వేదములు

# భారతీ నిరుక్తి - వేదస్వరూప దర్శనము



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







“ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్” ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్ధులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భారతీ నిరుక్తి

(వేదస్వరూప దర్శనము)

రచయితలు :

హరి సోదరులు

ప్రకాశకులు

**ఎస్.వి.ఎస్. పబ్లికేషన్స్**

శోధన్ గృహము

బందరు రోడ్, విజయవాడ - 10

# ఓమ్

# నమామ వేద మాతరమ్



శ్రీ శ్రీ శ్రీ జగద్గురు కాంచీ కామకోటి పీఠాధీశ్వరులచే ప్రసాదింపబడి
ఈపూరు హరిహరాజ క్షేత్రములో హరి సోదరులచే ప్రతిష్ఠితమైన

## శ్రీ గాయత్రీ మూర్తి

# భారతీ నిరుక్తి - ద్వితీయ ముద్రణము

## ఉపోద్ఘాతము

సుమారు ముప్పది సంవత్సరములు మేము శ్రమించి చేసిన వైదిక వాఙ్మయ పరిశోధన ఫలముగా తొలిసారిగా "భారతీ నిరుక్తి" వెలుగులోనికి వచ్చినది. శ్రీ జగద్గురువుల ఆశీఃప్రభావము వలనను ఆస్తిక సహృదయులు చూపిన ఆదరాభిమానముల వలనను తొలిముద్రణము రెండువేల ప్రతులు అయిపోయినవి. వేదమాతయెడ ఆంధ్రపాఠక లోకము చూపిన ఆదరాభిమానములకు మేమెంతయు కృతజ్ఞులము. తిరిగి జగద్గురువుల ప్రేరణము వలనను ప్రజల కోరిక ననుసరించి ద్వితీయముద్రణ రూపముగా ఈ భారతీ నిరుక్తి గ్రంథమును లోకమున కందించు చున్నాము. ఇది యెప్పుడో జరుగవలసినపని. "శ్రేయాంసి బహు విఘ్నాని"ఎన్నో విఘ్నములు. ఈశ్వరానుగ్రహముచే ఎట్లో వ్యయప్రయాసలకోర్చి ఈ గ్రంథము నిప్పటికైనను వెలుగులోనికి తీసుకురాగలిగితిమి. ఇది వేదమాత ఆశీర్వాద ఫలమే.

తొలిసారిగా భారతీ నిరుక్తిని ప్రచురించిన తరువాత వేదముల విషయమై ఇతరులు చేసిన విపరీత వాదములు మా దృష్టిలోనికి వచ్చినవి. ఆ వాదములను గూడ పరిశీలించవలయు ననెడి జగద్గురువుల ఆదేశము ననుసరించి ముందుగా అవతరణికలోను తరువాత గ్రంథములోను మరికొన్ని విషయముల చేర్చుట జరిగినది. ఆ విధముగానే ఈ భారతీ నిరుక్తి హిందీభాషలో రూపు దాల్చినది. సుప్రసిద్ధ పండితులు శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి హిందీ అనువాదము ఉత్తర భారతమున గూడ ప్రశంసల నందుకొన్నది. ఇవి యెంతయు ప్రశంసనీయ విషయములు.

ప్రథమ ముద్రణము మీదవలెనే ఈ ద్వితీయ ముద్రణముమీద గూడ ఆస్తిక మహాశయులెల్లరు ఆదరాభిమానములను చూపగలరని ఆశించుచున్నాము. గ్రంథమున గల ముద్రణ స్ఖాలిత్యము లేవియేని యున్న వానిని సహృదయులు మన్నింతురు గాక.

శుక్ల శ్రావణ పూర్ణిమ,
తేదీ. - - 89.

ఇట్లు,
(హరి సోదరులు)

# భారతీ నిరుక్తి

## గ్రంధకర్తలు : హరి సోదరులు



1. హరి వెంకట సుబ్బయ్య ( భార్య. మాణిక్యమ్మ )
2. చల్లా సత్యనారాయణశాస్త్రి ( లలితాంబ )
3. హరి సీతారామయ్య ( సీత )
4. హరి వెంకట కృష్ణమూర్తి ( అనసూయ )
5. హరి సాంబశివశాస్త్రి (శకుంతల) 6. హరి చంద్రశేఖర శర్మ (దుర్గ) 7. హరి లక్ష్మీనరసింహశర్మ (అన్నపూర్ణ)

# విషయానుక్రమణిక


వేదములు — శ్రీశ్రీశ్రీ కాంచీ కామకోటిపీఠాధీశ్వర శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు— 22

అవతారిక (V—XXXXXX)

వేదమంత్రార్థ వివరణకు ప్రమాణము లేవి యగును? XI

వేదనామములు - వేదస్వరూప దర్శనము— XV

వేదశబ్దములు-అర్థనిర్ణయ సంప్రదాయము XVII

నిరుక్తలక్షణము-శాస్త్రప్రవృత్తిః;

యాస్కనిరుక్తము— XVIII

నిగమ నిరుక్త లక్షణములు:

స్వాభావికార్థ బోధకత్వము— XXII

వేదము నిగమము; వేదపదములు నిగమములు— XXXI

ని (సమ్ ఆఙ్) హన్—సమాహతా భవన్తి— XXXVII

ని (సమ్ ఆఙ్) హృ-సమాహృతా భవన్తి XXXVIII

ఆలంకారికులు- నిరుక్తి— XXXX

వేదములు అన్యభాషా సంపర్కము—చారిత్రక వాదము— XXXX

వేదస్వరూప దర్శనము- నిరుక్త మూలము— XXXXIV

వేదః (1—60)

వేదశబ్దము-నిర్వచనములు— 4

ఒకే వేదశబ్దమున కిన్ని నిర్వచనము లేల? 8

వేదః (సకారాన్తము)-ధనము(శ్రుతత్వం ధనమ్— 10

కామః— కామేశ్వరః — 12

ధర్మః — 14

శ్రుతులు : వేదదేవ శబ్దములు 15

అగ్నిః వేదః— జీవునకు జన్మసిద్ధ నామములు 17

పృశ్నిః—పృశ్నిగర్భః-వేదగర్భః వేదగర్భా 21

వేదపదములు-దేవపదములు-దైవీవాక్ 22

నిధానం వేదః (శాశ్వతమగు పట్టము) 23

వేదము పౌరుషేయ మగునా? 24

వేదములలో పౌర్వాపర్యము, విజ్ఞాన క్రమ వికాసము గలదా? 26

అంతర్దర్శనము— 28

యత్ ఇవ ఇద మస్మిన విజానామి 30

నిణ్యః సంనద్ధో మనసా చరామి 31

యదా ఋతస్య ప్రథమజాః మాగన్, ఆదిత్ అస్యాః వాచః భాగం అశ్నువే 31

ఋగ్వేదము, నానాదేవతలు- ఏక దేవత 33

యస్తన్న వేదకిం మృచా కరిష్యతి 34

య ఇత్తద్విదు స్త ఇమే సమాసతే 34

ఉ ప ని ష త్ 36

ఉపనిషత్తు-చారిత్రికదృష్టి 40

నిర్వచన స్వరూపమ్ 50

బ్రహ్మవిద్య—కర్మోపాసనా సాధనావశ్యకత 54

ఋషిః (60-108)

ఋషిః- శ్రుతి స్మృతి కోశప్రసిద్ధి 61

ఋషి శబ్దము - నిర్వచనము 63

పరమేశ్వరుడు - ఋషిత్వము 63

వేదము — ఋషిత్వము 65

ఋషిః నారాయణః వేదః — 70

మంత్రద్రష్టలు - ఋషిత్వము 71

తపోజాః- స్వయమ్భూ- దైవీవాక్ 72

మంత్రకృత్-ఋషికృత్ 73

దేవతలు - ఋషిత్వము 79

అగ్నిః ఋషిః 79

ఇంద్రః ఋషిః 79

ఆదిత్యః ఋషిః సోమః ఋషిః 80

వేదములు - ఆద్యఋషులు 81

ప్రథమజాః 87

ఆర్షేయం ధనమ్ 90

ఋషిర్దర్శనాత్— ఈ దర్శన- మెట్టిది? 82

ఋషిశబ్దము - చారిత్రికులు 93

రచయితృత్వము - ఋషిత్వము 95

మంత్రము - ఋషి - ఛందో- దేవతా పరిజ్ఞానము 100

బ్రహ్మ (109-174)

బ్రహ్మ శబ్దము-చారిత్రికులు 109

బ్రహ్మయన వేదము- శ్రుతి స్మృతి ప్రసిద్ధి— 112

బ్రహ్మశబ్దము - నిర్వచనము 113

పరమాత్మ - బ్రహ్మత్వము 114

వేదము - బ్రహ్మత్వము 118

బ్ర హ్మ ర్షిః 125

బ్రహ్మ, బ్రహ్మణస్పతి, బృహస్పతి- చారిత్రికుల యూహలు 131

బృహస్పతిః బ్రహ్మణస్పతి- మంత్ర విభాగము 134

అంగిరసః 137

బృహస్పతిః 138

బ్రహ్మణస్పతిః 138

సామ 139

అగ్నియే అంగిరసుడు, బృహస్పతి, బ్రహ్మణస్పతి— 142

దేవతానామములు - విశేషణ వాచకములు— 143

బ్రహ్మ—బ్రహ్మకర్మ 145

బ్రహ్మ—అబ్రహ్మ 151

శబ్ద బ్రహ్మ 152

బ్రహ్మ—బ్రహ్మపురము 153
బ్రహ్మ కోశః 156
బ్రహ్మచారీ—నిధి రక్షకః 156
బ్రహ్మ—బ్రాహ్మణమ్ 158
బ్రహ్మ యజ్ఞః—బ్రహ్మ—
బ్రాహ్మణమ్ 163
బ్రహ్మ—ప్రతిష్ఠా 164
బ్రహ్మ—శ్రీః 169
బ్రహ్మాంజలిః 172
బ్రహ్మ వర్చః 172
బ్రహ్మ సూత్రమ్ 173
బ్రహ్మ స్థలి 173

ఆమ్నాయః—శ్రుతిః (175—214)

శ్రుతిః—ఆమ్నాయః 175
శ్రుతా 176
అనుశ్రవః 176
శ్రుతర్షిః—శ్రుతకర్ణః 177
పూర్వ్యం బ్రహ్మ 178
ప్రత్యా-సనజా-పూర్వ్యా 179
నవ-నవ్య-నవీయసీ 182
హరియోజనః 190
నవ—ప్రణవః 192
స్వయంకృతాగాథాగానము-
శ్రుతులు— 196
అనుశాసనమ్ 197
వాచః-అనువాకః-అనూచానః
అనూక్తమ్— 199
అనువాకః — దాకః 200
అనూచానః - నిధిః 202
ఆమ్నాయాంబుధి మథనమ్-
అమృత పానమ్— 205
సమామ్నాయః 208
విద్య-ఆమ్నాయ యోగము 209
వేద శ్రుతిః 214

స్వాధ్యాయః (215—250)

అధ్యాయః - వేదః 215
స్వాధ్యాయః వేదః 216
స్వాధ్యాయశబ్దార్థము—
పూర్వపక్షములు 217
స్మృతులు - కృత్స్న
వేదాధ్యయనము— 218
స్వాధ్యాయ మన కృత్స్న
వేదాధ్యయనమే— 222
కోశములు-స్వాధ్యాయపదము 225
శ్రుతులు-వేదాధ్యయన సంప్ర
దాయము— 225
నిఖిల శాఖాధ్యయనము-ఏక
శాఖాధ్యయనము— 227
వేద శాఖాధ్యయనము -
సంప్రదాయము 227
స్వాధ్యాయము యొక్క
స్వాధ్యాయత్వము— 235
స్వాధ్యాయమే బ్రహ్మ యజ్ఞము—239
ప్రణవజపము-స్వాధ్యాయము 240
స్వాధ్యాయము మోక్ష శాస్త్రా
ధ్యయనము— 243

స్వాధ్యాయ ప్రశంసా 246

ప్రియే స్వాధ్యాయ ప్రవచనే -
భవతః___ 246

యుక్తమనా భవతి 247

అపరాధీనో౽ హరహః ర్ర్థాన్
సాధయతి___ 247

సుఖం స్వపితి 247

పరమ చికిత్సక ఆత్మనో భవతి
ఇంద్రియ సంయమశ్చ: ఏకారామతా
భవతి: ప్రజ్ఞా వృద్ధిః యశో లోక
పంక్తిః___ 247

స్వాధ్యాయము-చరిత్ర కారులు 249

స్వాధ్యాయః - తపః 255

స్వాధ్యాయము -
శతమోత్కృష్టశ్రమ 256

స్వాహా (260—294)

స్వాహా శబ్దము వేదవాచకమగునా? 260

స్వాహా స్వధా-వైశిష్ట్యము 262

స్వాహుతి 264

ఆహుతులు, అగ్ని-యజమాన
దేవయో నిత్యము___ 265

ఆహుతి-అహుతిః దేవతల పరోక్ష
ప్రియత్వము: భోక్తృ భోగ్య
స్వరూపము___ 267

అగ్నిః - అగ్నిః 268

ఇంద్రః-ఇంధః-భోక్తృ భోగ్య
స్వరూపము___ 268

ప్రాణము స్వప్న స్వరూపము 270

ఆహుతి దేవతాహ్వాన స్వరూపము 272

ఆహుతులు స్వాహాకృతములు 273

స్వాహాకారము-శ్రుతియాదేశము 275

వేదవాక్-స్వాహాకారః-యజ్ఞ-
అవినాభావ సంబంధము___ 275

స్వాహా శబ్దము-సార్థకత 277

స్వాహుతం హ విర్జుహోతి-
(సు-ఆ-జుహోతి) 278

స్వా వాక్ ఆహ-స్వాహా వేదవాక్ 279

స్వయం తే సరస్వతీ ఆహ-
స్వాహా___ 283

స్వః మహిమా ఆహ స్వాహా 284

సు-ఆహ-స్వాహా 286

స్వం-ఆహ-స్వాహా 286

స్వాహా-వేద శరీరిణీ-పరాదేవతా
(పరమాత్మా)___ 287

స్వాహా శబ్దము-వ్యుత్పత్తుల
క్రమగతి___ 290

స్వధా (295—'31)

స్వధా-భోగ్య వస్తు జాతరూప ప్రకృతి
పారమేశ్వరీ శక్తి(భోగ్యభోక్తృ
స్వరూపము) 296

స్వధా-భోక్త లేక పరమేశ్వరుడు 298

స్వధా-క్రియా విద్య 300

అగ్ని వాయు స్వరూపులు
(వసు-రుద్ర-ఆదిత్యులు) పితరులు:
స్వధా స్వరూపులు___ 301

స్వధా-జీవుని భోగము;
భోగాయతన మగు శరీరము— 304
జీవేశ్వరులు-స్వధా శక్తి :— 306
వసు రుద్రాదిత్యులు-పితృ పితామహ
ప్రపితా మహులు :— 308
విష్ణు స్వరూపులు :— 315
గయాశీర్ష-వట(అధి భౌతిక-అధి
దైవిక-అధ్యాత్మికార్థములు)— 318
స్వధా పితృభ్యః (అస్తుస్వధా) 323
శ్రాద్ధ వృత్తి :— 326
స్వధా-ప్రాణధారణశక్తి :— 328
స్వాహాః-స్వధః-వషట్ 331

వషట్ (332—354)

హవిస్త్యాగ ప్రకారము-వషట్
కార ప్రాశస్త్యము — 332
వషట్కారము ఆదిత్య రూపము-
దేవ పాత్రము— 336
వాక్ ప్రాణా పానములు-
వషట్కారము— 338
వషట్కారము-పరాదేవత
(పరమేశ్వరుడు)— 341
వౌ (ఆదిత్యః) షట్ (ఋతవః)
వౌషట్— 343
వాక్, షట్ (ఋతవః)
వషట్ (అషాఢా)— 344
వాక్-షడంగములు-వషట్ 347
స్వాహా-స్వధా-వషట్-హన్త
కారములు-వాగ్ధేను స్తనములు 350
స్వాహా-స్వధా-వషట్ శబ్దములు-
చరిత్రకారులు— 352

త్రయీ (355—444)

అథర్వ వేదము అర్వాచీనము-
ఆక్షేపము— 355
వేదత్రయోత్పత్తి 356
ఋగ్యజుః సామలకే యజ్ఞాం
గత్వము— 356
స్మృతులు కోశములు-
త్రయీ వ్యవహారము— 357
అథర్వ వేదము (బ్రహ్మవేదము)
ఆవశ్యకత— 358
అథర్వ వేదమునకు గల
నామములు— 360
అథర్వ వేద ప్రాశస్త్యము
బ్రహ్మత్వ సంప్రదాయము— 361
బ్రాహ్మణారణ్యకములు చతుర్వేద
సంప్రదాయము— 366
ఉపనిషత్తులు-చతుర్వేద ప్రశంస 367
ఋగ్వేదాది శ్రుతులు-వేదత్రయ-
వేద చతుష్టయ ప్రస్తావన— 369
చారిత్రికుల వాదము-అసా
మంజస్యము— 375
చత్వారి శృంగా-ఇత్యాది ఋక్కులు-
అర్థమీమాంస— 381
మఱియొక యాక్షేపము 389
వేదత్వము-యజ్ఞ సంబంధము 389

చతుర్వేదముల త్రయీ విద్యా
రూపములు— 394
మంత్ర త్రైవిధ్యము 394
త్రయీ విద్య-యోగత్రయము 400
స్మృతి వచనములు-చారిత్రికుల
కల్పన— 402
'ఇతి వేదా స్త్రయ స్త్రయీ' 405
అథర్వవేదము—రెండు సంప్ర
దాయములు— 409
త్రయీ — శ్రుతి సంప్రదాయము 410
త్రయీశబ్దము—ముఖ్యార్థము 414
త్రయీ— పరాదేవత 416
అథర్వవేదము—భిన్ననామములు—
ఔచిత్యము— 417
భైషజ్యవేదము—అంగిరోవేదము 418
బ్రహ్మవేదము—క్షత్రవేదము 20
వసిష్ఠః — బ్రహ్మ — 421
వసిష్ఠుడు అథర్వుడు 424
అథర్వవేదము—అథర్వాంగిరసః 432
భృగ్వంగిరసః—
వసిష్ఠాదిఋషులు అథర్వనామ
ధేయులు 438
అథర్వవేదము—ప్రాథమ్యము— 439
అథర్వాంగిరసులు-నామసామా
చర్యము, చారిత్రికుల యూహ— 441
త్రయీశబ్దము— సంప్రదాయము 445
ఉ ప స ం హా ర ము —
కవిః — కావ్యమ్ (446—535)
త్రయీవిద్యప్రభు సుహృత్కాంతా
సంమితము.... 446
వేదః సచిరిత్ (సఖివిత్)
పురాణమ్ 447
వేదము—కాంతాసంమితత్వము— 448
సూ నృ తా— 448
వి ర ప్శీ— 450
గో మ తీ— 450
పక్వా శాఖా న దాశుషే 451
శ్రుతిస్మృతులు-వేదవాక్స్వరూపము 451
మంత్రము లన్నియు కాంతాసంమిత
ములా? — 458
భారతము వేదమువలెనే ప్రభు—
సుహృత్— కాంతాసంమితము 459
వేదమునకుగల కావ్యత్వ
మౌపచారికమా? 461
ఆలంకారికులు-కావ్యలక్షణము 462
ఆక్షేపము—సమాధానము 465
కావ్యపథము 467
వాగగ్రవిద్య భగవతీ శ్రీః 467
బ్రాహ్మణ ముఖేకావ్యమ్ 470
వేదగత విలక్షణకావ్యత్వము 474
వేదములు - కవులు— 475
వేదకావ్యము-శ్రుతిప్రసిద్ధి 476
వేదకావ్యము—శాశ్వతకవి
సంబంధిత్వము— 478
పరమేశ్వరుడు కవి - కావ్య
లక్షణము— 482

వేదకావ్యలక్షణము-ఆలంకారికులు 485
నియతికృత నియమరహితా
అనన్యపరతంత్రా— 486
హ్లాదైకమయీ— 487
న వ ర స రు చి రా— 489
వేదకావ్యలక్షణము —
మహాకవులు— 490
ఆత్మనః కలా— 493
వేదకావ్య-లౌకికకావ్యములు—
సామాజికులు— 494
కావ్యజీవితము- ఆలంకారికులు 497
అభినవగుప్తుడు — రసస్వరూపము
లక్ష్యము— 498
అలంకారికులు—రసస్వరూప నిర్వచ
నము—లక్ష్యము 501
అలంకారశాస్త్రము — లక్ష్యము 511
అధికారిభేదము ననుసరించి
వేదమునకు ప్రభు — సుహృత్—
కాంతా సంమితత్వము— 512
కవిః కావ్యేన పరిపాహిరాజన్ 514
సఖే సఖాయ మజరో జరిమ్ణే 514
అగ్నే పుర్వాగ్ంఅమ త్వ్యస్త్వంనః 515
దుహితా వసూనాం 517
వేదవిదుడు అగ్నివాయ్వాదిత్య
రూపుడగుట యెట్లు? 518
మాతా రుద్రాణామ్- 519
స్వసాఽఽదిత్యానామ్ 523
అమృతస్య నాభిః అహం
అదితిః— 527
అంబిక — బ్రహ్మవిద్యారూపిణి
స్వస 528
చారిత్రికుల దృష్టి— 531

భారతీ (536—625)

తిస్రో దేవ్యః 536
ఆక్షేపములు— 538
దుష్యంతపుత్రుడు భరతుడు—
భారతీప్రజ— 538
ఋషభపుత్రుడు భరతుడు—
భారత వర్షము 539
మనువు భరతుడు— భారత వర్షము—
భారతీప్రజ 539
లోకమే భారతము— 540
భరత—భారత—భారతీపదములు—
చారిత్రికుల కల్పన— అసామం
జస్యము 541
ఋత్విజులు—భరతులు 542
ద్రావిణోదాః— 545
ఋషీణాం పుత్రః :— 545
సహసస్పుత్రః :— 546
అగ్ని—వాయు— ఆదిత్యులు
సాహచర్యము 549
అగ్నిః 550
వాయుః — వాతః 552
ఆదిత్యః సూర్యః 555
దేవానా మనీకం చిత్ర ముదగాత్: 556

మిత్రస్య వరుణస్య అగ్నేః చక్షుః

ఆప్రాద్యావా పృథివీ అంతరిక్షమ్ 556

ఆప్రా ద్యావా పృథివీ అంతరిక్షమ్:

సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ— 557

త్రిస్థానదేవతలు—ఏకాత్మకత్వము 560

యజ్ఞము వసురుద్రాద్యాత్మకము;

విష్ణుస్వరూపము 565

ఇడా సరస్వతీ భారతీ సాహ

చర్యము 566

ఇడా శాసనీ; యజ్ఞానూకాశనీ;

దేవహూః; యజ్ఞనీః 572

సరస్వతీ 575

పావకా ధియావసుః 577

పావమానీ- వేదమాతా 578

పవిత్రం వేదమంత్రః— దేవతా 580

చోదయిత్రీ సూనృతానాం;

చేత న్తీ సుమతీనామ్ 583

భిషక్ 586

రసాత్మికా 586

భారతీ 588

ఆదిత్యుడు భరతుడు, తద్దీప్తి

లేక వాక్కు, లేక వత్ని భారతి 589

అగ్ని భరతుడు 590

వాయువు (మధ్యమస్థానాగ్ని)—

భరతుడు 591

భారతీ - బ్రహ్మవాదినీ-

బ్రాహ్మీ 593

హెగము - యోగశక్తి 596

ప్రజాపతి భరతుడు :

వసురుద్రాదిత్యులు ప్రజ 598

విశ్వవిత్ — అవిశ్వమిన్వా 603

క్రాన్తదర్శనము - కవి—

స్మృతులు 605

త్రిపథగామినీ 608

మహానటుడు - భరతుడు;

శిల్పములు- ఆత్మసంస్కృతి 610

మహాభారతము :

అగ్ని (భరత) వంశము 616

అపాంగర్భః 619

కోశ - పౌరాణికవచనములు-

భారతీప్రజ - భారతీ సంస్కృతి 620

ఛందః (626–716)

ఛందస్సులు-కోశప్రసిద్ధి 626

ఛందస్సులు- నాగేశభట్ట వాదము 627

బ్రాహ్మణములకు వేదసంజ్ఞ

శ్రీ దయానందుల యాక్షేపము 635

శ్రీదయానందుల యాక్షేపమునకు

సమాధానము 636

కోశప్రసిద్ధి 636

పూర్వమీమాంసా దర్శనము—

ప్రసిద్ధి 637

వ్యాకరణదర్శనము—ప్రసిద్ధి— 638

న్యాయదర్శనము— ప్రసిద్ధి 640

వైశేషిక దర్శనము ప్రసిద్ధి 642

ఉత్తర మీమాంసా దర్శనము—

ప్రసిద్ధి 644

ఆక్షేపము 646

సమాధానము 647
నిరుక్తము — ప్రసిద్ధి 653
నిరుక్తమున కౌత్సవాదము—
చాత్రికుల యాక్షేపము—
సమాధానము 657
ఓహా బ్రాహ్మణః— శ్రుతిమతిబుద్ధి
లక్షణా విద్యా 661
శ్రౌతగృహ్య సూత్రములు—
స్మృతులు — ప్రసిద్ధి 668
శ్రుతిప్రసిద్ధి— బ్రాహ్మణాచ్ఛంసీ 671
బ్రాహ్మణము—అనుబ్రాహ్మణము 675
మంత్రబ్రాహ్మణాత్మకవేదము— 679
ధర్మవ్యాఖ్యానము
యాజ్ఞవల్క్య బ్రాహ్మణములు—
ఆక్షేప సమాధానములు 678
బ్రాహ్మణశబ్ద నిర్వచనము—
ఆక్షేప సమాధానములు 681
మంత్రము— ఋషిచ్ఛందో దేవతా
పరిజ్ఞానము 686
శ్రుతులు-ఛందఃపదనిర్వచనములు 692
ఛాదనాత్ ఛందాంసి 692
ఛందస్సులు శర్మహేతువులు—
కృష్ణాజినవ శిల్పము (చర్మ-శర్మ) 694
ఛదయథ ప్రీతి ఛందాంసి 700
ఛన్దయతి ఆహ్లాదయతి 700
గాయత్ర్యాది ఛందస్సులు—
ఛందస్త్వము 701
గరుడ వాహనః — వృషభ
వాహనః 703
ఛందస్సులు—నిర్వచనక్రమము 706
ఛందస్సులు-గోవ్రజములు 711

# పరిశిష్టము

## ఉదాహృత గ్రంథములు - వాని సంకేతములు

| | | |
|---|---|---|
| వేదమాతృస్తవః | | హరిసోదరకృతః |
| ఋగ్వేద సంహితా | | ఋ. |
| తైత్తిరీయ " | | తై. సం. |
| వాజసనేయ " | (మాధ్యందిన) | వా. సం. |

| | | | |
|---|---|---|---|
| సామవేద | " | | సామ. సం. |
| అథర్వవేద | " | | అ. వే. |
| కాఠక | " | | కా. సం. |
| కాణ్వ | " | | కాణ్వ. సం. |
| మైత్రాయణీ | " | | మై. సం. |
| ఐతరేయ | బ్రాహ్మణమ్ | | ఐ. బ్రా. |
| కౌషీతకీ | " | | కౌ. బ్రా. |
| గోపథ | " | పూర్వభాగ | గో. పూ. |
| గోపథ | " | ఉత్తరభాగ | గో. ఉ. |
| తాండ్య | " | పంచవింశబ్రాహ్మణమ్ | తాం. బ్రా. |
| షడ్వింశ | " | | షడ్వింశ. బ్రా. |
| జైమినీయ | " | తలవకార | జై. బ్రా. |
| సంహితోపనిషద్ బ్రాహ్మణమ్. | | | సంహితా. బ్రా. |
| శాట్యాయన బ్రాహ్మణమ్ | | | శాట్యా. బ్రా. |
| శతపథ బ్రాహ్మణమ్ (మాధ్యందిన) | | | శ. బ్రా. |
| శతపథ | " | (కాణ్వశాఖీయా) | శ. బ్రా. కా. |
| తైత్తిరీయ | " | | తై. బ్రా. |
| ఐతరేయ. ఆరణ్యకమ్. | | | ఐ. ఆ. |
| తైత్తిరీయ – ఆరణ్యకమ్ | | | తై. ఆ. |
| తైత్తిరీయ నారాయణీయమ్ | | | తై. నా. |
| కౌషీతకీ బ్రాహ్మణ ఉపనిషత్ | | | కౌ. బ్రా. ఉ. |
| ఐతరేయ ఉపనిషత్ | | | ఐ. ఉ. |
| ఛాందోగ్య– | " | | ఛాం. ఉ. |
| జైమినీయ ఉపనిషద్ బ్రాహ్మణమ్ | | | జై. ఉ. |
| (తలవకార | " | | |
| బృహదారణ్యక | " | | |
| ఈశావాస్య | " | | |
| తైత్తిరీయ | " | | |

| | |
|---|---|
| అథర్వవేదీయ మహానారాయణ | మహానా. ఉ. |
| కఠ ఉపనిషత్ | కఠ. ఉ. |
| కృష్ణ — ఉపనిషత్ | కృష్ణ. ఉ. |
| కేన " | కేన. ఉ. |
| కైవల్య " | కైవల్య. ఉ. |
| గోపాల పూర్వతాపనీయ ఉపనిషత్ | గో. పూ. ఉ. |
| ప్రశ్న " | ప్రశ్న. ఉ. |
| శ్వేతాశ్వతర " | శ్వేత. ఉ. |
| మైత్రాయణీయ " | మైత్రా. ఉ. |
| ముండక " | ముండక. ఉ. |
| ప్రాణాగ్ని " | ప్రాణాగ్ని. ఉ. |
| అమృత బిందు " | అమృత. ఉ. |
| అథర్వ శిర " | అథ. శి. ఉ. |
| ధ్యాన బిందు " | ధ్యా. బిం. ఉ. |
| నృసింహ పూర్వతాపనీయ ఉపనిషత్ | నృ. పూ. ఉ. |
| సదానంద " | సదా. ఉ. |
| అశ్వలాయన శ్రౌతసూత్రమ్ | అశ్వ. శ్రౌ. సూ. |
| ఆపస్తంబ | ఆప. శ్రౌ. సూ. |
| సత్యాషాఢ " | సత్యా. శ్రౌ. సూ. |
| లాట్యాయన " | లా. శ్రౌ. సూ. |
| ఆపస్తంబ పరిభాషా " | ఆప. పరి. సూ. |
| అథర్వ కౌశిక " | అథ. కౌ. సూ. |

## చందోగ పరిశిష్ట

| | |
|---|---|
| కాత్యాయన సర్వానుక్రమ సూత్రమ్ | కా. సర్వా. సూ. |
| అశ్వలాయన గృహ్యసూత్రమ్ | ఆ. గృ. సూ. |
| ఆపస్తంబ " | ఆప. గృ. సూ. |
| గోభిల " | గో. గృ. సూ. |
| హిరణ్యకేశి " | హి. గృ. సూ. |

| | |
|---|---|
| ఆపస్తంబ ధర్మసూత్రమ్ | ఆప. ధ. సు |
| బోధాయన " | బో. ధ. సూ |
| గౌతమ " | గౌ. ధ. సూ |
| పింగల ఛందఃసూత్రమ్ | పిం. ఛం. సూ |
| బ్రహ్మ " | బ్ర. సూ |
| జైమినీయ " | జై. సూ |
| పాతంజల యోగ " | యో. సూ |
| గౌతమ న్యాయ " | న్యా. సూ |
| కాణాద వైశేషిక సూత్రమ్ | వై శే. సూ |
| పాణిని " | పా. సూ |
| యాజ్ఞవల్క్య స్మృతి | యాజ్ఞ. స్మృ |
| యోగియాజ్ఞవల్క్య " | యో. యాజ్ఞ. స్మృ. |
| మను " | మను. స్మృ. |
| పరాశర " | పరా. స్మృ. |
| బృహత్పరాశర " | బృ. ప. స్మృ. |
| యమ " | యమ. స్మృ |
| వాసిష్ఠ " | వాసి. స్మృ. |
| విష్ణు " | విష్ణు. స్మృ. |
| స్మృతిచంద్రికా | |
| చతుర్వర్గ చింతామణి (హేమాద్రి) | |
| నిర్ణయ సింధుః | |
| అగ్నిహోత్రచంద్రికా | |
| శుక నీతిః | |
| శ్రీమద్రామాయణమ్ | రామా. |
| మహాభారతమ్ | భార. |
| హరివంశమ్ | హరి వం. |
| భగవద్గీతా | భ. గీ. |
| శ్రీమద్భాగవతమ్ | భాగ |

| | |
|---|---|
| దేవీభాగవతమ్ | దేవీ. భా. |
| విష్ణుధర్మోత్తర పురాణమ్ | విష్ణు. ధ. పు. |
| విష్ణు ,, | విష్ణు. పు. |
| అగ్ని ,, | అగ్ని. పు. |
| మత్స్య ,, | మత్స్య. పు. |
| బ్రహ్మవైవర్త ,, | బ్ర. వై. పు. |
| బ్రహ్మ | బ్ర. పు. |
| బ్రహ్మాండ ,, | బ్రహ్మాండ. పు. |
| వాయు ,, | వా. పు. |
| మార్కండేయ ,, | మార్క. పు. |
| పద్మ ,, | పద్మ పు. |
| కూర్మ పురాణమ్ | కూర్మ. పు. |
| భవిష్య ,, | భవి. పు |
| నారద ,, | నార. పు. |
| స్కాంద ,, | స్కాంద. పు |
| నంది ,, | నం. పు |
| సౌర ,, | సౌర. పు |
| దేవీ ,, | దేవీ. పు. |
| సూతసంహితా | సూత. సం. |
| మాధవీయ తాత్పర్యదీపికా (సూత. సం) | (సూ. సం.) |
| యాస్కనిరుక్తమ్ | నిరు. |
| బృహద్దేవతా | బృ. దే. |
| సాయణభాష్యమ్ | సా. భా. |
| వేంకట మాధవభాష్యమ్ | వేం. మా. భా |
| ఉద్గీథ ,, | ఉద్గీ. భా |
| స్కందస్వామి ,, | స్కంద. భా |
| ముద్గల ,, | ముద్గ. భా |
| ఉవట ,, | ఉవ. భా |

| | |
|---|---|
| మహీధర ,, | మహీ. భా. |
| భట్టభాస్కర ,, | భట్ట. భా. |
| దుర్గాచార్య ,, | దుర్గా. భా. |
| విష్ణుసూరి ,, | విష్ణు. భా. |
| మస్కరి | మస్క. భా. |
| దేవత్రాత ,, | దేవత్రా. భా |
| కర్కాచార్య ,, | కర్కా. భా |
| శంకర | శం. భా |
| పంచపాదికా వివరణమ్ | |
| హరిస్వామి, వాసుదేవబ్రహ్మ భాష్యమ్ | శ. బ్రా. భా. |
| శ్రీ భాష్యమ్ ,, | శ్రీ. భా. |
| శాబర ,, | శా. భా. |
| వ్యాస. భాష్య | వ్యా. భా. |
| వాత్స్యాయన భాష్యమ్ | వాత్స్యా. భా |
| న్యాయసూత్రవృత్తిః | న్యా. సూ. వృ. |
| పాతంజల మహాభాష్యమ్ | మహా. భా |
| సిద్ధాన్త కౌముదీ | |
| ప్రదీపవ్యాఖ్యానమ్ | (కైయటః) |
| ఉద్ద్యోత ,, | (నాగేశః) |
| నీలకంఠ వ్యాఖ్యా | (మహాభారత - హరివంశ దేవీభాగవత) |
| భామతీ | (వాచస్పతి మిశ్ర) |
| శివార్కమణిదీపికా | (అప్పయ్య దీక్షిత) |
| తంత్రవార్తికమ్ | (కుమారిలభట్టః) |
| కుల్లూకభట్ట వ్యాఖ్యా | (మనుస్మృతి) |
| విజ్ఞానేశ్వరీయమ్ | (యాజ్ఞవల్క్య స్మృతి) |
| నారాయణవృత్తిః | (ఆశ్వ. శ్రౌ. సూ) |
| వైజయన్తీ వ్యాఖ్యా | (సత్యా. శ్రౌ. సూ) |

| | |
|---|---|
| సుదర్శనాచార్య వ్యాఖ్యా | (ఆప. గృ. సూ) |
| హరదత్త " | " |
| రసాయన " | (వై శే. సూ.) |
| శ్రుతప్రకాశికా " | (శ్రీభాష్య) |
| నిరుక్త " | (ముకుందశర్మా) |
| న్యాయసుధా " | (తంత్రవార్తిక వ్యాఖ్యా) |
| న్యాయమంజరీ | (జయన్తభట్టః) |
| న్యాయకుసుమాంజలిః | (ఉదయనాచార్య) |
| భాట్టచింతామణి | (వాంఛేశ్వరయజ్వ) |
| ఖద్యోత వ్యాఖ్యా | (పాతాఞ్జ. భా) |
| పరాశరభట్ట " | (విష్ణు సహస్రనామ) |
| నిర్వచన " | ( " ) |
| నిరుక్తి " | ( " ) |
| సౌభాగ్య భాస్కరరాయ వ్యాఖ్యా | (లలితా సహస్రనామ) |
| వైదికనిఘంటు వ్యాఖ్యా | (దేవరాజ యజ్వా) |
| " | (క్షీరస్వామి) |
| చతుర్వేదభాష్య భూమికా | (సాయణాచార్య) |
| ఋగ్వేదాది భాష్యభూమికా | (దయానంద) |
| శివానందలహరీ | (శంకరాచార్య) |
| ఆత్మబోధః | ( " ) |
| శతశ్లోకీ | ( " ) |
| గంగా లహరీ | (జగన్నాథః) |
| శివమహిమ్నస్తోత్రమ్ | (మధుసూదన సరస్వతీ వ్యాఖ్యా) |
| ఋగ్వేదామంత్రమణికా | (మాధవీయ) |
| కాండానుక్రమణికా | |
| సర్వానుక్రమణికా వృత్తిభూమికా | (షడ్గురు శిష్య) |
| వాచస్పత్యమ్ | |
| శబ్ద కల్పద్రుమః | |

న్యాయకోశః
అమర కోశః
అమరసుధాటీకా
మేదినీకోశః
వైజయన్తీ కోశః
వైదికకోశః (సూర్యకాన్తః)
అభిదాన చింతామణిః
నానార్థ రత్నమాలా
ఆంధ్ర సంగ్రహ విజ్ఞానసర్వస్వము
భరతనాట్య శాస్త్రమ్
అభినవ భారతీ (అభినవగుప్తకృత—నాట్యశాస్త్రవ్యాఖ్యా)
రసగంగాధరః (జగన్నాథః)
కావ్యప్రకాశః (మమ్మటః)
కావ్యమీమాంసా (రాజశేఖరః)
కావ్యాలంకార సూత్రమ్ (వామనః)
రఘువంశమ్ రఘు
కుమారసంభవమ్ కుమా. సం
కిరాతార్జునీయమ్ కిరా.
శిశుపాలవధమ్ శిశు
ఉత్తరరామ చరితమ్ ఉ. రా. చ
భావతల స్పర్శినీవ్యాఖ్యా (వీరరాఘవాచార్య) ఘనశ్యామటీకా
నైషధమ్ నైష
భట్టికావ్యమ్ భట్టి కా
సత్యార్థప్రకాశ (దయానంద)
ఐతరేయాలోచనమ్ (సత్యవ్రతసామ శ్రమీ)
హంసరాజ వైదికకోశ—
జైమినీయోపనిషద్బ్రాహ్మణ భూమికా— భగవద్దత్త

—)o(—

# పండితాభిప్రాయములు

ఇది యొక అపూర్వ గ్రంథము. దీని పేరు భారతనిరుక్తి. ఇందు వేదముల గూర్చి యీ మధ్యకాలమున నచ్చటచ్చట చెలరేగిన ఋషిప్రవరాశయ, విరోధ్యాశయ విశేషముల సామంజస్యాభావము సరసముగ, సప్రమాణముగ, సోపపత్తికముగ నిరూపింపబడినది. వేదము యొక్క స్వరూప స్వభావాదుల దెలిసి కొనవలయు నన్న వేదమునకు గల పర్యాయపదముల నిర్వచనముల గుర్తించుట ముఖ్య మని యీ గ్రంథకర్తలు నిశ్చయించుకొని, యీ గ్రంథమున నా నిర్వచన ప్రక్రియా విశేషముల ప్రధానముగ ప్రదర్శించి యుండిరి. ఇది చాల ప్రశంసనీయమైన పద్ధతి.

భారతి యనగా వేదవాక్కు. తత్స్వరూప తత్త్వావబోధము కొఱకై వివిధ నిర్వచనాది విశేషము లిందు ప్రదర్శింపబడుటచే నీ గ్రంథమున కీ సమాఖ్య యుపపన్నమై యున్నది.

ఈ గ్రంథమున ప్రతి ప్రకరణమునను వేదబోధక పదనిర్వచనాదుల ద్వారా వేదస్వరూపస్వభావాదులు అర్వాచీనకల్పితాక్షేప పరిహారపూర్వకముగ విశదీకరింపబడినవి. ప్రసంగవశమున నతిగంభీరముగు దేవతాతత్త్వమును గూర్చియు, దేవ పితృకర్మలు తద్రహస్యార్థము గూర్చియు నెన్నియో విశేషాంశము లిందు సోపపత్తికముగ ప్రతిపాదింపబడినవి.

మఱియు నిందలి పంద్రెండు ప్రకరణములలో నిర్వచింపబడి వివరింపబడిన వేద–ఋషి–బ్రహ్మాదీ వేదనామధేయములలో నొక్కొక్కదానియం దొక్కొక్క విశిష్టతయు, వానిని గ్రహించి వివరించుటలో నొక క్రమగతియు గన్పట్టును.

వీరు "భారతీనిరుక్తి" గ్రంథము నెన్నడో మఱ్పది యేండ్లకు పూర్వమే యుపక్రమించి యుండిరి.

సర్వత్ర స్సుందరముగ నీ గ్రంథమును రూపొందించుటకై స్వదేశ పర దేశస్థ అపేక్షిత గ్రంథజాతము నెల్ల ప్రోగుచేసిరి. శ్రమించి పరిశోధించిరి. కన్నులవత్తుల వేసికొని యా యా గ్రంథములయం దేయే మూల నేయే రహస్యములు దాగి యున్నవో, ఏయే రత్నము లొదిగియున్నవో వెదకి వెదకి జూచిరి. సువర్ణఖనులగు ఆర్షగ్రంథములనుండి యనర్ఘ రహస్యరత్నములను వెలికిదీసి పోగుపోసిరి. ఆ రత్నములప్రోగే యీ భారతీనిరుక్తి. వేదపర్యాయ పదనిర్వచన వ్యాజమున శంకాపంకమునుండి యుద్ధరించి, శుద్ధబ్రహ్మ (వేద) స్వరూపమును సాక్షాత్కరింపజేసిరి. ఇందలిరచనము సహృదయహృదయాహ్లాదకారి. ప్రతిపాదనప్రక్రియ సుమనస్సంమోదకారి.

మచిలీపట్నం,
14–10–1971.

కుప్పా లక్ష్మావధాని
(సాంగ స్వాధ్యాయ, భాస్కర)



ఈ గ్రంథమునందు వేద, ఋషి, బ్రహ్మ, ఆమ్నాయ- శ్రుతి, స్వాధ్యాయ, స్వాహా, స్వధా, వషట్, త్రయీ, కవి – కావ్య – భారతి, ఛందః శబ్దములు వాని స్వరూపములు వాని రహస్యములు బహుగ్రంథపర్యాలోచనచేసి నిరూపింపబడినవి. ఈ గ్రంథమునకు 'భారతీనిరుక్తి' యని పేరు పెట్టబడినది. వీరర్థనిర్ణయము చేయుటకు చేసిన మహాప్రయత్నములో భారతీశబ్దము కూడ నున్నది. వీరికి భారతీశబ్దార్థ నిర్ణయమునందు ఎక్కువ యభిమాన మేమో! అయినను హరిశబ్దమును వారు వదలిపెట్టలేదు. వారి యింటిపేరు "హరి" వారు. అందఱును పండితులు. ఇన్నియేండ్లు అందఱును తలాకొంచెము శ్రమయు పడి యీ మహాకార్యమును చేసిరి. ఈ గ్రంథము పండ్రెండు భాగములని చెప్పవచ్చును. ప్రతి

భాగము మొదట వారే రచియించిన వేదమాతృస్తవ శ్లోకములు కలవు. ప్రతిదానిలోను హరిశబ్దము గుంభితమై యుండును. ఆ శ్లోకములు మిక్కిలి రమణీయములుగా నుండును. మఱియు తత్తద్భాగములకు సూచకములుగాఁగూడ నుండును. అందుచేత 'హరినిరుక్తి, యన్నట్లు?

ఇంత ప్రయాసపడి చేసినప్పుడు ఎన్నిగ్రంథములు చూచియుండవలయును. ఇందుదహరింపబడిన గ్రంథముల సంఖ్యయే రెండువందలకు దాటియున్నది. అన్నియు వేదములు, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, సూత్రములు, పురాణములు, వృత్తులు, భాష్యములు, వార్తికములు, కోశములు.

ఇంక వారి పాండిత్యమును గూర్చి యేమి చెప్పవలయును? ఇందులో నింకొక్క రహస్యమున్నది. వేదమో ఋషియో స్వాధ్యాయమో ఛందస్సో త్రయీ శబ్దమో యేదో యొక శబ్దమును తీసికొని దానిని గూర్చి సర్వంకషముగా వ్రాయవలయు నన్న ప్రయత్నమును సంకల్పించినచో ఆ గ్రంథములను చదివెడి లక్షణము వేఱు. ఆ శబ్దమును గూర్చి యెక్కడ నేమి వ్రాయబడినది? ఎట్లు వ్రాయబడినది? ఈ పరామర్శబుద్ధికి సర్వంకషముగా భాసింపనిచో నీ పనిచేయుట సాధ్యము గాదు. ఇన్ని గ్రంథములలో తాము వ్రాయుచున్న యొక శబ్దముయొక్క యర్థమును నిరూపించుటకు ఎచ్చట నేది యున్నది? అన్న మతిబాహుళ్యము జ్ఞాపకశక్తియొక్క పరమార్థము, రెండును జతకూడవలయును.

ఈ గ్రంథము పేరు 'నిరుక్తి. నిరుక్తము వేదాంగములలో నొకటి. యాస్కాచార్యులవారు వ్రాసిరి. పండితులకు తెలిసిన విషయమే। దుర్గాచార్యుడు దానికి భాష్యమును వ్రాసెను. అది నిరుక్తము. ఇది నిరుక్తి. అది క్తాంతము ఇది 'క్తిన్' ప్రత్యయాంతము. క్తాంతము సామాన్యముగా భూతకాలమును గూర్చి చెప్పినను దానికి మూడు కాలములయందు ప్రయోగింపబడదగిన శక్తి యున్నది. అందుచేత నిరుక్తమః - అన్నది వేదముయొక్క త్రైకాలికాబాధ్యార్థ బోధకత్వము సూచించును. ఈ గ్రంథము వేదాంగము కాదు. అందుచేత నిరుక్తి.

ఈ గ్రంథకర్తలయొక్క యౌచిత్యము ఇంక విస్పష్టమైన వైదికముగా నున్నది వేదమాతను కొలిచెడివారి బుద్ధి యింకొకరీతిగా నుండునా?

ఈ హరి సోదరులు మేము ఋషితుల్యుల మని యనలేదు. అనేక మహాగ్రంథములు చూచి ఋషులను ఋషితుల్యులను నిరూపించిన మహార్థముల నొకచోట సేకరించిరి. తరువాతి తరువాతి శాస్త్రప్రవక్తలు మందబుద్ధుల ననుగ్రహించుటకు కదా ప్రవచనము చేసిరి వీరా పనిని చేసిరి.

ఇది యిట్లుండగా నేను ఒకసారి శ్రీ హరివారి యింటికివెళ్ళి యిది కొంత భాగము విని – యిట్టి గ్రంథము వీరు వ్రాయుచున్నా రని విని కదా వెళ్ళితిని— విన్నదానికి తత్పూర్వము విననందుకు మనసులో కష్టపడి, నా వయసుచేత నా యారోగ్యముయొక్క లోపముచేత తక్కినది వినలేక పోయితి నని చింతిల్లుచుండగా 'వారే దయతో 'మేమే మీ యింటికి వారముదినములు వచ్చి వినుపింతు' మనిరి. నాకాశ్చర్యము వేసినది. ఆనందము కలిగినది. వారన్నట్లు వరుసగా పదునాలుగు దినములు సాయంకాలములయందు మా యింటికి వచ్చి– (వారి యిల్లు బందరురోడ్డు మీద; మా యిల్లు ఏలూరురోడ్డుమీద. వారి మొగలిపూవాసనలు వేయవలసి యుండును. ఇప్పు డా వాసనలు లేవు. మిుండ్లే మిగిలినవి)— నాకు వినిపింప నారంభించిరి.

నేను రెండానందములలో మునిగియుంటిని. మొదటిది యింతటి మహా గ్రంథము వారు వచ్చి నాకు వినిపించుచుండుట; రెండవది యిది యింతటిది నేటి కాలమునకు మిక్కిలి యవసరమైన గ్రంథమగుట. ఈ రెండుభావములయొక్క బరువుచేత నాకూహాశక్తి పోయినది. ఒకనాడు నేనంటిని కదా? 'నేను దీనికి పీఠిక వ్రాయవలయును' — అని. వారు దయతో నంగీకరించిరి. ఈ మాట యనకముందు నేనొక్కటి యూహ చేయవలసియుండెను. ఇన్నాళ్ళుగా వీరీ గ్రంథము రచించుచుంతగా నెంతమంది పండితులు దీనిని వినియుండవలయును? వారు దీనికి పీఠిక వ్రాయుటకు నే మహాపురుషులను ఏ మహాపండితుల నెన్నుకొనిరో

యన్న విషయ మూహ చేయలేకపోవుట. మందబుద్ధుల కూహ తక్కువ కదా! తీరావిచారింపగా శ్రీజగద్గురువులు శ్రీ శ్రీ కంచికామకోటిపీఠాధిపతులును, అస్మద్గురువులైన వేదాంతభాస్కర శ్రీ కుప్పా లక్ష్మావధానులు గారును పూర్వమే దీనికి పీఠికా కర్తలుగా నిర్ణయింపబడి రని తెలిసినది. నా గుండె జారిపోయినది. తరువాత వారితో మనవి చేసితిని— "అయ్యా? వారు వ్రాయగా నేను వ్రాయుట యేమి? పొరపాటున నన్నాను. క్షమించవలయు" నని, శ్రీహరివారు కాదని పట్టుబట్టిరి. ఏమి చేయవలయును ? 'అయినచో వారు వ్రాసిన పీఠికలు చూచిన తరువాత ఏదో లౌకికముగా నేను వ్రాసెదను లెండి'— యని యంగీకరించితిని. గ్రంథకర్తలు పీఠికలను తీసికొని వచ్చి నాకు చూపించిరి. భయము విచిత్రమైన గుణము. దానియొక్క తొలుతటి చిక్కదనము క్రమముగా తగ్గిపోవును. ఈ కడచిన రెండు నెలలుగా నాకు తీరిక కాలేదు. ఇప్పుడైనను తీరికచేసికొని వ్రాయుచున్నాను. ఏదో వ్రాయుటకుకూడ తీరికయే కావలయును.

మఱియొక విషయము: నేను ప్రధానముగా ననుకొన్నది యిది— యిట్టి గ్రంథము ఒక మహారాష్ట్రదేశమున గాని కలకత్తాలో గాని వ్రాయబడినచో దానికి రెండు విశిష్టములైన లక్షణము లుండెడివి. వ్రాసెడివారు యమ్. ఏ., లు గాని డాక్టర్‌లు గాని ఒక విశ్వవిద్యాలయములోనో గొప్పకళాశాలలోనో సంస్కృతోపాధ్యాయులుగా నుండి, వారిగురువులు మహామహోపాధ్యాయులై యుండి, ప్రేరకులు ఆ విశ్వవిద్యాలయాధ్యక్షులైన యొక యూరోపుదేశీయుడైన సంస్కృత పండితుడో, సంస్కృతాభిమానియో యైనవాడై యుండెడివాడు. ఈ గ్రంథము ఇంగ్లీషుభాషలోనే వ్రాయబడి యుండెడిది. రెండవది యేమనగా సులభముగా ముద్రితమై యుండెడిది.

శ్రీ హరివారికి యీ రెండుబాధలును లేవు. వారు ఇంగ్లీషులో వ్రాయరు. ఈ గ్రంథము నచ్చొత్తించుటకు వారి కెవ్వరి సహాయము నక్కఱలేదు. అందుచేత నీ గ్రంథమునకు వాతిగ్రంథమునకు వచ్చెడి ప్రచారము తొలగిపోయినది. కాని యట్టి వారెవ్వరో దీనికి గ్రంథకర్త యైనచో నీ గ్రంథమింత నిష్కల్మషముగా

నుండెడిది కాదు. ఈ గ్రంథము పాశ్చాత్య చరిత్రకారులయొక్కయు, పాశ్చాత్య పండితులయొక్కయు, వారి యనుయాయులయొక్కయు సంప్రదాయేతరభావములను ఖండించుటకే నిర్దేశింపబడినది. అచ్చముగా సంప్రదాయమును పోషించుటకు వ్రాయబడినది. సంప్రదాయ మనగా చక్కగా అధికముగా నిచ్చునది— యని యర్థము. ఈ గ్రంథ మట్లు చేయుచున్నది.

ఈ మహాగ్రంథమంతయు సర్వత్ర యిట్లే బహుశబ్దములను ప్రోవుచేసి వాని సంయోజనమును వివరించుచున్నది. స్థూలముగా జూచినచో భిన్న శబ్దముల యొక్క యర్థమును నిర్ణయించునట్లు కన్పించును. 'ఏకేన విజ్ఞాతేన సర్వం విజ్ఞాతం భవతి'— అన్న ఉపనిషద్వాక్యముయొక్క యర్థ మిదియే.

ఈ గ్రంథము సంప్రదాయబుద్ధులకు, వేదమతులకు, శబ్ద యథార్థార్థ జిజ్ఞాసువులకు కరతలామలకముగా నున్న దని చెప్పవలయును. ఆ దృష్టితో గ్రంథము చిన్నది. విచారింపబడిన శబ్దముల సంఖ్య కొద్ది కాని 'ఏకేనైవ విజ్ఞాతేన సర్వమ్ విజ్ఞాతం భవతి'.

ఈ గ్రంథకర్తలకు నమస్కారశతములు.

విజయవాడ
8—12—71

విశ్వనాథ సత్యనారాయణ

    

భారతీనిరుక్తి - ఇయ్యది చతుర్వేదములయందలి వాక్యములను, తత్తద్భాష్యములను క్వాచిత్కముగ స్మృతివాక్యాదులను తఱచి యాస్కాచార్య నిరుక్తమునకు ఛాయగా విరచించిన యమూల్యమైన వైదికగ్రంథము. దీని రచనకు గ్రంథకర్తలు చేసిన పరిశ్రమ చాల వర్ణనీయము.

[illegible]యవాడ,
[illegible]—1947.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

నిష్పక్షపాతబుద్ధితో నీ గ్రంథరాజమును పఠించి తెలిసికొనిన ప్రతి మాన వునకు సర్వసందేహములు నివృత్తములై ప్రాచీన సంప్రదాయములు శిరోధార్యము లగు స్ఫురింపక తీరదు.

కాకినాడ,
8-12-1971.

(సం) ఉప్పులూరి గణపతిశాస్త్రి

   

(27-9-56) దినేఽస్మిన్ నిరుక్తభారతీ- సంస్కృత వాఙ్మయ పరిశోధ నాలయం దృష్ట్వాఽఽనందస్యానందస్య భాజనమభవమ్। అత్ర క్రియమాణ సంశో ధన వ్యాపార స్సర్వోఽపి ప్రశంసాస్పదః।

విరలవిరలా ఖల్వేతాదృశాః సంశోధనాలయాః। సశ్రద్ధం సోత్సాహం చైకమత్యేన హరిశ్రాతృభిః క్రియమాణోఽయం సంశోధనప్రకారో యత్సత్య మన్యేషా మాదర్శో భవిష్యతీతి।

Camp : Vijayawada,
28-10-1955.

(Sd.) T. A. Venkateswara Dikshitar.

   

ఈ దైవవాణీ స్వాభావ్యమును గుర్తించి వేదవర్ణ్యాయపదములనిరుక్తిని బహుప్రమాణముగా సనిర్దుష్టయుక్తిక్రమముగ నిరూపించుచు జాత్రికుల స్వోహ కల్పిత వేదపౌరుషేయతా ద్యపసిద్ధాంతముల సయుక్తికముగ సప్రమాణముగ ఖండిం చుచు, నద్దాన నిటీవల జారితీత దురూహా కల్పిత యుక్త్యాభాసమూలాప సిద్ధాంతా భాసలచే జనించిన యాధునికాస్తికజన మనోవ్యాకులతాది కాలుష్యముల సమూల ముగ నిర్మూలించుట యుందు సత్యావశ్యకవిశేషము.

మచిలీపట్టణము.
29-9-1971.

(సం) కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి

గ్రంథకర్తలు బహుశ్రమపూర్వకముగ దాము జెప్పు ప్రతివిషయమునకు ప్రమాణముల జూపించుచు వేదస్వరూపము నీ గ్రంధమునందు చక్కగ విశదీకరించి యున్నారు.

వీరి రచనలో వైదికసంప్రదాయమునకు గాని, శాస్త్రసిద్ధాన్తమునకు గాని విరుద్ధమైన విమర్శ వెదకినను కన్పించదు.

కౌతా స్వారాజ్యవిహార్ — ఇట్లు,

సికింద్రాబాదు- 25 — (సం) వీరేశ్వర కృష్ణ డోంగరే శాస్త్రి

13-10-1971. — (సం) సన్నిధానం లక్ష్మీనారాయణ మూర్తి

    

హరిసోదరు లీ భారతీనిరుక్తిలో వివిధ పాశ్చాత్యపండితవాదముల నన్నింటిని పరాస్తము చేసి వేదార్థవిషయమున అవిచ్ఛిన్నపారంపర్య మున్నదని నిరూపించిరి.

వైదికవాఙ్మయ గవేషణపరాయణుల కీ గ్రంథము కరదీపికగా నుండగలదు.

కాకినాడ,
26-10-71. — (సం) జటావల్లభుల పురుషోత్తము

   

The more important work that is being conducted by the institution is research in Vedic interpretation. I had a good opportunity to go through the papers prepared so far and am highly delighted by the standard of performance contained there in. The work is useful and detailed sup-

pliment to Yaska's Niruktha and it is not an exaggeration to say that it even excels the latter.........

Vijayawada,
26-10-1956,

(Sd,) **Ch, Markandeya Sastry.**

    

The Hari brothers have boldly under taken this gigantic task of vindicating the ancient vedic etymologies and expositions with a conviction and they richly deserve the honour and glory of being the authours of such a work as this.

Waltair,
13-11 71.

**(Sd.) V. Subba Rao,**

   

శ్రీ హరిసోదరు లిందు వేదము అందలి శబ్దములకు సాంప్రదాయికములు, సమగ్రములు, సర్వాంగీకార్యములు నగు నర్థము లొసంగుటకై యత్నించి కృతార్థులైరి.

హైదరాబాదు,
1-12-1971

(సం) దివాకర్ల వేంకటావధాని

శ్రీరామ. శ్రీహరిసోదరులచే రచింపబడి యున్న 'భారతీనిరుక్తి' (వేదస్వరూపదర్శనము)' - అను గ్రంథము విద్వ దాదరణీయమై యొప్పుచున్నది. వేద వాఙ్మయములో గల నిగూఢవిషయము లెన్నియో బహుప్రమాణములతో నిరూపింపబడియున్న గ్రంథరత్నమిది.

ఆధునికవాదములను బట్టి సందిగ్ధస్థితిలో నుండువారికిని, వేదసారస్వతారాధకులకును ఈ గ్రంథము మహోపకారకము.

ఈ గ్రంథరచనలో వీరు చేసిన కృషి యసాధారణము. దీని నభినందించుచున్నాము.

పిఠాపురం,
26- 1-1971. (సం) వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి

   

ఆస్తికులకు ఆస్తికత్వమును బెంపొందించుకొనుటకును, నాస్తికులకు నాస్తికత్వమును బరిహరించుకొనుటకును. వేదార్థనిర్ణేతలకర్థనిర్ణయము జేసికొనుటకును, సాహిత్యపిపాస గల వారలకు వ్యుత్పత్తివిశేషముల నాశ్రయించి సాహిత్యమును [illegible]దించుకొనుటకును - అధికారిభేదము ననుసరించి పెక్కువిధములుగా నుపయోగపడెడి యిట్టి యీ గ్రంథ మపూర్వమైనదనియు, అనన్యసాధారణమైనదనియు జెప్పుట యతిశయోక్తి గానేరదు.

రాజమహేంద్రవరము
18-12-1971. (సం) దివిల్లి సూర్యప్రకాశశాస్త్రి

వేద ధర్మ సంప్రదాయ రక్షణాయ ప్రవృత్తోఽయం గ్రన్థః అన్వర్థ నామ పరిశీలన ముఖేన వేదస్వరూపం దర్శయన్ చకాస్తి।

ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞాన ఫలభూతోఽయం నిబన్ధః విద్యాస్థానేషు వేదస్య ప్రాముఖ్య మావిష్కుర్వన్ తత్త్వజిజ్ఞాసూనా ముపకారాయ కల్పతే।

ఇతినివేదయితా

తెనాలి,
24-12-71.

(సం) సూరి రామకోటి శాస్త్రి
సుధీవిధేయః

    

శ్రీ హరిసోదరులు వేదములను వేదభాష్యములను వేదాంగములను లౌకిక సంస్కృత వాఙ్మయమును బాగుగ పరిశీలించి "భారతీనిరుక్తి" యను చక్కని గ్రంథమును నిర్మించిరి. ఈ గ్రంథము ఈనాటి ప్రజలలో కలిగెడి కలవరమునకు చక్కని సమాధాన మీయగలదు. దీని మూలమున వేదవేదాంగములందు ఆస్తికులకు విశ్వాసాతిశయము కలుగును.

ఈ గ్రంథమును సమగ్రముగ బరిశీలించినచో భారతీయవిజ్ఞానమున హరిసోదరులకు గల శాస్త్రవైదుష్య మెంతయో విదితము కాగలదు.

గౌతమీవిద్యాపీఠము,
ఓరియంటల్ కాలేజి,
రాజమండ్రి,
8-1-72.

ఇట్లు,
పేరి సూర్యనారాయణ శాస్త్రి

అపూర్వములు ఉత్తమములు ఐన గ్రంథములు పఠించుట ఆహ్లాదకరము, అట్టివానిని సమీక్షించుట మహాభాగ్యము. ఈ గ్రంథపఠన సమీక్షలలో అహ్లా అట్టి గిమూ మహాభాగ్యమూ మాకు ప్రాప్తించినవి. వేదముఅనాది, నిత్యము, అపౌరుషేయము, స్వతఃప్రమాణము అని అనాదిగా వేదవాదుల నిర్ధారణము. కాని అది పౌరుషేయమే కాక బుద్ధిహీనులు కల్పించిన మూర్ఖజల్పితమని జైనులు, బౌద్ధులు, చార్వాకులు మొదలగు మతాంతరులు దానిని నిరసించుచు రాగా, ఎప్పటికప్పుడు వేదవాదులు ప్రతిపక్షవాదములను ఖండించుచు వేదరాశి అపౌరుషయత్వాదులను సమర్థించి ప్రతిష్ఠించుచు వచ్చినారు.

వాదప్రతివాదము కొకవంక ఈవిధముగా జరుగుచుండగానే యాస్కాచార్యులవంటి ఋషులు—లిపిబద్ధము కాని రోజులలోనే— కృత్స్న వేదమును జిహ్వాగ్రమునందు వాచోవిధేయముగా ధారణమొనర్చి ప్రథమ వైదిక విఘంటు వన వేదన నిరుక్తము మొదలగు వేదాంగములను రచించి వేదస్వరూపమును యథార్థముగా ప్రదర్శించినారు. వేదరాశికి పదము క్రమము నిబంధించి శిక్షాదులచేత ఉచ్చారణ స్థిరీకరించి గురుశిష్యపరంపరగా అధ్యయ నాధ్యాపనములు సాగించి ఈ పెన్నిధిని యథామూలముగా కాపాడిరి. జైమిన్యాచార్యులు ధర్మసూత్రములను, బాదరాయణులు బ్రహ్మసూత్రములను రచించి వేదార్థమును యథాతథముగా ప్రామాణికముగా నిలుచునట్లు చేసినారు. బోధాయనాప స్తంబాదులు సూత్రగ్రంథనముచేసి వేదమంత్రములకు శ్రౌతస్మార్త కర్మలలో వినియోగక్రమమును నిర్దేశించినారు.

వేదవ్యాసులు తన కాలముననే కృత్స్న వేదము అధ్యయనము చేయగల శక్తి, సామాన్యులలో లోపించినదని గ్రహించి, శాఖావిభజనముచేసి శివరిశాఖ పదము పైనను వారు అధ్యయనము చేయునట్లు నియమించినారు.

ఇన్ని జాగ్రత్తలు పడినను రాను రాను వేదవాదులలో శ్రద్ధాశక్తులు లోపించుచు వచ్చినందున ఎన్నో వేదశాఖలు లుప్తములైనవి. వేదభాష్యములెన్నో పుట్టినను అవియు ఉత్సన్నము కాసాగినవి.

ఇట్టి దుఃస్థితిలో శ్రీవిద్యానగర స్థాపనాచార్యులైన శ్రీవిద్యారణ్య పూజ్యపాదులు ఆనాటికి లభ్యములైన గ్రంథజాతమును సేకరించి, భరతఖండములో మూలమూలలోనున్న వేదవిదులను శ్రీ విద్యానగరమునకు పిలిపించి, అప్పటికి ఉపలభ్యమైన వేదరాశికి తమ పర్యవేక్షణమున భాష్యము వ్రాయించి ప్రతిష్ఠించినారు. తదాదిగా నది సాయనభాష్యమనియు విద్యారణ్యమనియు పేర్లు వహించి ప్రామాణిక భాష్యముగా ప్రసిద్ధి వహించినది. అది సామ్రాజ్యస్థాపకుడగు బుక్కరాయల కంకితమైనది. రాయసోదరులు స్థాపించిన విజయనగర సామ్రాజ్యము 20 సం.లు (1336-1565) వైదిక ధర్మమునకు పట్టుకొమ్మగా నిలిచి, నెమ్మది నెమ్మదిగా క్షీణించి నశించినది. కాని బుక్కరాయల పేరపుట్టిన విద్యారణ్యము నేటికిని మొక్కవోని ప్రతిభతో నిలిచి వేదరాశి అపౌరుషేయత్వమును ఉద్ఘోషించుచున్నది.

వారి తర్వాతకూడ మరికొన్ని వేదశాఖలు విస్మృతప్రాయములైనవి. ఈ స్థితిలో పాశ్చాత్యులు భరతభూమిలో అడుగుపెట్టి క్రైస్తవమత ప్రచారమునకు పూనుకొనిరి. వారిని ముందు సంస్కృతభాష ఆకర్షించినది. తర్వాత వారి దృష్టి వేదరాశివంకకు మరలినది. ముందు దానిని పఠించుటకు కారణము తమ మత ప్రచారమే యైనను, తర్వాత దాని స్వరూప పతనమునకు ఉపక్రమించిరి. ఐనను ప్రత్యక్షముగా గాకున్నను అంతర్గతముగా నైనను వారిది స్వమతాభిమానము పోలేదు. వారికి భారతీయ ప్రభుత్వము చేజిక్కనందునను, అపారమైన అర్థబలము అంగబలము వారికి చేకూరినవి. వారు మరల ప్రాచీన కాలమున వేదాంగ నిర్మాతలు చేసినంత కృషి, దగ్గర దగ్గరగా, చేసిరి. వారు తయారుచేసిన Vedic Indexతే దానికి తార్కాణము.

వారిలో మతపక్షపాతము లేకుండ పఠించిన పండితులు కూడ, వేదము అపౌరుషేయ మను స్థిర నిశ్చయముతోనే ఉపక్రమించిరి. అందుకు అనుకూలముగానే వారు వేదార్థము నిర్ణయించి మహాగ్రంథములు రచించి ప్రచారముచేసి, ఇతర ప్రపంచమునేకాక భారతీయ పండితులనుగూడ భ్రాంతిలో పడవేయసాగిరి, వారు ఋగ్వేదము 1500 B. C. నుండి రచింపబడినదని చెప్పగా భారతీయ పండితులు 250, 000 B. C. ఇత్యాదిగా ఎక్కువ పురాతనత్వము ప్రతిపాదించుటకే పూనుకొన నారంభించిరి కాని దాని అపౌరుషేయత్వమును నిత్యత్వమును ప్రతిష్ఠించు ప్రయత్నమునకే పూనుకొనరైరి. పాశ్చాత్యులు మొదట ఋగ్వేదము 1500 బి సి. దని నిర్ణయించుటకు ప్రధానకారణము బైబిలు జెనిసిస్‌లోని సృష్ట్యాదికాలమున మించకుండుటకే యని గుర్తింపలేని వశనీయస్థితికి భారతీయ పండితులు దిగజారిరి.

పాశ్చాత్యులను పాశ్చాత్యభావ ప్రభావితులను వేదరాశినిగూర్చి తేల్చిన విషయములు స్థూలముగా నిట్లున్నది: అట్టివారినే ఈ గ్రంథము తరచుగా చారిత్రికులని నిర్దేశించి ఖండించుచున్నది.

1. వేదము అపౌరుషేయము కాదు. వివిధ ప్రాంతములలో ఆర్యులనే జాతివారు రచించిన గ్రంథజాతమిది. ఋగ్వేదము ముందు రచితము. దాని రచనా కాలమున గూడ నూతన మంత్రరచన సాగుచుండెననుటకు స్పష్టమైన ఆధార వచనములు వేదముననే కలవు. పూర్వకవులయు నూతన కవులయు రచనల ప్రశంసలు కలవు.

2. ... వేదములో భావపరిణతి క్రమక్రమముగా కనబడుచున్నది. ఋగ్వేద వక్తలు ప్రకృతిలో కనపడుచున్న అగ్ని వర్షము మేఘము ఉరుము పిడుగు సము ద్రమువంటి ప్రచండశక్తులనే దేవతలనుగా భావించి స్తుతిచేసినారు. ఈ ప్రచండ శక్తుల బాహ్య దర్శనమే కాని ఈశ్వరదర్శనము కాని ఆత్మదర్శనముకాని లేదు.

పురోహితుల ప్రాబల్యముచేత బ్రాహ్మణములు పుట్టి యజ్ఞకర్మ విస్తృతమైనవి. అరణ్యకములు ఉపనిషత్తులు పుట్టిననాటికి బ్రహ్మభావము, ఆత్మ భావన, ఇంద్రాది దేవతలందరు ఒక్కడైన పరమేశ్వరుని విభూతులను భావపరిణతి క్రమప్రాప్తమైనది. సృష్టికర్తను గూర్చిన జిజ్ఞాస అనంతరకాలికము.

8. విద్యారణ్య భాష్యములలో నిర్వచించిన వేదార్థములు ప్రామాణికములు కావు. తత్, సత్, బ్రహ్మ — ఇత్యాది పదములకు ఉపనిషత్తులందును భాష్యాదులందును జెప్పెడి తత్త్వార్థములు ఋగ్వేదమున కానరావు.

ఈ మొదలైన ప్రదర్శనములతో వేద స్వరూపమే మారి ప్రామాణికత కోల్పోవును. పాశ్చాత్య వేద పండితులు సర్వజ్ఞత్వాహంకారముతో ప్రదర్శించుచున్న వేదార్థములచే ప్రభావితులై భారతీయ పండితులు గూడ వానిని గ్రహింపుట సర్వసాధారణమైనది. ఆ భావములనే బ్రిటిషువారి పాలనమందే కాక స్వతంత్ర భారతములో గూడ శిశు క్లాసునుండి మన పిల్లలకు నూరిపోయుచు వారి రక్తమాంసములలోనికి ఎక్కునట్లు చేయుచున్నాము. ఈ సమీక్షకుడు కూడ ఆ భావమునకు వశంవదుడు కానివాడు కాదు.

ఈ దురవస్థను గమనించి బాపట్ల హరిసోదరులీ గ్రంథరచన కుపక్రమించినారు. ఇట్టి పూర్వపక్షములు వచ్చినప్పుడు పూర్వాచార్యులు యుక్తులగు ప్రతియుక్తులతో ఖండించుచు వచ్చినారు. వేదరాశిని సుష్ఠుగా పఠించి విస్తారకృషి చేసి పాశ్చాత్యులు తెచ్చిన ఈ పూర్వపక్షములను కేవల యుక్తులతో ఖండింపబూనినచో నప్పుడు. అందువలన హరిసోదరులు ఈ నూతన మార్గ మవలంబించినారు. వారు వేదశాస్త్రములలో కనబడు 12 శబ్దములను ఎంపిక చేసినారు. అవి యన్నియు వేదమునకు అన్వయించునవే. అవి ఇవి:

1. వేదః, 2. ఋషిః, 3. బ్రహ్మ, 4. ఆమ్నాయః (శ్రుతిః), 5. స్వాధ్యాయః, 6. స్వాహా, 7. స్వధా, 8. వషట్, 9. త్రయీ, 10 కవిః, కావ్యమ్, 11. భారతీ, 12. ఛందః.

ఈ పదములనుగూర్చి వేదములేమి చెప్పుచున్నవి? వేదాంగములు స్మృతుల శాస్త్రములు పురాణములు ఏమనుచున్నవి? తుదకు ప్రామాణికులగు కవుల కావ్యము లేమనుచున్నవి? వానిలో క్రమపరిణతి గాని పరస్పర వైరుధ్యముగాని కలదా? ఆ శబ్దములకు పాశ్చాత్య పండితులిచ్చిన యర్థములు సందర్భమునకు సరిపడునా?— ఇట్టి ప్రశ్నలు వేసికొని అర్థవివరణకు ఉపక్రమించినాడు.

12 శబ్దముల అర్థవివరణకు 696 పేజీల గ్రంథమా అని మా విద్వన్మిత్రు లొకరు అన్నట్లే, స్థూలదృష్టికి ముందు గోచరించును. ఆ మిత్రుడు వేదార్థ పరిశ్రమకూడ చేసినవాడైనందున మేముకూడ అట్టి విరుద్ధభావముతోడనే గ్రంథపఠన మారంభించితిమి. కాని లోతుగాపోయి శ్రద్ధగా గ్రంథపఠనము సాగించినకొలది మొదటి దురభిప్రాయము పటాపంచలు కాసాగినది. ఇందులో వేదవేదాంగ శాస్త్ర పురాణ కావ్యవిజ్ఞానము అపారముగా హేతుబద్ధముగా నిక్షిప్తమైన దని గోచరించినది. ఈ శబ్దముల వరుసకూడ క్రమప్రాప్తమైనది కాని యాదృచ్ఛికముగాఎన్నుకొన్నది కాదని తేలినది. ఈ 12 శబ్దముల విచారణలో సందర్భవశముగా అనేక శబ్దముల విచారణ, దాని యర్థవివరణము జరిగినది.

బ్రహ్మభావన అవంతర పరిణామ మనియు ఋగ్వేదము మొదట పుట్టినదనియు గదా చారిత్రికుల నిర్ణయము! శబ్దార్థ విచారణలో ఇందులో సర్వ సాధారణముగా ముందు ఋగ్వేదము లోని వాక్యములే గ్రహింపబడుచు వచ్చినవి. ఈ విచారణవలన బ్రహ్మభావన ఋగ్వేదము సహా అన్ని వేదములందును కలదని ఋజువు చేయబడినది. ఆ యర్థమే శ్రుతులును వేదాంగములును, స్మృతులును, శాస్త్రము

లును, ఇతిహాసములును, పురాణములును, ప్రామాణికుల కావ్యములును ఏకకంఠముగా ఉద్ఘోషించుచున్నది. ఋగ్వేదకాలమున అగ్ని మొదలగు ప్రకృతిశక్తుల ఆరాధనము మాత్రమే కలదను చారిత్రికులమాట వరాస్తసుగు చున్నది. శబ్దార్థము చెప్పుటకు ఏ శబ్దము ఏధాతువు నుండి నిష్పన్నమైనదో కూడ తరచుగా విచారణ చేయబడినది.

వేదరచనలో పౌర్వాపర్య మున్నదని చారిత్రికులు ప్రదర్శించు రెండు మూడు సందర్భములు ఉదాహరించి వానికి సంప్రదాయార్థముమాత్రమే ఎట్లు కుదురునో, చారిత్రికులది ఏల కుదురదో కొంచెము హరిసోదరుల ననుసరించి చూపెదము.

"అగ్నిః పూర్వేభిః ఋషిభిరీడ్యో మాతనైరుత' ఋగ్వేదము 1-1-2. పై మంత్ర మాధారముగా Macdonell ఇట్లనుచున్నారు,

'In the Rigveda reference is ofter made to previous singers and to contemporary poets.'

ఈ యర్థము ఆపాతమధురముగానే ఉన్నది. కాని మూలములో పూర్వఋషులు నూతన ఋషులు పేర్కొనబడినారే కాని Singers కాని Poets కాని లేరు.

ఇక్కడి అగ్ని శబ్దమునకు జగత్కారణుడైన పరమేశ్వరుడని వేదశబ్దవిచారణలో నిరూపించినారు. అట్టి అగ్ని తపస్సంపన్నులైన పూర్వ ఋషులకు నూతన ఋషులకు ఆరాధ్య దయ్యెను అని ఈ మంత్రమునకు అర్థమేర్పడుచున్నది. అనగా సర్వకాలము లందును అగ్ని ఆరాధ్యుడని కీర్తింపబడుచున్నాడు. కావుననే ఋగ్వేదమున అగ్నిని 'యుగే యుగే విదథ్యమ్' ఋ. 6-3-5 అని కీర్తించినది— అనగా సర్వకాలములందును అగ్నియజ్ఞాదులచే ఆరాధనీయుడు అనుచున్నది. ఋషి

పదమునకు అతీంద్రియార్థదర్శనము కలవారనియే గాని, Poets అని కాని Singers అని కాని, మంత్రరచయితలని కాని అర్థము కాదు. (పుటలు 84-85 తాత్పర్యార్థము).
ఈ యుదాహరణమువలన పాశ్చాత్య వేదపండితులు ఎట్టి విపరీతార్థములు చెప్పిరో బోధపడగలదు.

అట్టిదే మరియొకటి.

'నవంను స్తోమ మగ్నయే దివః శ్యేనాయ జీ జపమ్' ఋ. 7-15-4.

'ఓ అగ్ని, నీకు నవమైన స్తోమమును జనింప జేయుచున్నాను' అని మంత్రార్థము.

అట్టి యర్థమే.

'ఇదిం నుస్తోమం నవజాత మద్యేంద్రాగ్నీ వృత్రహణా జుషేథామ్' ఋ. 7-93-1 అను మంత్రమునకు గలదు.

ఇక్కడ ప్రస్తావింపబడిన స్తోమములు క్రొత్తగా సృష్టింపబడినవే నిస్సంశయముగా; అట్లే 'శస్త్రము' లనునవియు క్రొత్తగా సృష్టింపబడునవే. ఇట్టివాని ప్రస్తావనకూడ భ్రాంతి కలిగించునట్టిదే. కాని స్తోమములు గాని శస్త్రములు గాని క్రొత్తమంత్రములు కావు. అవి సిద్ధమంత్రముల కొత్త కూర్పులు. పే.16. ఇట్టి సూక్ష్మములు తెలిపినచో మొదట కలిగిన భ్రాంతి నివృత్తి యవును.

ఇట్లే మరి యెన్నో భ్రాంతి కలిగించు వేదసందర్భములు దాసక వివరించి వేదము పౌరుషేయమని భావించువారి భ్రాంతి తొలగునట్లు ఈ గ్రంథరచన చేసినాను.

వేదప్రామాణ్యము అంగీకరింతురు గాక, అంగీకరింప కుందురు గాక; ఏమైనను వేదము తాను పురుషప్రోక్తమైనట్లు చెప్పలేదని, అందుతో క్రమపరిణతి

లేదనీ హరిసోదరులు ఆయా సందర్భములలో హేతుబద్ధముగా సప్రమాణముగా సిద్ధాంతము చేసినారు.

ఈ విధముగా వేదస్వరూప ప్రదర్శనమునకు గ్రంథము ప్రవృత్తమైనను, సందర్భవశముగా వేదవాక్యముల అతీంద్రియ జ్ఞానము, వేదోక్త కర్మల అతిశయము వేదాంగముల స్మృతుల దర్శనముల విశిష్టత ప్రదర్శించు ఆర్ష విజ్ఞానమును గ్రంథ మందంతట హరిసోదరులు వెదజల్లి వేద వాదులకు మహోపకృతి కావించినారు.

మరియొక విశేషము కూడ ఈ గ్రంథములో అక్కడక్కడ గోచరించును. మమ్మటభట్టువంటి ఆలంకారికులు, భవభూతివంటి మహాకవులు చెప్పిన శ్లోకములకు సర్వసాధారణముగా వ్యాఖ్యాతలు చూపని విశేషార్థములు వేదవిజ్ఞానపరమైనవి ప్రదర్శించినారు. అట్టి మహారచయితల భావములు పూర్తిగా అవగాహన మొనర్చు కొనుటకు సామాన్యముగా భాషాశాస్త్ర విజ్ఞానము చాలదని వేదవిజ్ఞాన మవసరమని చెప్పకుండ సూచించినారు. రెండు ఉదాహరణము లిత్తుము.

మమ్మటభట్టు తన కావ్య ప్రకాశారంభముతో కవి భారతి నిట్లు ప్రశంసించినాడు.

'నియతికృత నియమ రహితామ్
హ్లాదైక మయీ మనన్య పరతంత్రామ్
నవరస రుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవేర్జయతి.'

ఈ శ్లోకమును బ్రహ్మ సృష్టికంటె కవి సృష్టి విశిష్టమైనదని వ్యాఖ్యాతలు వివరించినారు. కవులంటే లౌకిక కవులే. ఈ మంగళ శ్లోకము కవియగు పరమేశ్వరుని నుండి యావిర్భవించిన భారతియగు వేదవాణికి సర్వవిధముల నన్వ

యించునని పు. 459-462 లలో చేసిన వివరణము అపూర్వమై ఎంతో ఆనందము కలిగించినది.

అట్లే భవభూతి ఉత్తర రామ చరితములోని

'ఇదం కవిభ్యః పూర్వేభ్యో
నమోవాకం ప్రశాస్మహే
వందేమహి చ తాం వాణీ
మమృతా మాత్మనః కలామ్॥

అను మంగళశ్లోకములో ప్రస్తావింపబడిన పూర్వ కవులు వేదమంత్రముచే యని ఇందలి ఇదం శబ్దము వేదసంప్రదాయాను గుణమనియు ఇందలి వాణి వేద వాణియే యనియు పు. 454-467 లలో చేసిన వివరణము ఎంతో హృదయంగమముగా నున్నది.

మఱియొక విశేషము! కావ్యస్వరూప లక్షణవేత్తలు తరుచుగా వేదము ప్రభు సమ్మితముగాను, పురాణములు సుహృత్సమ్మితముగాను, కావ్యములు కాంతా సమ్మితముగాను ఉపదేశించు ననుట సర్వసాధారణ విషయము. కాని హరిసోదరులు అధికారిభేదమును బట్టి వేదము ప్రభుసమ్మితముగాను, సుహృత్సమ్మితము మాత్రమేకాక కాంతాసమ్మితముగా కూడ ఉపదేశించు మహాకావ్యమనుచు 'కవిః-కావ్యమ్' అను పదార్థవివరణలో పు 419-508 లలో చేసిన ప్రతిపాదన లెంతయేని అహ్లాదకరములై బుద్ధిమంతులు మననము చేయదగినవిగా నున్నవి. ఇది గ్రహించినచో భారతీయ విజ్ఞానమంతటికీ వేదమే మూలమని నిర్ధారితమై భారతీయ సంస్కృతి విశిష్టత గోచరింపగలదు.

ఈ విధముగా గ్రంథస్థ విషయములు ప్రామాణికములుగా నుండి వేద నిత్యత్వమును, అపౌరుషేయత్వమును నిరూపించునవిగా నున్నవి. దీనికి హిందీ భాషలో అనువాదము జరుగుచున్నట్లు తెలియవచ్చినది. తక్కిన భారతీయ భాషలలోనికే

కాక ప్రపంచభాష లన్నింటి లోనికిని సంగ్రహముగానైనను అనువాదము చేయదగిన ఉత్తమ గ్రంథకోటిలో చేరినదీ గ్రంథము.

గ్రంథవిషయ గౌరవమునకు తోడు అచ్చు, బైండు, జాకెట్టు, బుకు మార్కు అన్నీ రమణీయములుగా ఉండి వన్నె తెచ్చుచున్నవి. మూల్యముగూడ అతి స్వల్పముగా నిర్ణయింపబడినది.

దీనికి సాంగస్వాధ్యాయ భాస్కరులు కుప్పాలక్ష్మావధానిగారు వ్రాసిన విపుల పీఠికయు, శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి పరిచయమును, శ్రీ కంచికామ కోటి పీఠాధీశ్వరుల "వేదములు" అను వ్యాసమును, ఇతర పండితుల యభిప్రాయములును, మధ్యమధ్య ఉదాహరింపబడిన హరిసోదరుల వేదమ త్రృస్తవ భాగములును గ్రంథగౌరవమును బహుగుణముగా వృద్ధిచేయుచున్నవి.

ఈ ఉత్తమగ్రంథ రచయితలైన హరిసోదరులను. ప్రకాశకులైన తెనాలి సాధన గ్రంథ మండలి వారిని సర్వాత్మనా ప్రశంసించుచున్నాము. వేదవాఙ్మయమందు ఏ మాత్రము అభిమానమున్న వారైనా ఈ గ్రంథము అవశ్యము పఠింప వలసియున్నది.

—నోరి నరసింహశాస్త్రి

—)o(—

# వేదములు

జగద్గురువులు శ్రీశ్రీశ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ్వరులు

## శ్రీ చంద్రశేఖరేన్ద్ర సరస్వతీ స్వామివారు

'ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా-వేదోఽఖిలో ధర్మమూలమ్'

వేదములు పరమేశ్వరుని నిఃశ్వాసరూపము లని యనాదిసిద్ధ భారతీయ సంప్రదాయము. మన ప్రాచీనులగు మహర్షులే గాక తరువాత క్రమముగ వెలసిన శ్రీ శంకరభగవత్పాదాది మహాపురుషులును, కాళిదాసాది మహాకవులు, తులసీదాసు, ఆళ్వారులు, నాయన్మారులు త్యాగరాజు మున్నగు మహాభక్తులు, నెందఱో వేదములు పరమేశ్వరుని నిఃశ్వాసరూపము లని దృఢముగ నమ్మి సహేతుకముగ నిరూపించి యున్నారు.

పరమేశ్వరు డీ జగత్తును సృష్టించి రక్షించి లయ మొందించు చున్నాడు, ప్రళయమునం దీ జగత్తు అదృశ్య మగుచుండును. సృష్టింపబడిన తరువాత నీ జగత్తెంత కాలముండునో ప్రళయకాలము గూడ నంతియే. సృష్టిలయములు రెండును నొకదాని వెనుక నొకటి నిరంతరము నియతగతిని చక్రము వోలె తిరుగుచుండును. సృజింపబడిన తరువాత నీ విశ్వమంతయు పదునాలుగు భువనములతో నొప్పుచు, నొకానొక సార్వభౌముని యాజ్ఞచే బరిపాలింప బడుచున్నట్లు నియమబద్ధమై ప్రవర్తిల్లుచున్నవి. ఆ సార్వభౌముడే పరమేశ్వరుడు. స్థావర జంగమాత్మకము లగు ప్రాణులే యాయన పరిపాలనకు లోబడి ప్రవర్తిల్లుచుండెడి ప్రజలు. అందుచే నాయనకు ప్రజాపతి యని పేరు. ఆ చక్రవర్తియు, ఆయనచే బాలింపబడు జీవులు నందఱు ననాది స్వరూపులు. కాని, సృష్టి జరిగినపు డెల్ల ప్రాణులు మాత్రము భిన్నభిన్న శరీరములతో దిరిగి యవతరించుచుందురు. ఈ ప్రాణులను (పరిపాలిత ప్రజలను) ఉద్ధరించి పోషించుట కొక చట్ట మవసరము. ఆ చట్టమే వేదము. ప్రజలును సార్వభౌముడును అనాది స్వరూపులగుచో నీ చట్టము గూడ ననాదియే

కాలయును. సృష్టి యుండునంతదాక పరమేశ్వరుడును, ప్రజలును, వేదమును (చట్టమును) శాశ్వతములు. ప్రళయకాలమున నీ వేదములు పరమేశ్వరుని యందు విలీనములై యుండును.

వేదములు మంత్రాత్మకములు గాన నవి శబ్దరూపమున నాకాశమున నెపుడును వ్యాపించియుండును. ప్రళయానంతర మీ వేదములు ఋషులచే దర్శింప బడుచున్నవి. పిదప గురువులనుండి శిష్యులకు సంక్రమించుచు 'శ్రుతులు' అను అన్వర్థ నామమున బరగుచు సంరక్షింప బడుచున్నవి. అట్టి గురుశిష్యులు క్రమశిక్షణతో గూడిన నియమబద్ధ జీవితమును గడుపవలసి యుండును. అట్టి జీవితమును గడుపుచు వేద సంరక్షణమును జేయువారు దివ్యశక్తి సంపన్నులగుదురు. అంతియే గాదు. నిరంతర మంత్రోచ్చారణ సేయుచు నా మంత్రాక్షరాది దేవతాస్వరూప ధ్యానముచే దాము తరించుచు లోకశాన్తి కళ్యాణములకుగూడ దోహద మొనర్చుచున్నారు.

తమిళమున వేదములకు 'ఎళుదాకిళవి' (Unwritten Words) అనియు, మరై (గుహ్యమైన), ఓతు (గానము లేక ఉచ్చారణ)' అనియు వ్యవహారము. ఇవి పౌరుషేయములు (పురుష ప్రణీతములు) గావు. ఇతర గ్రంథముల వలె వేదములు స్వయముగ చదువుకొనదగినవి కావు. అధ్యయనము ద్వారామాత్రమే గురువునుండి శిష్యునకు సంక్రమించునవి. వేదాంగములలో మొదటిది యగు శిక్ష వేదములను స్వయముగ చదువుకొనుట నిషేధించినది

"గీతీ శీఘ్రీ శిరఃకంపీ తథా లిఖితపాఠకః ।
అనర్థజ్ఞోఽల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః ॥" —పా.శి.32.

పింగళము, చూడామణి మున్నగు తమిళకోశములు గూడ పరమేశ్వరుని వేదకర్త (వేద ముదల్వన్ - Veda Mudalvan) అని పేర్కొనుచున్నవి.

సృష్ట్యారంభమునుండి యెపుడును చక్రవర్తి యగు పరమేశ్వరుడు దివ్య యోగశక్తులచే బాహ్యాభ్యంతర ప్రపంచముల సామరస్యమును సాధింపజాలిన యాధికారిక పురుషులను నియోగించుచుండెను. అట్టి మహనీయులు తమ దివ్యస్తోత్రములను (వేదములను) సాక్షాత్కరింపజేసికొందురు. అనగా తమ దివ్యశ్రవణ శక్తిచే విశ్వమునందు వ్యాపించియున్న యనాది వేదశబ్ద తరంగములను దర్శింతురు. బ్రహ్మకుకూడ పరమేశ్వరానుగ్రహముచేత వేదములు స్వయముగ భాసించును. అట్టి యాధికారిక పురుషులే లేక మంత్రద్రష్టలే మొట్టమొదట వేదములను వెలిపరచిన దివ్యమూర్తులు.

"అనాదినిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా ।
ఆదౌ వేదమయీ దివ్యా యత స్సర్వాః ప్రవృత్తయః॥" —మను.

యుగాంతేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః,
లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతాః స్వయంభువా ॥" —వ్యాసః

"తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే" —భాగవతమ్.

వేదాధ్యయన మన మంత్రయోగము. వేద మంత్రాక్షరము నుచ్చరించినపుడెల్ల తదను గుణముగ దేహము నందలి నాడియందు (నాడీకేంద్రమునందు) ఒక విధమగు సంచలనము కలుగును. సామాన్యముగ నాడిసంచలనము యొక్క ప్రభావము మనస్సుపై బడి యది కామ క్రోధ శోకాది రూపమున ముఖభంగిమల ద్వారా యభివ్యక్త మగుచుండును. ముఖము మనోభావ దర్పణము (Face is the index of the mind) అను నానుడి యొక్క తాత్పర్య మిదియే. మంత్రాక్షరములను నియమబద్ధముగ నుచ్చరించి తగువిధముగ నాడీసంచలనము కలిగించినచో సత్త్వభావములే యుదయించునట్లు చేసికొనవచ్చును. ప్రాణాయామముచే నాడీనియమనము గావించుట హఠయోగము. సామాన్యముగ నే శబ్దము నుచ్చరించినను నా యుచ్చారణము జిహ్వ, పెదవులు, దౌడలు, వక్షఃస్థలము - వీని

యందంతట వ్యాపించి యుండెడి నిశ్శ్వాసరూపమగు ప్రాణవాయువుచే ననుగతమగు చుండును. మంత్రోచ్చారణ సమయమున ప్రాణవాయువును దేహమందలి యేదియేని నాడీకేంద్రమున నిలిపి యున్నప్పుడె యొకవిధమగు ప్రేరణ కలిగి యందుండి శబ్దతరంగముల ప్రభావము ప్రపంచమున గలుగు సుఖ దుఃఖాదులకు గారణమగు చుండును. ఇహలోకము నందేగాక పరలోకమునందు గూడ శాన్తిసౌభాగ్యముల గలిగింప జాలెడి శబ్దతరంగముల నుదయింపజేయు శక్తి వేదమంత్రాక్షరములకు గలదు. అట్టి వేదముల సంరక్షించుకొనుచు లోకశాన్తికై వేదమంత్ర పురశ్చరణము గావించుచుండుట బ్రాహ్మణుని విధ్యుక్తధర్మము. "బ్రాహ్మణేన నిష్కారణః షడఙ్గో వేదోఽధ్యేతవ్యో జ్ఞేయ శ్చ".

తమిళదేశస్థుడు మహాభక్తుడు నగు తిరుమూలర్ మహాశయుడు "అకారాది క్షకారాన్త రూపములగు నేబది వర్ణములతో (మాతృకలతో) విలసిల్లెడి వేదములనంతములు, అగాధములు" నని కీర్తించెను. యజుర్వేదము నందలి కాఠకము 3వ ప్రశ్నయందు వేదముల యనంతత్వము నిరూపించెడి భరద్వాజుని గూర్చిన గాథ యొకటి గలదు.

భరద్వాజమహర్షి బ్రహ్మచారియై వేదాధ్యయనము చేయుచు జీవితమునంతయు గడపెను. జీవితాంతమున (నూఱు వత్సరముల తరువాత) మఱియొక పూర్ణాయుర్దాయము (నూఱు సం॥)ను ఇంద్రుని యనుగ్రహముచే బొందెను. తరువాత వేదాధ్యయనమునకై మఱియొక పూర్ణాయుర్దాయమును గూడ నిమ్మని గోర ఇంద్రు డనుగ్రహించెను. అప్పటి కాతని భౌతికశరీరము మిక్కిలి జీర్ణమయ్యెను. అయిన నింకను వేదాధ్యయనము జేయగోరి యింకొక పూర్ణాయుర్దాయ మిమ్మని కోరెను. ఇచ్చినచో నీవేమి చేతు వని యింద్రు డడిగెను. వేదాధ్యయనమును బూర్తి జేతు నని భరద్వాజు డనెను. ఇంద్రుడు వెంటనే భరద్వాజుని యెదుట మూడుపర్వతముల జూపించి యా మూడింటినుండి మూడు గుప్పిళ్ళ దుమ్ము తీసి

యాతనికి జూపి "మూడువందల యేండ్ల జీవితకాలములో నీవు గ్రహించిన వేదభాగ మింతియే. ఇంకను గ్రహింపవలసిన దింత గల"దని యా పర్వతముల జూపెను.

వ్యాసభగవానుడు అయిదువేల వత్సరములకు బూర్వ మొక రాశిగానున్న వేదమును ఋక్, యజుస్, సామ, అథర్వరూపమున నాల్గుభాగములుగ విభజించెను. అపుడు మొత్తము 1131 వేదశాఖలు గలవు. అందు ఋగ్వేదమునకు 21, యజుర్వేదమునకు 101, సామవేదమునకు 1000, అథర్వవేదమునకు 9 - శాఖలు గలవు. అట్టి యీ శాఖలు ఋషి పరంపరగా నధ్యయనము జేయబడుచు వచ్చినవి. కాని కాలక్రమమున వేదాధ్యయనముకంటె నన్యవిద్యల నభ్యసించినచో ఐహిక జీవితము సుఖముగ గడచిపోవు నను భావములు ప్రబలి, గురుశిష్యపరంపరారూపమున క్రమప్రాప్తమైన వేదాధ్యయనము నందనాదర మేర్పడుటచే వే. శాఖలన్నియు నిపుడుపలభ్యము లగుటలేదు. ప్రస్తుతము ఋగ్వేదమునకు శాకల - లేక ఐతరేయ లేక పౌఝియమ్ (Pouzhiom) అని వేర్వేరు నామములతో బిలువబడెడి శాఖ యొకటియే గలదని తెలియుచున్నది. అట్లే యజుర్వేదమునకు తైత్తిరీయ, మైత్రాయణీయ, కాణ్వ, మాధ్యందిన శాఖలు నాలుగు లభ్యము లగుచున్నవి. సామవేదమునకు ఛందోగ లేక కౌథుమ శాఖయు, తలవకార లేక జైమినిశాఖయు, రాణాయనీయ శాఖయు మాత్రమే లభ్యము లగుచున్నవి. అథర్వవేదమునకు శౌనక, పిప్పలాద శాఖలు రెండుమాత్రమే గన్పట్టుచున్నవి.

అథర్వవేదాధ్యయనము జేసినవారు నేడు వ్రేళ్ళమీద మాత్రమే లెక్కింపదగి యున్నారు. అథర్వవేదీయ శౌనకశాఖాధ్యయనము జేసినవారొకరు మాత్రమే నేడున్నట్లు తెలియుచున్నది. పిప్పలాద శాఖ నేటికిని తాళపత్రములందే నిలిచి యున్నది. తమిళదేశమునకు జెందిన మహాభక్తులగు ఆళ్వారుల యొక్కయు, నాయన్మారులయొక్కయు భక్తి రసపూర్ణగేయములలో తలవకారసామశాఖను గూర్చిన ప్రశంసలు గలవు. ఆ మహాభక్తులలో నొకరగు సోమాసిమారనాయ

న్నారు తలవకార సామశాఖకు చెందినవారు. ఆయన చోళరాజుల కాలమున నివసించినట్లు తెలియుచున్నది.

మన పవిత్ర భారతభూమి యందలి ప్రజలయొక్క దైనందిన జీవితము నందు వేదములయొక్క ప్రభావమెంతేని గలదను విషయము భారతీయ వివిధ భాషా గత వర్ణపదోచ్చారణను బరిశీలించిన దెలియగలదు. ఆ యా ప్రాంతీయభాషలు ఆ యా వేదశాఖలయొక్క ప్రాతిశాఖ్యములయందలి నిబంధనల ననుసరించి యుచ్చరింప బడుచున్నట్లు తెలియగలదు. ఋగ్వేదమున నుచ్చరింపబడు "క" యను నక్షరము యజుర్వేదము నందును, కౌథుమ సామశాఖయందును 'ద' యనియు, జైమినీయ సామశాఖయందు 'ఴ' (zh) యనియు నుచ్చరింపబడును. 'ఴ' యను నక్షరము తమిళభాషయందే గాన నగును. ఆ యక్షరము వేదశాఖలలో నొకటియగు జైమినీయ సామశాఖయందు గన్పట్టుచుండును. సంస్కృతవ్యాకరణము జిహ్వామూలీయము (ఃక) ఉపధ్మానీయము (ఃప) అను రెండక్షరముల స్వరూపమును నిర్దేశించినది. జిహ్వయొక్క మూలమున నుద్భవించుటచే దానికి జిహ్వామూలీయమని పేరు. తమిళభాషలో దీనిని ఐథమ్ ( Aitham) అని వ్యవహరింతురు. వేదాంగములగు శిక్ష, వ్యాకరణ, శాస్త్ర సంప్రదాయముల ననుసరించి విసర్గపూర్వక కకారరూపమున (కః) నీ జిహ్వామూలీయము వ్యవహరింపబడుచున్నది. ఐరోపా అరబ్బీభాషల యందు గన్పట్టు 'F' (యఫ్) అను నక్షరము వ్యాకరణశాస్త్రమున ఉపధ్మానీయ మను నామముతో విసర్గపూర్వక పకారరూపమున (ఃప) తెలియ నగుచున్నది. తొల్‌కాప్పియమ్ అని పిలువబడు తమిళభాషా వ్యాకరణమునకు గూడ మూలము ఐంద్రవ్యాకరణము. శిక్షా వ్యాకరణము లన్ని వేదశాఖలకును సమానములు. ఇవి కాక యొక్కొక్క వేదశాఖకు సంబంధించి ప్రత్యేకముగ వ్యాకరణములు గలవు. వానికి ప్రాతిశాఖ్యము లని పేరు. ఉత్తరభారతము నందలి రాష్ట్రములలో విశేషించి మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రములలో ప్రచారములో నున్న వ- జ- ష- యను నక్షరములు దాక్షిణాత్య రాష్ట్రములలో గ్రమముగ బ- య- క- యని యుచ్చరింప బడుచుండును. ఉత్తరభారతమున తైత్తి

రీయ కాణ్వశాఖలు ప్రచారములో లేక మాధ్యందినశాఖ విస్తరించుటయే యీ వర్ణోచ్చారణభేదమునకు గారణముగా నూహింపవచ్చును ఏలయన మాధ్యందిన తైత్తిరీయశాఖలకు సంబంధించిన ప్రాతిశాఖ్యలందీ వర్ణోచ్చారణ భేదమును గూర్చిన నిబంధనలు గలవు. క్రైస్తవ మతవ్యాప్తి గాంచిన దేశములందును 'య' కారమునకు బదులు 'జ' కారము వ్యవహారములో గన్పట్టుచున్నది.

Jews జ్యూస్ - యూదర్ (తమిళము)—యూదులు (తెలుగు).

Joseph జోసెఫ్—యూసఫ్.

ఇట్టి వర్ణోచ్చారణ భేదము ననుసరించి యీ దేశములలో మాధ్యందినశాఖ వ్యాప్తమై యుండి యుండునని యూహింపనగును.

ఆంధ్రప్రదేశమున నూటికి తొంబదిమంది యజుర్వేదశాఖకు జెందినవారు సంభాషణలయందును ఆ యా ప్రదేశముల నామముల యందును 'డ'కారము నెక్కువగ నుపయోగించుట యంధ్రదేశమున తైత్తిరీయ శాఖయొక్క విశాలవ్యాప్తిని సూచించును. తైత్తిరీయశాఖ యందలి 'డ' కారము సామశాఖయందలి ఴ (zh) కారమునకును ఋగ్వేదము నందలి 'ళ' కారమునకు సమానము. మహారాష్ట్రులలో నూటికి ఎనుబదిమంది. ఋగ్వేదీయశాఖలకు జెందినవారు. తమిళదేశమున ఴ (zh) కారమును, ఆంధ్రదేశమున 'డ'కారము నుపయోగించు పట్టులయందు మహారాష్ట్రులు తమ దైనందిన సంభాషణాది వ్యవహారములందు గూడ 'ళ' కారమునుపయోగింతురు. ఋగ్వేదీయ ప్రాతిశాఖ్యయం దట్టి తావులందు 'ళ' కార మువయోగింపబడవలె ననెడి నిబంధన లుండుటయే యీ వ్యవహారమునకు గారణము గావచ్చును.

అందుచేతనే యజుర్వేదము నందలి 'డ' కారము ఋగ్వేదమున 'ళ' కారముగ నుచ్చరింపబడుచున్నది. యజుర్వేదశాఖలయందు గన్పట్టు 'డ'కారము ఋగ్వేదమున నరుదు. ఛందోగ సామశాఖ యందలి 'డ' కారము జైమినీయసామశాఖయందు 'ఴ' (zh) కారముగ నుచ్చరింపబడు చుండును. వేదశాఖలయందలి

యిట్టి వర్ణోచ్చారణ భేదమే వ్యావహారిక భాషలయందును తలజూపిన దని చెప్ప వచ్చును. మృగశీర్షా నక్షత్రయుక్త పూర్ణిమకు 'మార్గశీర్షి' యని శాస్త్రమున వ్యవహారము గలదు. మృగశీర్షా నక్షత్రము తమిళమున 'మార్గశీర్ద' యని వ్యవహరింపబడును. మార్గశిర మాసమును తమిళదేశమున మహాభక్తురాలగు ఆండాళ్ 'మార్గళి తింగళ్ (Margazhi Thingal)అని పేర్కొనినది. నియమబద్ధముగ జేయబడు వేదమంత్రాక్షరోచ్చారణము లోకకళ్యాణప్రదము గాన మంత్రములు పుష్టిహేతువు లగుచు పౌష్టికములు' అని చెప్పబడుచున్నవి. సంస్కృతము నందలి 'పౌష్టిక' యను పదము తమిళమున 'పౌడికమ్' అనియు, మళయాళమున 'పౌళ్షియమ్' (Powzhiam) అనియు నుచ్చరింపబడును. తెలుగులోని 'ర' కారము తమిళమునందు 'ళ్ష' కారముగను కన్నడమున 'ళ' కారముగ నుచ్చరింపబడుననుటకు గొన్ని యుదాహరణములు ;

| తెలుగు | | తమిళము | కన్నడము | |
|---|---|---|---|---|
| పొగడుట | Puhazhlthal | పుహళ్షుదల్ | Hokaluvathu | హొగళువదు |
| పగడాలు | Pavazhlam | పవళ్షమ్ | Havalu | |
| పాఱు | Pazh | | Halu | హాలు |
| కూడు | Koozh | కూళ్షు | Koolu | కూలు |

ఆ యా భాషలలో నిట్టి వర్ణోచ్చారణ భేదమునకు నా యా ప్రాంతము ప్రచారములో నున్న ప్రాతిశాఖ్యములే కారణము. ప్రతి వేదశాఖయందును కర్మకాండ యనియు జ్ఞానకాండ యనియు రెండు భాగములు గలవు. సదాచారానుష్ఠానములతో యజ్ఞయాగాదులను గూర్చి కర్మకాండ వివరించుచున్నది. కర్మఫలమును సర్వమును పరమేశ్వరార్పణ జేయుచు లోకశాన్తి కొఱకై పరమేశ్వరుని ప్రార్థించుట వలన చిత్తశుద్ధి కలుగును. ఇట్లు నిష్కామ కర్మానుష్ఠానము చేతను భగవ

ధ్యానము చేతను గలిగిన చిత్తశుద్ధి పరమేశ్వర స్వరూపానుసంధానమునకు గారణము కాగలదని జ్ఞానకాండ యుపదేశించుచున్నది.

ఈ ప్రపంచము సృష్టింపబడిన తరువాత నొకానొక సమయమున నీ ప్రపంచమంతయు వైదికమతవ్యాప్తమై యున్నట్లు శ్రీమద్భాగవతాది గ్రంథముల వలన దెలియుచున్నది. ప్రాచీనకాలమున ఉత్తరధ్రువము నుండి దక్షిణ ధ్రువము వరకు నీ భూగోళము సప్తద్వీపములతోను, ఆ ద్వీపములమధ్య సప్తసముద్రముల తోను వ్యాప్తమై యవి ఉత్తరము నుండి దక్షిణము వరకు నీ భూగోళమును ఉంగరములవలె చుట్టుకొనియున్నట్లు దెలియుచున్నది. అందు ప్రతి ద్వీపము నందును, వైదిక కర్మానుష్ఠానము, వేదమార్గానుగతమైన యర్చనాదికము గలవు.

భూమి రోజున కొకసారి తనచుట్టును, సంవత్సరమున కొకసారి సూర్యుని చుట్టును తిరిగి వచ్చునపుడేర్పడు కక్ష్యలు లేక క్రాంతవృత్తములు (orbits) రెండును ఒకే సమతలమున (Ecliptic Plane) నుండును. భూమ్యక్ష మీ సమతలమునకు ౬౦౹ డిగ్రీలకోణమున వర్తిల్లుచు నిరంతరము ధ్రువతారవైపు జూచుచుండును. జ్యోతిశ్శాస్త్రము ననుసరించి యిట్లు భూమి సూర్యుని చుట్టి పరిభ్రమించునపుడు సంవత్సరమునకు రెండుసార్లు అనగా మేషమాసమునందు తులామాసమునందును విషువములు (Vernal and Atumnal Equinoxes) యేర్పడును. మేషమాసమున మొదటి దినము మేషవిషువము. తులామాసమున మొదటి దినము తులావిషువము విషువము దినములయందు రాత్రిందివలు సమానదైర్ఘ్యము గలిగియుండును. అమర కోశమునందును వ్యాకరణమునందును 'విషు' పదమున కిట్లే యర్థము వివరింపబడి యున్నది.

"సమరాత్రిందివే కాలే విషువ ద్విషువం చ తత్"

కాలక్రమమున నీ భూభ్రమణ (Orbit) కక్ష్యయందు విషువము లేర్పడు స్థానములు ( Equinoctial Points ) వెనుకకు జరుగుచుండును. అందుచేతనే

బైన దెలిపిన మేష, తులా, విషువత్పుణ్యకాలము లందలి రాత్రించవళ్ళయొక్క కాలపరిమితి గూడ సమానముగ నుండక మాఱ జొచ్చినది ప్రస్తుత మేష తులా సంక్రాంతి పుణ్యకాలములకు 22 దినములకు బూర్వమే సమ రాత్రిం దివకాలము వచ్చుచున్నవి ఖగోళ భూగోళ శాస్త్రములు భూభ్రమణ కక్ష్య[Orbits]లందు సంభవించెడి యుట్టిమార్పు(Precession) వలననే ద్వీపములయొక్కయు సముద్రముల యొక్క ఉనికియందు గూడ పెక్కు మార్పులు సంభవించుచుండునని చెప్పుచున్నవి. యుగభేదము ననుసరించి ద్వీపముల యొక్కయు స్థితి గతులు మాఱినవని చెప్ప వచ్చును. కృతయుగమునందును, త్రేతాయుగమునందును ఉచ్చస్థితిలో నునది వైదిక కర్మానుష్ఠానము క్రమముగ ద్వాపర యుగములో గొందిగ మార్పుజెంది కలియుగములో గొన్ని యెడల మాత్రమే బీజప్రాయముగ నిలిచియున్నది.

క్రీ. పూ. 3500 సం॥ నాటి ఈజిప్టు శాసనములలో రామెసెస్ II [ Ramesses ] అను తెగకు జెందిన ప్రభువు హిట్టైట్సు అను తెగయొక్క ప్రభువుతో సంధి జేసికొని యందుకు సాక్షులుగ నా సంధిపత్రమున మిత్రావరుణ దేవతల నుదహరించినట్లు H R. Hall వ్రాసిన Ancient History of the Near East అను గ్రంథమున (364 పుటలో) గలదు. క్రీ. పూ. 5000 సం॥ నాటి మఱియొక ఈజిప్టు శాసనమున నట్లే వైదిక 'మిత్ర' దేవత సాక్షిగా గ్రహింపబడినట్లును గలదు. ఇంతేకాక హిట్టైట్సు ప్రభువు ఉత్తర మెసపిటోమియా లోని మిటాని దేశ ప్రభువుతో సంధిజేసికొని వ్రాసికొనిన సంధిపత్రములందు మిత్రావరుణ ఇంద్ర-నాసత్య దేవతలు సాక్షులుగ గ్రహింపబడినట్లును [Vedic Chronology and Vedanga Jyotisha. B. G. Tilak పుట. 29) గలదు వేదములందు మిత్రదేవతను పర్షియా యందలి ఇరేనియనులు గూడ నదే నామముతో కొలుతురు. లిడియా, రోమ్ దేశీయులకు గూడ మిత్రదేవత సుపరిచితము. ఈజిప్టు శాసనములందు గన్పట్టు ఒకతెగకు నామమైన Ramesses అను పదము నకు విఘంటువునం దిట్లు అర్థము గలదు. 'Ramesses (3Syl) The title

of an ancient Egypti n Dynasty; it means offspring of the Sun'. Dictionary of hrase and Fable By E. Coobham Brewer, L. L. D. కాన పై తెగవాడు సూర్యవంశపు రాజులై యుందురు.

అవినాశ్ చంద్రదాస్ అను సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకుడు Rigvedic India అను గ్రంథమున 114 వ పుటలో ఇట్లు చెప్పినాడు. "వేదకాలపు ఆర్యులు గొలిచెడి మిత్రదేవతయు, ఇరేనియనులు ఆరాధించెడి మిత్రదేవతయు, లిడియనులు పూజించెడి మెడ్యూస్ ( Medues ) దేవతయు, సమానమే. రోమన్ సామ్రాజ్యమున నాల్గవ శతాబ్దపర్యన్తము మిత్రదేవతారాధన కొనసాగినది. జొరాస్ట్రియానిజమ్ ప్రభావము వలననే పశ్చిమ ఐరోపా ఖండమున మిత్ర (సూర్య )దేవతారాధనము వర్ధిల్లెను. ఇది క్రీస్తుకు పూర్వము మొదటి శతాబ్దముననే రోమ్ నగరమున ప్రారంభమై క్రీ శ మొదటి శతాబ్ది పూర్తియగుసరికి సైనికులు, బానిసలు, వర్తకులు మున్నగు వారిద్వారా రోమ్ సామ్రాజ్యమునందంతటను విరివిగ విస్తరించెను. క్రీ శ మూడవ శతాబ్ది నాటికి అంతర్జాతీయ మతముగ విలసిల్లెను. 4వ శతాబ్ది ప్రారంభమున రోమన్ చక్రవర్తులు చాలమంది మిత్ర దేవతారాధకులే. కాని క్రీ.శ. 326లో రోమన్‌సామ్రాజ్యమును జయించి స్వాధీన మొనర్చుకొనిన కాన్‌స్టాంటిన్‌అను ప్రభువు క్రైస్తవ మతమును అధికారమతముగ జేయుటవలన మిత్రదేవతారాధనము క్రీ శ. 4వ శతాబ్దాంతమున సన్నగిల్లి క్రమముగ రోమునగరమునందదృశ్యమయ్యెను."

స్పెన్‌సర్, గిల్లియన్, మాక్మిలన్ అనువారు 1899లో ప్రకటించిన "The Nature of Tribes of Central Asia" అను గ్రంధమున 621 పుటలో CIF—128, 129 చిత్రములలో చూపబడిన ఆస్ట్రేలియా యందలి జానపద శివతాండవ దృశ్యభంగిమలలో శివునకు తృతీయనేత్రము గలదు. నేటికిని భారత దేశమునకు రెండువేల మైళ్ళ దూరమున బాలీ ద్వీపములో మన దేశమునందు వలెనే

యచట నున్న శివాలయములందు వేదమంత్రములతోనే పూజాదికము నిర్వర్తింప బడుచున్నది. అన్య మతస్థులు గూడ తమ తమ మతములకు గొప్పతనము సమ కూరుటకై తమ గ్రంథములను "వేదములు" - అని పేర్కొనుట వేదముల యొక్కయు, వైదిక సంప్రదాయము యొక్కయు, ప్రాచీనతకు, పవిత్రతకు దార్కాణము. వేదవేద్యుడైన పరమేశ్వరుడు శ్రీరాముడుగ నవతరించినపుడు వేదము రామాయణరూపమున నవతరించెనని చెప్పబడుచున్నది.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా ॥"

మహాభారతము పంచమవేదముగా గీర్తింపబడినది. విష్ణుభక్తుడగు నమ్మాళ్వారు వేదములను "ద్రావిడ ప్రబంధ" రూపమున ననువదించునట్లు చెప్పుదురు. 'తిరువళ్ళువ మాల" యను గ్రంథమున బ్రహ్మయే వళ్ళువార్ రూపమున నవతరించి వేదతాత్పర్యమును "తిరుక్కురళ్ అను గ్రంథమున సంగ్రహించి చెప్పెనవి వర్ణింబడినది. మహమ్మదీయులును క్రైస్తవులును తమ తమ మత గ్రంథములను (ఖురాన్-బైబిలు) వేదములు అను పేరుతో కీర్తించు కొనుచుందురు. బైబిలులోని "జ్ఞానవృక్షము [ Tree of Knowledge ] నిషిద్ధ ఫలము (Forbidden Fruit ), స్త్రీ సృష్టి" —వీనిని గూర్చిన ప్రస్తావన ఐతరేయ బృహదారణ్యకోపనిషత్తుల యందలి శాస్త్రీయ దృక్పథమును బోలి యున్నవి.

పాశ్చాత్యవిద్వాంసులు కొందరు దేహవర్ణమునుబట్టి జాతివిభాగమును జేయవచ్చు నను సిద్ధాన్తమును నమ్మినవారై యా సిద్ధాన్తమును బురస్కరించుకొని ప్రపంచములోని ప్రజలను కాకేషియనులు లేక ఆర్యులు, సెమిటిక్కులు, మంగోలియనులు, నీగ్రోలు, రెడ్ ఇండియనులు, అని విభజించిరి. మఱియు అందు వేదములు

ఆర్యులకు సంబంధించినవి. వారు ఒక ప్రాంతమునుండి మఱియొక ప్రాంతమునకు వలస పోవుచు తమ వేదములను గూడ వెంటగొనిపోయి వివిధప్రాంతములందు వానిని వ్యాపింపజేసిరి." అనియు చెప్పుచున్నారు. స్వామి వివేకానందులు వారి వాదము నిట్లు ఖండించిరి. "ఆర్యులను వారు ఎచటినుండియో విదేశముల నుండి యకస్మాత్తుగ నిటకు వచ్చి మీదపడి యిచటి యాదిమ నివాసులను తరిమివేసి నిర్మూలించి వారి భూముల నాక్రమించుకొని భారతదేశమున స్థిరపడిరి-యని చెప్పెడి మీ యురోపా విద్వాంసుల వాదము నిరాధారము; కేవల మసత్యము; అవివేకి ప్రలాపము. మన భారతీయవిద్వాంసులు గూడ వారివాదములకే జోహారు లర్పించుచు నిట్టి యభూత కల్పనలతో నిండిన ఈ పచ్చి యబద్ధములనే మన బాలురకు గూడ బోధించుట విచిత్రము."

ప్రపంచమంతయు వైదికసంస్కృతి లేక వైదికనాగరికతచే వ్యాప్తమైనట్లు భారతీయుల విశ్వాసము మఱియు చైనీయులు, ద్రావిడులు, తార్తారులు, పారశీకులు -అందఱునుక్షత్రియులే యని ధర్మశాస్త్రము చెప్పుచున్నది

శనకై స్తు క్రియాలోపా దిమాః క్షత్రియ జాతయః।
వృషలత్వం గతా లోకే బ్రాహ్మణాదర్శనేన చ॥
పౌండ్రకా శ్చౌడ్ర ద్రవిడాః కాంభోజా యవనా శ్శకాః।
పారదా పహ్లవా శ్చీనాః కిరాతా దరదాః ఖశాః॥

—మను. 10-43, 44

చరిత్రకారులగు పాశ్చాత్య భారతీయ విద్వాంసులు వేఱు వేఱు సిద్ధాంతముల నాధారముగ గొని వేదములకు కాలము నిర్ణయింప బూనుకొనిరి. ఎవరి సిద్ధాన్తము వారిది. ఒకరి నిర్ణయముతో మఱియొకరి నిర్ణయము పొసగుట లేదు.

కాని "వేదములు అతిప్రాచీనములు; వాని కాలమును ఇదమిత్థమని నిర్ణయించుట శక్యము కాదు"— అని మాత్ర మందరు నంగీకరించిన విషయము.

హరప్పా, మహెంజోదారో నగరముల యందలి నాగరికత వైదిక సంస్కృతికి జెందినది గాదని కొందటి యభిప్రాయము. కాని యది సరిగాదు. హరప్పా యందలి యొక శిల్పములో ఛేదింపబడిన అశ్వత్థవృక్షశాఖ యొకటి, మేకను పట్టుకొనియున్న పురుషుడు, శాఖప్రక్క నొక స్త్రీ, వరుసగ నిలబడిన కొందరు పురుషులు గలరు. వేదకాలమును మొదట స్థూలముగ నిర్ణయించుకొని, దానికి ముందుగనే ఈ హరప్పాశిల్ప ముండి యుండవలె నని తలచుటచే చరిత్ర కారులకీ శిల్పమును గూర్చిన సమన్వయము కుదురలేదు. ఈ శిల్పచిహ్నమును యాగసంబంధిగా దెలిసికొనక గ్రామదేవతకు బలియిచ్చునట్లు భావించి యున్నందున అశ్వత్థవృక్షశా గూర్చిన వివరము గూడ వారికి లభించుట లేదు- అని Director general of Archaeology యొక్క యభిప్రాయము.

"యజ్ఞము కొఱకు మాత్రమే యశ్వత్థవృక్షమును ఛేదింప నగును; ఇతర సమయములందు ఛేదించుట పాపము" -అని యనాదిసిద్ధ భారతీయ సంప్రదాయము. ఈ శిల్పము యాగయజమానుడు, అతని ధర్మపత్ని, ఋత్విగ్గణము, యాగపశువు, అశ్వత్థశాఖలతో గూడిన నొక యాగశాల యని తెలియఃగును. ఇట్లు శిల్పము నన్నిటిని సూక్ష్మముగ బరిశీలించిన వేదములు - వైదికసంస్కృతి యొక్క యతి ప్రాచీనతయు, వైదికసంస్కృతియొక్క వ్యాప్తియు స్పష్టముగ గాంచనగును.

జైనులుగూడ తమ గ్రంథములలో గొన్నిటియందు వేదములు నిత్యము లని చెప్పిరి. (చూ. త్రిషష్టి శ్లాక పురుషచరిత్ర. I—IV-244, 948, 256), బాల గంగాధర తిలక్, డాక్టరు జాకోబీ మహాశయు లిరువురు ఖగోళ - భూగర్భశాస్త్ర

పరిశోధన ఫలితముల నాధారముగ గైకొని వేదముల కాలము క్రీ. పూ. 6000 సం॥ అని నిర్ణయింప బూనిరి (చూ. The Orion and Arctic Home in the Vedas) అవినాశచంద్రదాస్ ధీరేంద్ర నాథ్ మహాశయు లిరువురు భూగర్భ నైసర్గిక పరిణామ స్థితిగతుల ననుసరించి కాలనిర్ణయమునకు గడంగిరి. మాక్సు ముల్లరు వింటర్‌నిడ్జ్ (Winternitz) మొదలగు పాశ్చాత్య విద్వాంసులు ఐరోపా యందలి భాషలు కాలగతి ననుసరించి పొందియున్న వివిధ వర్ణలోప వ్యత్యయాది పరిణామముల బరిశీలించి భాషాశాస్త్ర సిద్ధాన్తముల గొన్నిటిని రూపొందించి, తదను గుణముగ వేదకాలమును స్థూలముగ నిర్ణయింప బాటుపడిరి. వేదకర్తలగు ఋషులు ఒకచోట స్థిరనివాసము లేక యొక ప్రాంతము నుండి మఱియొక ప్రాంతమునకు వలస పోవుచు వేదముల వ్రాసియుందురని యా విద్వాంసులభి ప్రాయపడిరి. వారి వాదము ననుసరించి యార్యులకు స్థిరనివాసమే లేనిచో నా కాలమున స్థిరనివాస యోగ్యములగు గ్రామనగరాదులు గాని, సుస్థిరమగు ఆర్థిక సాంఘిక వ్యవస్థగాని యున్నవని చెప్పుటకు వలనుపడదు. కాని యా విద్వాంసులు సింధునదిలోయ ప్రాంతమును, హరప్పా మహెంజోదారోలలోని శిల్పములను, పురాతన శిల్పవస్తు శాస్త్ర సిద్ధాంతములరీత్యా పరిశీలించి వేదరచనాకాలమునకు 500 సం॥ పూర్వమే మహానగరము లుండియున్నట్లును, దానికి తార్కాణము హరప్పా మహెంజోదారో నగరము లనియు జెప్పుచున్నారు. హరప్పాయందలి శిల్పములు వైదిక సంస్కృతి ప్రతిరూపములుగా గాంచనగునని పూర్వము జెప్పితిమి. కాన వేద కర్తలగు ఋషులు నిలువ నీడ లేక తెగలు తెగలుగా వలన పోవుచు జీవించుచుండెడి వారనిచెప్పెడి వారి వాదము నిరాధారము. అట్లుగాక యొకవేళ వేదరచనాకాలమునకు బూర్వమే యా మహానగరము లుండియుండు ననెడి వారివాదము నంగీకరించినను అట్లు మహానగరములా కాలముననే విలసిల్లియుండ వేదకర్తలైన ఋషులు అట్టి నగ రములను వీడి నిలువనీడలేక వలస పోవుటలో గారణము గన్పట్టదు. కాన 'ఆర్యులు

వేదకర్తలు; వారు తెగలు తెగలుగ (Nomads) వలస బోవుచు వేదముల రచించి యుందురని చెప్పెడి వారి వాదములు నిరాధారములు.

ఇక భాషాశాస్త్ర (Phylology) సిద్ధాంతముల దృష్ట్యా వివిధ, భాషా పరిణామముల బరిశీలించి చేయబడిన వేదకాల నిర్ణయమును యుక్తము గాదు. ఎట్లన ; ఇది దైనందినమింటియం దుపయోగింపబడెడి పాత్రల యొక్కయు, అప్పుడప్పు డరుదుగ నేదేని యొక నిమిత్తమునకై యుపయోగింబడు పాత్రయొక్కయు మన్నికను దృష్టాంతముగ గైకొని పరిశీలింప దగినది. ఐరోపాభాషలు నిరంతరము దైనందినవ్యవహారములలో కోట్లకొలది ప్రజలచే భాషింపబడుచు, వ్రాయబడుచు, ప్రచారము గావింపబడుచు అనేకులచే ననేకవిధముల నుపయోగింపబడుచు వచ్చినవి. వేదమంత్రము లట్లుగావు. ఇవి యే కొంతమందిచేతనో కంఠస్థములు జేయబడుచు, గురువుచే శిష్యున కనుగ్రహింపబడుచు, యజ్ఞాది పవిత్ర కర్మాచరణము నందు మాత్రమే నియమపూర్వకముగ వినియోగింప బడుచుండును. విద్యార్థి ఉపనయనమైన తరువాత వేదముల గ్రహించుటకు క్రమశిక్షణతోపాటు తగిన యోగ్యత సంపాదించి పండ్రెండు వత్సరములు గురుశుశ్రూష జేయుచు నధ్యయనము జేయవలసి యున్నాడు... ఆ వేదమంత్రోచ్చారణము గూడ శిక్ష, వ్యాకరణము, ఛందస్సు - అనెడి మూడు శాస్త్రములచే నియమితమైనది. ఆడుపులి తన శిశువును కోఱలతో బట్టుకుని యొక ప్రదేశమునుండి వేఱొక ప్రదేశమునకు దుముకుచు బోవునపుడు తన శిశువున కెట్టి హానియు గలుగకుండుటకై యెంతటి జాగరూకత వహించునో వేదమంత్రోచ్చారణమునందు గూడ నంతటి జాగరూకత యావశ్యకమని శిక్షాది గ్రంథములు హెచ్చరించుచున్నవి.

"యథా వ్యాఘ్రీ హరే త్పుత్రాన్ దంష్ట్రాభిః న చ పీడయేత్ ।
భీతా పతన భేదాభ్యాం తద్వ ద్వర్ణా న్ప్రయోజయేత్ ॥
ఏవం వర్ణాః ప్రయో క్తవ్యా నావ్యక్తా న చ పీడితాః ।"

—నారదీయశిక్షా - 2 ప్రపాఠక; 30-31.

సృష్టికాలమునుండి ప్రళయకాలము వరకు నొకే విధముగ నెట్టిమార్పులు లేకుండ నుండవలె ననెడి యభిప్రాయముతోనే యున్న నియమములతో వేదమంత్రములు రక్షింపబడుచు వచ్చుచున్నవి. ఇట్లు వేదమంత్రోచ్చారణ సంరక్షణమునకై యేర్పడినవే పద- క్రమ- జటా ఘనాది వికృతులు.

వేదమంత్రముల వీర్యత్వము, శక్తిమత్త్వము గూడ లక్షణగ్రంథము లందు బ్రతిపాదింపబడిన వర్ణక్రమ మనెడి యొక విశిష్ట సంప్రదాయముచే సురక్షితముగ జేయబడినది. ఆ సంప్రదాయము ననుసరించి వేదమునందలి ప్రతియక్షరమును గూడ ధ్వని - స్థాన - కరణ - ప్రయత్న - మంత్ర - స్వర - దేవతా- జాతు లనెడి యెనిమిది లక్షణముల మనస్సునం దుంచుకొని యెంతయో మెలకువతో నుచ్చరింప వలసియున్నది.

"ధ్వని స్థానం చ కరణం ప్రయత్నః కాలతా స్వరః ।
దేవతా జాతి రేతైశ్చ వర్ణో జ్ఞేయో విచక్షణైః॥"

వేదమందలి ప్రతి యక్షరముయొక్క మాత్రల సంఖ్యయు, వర్ణోత్పత్తి స్థానము, అందలి ముఖ్యాముఖ్య విభాగములు, వర్ణోత్పత్తికై చేయు వివిధయత్న ములు, వివిధస్వరములు, ఆ స్వరముల నుచ్చరించునపుడు ఉచ్ఛ్వాస నిఃశ్వాసముల నియమించు విధానము, వేదముల యందలి సప్తస్వరములకును సంగీతశాస్త్రము నందలి సప్తస్వరములకును గల పరస్పర సంబంధము, వేదముల యందలి స్వరము లకును మయూర - వృషభ - గాంధార (కంఠహారుకు జెందిన గొఱ్ఱె) - క్రౌంచ- -కోకిల- అశ్వ- గజాది పశుపక్ష్యాదుల సహజ ధ్వనులతో గల సామ్యము, ఏకత్వము — వీనినన్నిటిని ఈ లక్షణ గ్రంథములు చక్కగ వివరించియున్నవి. అంతియే కాదు. మంత్రము స్వరహీనమై చక్కగ నుచ్చరింపబడకపోయినను, వర్ణవ్యత్య యము గలిగినను కలుగవలసిన ఫలము కలుగక పోగా తద్విపరీత (అనిష్ట) ఫలము సంప్రాప్తించును.

"మంత్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో న త మర్థ మాహ ।
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రుః స్వరతో ఽపరాధాత్"॥

కనుక వేదమంత్రములుగూడ వ్యావహారిక భాషలవలెనే (సృష్ట్యాది నుండి ప్రళయము వరకును) కొన్ని పరిణామముల జెందియుండ నగునని నిశ్చ యించి భాషాశాస్త్ర (Phylology) సిద్ధాన్తముల ననుసరించి వేదకాలమును నిర్ణ యింప బూనుట యుక్తిసహముగాదు. పైగా నీ వాదములు అనవస్థకును అవ్యవ స్థకును గారణములై నిలువకపోవుచున్నవి.

బాలశాస్త్రి హరదాసపండితుడను తన "Glimpses of the Vedic Nation" అను గ్రంథమున అన్య భాషల వలె వేదమంత్రములు వ్యావహారిక భాషాకల్పితములు గావు. అనగా ఆర్యులనెడివారు నాడు తాము వ్యవహరించు కొనుచుండెడి భాషలోనే వేదమంత్రముల రచించిరి - అని చెప్పుట యుక్తిసహము గాదని సప్రమాణముగ నిరూపించెను. మఱియు తన వాదమున కుపష్టంభముగ సంస్కృతవ్యాకరణకర్తలలో ప్రధానుడగు పాణిని తన సూత్రముల ద్వారా యీ యభిప్రాయమును సూచించినట్లు ఇట్లు నిరూపించినాడు.

The Vedic Language was called by him 'Chhanda' and the Common Sanskrit Language as "Bhasha" (P.P. 164)

పాణినిమహర్షి వేదములను 'ఛందః' అనియు సాధారణభాషను- "భాష" యనియు వ్యవహరించినాడు (చూ. 'బహుళం ఛందసి' ఇత్యాది)

పై విషయములబట్టి "వేదములు వ్యావహారిక భాషలకంటె విలక్షణ మైనవి; లౌకిక వ్యవహారభాషారూపములు గావని స్పష్టముగ బేర్కొనుటతెలియ నగును.

ఈజిప్టుయందు దొఱకిన శాసనములలోని మిత్రావరుణుల గూర్చిన ప్రసక్తి మధ్యధరాసముద్ర ప్రాంతదేశమునందలి వైదిక విజ్ఞాన వ్యాప్తిని సూచించుచున్నది. మహేంజోదరోయందు లభించిన పురాతన వస్తువులలో నొక వృక్షముమీద రెండు పక్షులుండి యందొకటి పిప్పలఫలమును దినుచుండ రెండవది యుదాసీనముగ జూచు చున్నట్లు (చూ. 1950 సం॥లో ప్రకటింపబడిన కళ్యాణ్ పత్రిక సంవత్సరాది సంచిక, 137వ పుట) గలదు. కొందఱు పురావస్తు శిల్పశాస్త్రముల ననుసరించి ఈ పక్షులజంట ఋగ్వేదము (1-164-20) నందు నిరూపింపబడిన జీవాత్మ పర మాత్మలు. బైబిలు పాతనిబంధన (Old Testament)లో సృష్ట్యారంభము నకు నిమిత్తమును వివరించుచు నిట్లు చెప్పబడినది. మొదట 'ఆదమ్' అను పురుషుడు, 'ఈవ్' అను స్త్రీయు సృజింపబడిరి. వారిరువురు నొక చెట్టు క్రిందనుం

డిరి. కాని యా చెట్టు యొక్క ఫలమును తినుట మాత్రము నిషేధింప బడెను. ఇట పేర్కొనబడిన చెట్టు జ్ఞానవృక్షము లేక బోధివృక్షముగా దెలియనగును. వారిలో ఈవ్ (స్త్రీ) నిషేధము నుల్లంఘించి యా ఫలమును దినుటకై మనసు పడెను. ఉపనిషత్తులు "వృక్షమున నున్న యా రెండు పక్షులలో నొకటి ఆత్మ: రెండవది జీవుడు; జీవుడు కర్మఫలభోక్త; ఆత్మ స్వయంజ్యోతిరూపుడు, కర్తృత్వ భోక్తృత్వాది రహితుడు, ఉదాసీనుడు "(సాక్షి) అని వివరించినది. బైబిలులో పేర్కొనబడిన ఆడమ్ శబ్దము యొక్కయు, ఉపనిషత్తులలో పేర్కొనబడిన ఆత్మ శబ్దము యొక్కయు, రూపనిష్పత్తికి మూలమైన ధాతువుయొక్క అర్థము సమానము కావున, ఉపనిషత్ప్రతిపాదితాంశములే పెక్కు వైకల్యముల నొంది Old Testament లో వర్ణింపబడిన వని చెప్పవచ్చును. ధాత్వర్థము ననుసరించి 'ఈవ్' పదమునకు 'జీవించుట' యని యర్థము. పిప్పలమనగా బోధిద్రుమము.

బోధిద్రుమ శ్చలదలః పిప్పలః కుంజరాశనః"— అమరకోశ.

అదియే జ్ఞానవృక్షము. ఈ బోద్రుమము క్రిందనే శాక్యముని యగు సిద్ధార్థుడు. జ్ఞానము నొంది బుద్ధుడయ్యెను. ధర్మశాస్త్రములు బోధిద్రుమముయొక్క ఫలభక్షణ మును నిషేధించినవి.

"తథా వట ప్లక్షాశ్వత్థ దధిత్థ నీప మాతులుంగ ఫలాని
వర్జయేత్" —వైద్యనాథదీక్షిత, స్మృతిముక్తాఫలము - ఆహ్నికకాండ

తిలక్ మహాశయుడు 'The Arctic Home in the Vedas' అను గ్రంథమున వేదకాలము క్రీస్తుపూర్వము 6000 సం॥ అని నిర్ణయించెను. ఆ విషయమున జూపదిన కారణములివి: "వసంతఋతు ప్రారంభమునను, శరదృతు

ప్రారంభమునను రెండవ సంవత్సరమునకు రెండు మారులు విషువములు Vernal and Autumual equinoxes ) వచ్చుచుండును. ఆ సమయములందు రాత్రింబవళ్ల దైర్ఘ్యము సమముగ నుండుటచే విషువములు అని వానికి సార్థక నామము. కాని ఈ విషువములు సంభవించుటలో క్రాన్తి వృత్తము (Ecliptic) నందు విషువస్థానములు కాలక్రిమమున కొలదిగ వెనుకకు జరుగుచుండును. సూత్య్ర దొకపుడు కృత్తికల యందును, మరియొకపుడు మృగశిరయందును, ఇంకొకపుడు పునర్వసు నక్షత్రమునందును ఉన్నప్పుడు విషువత్పుణ్యకాలములు ( Vernal Ecquinoxes ) ప్రాప్తించినట్లు వెదములందు సూచనలు కలవు. విషువత్పుణ్య కాలము ఒక నక్షత్రము నుండి ఇంకొక నక్షత్రమునకు వెనుకకు జరుగుచు తిరిగి మొదటి నక్షత్రమునకు వచ్చుసరికి 2586 సంవత్సరములు పట్టును అనగా ఒక నక్షత్రము నుండి మరియొకనక్షత్రమునకు జరుగుటకు 958 సం॥ కాలము పట్టును. కావున విషత్పుణ్యకాలము పునర్వసు నక్షత్రమునందు ప్రాప్తించినట్లుగా సూచించెడి యా వేదములు 6 × 958= 5748 లేక సుమారు 6000 వత్సరములకు పూర్వము రచింపబడి యుండవలెను.

పై వాదమువలన వేదములు రచింపబడినట్లును, మఱియు నందానాటి ఖగోళ సంఘటన విషువము వంటిది యొకటి వేద రచయితలు తమ రచనలలో పేర్కొనినట్లును తెలియుచున్నది. ఇది యుక్తము కాదు. కాలము అనంతము దృశ్యమగు ఈ జగతు మన శాస్త్రముల ననుసరించి 195,58,85000 వత్సరములకు పూర్వ ముత్పన్న మైనది. అంతటి దీర్ఘ కాలములో పైన పేర్కొన బడినట్టి విషువము లెన్నియో ప్రాప్తించియుండును. అందుచే వేదములందు సూచింపబడినట్లుగా జెప్పబడుచున్న విషువములను బురస్కరించుకొనుచు వేదకాలనిర్ణయమునకు బూను కొనుట యుక్తిసహము గాదు.

పాశ్చాత్యచరిత్రకారులు ప్రపంచము పుట్టి 6000 వం॥ గడచినదని చెప్పు దురు. కాని, భూగర్భశాస్త్రజ్ఞులు, భౌతికశాస్త్రజ్ఞులు, భూగోళము చల్లారుట యను

వంశముపై నాధారపడి కాలనిర్ణయము గావించిరి. ఈ శాస్త్రజ్ఞుల నిర్ణయము మన శాస్త్రములో జెప్పబడిన కాలమునకు స్థూలముగ సరిపోవుచున్నది. తిలక్ మహాశయుడు వేదములయందలి సూర్యోదయ సూర్యాస్తమయముల వర్ణనము, ఉషస్సు—అరుణోదయముల వర్ణనము, ఉత్తరధ్రువ ప్రాంతమందలి స్థితిగతులను సూచించుచున్నవనియు, ఆ యుత్తరధ్రువప్రాంతము భూగోళశాస్త్రముల అంచనాల ప్రకారము సుమారు 8 000 సం॥ ప్రాంతమునుండి మానవనివాసయోగ్యము గాక పోయినదనియు, వేదకర్తలగు ఋషులు నా ప్రాంతములం దపుడు వసించుచు నా వర్ణనముల జేసియుందు రనియు, అదియే వేదకాల మనియు నిర్ణయించెను.

వంగదేశీయులగు ధరేంద్రనాథ ఉపాధ్యాయ, అవినాశచంద్రదాసు అను పండితు లిరువురు వేదములందలి హిమవత్పర్వతప్రాంత వర్ణనల నాధారముగ జేసికొని భూగోళశాస్త్ర సిద్ధాంతసాహాయ్యముతో వేదకాలము 25 వేల సం॥లకు పూర్వ మని నిర్ణయించిరి. ఏలయన, "పూర్వము సముద్రములుగ వర్ణింపబడిన ప్రాంతము లిపుడు పర్వతమయములుగను, నాటి యరవు లిపుడు సముద్రములుగను పరిణమించి యున్నవి. కాన, భూగోళశాస్త్ర సిద్ధాంతముల ననుసరించి వేదకాలము 25000 సం॥ పూర్వమే యయి యుండవలెను."

పై వాదములు సరి కావు. భూమి సముద్రముగను, సముద్రము భూమిగను, పరిణమించుటగాని శీతోష్ణస్థితిలో మార్పులు సంభవించుట గాని ప్రకృతియందలి నైసర్గికస్థితులపై నాధారపడి యుండును గాన, భూగోళశాస్త్రము నాధారము జేసికొని కల్పితములైన యీ వాదము లందు బలము లేదు.

"వేదములు శబ్దతరంగ రూపములు, పరమేశ్వరుని ఉచ్ఛ్వాస నిఃశ్వాస రూపములు, ధ్వని యెంత ప్రాచీనమో శబ్దతరంగరూపమగు నీ వేదరాశియు నంత ప్రాచీనము." —అనెడి సంప్రదాయానుగతమైన మన శాస్త్రీయ దృక్పథమే మిక్కిలి యుచితముగ గన్పట్టుచున్నది.

పూర్వసంప్రదాయాభిరతులైన పండితులు వేదములు శబ్దతరంగములై మనచుట్టు నెల్లపుడు నాకాశములో నుండియే యున్నవని చెప్పుదురు. "శబ్దతరంగము లొకపరి పుట్టుచో నవి యంతటితో నంతమొందక యితర శబ్దతరంగములలో లీనము గాక యట్టులే యుండు నను విషయము నేడు మన కనుభవసిద్ధమే. తీవ్ర తపశ్చర్యాదులచే నింద్రియములు వీర్య వత్తరములై దైవీ సంపత్సముల్లసితను లగుచో నాకాశమునందు విలీనములై యుండెడి యా యతిసూక్ష్మములైన శబ్దములను గూడ స్ఫుటముగ వినుట శక్యమగును".

Vide P. E. N. Books, Indian Literature. No. 12. Sanskrit Literature by Sri K. Chandrasekharam, V.H. Subrahmanya Sastry. PP 19. )

ప్రాచీనులును మంత్రద్రష్టలును నగు మహర్షులు కొందఱు నిరతిశయ తపశ్చర్యాదులచే నట్టి దైవీశక్తిని పెంపొందించుకొనినవారై తమ దివ్యతపస్సమాధిలో నీ వేదమంత్రరాశిని దర్శించిరి. అట్లు దర్శించి శబ్దస్వరూపవిషయకమైన తమ యనుభూతిని ( The Theory of the Origin of Sound)లోకాను గ్రహబుద్ధితో తొలుదొలుత శాస్త్రీయముగ లోకమున వెలయిప జేసిరి. కనుక "వేదములు నిత్యములు; సృష్టి యెంత ప్రాచీనమో వేదము లంత ప్రాచీనములు" అనెడి సంప్రదాయానుగతమైన యీ వాదమును కాదనుట కేమాత్రమును వీలులేదు.

—(०)-(०)-(०)—



హరిహంరాజ క్షేత్రము — ఈపూరు



# గురు దేవతాస్తుతిః

—o-o-o—

ఇదంపుర నివాసం శ్రీ వేణుగోపాల విగ్రహమ్ ।
పితృపైతామహధనం నమామ జగతాం గురుమ్ ॥

చిద్ఘనాయ ప్రసన్నాయ శ్రుత్యాకాశ విహారిణే ।
అద్వైతామృత వర్షాయ శంకరాయ నమోనమః ॥

కామకోటి మహాపీఠ వాసినీం కామితార్థదామ్ ।
వన్దేమహి చ తాం దేవీం చంద్రశేఖర సుందరీమ్ ॥

త్రయీవిద్యాత్మికాం దేవీం కాంచీపుర మహాద్యుతిమ్ ।
నమామ కామకోటిం తాం జయేంద్ర వినుతాం ప్రభామ్ ॥

సోమయాజి గురుం వందే దుర్గాంబాం మాతరం శుభామ్ ।
యౌ సర్వగుణ సంపన్నౌ శివావివ శివాయ నః ॥

వేణుగోపాల దేవస్య మందిరం గోపురాదికమ్ ।
నిర్మాయ సుకృతాత్మానౌ పితరౌ తా వుపాస్మహే ॥

పితృవ్యం రామశర్మాణం అగ్రజస్యానుగామినమ్ ।
పురాణోపనిషచ్ఛాస్త్ర మనసైకరతం సదా ॥

రామనామామృతాస్వాద నిరతం ధర్మ తత్పరమ్ ।
మార్గదర్శిన మస్మాకం నమామ శిరసా గురుమ్ ॥

హనుమచ్ఛాస్త్రిణం వందే వైయాకరణ భూషణమ్ ।
కరుణాలుం కులపతిం సంస్కృతం యస్య జీవితమ్ ॥

కవితార్కిక సింహం శ్రీ గోవిందాచార్య మేవ చ ।
రఙ్గరామానుజాచార్యం వన్దేస్త్రైక జీవితమ్ ॥

పితౄన్ దేవాన్ ఋషీన్ దివ్యాన్ గురూన్ శాస్త్రార్థ కోవిదాన్
నమామ విదుషో యేషా మాశిషేయం కృతిస్తథా ॥

# కృతి సమర్పణమ్

—0-0-0—

నమస్తే వేణుగోపాల ! హరివంశ ప్రదీపక ।
కృతి రేషా తతాఽస్మాభి రర్పితా త్వత్పదాంబుజే ॥
త్రివిక్రమ హరే తే యత్ పరమం పద మస్తి తత్ ।
నిర్బ్రువన్తి యథాన్యాయం కృతి స్త్వామను సువ్రత ॥
ప్రత్యస్తాఖిల భేదే తే వ్యత్యస్త పద పంకజే ।
భక్త్యై సమర్ప్యమాణేయ మలంకృతి రియం కృతిః ॥
య త్తే పదం త్రిలోకాత్మన్ ఋగ్యజుస్సామ సంజ్ఞితమ్ ।
పరిమార్గః కృత స్తస్మిన్ త్వత్పదానుగమై ర్మయా ॥
త్రయీ త్రికాండరూపా సా త్రిపదా త్వత్పదానుగా ।
కర్మోపాస్తి జ్ఞాన యోగ సంస్కారక్రమ సాధనా ॥
గోప తే వాక్పతేః పాదపూజాయై నిరతా శుచిః ।
శ్రుతినిర్వచనా భారతీ నిరుక్తి రియం కృతిః ॥
క్షేత్రే హరిహరాజాఖ్యే ఇదంపురవరే స్థితమ్ ।
వరం కామయతే హ్యేషా వేణుగోపాల సుందరమ్ ॥
సర్వజిద్వర్ష వైశాఖ పూర్ణిమా సోమ వాసరే ।
కల్యాణ మూర్తయే తుభ్యం దత్తాం స్నేహేన పాలయ ॥

న మా మ వే ద వి గ్ర హ మ్ః

# అవతారిక

—o-o-o—

అజముఖాంబుజ నిఃసృత వాహినీ
హరి హృదబ్ధి తరంగ విహారిణీ ।
హరశరీర మహాచల వాసినీ
త్రిపథగా త్రిపదా నను భారతీ ॥

అంబ ! భారతి ! నిరుక్తి రంజితే
సూనృతే మధురసూక్తిశోభితే ।
భావనాంబర విహార విశ్రుతే
పాహి పావని ! హరిప్రియే ! శివే ॥ — వేదమాతృస్తవ

వేదప్రతిపాద్యయు, వేదమాతయు, వాగ్దేవతయు నగు భారతి యొక్క స్వరూపదర్శనమే భారతీనిరుక్తి.

పరాదేవత యగు నా భారతి యొక్క స్వరూపము (లేక పరమాత్మ స్వరూపము) నుద్బోధించుటకై యవతరించిన వేదవాణి భారతి. పరాదేవత యగు భారతియొక్క స్వరూపమును దెలియవలె నన్నచో వేదవాణి యగు భారతియొక్క స్వరూపము దెలియవలసి యున్నది. అట్టి భారతి (వేదము) యొక్క స్వరూప నిర్వచనమే భారతీనిరుక్తి.

పరాదేవతయగు భారతిని, తత్ప్రతిపాదిక యగు వేదభారతిని పెక్కు తెఱగుల నారాధించెడి ప్రజలకును "భారతీ" యని పేరు, భారతీప్రజయొక్కయు, భారతీసంస్కృతి యొక్కయు స్వరూప వివరణమే భారతీనిరుక్తి.

భారతి యొక్క యీ త్రివిధస్వరూపమును శ్రుతి స్మృతి పురాణేతిహాసాది తాత్పర్యానుగుణముగ వివరించుట యీ భారతీనిరుక్తి యొక్క లక్ష్యము.

ఈ భారతీస్వరూపమును శ్రుతులే నిర్వచించినవి: మహర్షు లెందఱో దర్శించి ప్రబోధించిరి; భాష్యకర్తలు మున్నగువా రెందఱో వివరించిరి; అట్టి యెడ మరల నీ గ్రంథమేల ? ఇందు గ్రొత్తగ బ్రతిపాదింపబడెడిదేది? యన

వచ్చును. శ్రుతులు చక్కగ బ్రతిపాదించినను వేదముల నిరసించుచు కేవల బుద్ధి ప్రమాణముతో పెక్కు దర్శనములు బయలుదేరినవి. వానిని ఖండించి సమన్వయ పఱచుటకై పెక్కు శాస్త్రము లవతరించినవి. న్యాయ వైశేషికాది శాస్త్రము లట్టివి. ఎంత వాఙ్మయ మున్నను, సిద్ధాంత మెంత స్ఫుటముగ నిరూపింపబడినను వేఱ్వేఱు కాలములలో వేఱ్వేఱు ప్రతిపక్షవాదములు చిగురించుచునే యుండును. ఆ వాదముల ఖండించుటకై యెప్పటికప్పుడు క్రొంగ్రొత్త గ్రంథము లవతరించుచునే యుండును. అనాదిసిద్ధమైన సిద్ధాంతమునే నూత్ననూత్న ప్రతిపక్షవాదముల ననుసరించి క్రొంగ్రొత్త రీతుల మఱల మఱల నిరూపించి ప్రబోధింపవలసియుండును.

ఇటీవల నించుమించుగ నొకటి రెండు శతాబ్దుల నుండి పాశ్చాత్య చరిత్ర కారులును, తదనుయాయులును గేవలము చరిత్ర కల్పనాలక్ష్యముతో వేదవాఙ్మయ మును బరిశీలించిరి తమ తమ భాషలలోని కనువదించు కొనిరి. ఆ భాషాంతరీకరణ ములను, ప్రపంచములోని వివిధ భాషల యందుగల కొన్ని పదములతో సంస్కృత భాషా పదములకు గల సామ్యమును, విజ్ఞానక్రమ వికాసము (Theory of evolution) అనెడి న్యాయమును, ఖగోళ, భూగర్భాది శాస్త్రములను నాధారముగ జేసికొని పెక్కు చరిత్ర కల్పనల గావించిరి. యుగయుగములుగ భారతీయుల దృష్టిలో 'నపౌరుషేయములు, స్వతఃప్రమాణములు' నయి విలసిల్లుచు వచ్చిన వేదములు చరిత్రకారుల ననుసరించి 'ఆర్యు లనెడి పెక్కు తెగల' యొక్క రచనలు; అవి భాషాసామ్యాది నూత్నమార్గముల ద్వారా తెలియదగినవి'— యని చెప్పబడినవి. కర్మ-భక్తి-జ్ఞా యోగముల ద్వారా పరతత్త్వము నుద్బోధించుటకై కాండత్రయాత్మకముగ నవతరించినదని చెప్పబడు వేదమంత్రరాశి చారిత్రికుల ననుసరించి యాదిమ నివాసులలోని పలు తెగలయొక్క యంతర్యుద్ధవర్ణనలుగను, వారు ప్రకృతి దృశ్యముల జూచి దేవత లని భ్రమించి నక్షత్రమాశ్చర్య పరవశులై చేసిన స్తోత్రములుగను చిత్రింపబడినవి! పరమేశ్వరుని నుండి నిఃశ్వాసముల వలె నప్రయత్నముగ వెలువడి ఋషులచే మహాతపఃసమాధిలో దర్శింపబడినట్లు చెప్ప బడెడి వేదమంత్రములు వేఱ్వేఱు కాలములలో, వేఱ్వేఱు తెగల రచనలుగా చరిత్రకారు లూహించిరి. సంగ్రహముగ వారి చరిత్రాంశము లివి :

"మానవజాతి యొక్క నాగరికత శైశవావస్థ యందున్న కాలములో నార్యు లనెడివారి తొలి రచన ఋగ్వేదము ; ఇందు పది మండలములు గలవు ; వీనిలో

1. Maxmulier - What India can teach us P. P. 108 to 113.

దశమ మండల మత్యన్త          నము ; ఏలయన, పూర్వమండలములలో గన్పట్టు భక్తిప్రవణము లయిన స్తోత్రములు క్రమముగ తఱిగి సృష్టిరహస్యాదుల గూర్చిన యూహాగానములు కొలదిగ నిట పొడసూపసాగినవి ; ఋగ్వేద రచన యయిన కొంతకాలమునకు సామవేదము, తర్వాత యజుర్వేదము రచింపబడినవి ; వేదకాలమున తొలుదొలుత యజ్ఞనిర్వహణమున కెట్టి నిబంధనలు లేవు ; ఎవరికి వారు తమ తమ భక్తికొలది యా యా దేవతల నుద్దేశించి నిరాడంబరముగ స్తోత్రము జేయుచు నగ్నియందు హవిస్సుల నొసగెడివారు ; కాలక్రమమున నిబంధనలు పెరిగినవి : ఆ నిబంధనలే యజుస్సులు ; తరువాత యజ్ఞ క్రియాకలాపమును బెంచుచు బ్రాహ్మణములు బయలుదేరినవి : చాలకాలము వరకు అథర్వవేదమునకు వేదత్వమే లేకుండెను ; మఱియు సూర్య చంద్ర విద్యు దగ్ని నక్షత్రాది జ్యోతిస్సులే (Bright Bodies or Luminous Bodies) యార్యుల దృష్టిలో మొదట దేవతలు ఈ జ్యోతిస్సులే జగద్యాత్రానిర్వహణమునకు గారణభూతము లని వారు నమ్మిరి ; తరువాత భూమ్యాకాశములు, మేఘములు, వాయువులు, నదీ నద పర్వతాదులు, లతావృక్షాదులు తుదకు పశుపక్ష్యాదులు సైతము దేవతాగణములో జేర్చబడినవి ; చనిపోయినవారు సైతము దేవత లగుదు రని భావించి వారికి శ్రాద్ధాదులు జేయబడినవి. క్రమముగ దేవతలకు గరచరణాద్యంగములు గల్పింపబడినవి; దేవతాకల్పనము ఋగ్వేదమునందే యెక్కువగా గలదు. మనుజుని మనస్సు అనెడి 'ఫ్యాక్టరీ' యందు రకరకములైన దేవతల నుత్పత్తి జేయు ప్రణాళిక ఋగ్వేదమునందువలె మఱి యే యితరదేశ వాఙ్మయము నందును లేదు ; ఇట్లు దేవతల సంఖ్య మితిమీఱి పెరుగుచుండగా — ఈ భూమ్యాకాశాదుల నిజముగ సృజించిన దెవరు ?— అనెడి ప్రశ్న యార్యులలో గొందఱ కుదయించెను అట్టి శక్తివి గొంద ఱగ్నికి సమకూర్చిరి. మఱికొంద ఱింద్రునకు — నిట్లే సోమ వరుణాది దేవతలకును గల్పింపబడినది. క్రమముగ దేవతలలో పోటీ యేర్పడెను. కొంతకాలమునకు - 'దేవు డొకడే. కవులు ఒకే దేవుని యనేకనామములతో బిలుచుచున్నారు.' - అను భావము బయలుదేరెను. తత్, సత్, ఆత్మ, బ్రహ్మ. అదితి, అక్షరమ్ - ఇత్యాది పదములు కొన్ని ఋగ్వేదమున గూడ గన్పట్టుచున్నవి ; తరువాత బయలువెడలిన యుపనిషదాది గ్రంథములలో జెప్పబడెడి తత్త్వజిజ్ఞాసకు అంకురములు ఋగ్వేదమున గలవని యంగీకరింపక తప్పదు. మొత్తము మీద వేదములందు బాహ్య దర్శనమే గాని యంతర్దర్శనము లేదు.

మొదట వేదములలో నిరాడంబరముగ సాగి, పిదప బ్రాహ్మణముల కాలములో బహుళముగ బెఱిగిన యజ్ఞక్రియాకలాపముపై విసుగు జనించినది. అంతర్దర్శనము సాగినది. ఉపనిషద్వాఙ్మయము బయలు వెడలినది అనాదిగ తమ పూర్వుల గౌరవించు స్వభావము భారతీయులకు గలదు అందుచే నుపనిషత్తులు యజ్ఞములను బూర్తిగ నిషేధింపక వానిని బ్రోత్సహించుచునే యుపాసనలను తత్త్వజిజ్ఞాసను బెంచినవి. ఈ జిజ్ఞాస బౌద్ధ జైనాదుల కాలమునను, పిదప శంకరాదుల కాలమునను మఱింత పెఱిగినది సోమపానము జేసెడి, దేవతలను గొల్చెడి వేద కాలము నాటికిని శంకరుని యద్వైతబ్రహ్మ దర్శనము నాటి కాలమునకును విజ్ఞాన వికాస విషయమున నెంతేని వ్యత్యాసము గలదు ఇట్లే దేవతాస్వరూప దర్శన విషయమునను క్రమవికాసము గలదు."- అని చారిత్రికుల యూహ.1

వేదమును గూర్చిన యిట్టి చరిత్రాంశములు ప్రస్తుత మన్ని విశ్వ విద్యాలయములయందును, పాఠశాలలయందును బాఠ్యాంశములుగ నిర్ణీతములయి, బోధింపబడుచున్నవి. క్రమముగ వానిని ప్రధానముగ నభ్యసించెడి భారతీయ విద్యార్థులకును వేదములకును మధ్య నీ చారిత్రిక కల్పన లడ్డుగా నిలిచి, 'వేదములు తమ విజ్ఞాన సర్వస్వము'లను విశ్వాసమును సడలించుచున్నవి. దానితో మనకు కాణాచియైన యార్షసంస్కృతియు దూర మగుచున్నది. అందుచే చారిత్రికకల్పనలు వేదవాక్యార్థ నిర్ణయ విషయమై ప్రమాణము లగునా ? కాదా ?- యను నంశము ప్రధానముగ బరిశీలింప వలసియున్నది.

వేదరచయిత లనబడెడి యార్యుల నివాసస్థానము, వారి కాలము మున్నగు నంశములపై చారిత్రికుల మధ్య పెక్కు వివాదములు గలవు. ఏ భాషా సామ్యవాదమును, భూగర్భ ఖగోళాది శాస్త్రములను పాశ్చాత్య చరిత్రకారులు పురస్కరించుకొనిరో వాని నాధారము జేసికొనియే- "ఆర్యులనెడి వేదరచయితలు ఈ దేశస్థులే. ఇటనుండియే వారిలో గొన్ని శాఖలు బయలుదేరి ఆసియా, ఐరోపాలలోని వివిధ ప్రాంతములకు వలస బోయియుందురు. పాశ్చాత్యు లూహించెడి కాలము కంటె నింకను ప్రాచీన కాలములకు జెందినవారు"- అని చెప్పెడి చరిత్రకారులును

1. 1. S. Radhakrishnan-Indian Philosophy, Vol. I.
   2. A.A. Macdoneil-History of Sanskrit Literature.
   3. Maxmuller-History of Vedic Literature.

గలరు. ఈ వాదము లన్నియు పరస్పర విరుద్ధము లగుటచే నొకరి వాద మొకరికి ప్రమాణ మగుటలేదు. ఇవి కేవల మూహాకల్పితము (Speculations) లగుటచే నె వరియూహ సరియైనది ? ఎవరిది కాదు ? - అను ప్రశ్న లట్లే నిలిచిపోవును, అందుచే చరిత్రకల్పన సువ్యవస్థితము కాదు. ప్రమాణ భూతమును గాజాలదు, 'చరిత్రకల్పనలు ప్రమాణములు కానందున- వేదదకాలమునాటి తత్త్వదర్శనమునకును ఈనాటి తత్త్వదర్శనమునకును విజ్ఞాన వికాసవిషయమున నెంతేని వ్యత్యాసము క్రమవికాసము గలదు; మొత్తము మీద వేదములలో బాహ్యదర్శనమే గాని యంతర్దర్శనము లేదు'- ఇత్యాది చారిత్రికవాదము గూడ దుర్బల మగుచున్నది.

సృష్ట్యాదినుండియు భౌతికశాస్త్ర పరిశోధనలు పెంపొందుచు, పెంపొందు కొలది భౌతిక విజ్ఞానము క్రమవికాసము నొందవచ్చును. ఆ విజ్ఞానము నాధారము జేసికొని బాహ్యవస్తుసంపద, సాధనసామగ్రి, తదనుగుణముగ నాచారవ్యవహార ములు, వీనిన్వ్యూహపము క్రమపరిణతి జెందవచ్చును. ఇదియే నాగరికతగా గూడ ప్రసిద్ధి జెందవచ్చును. ఇట్టి క్రమపరిణామము జగద్యాత్ర సాగినంతవరకు నుండు నదే. నూత్న పరిశోధనలు సాగి యంతకు బూర్వపు పరిశోధనల యవాస్తవికతను వెల్లడిజేయుచు, మఱల మఱల నూత్న పరిశోధనలకు దారితీయుచుండును కాని వేదములు ప్రబోధించెడి యాధ్యాత్మికౌన్నత్య మిందుకు భిన్నమైనది. ఆ యౌన్నత్య మును బొందుటకు నధికారిభేదము ననుసరించిన క్రమమును జూపెడివి కర్మోపాసనా జ్ఞానకాండలు. ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మను పరమలక్ష్యముగా నిర్దేశించుచునే కర్మోపాసనాకాండలును బ్రవర్తిల్లినవి. అంతియేగాని ఋషిదర్శనములగు వేదము లలో కాలభేదము ననుసరించి విజ్ఞానక్రమవికాసము గలదనెడి వాదము శ్రుతి తాత్పర్యానుగుణము కాదు. శ్రీ శంకరభగవత్పాదులు గాని, భగవద్రామానుజ — మధ్వాచార్యాదులు గాని ప్రతిపాదించిన సిద్ధాన్తములు తదుపజ్ఞములు గావు. తమతమ దర్శనములు శ్రుతిప్రమాణానుగృహీతము లనియే వారు చెప్పికొనిరి గాని యవి స్వబుద్ధిప్రతిభోన్నీతములని భావింపలేదు; చాటుకొనలేదు. ఉపనిషద్దర్శనముకంటె తాను దర్శించిన యద్వైతదర్శనము భిన్నమే యగుచో శ్రీ శంకరుడు ఇతర బౌద్ధ జైనాది దర్శనములతోపాటు ఉపనిషద్దర్శనమును గూడ ఖండించి యుండెడివాడు. అట్లు ఖండింపక పోగా —

"తస్మా ద్య త్తేనో క్తం తత్తథైవ ప్రతిపత్తవ్య మాత్మనః
శ్రేయ ఇచ్ఛద్భిః జ్ఞానం వా కర్మ వేతి" — శం.భా.బృ.ఉ. 2.4.10
"తస్మా ద్వేదప్రామాణ్యస్య అవ్యభిచారాత్ తాత్పర్యే సతి
వాక్యస్య తథాత్వం స్యాత్ న తు పురుషమతికౌశలమ్"

—శం. భా. 3-3-1

అని యనినాడు. శ్రేయస్కాములగువారు వేదోపదిష్టమగు ధర్మము గాని జ్ఞానము గాని యథాతథముగనే గ్రహింపవలెను. వేదప్రామాణ్య మవ్యభిచరితము (సువ్యవస్థితము). పురుషమతికౌశలముచే నిర్ధారితమగు నర్థము వ్యభిచరితము (అవ్యవస్థితము) గావచ్చును గాని ఉపక్రమోపసంహారాది షడ్విధలింగములచే నిర్ధారితమైన వేదతాత్పర్యము వ్యభిచరితము గాదు. అందుచే తత్ప్రతిపాదక వేదవాక్యము యథార్థబోధకమే యగును. అట్టి వేదవాక్యతాత్పర్యమును పురుషమతికౌశలముచే నన్యథాకరింప శక్యముగాదు అనుచు నీరీతిగ శ్రీశంకరుడు కర్మ — బ్రహ్మావబోధక కృత్స్నవేదరాశి యొక్క ప్రామాణ్యము నుద్ఘోషించెనేగాని వేదోపదిష్టము గానట్టి నూత్నదర్శనమును ప్రబోధించు చున్నట్లు చెప్పకొనలేము. శ్రీరామానుజాదులు నిట్లే యనిరి. అందుచే "శ్రుతి దర్శనము వేఱు; శంకరాదుల దర్శనము వేఱు" — అనుట యుక్తము గాదు. కనుక ఆధ్యాత్మికౌన్నత్య విషయమున వేదకాలము కంటె నుపనిషత్కాలములలోను, నంతకంటె శ్రీ శంకరాదుల కాలములోను నొక క్రమపరిణామము గలదనెడి వాదము శ్రుతితాత్పర్యానుగుణము గాదని నిరూపించుటయే యీ గ్రంథము యొక్క లక్ష్యము.

చరిత్రకల్పనలను ప్రబలములగు యుక్తుల జూపి చక్కగ విమర్శించి ఖండించిన మహనీయు లెందఱో గలరు. అందుచే నా యుక్తివాదముల నిట పునరుక్తములు చేయుటలేదు. తన యవతరణమును గూర్చియు, తన స్వరూపమును గూర్చియు వేదములే యేమి చెప్పికొనినవియను నంశమే ప్రధానముగ నీ గ్రంథమున బరిశీలింపబడినది. ఈ యంశమును బరిశీలించుచో చరిత్రాంశముల యందలి సామంజస్యము తేటపడగలదు.

# వేదమంత్రార్థవివరణకు ప్రమాణము లేవి యగును?

—0-0-0-0-0-0-0-0—

ఈ ప్రశ్న యుదయించుట సహజము.

"సత్రిణాం సత్రఫలదః పవిత్రం పరమాత్మవాన్ ।
లోకసత్రధరో హ్యేష మంత్రై ర్మంత్ర ఇవోచ్యతే ॥"

— హరివంశ. 49-24

ఆత్మవాన్ స్వతంత్రః, మంత్రై ర్మంత్ర ఇవోచ్యత ఇతి యథా వాచో మాధుర్యం వాచైవ వర్ణనీయం ఏవం విష్ణోః స్వరూపం విష్ణునై వాచ్యనీయ మిత్యర్థః॥

— నీలకంఠ:

వేదమంత్రార్థ వివరణకు వేదమంత్రములే ప్రమాణము అనెడి సంప్రదాయము పై శ్లోకము వలన దెలియును. వేదమంత్రముల తరువాత తత్సంప్రదాయోద్దీపకము లగుటచే షడంగములు, స్మృతులు, పురాణేతిహాసాదులు ప్రమాణములు. వీనిని ప్రమాణముగ గొనిన భాష్యములును ప్రమాణములు కాని చరిత్రకల్పనయే లక్ష్యముగా గల్గి స్వకపోల కల్పితములై వెడలెడి చరిత్రలు ప్రమాణములు కాజాలవు.

దర్శనకారులు వస్తుజ్ఞానసిద్ధికి ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి యని యారు ప్రమాణములు గ్రహించిరి వీనిలో గొన్నిటిని మిగిలిన ప్రమాణములలో నంతర్భావము గల్పించుకొనినవారును, లేక వీని నన్నిటిని గ్రహించినవారును గలరు. చరిత్రను ప్రమాణకోటిలో జేర్చినవా రెవ్వరును లేరు కాని చరిత్ర కల్పనయే లక్ష్యముగా గల చరిత్రకారు లట్లు గాక అన్యభాషాసామ్యము, నాగరికతా-విజ్ఞానక్రమవికాసము మొదలగువాని నాధారముగా గొని, చరిత్రను గల్పించి వేదవాక్యార్థ కల్పనల జేసి తదనుగుణముగ భాషాంతరీకరణములు, కోశములు (Lexicons), నామవిషయానుక్రమణికలు (Vedic Index of names and subjects) మున్నగు వానిని రూపొందించిరి వీని వలన సంప్రదాయానుగతమైన (శ్రుతిసిద్ధమైన) యర్థము మఱుగు పడినది సంప్రదాయ మనగా వేద మని యర్థము. (చూ. ఆమ్నాయ శబ్దము) శ్రుత్యనుగుణముగ ప్రవర్తిల్లి పరంపరాగతమై వచ్చిన యాచారమునకును సంప్రదాయ మని పేరు. అట్లే శ్రుతిసిద్ధమై పరంపరాగతమై వచ్చిన యర్థమే సంప్రదాయార్థము. అట్టి యర్థము దర్శింపజేయుటకు చారిత్రికులు అన్యభాషాసామ్యాదులచే నూహించిన భాషా

శాస్త్రము గాని చరిత్రగాని ప్రమాణములు కాజాలవు. ఏలయన....గ్రీసు పారశీకాది దేశములలో గూడ ప్రాచీన వాఙ్మయములు గలవు. వానికిని వైదిక సంస్కృతమున కును గొంత భాషాసామ్య మున్నట్లు చరిత్రకారు లిటీవల దర్శించిరి. ఈ ప్రాచీన భాష లన్నియు ప్రాచీనార్యుల యొక్క వివిధ శాఖలచే వ్యవహరింపబడియుండు నవియు, వారు వివిధ శాఖలుగా చీలక పూర్వమే భాషలన్నిటికిని పూర్వరూపమైన మఱియొక భాషను మాటలాడి యుందురనియు నూహించి. యా భాషకు 'ఇండో యూరోపియన్ లాంగ్వేజ్' అని పేరు బెట్టిరి. దానిని మాతృభాష యనిరి. ఆ భాషాపదము లిట్లుండి యుండవచ్చు నని యూహ చేసి కొన్ని పదముల సృష్టించిరి. ఆ మాతృభాష నుండియే భారతీయుల వేదములు, పారశీకుల జెందవెస్తా, గ్రీకు, లాటిన్ - ఇత్యాది ప్రాచీన వాఙ్మయము లన్నియు వేఱ్వేఱు దేశములలో వేఱ్వే ఱుగ క్రమక్రమాభివృద్ధి నొందియుండు నని తలచిరి. ఈ యూహయసమంజస మని త్రోసివేయ వీలు లేనట్లు గన్పట్టును సమాన లక్షణములు గల యిరువురిని గాంచినపుడు వారిరువురు తండ్రికొడుకులో, సోదరులో, లేక దగ్గఱ బంధువులో యని యూహించుట సహజము. అట్లే పదసామ్యము, అర్థసామ్యము గన్పట్టుచున్న యీ ప్రాచీన వాఙ్మయములకును నేదేని సంబంధ ముండవలెను గదా ! కాని యా సంబంధ మెట్టిది? యను ప్రశ్నయే వివిధ సమస్యలతో గూడి, విభిన్న వాదములకు దారి తీసినది.

ఏలయన భాషాసామ్యవిషయమున నొక చిక్కు గలదు. ఉదా: అగ్నిః అను నది సంస్కృతపదము. అగ్గి యనునది తెలుగుపదము. ఈ రెంటికి నాకృతి సామ్యము, అర్థసామ్యము గలవు. ఈ సామ్యమును మాత్రమే పురస్కరించుకొని యగ్ని యను పదమునుండి అగ్గి పద ముత్పన్నమైనదా లేక అగ్గి పదమునుండి అగ్ని పద ముత్పన్నమైనదా ? అట్లుగాక యీ రెంటికిని మూలకారణమైన పద మింకొకటి యేదియైన నుండవలె నని యూహింపవలెనా ? పద - అర్థసామ్యములను బట్టి వాఙ్మయచరిత్ర సాధింపవలెనన్న నిట్టి చిక్కులు సంభవించును ఇట్టియెడ గమ నింపవలసిన యంశ మొకటి గలదు. అగ్నియను పదము ధాతూత్పన్నమై స్వతం త్రముగనే యనేకార్థబోధనసమర్థము దాని యర్థనిర్ణయమునకై అగ్గి యను పద ముపై నాధారపడవలసిన స్థితిలేదు. అగ్గి పదవిషయమున నట్లు గాదు. అర్థ నిర్ణయ విషయమై దానికి ప్రకృతిరూపమైన యగ్నిపదముపై నాధారపడక తప్పదు. సంస్కృత శబ్దసామర్థ్య మట్టిది. అది స్వచ్ఛందముగ నర్థమును బోధింప జాలి

యున్నది. మఱియు "ఇండో యూరోపియన్ లాంగ్వేజి" యనెడి మాతృభాష యొకటి యున్నట్లు చరిత్రాధారములుగాని, భూగర్భాదిశాస్త్ర ప్రమాణములు గాని లేనందున నిది యొక యభూత కల్పనమే యగును. అట్లే సువ్యవస్థితము కానందున భాషాశాస్త్రము (ఫైలాలజీ) నొక శాస్త్రముగా బరిగణింప శక్యము గాదు. (చూ. A Critical Study of Rigveda – Dr. Dev Prakash Patanjal Sastry. PP. 28 to 30). కాన వేదశబ్దార్థ నిర్ణయము చేయుపట్టున నన్య భాషా సామ్య దర్శముతో గాని, మాతృభాష యనెడి "ఇండో యూరోపియన్ లాంగ్వేజి"తో గాని, అన్యభాషాసామ్యాదుల నాధారముగా గొని యూహించి కల్పించిన చరిత్రతో గాని భాషాశాస్త్రముతో గాని పని లేదు. ఇక వేదమునకు జేయబడిన భాషాన్తరీకరణములు సపగ్రములు కాజాలవు - అని చరిత్రకారులే యంగీకరించుచున్నారు

> "Let it not be supposed that, because there are several translations of the Rigveda in English, French and German, therefore all that the veda can teach us has been learned. Far from it. Every one of these translations has been put forward as tentative only. I, myself, though during the last thirty years I have given translations of a number of the more important hymns, have only ventured to publish a specimen what I think a translation of the Veda ought to be; and that translation ——— of twelve hymns only, fills a whole volume. We are still on the mere surface of the Vedic Literature,"
>
> Maxmuller — What India can teach us. pp. 131.

ఇట్లు అవ్యవస్థితములు, అసగ్రములునైన భాషాంతరీకరణములును వానిని బురస్కరించుకొని కల్పింపబడెడి చరిత్రాంశములుగాని వేదార్థ నిర్ణయ విషయమై ప్రస్తుతములు కావు

ఇక చరిత్ర ప్రమాణకోటిలో చేర్పబడనిచో పురాణేతిహాసాదులు గూడ నైతిహ్యమును బ్రతిపాదించును గదా! వేదస్వరూప నిరూపణమున నవియు నెట్లు

ప్రమాణము లగును ? అని యనవచ్చును. పురాణేతిహాసాదుల విషయమున నట్లు గాదు.

"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్"
"వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా"
"వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః"

—రామా. 1-4-6.

"విమృశంతి స్మ తం దేవా దివ్యాభి రుపపత్తిభిః ।
నచైనం శేకు రన్వేష్టుం కర్మతో జన్మతోఽపి వా ॥
గాథాభి స్తత్ప్రతిష్ఠాభి ర్యే తస్య చరితం విదుః ।
పురాణా స్తం పురాణేషు ఋషయః సంప్రచక్షతే ॥"

—హరివంశ. 50-18-19.

ఇతిహాసములు వేదమునందే గలవు. వేదగతములైన యితిహాసములు వేదార్థోపబృంహకములు వానికి స్వార్థమున తాత్పర్యము లేదు. సంగ్రహముగా నున్న నా యితిహాసములను స్పష్టముగ ప్రతిపాదించుచు నందలి నిగూఢార్థముల నుద్బోధించుటకై యవతరించినట్లు పురాణేతిహాసములే చెప్పికొనుచున్నవి. కనుక వేదములందలి యితిహాసములకును, బీజరూపమున నున్న వీనిని విస్తరింపజేసిన గాథలకును లక్ష్యము శ్రుతిచోదిత ధర్మ-బ్రహ్మ స్వరూప నిరూపణమే. వేద స్వరూపమును పురాణాదుల వలనను, పురాణగాథాతత్త్వమును వేదవాక్యసాహాయ్యమునను దెలిసికొనదగునని సంప్రదాయము. శ్రుత్యర్థానుసరణముండుట వలననే పురాణేతిహాసములకును స్మృతు లనియు వ్యవహారము అందుచేతనే యవియు పవిత్రములై పారాయణగ్రంథములై విలసిల్లుచున్నవి. కావుననే పురుషార్థ సాధనము లగు చతుర్దశ విద్యలలో పురాణములును చేర్కొనబడినవి.

"పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః ।
వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ ॥"

—యాజ్ఞ. స్మృ. 1-3.

పురాణములు, న్యాయము, మీమాంసా, ధర్మశాస్త్రము, షడంగములు, చతుర్వేదములు నను నీ పదునాల్గును పురుషార్థసాధనములగు విద్యా స్థానములు. శ్రుతులయందు సంగ్రహముగ నటనట నీ పురాణాది చతుర్దశ విద్యలు వివరింపబడినవి. ఋషులు

శ్రుతుల యందీ విద్యల దర్శించి లోకానుగ్రహబుద్ధితో వీనిని ప్రత్యేకముగ ప్రవచించిరి. శ్రుతు లిట్లు చతుర్దశ విద్యాత్మకము లగుటజేసి త్రయీశబ్దము చతుర్దశ విద్యోపలక్షకముగ గ్రహింపబడుచుండును. "త్రయీ సాంఖ్యం యోగః"— అను శివమహిమ్న స్తోత్రమునందలి శ్లోకమును వ్యాఖ్యానించుచు శ్రీ మధుసూదన సరస్వతులు "త్రయీ శబ్దము పురాణన్యాయాది చతుర్దశవిద్యోపలక్షక" మని వివరించిరి. ఇట్టి సంప్రదాయము కామందకీయమునను స్పష్టముగ గాననగును.

"అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయ విస్తరః ।
ధర్మశాస్త్రం పురాణం చ త్రయీదం సర్వ ముచ్యతే ॥ 2-13

ఈ చతుర్దశవిద్యల ననుసరించియే కావ్యనాటకాదులు, చతుఃషష్టికళలు మున్నగునవి ప్రవర్తిల్లినవి. అందుచే నవియు వేదస్వరూప దర్శనమున దోడ్పడునవి యగును. ఇట్లు పురాణాది భారతీయ వాఙ్మయము, తదనుగుణముగ యనూచానములై వచ్చెడి యాచార వ్యవహారములును వేద సంప్రదాయ రహస్యముల దెలియుట కెంతయు నుపకరించును

కాని కొందరు భారతీయ విద్వాంసులు- "వేదము లందలి సంహితాభాగములు మాత్రమే అపౌరుషేయములు, అందలి బ్రాహ్మణ భాగములు మాత్రము ఋషి విరచితము లగుటచే పౌరుషేయములు; అందుచే వేదము అను సంజ్ఞ సంహితా భాగమునకే గాని బ్రాహ్మణ భాగమునకు గాదు; పురాణేతిహాసాదులు ప్రమాణములు కావు''- అని చెప్పుచున్నారు. మఱికొందఱి దృష్టిలో అధ్యాత్మతత్త్వప్రబోధకము లగు ఉపనిషత్తులే ప్రమాణములు, తదితర వేదభాగములు కావు. ఇట్లు వేద స్వరూప- స్వభావ- ప్రామాణ్యాది విషయమై పెక్కు వికల్పము లిటీవల బయలు దేరినవి. అందుచే శ్రుతి తాత్పర్యానుగుణముగ వేదస్వరూపమును దర్శింప వలసి యున్నది.

## వేదనామములు_వేదస్వరూప దర్శనము:-

వేదస్వరూపమును దర్శించుటకై శ్రుతుల యందు గన్పట్టెడి వేద నామధేయములు కొన్ని యిట గ్రహింపబడి యథాశక్తి వివరింపబడినవి. పరిశీలించి వివరింపదగిన వింకను గలవు. కాని "వేదమునకు వేదః, ఆమ్నాయః, శ్రుతిః,

నిమిత్తభేదముచే భిన్నార్థమును బోధింప సమర్థము. కనుక సహస్రనామములలో విష్ణ్వాది శబ్దములు పునరుక్తములైనను దోషము లేదు.

"విష్ణ్వాది శబ్దానాం పునరుక్తానా మపి వృత్తిభేదే నార్థభేదాత్ న పౌనరుక్త్యమ్॥ — శం. భా. (విష్ణుసహస్రనామము),

ఈ నామములు కేవలము సంజ్ఞావాచకములు గావు. అవి పరమేశ్వరుని స్వరూపమును దెల్పెడి సంగ్రహవాక్యరూపములు లేక వ్యాఖ్యానములు. అట్లే వేదనామములు గూడ. సామాన్యముగ ఇతరభాషలలో నొక వస్తువును బోధించుట కొకటి రెండు లేక మూడుగాని నామములుండవచ్చును. సంస్కృతమున నట్లుగాదు. వైదిక నిఘంటువును జూచుచో — "ఇతి ఏకవింశతిః పృథివీనామధేయాని; ఇతి సప్త పంచాశద్ వాఙ్నామాని"- అని యీరీతిగ పృథివ్యాదులకు వేఱ్వేఱు నామానుక్రమణికలు గన్పట్టును. పృథివ్యాదినామము లన్నియు పృథివిని, వాఙ్నామము లన్నియు వాక్కును - ఇట్లు పర్యాయనామము లన్నియు నాపాతముగ నొకే యర్థమును బోధింపవచ్చును. కాని యా పదముల యందలి నిగూఢములైన రహస్యములు దెలియవలెనన్న వానికి గల వివిధ నిర్వచనముల దర్శింపవలెను. వానిని దర్శించిననే గాని యా పదములయొక్క యర్థగాంభీర్యము, తద్ద్వారా తెలియదగిన వస్తుస్వరూప స్వభావాదులు తేటపడవు అందుచే వివిధనామౌచిత్య విచారముచేసి వేదముయొక్క వివిధస్వరూపస్వభావముల దర్శించుట యుక్తము. అదియే యీ భారతీనిరుక్తి లక్ష్యము.

## వేదశబ్దములు - అర్థనిర్ణయ సంప్రదాయము

—o-o-o-o-o-o-o-o—

పాండితీ ప్రతిభచే పదములకు నూత్ననూత్న వ్యుత్పత్తుల గల్పించి వాని ద్వారా నూత్నార్థముల జెప్పుచో నవి సంప్రదాయానుగతము లగునా? కాజాలవు. అందుచేతనే తామూహించిన చరిత్ర నాధారము జేసికొని వేద పదములకు తద్ద్వారా వేదమంత్రములకు చారిత్రికులచే జెప్పబడెడి నూత్నార్థములు సంప్రదాయానుగతము లగుటలేదు. అప్రమాణము లగుచున్నవి. వేదపదముల యర్థనిర్వచనమునకై ప్రవ

నిమిత్తభేదముచే భిన్నార్థమును బోధింప సమర్థము. కనుక సహస్రనామములలో విష్ణ్వాది శబ్దములు పునరుక్తము లైనను దోషము లేదు.

"విష్ణ్వాది శబ్దానాం పునరుక్తానా మపి వృత్తిభేదే నార్థభేదాత్
న పౌనరుక్త్యమ్॥ — శం. భా. (విష్ణుసహస్రనామము),

ఈ నామములు కేవలము సంజ్ఞావాచకములు గావు. అవి పరమేశ్వరుని స్వరూపమును దెల్పెడి సంగ్రహవాక్యరూపములు లేక వ్యాఖ్యానములు. అట్లే వేదనామములు గూడ. సామాన్యముగ ఇతరభాషలలో నొక వస్తువును బోధించుట కొకటి రెండు లేక మూడుగాని నామములుండవచ్చును. సంస్కృతమున నట్లుగాదు. వైదిక నిఘంటువును జూచుచో – "ఇతి ఏకవింశతిః పృథివీనామధేయాని; ఇతి సప్త పంచాశద్ వాఙ్నామాని"- అని యీరీతిగ పృథివ్యాదులకు వేఱ్వేఱు నామానుక్రమణికలు గన్పట్టును. పృథివ్యాదినామము లన్నియు పృథివిని, వాఙ్నామము లన్నియు వాక్కును - ఇట్లు పర్యాయనామము లన్నియు నాపాతముగ నొకే యర్థమును బోధింపవచ్చును. కాని యా పదముల యందలి నిగూఢము లైన రహస్యములు దెలియవలెనన్న వానికి గల వివిధ నిర్వచనముల దర్శింపవలెను. వానిని దర్శించిననే గాని యా పదములయొక్క యర్థగాంభీర్యము, తద్ద్వారా తెలియదగిన వస్తుస్వరూప స్వభావాదులు తేటపడవు అందుచే వివిధనామౌచిత్య విచారముచేసి వేదముయొక్క వివిధస్వరూపస్వభావముల దర్శించుట యుక్తము. అదియే యీ భారతీనిరుక్తి లక్ష్యము.

## వేదశబ్దములు - అర్థనిర్ణయ సంప్రదాయము

—o-o-o-o-o-o-o-o—

పాండితీ ప్రతిభచే పదములకు నూత్ననూత్న వ్యుత్పత్తుల గల్పించి వాని ద్వారా నూత్నార్థముల జెప్పుచో నవి సంప్రదాయానుగతము లగునా ? కాజాలవు. అందుచేతనే తామూహించిన చరిత్ర నాధారము జేసికొని వేద పదములకు తద్ద్వారా వేదమంత్రములకు చారిత్రికులచే జెప్పబడెడి నూత్నార్థములు సంప్రదాయానుగతము లగుటలేదు. అప్రమాణము లగుచున్నవి. వేదపదముల యర్థనిర్వచనము నకై ప్రవ

ర్తిల్లిన నిరుక్తశాస్త్ర మట్టిది గాదు. సంప్రదాయానుగతములు గానట్టి విశేషార్థముల గల్పించి చెప్పుటకై యది యారంభింపబడలేదు. అట్లు ప్రవృత్త మగుచో నది వేదాంగముగ బరిగణింపబడెడిది కాదు. వ్యాకరణమునకు వేదచోదితార్థ దర్శనము నకై వలయు శబ్దగత ప్రకృతి ప్రత్యయ విభాగరూప సంస్కారమును దర్శింప జేయుట యందే దృష్టి. ఆ శబ్దసంస్కారము ననుసరించుచు శ్రుతితాత్పర్యాను గుణ ముగ నా పదమునకు గల యావదర్థమును - ఆధ్యాత్మిక, అధిదైవిక, ఆధిభౌతికా ద్యర్థములను-సంఘటనము జేసి, వేదచోదితార్థమును దర్శింపజేయుటయందే నిరుక్త శాస్త్రమునకు దృష్టి. అట్లు అర్థసంఘటనము జేయు కొఱకై శిక్షాద్యంగయుక్త వివిధ మంత్రబ్రాహ్మణాది గ్రంథసాహాయ్యముతో నా యా పదములకు శ్రుతులయందు గల వివిధ నిర్వచనముల బ్రదర్శించి వివరించుట నిరుక్తశాస్త్ర లక్ష్యము. (చూ. ఛందః శబ్దము).

## నిరుక్త లక్షణము-నాట్యశాస్త్రము ; యాస్క నిరుక్తము

-o—o-o-o-o-o-o—o-

ఈ నిరుక్తశాస్త్ర సంప్రదాయముననే భరతనాట్య శాస్త్రాదులును బ్రవ ర్తిల్లినవి.

"అల్పాభిధానేనార్థో యః సమాసే నోచ్యతే బుధైః ।
సూత్రతః సా తు విజ్ఞేయా కారికార్థ ప్రదర్శినీ ॥
నానా నామాశ్రయోత్పన్నం నిఘంటునిగమాన్వితమ్ ।
ధాత్వర్థహేతుసంయుక్తం నానాసిద్ధాన్తసాధితమ్ ॥
స్థాపితోఽర్థో భవేద్యత్ర సమాసే నార్థసూచకః ।
ధాత్వర్థ వచనేనేహ నిరుక్తం తత్ప్రచక్షతే ॥" •

-భరతనాట్యశాస్త్రమ్

ఇట నుదాహరింపబడిన శ్లోకములలో మొదటిది కారికాలక్షణమును, మిగిలిన రెండు శ్లోకములు నిరుక్త లక్షణమును దెలుపునట్టివి. ఈ శ్లోకముల వ్యాఖ్యానించుచు అభినవగుప్తుడు తన అభినవ భారతీ వ్యాఖ్యయందు నిరుక్తలక్షణమును విపులముగ వివరించినాడు.[1] తదనుగుణముగ నిరుక్త సంప్రదాయము దర్శింపదగియున్నది.

• "అర్థ పరీక్షాత్మకం నిరుక్తం లక్షయతి శ్లోకద్వయేన– నానానామేతి స్థాపిత ఇతి చ. సంక్షేపేణానేకవ్యక్తి భిన్నస్యార్థస్య లక్షణీయస్య యః సూచకోఽర్థో లక్షణాత్మకః స యత్రాక్షేప ప్రతిసమాధాన లక్షణే వస్తుని సతి స్థాపితో భవతి. నచైవం పరిభాషా. కిన్త్వర్థ మేనం నిర్భుజ్య ఆక్షేపప్రతి సమాధానాభ్యాం లక్షణస్య వచన మితి. ఏత దాహ– కిన్త్వర్థవచన మితి.

కథం తల్లక్షణం స్థాప్యత ఇత్యాశంక్య క్రియావిశేషణాభిధానద్వారేణ ఆక్షేపప్రతిసమాధానప్రకారం దర్శయతి– నానేత్యాదినా । నానాప్రకారాణి యాని నామాని లక్షణవాక్యేఽర్థ ప్రతిపాదకాః సుబన్తాః శబ్దాస్తా నాశ్రితోత్పన్నః ఉత్పాద ఆక్షేపప్రతిసమాధానయో ర్యత్ర । నను నామపదేషు కథ మాక్షేపప్రతిసమాధానే ? ఆహ – నిఘంటునాఽభిధానకోశేన రూఢేషు అన్యేషు ప్రకృతి ప్రత్యయ విభాగ నిగమనయా అన్విత మన్వయో యత్రోత్పాదే। యాని చ లక్షణవాక్యే తిఙన్తాని పదాని తేషు ప్రకార మాహ– ధాత్వర్థస్య క్రియాయా, హేతూనాం చ క్రియానిమిత్తానాం కారకాణాం సంయోజనం విచారో యత్ర స్థాపనే । ఇయతా లక్షణవాక్యే పూర్వం శబ్దపరీక్షా దర్శితా। అయం శబ్దః కథ మత్రార్థే వర్తత ఇత్యాక్షేపః। ఇత్థ మితి చ ప్రతిసమాధానమ్। ఏతత్ ప్రదర్శితవస్తుప్రణీత మేవ। అర్థపరీక్షయా మపి దర్శయతి – నానాప్రకారైః సర్వతంత్ర ప్రతితంత్రాదిభిః సిద్ధాన్తైః। ప్రమాణమూలైరర్థైః సాధిత మాక్షేపోత్తరయోః సాధనా యత్ర స్థాపనే। ఏవం పరీక్షాఽనేన దర్శితా। తంత్రాది న్యాయాస్తు తదఙ్గమ్" —అభినవ భారతి.

---

నిరుక్తమనగా వాగర్థ పరీక్ష. వాక్ అనగా అర్థ ప్రతిపాదక శబ్దము. శబ్దముచే ప్రతిపాదింపబడెడి యర్థము అనేక వ్యక్తిదముచే భిన్నముగ గన్పట్టును. ఉదా :– గౌః– ఈ శబ్దమునకు గోవు అను వర్థము ప్రసిద్ధము ఇంతేకాదు. వాక్కు, ఆదిత్యుడు, కిరణము, బాణము విరాట్టు–ఇత్యాద్యర్థములును శ్రుతుల యందు కన్పట్టును. ప్రకరణానుగుణముగ వీనిలో నే యర్థమును గ్రహింపవలెను, అనున

పరీక్ష (జిజ్ఞాస లేక మీమాంస). ఏ యర్థమును గ్రహించినను నది యనేక (గో) వ్యక్తి భేదముచే భిన్నముగ గన్పట్టు చుండును. ఇట్టి శబ్దము సమాసరూపము - అనగా సంగ్రహవాక్యాత్మకము. ఉదా:- గచ్ఛతీతి గౌః - అనెడి సంగ్రహవాక్యార్థమును లక్షింపజేయు సమాసరూపమే గోశబ్దము. ఈ సంగ్రహవాక్యమే విగ్రహవాక్యము. ఇదియే లక్షణవాక్యము ఇట్టి లక్షణవాక్యముద్వారా అనేక వ్యక్తి భేదముచే భిన్నమగు అర్థము దర్శింపబడవలసి యున్నది. లక్షణము ద్వారా తెలియదగినది. గావున ఈ యర్థము లక్షణీయమగును. ఇట్టి లక్షణీయార్థమును దర్శించు సమయమున సామాన్యముగ గలిగెడి యాక్షేపములకు ప్రతిసమాధానాదుల జూపి, లక్షణాత్మకమగు అర్థము ఎచట స్థాపిత మగునో యది పరీక్షారూపమగు నిరుక్తమగును. ఇట్టి ఈనిరుక్తము పరిభాషా (సంకేత) రూపము కాదు. ఏలయన ఆక్షేప ప్రతిసమాధానాదుల ద్వారా అర్థమును నిరూపించి, లేక, నిర్వచించి, లక్షణము జెప్పుటయే నిరుక్తము.

ఇక నిరుక్త (నిర్వచన) లక్షణమును స్థాపించు విధానము గమనింపదగినది. "దూరం గచ్ఛతీతి గౌః ; గచ్ఛన్తి అస్యా మితి గౌః" — ఇత్యాది లక్షణ వాక్యముల యందు నామము (సుబంతములు), క్రియలు (తిజన్తములు) గన్పట్టుచుండును లక్షణ వాక్యములలోని నామములలో కొన్ని రూఢిపదములు. నిఘంటువులు వానికిగల రూఢ్యర్థముల బోధించుచుండును. మిగిలిన నామములు యోగజములు. వీనియర్థములు ప్రకృతి ప్రత్యయ విభాగ నిగమనము ద్వారా గోచరమగుచుండును.

ఇక లక్షణ వాక్యము నందలి క్రియ పదములు జూతము. ధాత్వర్థము క్రియ. క్రియాజనకములు కారకములు. లక్షణ వాక్యమునందలి నామముల విషయమునను, క్రియలవిషయమునను బెక్కు ఆక్షేపములు గలుగుచుండును. లక్షణ వాక్యములలోనే యే నామపదములను యోజన చేయవలెను? అట్లు యోజింపబడెడి నామపదములకు గల రూఢ్యర్థము గ్రాహ్యమా? లేక ఆ పదములకు యోగశక్తిచే సిద్ధించెడి యర్థము గ్రాహ్యమా? అట్లే ధాత్వర్థముగా నే క్రియ నిట గ్రహింపవలెను? అట్టి క్రియతో నే యే కారకములను యోజనము చేయవలెను? ఉదా:- గచ్ఛన్తి అస్యా మితి గౌః - అను లక్షణ వాక్యము లోని కారకములలో దేనిని యోజనము చేయవలెను? ఇట్లు విచారించి తగిన యుపపత్తుల జూపుచు న్యాయ

మూలకముగ జేయు పరీక్షయే నామ — క్రియా విషయమై చేయు పరీక్ష. ఇది శబ్ద పరీక్ష.

ఇక అర్థ పరీక్ష. దర్శనములుగాని, లేక తంత్రములు గాని యొకే తీఱున నుండవు. ఉన్నచో వాదోపవాదములకు తావే యుండెడిది కాదు. కాని తంత్రము (లేక దర్శనము) లెన్నియైనను వానియందు చాతుర్విధ్యము కాననగును. అందుచే వానిచే ప్రతిపాదింపబడు సిద్ధాంతములందును చాతుర్విధ్యము గోచరించుచుండును. వానినే సర్వతంత్ర సిద్ధాంతము, అధికరణ తంత్రసిద్ధాన్తము, అభ్యుపగమ తంత్ర సిద్ధాన్తము అని చెప్పుదురు.[1]

వీనిని బరిశీలించి పక్ష ప్రతిపక్ష వాదముల ద్వారా అర్థ నిర్ణయము చేయుటయే అర్థపరీక్షారూప మయిన నిరుక్తము. ఇట్టి వాగర్థ పరిశీలనాత్మక పరీక్ష (మీమాంస)కే నిరుక్త మని పేరు. న్యాయ మీమాంసాది శాస్త్రములు, వానిచే ప్రవర్తితము లయిన న్యాయములు నిరుక్తమున కంగములు.

భరత నాట్యశాస్త్రము గాని, తద్వ్యాఖ్యాత యగు అభినవగుప్తుడు గాని వివరించిన ఈ నిరుక్తలక్షణము, యాస్కనిరుక్తానుగుణముగనే యున్నది.

"అర్థనిత్యః పరీక్షేత .... .... నైకపదాని నిర్బ్రూయాత్"

—నిరు. 2-1 నుండి 3.

"అర్థ ప్రాధాన్యేన అనాదృత్య స్వర సంస్కారౌ పరీక్షేత । తత స్తదభిధానం బుద్ధ్వా కేనచి దర్థ వృత్తిసామాన్యేన క్రియాగుణ సామాన్యేనే త్యర్థః, కతమస్మా ద్ధాతో రర్థసామాన్య మిహాస్తీతి ।
తతః తస్య(?)ర్కయిత్వా సామాన్యం తేన నిర్బ్రూయాత్ । అర్థో హి ప్రధానమ్, తద్గుణభూత శ్శబ్దః । తస్మా దర్థ సామాన్యం బలీయః, శబ్దసామాన్యాత్ .... .... ....."

1. సర్వతంత్రా విరుద్ధః తంత్రేఽధి కృతోర్థః సర్వతంత్ర సిద్ధాన్తః
2. సమాన తంత్రసిద్ధః పరతంత్రాసిద్ధః ప్రతితంత్ర సిద్ధాన్తః
3. యత్సిద్ధా వన్యప్రకరణసిద్ధిః సోఽధికరణసిద్ధాన్తః
4. అపరీక్షితాభ్యుపగమా త్తద్విశేష పరీక్షణ మభ్యుపగమసిద్ధాన్తః

— గౌత—న్యా-సూ. 1-1-28 నుండి 31.

"నైక పదాని నిర్బ్రూయాత్ — ప్రకరణోప పదరహితాని సన్తి
కేవలాన్యేవ పరేణాభి ద్రోహబుద్ధ్యా పృచ్ఛ్యమానాని న నిర్బ్రూ
యాత్ । కిం కారణమ్ । తేషాం ప్రకరణాత్ ఉపపదా ద్వా
అర్థః శక్యతే అవధారయితుమ్। సోఽసౌ ప్రకరణానభిజ్ఞోఽ
న్యథైవ నిర్బ్రూయాత్ । తతశ్చ ప్రత్యవాయేన యోగాత్
అపహాస్య శ్చ స్యాత్ .... .... .... దుర్గాచార్యభాష్య

వేదపదములను ప్రకరణమునుండి వేఱు చేసి వానికి నిర్వచనము చెప్పరాదు అట్లు చెప్పుచో కొన్నియెడల నా పదములచే అనభిమతార్థము గాని, విపరీతార్థము గాని, బోధింపబడెడి ప్రమాదము గలదు. అందుచే మొదట తగిన యుపపత్తుల ద్వారా న్యాయానుగుణముగను, ప్రకరణానుగుణముగను, శ్రుతిసంవాదాదుల చేతను పరీక్షించి యర్థమును బోధించుట కనుగుణముగ లక్షణాత్మక నిర్వచనమును జెప్ప వలెను. ఈ నిర్వచనాత్మక మగు లక్షణమున కనుగుణముగ వ్యాకరణ సంస్కార మును దర్శింపవలెను. అంతియే కాని మొదటనే ఏదియో యొక ధాతువునుండి యా పదములను నిష్పన్నము జేసి, ఆ వ్యాకరణ సంస్కారము నాధారము జేసికొని స్వకపోలకల్పిత మగు నేదియోయొక యర్థమును జెప్పరాదు — అని భావము.

## నిగమ నిరుక్తలక్షణములు - స్వాభావికార్థబోధకత్వము :

o—•—o—o—o

వేదవాక్యార్థ నిర్ణయమునకై ప్రవర్తిల్లిన పూర్వోత్తర మీమాంసాదర్శ నములను వేదపదముల యర్థనిర్ణయ విషయమున నిరుక్తశాస్త్రసంప్రదాయమునే యనుసరించినవి.

"పతః పర మవిజ్ఞానమ్-" జై.సూ 1-2-41
"విద్య మానోఽప్యర్థః ప్రమాదాల స్యాదిభిః నోపలభ్యతే । నిగమ
నిరుక్తవ్యాకరణ వశేన ధాతుతోఽర్థః కల్పయితవ్యః" -శాబరభాష్య.
"యత్తు పరం కారణ మవిజ్ఞేయత్వ ముక్తం త దయుక్తమ్ । సత ఏవా
ర్థస్య పురుషాపరేధానా విజ్ఞానాత్ । తత్ర చ అర్థ ప్రకరణ సూక్త
"దేవతార్థ నిగమ నిరుక్త వ్యాకరణ జ్ఞానాన్యధిగమోపాయాః".
— తంత్రవార్తికమ్.

వేదపదములకు- మంత్రములకు - అర్థము సిద్ధమై యున్నను ప్రమాద - ఆలస్యాది దోషముల వలన తెలియబడదు. అట్టియెడ నిగమ నిరుక్త వ్యాకరణాదుల ద్వారా ధాత్వర్థమును కల్పించి సిద్ధమై యున్న యర్థమును దెలియవలెను— అని అర్థము. ఇట నిగమ నిరుక్తాదులు సిద్ధమైయున్న యర్థమును దెలియుటకు ఉపాయములు మాత్రమే- అని చెప్పబడినది. కాన ఈ నిగమ నిరుక్తాదులచే దెలియబడెడి యర్థము అపూర్వార్థము కాదు ; సిద్ధమే ; స్వాభావికమే- అని తెలియును.

ఇట నిర్దేశింపబడిన నిగమము యొక్కయు నిరుక్తము యొక్కయు స్వరూపము పంచపాదికా వివరణ గ్రంథమునం దిట్లు వివరింపబడినది.

"తత్ర నిగమ నిరుక్త వ్యాకరణానాం ఏవంరూప పదార్థాను గమ హేతూనాం విద్యమానత్వాత్ తద్బలేన అర్థ మనుగమ్య వాక్యార్థావగతి ర్యుక్తా"

— పంచపాదికా 4 వర్ణక.

"నిగమో నామ ప్రసిద్ధార్థ తదవయవౌ పరిత్యజ్య శబ్దస్య శబ్దైకదేశానుగ మేన అర్థాంతరేవృత్తిః । యథా దేహాత్మాది శబ్దానాం ఉపచితవస్తు సంతతగమనవ త్పదార్థాదా వేకదేశానుగమేన వృత్తిః । ప్రసిద్ధార్థ తదవయవోపాదానేన అర్థాంతర వృత్తౌ లక్షణాగుణవృత్తి ప్రసంగాత్ నిరుక్తంనామ శబ్దస్య సర్వావయవార్థానుగమేన ప్రసిద్ధా దర్థాత్ అర్థాంతరే వృత్తిః. యథా సోమశబ్దస్య పార్వతీసహిత మహేశ్వరే వృత్తిః ।"

— పంచపాదికా వివరణమ్

"ప్రసిద్ధార్థకములైన పదములతోపాటు అప్రసిద్ధార్థకపద మేది యైన గన్పట్టుచో నంతమాత్రమున ప్రధాన వాక్యార్థ త్యాగము యుక్తముకాదు. గ్రంథ తాత్పర్యానుగుణముగను, ప్రకరణానుగుణముగను వాక్యార్థమును నిర్ణయింపవలెను. దాని ననుసరించి అప్రసిద్ధార్థక పదమునకు గూడ అర్థమును దర్శింపవలెను. ఆ పదముచే లక్షణీయమగు నర్థమును దర్శించుటకై నిగమ నిరుక్తాది సాహాయ్యముచే లక్షణవాక్యమును జెప్పి తదనుగుణముగ వ్యాకరణబలముచే ప్రకృతి ప్రత్యయ విభాగరూప సంస్కారమును దర్శింపవలెను. కాన నిగమ నిరుక్త వ్యాకరణ ములు పదార్థానుగమహేతువులు - పదార్థజ్ఞానోపాయములు.

నిగమ మనగా ప్రసిద్ధార్థమును తదవయవములను విడిచిపుచ్చి శబ్దైకదేశ[1] సామాన్యమును (శబ్దగత ధాత్వర్థ(క్రియా సాదృశ్యమును) బురస్కరించుకొని యొక శబ్దము అర్థాంతరముల బోధించుట.

ఉదా :- (1) దేహః :- ఈ పదమునకు వివిధావయవోపేతమైన ప్రాణిశరీరరూప మగు అర్థము ప్రసిద్ధము.

"సంతాపయతి స్వం దేహ మాపాదతలమ స్తకః-నారాయణీయమ్
"మరీచయః స్వాయంభువాః యే శరీరాణ్యకల్పయన్। తే తే దేహం కల్పయన్తు"
తై. అ॥ 2-2

ఈ పదము 'దిహ ఉపచయే' - అను ధాతువునుండి నిష్పన్నమైనది. వృద్ధి నొందింపబడునది యని యర్థము ఈ పదము ప్రసిద్ధశరీరరూపార్థమునసే కాక ధాత్వర్థ (క్రియా) సామాన్యమును బురస్కరించుకొని 'మూర్తి ; రూపము లేక స్వరూపము' ఇత్యాద్యన్యార్థము లందును వర్తిల్లుచుండును.

"భాతి ప్రసృతి దిక్కాలబాహ్యం చిద్రూపదేహకమ్" —మహోపనిషత్ 4-42
"యస్య ఛందోమయం బ్రహ్మ దేహ ఆవపనం విభో
శ్రేయసాంతస్య గురుషు వాసోఽత్యన్త విడంబనమ్
"శబ్దార్థాకావ్యస్యదేహః" - భాగం 10-80-40.

ఇచట దేహపదమునకు ప్రసిద్ధమగు శరీరరూపార్థము కాని తదవయవము గాని గ్రహింప వలనుపడదు. కాన వానిని పరిత్యజించి ఉపచయరూప కేవలధాత్వర్థ సామాన్యమును పురస్కరించుకొని 'మూర్తి ; రూపము లేక స్వరూపము' - అను అన్యార్థము అందే ఇట దేహశబ్దము వర్తిల్లును. (కాయో దేహః క్లీబపుంసోః స్త్రియాం మూర్తిస్తనుస్తనూః - అమరః)

(2) ఆత్మా :- ఈ పదమునకు జీవుడు (జీవాత్మ) - పరమాత్మ - అను నర్థములు ప్రసిద్ధములు

1. శబ్దస్య ఏకదేశః పూర్వోక్తః. 'అగి'ధాతుః ప్రదేశః తత్ర భవో గుణో గతి రూపోఽర్థః - చూ. అగ్నిశబ్దనిర్వచనమ్. పా భా. ఋ. 1-1-1.

'సూర్య ఆత్మా జగత స్తస్థుష శ్చ - ఋ. -115-1
'ఆత్మన ఆకాశ స్సంభూతః' - తై. ఆనందవల్లి.

ఈ పదము 'అత సాతత్యగమనే' - అను ధాతువునుండి నిష్పన్నమై యీ ప్రసిద్ధార్థమునందే కాక సతతగమనరూప ధాత్వర్థసామాన్యమును (శబ్దైకదేశానుగమమును) బురస్కరించుకొని యత్నము, ధైర్యము, అంతఃకరణము, స్వభావము, సారము - ఇత్యాద్యన్యార్థములయందును వర్తించును.

'ఆత్మన్వన్నభో దుహ్యతే' - ఋ. 9-74-4
"ఆత్మన్వత్-ఆత్మవత్ - సారవత్" —సా. భా.
"సింధుష ప్లవ మాత్మన్వంతమ్" — ఋ. 1- 82-5
"ఆత్మన్వంతం దార్ఢ్యవంతం" - సా. భా.
"నౌభి రాత్మన్వతీభిః" - ఋ 1-116-3.
ఆత్మన్వతీభిః ఆత్మీయాభిః యువయోః స్వభూతాభి రిత్యర్థః । యద్వా ధృతి రాత్మా । ధారణవతీభి రిత్యర్థః" - సా. భా.
"ఆత్మవాన్ కో జితక్రోధః - శ్రీమద్రామాయణ 1-1-4.

ఆత్మవాన్ ధైర్యవాన్-"ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మని" ఇత్యమరః అప్రకంప్యధైర్య ఇత్యర్థః - గోవిందరాజీయ (చూ. మహేశ్వరీయ)

"కావ్యస్యాత్మా ధ్వనిః' - ధ్వన్యాలోక.

ఇట్లు ప్రసిద్ధార్థమును విడిచి అన్యార్థములందు వర్తిల్లుట నిగమము. ఇది లక్షణావృత్తి కాదు; గౌణవృత్తియు కాదు [1]

---

1. కావ్యస్యాత్మా ధ్వనిః - ఇట 'ఆత్మేవ ఆత్మా' అని వ్యాఖ్యానించుచు కొందఱు వ్యాఖ్యాతలు (చూ. బాలప్రియావ్యాఖ్య) ఈ ఆత్మశబ్దప్రయోగ మిట ఔపచారిక మనిరి. అనగా ధ్వని కావ్యమునకు జీవితము వంటిది - అని యర్థము. జీవితం వ్యంగ్యవైభవమ్ - 'ఇత్యాద్యాలంకారిక వచనముల ననుసరించి ఇట్లు చెప్పుట ఆలంకారికముగ యుక్తమే యని తోచుట. కాని 'కావ్యమునకు సార

ఇక నిరుక్త మనగా శబ్దమునకు గల సర్వావయవార్థానుగతిని ఋస్కరించుకొని ప్రసిద్ధార్థమును విడిచి యా శబ్దమునకుగల వేఱొక యర్థమును జెప్పుట. ఉదా :- సోమః, ఈ శబ్దమునకు చంద్రుడు, సోమరసము - ఇత్యాద్యర్థములు ప్రసిద్ధములు. ఉమయా సహితః సోమః - అను నిర్వచనము ననుసరించి సర్వావయవార్థానుగుణముగ పార్వతీసహితుడగు పరమేశ్వరుడను నర్థమును బోధించుట నిరుక్తము - అని భావము.

ఈ పంచపాదికా వివరణాది గ్రంథముల ననుసరించి నిగమ నిరుక్తములకు స్వల్పభేద మున్నట్లు కాననగును. కాని ఈ కొలది భేదమును పాటింపక మొత్తమును నిరుక్తమని వ్యవహరించుటయు గలదు.

వేదపదములు ప్రకరణానుగుణముగ అధికారి భేదము ననుసరించి వివిధార్థములు బోధించు సామర్థ్యము కలవి. సాధకుడు ఒకే మంత్రము నందు యాజ్ఞికుడై అధియజ్ఞ పరముగను, దేవతోపాసకుడై అధిదైవపరముగను, ఆత్మవేత్తయై అధ్యాత్మపరముగను నర్థముల దర్శించును (చూ - కవి - కావ్య ధాతి, ఛందస్ శబ్దములు). ఇట్లు ఆత్మవిత్ - నైరుక్త (ఉపాసక) - యాజ్ఞికులు దర్శించు ఈ యర్థములు మూడును మంత్రములకు స్వాభావికములే - సిద్ధములే; కల్పితములు కావు. కాన నన్నియు గ్రాహ్యములే. 'యాజ్ఞిక పక్షము వేఱు; నైరుక్త పక్షము వేఱు; అధ్యాత్మిక పక్షము వేఱు; ఇవి పరస్పరభిన్నములు. విరుద్ధములు'- అని తలచుట యుక్తము కాదని నిరుక్తభాష్యకర్త దుర్గాచార్యు డిట్లు తెల్పుచున్నాడు.

"ఉభయే హి ప్రమాణమ్ భేదాభేదవాదిన ఆత్మవిద్ - నైరుక్త-
యాజ్ఞికాః । న హి తే స్వ మనీషికయా భేదాభేదౌ ప్రకల్ప
యన్తి - - - - అస్తి హి శబ్దార్థయోః వక్తృప్రతిపత్త్రవశేన

భూతము ధ్వని'- అను ముఖ్యార్థమును గ్రహించినను ఈ వ్యాఖ్యాతలు చెప్పిన యర్థము లేక ప్వారస్యము అర్థా త్సిద్ధ మగుచునే యున్నది. ఇట్టియెడ సాయణుడు 'సారభూతము, స్వభూతము' అనెడి ముఖ్యార్థములనే గ్రహించుట పైన నుదాహరింపబడినది. ముఖ్యార్థము సంభవించునపుడు లక్షణావృత్తికి తావేది ? కావుననే ఇట 'ఆత్మ'పదమును 'తత్త్వ' మని ఆనందవర్ధనుడును 'సారభూతం' అని అభినవగుప్తుడును అర్థమును వివరించుట గమనార్హము.

తద్బుద్ధ్యపేక్షయా అన్వయవ్యతిరేకాభ్యాం వర్తితుం శక్తిః।
న తు స్వాభావికం అభిధానాభిధేయ సంబంధం అకృతకం
అప్రచ్యవమానం అభిధానాభిధేయా జహీతః । న హ్యగ్నే
రవభాస్యం ప్రత్యవభాసనశక్తేః, అవభాస్యస్య చావభాస్య
మానతా శక్తిః వ్యవధాన మంతరేణ విహన్యతే । న హ్యాకృతకం
స్వయ మవ్యధీశం కో ఽకల్పతే వైదికానాం పదవాక్యప్రమా
ణానామ్ । 'ఆత్మభావానుశయ వశేన ఆత్మవిత్ - నైరుక్త
యాజ్ఞికా వేదస్యావిపర్యాసేపి మపి అధ్యాత్మాధి
దైవాధియజ్ఞ విషయనియతా మర్థాభిధానశక్తిం విపర్యాసి
నీ మివ మన్యమానాః పరస్పరతో విపర్యస్యన్తే ।

—నిరు 7.5 దుర్గాచార్య భాష్య.

అగ్నికి వివిధ పదార్థముల భాసింపజేయు శక్తి స్వాభావికము. అట్లే అగ్నిచే భాసింపజేయబడెడి శక్తియు పదార్థములకును స్వాభావికము. ప్రతిబంధము లేని యపుడు అగ్నికి గల పదార్థావభాసనశక్తియు, పదార్థమునకుగల భాస్యమానతా శక్తియు సహజముగనే ప్రస్ఫుటమగుచుండును. అట్లే ప్రతిబంధము లేని యపుడు శబ్దములకు గల యర్థావభాసనశక్తి సహజముగనే అభివ్యక్త మగుచుండును. అర్థ విషయమున గూడ నిట్లే భాస్యమానతాశక్తియు ప్రస్ఫుట మగుచుండును. వైదిక శబ్దములకు అధ్యాత్మ-అధిదైవ-అధియజ్ఞాది వివిధార్థావభాసనశక్తి స్వాభావికము; కల్పితము కాదు. పదవాక్యప్రమాణజ్ఞు లగు వేదవేత్త లెవరును గూడ నీ యర్థముల విషయమున నెట్టి వికల్పముల జూపరు. సాధకునకు గల ఆత్మభావ (శ్రద్ధా-భావనా)-అనుశయ (సంస్కారు) ముల ననుసరించి యీ త్రివిధము లగు అర్థములు భాసించుచుండును. స్థూలముగ జూచుచో నీ యర్థముల యందు పరస్పర భేదము విరోధము నున్నట్లు భాసించును. సూక్ష్మదృష్టితో-అనగా సంప్రదాయానుగతమైన సమన్వయదృష్టితో పరిశీలించినచో భేదము గాని, విరోధము గాని ఆభాస మాత్రమే యని ప్రస్ఫుటమగును. వాస్తవముగ నీ యర్థములయం దెట్టి విపర్యాసము లేక పోయినను ఉన్నదని కొందఱు పండితులు తలచుచున్నారు - అవి భావము.

వాక్యపదీయము నందును ఈ విషయ మిట్లు స్పష్టముగా వివరింపబడినది

"ఏకో మంత్ర స్తథాధ్యాత్మ మధిదైవ మధిక్రతు ।
అసంకరేణ సర్వార్థో భిన్నశక్తి ర్వ్యవస్థితః ॥

— వాక్యపదీయ 2.26

ఈ వాక్యపదీయ శ్లోకమును పుణ్యరా జిట్లు వ్యాఖ్యానించినాడు.

"తదైకదర్శన ఏవ ప్రక్రియాం దర్శయతి-ఏకో మంత్ర ఇతి
తథాచైక ఏవ మంత్రః ఆత్మన్యపి, జపావసరే దేవేష్వపి,
క్రతౌ యజమానసమయేఽపి వినియుజ్యతే । భిన్నశక్తిత్వా
దసాంకర్యేణ ప్రతినియతార్థతయా వ్యవస్థితిం లభత ఇత్యర్థః".

ఒకే మంత్రము ఎట్టివిపర్యాసము గాని, సాంకర్యము గాని లేక యే ఒక సాధకునకు భిన్న భిన్న దశలయందు అధియజ్ఞ—అధిదైవ—అధ్యాత్మపరము లగు త్రివిధార్థముల ప్రకాశింపజేయు స్వభావము గలది. కావుననే ఒకే మంత్రము ఆత్మవిషయమునను, జపధ్యానాద్యవసరములయందు దేవతావిషయమునను, కర్మానుష్ఠానసమయమున క్రతువు నందును వినియోగింపబడుచున్నది – అని భావము

అన్యా సంస్కార గాయత్రీ కర్మ ణ్యన్యా ప్రయుజ్యతే ।
అన్యా జపప్రబంధేషు సా త్వేకైవ ప్రతీయతే ॥ 2-261.

గాయత్రీమంత్రము ఉపనయనాది సంస్కారములయందును, క్రతువు లందును, జపాదులందును వినియుక్తమగుచున్నది. ఇట్లు వినియోగ భేదమున్నను మంత్రము నందు భేదము లేదు. మంత్ర మొకటియే: ఈ మంత్రము అధియజ్ఞము సౌరమండలపరము, జపావసరమున అధిదైవతముగ సూర్యదేవతాధ్యానపరము, మన నానంతరము ధ్యానసమయమున ఆధ్యాత్మికముగ బ్రహ్మపరమై ప్రత్యగాత్మధ్యాన పరము, (ఏక ఏవ గాయత్రీమంత్రో మననోత్తరం ధ్యానావసరేఽధ్యాత్మం బ్రహ్మరూపతయా ప్రత్యగాత్మనో ధ్యానపరః, జపావసరేఽధిదైవతం సూర్యదేవతాధ్యాన పరః; కర్మసు చాధిభూతం సౌరమండలపరః-రఘునాథశర్మ వ్యాఖ్య)

కావున సాధకుడు శ్రద్ధా-భావనా-సంస్కారాతిశయాదుల ననుసరించి- అనగా అధికారి భేదము ననుసరించి ప్రకరణాద్యనుగుణముగ వేదపదములకు గల

స్వాభావికము లగు నీ త్రివిధార్థముల దర్శింపవలసియున్నది. అట్లు దర్శించు నపుడు కొన్ని యెడల ప్రసిద్ధార్థముల విడచి పరోక్షము లగు నీ స్వాభావికార్థముల దర్శింప జేయుటకై నిగమ - నిరుక్త - వ్యాకరణము లావశ్యకము లైనవి. కల్పితార్థముల దర్శింపజేయుటకు కాదు.

ఇట్లు చెప్పుచో 'అన్యాయ్యం చానేకార్థత్వమ్ - ఒక పదమునకు లేక మంత్రమునకు అనేకార్థముల జెప్పుట న్యాయవిరుద్ధము' - అనెడి న్యాయముతో విరోధము సంభవించుట లేదా? అను ప్రశ్న యుదయించుట సహజము. కర్మానుష్ఠానసమయమున అధియజ్ఞపరముగనే మంత్రార్థముల దర్శింప వలసియున్నది. అట్లే యుపాసనాసమయమున అధిదైవమాత్రపరముగను, జ్ఞానయోగమున అధ్యాత్మమాత్రపరముగను మంత్రార్థము దర్శింపవలెను. యజ్ఞపరమయిన యర్థము జెప్పదగిన సమయమున నిగమ నిరుక్తాదుల సాయముతో అన్యార్థకల్పన గాని, అనేకార్థకల్పనము గాని చేయుట న్యాయవిరుద్ధము. అట్లే యితర ప్రకరణము లందును— అంతియే కాని అధికారి భేదము ననుసరించి యా మంత్రముల కధియజ్ఞ-అధిదైవ-అధ్యాత్మపరముగ ప్రస్ఫుటము లయ్యెడి యన్యార్థముల దర్శించుట న్యాయవిరుద్ధ మని తాత్పర్యము గాదు. అట్లు అన్యార్థముల దర్శించుట న్యాయవిరుద్ధమే యగుట తాత్పర్య మన్నచో "ఇత్యధియజ్ఞమ్, ఇత్యధిదైవమ్, ఇత్యధ్యాత్మమ్" - ఇత్యాది శ్రుతి వచనతాత్పర్యముతో విరోధము సంభవించును. అనగా - ఒకే వస్తువును ప్రకరణానుగుణముగ అధియజ్ఞ—అధిదైవ—అధ్యాత్మరూపముల దర్శించుట శ్రుత్యభిమతము మఱియు శ్రుతియె స్వయముగ — 'ఋచో అక్షరే పరమే వ్యోమన్,' 'చత్వారి శృంగా' ఇత్యాది మంత్రములను భిన్న భిన్న ప్రకరణములలో భిన్నార్థకములుగ నుదాహరించుటయు సంగతము కాకపోవలసివచ్చును ఇది గమనార్హము. మఱియు—

"నానావిధైరభిప్రాయైః ఋచో దృష్టా మహర్షిభిః ।

—మాధవీయ ఋగ్వేదానుక్రమణికా—పే 54.

మహర్షులు ఋక్కులయందు బహ్వర్థముల దర్శించిరి—యనెడి సంప్రదాయ వచనములును అసంగతములు కావలసి వచ్చును. మఱియు గో - అశ్వాది పదములు నానార్థబోధకము లని వైదికనిఘంటువుల వలనను నిరుక్తాదుల వలనను దెలియును ఇవియు నసంగతము లగును కాన ప్రకరణవిరుద్ధముగ ననేకార్థకల్పనము చేయుట

న్యాయ బద్ధమని చెప్పుటయే యీ న్యాయతాత్పర్యమని గ్రహించుట సమంజసము.

వేదముల కిట్లు నిగమనిరుక్తాది సాహాయ్యముతో నన్యార్థముల జెప్పు సమయమున లక్షణావృత్తికి గాని గౌణవృత్తికి గాని ప్రవృత్తి లేదని పై వివరణ గ్రంథము వలన స్పష్ట మైనది (ప్రసిద్ధార్థ తదవయవోపాదానేన అర్థాంతరప్రవృత్తౌ లక్షణాగుణవృత్తిప్రసంగాత్)

కావుననే బ్రహ్మశబ్దమునకు గల లోకప్రసిద్ధము అయిన వేద – బ్రాహ్మణ – కమలాసనాద్యర్థముల బరిత్యజించి నిగమ (నిర్వచన) పూర్వకముగ శబ్దైకదేశ– 'బృహి' ధాత్వర్థక్రియానుగతిని బురస్కరించుకొని ప్రకరణానుగుణముగ నిరతిశయ మహత్త్వసంపన్నము, దేశకాలాద్యపరిచ్ఛిన్నము నగు బ్రహ్మవస్తువు నర్థముగా సంప్రదాయజ్ఞులు చెప్పినారు.

"ధ్రువ మేకాక్షర మిదం స్వాత్మన్యేవ వ్యవస్థితమ్ ।
బృహత్వా ద్బృంహణత్వా చ్చైవ తద్బ్రహ్మే త్యభిధీయతే"॥

— వాయు. పురా. 104.

శ్రీ శంకరాదులును బ్రహ్మసూత్ర జిజ్ఞాసాధికరణమున బ్రహ్మశబ్దము నిట్లే నిర్వచించిరి.

ఇటులే హిరణ్యగర్భ, ప్రజాపతి శబ్దములకు గల ప్రసిద్ధార్థముల విడిచి ప్రకరణాద్యనుగుణముగను, యోగశక్తి చేతను నవి ఇంద్రపదములని పూర్వమీమాంసాదర్శనమున హిరణ్యగర్భాధికరణమున (1 – 3 – 13 నుండి 17) నిర్ణయింపబడినది. (చూ – శాస్త్రదీపికా, – సోమనాథీయమ్)

ఇట్లు బ్రహ్మ, హిరణ్యగర్భాది పదములకు చెప్పబడెడి ఈ యర్థములు లాక్షణికములు గాని, గౌణములును కావు. నిగమ సిద్ధములై స్వాభావికములగు ముఖ్యార్థములే. ఈ యర్థము లనధికారుల కప్రసిద్ధములు కానచ్చును కాని స్వాభావికములు (చూ. పతః పరమవిజ్ఞానమ్ – జై – సూ) అట్లే వేదనామముల విషయమునను దెలియ నగును. వేదమునకు గల యనేక నామములలో వేదః శ్రుతిః ఆమ్నాయః– ఇత్యాది నామములకు వేదరూపార్థము ప్రసిద్ధము. స్వాహా, స్వధా, వషట్ ఇత్యాది నామములకు పై వానికి వలె వేదరూపార్థము కొందఱకు ప్రసిద్ధము

కాకపోవచ్చును. ఈ పదములకు గల కొన్ని యర్థములే ప్రసిద్ధములై వానికి పొడగట్టవచ్చును. ప్రసిద్ధమైనను ఈ నామములకు గల వేదయూపార్థము స్వాభావికమే. లాక్షణికము గాని గౌణము గాని కాదు - అని పై గ్రంథసందర్భము వలన స్పష్టమగును.

## వేదము నిగమము : వేదపదములు నిగమములు

—o-o-o-o-o-o-o-o—

వేదమునకు నిగమ మనియు, వేదపదములకు నిగమము లనియు ప్రసిద్ధి. వేదమునకును వేదపదములకునుగల నిగమ మనెడి ప్రసిద్ధిని గూర్చి పరిశీలించినను నిగమస్వరూపము, నిగమ నిరుక్తాద్యావశ్యకతయు తేటపడును. వేదపదములు నిగమములని యాస్కుడు నిరుక్తమున నిట్లు చెప్పబడుచున్నది.

"సమామ్నాయః సమామ్నాతః । స వ్యాఖ్యాతవ్యః । త మిమం
సమామ్నాయం నిఘంటవ ఇత్యాచక్షతే । నిఘంటవః కస్మాత్ ।
నిగమా ఇమే భవన్తి । ఛందోభ్యః సమాహృత్య సమాహృత్య
సమామ్నాతాః । తే నిగంతవ ఏవ సన్తో నిగమనా న్నిఘంటవ
ఉచ్యన్త ఇత్యౌపమన్యవః" -నిరు 1- 1

"విశ్చయేన అధికం వా నిష్కృష్య నిగూఢార్థా ఏతే పరిజ్ఞాతా
స్సన్తో మంత్రార్థాన్ గమయన్తి జ్ఞాపయన్తి । తతో నిగమ
సంజ్ఞా ఇమే భవన్తి । .... .... ఏతే మన్త్రార్థ నిగమ యిత్వ
త్వాత్ ఉభయేఽపి నిగంతవ స్సన్తో నిగమనా ద్ధేతోః నిఘంటవ
ఉచ్యన్త ఇత్యౌప మన్యవః" – దుర్గాచార్యభాష్యం.

నిరుక్త శాస్త్రారంభమును జేయుచు యాస్కుడు నిఘంటువ్యాఖ్యానావశ్యకతను నిరూపించుచుకై 'నిఘంటు' పద నిర్వచనము లిట్లు ప్రవచించినాడు. "గవాది దేవపత్న్యంత రూప మగు వేదశబ్దసమామ్నాయము ఋషులచే నిఘంటు గ్రంథరూపమున క్రోడీకరింపబడి యున్నది. (సమామ్నాయః సమామ్నాతః). దీనిని వ్యాఖ్యానింప వలసిన యావశ్యకత యున్నది. ఏలయన ఈ సమామ్నాయమును (ఈ కోశమున పఠింపబడిన శబ్దములను) నిఘంటువు లందురు. ఇవి నిఘంటువు లని ఏల యనబడుచున్నవి ? ఇవి నిగమములు గాన (యనబడుచున్నవి). ఈ నిఘంటువులు (వేద పదములు) నిగూఢార్థములు. పరీక్ష చేసి వీని యందలి

నిగూఢార్థములు బాగుగ దర్శింపబడుచో నివి మంత్రముల యొక్క నిర్ణీతార్థముల దెలియుజేయును. (ని - నిశ్చయేన, గమయన్తి - జ్ఞాపయన్తి). అందుచే వీనికి నిగమములు—అని యన్వర్థసంజ్ఞ మఱియు ఏ యే పదముల యర్థసామర్థ్యముల నుదాహరణ భూతములుగా గ్రహించినచో నిఖిలమంత్రార్థపరిజ్ఞానము సులభసాధ్య మగునో, సామర్థ్యోపేతము లయినట్టి ఈ పదములు ఛందస్సులనుండి (వేదముల నుండి) యేర్చి కూర్చి సంకలనము చేయబడినవి. ఇట్లు విశిష్ట శక్తి సంపన్నము లగుటచే-నిగమము లగుటచే — ఈ నిఘంటువుల వ్యాఖ్యానావశ్యకత యెంతేని గలదు. నిగమము లనగా నిగంతువులు - అనగా నిగూఢ మంత్రార్థ ప్రకాశకములు. అందుచే నివి నిఘంటువు లనబడుచున్నవి"—అని ఔపమన్యవుని యభిప్రాయము-అని యర్థము.

దీనివలన నిఘంటువు లనబడెడి వైదికనిఘంటువు నందలి శబ్దముల యొక్క వ్యాఖ్యానావశ్యకతయు, తద్ద్వారా నిరుక్తశాస్త్రారంభావశ్యకతయు వివరింప బడుట సుస్పష్టము. కాని 'నిగమా ఇమే భవన్తి' అనెడి పై నిరుక్తవాక్యములకు చేయబడిన దుర్గాచార్యుని వ్యాఖ్యానమును కాదనుచు. డాక్టరు లక్ష్మణస్వరూప పండితు డిట్లనువదించినాడు.

"They are words quoted from the Vedas (Ni-gamahs). As these are the quoted words of the Vedas, they are called Nighamuvas on account of their being quoted (Nigamanath."

నిగమముల నుండి—అనగా వేదములనుండి—ఉదాహరింపబడిన వగు టచే ఈ పదములు నిగమములు. ఇట్లు నిగమనము చేయబడుటచే - అనగా నిగమ ములనుండి యుదాహరింపబడుటచే - వీనికి నిఘంటువు లని పేరు — అని యర్థము.

ఈ యాంగ్లానువాదము సరియైనదిగా కనుపట్టదు. నిగమముల నుండి యుదాహరింపబడుట (Quote చేయబడుట) చే ఈ నిఘంటువు నందలి పదములకు నిగమ సంజ్ఞ గలిగినదని వీరభిప్రాయపడిరి. అట్లగుచో వేదములకు నిగమము లని పేరు వచ్చుటకు కారణమేమి ? ఈ విషయము వీరిచే స్పృశింప బడలేదు. నిగమ్ అను ధాతువునకు ఉదాహరించుట (to Quote) అను నర్థమును వీరు

గ్రహించిరి. అందుచే వేదవాక్యము లా యా గ్రంథములలో వేఱ్వేఱు సందర్భములం దుదాహరింపబడుచుండుటచేసి వేదములకు నిగమత్వము సిద్ధించిన దవి యనుకొనవలెనా ? అట్లు ఇతర గ్రంథములం దుదాహరింపబడుటకు పూర్వము వేదములకు నిగమత్వము లేదని యనుకొనవలెనా? మఱియు నీ యర్థమును గ్రహించినందున యీ నిఘంటువుల (నిగమముల) వ్యాఖ్యా వశ్యకత ఏమియు వ్యక్తమగుటలేదు. కాన ఈ పండితుని యనువాదము గాని, తద్వివరణము (notes) గాని నిగమము యొక్క నిగమత్వమును స్పష్టము చేయుట లేదు. ఇంతే కాదు.

యాస్కుడు శాస్త్రారంభమున 'స వ్యాఖ్యాతవ్యః'- అనుచు నిఘంటు వ్యాఖ్యానావశ్యకతను చెప్పుటాని తదుపష్టంభకముగ నిఘంటుశబ్దమునకు నిగమనాత్- అనియే కాక, మఱి రెండు నిర్వచనముల గూడ నిట్లు చూపినాడు.

'అపివాఽఽహననా దేవ స్యుః । సమాహతా భవన్తి । యద్వా సమాహృతా భవన్తి।'

ఇట ని ( = సమ్ ఆఙ్) పూర్వక 'హన్' ధాతువు నుండియు, ని ( = సమ్ ఆఙ్) పూర్వక 'హృ' ధాతువు నుండియు నిఘంటుశబ్ద నిష్పత్తి జూపబడినది. 1 ఈ రెండు నిర్వచనములకును గూడ లక్ష్మణస్వరూప్ పండితుడు గావించిన యనువాదమును జూతము.

Or else the word Nighantavas may be (so called) from being fixed only (√ han), i.e. a list in which they (the words) are fixed together, or collected together (√hr).

ఇట నిఘంటు పదమునకు (1) ని పూర్వక 'హన్' ధాతువునుండి రెండవ నిర్వచనము చెప్పబడి- "దేనియందు ఈ పదములు కూర్చబడినవో

1. సమః స్థానే నీత్యేష నియుక్తః దుర్గాచార్యభాష్య (నిరిత్యేష సమిత్యేష స్థానే - నిరు 1?-7)

(fixed together) అట్టి జాబితా" -అనియు. (2) ని-పూర్వక 'హృ' ధాతువు నుండి మూడవనిర్వచనము చెప్పబడి-"దేనియందు ప్రోగుచేయబడినవో ఆ జాబితా-" అనియు అర్థము కల్పింపబడినది. "నిగమముల నుండి ఉదాహరింపబడినవి. quoted from the Vedas (Ni-gamah)-" అను వీరి మొదటి నిర్వచనము ననుసరించి "నిఘంటవః" అను పదమునకు వైదిక నిఘంటువు నందలి పదములు- అని యర్థము- ఇక తరువాత వీరి ఈ రెండు నిర్వచనములును 'వైదికపదములు' దేనియందు కూర్చబడినవో, లేక ప్రోగుచేయబడినవో (fixed together or collected together), ఆ జాబితా (list) ను- అనగా వైదికనిఘంటువును బోధించుచున్నవే గాని, 'అందలి పదములు నిఘంటువులు'- అను నర్థమును చెప్పుట లేదు. ఇట యాస్కుడు ప్రదర్శించిన మూడు నిర్వచనములును (నిగమనాత్, సమాహతా భవన్తి; సమాహృతా భవన్తి) కోశ (list) రూపనిఘంటువు నుద్దేశించికాదు. ఆ కోశము నందలి పదములు నిఘంటువులు. అట్టి నిఘంటువుల నుద్దేశించియే ప్రవృత్తము లైనవి. నిఘంటువుల (పదముల) నుద్దేశించి కాక, పదసముదాయ రూపమగు నిఘంటువు (list) నుద్దేశించుటయే గ్రంథకర్త తాత్పర్య మగుచో "నిఘంటుః కస్మాత్"- అని నిఘంటుపరముగ ఏకవచనప్రయోగముండి యుండును. అట్లుగాక 'నిఘంటవః కస్మాత్' అని బహువచనప్రయోగమే ఇట గలదు. కాన వీరి యనువాదము గ్రంథకర్తృ తాత్పర్యాను గుణముకాదు.

మఱియు దుర్గాచార్యకృత వివరణమును కాదనుచు, వీరు చేసిన అనువాదము వలన (I. quoted 2) fixed or 3) collected together) ఈ మూడు నిర్వచనముల ద్వారా ఇంచుమించుగ నొకే యర్థము చెప్పుట వీరి లక్ష్యముగా కనుపట్టుచున్నది. ఒక వైశిష్ట్యము, లేక ఒక ప్రత్యేకత బోధింపని యపుడు ఒకే పదమునకు ఈ మూడు నిర్వచనము లేల? వీరు చూపిన ఏ యొక నిర్వచనము యాస్కు డుద్దేశించిన నిఘంటువుల వ్యాఖ్యానావశ్యకతను గాని, శాస్త్రారంభావశ్యకతను గాని ఏమాత్రము వ్యక్తముచేయుట లేదు. కాన నిగమము లనబడు వేదముల యొక్క గాని, వేదపదముల యొక్క గాని నిగమత్వమును దర్శించుటకు వీరి యనువాదము తోడ్పడుట లేదు. ఈ నిగమత్వము దుర్గాచార్యకృతవివరణము నందు ఎట్లు వివరింపబడినదో, అది గ్రంథకర్తృతాత్పర్యానుగుణమై, శ్రౌతసంప్రదాయానుగుణమై ఎట్లు వఱలునో చూతము.

1. ని-గమనాత్- "నిగూఢ మంత్రార్థములను నిష్కృష్టముగ నిశ్చయించి బోధించునవి, ఇవి 'నిగంతువు' లగును నిఘంటువు లన బరగుచున్నవి. కాన వ్యాఖ్యాతవ్యములు"___ ఈ వ్యాఖ్య ననుసరించి నిగమ-నిగంతు- నిఘంటు శబ్దములు మూడును సమానార్థకములు. ఇందు నిగమశబ్దము ప్రత్యక్షవృత్తి గలది- (అనగా ప్రకృతి ప్రత్యయ స్వరూపమును ప్రత్యక్షముగ గోచరింపచేయునది). నిగంతు శబ్దము పరోక్షవృత్తి గలది- నిఘంటుశబ్దము అతి పరోక్షవృత్తి గలది. అనగా ప్రకృతి ప్రత్యయ విభాగ మేమాత్రము గోచరము కానిది. అందుచే నిఘంటు శబ్దమునకు గల సంప్రదాయానుగత మగు అర్థమును మొదట ప్రత్యక్ష వృత్తియగు నిగమశబ్దముచేతను. పిదప పరోక్షవృత్తి యగు నిగంతుశబ్దము చేతను ఔపమన్యవుడు ప్రదర్శించినాడు. దానిని యాస్కు డాదరించినాడు. దుర్గాచార్యుడును యాస్కానుగుణముగ వ్యాఖ్య చేసెను.

మఱియు ని పూర్వక 'గమ్' ధాతువునుండి నిష్పన్నములైన నిగమ-నిగంతు శబ్దములకు దుర్గాచార్యు డొనర్చిన వ్యాఖ్యానము శ్రౌతసంప్రదాయానుగుణమై యుంకుటయు గమనార్హము.

"అవి చికిత్సా యావత్ బ్రహ్మ నిగంతవ్యమితి హారీతః"

అప. ధర్మ సూ. 1-13-11

"నియమపూర్వ మధిగంతవ్య మితి హారీతాచార్యో మన్యతే"- హరదత్తః

ని: సందిగ్ధమైన—నిష్కృష్టమైన జ్ఞానము కలుగు నంతవఱకు బ్రహ్మను (వేదమును) నియమపూర్వకముగ నధ్యయనము చేయవలె నని హారీతాచార్యుడు చెప్పుచున్నాడు- అని యర్థము. ఇట నిగమన మనగా నియమపూర్వకముగ అధ్యయనము చేయుట; కేవలపాఠము కాదు. మంత్రోచ్చారణవిషయమునను, మంత్రార్థ విషయమునను గల్గెడి అసంభావనా విపరీతభావనాదుల బోగొట్టెడి నియమపూర్వ కాధ్యయనమే ఇట నిగమ (నిగంతవ్య) శబ్దముచే ఉద్దిష్టమైనది వేద మట్లు అధ్యయనము చేయదగినది (నిగంతవ్యః) గావున నిగమ మనెడి సార్థకసంజ్ఞతో నొప్పినది. అర్థ జ్ఞాన విషయమున సంశయాదులు తీఱునంతవఱకు వేదపదములు గూడ నట్లే అధ్యయనము చేయబడదగినవి (నిగంతవ్యాః). కాన నిగమాః అను సార్థక సంజ్ఞతో నొప్పుచున్నవి. అట్లు నియమపూర్వకముగా నధ్యయనము చేయబడ దగియున్న

నిగమములు (వేదములు లేక వేదపదములు) జిజ్ఞాసువులకు నిగూఢార్థములను నిష్కృష్టముగా, నిశ్చయముగా, బోధించు స్వభావము గలవియై యుండవలెను. లేనిచో వానినట్లు నియమపూర్వకముగా నధ్యయనము జేయవలసిన యవసర ముండెడిది కాదు; వ్యాఖ్యానావశ్యకతయు నుండెడిది కాదు. కావున- నియమపూర్వకముగ అధ్యయనము జేయుచో అజ్ఞాతమై నిగూఢమై యున్న యర్థమును (పురుషార్థమును) నిగమనము (అభివ్యక్తముగ) చేయునది గావున వేదమునకు నిగమ మని సార్థక సంజ్ఞ- అనియు స్పష్టమైనది. శ్రుతియే వేదవాక్కుల స్వభావమును గూర్చి యిట్లు వివరించుకొనినది,

'ఏతా విశ్వా విదుషే తుభ్యం వేధో నీథాన్యగ్నే వచాంసి
నివచనా కవయే కావ్యాని॥' —ఋ 4-3-16.

సర్వవిధారకుడ వగు ఓ అగ్నీ! (హే వేధః అగ్నే!) ; ఈ వేదవాక్కులన్నియు (ఏతా విశ్వా వచాంసి) నేయార్థములు- గూఢములు (నిణ్యా); వివిధఫల ప్రాపకములు (నీథాని); క్రాంతదర్శివి సర్వజ్ఞుడవు నగు నిన్ను ఉద్దేశించి (కవయే విదుషే తుభ్యం) నియమపూర్వకముగ అధ్యయనము చేసి ఉచ్చరింప దగినవి, నిరంతర మధ్యయనము చేయదగినవి (ని-వచనాని=నితరాం వక్తవ్యాని; నియమేన వక్తవ్యాని—సా.భా. ఋ. 1-189-8). - అని యర్థము.

ఇట వేదవాక్కులు నేయార్థములు -అని చెప్పబడినది. అనగా నిగమ-నిరుక్త-వ్యాకరణాదులచే వీనికి గల యర్థము ఉన్నేయము అగుట సూచితము; అందుచే నివి గూఢార్థకములు. ఈ వాక్కులు క్రాంతదర్శియు, సర్వజ్ఞుడు, సర్వ విధారకుడునగు పరమేశ్వరు నుద్దేశించునవి. అనగా నిరంతరము పరమేశ్వర 'తత్త్వము' (పరమార్థము)ను బోధించుటయే వీని లక్ష్యము. నియమపూర్వకముగ నిగమ-నిరుక్త-వ్యాకరణాది సాహాయ్యముతో నధ్యయనము చేసిన గాని ఈవాక్కుల యొక్క పరమార్థబోధకత్వము, లేక నిగూఢార్థబోధకత్వము అవగతము కాదు. అందుచేతనే ఈ వాక్కులు ని-వచనాని (నియమేన వక్తవ్యాని) -అని యిట శ్రుతిచే నిర్దేశింపబడినవి. దీనివలన వేదవాక్కుల నిగమత్వము స్పష్ట మగుచున్నది. అందుచే 'నిగమా ఇమే భవన్తి'- అను నిరుక్తవచనమునకు దుర్గాచార్యకృత వ్యాఖ్యానమే శ్రుతి తాత్పర్యానుగుణ మనియు, లక్ష్మణస్వరూప పండితకృత వ్యాఖ్యానము కాదనియు స్పష్టమగుచున్నది.

ఇక నిఘంటు శబ్దమునకు యాస్కుడు ప్రదర్శించియున్న మిగిలిన రెండు నిర్వచనములకును దుర్గాచార్యకృత వ్యాఖ్యను చూతము.

2) ని (=సమ్ ఆఙ్) హన్-సమాహతా భవన్తి :— "ఏతస్మిన్ పంచాధ్యాయీ సంగ్రహే మర్యాదయా పఠితా హ్యేతే భవన్తి తస్మాత్ సమాహతాః సమాహన్తవ ఏతే సన్తః - - - - నిఘంటవ ఇత్యుచ్యన్తే" —దుర్గాచార్యః

ఈ పంచాధ్యాయాత్మకమైన గ్రంథమున నొక విశిష్టక్రమము ననుసరించి (మర్యాదయా)—నియమపూర్వకముగ నధ్యయనము లేక ఆమ్నానము చేయవలసిన క్రమము నుద్దేశించి పఠింపబడినవి. కాన నీ పదములు నిఘంటువులు- అని యర్థము_ఇట సమాహతాః అనునది ప్రత్యక్షవృత్తి. సమాహంతవః పరోక్షవృత్తి నిఘంటవః అతిపరోక్షవృత్తి. ఇట 'సమ్ ఆఙ్' స్థానమున 'ని' అను ఉపసర్గము వర్ణలోప వర్ణవికారాదులును వచ్చి నిఘంటుశబ్ద నిష్పత్తి—అని భావము.

వేదమంత్రములందు నియతస్థానములు గల్గియున్న పదములే యిట మంత్రార్థానుసంధానమును సుఖతరము గావించుటకై యొక విశిష్టక్రమమున పఠింప బడినవి. నియమపూర్వకముగ అధ్యయనము చేయబడి నిరంతరము సమామ్నాత మగునట్టిది యగుటచే వేదమునకు సమామ్నాయ మని యన్వర్థసంజ్ఞ. (చూ—శ్రుతి ఆమ్నాయప్రకరణము). ఈ నిఘంటువు లనబడెడి పదములును సాక్షాత్తు వేద పదములే యగుటచే వేదము వలెనే నియమపూర్వకముగ అధ్యయనము చేయబడి నిరంతరము సమామ్నాతములు గావలసినట్టివి నిఘంటువుల యందలి నిగమత్వము మొదటి నిర్వచనముచే చూపబడి, యిపు డీ రెండవ నిర్వచనముచే తద్గత మగు సమామ్నాయత్వ మనెడి మఱియొక విశిష్టత ప్రదర్శింపబడినది. "త మిమం సమామ్నాయం నిఘంటవ ఇత్యాచక్షతే" అని యాస్కుడు సమామ్నాయశబ్ద పర్యాయ వాచకముగా నిఘంటుశబ్దమును కీర్తించుటచే నిఘంటువుల యందలి సమామ్నాయత్వ మనెడి విశిష్టతను అభివ్యక్తము చేయుటకై యీ రెండవ నిర్వచనము చెప్ప బడినది.

3) ని (సమ్ ఆఙ్) హృ-సమాహృతా భవన్తి- "యస్మా ద్వా ఏతే సమాహృతా భవన్తి ఛందోభ్యః తస్మాత్ సమాహరణ క్రియాయోగాత్ సమాహర్తవ

ఏతే సమాహృతా స్సంతః పూర్వవదేవ ఉపసర్గ వ్యత్యయాది క్రమేణ నిఘంటవ ఇత్యుచ్యన్తే"—దుర్గాచార్యః

ఛందస్సుల నుండి గ్రహింపబడిన వగుటచే సమాహరణక్రియా సంబంధముచే సమాహృతము లగుచు నిఘంటువు లని చెప్పబడుచున్నవి- అని యర్థము ఇట సమాహృతాః అనునది ప్రత్యక్షవృత్తి. నిఘంటవః అనునది అతిపరోక్షవృత్తి (ని=సమ్ ఆజ్, హృ)

మంత్రపఠితము లైన పదములే యేఱ్చి కూర్చి (సమాహృత్య సమాహృత్య) ఇట ఆమ్నాతము లైనవి. అట్టి యీ పదములకు మంత్రప్రకరణాద్యనుగుణముగనే యర్థముల దర్శింపవలెను. యాస్కుడును 'నైకపదాని నిర్బ్రూయాత్' -అని శాసించినాడు. కానప్రకరణము నుండి వేఱు చేసి ఇచ్చవచ్చిన రీతిని వీని కర్థము చెప్పరాదు. పదములే కాదు, మంత్రములకు సైతము ప్రకరణముల నుండి వేఱు చేసి యర్థము చెప్ప బూనరాదు. యాజ్ఞ-దైవత-అధ్యాత్మాది రూపప్రకరణాను గుణముగనే మంత్రార్థముల దర్శింపవలెను-అని భావము.

"న తు పృథక్త్వేన మంత్రా నిర్వక్తవ్యాః । ప్రకరణశ ఏవ తు నిర్వక్తవ్యాః" . నిరు 13-12 అనియు శాసించినాడు. ప్రకరణానుగుణముగనే వ్యాఖ్యానింపబడదగిన యావశ్యకత గలదు.

ఈ రీతిగ నిఘంటువుల వ్యాఖ్యానావశ్యకతయు, నిరుక్తశాస్త్రారంభప్రయోజనము చెప్పుటకయియే ఇట మూడు నిర్వచనములను మూడు దృక్పథములతో యాస్కునిచే ప్రవర్తింపబడినవి. తద్ద్వారా వేదపదముల స్వభావము వ్యక్తము చేయబడినది. అందును "మంత్రములు నిగూఢార్థములు; నేయార్థములు; వాని దర్శింపజేయవలసి యున్నది- అని ఏ లక్ష్యముతో ఈ నిఘంటువు ఆమ్నాతమైనదో అట్టి మంత్రార్థ నిగమన మనెడి లక్ష్యము ఈ పదములకు సహజముగ గలదు"- అను విషయమును తొలిదొలుత పాఠకుల కుద్దీపింప జేయుటకే 'నిగమా ఇమే భవన్తి'- అను మొదటి నిర్వచనము యాస్కునిచే జూపబడినది.

నిగూఢార్థబోధక మగు వేదమునకు నిగమః అను నామము సార్థక మయినట్లు, వేదముచే లేక వేదపదములచే నిగమనము ద్వారా (నిగమనాత్) తెలియబడువారగుటచే పరమేశ్వరునకును 'నిగమః'-అని యన్వర్థనామము. మఱియు దుర్గాభిప్రా

మగు ఆత్మతత్త్వమును నిగమనము (జ్ఞాపనము) చేయుట కయియే లీలాగృహీత శరీరుడై యవతరించు నట్టి వా డగుటచేతను పరమేశ్వరునకు నిగమః అని యన్వర్థసంజ్ఞ (చూ. దురధిగమాత్మతత్త్వనిగమాయ తవాత్తతనోః భాగ. 10.22. దుర్బోధం యదాత్మతత్త్వం తస్య నిగమాయ జ్ఞాపనాయ తవ ఆత్తతనోః ఆవిష్కృతమూర్తేః- శ్రీధరః) కావుననే పురాణేతిహాస కావ్యాది వాఙ్మయమునం దంతట వేదము, వేదవేద్యు డగు పరమేశ్వరుడును నిగమ పదముచే పలురీతుల కీర్తింపబడుట కాననగును.

"హంసాయ సంయతగిరే నిగమేశ్వరాయ"

"నమః ప్రమాణ మూలాయ కవయే శాస్త్రయోనయే ।

ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమో నమః"॥ భాగ.10-16-44.

ఇట్లు నేయార్థమై, అధికారి భేదముచే వివిధార్థబోధక మగుచు, శత పథమై, బహువిధఫలప్రదమై (ఋ. 4.3.16) వరలెడి నిగమరూప మగు వేదము కల్పవృక్షము (అభిమతం ఫలం కల్పయతీతికల్పః, స చాసౌ వృక్షశ్చ); తత్ఫల భూతమై తద్వ్యాఖ్యానాత్మకమే శ్రీమద్భాగవతము-అను భావమునుద్దీపింప జేయుటకో యనునట్లు 'నిగమకల్పతరోర్గళితం ఫలమ్'- అనుచు వ్యాసభగవానునిచే శ్రీమద్భా గవతగ్రంథారంభము చేయబడినది. అనగా శ్రీమద్భాగవతము వేదార్థ నిగమనరూప మని తాత్పర్యముగా గ్రహింపనగును.

కాన నిగమశబ్దమునకు దుర్గాచార్యకృత వివరణానుసారముగనే యర్థము గ్రహించుట యుక్తము. అపుడే పైన నుదాహరింపబడిన శ్రుతివాక్యములతోను, పంచపాదికా వివరణాది గ్రంథములతోను సంవాదము లభించును. ఇట్లు నిగమ-నిరుక్త-వ్యాకరణముల ద్వారా వేదపదములకు ప్రకరణానుగుణముగ ప్రసిద్ధార్థమును విడిచి అన్యార్థములను- అలౌకికాధిదైవికాద్యర్థములను- దర్శింపవలసియున్నది. వేదపదముల విషయమై అర్థనిర్ణయ సంప్రదాయ మిది.

## ఆలంకారికులు-నిరుక్తి

—o-o-o—

ఆలంకారికు లీ సంప్రదాయము నాదరించుటయే గాదు; పదములందు యోగశక్తిచే నన్యార్థమును దర్శించుట యలంకార మనిరి.

'నిరుక్తి ర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్' —కువలయానందః

ఇది నిరుక్త్యలంకారలక్షణము. ఇది శ్లేషప్రభేద మని కొందఱనిరి. (నిరుక్త్యలంకారః శ్లేషవిశేష ఏవ'— వామనభట్టీయ-కావ్యప్రకాశికా వ్యాఖ్య). మొత్తము మీద యోగశక్తిచే జమత్కారజనక మగు అన్యార్థ దర్శన మలంకారమగుట యందఱకును సంమతమే. కావున నలంకారశాస్త్రజ్ఞుల దృష్టిలో "నిరుక్తి" శబ్దముల యందలి యొక విశిష్టత, ఒక యలంకారము. వేదవాఙ్మయమున నీ నిరుక్త్యలంకార మడుగడుగున తద్రసాభిజ్ఞులకు పొడగట్టుచునే యుండును. వేదశబ్దములు ప్రకరణానుగుణముగ ప్రసిద్ధ గో- అశ్వ—అగ్ని-ఇంద్ర-వరుణాద్యర్థముల బోధించుచునే రసాభిజ్ఞులగు సహృదయులకు యోగశక్తిచే నన్యరమణీయార్థస్ఫూర్తిని గలిగించుచునే యుండును. ఉదాహరణమునకు ఋగ్వేదము యొక్క మొదటి మంత్రమునే చూతము. "అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్। హోతారం రత్నధాతమమ్." ఇచట అగ్నిపదము యజ్ఞమున ప్రత్యక్షముగ గన్పట్టు జ్వాలారూపుడగు నగ్నినే గాక 'యజ్ఞస్య దేవం, పురోహితం'- ఇత్యాది విశేషణముల సామర్థ్యము వలన యోగశక్తిచే నన్యార్థమును (సర్వవ్యాపకత్వ హోతృత్వాది ధర్మములు గల అప్రాకృత- అగ్ని దేవతారూపార్థమును, మహాగ్ని రూపార్థమును) బోధించుచుండును. (చూ. బ్రహ్మ. స్వాహా, కవి-కావ్య, ఛందః శబ్దములు).

## వేదములు-అన్యభాషాసంపర్కము-చారిత్రక వాదము

—o-o-o-o-o-o-o-o—

ఇట్లు వేదపదము లన్నియు సామాన్యముగ నిరుక్త్యలంకారభూషితములు. చారిత్రికు లిట్టి దృష్టితో వేదస్వరూపమును దర్శింప బూనినట్లు లేదు.

"కేవల నిగమ- నిరుక్త- వ్యాకరణాది సాహాయ్యము చేతనే వేదమంత్రముల యర్థనిర్ణయము జేయ వలను పడదు; ఏలయన మంత్రరచయిత లగు ఆర్యులచే మ్లేచ్ఛభాష లని పిలువబడిన అనార్యభాషలగు యవన- రోమక- ద్రావిడాది భాషల నుండి యనేక శబ్దములు వేదకాలము నుండియు వారి గ్రంధములలో (వేదములలో) ప్రవేశించినవి. ఆర్యులు వీనిని గ్రహించినపు డా యా శబ్దముల కా యా భాషలలో నే యర్థములు గలవో ఆ యర్థములనే గ్రహించి యుంచురు వేఱు విధముగ గాదు. కాన నట్టి శబ్దముల కా యా మ్లెచ్ఛాది భాషాసంప్రదాయముల ననుసరించి యే యర్థ నిర్ణయము చేయవలెను. అంతియే కాని అట్టి శబ్దములకు ఏవియో వ్యుత్పత్తుల గల్పించి, సంస్కృతీకరించి, ఏవియో యర్థముల గల్పించుట యుక్తము కాదు"- అని కొందఱు చారిత్రికుల వాదము.[1] ఇందుల కుపోద్బలకముగ వీరు పూర్వమీమాంసాదర్శనము నందలి పికనేమాధికరణమున గల కుమారిలుని తంత్రవార్తికము నుదాహరించుచు, నిట్లు చెప్పుట కుమారిలున కభిమతమనియు చెప్పుచున్నారు.

తంత్రవార్తికము నెంత పరిశీలించినను మ్లేచ్ఛభాషాపదములు వేదములలో ప్రవేశించి యున్నట్లు చెప్పబడుట గాంచము. అట్టి సూచనలు నేవియు గాన రావు. అన్యభాషాపదములు వేదములలో ప్రవేశించిన వని చెప్పుట కుమారిలభట్టు యొక్క అభిమత మని చెప్పబూనుచో "వేదములు నిత్యములు, అపౌరుషేయములు"- అని యన్యమత నిరాసపూర్వకముగా నాయనచే స్థాపింపబడిన సిద్ధాంతమునకే వ్యాఘాతము సంభవింపగలదు. కాన నట్టి వాదము కుమారిలున కభిమత మనుట యసంగతము. ఆ తంత్రవార్తిక వాక్యములకు ఈ చారిత్రికు లపార్థముల గల్పింపబూని రనుటయే సమంజసము.

పికనేమాధికరణమున పూర్వపక్షమును వివరించు సందర్భమున కుమారిలభట్టు అనార్యభాషాపదములకు, సంస్కృతపదములకు వలె, వ్యుత్పత్తుల కల్పించెడి

(1) కోరాడ రామకృష్ణయ్య - 1. భాషాచారిత్రకవ్యాసములు.
2. దక్షిణదేశభాషాసారస్వతములు-దేశి

(2) సునీత్‌కుమార్ ఛటర్జీ - History of Bengali language.

కొందఱి స్వచ్ఛందప్రవృత్తిని గర్హించినాడు. ఇయ్యది ఆ కాలమునాటి కొందఱి స్వచ్ఛంద ప్రవృత్తిని, దానిని గర్హించి సంస్కృతభాషాసంప్రదాయమును యథాతథముగ సువ్యవస్థితము చేయు శిష్ట ప్రవృత్తిని వెల్లడి చేయును. కాని ఈ గ్రంథ సందర్భమును యథాతథముగ గ్రహింపక "అనార్యభాషాపదములు వ్యుత్పత్తులు కల్పింపబడి, సంస్కృతీకరింపబడి, వేదకాలము నుండియు వేదభాషలో ప్రవేశించి యుండవచ్చు" నని ఈ చారిత్రకులు కల్పింపబూనిరి.

వేదగతములైన పిక నేమాది పదములు అనార్యభాషాపదము లని గాని, విదేశీయ భాషాపదము లని గాని, కుమారిలుడు చెప్పలేదు. అట్టి సూచనలును కానరావు. ఈ పికనేమాదిపదములకు నిగమ - నిరుక్త - వ్యాకరణాదుల ద్వారా వ్యుత్పత్తుల కల్పించుట తగదనియు నిషేధింపలేదు. అనార్య - విదేశీయ భాషాపదములకు, సంస్కృతపదములకు వలె, వ్యుత్పత్తుల కల్పింపబూనుట యుక్తము కాదని నిషేధించుట యందే కుమారిలుని దృష్టి. కాని వేదగతములైన పికనేమాది పదముల విషయమున కాదు. ఇట్టి వేదగతములైన పదములు, తదర్థములు కొన్నియెడల నెవరికైన యప్రసిద్ధములై సందేహము గలుగవచ్చును. అట్టియెడ నా పదములు అవికృతములై అన్యభాషలయందు జేఱి, ఏ యర్థములందైన ప్రసిద్ధములై యున్నచో నా యర్థములు ధర్మావిరుద్ధములై యొప్పుచో ద్వైభాషికుల సాహాయ్యముచే నా యర్థముల గ్రహించుట యుక్తమ"నినాడు. అట్లు గ్రహించినపుడిక నిరుక్తాదులతో పనియేమి? వానికి అర్థవత్త్వ మెట్లు? -అని యనుచో "అపుడును గూడ అట్టి పికనేమాది పదములను నిగమ - నిరుక్త - వ్యాకరణాదుల ద్వారా సుసంస్కృతములై యొప్పవలెను. అట్లు సిద్ధించెడి నామార్థజ్ఞానపూర్వకమైన వాక్యార్థజ్ఞానముతో. విలసిల్లు కర్మానుష్ఠానము వలననే అదృష్టసిద్ధి కల్గును" అనియువ్యవస్థ గావించినాడు. ఇంతియేకాదు. ఇట్లు వేదార్థ నిర్ణయమున నిరుక్తాది శాస్త్రావశ్యకతను ధ్రువీకరించి నిరుక్త శాస్త్రజ్ఞానము సర్వపాపముక్తి హేతువని యిట్లు వివరించినాడు.

"యథా మహాభారత నిర్వచనావ్యాఖ్యానే ద్వైపాయనే నోక్తమ్."
"మహత్త్వాత్ భారతత్వాచ్చ మహాభారత ముచ్యతే ।
నిరుక్తమస్య యో వేద సర్వపాపైః ప్రముచ్యతే"
ఇత్యేవం నిరుక్తవ్యాకరణాద్యంగామనుగృహీత వేదాధ్యయన జనిత
కర్మావబోధపూర్వకానుష్ఠానాయత్తత్వాత్ స్వర్గాది సిద్ధర్థా

పూర్వసిద్ధేః, అవ్యుత్పన్న రూపే చ జ్ఞాతేఽపి నిరుక్తావగత ధాత్వర్థ పూర్వక నామార్థ జ్ఞానద్వార వాక్యార్థ ప్రతిపత్తిపూ ర్వకానుష్ఠానా దేవాదృష్ట సిద్ధి రితి మ్లేచ్ఛ సిద్ధ పికాద్యర్థ గ్రహణేఽపి నిరుక్తా దీనా మర్థవత్తా సిద్ధేతి -

—తంత్రవార్తికమ్ 1 - 3 - 10

మఱియు, సామాన్యముగ దేశభాషలలో సంస్కృతభాషాపదములను, ఇతర భాషాపదములను జేఱుచుండును. కొన్ని యథాతథముగ అవికృతరూపములతోను, కొన్ని వికృతరూపములతోను జేఱుచుండును. అందుచే తత్తద్భాషాస్వరూపమను విశదపఱచుటకై తత్సమము - తద్భవము - దేశ్యము అన్యదేశ్యము- అని యీ రీతిగా పదముల విభాగించి, తదనుగుణముగ తత్తద్భాషావ్యాకర్తలు పూర్వమునుండియు పట్టికలను సిద్ధపఱచుచు వచ్చిరి ఇట్టి సంప్రదాయః మించుమించుగా దేశభాషావ్యాకరణము లన్నిటియందును గాంచగలము. హేమచంద్రుని దేశినామమాల- ఇత్యాది గ్రంథము లట్టివి. కాని సంస్కృతవ్యాకర్త లెవరుగాని, నిరుక్తాది శాస్త్రకర్తలు గాని అట్టి పట్టికల కూర్చియుండుట గాంచము. లేవు— అని చారిత్రికులే యంగీకరించిరి గూడ 1. దీనివలన వేదములయం దన్యభాషాపదములు ప్రవేశించలేదనుట స్పష్టము. పాశ్చాత్య చరిత్రకారులలో ప్రముఖు డగు మాక్సుముల్లరు పండితుడు గూడ వేదముల (వేదభాష) యందును, వేదచోదిత ధర్మస్వరూపమందును, తదనుష్ఠానమునందును విదేశీయసంపర్కము గాని ప్రభావము గాని ఏ మాత్రము లేవు- అని ఘంటాపథముగ నిట్లు జెప్పినాడు.

"After having thus carefully examined all the traces of supposed foreign influences that have been brought by various scholars, I think I may say that there really is no trace whatever of any foreign influence In the language, the religion or the ceremonial of the aancient Vedic literature of India.

— What India can teach us. Page 139 - 140.

(1) కోరాడ రామకృష్ణయ్య - దక్షిణదేశభాషాసారస్వతములు - దేశి.

# వేదస్వరూప దర్శనము నిరుక్తిమూలము

—o—o-o—o—o—o—

పై కారణములవలన వేదార్థ నిర్ణయవిషయమై యన్యభాషాపరిజ్ఞాన మావశ్యక మనుట తగదు. చారిత్రకుల దృష్టిలో "వేదములు పౌరుషేయములు; చరిత్రసాపేక్షములు; అందుచే అన్యభాషాసాపేక్షములును" -కావచ్చును. ఆ కారణముచే వారికి నిరుక్తాదులతో పని లేక పోవచ్చును. కాని భారతీయశాస్త్రకారుల దృష్టిలో వేదస్వరూపదర్శనము నిరుక్తి మూలము. ఈ విషయము బృహద్దేవతయం దిట్లు వివరింపబడినది.

అర్థాత్ ప్రకరణాల్లిఙ్గా దౌచిత్యా ద్దేశకాలతః ।
మంత్రే ష్వర్థవివేకః స్యా దితరే ష్వితి చ స్థితిః ॥
ఇతి నానాన్వయోపాయై ర్నైరుక్తే యో యతేత సః ।
జిజ్ఞాసు ర్బ్రహ్మణో రూప మపి దుష్కృత్ పరం వ్రజేత్ ॥

అర్థ - ప్రకరణ — లిఙ్గ ఔచిత్య - దేశ - కాల- పరిజ్ఞానము వలన మంత్రప్రపాద్య - అర్థవివేకము కలుగును. మంత్రములందే కాదు, ఇతర గ్రంథ విషయమునను ఇట్టి నియమము కలదు. ఈ అర్థప్రకరణాదులు మంత్రార్థసమన్వయమునకుపాయములు. వీని సాయముతో బ్రహ్మ (వేద) స్వరూపమును దెలియ గోరి జిజ్ఞాసువై నైరుక్తసంప్రదాయమున నెవడు పరిశ్రమ చేయునో యతడే వేదస్వరూపము దెలిసినవాడు -అతడే వేదప్రతిపాద్య మగు వేదస్వరూపమును (పరబ్రహ్మ స్వరూపమును) దర్శింపగలవాడు - అట్టి యతడు దుష్కృతుడైనను పరము (బ్రహ్మము)ను పొందును (పరం వ్రజేత్)- అని యర్థము.

ఇటు అర్థప్రకరణలిఙ్గాది రూపము లగు నానాన్వయోపాయములచే నైరుక్త సంప్రదాయమున పరిశ్రమ చేయవలె నని బృహద్దేవతాగ్రంథము విధించుచున్నది. ఈ వివిధాన్వయోపాయములే పురాణ - న్యాయ - పూర్వోత్తర మీమాంసా - ధర్మశాస్త్రాదులు. ఇవి యన్నియును వేదార్థోపబృంహణమునకై ప్రవర్తిల్లినవే. కాని ఇవి యొక్కొక్కటియు బహుముఖమై విలసిల్లెడి వేదము నందలి యొక్కొక యంశమును ప్రధానముగ ప్రతిపాదించు లక్ష్యము గలవియై విస్తరిల్లినవి. ఈ వివిధాన్వయోపాయములకు పరస్పరసమన్వయమును ప్రతిపాదించునది నైరుక్తసమయము.

ఇట్టి సుసంస్కృతమైన విజ్ఞానముతో సర్వాన్వయోపాయ సమన్వయ దృష్టితో నైరుక్తశాస్త్రమున బరిశ్రమించి మంత్రవాక్యార్థమును నిర్ణయించి బ్రహ్మ (వేద) స్వరూపమును దర్శింపవలె నని తాత్పర్యము.

కనుకనే భరతుడు నిరుక్తమును - సానాసిద్ధ • ధితమ్-అని కంఠోక్తిగ జెప్పినాడు. కనుకనే అభినవ గుప్తుకును - న్యాయమీమాంసాదితంత్రములు, తత్ర్ప వర్తిత న్యాయములును నిరుక్తమున కంగములు, (తంత్రాది న్యాయాస్తుతదఙ్గమ్) నానాప్రకారములగు సర్వతంత్ర — ప్రతితంత్రాది సిద్ధాంతములచే బరిశీలించి యర్థ నిర్ణయముచేయుట పరీక్షారూపమగు నిరుక్తమని చెప్పినాడు. యాస్కనిరుక్తమున నైరుక్త సమయము యొక్క విశిష్టత ఇట్లు తెల్పబడినది.

"అథాపీద మంతరేణ మంత్రేష్వర్థప్రత్యయో న విద్యతే । అర్థ మప్రతి యతో నాత్యంతం స్వర సంస్కారోద్దేశః ।త దిదం విద్యా స్థానం వ్యాకరణస్య కార్త్స్న్యమ్ । స్వార్థసాధకం చ" - నిరు 1 - 15

అన్యదర్శనము లెన్ని యున్నను నైరుక్తసంప్రదాయ మెఱుగక మంత్రము లందు అధియజ్ఞ - అధిదైవ - అధ్యాత్మ రూప కృత్స్నా ర్థ వివేకము గలుగదు. ఈ యర్థపరిజ్ఞానము లేకయే, వ్యాకరణముచే నిష్కృష్టముగా పదముల యందలి స్వర— సంస్కార (ప్రకృతి ప్రత్యయ విభాగాది పరిజ్ఞానములను బరిశీలించుటకు శక్యము కాదు ఏలయన స్వర — సంస్కారజ్ఞానము అర్థజ్ఞానాధీనము. నిరుక్తశాస్త్రము అర్థవివేకమును గలిగించి వ్యాకరణమునకు పూర్ణతను సిద్ధము చేయును. (కాన నిరుక్తజ్ఞానము లేనిదే వ్యాకరణచేయనకు పూర్ణత లేదు.) అంతేకాదు; స్వార్థసాధ కూడ -అని యర్థము

ఇట స్వార్థసాధకత్వ మన నేమి? నిరుక్తము వ్యాకరణమునకు పూర్ణ తను కల్గించుట అంగమె కాదు ఇది స్వతంత్ర విద్యాస్థానము. మంత్రార్థ నిర్ణయ మునకై ప్రవర్తిల్లుట యనెడి తన ప్రత్యేకతతో విరాజిల్లునది. ఇతరవి ద్యా విలక్షణమై స్వార్థసాధనము నగుచున్నది. మఱియు కర్మ - ఉపాసనా - జ్ఞాన భూమికల యందు అధికారి భేదము ననుసరించి స్వార్థమును దర్శింపజేయునది. అని తాత్పర్యము. ఇతరాంగములకంటెను, సర్వశాస్త్రముల కంటెను నిరుక్తమునకు గల వైలక్షణ్యమును దుర్గాచార్యుడు గ్రంథాది నిట్లు విపులముగ వివరించినాడు.

> "ప్రధానం చేద మితరేభ్యోఽఙ్గేభ్యః సర్వశాస్త్రేభ్య శ్చార్థపరిజ్ఞానాభి నివేశాత్ । అర్థో హి ప్రధానమ్ । తద్గుణ శ్శబ్దః స చేతరేషు వ్యాకరణాదిషు చిన్త్యతే । .... .... యథా శబ్దలక్షణ పరిజ్ఞానం సర్వశాస్త్రేషు వ్యాకరణా దేవం శబ్దార్థపనిర్వచన పరిజ్ఞానం నిరుక్తాత్ । .... .... మంత్ర బ్రాహ్మణార్థ పరిజ్ఞానద్ధ శ్చాధ్యాత్మాధిదైవాధిభూత పరిజ్ఞాన ద్వారేణ ధర్మార్థకామ మోక్షా ఖ్యాఖిలపురుషార్థః । న చానిరుక్తో మంత్రార్థో వ్యాఖ్యాతవ్య ఇతి ।

కాన నిరుక్తము యొక్క పరమప్రయోజనము ఏదియో యొక అర్థమును దర్శించుట లేక దర్శింపజేయుట కాదు. పరమార్థమును, అనగా అధికారి భేదమున ననుసరించి యాజ్ఞ - దేవతా - ఆధ్యాత్మ రూపార్థములను దర్శింపజేయుట - యని తాత్పర్యము. కావుననే నిరుక్తమనగా 'మంత్రార్థ చింతాభ్యూహరూప మగు తర్కము' అని శ్రుతియే స్వయముగ నిట్లు నిర్దేశించినది.

> "మనుష్యా వా ఋషిషు ఉత్క్రామత్సు దేవా న్బ్రువన్ । కో న ఋషి ర్భవిష్యతి । ఇతి । తేభ్య ఏతం తర్క మృషిం ప్రాయచ్ఛన్ । తే మంత్రార్థచింతాభ్యూహ మభ్యూహన్ । తస్మా ద్యదేవ కించా నూచానో ? భ్యూహ త్యార్షం తద్భవతి । ఇతి ।

— మాధవీయ ఋ. అనుక్రమణికా. మంత్రార్థానుక్రమణి. పే. 90,

ఈ బ్రాహ్మణ వాక్యములే యాస్కనిరుక్తమునను గ్రంథాంతమున ఉదాహరింపబడినది. "మంత్రద్రష్ట లగు ఋషుల తరువాత త్రైవిదు లగు మహాత్ములు (దేవా:) మంత్రార్థ చింతాభ్యూహరూప మగు తర్కమును జిజ్ఞాసువు లగు మానవులకు ప్రసాదించుచుందురు, వాగర్థ పరీక్షాత్మక మగు నీతర్కము మంత్రార్థమును - వేద స్వరూపమును -దర్శింపజేయునట్టిది యగుటచే ఋషి యగును (ఋషిర్దర్శనాత్- చూ. ఋషిప్రకరణము). ఇట్టి యీ తర్కరూప ఋషియే నిరుక్త శాస్త్రము. ఈ ఋషి (శాస్త్ర) సంప్రదాయానుగుణముగ చేయబడెడి మంత్రార్థ దర్శనము లేక వివరణమంతయు ఆర్షమే యగును (ఆర్షం త ద్భవతి) - అని భావము, యాస్కప్రవర్తితమైన నిరుక్తశాస్త్రము కూడ ఆర్షమే యగుటయు నిట సూచితము. కావుననే ఏత

త్సంప్రదాయానుగుణముగ ప్రవర్తిల్లిన భాష్యములకును 'నిరుక్తము' అనెడి ప్రసిద్ధి యేర్పడినది.

> జ్ఞాతే ష్వపి పదార్థేషు వాక్యార్థపరికల్పనమ్ ।
> అశక్య మృషు బహ్వీషు న వైరకృత బుద్ధిభిః ॥
> తస్మాత్ పదార్థ వాక్యార్థాన్ ప్రయత్నేన ప్రదర్శయేత్
> నాన్యత్ కించి దపి బ్రూయాత్ నిరుక్త మపి తాదృశమ్ ॥
> భాష్యాణి వైదికా న్యాహు రార్యావర్తనివాసినః ।
> క్రియామాణా న్యపీదానీ న్నిరుక్తానీతి మాధవః ॥

మాధవీయ ఋ అనుక్రమణికా – మంత్రార్థానుక్రమణి. పదముల యర్థముల దెలిసినంత మాత్రమున నవిద్వాంసులకు పెక్కుమంత్రముల యందు వాక్యార్థమును దర్శించుట శక్యము కాదు. అందుచేత పూనికతోను మెలకువతోను పదార్థ వాక్యార్థములను ప్రదర్శింపవలెనే గాని ఏదియో యొకవిధముగ వ్యాఖ్యానించుట తగదు. పదార్థ వాక్యార్థ నిర్ణాయకమే నిరుక్త శాస్త్రము గూడ. ఈ శాస్త్రసంప్రదాయమున ప్రవర్తిల్లిన వేదభాష్యములు గూడ నిరుక్తములు – అని భావము.

పై గ్రంథ సందర్భమున ననుసరించి నిరుక్తశాస్త్రము కేవలము పదార్థ నిర్ణాయకమే కాదు; వాక్యార్థ నిర్ణాయకము గూడ – అని తెలియనగును. 'మనుష్యా వా ఋషిషు ఉత్క్రామత్సు' అనెడి శ్రుతివాక్యముల నుదాహరించి తదనుగుణముగ నిరుక్తము మంత్రార్థచింతాభ్యూహ' మనుచు యాస్కుడు గ్రంథాంతమున నిగమనము చేసినాడు. మఱియు 'నైకపదాని నిర్బ్రూయాత్' అను పదముల విషయముననే గాక 'న తు పృథక్త్వేన మంత్రా నిర్వక్తవ్యాః । ప్రకరణశ ఏవ తు నిర్వక్తవ్యాః' అని వాక్యార్థవిషయమున గూడ నిరుక్తశాస్త్రమర్యాదను చెప్పినాడు.

> "నా నిరుక్తార్థవిత్ కశ్చి న్మంత్రం నిర్వక్తు మర్హతి । – ఇతి చ
> వృద్ధానుశాసనమ్ । నిరుక్తప్రక్రియానురోధేనైవ మంత్రా
> నిర్వక్తవ్యాః" — నిరుక్త సముచ్చయః

> "నిరుక్తమగ్రతః కుర్యాత్ యావ దర్థం తథాస్వరమ్ మాధవీయం
> ఋ. అనుక్రమణికా.

ఈ వచనముల బట్టియు మంత్రార్థ నిర్ణయమున నిరుక్తశాస్త్రమునకే అగ్రస్థాన మనియు తదనుగుణముగ జేయబడు మంత్రవాక్యార్థ నిర్వచనమునకును నిరుక్త మనియే సామాన్యముగ వ్యవహార మనియు తెలియును. ఇట్టి పదార్థ వాక్యార్థ పరిజ్ఞానరూప మగు నిరుక్తము చేతనే బ్రహ్మ (వేద) స్వరూపవర్ణనము సిద్ధించు నని పై బృహద్దేవతాది గ్రంథతాత్పర్యము.

ఇట్టి నిరుక్తాది పరిజ్ఞానము చేతనే కర్మలు సమృద్ధము లగు నని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"న యదుపాంశు క్రియతే–త న్మనో దేవేభ్యో యజ్ఞం
వహతి । అథ య ద్వాచా నిరుక్తం క్రియతే–త ద్వాగ్
దేవేభ్యో యజ్ఞం వహతి । - - - తూష్ణీం తమా ఘార
యతి–యం మనస ఆఘారయతి, న స్వాహేతి చ న
అనిరుక్తం హి మనః, అనిరుక్తం హ్యేతత్–య త్తూష్ణీమ్ ।
మంత్రేణ తమాఘారయతి-యతి-యం వా ఆఘారయతి ।
నిరుక్తా హి వాక్, నిరుక్తో హి మంత్రః"- శ.బ్రా. 1.3.6-2,5,6

కర్మానుష్ఠాన సమయమున మంత్రకముగ హవిర్దానాదికము చేయు నెడ సాధకుని మనస్సు అనిరుక్తము అగును. సమంత్రకముగ జేయునెడ నా మంత్రము ను ఉపాంశువుగా ( మెల్లగా– ఇతరులకు వినబడని యట్లు) ఉచ్చరించి చేసినను- లేక వాక్కుతో స్పష్టముగ నుచ్చరించి చేసినను, అపుడు వాక్కు-మంత్రము- రెండును నిరుక్తము లగును_అని భావము.

ఇట గమనింపవలసిన విషయము గలదు. అమంత్రకముగ హవిర్దానాదిక మొనర్చునపుడు మంత్రముతో గాని, తదర్థ పరిజ్ఞానముతో గాని నిమిత్తము లేనందున మనస్సు అనిరుక్త మగును. సమంత్రకముగ జేయునపుడు నియమ పూర్వక మంత్రోచ్చారణము చేతను, న్యాయనిర్ణీత తదర్థ పరిజ్ఞానము చేతను సుసంస్కృత మై మనస్సు నిరుక్త మగును. తద్ద్వారా వాక్కు, అట్టి వాక్కుచే స్పష్టముగ_ నిర్దుష్టముగ- నుచ్చరింపబడు మంత్రము-ఈ రెండును నిరుక్తము లగును. అట్టి వాఙ్మనస్సుల చేతను, మంత్రము చేతను సుసంస్కృతమైన ఆహుతియు నిరుక్తమై (నిరుక్తరూప మాహుతిద్వయమ్ - సా. భా.) దేవతల ప్రీతి

నొందించును (చూ. ఋషి ప్రకరణము; వేదము- ఋషిత్వము; చూ-స్వాహా ప్రకరణము-అహుతులు)- అని శ్రుతి తాత్పర్యము.

అట్లే ఉపాసనాసమయమున జిజ్ఞాసువు నిరుక్తాది సాహాయ్యముచే మంత్ర ప్రతిపాద్య దేవతాస్వరూప యాథార్థ్యమును దర్శించి దేవతాసాయుజ్యమును పొందును.

"యాం యాం దేవతాం నిరాహ తస్యా స్తస్యా స్తాద్భావ్య మనుభవతి"-

నిరు. 13-13.

ఇక జ్ఞానయోగమున ఆత్మవేత్తయు వేదప్రతిపాద్య బ్రహ్మాత్మ భావమును గాంచును (నైరుక్తే యో యతేత సః జిజ్ఞాసుర్బ్రహ్మణో రూపమపి దుష్కృ॰ పరంవ్రజేత్- బృ.దే.)

"వేదాస్త్రికాండ విషయా బ్రహ్మాత్మవిషయా ఇమే." భాగ.

అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమే వాత్ర దేహేదేహభృతాం వర ॥ భ గీ.8.41.

వేదములుకర్మ- ఉపాసనా- జ్ఞానకాండ త్రయాత్మకములు. ఇవి వేత్వేఱుగ ధర్మ-దేవతా-జ్ఞాన రూపవిషయములు బోధించునవిగా అధికారిభేదము ననుసరించిగన్పట్టును.కాని ఆత్మవేత్తకు త్రికాండాత్మకమైన వేదరాశియంతయు బ్రహ్మాత్మావబోధకము-అని భావము. వేదము యొక్క ఇట్టి స్వభావమును స్వార్థబోధకత్వమును (స్వ=ఆత్మ)— ఆత్మార్థ బోధకత్వమును దర్శింపజేయుటయే నిరుక్తశాస్త్ర లక్ష్యము. కాన నిరుక్తము మొదట అధియజ్ఞ-అధిదైవ రూపమున పరమేశ్వర తత్త్వమును దర్శింపజేయుచు, ప్రకరణానుగుణముగ స్వార్థమును (స్వపద-అర్థమును) బోధించును. తుదకు అధియజ్ఞ-అధిదైవరూప మగు సర్వము ఆత్మరూపమే అను వేద ప్రతిపాద్య తత్త్వమును దర్శింపజేయుట కుపాయభూతమై తన సార్థ సాధకత్వమును సార్థకపఱుచుకొనును.(చూ-స్వాధ్యాయ, స్వాహా, స్వధా, ఛందస్ శబ్దములు.) అందుచే వేదస్వరూపము నిరుక్తి మూలము-అని భారతీయ సంప్రదాయము.

కాని భారతీయశాస్త్రకారుల దృష్టిలో వేదస్వరూపదర్శనము నిరుక్తి మూలము. పురాణేతిహాసాదులును వివిధస్థలములందు బెక్కు నిర్వచనముల బ్రదర్శించుచు

నిరుక్తశాస్త్రమార్గముననే ప్రవర్తిల్లినవి. కావుననే యమరకోశాది లౌకిక నిఘంటువులకును నిర్వచనపూర్వక వ్యాఖ్యానము లవయించినవి.

నిరుక్తశాస్త్రమును ప్రమాణముగ గొనియే శ్రీ సాయణాదులును వేద భాష్యముల ప్రవర్తింపజేసిరి. శ్రీ సాయణులు జేసిన మంత్రవ్యాఖ్యానము గొన్ని యెడల బరిమితముగనే యున్నది. ఆ మంత్రములు కన్నిటికి ఆధ్యాత్మిక- ఆధిదైవిక-ఆధిభౌతికార్థత్రయము లన్నియు వివరింపబడలేదు. కొన్నియెడల నితిహాసపరమైన వ్యాఖ్యానము మాత్రమే గలదు. అట్టియెడ నీ మంత్రములకు శ్రీసాయణులుద్దేశించిన యర్థ మంతియే యని తలపరాదు. ఏలయన-ఋగ్వేదము మొదటి మంత్రమున గల మొదటి పదము అగ్ని. శ్రీ సాయణులు శిక్షాదిషడంగములను, వివిధ మంత్ర బ్రాహ్మణ వచనములను ప్రమాణముగ నుదహరించి యగ్ని పదముచే దెలియగల విశేషార్థముల బెక్కింటిని బెక్కు నిర్వచనముల ద్వారా నిరూపించిరి. ఇట్లు మొదటి మంత్రము యొక్క యర్థమును అధియజ్ఞముగ విపులముగ వివరించి—

'వేదావతార అధ్యాయా ఋచోఽర్థశ్చ ప్రపంచితః ।
విజ్ఞాతం వేదగాంభీర్య మథ సంక్షిప్య కథ్యతే ॥'

అని యనిరి. "ఇంతవరకు ఋగ్వేదము మొదటి ఋక్కు యొక్క యర్థము వివరింపబడినది. వేదగాంభీర్యమును దర్శించితిమి. ఇక తరువాత మంత్రములకు సంగ్రహముగ నర్థవివరణము చేయబడును"— అని యర్థము. తరువాతి మంత్రములకు వ్యాఖ్యానము సంగ్రహముగా నున్నను మొదటి మంత్రమునకు వలెనే తదితర మంత్రములకు గూడ నట్లే వివిధ నిర్వచనముల యోజనముచేసి తాత్పర్యము గ్రహింపదగు నని శ్రీ సాయణుల యభిప్రాయము. కాన సంక్షిప్తవ్యాఖ్యానము గల మంత్రముల యొక్క యర్థ మంతియే యని యనుకొనరాదు. ఉదాహరణమునకు— ఋగ్వేదమున కొన్ని సూక్తములను (1-165 మొ॥) అధిదైవికముగ ఇంద్ర మరుత్సంవాదరూపమున శ్రీ సాయణుడు వ్యాఖ్యానించినాడు. అట్లు వ్యాఖ్యానించుచునే- 'అత్ర ఇంద్రమరుత్సంవాదరూపే సర్వత్ర ప్రాణ జీవాత్మ పరతయాఽపి యోజనీయమ్' (ఋ. 1-165-1) అని యనినాడు. ఇంద్రమరుత్సంవాదపరము లగు నీ సూక్తముల నంతట ప్రాణజీవాత్మపరములుగ గూడ యోజనము చేయ నగునని

యర్థము కాన మంత్రములకు అధియజ్ఞముగను, అధిదైవికముగను, ఆధ్యాత్మికముగను గూడ సంప్రదాయానుగుణముగ నర్థముల దర్శించుట భాష్యకారాభిమతము.

మఱియు ఋగ్వేదమున గన్పట్టెడి కొన్ని మంత్రములు భిన్నశాఖలలో భిన్నప్రకరణములందు పఠితములై గన్పట్టును. సంహితాగత మంత్రములను గొన్ని యెడల బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులును ఉదహరించి వ్యాఖ్యానించుచుండును. అందుచే నీమంత్రములకు అధియజ్ఞముగను ప్రకరణము ననుసరించి యర్థమును దర్శింపవలసి యుండును ఇట్లు బ్రాహ్మణారణ్యకములే గాదు. మహాభారతాది స్మృతులును సంవాదరూపముననో, అఖ్యాయికారూపముననో యా మంత్రముల నిగూఢార్థముల నభివ్యక్తము చేయుచుండును అట్లభివ్యక్తము జేయబడిన యా మంత్రార్థముల నన్నిటిని వివరించుట కిది సమయము కాదు. వాని నన్నిటిని వివరింపబూనుచో నిది వేఱొక పెద్ద గ్రంథమే యగును. అయిన నొక్క యుదాహరణము :—

"అగ్ని ర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా అయమ్ ।
అపాం రేతాంసి జిన్వతి ॥ — ఋ 8–44–16.

ఈ ఋక్కు దాదాపు అన్ని శాఖలయందును గలదు. ఈ మంత్రమునకు సాయణుని భాష్య మిది మాత్రమే.

"మూర్ధా దేవానాం శ్రేష్ఠః. దివః ద్యులోకస్య, కకుత్
ఉచ్ఛ్రితః పృథివ్యాః అయం అగ్నిః అపాం
రేతాంసి స్థావర జంగమాత్మకాని భూతాని జిన్వతి ప్రీణయతి"

"ఈ యగ్ని దేవతలలో శ్రేష్ఠుడు; ద్యులోకాధిపతి; పృథివీపాలకుడు: స్థావరజంగమాత్మక భూతముల తృప్తి నొందించువాడు"—అని యర్థము. ద్యావాపృథివీవ్యాపక మగు నగ్నిదేవతాపరముగ నిట సాయణునిచే మంత్రవ్యాఖ్యానము జేయబడినది. ఈ మంత్రార్థమును బ్రాహ్మణవ్యాధసంవాదరూపమున మహాభారత మిట్లు విపులముగ వివరించుచున్నది.

బ్రాహ్మణ ఉవాచ :-

"పార్థివం ధాతు మాసాద్య శారీరోఽగ్నిః కథం భవేత్ ।
అవకాశవిశేషేణ కథం వర్తయతేఽనిలః" ॥

మార్కండేయ ఉవాచ :

"ప్రశ్న మేతం సముద్దిష్టం బ్రాహ్మణేన యుధిష్ఠిర ।
వ్యాధ స్తు కథయామాస బ్రాహ్మణాయ మహాత్మనే ॥

వ్యాధ ఉవాచ :

"మూర్ధాన మాశ్రితో వహ్నిః శరీరం పరిపాలయన్ ।
ప్రాణో మూర్ధని చాగ్నౌ చ వర్తమానో విచేష్టతే॥ 2
భూతం భవ్యం భవిష్యం చ సర్వం ప్రాణే ప్రతిష్ఠితమ్ ।
శ్రేష్ఠం తదేవ భూతానాం బ్రహ్మయోని ముపాస్మహే ॥ 4
స జంతుః సర్వభూతాత్మా పురుషః స సనాతనః ।
మహాన్ బుద్ధి రహం కారో భూ తానాం విషయ శ్చ సః ॥ 5
ఏవం త్విహ స సర్వత్ర ప్రాణేన పరిపాల్యతే ।
పృష్ఠత స్తు సమానేన స్వాం స్వాం గతి ముపాశ్రితః" ॥ ఇత్యాది 6

—భార. 3-213-1 నుండి.

"జ్ఞాన క్రియా శక్తిమతోః ధీప్రాణయో రాత్మాన్యత్వమ్—
'అగ్ని ర్మూర్ధా దివః కకుత్పతిః'— ఇతి మంత్రప్రకాశితం
వకు మారభతే పార్థివ మితి....మూర్ధని సహస్రారే స్థితత్వాత్.
శ్రేష్ఠత్వా ద్వా మూర్ధానం చిదాత్మాన మగ్ని రిజ్ఞా
నాత్మా శ్రిత స్తదుపాధితాం ప్రాప్తః సన్ శరీరం పరిపాల
యన్ చిత్ప్రతిబింబం ప్రాప్య ధీ ధాతుః శరీరం చేతయతీ
త్యర్థః। ఏతేనాగ్ని ర్మూర్ధేతి పదద్వయం వ్యాఖ్యాతమ్ ।
....అస్య కకుత్త్వం వ్యాచష్టే భూతమితి ।.... ఏతేన పతిః
పృథివ్యా అయ మతి ద్వితీయః పాదో వ్యాఖ్యాతః।....
అపాం రేతాంసి జిన్వతీ త్యంతపాదం వ్యాచష్టే పృష్ఠత
ఇత్యాదినా...." —నీలకంఠః.

"జ్ఞాన క్రియాశక్తి సంపన్నములైన ధీ ప్రాణములు ఆత్మకంటె భిన్నములనుచు 'అగ్నిర్మూర్ధా' – అను మంత్రముచే ప్రకాశిత మయ్యెడి యర్థమిట జెప్పబడుచున్నది. సర్వశ్రేష్ఠమై సహస్రారమున వెలయు మహాగ్ని లేక చిదాత్మయే యిట మూర్ధశబ్దవాచ్యము. తదుపాధిభూతమై, జ్ఞానశక్తి సంపన్నమై, చిత్ప్రతిబింబ విలసితమై శరీరమును చైతన్యవంత మొనర్చెడి యగ్ని ధీ రూపమగు విజ్ఞానాత్మ" – అని యీ రీతిగ నీ భారతశ్లోకములలో పై ఋక్కునకాధ్యాత్మికముగ నర్థము విపులముగ వివరింపబడినది. (చూ. నీలకంఠ వ్యాఖ్య.) సంగ్రహముగ సూత్రప్రాయముగ నున్న వేదమంత్రముల యర్థము నిట్లు పురాణేతిహాసములు వివిధ సంవాద – ఆఖ్యాయికాది రూపమున విస్తరించి వివరించుటకయి ప్రవృత్తము లయినవి.

• కవీశ్వరం తం హి వందే ప్రవరం వై తపస్వినామ్ ।
తత్త్వజ్ఞానవతాం శ్రేష్ఠం కృష్ణ ద్వైపాయనం మునిమ్ ॥
• వేదవృక్షం ప్రవిభజ్య స్వశిష్యేభ్యః ప్రదాయ చ ।
ఇతిహాసం తదం తస్మిం సముద్ధృత్య మనీషయా ॥
• పురాణసంహితాం చక్రే పురాణార్థ విశారదః ।
తదర్థానాం నిర్ణయాయ బ్రహ్మసూత్ర మకల్పయత్ ॥
• త ద్భాష్యభూతం పురాణం భాగవతం వై విదు ర్బుధాః ।
త త్సర్వసారభూతం హి పురాణం త్వాది సంజ్ఞకమ్ ॥
• విదధే పరమేశాంశః వ్యాసరూపీ సనాతనః ।
ఆఖ్యానం చాత్ర వివృతం సర్వం హి వేదసమ్మితమ్ ॥

— ఆది. పు. 1 - 0 నుండ 11

కాన నీ యితిహాసపురాణాది సాహాయ్యముతో గూడ వేదార్థమును దర్శింపవలసియున్నది. శ్రీ సాయణుడును వివిధశ్రుతులతోపాటు నిట్టి స్మృతివచనముల గూడ దృష్టియందుంచుకొనియే యాధ్యాత్మికాద్యర్థముల గూడ నట నట సంగ్రహముగ దర్శింపజేయుచు ప్రకరణానుసారముగ శ్రుతుల వ్యాఖ్యానించుకొనుచు బోయినాడు. కాన వ్యాస సాయణాదులు చూపిన వాగ్ద్వారమున నే పోయి వివిధశ్రుతి స్మృతి సంవాద నిర్వచనాదులద్వారా వేదమంత్రముల యర్థగాంభీర్యమును ద ంపవలసియున్నది.

వేదశబ్దార్థ నిర్ణయమునకై వేదమునందు గల నిర్వచనములే ప్రమాణములు. అట్టి నిర్వచనములు వేదైకదేశమగు బ్రాహ్మణభాగమున హెచ్చుగగలవు. బ్రాహ్మణములు మంత్రవ్యాఖ్యానరూపము అని సంప్రదాయము. ఈ వ్యాఖ్యానముల బరిశీలించినచో బ్రాహ్మణములు మంత్రవినియోగాదులతోపాటు మంత్రప్రకాశితార్థమును వివరించు లక్ష్యముతో నామరూపముల బెక్కుతీరుల వ్యాకరించుట గాంచగలము. ఒకే నామము బెక్కునిర్వచనముల ద్వారా వివిధార్థముల బోధించుటయు నట్లే యొకే వస్తువు వివిధనామములచే బేర్కొనబడుటయు గాంచగలము. వేద శబ్దస్వభావము నిట్లు దర్శింపనగునని వేదమే నిర్వచనాదుల ద్వారా మార్గము జూపినది. ఈ నిర్వచనములనే స్మృతిపురాణేతిహాసాదులు నాదరించినవి. కాని చారిత్రికులు 'మంత్రరచనాకాలమునకును బ్రాహ్మణరచనాకాలమునకును మధ్య నెంతయోకాలము గడచినది. మంత్రములయొక్క వాస్తవికమగు నర్థము మఱుగు పడినది : తరువాత బ్రాహ్మణ రచయితలు స్వకపోలకల్పితములు, పరస్పరవిరుద్ధములు నైన నిర్వచనముల జేసినట్లు గన్పట్టుచున్నది: అందుచే మంత్రముల వాస్తవికార్థమును గ్రహించుటకు బ్రాహ్మణ నిర్వచనములు తోడ్పడవు, కొన్నియెడల నివి యున్మత్తలాప్రపముల వలె గూడ గన్పట్టును' -అని యిట్లు పరిహసించిరి.

"The investigation of the Brahmanas has shown that, being mainly concerned with speculation on the nature of sacrifice, they were already far removed from the spirit of the composers of the Vedic hymns, and contain very little capable of throwing light on the original sense of those hymns. They only give occasional explanations of the sense of the Mantras and these explanations are often very fanciful___"

*—A.A. Macdonell, Bhandarkar Commemoration Volume—Poona 1917*

"With the exception of the occasional legends and striking thoughts which occur in them, they cannot be said to be at all atractive as literary productions. To support their explanations of the ceremonial, they interweave exege-tical, linguistic, and etymological observations, and intro-duce myths and philosophical speculations in confirmation of their cosmogomic and theosophic theories. They form an aggregate of shallow and pedantic discussions, full of sacer-dotal conceits, and fanciful, or even absurd identifications, such as is doubtless unparalleled anywhere else"

—*A. A. Macdonell, History of Sanskrit Literature. PP. 32.*

"The Brahmanas represent no doubt a most interest-ing phase in the history of the Indian mind, but judged by themselves, as literary productions, they are most disappoint-ing. No one would have supposed that at so early a period, and in so primitive a state of society, there could have risen up a literature which for pedantry and downright absurdity can hardly be matched anywhere. There is no lack of striking thoughts, of bold expressions, of sound reasoning, and curious traditions in these collections. But these are only like the fragments of a 'Torso' like precious gems set brass and lead. The general charecter of these works is marked by shallow and insipid grandiloquence, by priestly conceits and antiquarian pedantry. *It is most important to the historian* that he should know how soon the fresh and healthy growth of a nation can be blighted by preistcraft and superstition. It is most important that we should know that nations are liable to these epidemics in their youth as well as in their dotage. These works deserve to be studied as the physician studies the twaddle of idiots and the raving of madmen."

—*Maxmuller,- History of Ancient Sanskrit Literature.*

*P.P. 389 (See Introduction to Vedic Kosha of Hamsaraja)*

చరిత్రకల్పనాలక్ష్యముతోను, విజ్ఞానక్రమవికాసము మున్నగు దృష్టితోను చూచినపు డీ బ్రాహ్మణములందలి నిర్వచనములతో మంత్రసమన్వయము పొసగక చారిత్రికుల కిట్టి యూహలు తలయెత్తి యుండును. కర్మోపాసనాజ్ఞానయోగముల నుద్బోధించుటకై శ్రుతి యవతరించిన దనెడి సంప్రదాయానుగతమైన దృష్టితో జూచినపు డీ నిర్వచనము లన్నియు మంత్రార్థసమన్వయమునకు మిగుల దోహద కారులే యగును. వివిధశాఖాగత వాక్యముల సమన్వయపఱచి దర్శింపవలెనని శ్రుతియే (ఋగ్వేదమే) ప్రబోధించి యున్నది. (చూ. స్వాధ్యాయః). ఆ దృష్టి తోనే స్మృతి పురాణేతిహాసాదులు ప్రవర్తిల్లి శ్రుతి సంప్రదాయమును విస్తరింప జేసినవి. మంత్రబ్రాహ్మణాత్మక వేదరాశిని మూర్ధన్యప్రమాణముగ గ్రహించినవి: అట్లు గ్రహింపవలెనని యుద్బోధించినవి.

శ్రుతిః ప్రమాణం స్మృతయః ప్రమాణం
ధర్మార్థయుక్తం వచనం ప్రమాణమ్ ।
యస్య ప్రమాణం న భవే త్ప్రమాణం
క స్తస్య కుర్యా ద్వచనం ప్రమాణమ్ ॥ — పరా. మాధవీయ.

ప్రమాణములలో ఆప్తవాక్యరూప మగు వేదము స్వతఃప్రమాణము. కాననిది ప్రమాణములలో మూర్ధన్యము. శ్రుత్యర్థము ననుసరించున వగుటచే స్మృతు లును ప్రమాణము. శ్రుతి స్మృతి విహిత ధర్మార్థయుక్తమైన యాప్త వచనము గూడ ప్రమాణము. ఇట్లు ప్రమాణభూతములైన శ్రుతిస్మృతులు గాని, వానిని ప్రమాణముగ గ్రహించెడి యాప్తుల ధర్మార్థయుక్తవచనములు గాని యెవనికి ప్రమా ణము గావో యట్టివాని వచనము నెవరు ప్రమాణముగ గ్రహింతురు ? అని యర్థము. కాన వేదార్థ నిర్ణయ విషయమున శ్రుతి స్మృతులను తదనుగుణముగ ప్రవర్తిల్లెడి దర్శనకారుల ధర్మార్థయుక్త వచనములను మాత్రమే ప్రమాణముగ గ్రహించుట సంప్రదాయము, ఇట్టి యీ సంప్రదాయమును పాటింపక స్వబుద్ధి ప్రతి భోత్పన్నితములై పరస్పర విరుద్ధములై వెడలు చరిత్ర కల్పనలు వేదార్థ నిర్ణయమున ప్రమాణము లెట్లగును ? 'వేదసంప్రదాయమును దర్శింపక, తదనుభూతి లేక, యా పాతముగ జెప్పెడి యర్థములును, జేయబడెడి వాదములును కుతార్కికవాదము లగును; అవి శ్రుతి సంప్రదాయము నెఱుగగోరువారికి గ్రాహ్యములు కావు: హాస్యా స్పదములుగ గన్పట్టును. కాన మపేక్షణీయములు' -అని ఋగ్వేదానుక్రమణిక యందిట్లు చెప్పబడినది.

'వేదముద్రా మజానంతః కుతర్కగతమానసాః ।
ఆపాతతో భాషమాణాః తే హాస్యా వైదికైరిహ॥'

పై కారణములచే వివిధశాఖాగత శ్రుతివాక్యములు, బ్రాహ్మణగత నిర్వచనములు, శ్రీ సాయణ - ఉవట - మహీధర - స్కందస్వామి - ముద్గల – ఉద్గీథ – హరిస్వామి - విష్ణుసూరి – భట్టభాస్కరాది ప్రాచీనభాష్యములు, శిక్షాది షడంగములు, తద్భాష్యములు, స్మృతిపురాణేతిహాసాదులు, తద్వ్యాఖ్యానములు, గృహ్యధర్మసూత్రములు, తద్భాష్యములు, న్యాయపూర్వోత్తరమీమాంసాది దర్శనములు, తద్భాష్యములు మున్నగునవి యిట ప్రమాణములుగ గ్రహింపబడి వేదస్వరూప దర్శనమునకై యీ భారతీనిరుక్తి ప్రవర్తిల్లుచున్నది.

## మా పరిశోధన:-

వేదస్వరూప దర్శన విషయమై మా యీ పరిశోధనోద్యమము సుమారు ముప్పదియైదేండ్లకు బూర్వమే, 1935 సం॥ నుండి, ప్రారంభమైనది. ఈ యుద్యమ మొకవిధముగ పితృపరంపరాప్రాప్త మనియు జెప్పవలసియున్నది. మా మాతాపితరులగు శ్రీ దుర్గాంబా సోమయాజులు గారలు, మా యభిజనమగు కృష్ణాతీర మందలి యీపూరు గ్రామమున పితృపైతామహ ధనమై ప్రాప్తించిన శ్రీ వేణుగోపాలమూర్తికి (1927వ సంవత్సరమున) ఆలయ మంటపాదులు నిర్మించి, యుత్సవాదులు నల్పుచు తమ జీవితమును ధన్యము గావించుకొనిరి. మా పితృవ్యులగు రామశాస్త్రిగారు (పెదరామయ్యగారు) అగ్రజు నడుగుజాడల సంచరించుచు, నిరంతరము పనిషత్పురాణేతిహాస గ్రంథ పరిశోధనముతో జీవితము గడపిరి పిదప మా యేడుగురు సోదరులము (వెంకటసుబ్బయ్య, సత్యనారాయణశాస్త్రి, కీ.శే. సీతారామయ్య, వేంకటకృష్ణమూర్తి, సాంబశివశాస్త్రి, చంద్రశేఖరశర్మ, లక్ష్మీనరసింహశర్మ) పితరులు జూపిన మార్గముననే యథాశక్తి బోవబూని, యా దేవస్థానమును హరి - హర - అజ క్షేత్రముగ (త్రిమూర్తిక్షేత్రముగ) రూపొందింపగల్గితిమి. అందలి దేవసభామండపమున నిటీవలనే జగద్గురువులు శ్రీశ్రీశ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతు లనుగ్రహించిన శ్రీ గాయత్రీదేవతామూర్తిని ప్రతిష్ఠించెడి భాగ్యమును గలిగినది.

అనాదిసిద్ధముగ వచ్చిన వ్యవసాయవృత్తితోపాటు, వికేంద్రీకరణ సిద్ధాన్తానుగుణముగ, అన్యోన్యసహకార సంపత్తి గల స్వతంత్ర పారిశ్రామిక కుటుంబ వ్యవస్థా (శోధన్-సెంట్రల్-గృహపరిశ్రమల సంఘము) మర్యాద నను సరించి మా నాల్గవ సోదరుడు వేంకటకృష్ణమూర్తి, తమ్ముడు చంద్రశేఖరశర్మ సహకారముతో, కుటుంబ పరిశ్రమగా వర్ణ పరిశ్రమను (Paint Industry) సుమారు ముప్పదియేండ్లకు బూర్వమే చేపట్టి తద్వ్యాప్తికై కృషి సలుప నారంభిం చెను. ఇట్లొకవైపు యీ వర్ణ (రంగుల) పరిశ్రమ; మఱియొకవైపు మా పితృవ్యులు-పెదరామయ్యగారు-మాకొసగిన పెన్నిధానమగు సంస్కృత గ్రంథజాతముతో వేదస్వరూప పరిశోధన రూప వర్ణ పరిశ్రమను మాలో ద్వితీయులగు సత్యనారాయణ శాస్త్రి చేపట్టి, తమ్ములను సంస్కృతమున సుశిక్షితుల గావించు ఉద్యమము సాగించెను. 'భారతీనిరుక్తి' యను పేరుతో గ్రంథరచన మారంభమైనది. పోను పోను విషయ మతిగంభీరము దురవగాహమునై, బహుగ్రంథ పరిశీలనావశ్యకత నానాటికి బెఱిగినది. మాలో సాంబశివశాస్త్రి, లక్ష్మీనరసింహ శర్మయు నిరువురును యథాశక్తి వలసిన శాస్త్రాధ్యయనము గావించి, యితోఽధికముగ పరిశోధన కార్యక్రమమునకు బూనుకొనిరి శ్రీ వేణుగోపాల దేవుని యనుగ్రహముచే నిట్లీ రెండు వర్ణపరిశ్రమ లును గూడ మాకు కుటుంబపరిశ్రమలై యన్యోన్యసహకారముతో సాగినవి. మాలో జ్యేష్ఠులు దేవాలయనిర్మాణ నిర్వహణ—వ్యవసాయ కార్యక్రమములు జేపట్టి యీ పరిశ్రమలు నడచిపోవుటకు బ్రోత్సహించిరి 1942 లో నిరుక్తభారతి-సంస్కృత వాఙ్మయ పరిశోధనాలయము'- అను సంస్థ నెలకొల్పబడినది. వివిధ వ్యయప్రయాసల కోర్చి క్రమముగ గ్రంథముల సేకరించి వాని సాయముతో పరిశోధన సాగినది.

పాశ్చాత్యుల వైదికకోశములు మున్నగు గ్రంథములు సంప్రదాయార్థ ముల మఱుగుపరచుటను జూచి, సంప్రదాయార్థముల ప్రతిబింబింపజేయుచు వేద స్వరూపమును వర్ణింప జేయగల వైదిక శబ్దకోశము లత్యన్తా వశ్యకములని భావించి, వేదమున గల గవాశ్వాదినామములు, నదీ నద దేవతాది వివిధ నామముల గూర్చి శ్రుతి తాత్పర్య విషయమై పరిశోధన గావింపబడినది. పరిశోధన ఫలితముగ భారతీ నిరుక్తి యను గ్రంథమొక విధముగ 1945 వ సంవత్సరముననే రూపొందింప గల్గితిమి. వెనువెంటనే గురువర్యులు, నెల్లూరు సంస్కృత కళాశాలాధ్యక్షులు బ్రహ్మశ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారికిని, ఆ కళాశాలా పండితులు శ్రీమాన్

కవితార్కికసింహ గోవిందాచార్యుల వారికిని, శ్రీమాన్ N. రంగరామానుజా చార్యుల వారికిని మా పరిశోధన ఫలితము నివేదించితిమి. వారి యాశీర్వాదముతో పాటు మన్ననల నందుకొనుటతో మా కీ విషయమున ప్రోత్సాహ మినుమడించి నది.

సర్వజిన్నామ సం॥ వైశాఖ పూర్ణిమ సోమవారము (5-5-1947) నా డీ గ్రంథము శ్రీ వేణుగోపాల దేవున కంకితము జేయబడినది. పిదప పలువురు వేద శాస్త్ర ప్రముఖులు మా రచనలను. ఉద్యమమును జూచి, యానందించి, యాశీఃపురః సరముగ దమ యభిప్రాయముల నొసగి యీ గ్రంథమును వెంటనే ముద్రింపు డని మిగుల ప్రోత్సహించిరి. కాని త్వరపడి గ్రంథమును ముద్రించుటకంటె వేద సంప్రదాయ రహస్యముల నింకను దెలిసికొనుటకై కృషి సాగించుటయే యుక్తమని తోచినది అందుకై యధ్యయనాదులు సల్పుచు నితోఽధిక కృషి సాగినది.

ఇది యిట్లుండ నిటీవల జగద్గురువులు శ్రీ శ్రీ శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు విజయవాడ విచ్చేయుటయు, శ్రీవారి యాధ్వర్యమున స్థానమండల వేదవిద్వ త్ప్రవర్ధక సభయును, అఖిలాంధ్రపండితసభయు జరిగి ప్రముఖులగు వేద-శాస్త్రపండితులకు నాతిథ్య మిచ్చెడి భాగ్యము లభించినది. పిదప గడిచిన కృష్ణాపుష్కర సందర్భమున నఖిలభారత వేదశాఖా సమ్మేళనము మహావైభవముగ శ్రీవారి యాధ్వర్యమున జరుగుటచే నా సమయమున వివిధ శాస్త్ర పారంగతులయిన పలువురు పండితుల కాతిథ్య మిచ్చి గ్రంథస్థము లగు పెక్కువిషయముల వారితో జర్చించెడి యవకాశమును గలిగినది. తరువాత మా భాగ్యవశమున సుమారు పది దినములు శ్రీకామకోటి పీఠము మా విజయవాడ శోధన్ గృహమున నుండు తరుణ మున శ్రీచరణులు కూడ మాచే రచింపబడిన వేదమాతృస్తవము నందలి శ్లోకముల సావధానముగ వినుట జరిగినది. దానితో మా యీ గ్రంథవిషయముల గొన్నిటి వివరించు భాగ్యమును జేకూరెను అపుడే అఖిలభారత వేదశాఖాసంమేళన సంచిక (souvenir) యందు వేదములను గూర్చి యాంగ్లమున ప్రకటితమైన తమ వ్యాస మునకు నాంధ్రానువాదము జేయవలసినదిగ శ్రీవారు ఆనతిచ్చిరి; అట్లే యను వదించితిమి. ఆ సందర్భమున-వేదమునకు గల వేద-ఋషి-బ్రహ్మ-స్వాధ్యాయాది వివిధ నామములే వివిధ రీతుల వేదమునకు గల యపౌరుషేయత్వాది విషయముల దెలియజేయ సమర్థములు'- అని యా యా పదముల గూర్చి సంగ్రహముగ వ్రాసి

వివరించితిమి. శ్రీవారు సావధానముగ విని, మమ్ము ప్రోత్సహించుచు, కొన్ని సూచనల నిచ్చి యీ విషయమై విపులముగ వ్రాయుడని యాదేశించిరి. తదాదేశాను సారము వ్రాసి గ్రంథ మంతయును కంచిలో శ్రీవారికిని, తదన్తేవాసి వర్యులు శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామివారికిని చదివి వినిపించితిమి. వారు సావధాన ముగ సుమారు 10 రోజులు వినిరి. మిగుల యానందించిరి. తమ వ్యాసమును, యీ గ్రంథమును కలిపి ముద్రించుడని యాదేశించిరి.

"నమామ వేదమాతర మితి సూక్తి రస్మాకం జీవనాడీ
భవతు। వేదమాతా దేశే దేశే రాష్ట్రే రాష్ట్రే గ్రామే గ్రామే
గృహే గృహే విరాజమానా క్షేమం తనోతు। వేద
ఏవాస్మాకం సర్వస్వం భవతు। శోభనాస్తే పంథానః
సన్తు."

అని యాశీర్వదించి పంపిరి. తదాదేశానుసార మిట శ్రీవారి వ్యాసమును మొదట ప్రకటించుచున్నాము. మా యీ రచనకు బుద్ధి నొసగి ప్రోత్సహించిన శ్రీ చరణుల కును, తదంతేవాసివర్యులు శ్రీ జయేంద్రసరస్వతి స్వామివారికిని హృదయపూర్వక సాష్టాంగ ప్రణామములు.

## నమామ వేద మాతరమ్

ప్రదీపం భారత్యాః భరతశుభగీతం సుమనసాం
ప్రగీతం ఛందోభిః మృదుల నవనీతం రసజుషామ్।
ప్రభాతం భక్తానాం విశతశరభూతం కుమనసాం
ప్రభూతాం వేదాన్తైః హరిహృదయలక్ష్మీం తనుమహే॥
అమూల్యం రత్నం తత్పరిమలపరీతం నవసుమం
తరుం శీతచ్ఛాయం నవజలధరం దివ్యపథగమ్।
సుధాపూర్ణం పాత్రం ఋషివచన తేజః సువిమలం
వ్రజం గోబృందానాం గురుకులకురంగీం తనుమహే॥
పూర్వసూరికృత వాగ్విలాస న
త్సంప్రదాయ కలితాత్మ సంపదః।
భారతీ వివృతి మాప్త సంమతా
మున్నయంతి హరిసోదరా ముదా॥

—o—o—o—

# శ్రీః

# వేదః

నమామ వేదమాతరం మహీం సదాత్మనః కలాం
మహాతవః సమాధిగోచరాం షడఙ్గభాసురామ్ ।
సవిత్వ మీయుషే జనాయ చాత్మరూపదర్శికాం
త్రయీమయీం హరిప్రియాం స్వయంప్రభాం గిరం భజే ॥

1. వేదశబ్దే :- హరిపదం నను వేదయితుం స్వయం
త్రివిధయోగ పదక్రమ రంజితామ్ ।
శివతమేన రసేన పరిప్లుతాం
శివతమాం ప్రణుమః శ్రుతిమాతరమ్ ॥

— వేదమాతృ స్తవః

మంత్రబ్రాహ్మణాత్మకమైన శబ్దరాశికి వేదమని పేరు. ఈ శబ్దరాశి యనాదిగ ఋగ్యజుఃసామాథర్వణరూపమున లోకమున ప్రసిద్ధము. ఇట్టి వేద మపౌరుషేయ మని సంప్రదాయము.

కాని, వేద మపౌరుషేయ మనిన నది యెట్లు సంభవ మగును ?—అనెడి ప్రశ్న యుదయించుట సహజము. లోకమున నేదేని గ్రంథమును రచించుటకు గర్త యొకఁ డుండవలెను. కర్త్రపేక్ష లేక, గ్రంథరచన సంభవము గాదు. ఇది లోకసహజము. అందుచే గ్రంథములన్నియు పౌరుషేయములే యగును. భారత రామాయణాదు లట్టివే కదా ! అట్టియెడ వాక్యాత్మకమగు నీ వేదమంత్రరాశికి గూడ కర్త, లేక కర్తలుండి యుండవలెను. అందుచే నితర గ్రంథముల వలె గూడ పౌరుషేయములే యగును గాని - యపౌరుషేయము లగుట యెట్లు ? ఈ విషయము పరిశీలింప వలసి యున్నది.

భారతరామాయణాదులు వాక్యాత్మకములు; అట్లే వేదములును వాక్యాత్మకములు: కాన, పౌరుషేయములు (వేదః పౌరుషేయః వాక్యత్వాత్: భారతాదివత్) అను నీ దృష్టాంతము సరియైనది కాదు. భారతరామాయణాదులు ఋషికర్తృకములని ప్రసిద్ధి. ఆ గ్రంథములు రచించినట్లు వ్యాసవాల్మీకాదులు స్వయముగ జెప్పికొనిరి. కాని ప్రాచీనులగు నా ఋషులే వేదము లపౌరుషేయము లనిరి. వారేగాదు అతిప్రాచీనులగు మన్వాది స్మృతికర్తలును అపౌరుషేయము లనిరి. 'న కశ్చి ద్వేదకర్తా చ' (పరా. స్మృతి) యనుచు వేదమునకు కర్త లేడని యుద్ఘాటించిరి. అట్లుద్ఘాటింపనేల?

కాన, ఋషిసంప్రదాయము ననుసరించి భారతరామాయణాదులకును, స్మృతులకును వలె వేదములకు కర్తయున్నట్లు ప్రసిద్ధి గన్పట్టదు. అందుచే కర్తృప్రసిద్ధివిషయమై భారతాదిగ్రంథదృష్టాంతము పొసగదు.

అట్లగుచో కర్తృప్రసిద్ధి లేని గ్రంథములు లోకమున గొన్ని కలవు. ప్రసిద్ధి లేనంతమాత్రమున నవి యపౌరుషేయము లని చెప్పనగునా? పౌరుషేయము లనియే వానికి బ్రసిద్ధి. వేదముల విషయమున గూడ నట్లేయని యేల చెప్పరాదు? అట్లు చెప్పుట సరికాదు. కర్తృప్రసిద్ధి లేకపోయినను ఇతరగ్రంథములు పౌరుషేయములే యని ప్రసిద్ధము లైనవి. వేదము లట్లుగాక యపౌరుషేయము లనియే ప్రసిద్ధము లైనవి. ఇందుకు గారణము గ్రంథప్రతిపాద్యాంశ స్వరూప పరిశీలనము వలన స్పష్టమగును. వేదములు గాక తదితర పురాణేతిహాసములు గాని, కావ్యములు గాని, వేదములను బ్రమాణములుగ గొనియే ప్రవృత్తము లయినవి. కాన తద్గ్రంథప్రతిపాద్యాంశము వేదమూలము. వేదముల బ్రమాణముగా గొనని దర్శనములు, తదనుసారిగ్రంథములు గూడ నుండవచ్చును. అవి యా యా ప్రవక్తల చేతను, తదనుయాయుల చేతను బ్రవర్తితము లైనట్లు చెప్పబడుచునే యున్నవి. కాన, వేదముల కంటె నితరములగు గ్రంథముల విషయమై కర్తృప్రసిద్ధి యున్నను లేకపోయినను తత్ప్రతిపాద్యాంశము పురుషబుద్ధికల్పిత మగుటచేసి యవి పౌరుషేయములే యగుచున్నవి. వేదముల విషయమున నట్లుగాదు. ఇట కర్తృప్రసిద్ధి లేకపోవుటయే గాదు: ఇందలి ప్రతిపాద్యాంశము ధర్మ - బ్రహ్మస్వరూప నిరూపణము. ఇది యతీంద్రియ మగుటచే పురుషబుద్ధికి గోచరము గాదు.

తమకంటె ప్రాచీనములగు గ్రంథములున్నట్లు గాని, తత్ప్రామాణ్యమునను సరించి ధర్మ బ్రహ్మస్వరూపనిరూపణము జేయబడినట్లుగాని వేదములు చెప్పికొనలేదు. ఇట్లు కర్తృప్రసిద్ధి లేనందునను గ్రంథప్రతిపాద్యాంశము పురుషబుద్ధి కల్పితమగుటజేసియు వేదములు అపౌరుషేయములే యని చెప్పనగును. గ్రంథప్రతిపాద్యాంశమట్టిదని స్ఫురింపజేయుటకే వేదము తనను దాను, వేదమనియే గాక, పెక్కునామములతో గీర్తించుకొనినది. తన్నామౌచిత్య విచారముచే వేదస్వరూపస్వభావాదులు తేటపడ గలవు.

వేదః, విధానమ్, ఋషిః, తపోజాః, ప్రథమజా, ప్రతిష్ఠా, బ్రహ్మ, శ్రుతిః, శ్రుతా, అనుశ్రవః, ఆమ్నాయః, స్వాధ్యాయః, స్వాహా, స్వధా, త్రయీ, కవిః, కావ్యమ్, ఇడా, సరస్వతీ, భారతీ, ఛందః, ప్రవచనమ్, శాస్త్రమ్, పవిత్రమ్, వాక్, శ్రీః- ఇత్యాద్యనేకనామములతో వేదము తనను తాను వ్యవ హరించుకొని యున్నది. ఇంతే కాదు. ఈ పదముల యొక్క యర్థముల ననేక విధముల స్వయముగ నిర్వచించి యున్నది. ఆ యర్థములను వేదాంగములు, పురా ణేతిహాసాదులును బెక్కురీతుల వివరించినవి. కాన వేదమునకు గల యీ నామ ములు అర్వాచీన కల్పితము లనిగాని, కేవల సంజ్ఞావాచకము లనిగాని చెప్పవలను పడదు. అవి సార్థకములు. ఈ పదముల బరిశీలించినచో నొక్కొక్క పద మొక్కొక్క తీరుగ వేదముల యొక్క స్వరూపస్వభావాద్యుల నిరూపింపగలవు. వేదపురాణాదుల బరిశీలించిన గాని, వీనికి గల సంప్రదాయానుగతమైన యర్థ మవ గతము గాదు. ఆ యర్థముల సూక్ష్మముగ బరిశీలించుకొలది- "వేదము అపౌరు షేయము; సనాతనము; స్వతఃప్రమాణము; క్రాంతదర్శి; తపఃసమాధి గోచరము; అనాదినిధనము; స్వయంజాతము; బ్రహ్మతత్త్వావబోధకము; పురుషార్థసాధనము; గురుశిష్య పరంపరాప్రాప్తము; పరమపావనము; శ్రీరూపము'- అనియు, నందుచే చరిత్రకారులు చెప్పునట్లుగా-'పురుషబుద్ధికల్పితము; ఒకనాటి సాంఘిక రాజకీయాది చరిత్రను బోధించుటకు బ్రవృత్తము'— కాదనియు మున్నగు నంశములు స్పష్టపడగలవు.

శ్రుతికి గల నామములలో 'వేదః' అనునది యత్యంతప్రసిద్ధము. కనుక వేద శబ్దమును మొదట బరిశీలింతము.

## వేద శబ్దము-నిర్వచనములు :-

వేదయతీతి వేదః — తెలియ జేయునది యని వేదపదమున కర్థము. దేనిని దెలియజేయునది వేదము ? ఈ విషయముని సంప్రదాయ విదులిట్లు జెప్పు చున్నారు.

"ప్రత్యక్షే ణానుమిత్యా వా యస్తూపాయో న బుద్ధ్యతే.
ఏతం విద న్తి వేదేన తస్మా ద్వేదస్య వేదతా॥"

ప్రత్యక్ష ప్రమాణముచే గాని, యనుమానప్రమాణముచే గాని తెలియజాలని పురుషార్థోపాయములను బోధింపజాలినది యగుటచే దీనికి వేద మని సార్థకనామము-అని యర్థము. వేద పదమున కింత దూర మర్థము జెప్పికొన వలసిన యావశ్యకత యేమి ? ఈ విషయమును జూతము.

ఆయుర్వేదః, ధనుర్వేదః, గాంధర్వవేదః, నాట్యవేదః — ఇత్యాది గ్రంథములును గలవు. వీనికి ఉపవేదము లని ప్రసిద్ధి. 'వేదయతీతి వేదః' అను పై నిర్వచనము ననుసరించి దేనిని తెలియజేయు ననెడి యాకాంక్షకు సమాధాన స్ఫూర్తిని గలిగించెడి ఆయుస్-ధనుస్-గాంధర్వ-నాట్యా ద్యుపపదము లిచట గనపట్టును; వీనిలో నొక్కొక్కటి ప్రత్యేకముగ నొక్కొక్క విద్యను బోధించు టకై ప్రవృత్తమగుట స్పష్టము జేయును. అందుచే దేనిని దెలియజేయు ననెడి సందియమున కిట తావు లేదు. ప్రకృతమున నట్టి యుపపదములతో గూడియుండని 'వేద' విషయమున దేనిని దెలియజేయు ననెడి యాకాంక్ష యట్లే నిలిచిపోవు చున్నది. కనుక, దేనిని యజేయునో తెలియవలసి యున్నది.

లోకవ్యవహారోపయుక్తము లగుచుండు నేవేని వాక్యములుగాని, లేక రచనలు (గ్రంథములు) గాని ఆ యా వక్తలచే నుద్దిష్టములగు నా యా యభిప్రాయముల దెలియజేయుటకే ప్రవృత్తము లగుచుండును. ఏవేని యభిప్రాయముల దెలియ జేయుటయే వేదశబ్దార్థమా ? కాదు. కావుననే లోకవ్యవహారోపయుక్త వాక్య సామాన్యమునకుగాని, గ్రంథసామాన్యమునకు గాని వేద మనెడి సంజ్ఞ ప్రసిద్ధము కాలేదు. ఋగాదిశబ్దరాశికి మాత్రమే పరిమితమై 'వేదః' అను నీ సంజ్ఞ అనాదిగ ప్రసిద్ధమై యున్నది. ఇట్టి యీ ప్రసిద్ధికి గారణ మేమి ? ఋగాదిశబ్దరాశికి దేనిని

దెలియజేయుటకై ప్రవృత్తమైనది ? కాన. ఋగాదిశబ్దరాశికి దేనిని బ్రతిపాదించుట యందు దాత్పర్యమో పరిశీలించి యీ విషయము దెలియవలసి యున్నది.

లోకవ్యవహార మంతయు సామాన్యముగ నర్థకామవిషయము. అర్థ కామముల యం దెల్లరకు స్వయముగనే ప్రవృత్తి కలుగుచున్నది. దానిని గలిగించు టకు గాని, ప్రబోధించుటకు గాని శాస్త్రముల యావశ్యకత లేదు. అర్థకామములకు వశులై, సంసారచక్రమున బరిభ్రమించు జీవుల నుద్ధరించుటకై ప్రవృత్తి-నివృత్తి రూప ధర్మము నుపదేశించుట కవతరించిన సనాతనశాస్త్రము వేదము. అనగా నెట్టి యర్థకామములు గ్రాహ్యములో, ఏవి నింద్యములో, వానియందు బ్రవృత్తి యెట్లుండ వలెనో, అవి యెట్లు ధర్మానుగతములగుచు బురుషార్థము లగునో, ధర్మస్వరూప మేదియో, తుదకు ధర్మార్థకామములనుండి నివృత్తుడై నిఃశ్రేయసము నెట్లు బొందునో తెలియజేయుటకై వేదము ప్రవృత్తమైనది. ఇట్లు మానవునకు దివ్యత్వ మును సిద్ధింపజేయు ప్రవృత్తి ర్మమును, స్వారాజ్యమును (లేక నిఃశ్రేయసమును) సిద్ధింపజేయు నివృత్తిధర్మము నుపదేశించెడి సనాతనశాస్త్రము వేదము. 1

1. సుఖాభ్యుదయికం చైవ నైశ్శ్రేయసిక మేవ చ ।
ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికమ్ ॥
ఇహ చాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే ।
నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్త ముపదిశ్యతే ॥
ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానా మేతి సామ్యతామ్ ।
నివృత్తం సేవమానస్తు భూతా న్యత్యేతి పంచ వై ॥
సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
సమం పశ్య న్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి ॥
పితృదేవ మనుష్యాణాం వేద శ్చక్షు స్సనాతనమ్ ।
అశక్యం చాప్రమేయం చ వేదశాస్త్ర మితి స్థితిః ॥
—మనుస్మృతి. 12-88 నుండి 91, 94.

ఈ ధర్మమోక్షము లతీంద్రియములు-పురుషబుద్ధికి గోచరములు గానివి. అట్టి ధర్మమోక్షముల స్వరూపమును, తత్సాధనములగు నిత్యనైమిత్తిక యాగాది కర్మలను, ఉపాసనాదులను — అనగా 'కర్మ - ఉపాసనా - జ్ఞానయోగముల (ఉపాయముల)' నుపదేశించుటకై ప్రవర్తించిన గ్రంథమే వేదము

'ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయం యో
గ్రంథో వేదయతి స వేదః । అలౌకికపదేన ప్రత్యక్షానుమానే
వ్యావర్త్యేతే ।'- సాయణః. తై. సం. భాష్యభూమికా.

స్వర్గమోక్షాదిరూపమగు నిష్టప్రాప్తికి గాని, దుఃఖనరకాద్యనిష్టపరిహారమునకు గాని వలయు నుపాయములు ప్రత్యక్ష-అనుమానాది లౌకికోపాయములచే దెలియ జాలినవి గావు. అందుచే ఇష్టప్రాప్త్యనిష్ట పరిహారములకై వలయు నలౌకికోపాయ ముల (కర్మ-ఉపాసనా-జ్ఞానయోగముల) బోధించెడి (వేదయతి) గ్రంథము వేదము— అని యర్థము. కనుక, నాట్యవేదాది శబ్దములవలె గాక, నిరుపపదమై యొప్పు 'వేదము' - అను నీ నామము ప్రత్యేకముగ నేదేని యొక విద్యను గాక, అతీం ద్రియములగు ధర్మమోక్షస్వరూపములను, తత్ప్రాప్తికై వలయు సర్వవిద్యలను (ఉపాయములను) తెలియజేయునది-యను నర్థ ప్రసిద్ధమైనది. మన్వాది సంప్ర దాయవిదు లందఱిచే నీ యర్థమే గ్రహింపబడినది. అట్లుపదేశించుట కన్యనిరపేక్ష ముగ బ్రవర్తించిన దగుటచే వేదము స్వతఃప్రమాణ మనియు గీర్తింపబడినది.

ఉపదేశించుటలో వేదము పెక్కు విధానముల నవలంబించినది. తన లక్ష్యము పరమపురుషార్థ (మోక్ష) ప్రతిపాదనమే యయ్యును, తదనుగుణముగ వేదరాశి కొన్నియెడల పురాణమై సృష్టిక్రమాదికము, ఇతిహాసమై దేవాసురాదుల యుద్ధాదివర్ణనలు, వాకోవాక్యమై బ్రహ్మవాదుల ప్రశ్నప్రతి వచనాదులు, అర్థ వాదమై తత్తద్దేవతాది ప్రశంసాదులు, శాస్త్రమై విధినిషేధాదులు, నిర్వచనాదులు, స్తోత్రములు, ఉపాసనలు, వర్ణ-ఇవలుల్లైనొన్ని రూపముల దాల్చి పెక్కు విషయ ముల బ్రతిపాదించుచు, తుదకు ఉపనిషద్రూపమున పరమపురుషార్థమును దర్శింప జేయుచు, తరువాతి స్మృతిపురాణేతిహాసకావ్య నాటకాదులకు మార్గదర్శకమగుచు నాదికావ్యమై వెలసినది. కనుక, వేదమనగా అజ్ఞాతమగు ధర్మబ్రహ్మరూపార్థము

లను ప్రతిపాదించునది; జ్ఞాపకము చేయునది; ఉపదేశించునది; దర్శింపజేయునది యని 'వేదయతీతి వేదః' అను నిర్వచనము వలన గ్రహింప నగును.

ఇంతే కాదు వేద శబ్దము మిగుల అర్థవంతము. వేదవేద్యుడగు పరమేశ్వరునకు 'వేదః' అనియు నామము గలదు.

"కో ను నామ న యో వేద త్వాం వినా సాంప్రతం వద ।
నీతి స్త్వం సర్వకార్యాణా మితి మే నిశ్చితా మతిః ॥"

— హరివంశ. 3.76-19

'హేవేద । మంత్రమూర్తే, నీతిః నీతిప్రదర్శకః'- నీలకంఠః

మంత్రమూర్తియగు పరమేశ్వరుడు హేవేద। అని యిట సంబోధింపబడినాడు. విష్ణుసహస్రనామము (మహాభారతము) గూడ పరమేశ్వరునిట్లు కీర్తించినది.

"వేదో వేదవి దవ్యంగో వేదాంగో వేదవి త్కవిః ।"
'వేదయతీతి వేదః', 'తేషామేవానుకంపార్థ మహ మజ్ఞానజం
తమః । నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥'
ఇతి భగవద్వచనాత్ । యథావత్ వేదం వేదార్థం వేత్తీతి
వేదవిత్ 'వేదాంతకృ ద్వేదవిదేవ చాహం' ఇతి భగవ
ద్వచనాత్॥' - శం భా.

భక్తులు జిజ్ఞాసువులు నగువారి హృదయమున నిలిచి జ్ఞానదీపముచే నజ్ఞానాంధకారమును దొలగించి సర్వాత్మకబ్రహ్మాత్మ భావమును దర్శింప జేయువాడగుటచే (వేదయతి) పరమేశ్వరు డిట 'వేదః' అనియు, యథావద్వేదార్థజ్ఞానసంపన్ను డగుటచే 'వేదవిత్' అనియు, వేదమూర్తి యగుటచే 'వేదాంగః' అనియు, క్రాంతదర్శి యగుటచే 'కవిః' అనియు గీర్తింపబడినాడు. కనుక నిపుడు వేద శబ్దము పరమేశ్వరునకును, తత్ప్రతిపాదక శ్రుతికిని వాచక మగుచున్నది. ఈ విషయమును సనత్సుజాతీయము నిట్లు వివరించుచున్నది

"ఏకవేదస్య చాజ్ఞానాత్ వేదాస్తే బహవోఽభవన్" — 2 38

బుద్ధికి గోచరముగాని యొక వేదమును (పరమేశ్వరుని) దెలియజేయుటకై పెక్కు వేదములు ప్రవర్తిల్లినవి - అని యర్థము. ఈ వాక్యమును వివరించుచు శ్రీ శంకర భగవత్పాదులు వేదశబ్దము నిట్లు వ్యాఖ్యానించిరి.

'అత్ర ఋగాదయో వేదాః తత్ప్రతిపత్త్యర్థం విచారం కుర్వన్తీతి వేదఖ్యాన మవాపుః । అథవా సద్భావం సాధయన్తీతి వేదాః । విదన్తి వేదన సాధన భూతా ఇతి వా వేదాః । అథవా బ్రహ్మాధీన మాత్మానం లభన్త ఇతి వా వేదాః । అథవా బ్రహ్మణ ఆత్మతయా లాభహేతవ ఇతి వా వేదాః । విద విచారణే, విద సత్తాయాం, విద జ్ఞానే, విద్ల లాభే, ఏతేషాం ధాతూనాం విషయే వర్తన్తే యస్మాత్ తతో వేదా ఇత్యుక్తాః....తస్మాత్ సత్యస్య ఏకవేదస్వరూపస్య బ్రహ్మణోఽనవగమా ద్వేదా బహవో వ్యాఖ్యాతాః । సర్వే వేదా స్తదర్థదర్శన హేతవః ॥'

నాల్గు విద్ ధాతువు నుండి వేద శబ్దము నిష్పన్నమైనది. ఈ ధాతువులకు విచారణము, సత్త, జ్ఞానము, లాభము అని యర్థములు గలవు. వేదమనగా అద్వితీయుడు 'సత్య—జ్ఞాన-ఆనంద' రూపుడగు బ్రహ్మ యని యర్థము. (1) అట్టి బ్రహ్మను గూర్చి తెలిసికొనుటకు విచారము సల్పునవి యగుటచేతను (2) బ్రహ్మ యొక్క సద్భావమును (అస్తిత్వమును) నిరూపించునని యగుట చేతను (3) బ్రహ్మ జ్ఞాన (వేదన) సాధనము లగుట తను 4) ఆత్మకు బ్రహ్మాధీనత్వ ప్రాప్తిసాధనములు, లేక బ్రహ్మాత్మత్వ ప్రాప్తి సాధనము లగుట చేతను- ఋగాదిగ్రంథ రాశికి వేదము అను పేరు సార్థకము, కనుక పరమేశ్వరరూప వేదార్థదర్శన హేతువులు సర్వవేదములు—అని శంకరభగవత్పాదులచే నిట వేదశబ్దమునకు నాల్గు ధాతువుల నుండి నిర్వచనములు జూపబడినవి.

## ఒకే వేద శబ్దమునకు ఇన్ని నిర్వచనముల లేల ?

ఇందొక క్రమమును దర్శింపజేయుటయే యీ నిర్వచనముల ప్రయోజనముగ గానవచ్చును. (1) మొదట వేదరూపుడగు బ్రహ్మను గూర్చిన విచారము సల్పుటచే వేదములకు వేదత్వము; (2) అట్లు విచారము సల్పి వేదరూపుడగు పరమేశ్వరు డున్నాడని (అస్తిత్వము) నిరూపించుట వేదము యొక్క వేదత్వము;

(3) ఇట్లస్తిత్వమును సాధించి ఆ వేదరూపుడగు పరమేశ్వరుని గూర్చిన జ్ఞానమునకు (వేదనమునకు) సాధనము లగుట వేదము యొక్క వేదత్వము, (4) పిమ్మట తనను (ఆత్మను) వేదరూప పరమేశ్వరాధీనునిగ దెలియజేయుటయు, తుదకు బ్రహ్మాత్మభావ ప్రాప్తిసాధన మగుటయు వేదము యొక్క వేదత్వము- అను క్రమము నీ వ్యుత్పత్తులు సూచించుచున్నవి. అందుచే అధికారి భేదము ననుసరించి ధర్మ-బ్రహ్మవిషయముల బోధించుట వేదము యొక్క వైలక్షణ్య మని యిట సూచితము. హరివంశమున వేదము యొక్క వేదత్వ మిట్లు చెప్పబడినది.

"జాతమాత్రాస్తు తే వేదాః క్షేత్రం విన్దన్తి తత్త్వతః
తేన వేదత్వ మాపన్నా యస్మా ద్విన్దన్తి తత్పదమ్ ॥"

- హరివంశ. 3-17-48

'ఆవిర్భూతమాత్రా ఏతే స్వం స్వం క్షేత్రం ప్రకాశ్య ముపాధిం విదంతి లభన్తే । తస్మా దేతే వేదా ఉచ్యన్త ఇత్యాహ జాత మాత్రాఇతి....చత్వారోఽప్యేతే శుద్ధస్యోపాధితాం గత్వా స్వైఃస్వై ర్గుణై ర్విశిష్టేన రూపేణ పురుషం విశ్వాదిరూపం కుర్వన్తీ త్యర్థః ।' — నీలకంఠః.

ఋక్ - యజుః - సామ - అథర్వణ వేదములు నాల్గును నిత్యము, శుద్ధము నగు బ్రహ్మకు ఉపాధులై యావిర్భవించి తమతమ విశిష్టగుణములచే పురుషుని, క్రమముగ 'విశ్వ - తైజస — ప్రాజ్ఞ - తురీయ' రూపునిగ నొనరించును. ఇట్లు క్రమముగ పురుషుని విశ్వాదిరూపునిగ దర్శింపజేసి తుదకు తురీయాతీత వేద (జ్ఞాన) స్వరూపము ప్రాప్తింప జేయుట వేదము యొక్క వేదతత్త్వము. (తేన విదంతి తత్పదమ్-విద్ఌ లాభే) -అని యర్థము. ఈ హరివంశవచన తాత్పర్యమే- 'అథవా బ్రహ్మాధీన మాత్మానం లభన్త ఇతి వా వేదాః, అథవా బ్రహ్మణ ఆత్మతయా లాభహేతవ ఇతి వా వేదాః' అను నిర్వచనముల ద్వారా శ్రీ శంకరభగవత్పాదులచే వివరింపబడుట గమనార్హము.

కాన 'వేదయతి ధర్మాదిం ఇతి వేదః ; అథవా వింద్యతే లభ్యతేఽనేన ధర్మాదిః ఇతి వేదః' -అను నిర్వచనములు పర్యవసితములగుచున్నవి. అతీంద్రియ

ధర్మస్వరూపమును బ్రహ్మస్వరూపమును, (పరమేశ్వర తత్త్వమును) తెలియ జేయుట వేదము యొక్క వేదత్వ మని తెలిసినది.

వేదవిహితమైన ధర్మము (ధర్మాచరణము), తదవిరుద్ధము లయిన యర్థ కామములు గూడ పురుషార్థములై వేదము (పరమేశ్వరు) నుపలక్షింప జేయునవి యగును. కాన, పై నిర్వచనముల ననుసరించి (వేదం పరమేశ్వరం వేదయ స్తీతి) ధర్మార్థకామము లనెడి పురుషార్థములందును వేదత్వము లక్షిత మగుచుండును. వేద శబ్దము వలెనే ధర్మ — అర్థ - కామ శబ్దములు గూడ పరమేశ్వరునకు వాచక ములై వరలుటయు, నిందుకు తార్కాణము. ఈ విషయము వేదస్ (అర్థ), కామ, ధర్మశబ్దపరిశీలనము వలన స్పష్టమగును.

## వేదః- (సకారాన్తపదము) -ధనము (శ్రుత్యం ధనమ్)

వేదములందు 'వేదః' అను సకారాన్త పదము గూడ గలదు. జ్ఞానము లేక ధనము (లేక పరమైశ్వర్యము) అని పదమున కర్థములు పెక్కు చోటుల వివ రింపబడినవి. 'వేద - వేదస్' శబ్దముల వ్యుత్పత్త్యర్థములు సమానములు.

'వేదః విద్య లాభే - అసున్ । విన్దత్యేతత్ । లభ్యతే వాఽనేన ధర్మాదిః । హోతారం విశ్వవేదసం. ఋ 1-12-1 ; జాతవేదసే సునవామ. —ఋ, 1-99-1 - వైదికనిఘంటువ్యాఖ్య - దేవరాజయజ్వ

వేదచోదిత కర్మాద్యనుష్ఠానము ద్వారా దేవతానుగ్రహముచే ప్రాప్తించు ధనముగాని, లేక తదర్థమై వినియోగింపబడెడి ధనము గాని, తదితర లౌకిక ధనము కంటె విలక్షణమై పురుషార్థ సాధక మగును. అనగా, దేవతా ప్రసాద రూపమగునట్టి ధనమే (ఐశ్వర్యమే లేక జ్ఞానమే) వేదరూప పరమేశ్వరుని దర్శింప జేసి, తత్ప్రాప్తిసాధన మగుచు (వేదయతి వేదం) 'వేదః అను సార్థకనామము నొందును. వేదోక్తకర్మదీక్షితు డగు యజమానుడు అట్టి ధనము (వేదస్)తో తనను నింపుమని వేదరూపుడగు దేవుని యర్థించుట వేదమునం దిట్లు గలదు.

"వేదోఽసి, వేదో మా అధర, తృప్తోఽహం తృప్త స్త్వమ్"

— మై. సం. 1-4-22

దేవా ! నీవు వేదస్వరూప (వేదోఽసి): వేదముతో (పశుపుత్రాది ధనముతో లేక పరమైశ్వర్యముతో—జ్ఞానముతో) నన్ను నింపుము; అట్టి ధనముతో నేను తృప్తుడ నగుదును; ఆ ధనము నీ కైంకర్యమునకు వినియోగింపబడినది యగుటచే నీవును తృప్తుడ వగుదువు-అని యర్థము.

సామాన్యముగ నర్థము (ధనము) నర్థింపని వారుండరు. ఏదియేని కోరికను లేక సుఖము నుద్దేశించియే యీ యర్థ మర్థింప బడుచుండును. ఎట్టి యర్థ మర్థింపబడవలెనో, యెట్లది వేదరూప మగునో, వేద మిట తెలియచేయుచున్నది (వేదం పరమేశ్వరం వేదయతీతి వేదనః వేద స్తస్మై). సుఖప్రాప్తిసాధనమై యర్థింపబడునది యగుటచేత నే ధనాదికము 'అర్థః' అని చెప్పబడుచున్నది. సుఖ (నిరతిశయానంద)రూపుడై యందఱిచే నర్థింపబడువా డగుటఁజేసి పరమేశ్వరునకు 'అర్థః' (పరమార్థః)' —అని పేరు.

'సుఖరూపత్వాత్ సర్వై రర్థ్యత ఇతి అర్థః'

—శం. భా. విష్ణు సహస్రనామ

అట్టి పరమేశ్వరుని కొఱకు వినియోగింపబడి తత్ప్రాప్తి సాధనమగు ధనము లేక జ్ఞానము వేదము (వేదస్) అగునని పై మంత్రమున దెల్పబడుచున్నది. అట్టి ధనమే ఆరాధకునకును ఆరాధ్యులగు దేవునకును తృప్తిని కల్గించునని శ్రుతి తాత్పర్యము. వేదవాక్కుచే- వేదవిహిత ధర్మాద్యాచరణముచే సిద్ధించెడి ధనమే 'వేదః' అగు ననెడి యర్థము పర్యవసిత మగుచున్నది. కావుననే యిట్టి ధనమును 'శ్రుత్యమ్' అని ఋగ్వేదము కీర్తించినది.

"అస్మే రయిం నాసత్యా బృహంత మపత్యసాచం శ్రుత్యం రరాథామ్" ఋ. 1-117-23

'హే నాసత్యౌ ! అశ్వినౌ, బృహన్తం మహాన్తం అపత్యసాచం అపత్యైః పుత్రాదిభిః సమవేతం, శ్రుత్యం ప్రశంసనీయం ఉత్కృష్టం రయిం ధనం రరాథామ్ ప్రయచ్ఛతమ్ ।.... శ్రుత్యం శ్రుతిః స్తుతిః తత్ర భవమ్' — సా.భా.

అశ్వినులారా : శ్రుతి సంస్కారక్రమసంశ్రుతమై (శ్రుత్యం), పుత్రపౌత్రాది రూపమున నింతిశయముగ వర్ధిల్లెడి (బృహన్తం) యైశ్వర్యమునను గ్రహింపుడు-అని యర్థము.

## కామః-కామేశ్వరః :-

ఇక కామము వేదరూపు డగు పరమేశ్వరుడే "ధర్మావిరుద్ధః కామోఽహమ్"- అని గీతయందు తనను తాను కీర్తించుకొనినాడు. అనగా ధర్మావిరుద్ధమైన కామము. లౌకిక విషయకామనల కంటె విలక్షణమై, పరమేశ్వరుని దర్శింపజేసి తత్ప్రాప్తిసాధన మగుచు (వేదయతి) వేద స్వరూపమే యగుచున్నది

"కామహా కామకృత్ కాన్తః కామః కామప్రదః ప్రభుః"

—విష్ణుసహస్రనామ

లౌకికమగు కోరికల ద్రుంచువాడు; సాత్త్వికకామనల బ్రేరేపించువాడు; కామజనకుడు; కమనీయతమ రూపము గలవాడు; భక్తులకు కోరికల గురియువాడు; ప్రభువు-నగు పరమేశ్వరు డిట 'కామః' అని కీర్తింపబడినాడు.

'కామ్యతే పురుషార్థాభికాంక్షిభి రితి కామః'—శం.భా.

పురుషార్థముల గాంక్షించువారిచే గోరబడువాడు- అని యర్థము. ఇట్లందఱిచే కామ్యమాను డగుటచే పరమేశ్వరుడు 'కామ' శబ్దవాచ్య డగుట ఋగ్వేద మిట్లు వివరించుచున్నది.

"యత్రానందాశ్చ మోదాశ్చ ముదః ప్రముద ఆసతే ।
కామస్య యత్రాప్తాః కామా స్తత్ర మా మమృతం
కృధీన్ద్రాయేన్దో పరిస్రవ ॥" —ఋ. 9-113-11.

ఏ లోకమునందు ఆనందమోదాదులు విలసిల్లుచుండునో, మరియు నెచట కాముని యొక్క (అనగా కామ్యమానుడైన పరమేశ్వరుని యొక్క) కామము లన్నియు ప్రాప్తము లగునో, యచట నన్ను అమృతస్వరూపునిగ విలసిల్ల జేయుము- అని యర్థము. (చూ. సా. భా.) పరమేశ్వరుని యొక్క యీ ఆప్తకామత్వమును, కామేశ్వరత్వమును, ఉపనిషత్తులు పెక్కు రీతుల వివరించియున్నవి (చూ - బృ. ఉ. 4-4-6; 3-2-11; ప్రశ్న ఉ. 6-5; ము.ఉ. 3-2-7; తై.ఉ. 2-1; 8-5 మొ॥).

ఈ 'కామ' శబ్దము యొక్క నిర్వచనములు 'వేదోఽసి, వేదో మా అభవ. తృప్తోఽహమ్, తృప్తస్త్వమ్' - అనెడి పై శ్రుత్యర్థమును తలపింప జేయుచు నిత్యతృప్తత్వమును లేక అవాప్త సర్వకామత్వమును (అమృతత్వమును) బోధించుచున్నవి ఇంతే కాదు.

"యో జాగార తమృచః కామయన్తే యో జాగార తము సామాని యన్తి ।
యో జాగారం తమయం సోమ ఆహ తవాహ మస్మి సఖ్యేన్యోకాః ॥
అగ్ని ర్జాగార తమృచః కామయన్తేఽగ్నిర్జాగార తము సామాని యన్తి ।
అగ్ని ర్జాగార తమయం సోమ ఆహ తవాహ మస్మి సఖ్యేన్యోకాః ॥"

—ఋ. 5-45-14; 15; సా.సం. 2-1177.

వినిద్రుడై - సర్వదా జాగరూకుడై - ఎవడు వెల్గొందుచుండునో యా యగ్నిని ఋక్కులు కాంక్షించుచున్నవి; సామలును ఆ యగ్నినే బొందుచున్నవి యజుస్సులచే త్యాగ మొనర్పబడిన సోమము- 'నేను నీదానను, స్వీకరింపు' మని ఆ యగ్నితో జెప్పికొనుచున్నది. అట్టి నీ సఖ్యము (హితకరణము) నందే నియతుడనై యున్నాను.' అని మంత్రార్థము,

ఈ మంత్రమునందలి అగ్నిపదము అధియజ్ఞముగ గృహపతి యగు నగ్నిని (గార్హపత్యాగ్నిని), ఆధ్యాత్మికముగ జీవరూపుడగు అగ్నిని (ఆత్మను), అధిదైవికముగ పరంజ్యోతి యగు అగ్నిని ఉపలక్షింప జేయుచున్నది. ఋగ్యజుః సామాత్మకములైన మంత్రములచేతను, హవిర్దాతయగు యజమానుని చేతను ఆ యగ్ని కాంక్షింపబడుట యీ మంత్రమున జెప్పబడినది. ఇట్లు కాంక్షింపబడుటజేసి అగ్ని (పరమేశ్వరుడు) 'కామ' పదవాచ్య డగుట సూచిత మగుచునే యున్నది.

ఇచట ఋగ్యజుఃసామలకు అగ్నితో (పరమేశ్వరునితో) గల నిరంతర సఖ్యము వివరింపబడినది. అట్టి సఖ్యమునే యజమానుడును కాంక్షించుచున్నాడు. అట్టి సఖ్యమే (కామమే) అతడు కాంక్షించు ధనము. అయ్యది పరమేశ్వరు నుపలక్షింపజేయుచు తత్ప్రాప్తిసాధనమగుచు వేదః (వేదయతీతి) అగుచున్నది. కాన "ధర్మావిరుద్ధః కామోఽహమ్" అను పై గీతావాక్యము శ్రుతితాత్పర్యానుగుణ మగుట స్పష్టము.

## ధర్మః:-

ఇట్లు ధర్మావిరుద్ధములగు అర్థకామములు వేదరూపము లగుచో ధర్మము వేదరూప మగుట స్పష్టము. ధర్మము వేదస్వరూప మగుట మహాభారత మిట్లు వివరించుచున్నది.

"యశ్చ దండః స దృష్టో నో వ్యవహారః సనాతనః ।
వ్యవహారశ్చ దృష్టో యః స వేద ఇతి నిశ్చితమ్ ॥
యశ్చ వేదః స వై ధర్మో యశ్చ ధర్మః స సత్పథః ।"

—భార. శాన్తి 56-57.

కాన, ధర్మమునకు వేద మనియు ప్రసిద్ధి; పరమేశ్వరునకును ధర్మః అని ప్రసిద్ధి గలదు.

"రామో విగ్రహవాన్ ధర్మః"- రామాయణమ్.
"వీరః శక్తి మతాం శ్రేష్ఠో ధర్మో ధర్మని దుత్తమః"

—భార. విష్ణు సహస్రనామ.

'సర్వభూతానాం ధారణాత్ ధర్మః, అణు రేష ధర్మ
ఇతి శ్రుతేః । ధర్మై రారాధ్యత ఇతి వా ధర్మః' -శం.భా.

సర్వభూతములను ధరించుటచేతను, ధర్మములచే నారాధింపబడుట చేతను పరమేశ్వరునకు 'ధర్మః' అని సార్థకనామము. 'బిభర్తి సర్వభూతాని వేద శాస్త్రం సనాతనమ్' - అను మనుస్మృతి వాక్యమును ఈ యర్థమునే తలపింప జేయుచు వేదమునకు గల ధర్మత్వమును స్ఫురింపజేయుచున్నది పురాణేతిహాసాదు లందే గాక వేదమున గూడ బెక్కుచోట్ల (ఋ. 3-17-1; 10-92-2 ఇత్యాది) పరమేశ్వరుడు ధర్మః అని కీర్తింపబడినాడు. వేద-దేవ స్వరూప మగు ఈ ధర్మమే సర్వ జగత్తుకు (సర్వభూతములకు) ఆధార మని శ్రుతి చెప్పుచున్నది.

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా । లోకే ధర్మిష్ఠం ప్రజా ఉప
సర్పన్తి । ధర్మేణ పాప మపనుదతి । ధర్మే సర్వం ప్రతిష్ఠితమ్ ।
తస్మా ద్ధర్మం పరమం వదన్తి" —తై. ఆ. 10-63-7.

ఇట్లు ధర్మ–అర్థ–కామ శబ్దములు సంప్రదాయాసిద్ధమైన అర్థగాంభీర్యముతో నొప్పుచు వేదత్వ (పరమేశ్వరతత్త్వ)-ఉపలక్షకము లగుచున్నవి. కాని, 'ధర్మ' అను పదము Duty, Conduct, Moral ఇత్యాది పదములచేతను, 'అర్థ' అను పదము Money, wealth; matter ఇత్యాది పదముల చేతను, 'కామ' అను పదము Desire, Will, Love ఇత్యాది పదములచేతను ననువదింపబడుచున్నవి. ఈ భాషాంతరీకరణములు ఆ పదముల యర్థ గాంభీర్యమును, వానిచే నుపలక్షిత మయ్యెడి వేదత్వమును నే మాత్రము దర్శింపజేయజాలి యుండలేదు.

## శ్రుతులు : వేద-దేవశబ్దములు :-

'వేదః' అను నామముచే పరమేశ్వరుడు కీర్తింపబడుటయు, వేద-దేవ శబ్దములు రెండును పర్యాయపదములై వర్తిల్లుటయు శ్రుతులయందు స్పష్టముగ గాంచనగును.

"జాతవేదసే సునవామ సోమ మరాతీయతో ని దహాతి వేదః"
-ఋ. 1-99-1 ; ఐ.బ్రా. 4-30-12, తై.ఆ. 10-2-1 నిరు. 14-3 .
'స్వయం సర్వం వేత్తీతి వేదః సర్వజ్ఞః అగ్నిః ; వేదాంసి
వేదనాని జ్ఞానాని. తాని జాతా న్యుత్పన్నాని యస్మా దగ్నేః
సోఽయం జాతవేదాః' —సా.భా.తై.ఆ.

ఇట 'స్వయం సర్వం వేత్తీతి వేదః'- అని వేద శబ్దము నిర్వచింపబడినది. సర్వజ్ఞుడు–అని యర్థము పూర్వము 'వేదయతీతి దః' అను నిర్వచనము జూపబడినది. దాని ననుసరించి 'జ్ఞానముచే నజ్ఞానాంధకారమును దొలగించి ఆత్మ స్వరూపమును దర్శింపజేయువాడు'- అని యర్థము. ఈ యర్థమే, 'వేదాంసి జ్ఞానాని జాతాని యస్మా దగ్నేః స జాతవేదాః'- అను జాతవేదశ్శబ్ద నిర్వచనముచే దెలియజేయబడుచున్నది. జ్ఞానప్రదాత యని భావము. జాతవేదశ్శబ్దమును మహాభారత మిట్లు నిర్వచించుచున్నది.

"పావనా త్పావకశ్చాసి వహనా ద్ధవ్యవాహనః ।
వేదా స్త్వదర్థం జాతా వై జాత వేదస్తతో హ్యసి" ॥
- భార. 231-42.

ఓ యగ్నీ ! సర్వము పావనము చేయువాడ వగుటచే పావకుడవు; హవ్యముల వహించుటచే హవ్యవాహనుడవు; వేదములు నీ కొఱకయియే జాతములు—ఆవిర్భూతములు; కాన జాతవేదుడవు- అని యర్థము. ఇట వేదములు అగ్నికొఱకై -పరమేశ్వరునికొఱకై- అనగా పరమేశ్వరతత్త్వ ప్రతిపాదనమున కయియే యావిర్భవించినట్లు వేదముల పరమ తాత్పర్యము చెప్పబడినది.

కాగా, పై నిర్వచనముల ననుసరించి వేదము లెవనినుండి యావిర్భవించినవో, యెవనిని ప్రతిపాదించుట కావిర్భవించినవో యట్టి యగ్నికి (పరమేశ్వరునకు) 'జాతవేదాః'- అని యన్వర్థనామ మగుట దెలియును. ఇక వేద-దేవ శబ్దములు పర్యాయపదము లగుట జూతము.

"వేదోఽసి యేన త్వం దేవ వేద దేవేభ్యో వేదోఽభవః
తేన మహ్యం వేదో భూయాః ॥"

—వా. సం. 2-21; కాణ్వ. సం. 1-35.

యజ్ఞమున కుశముష్టినిర్మిత పదార్థమునకు 'వేదః' అని పేరు. యజమాన పత్ని ఆ వేదమును సంబోధించుచు జెప్పెడి మంత్ర మిది. హే వేద ! నీవు ఋగ్యజుః సామాత్మక వేదస్వరూపుడవు; జ్ఞాతవు - సర్వజ్ఞుడవగు దేవుడవు: వేదరూపుడవగు నో దేవా ! నీవు దేవులకు (దైవీశక్తి సంపన్నులకు) వేదరూపుడ వయి పొడగట్టుదువు. అట్లే నాకును (దైవీ సంపద నొసగి) వేదరూపుడవుగా సాక్షాత్కరింపుము- అని యర్థము.

('త్వం వేదోఽసి ఋగాద్యాత్మకోఽసి యద్వా వేత్తీతి వేదః జ్ఞాతాసి'
—మహీధరః చూ; ఉవట భాష్య

ఇట హే వేద ! హేదేవ ! యని వేదము (దర్భముష్టి) సంబోధింపబడుటచే వేద-దేవ శబ్దములు పర్యాయపదములుగ వర్తిల్లుటయు, దేవుడు వేదస్వరూపు డగుటయు గాంచనగును.

పూర్వ ముదాహరింపబడిన 'అగ్నిర్జాగార' యను మంత్రమున ఋగ్యజుః సామాత్మక వేదరాశికి లక్ష్యము నిరంతర జాగరణశీలుడగు దేవుడే యని జెప్పబడినది. ఇట 'వేదోఽసి' యను నీ మంత్రము దేవులకు (దైవీశక్తి సంపన్నులకు) నా దేవుడు వేదముగా గోచరించు నని చెప్పబడినది. అందుచే దివ్యశక్తి పెంపొం

దించుకొనిన కొలది వేదమునందలి వేదత్వము లేక సర్వజ్ఞత్వము గాంచ శక్య మగు నని తెలియుచున్నది. కావున, దైవీశక్తి పెంపొందించుకొని, మంత్రములకు దేవునితో గల నిరంతర సఖ్యమును దర్శింపనిచో— 'నా వేదములు కేవల మొక శబ్ద రాశిగనో లేక యాదిమ నివాసుల ఆర్థిక సాంఘిక రాజకీయాది సంఘటనలుగనో లేక కేవలము ప్రార్థనాదికమును సూచించెడి ప్రాచీనుల రచనలుగనో'- గోచరించుటయు సూచిత మగుచున్నది.

## అగ్నిః, వేదః-జీవునకు జన్మసిద్ధనామములు :-

"అగ్ని రస్మి జన్మనా జాతవేదా ఘృతం మే చక్షు
రమృతం మ ఆసన్ । అర్క స్త్రిధాతూ రజసో
విమానోఽజస్రో ఘర్మో హవి రస్మి నామ ॥"

—ఋ. 3-26-7; వా.సం. 18-66; మై.సం. 4-12-132; నిరు. 1-42.

ఈ మంత్రము "అగ్నియే సర్వము"— అని అగ్న్యద్వైతమును బోధించునది. దీనికి యజ్ఞమున వినియోగము లేదు. (అగ్న్యద్వైతవాదినీ త్రిష్టుప్ యజ్ఞేఽవినియుక్తా—మహీధరః). కాని యజమాను డీ మంత్రమును జెప్పుచు 'నేను జన్మతః జాతవేదుడగు నగ్నిని'— అని యీ రీతిగ తనను సర్వాత్మకుడగు పరమేశ్వరునిగ భావన జేయవలెను.

శాస్త్రము (వేదము) అజ్ఞాతజ్ఞాపకము అనగా మానవులు లౌకిక వ్యవహార నిమగ్నులై తెలియజాలని అతీంద్రియ విషయముల నుపదేశించునది (వేదయతి) 'నేను దేవదత్తుడను లేక యజ్ఞదత్తుడను'- అని లౌకిక వ్యవహారమున బరగుచు పరిచ్ఛిన్నుని వోలె భ్రమించు యజమానునకు నాతని ఆత్మస్వరూపము అపరిచ్ఛిన్నుడగు (Unconditioned) అగ్నియే (పరమేశ్వరుడే), లేక వేదమే యని పై మంత్రము జ్ఞాపకము చేయుచున్నది.

బృహదారణ్యకాదిశ్రుతులు నీ విషయము నిట్లు వివరించినవి.

"అథాఽస్య నామ కరోతి వేదోఽసీతి ।
తదస్య గుహ్యమేవ నామ భవతి"

-బృ. ఉ. 8-26.

'లోకే వ్యవహారో నాస్తీత్యాశంక్యాహ - తదస్యేతి ।
యత్తద్వేద ఇతి నామ తదస్య గుహ్యం భవతి ।
వేదనం వేదః సర్వస్య నిజస్వరూప మిత్యర్థ ఇతి ।'

-ఆనందగిరి

"అంగాదంగాత్సంభవసి హృదయా దధిజాయసే ।
వేదో వై పుత్రలమాసి ఇతి" -ఆవ. గృ.సూ. 1-15-3.

ఇవి నామకరణసమయమున జెప్పెడి మన్త్రములు. తండ్రి, పుట్టిన శిశువునకు వ్యవహారయోగ్యములైన దేవదత్తాది నామముల బెట్టును. కాని శ్రుతి, పుట్టిన ప్రతివానికిని గల 'వేదః' అను గుహ్యనామమును జ్ఞాపకము చేయుచున్నది. అందుచేతనే నామకరణ సమయమున తండ్రి శిశువును 'వేదోఽసి - నీవు వేద స్వరూపుడవు'— అని యథార్థము. గుహ్యము నగు వేదనామముతో బిలుచును. కాన 'అగ్నిరస్మి జన్మనా జాతవేదాః' ఇత్యాది ఋక్కుల యొక్క అర్థమునే బృహదారణ్యకాది శ్రుతులు వివరించుచున్నవనుట స్పష్టము.

'అగ్నిరస్మి జన్మనా'- అను మంత్రమున గల 'త్రిధాతుః' అను పదము 'పరమేశ్వరుడు ఋగ్యజుఃసామాత్మకు'డని బోధించుచున్నది ఉవట మహీధరు లిర్వురు నిట్లే వ్యాఖ్యానించిరి. సాయణునకును పరతత్త్వ రూపమును సాక్షాత్కరించు కొనిన యగ్ని (ముక్తపురుషుడు) తన సర్వాత్మకత్వానుభవము నావిష్కరించు చున్నట్లు ఈ మంత్రమును వివరించినాడు. కనుక నీ మంత్రమున అగ్ని యన సర్వాత్మకుడగు పరమేశ్వరు డనుట నిర్వివాదము. కాని, 'త్రిధాతుః' అనగా అగ్ని వాయ్వాదిత్యాత్మకుడు అని శ్రీ సాయణుడు వ్యాఖ్యానించెను. అగ్ని - వాయు - ఆదిత్యులు, ఋక్—యజుః-సామాత్మకు లగుట శ్రుతి సిద్ధమే.

"స ఇమాని త్రీణి జ్యోతీం ష్యభితతాప । తేభ్య స్తప్తేభ్య
స్త్రయో వేదా అజాయన్త । అగ్నేర్ ఋగ్వేదః
వాయో ర్యజుర్వేదః సూర్యా త్సామవేదః ।"

-శ. బ్రా. 11-5-8-3.

"ఋగ్వేద ఏవాగ్నే రజాయత । యజుర్వేదో వాయోః ।
సామవేద ఆదిత్యాత్ ।" -ఐ. బ్రా. 5-5-7.

అగ్ని-వాయు-ఆదిత్యుల నెడి జ్యోతిస్త్రయము నుండి ఋగ్యజుఃసామ వేదము లావిర్భ వించినవని యర్థము. కనుక, త్రిధాతు పదముచే యజమానుడు తనను అగ్ని-వాయు-ఆదిత్యాత్మకునిగను, ఋగ్యజుః సామాత్మక వేదస్వరూపునిగను భావన జేయవలె నని శ్రుతి బోధించుచున్నది. ఈ మంత్రము తరువాతి మంత్రములో వాజసనేయసంహిత పరమేశ్వరాభిన్నుడనని భావనజేయు యజమానుని యొక్క యీ త్రిధాతుత్వము నిట్లు స్పష్టము జేయుచున్నది.

"ఋచో నామాస్మి యజూంఁషి నామాస్మి సామాని నామాస్మి"

—వా. సం. 18-67.

నేను ఋగ్రూపుడను; యజూరూపుడను; సామరూపుడను—అని యర్థము. కాన, యజమానుడు తనను ఋగ్యజుఃసామాత్మక వేదరూపునిగను, లేక అగ్నివాయ్వా దిత్యాత్మక జాతవేదరూపునిగను నిరంతరము భావన జేయుచుండవలె నని శ్రుతి యుపదేశము.

బృహదారణ్యక శ్రుతియు పుట్టిన శిశువు విషయమై యిట్లు జెప్పు చున్నది.

"అథ జాతకర్మ............
అథాఽస్య దక్షిణం కర్ణ మభినిధాయ వాగ్వాగితి త్రిః"

— బృ. ఉ. 6-4-25.

'అథాస్య దక్షిణం కర్ణ మభినిధాయ స్వం ముఖం
వాగ్వాగితి త్రిర్జపేత్'

—శం. భా.

'అస్య జాతస్య శిశో రిత్యర్థః । త్రయీలక్షణా వాక్ త్వయి
ప్రవిశత్వితి జపతోఽభిప్రాయః'

—ఆనందగిరి

జాతకర్మ సమయమున తండ్రి తన ముఖమును పుట్టిన శిశువు యొక్క కుడిచెవి కభి ముఖముగ నుంచి వాక్ - వాక్ — వాక్ అని మువ్మారు జపింపవలెను. త్రయీ లక్షణ మగు వేదవాక్కు శిశువు నావేశించుగాక—యని యను .

పుట్టినతోడనే ఋగ్యజుఃసామాత్మకమగు వేదవాక్కు శిశువు నిట్లావేశించును-అతడు ఋగ్రూపుడు, యజూరూపుడు, సామరూపుడు నగునని దర్శింపజేయును, పిదప 'వేదోఽసి; వేదో వై పుత్రనామాసి'- యనుచు నామకరణ సమయమున యథార్థము, గుహ్యము నగు జీవునియొక్క 'వేద' స్వరూపమును జ్ఞాపకము చేయ మొదలిడును. క్రమముగ వేదాధ్యయన సమయముననను, కర్మానుష్ఠానోపాసనాది సమయములందును పెక్కురీతుల యజమానునకు లేక ఉపాసకునకు గల యథార్థ 'వేద' స్వరూపమును 'అగ్నిరస్మి జన్మనా జాతవేదాః; ఋచో నామాస్మి....'' ఇత్యాద్యనేక మంత్రముల ద్వారా జ్ఞప్తికి దెచ్చుచుండును. సర్వకర్మసన్యాస మొనర్చిన యతిని వ్యావహారిక (దేవదత్త యజ్ఞదత్తాది) నామములతో గాక, భారతీ-సరస్వతీత్యాది వేదనామములతో వేదస్వరూపునిగ దర్శింపజేయును తుదకు బ్రహ్మవిదులై బ్రహ్మ (వేద) స్వరూపులై జన్మరాహిత్యము నొందువఱకును అజ్ఞాతార్థజ్ఞాపక మగుచు, తోడ నుండి, యంతట నుపరతవ్యాపారమగును. ఇట్లు జన్మించినదాది జన్మరాహిత్యము నొందువఱకు తోడ నుండి యడుగడుగున యజ్ఞాతార్థజ్ఞాపనశీలమై వెలయుటయే (వేదయతి) వేదము యొక్క వేదత్వము.

కాన, పరమేశ్వరుడు వేదస్వరూపుడు, వేదగర్భుడు లేక వేదాత్మకుడనియు. వేదము అతీంద్రియ ధర్మబ్రహ్మ స్వరూపబోధక మగుచు తన నారాధించువారి తోడ నుండి వారిని వేదాత్మకులను (తద్రియాన్వరూపులను) వేద (బ్రహ్మ) స్వరూపుల నొనర్చు ననియు తెలసినది.

ఇట్లు వేదములే గాదు. పురాణేతిహాసాదులు గూడ దేవుడు వేదస్వరూపుడు, వేదాత్మకుడు నని పెక్కు రీతుల గీర్తించి యున్నవి.

"సంస్కారాత్తేఽభవన్ వేదాః"—రామాయణమ్, 6-120-20

"ఋగ్వేద స్త్వం యజుర్వేదః సామవేద స్త్వథర్వణః"

— విష్ణు పు. 5-1-36

"యం బృహన్తం బృహత్యుక్థే యమగ్నౌ యం మహాధ్వరే ।
యం విప్రసంఘా గాయన్తి తస్మై వేదాత్మనే నమః ॥"

ఋగ్యజుః సామధామానం దశార్ధహవిరాత్మకం ।
యం సప్తతంతుం తన్వన్తి తస్మై వేదాత్మనే నమః ॥

—భార. 12-47-43,44

"వేదప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్విపర్యయః ।
వేదో నారాయణః సాక్షా త్స్వయంభూ రితి చ శ్రుతిః ॥"

భాగ 61-40.

## పృశ్నిః-పృశ్నిగర్భః-వేదగర్భః-వేదగర్భా :-

పై స్మృతి వచనములు దేవుడు వేదస్వరూపు డగుటయు, వేదము స్వయంజాత మగుటయు శ్రుతియభిప్రాయ మని తెల్పుచున్నవి. 'ఋగ్యజుః సామధామానం-వేదాత్మనే' అను పదములచే పరమేశ్వరుడు వేదమయుడు, వేద గర్భుడు నగుట దెలియును. అందుచేతనే దేవునకు 'పృశ్ని గర్భః' అనియు ప్రసిద్ధి

"పృశ్ని రిత్యుచ్యతే చాన్నం వేద ఆపోఽమృతం తథా ।
మమైతాని సదా గర్భః పృశ్నిగర్భ స్తతో హ్యహమ్ ॥"

—భార. శాన్తి. 341-45

'పృచ్ఛ న్త్యేనం జిజ్ఞాసవో ధర్మజాత మితి, పృచ్ఛ న్త్యేనం
క్షుధితాదయ ఇతి వా పృశ్ని ర్వేదోఽన్నాది వా గర్భో గర్భస్థానిః
అతః పృశ్ని గర్భోఽహ మిత్యర్థః ।' —నీలకంఠవ్యాఖ్య.

అన్నము, జలము, అమృతము, వేదము - ఇవి 'పృశ్ని' యని చెప్పబడుచున్నవి. ఇవి యెల్లపుడును నా గర్భమున నుండునవి. కాన, నేను పృశ్ని గర్భుడను- అని యర్థము.

పరాదేవతయు నిట్లే పురాణములయందు 'వేదమాతా' 'వేదగర్భా' యని కీర్తింపబడినది.

"వేదాధిష్ఠాతృదేవీం చ వేదశాస్త్రస్వరూపిణీమ్ ।
వేదబీజస్వరూపాం చ భజే తాం వేదమాతరమ్॥"-దేవీ. భా. 9-26-52
"వేదమాతర మేకాం చ విద్యాం భవతరోః స్థిరామ్ ।"
-దేవీ. భా. 3-1-34

"వేదగర్భా విశాలాక్షీ సర్వేషా మాది రీశ్వరీ ।" -దేవీ భా. 3-3-53
"ప్రకృతి స్త్వం పరా సూక్ష్మా బ్రహ్మగర్భాఽభవః పురా ।
తతో వాణీ జగద్ధాతు ర్వేదగర్భాఽసి శోభనే॥
సృజ్యస్వరూపగర్భాఽసి సృష్టిభూతా సనాతనే ।
బీజభూతా తు సర్వస్య యజ్ఞభూతాఽభవ త్త్రయీ ॥" -విష్ణు ?-?-78.

ఇచట పరాదేవి వేదగర్భ, బ్రహ్మగర్భ, వేదమాత - ఇత్యాది పదములచే వేదస్వరూపిణిగ ప్రతిదినము ధ్యానింపబడవలెనని విధింపబడుచున్నది.

"ఛందసాం మాతా; వరదా వేదమాతా"
అని త్రిసంధ్యలయందు పరాదేవత ధ్యానింపబడుట ప్రసిద్ధమే.

## వేదపదములు దేవపదములు-దైవీవాక్ :

"అప్యేకం దేవపద మధీయీతైవ"
అను శతపథబ్రాహ్మణవచనము (11-5-6-9) వేదమునందలి పదము లన్నియు దేవపదములు; అనగా దేవతత్త్వ బోధకములు; శక్తిలేని యపుడు అందు ఏ యొక పదమునైన నధ్యయనము చేయవలయును గాని యూరకుండరాదని విధించుచున్నది. అట్లధ్యయనము జేయుచో ప్రచ్యుతుడు కాడనియు దెలుపుచున్నది.

పై ప్రమాణములచే పరమేశ్వరుడు వేదస్వరూపు డయినందున వేద - దేవ శబ్దములు పర్యాయపదము లగుట యుక్తమే. అంతేగాక వేదములందలి పదము లన్నియు దేవపదము లని శ్రుతి స్పష్టముగ బేర్కొనినది. ఇందలి ప్రతి పదము దేవ - తత్త్వబోధనమే పరమలక్ష్యముగా గలవి యగుటచేతనే శ్రుతికి దైవీవాక్, అమరభారతి, గైర్వాణీ ఇత్యాది నామములు ప్రసిద్ధము లయినవి. తచ్ఛాయరూప మగుటచేసి లౌకిక సంస్కృతమునకును నిట్టి ప్రసిద్ధి కలిగినది. కాని, శ్రుతి

గతపదములు లోకసిద్ధములైన యర్థకామములను ప్రబోధించుటకు గాని, లౌకికార్థములనే వివరించుటకు గాని ప్రవర్తించినవని చెప్పుట శ్రుతిసమ్మతము కాదు. ఈ విషయ మింకను బ్రహ్మశబ్దమున విపులముగ వివరింపబడినది. (చూ-వేదము-(బ్రహ్మత్వము) మనుస్మృతియు వేదస్వరూపము నిట్లు వివరించినది.

## విధానమ్-వేదః (శాశ్వతమగు చట్టము):-

"త్వమేకో హ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః ।
అచింత్య స్యాప్రమేయస్య కార్యతత్త్వార్థవి త్ప్రభో॥ " - మను. 1-3.
'యస్మాత్త్వమేకోఽద్వితీయః, అస్య సర్వస్య ప్రత్యక్షశ్రుతస్య స్మృత్యాద్యనుమేయస్య చ, విధానస్య విధీయంతేఽనేన కర్మాణ్యగ్నిహోత్రాదీనీతి విధానం వేదః, తస్య స్వయంభువః అపౌరుషేయస్య, అచింత్యస్య బహుశాఖావిభిన్నత్వాదియత్తయా పరిచ్ఛేత్తు మయోగ్యస్య, అప్రమేయస్య మీమాంసాది న్యాయనిరపేక్షతయాఽనవగమ్యమాన ప్రమేయస్య, కార్య మనుష్ఠేయ మగ్నిష్టోమాది, తత్త్వంబ్రహ్మ - 'సత్యంజ్ఞానమనంతంబ్రహ్మే' త్యాది వేదాంతవేద్యం, తదేవార్థః ప్రతిపాద్యభాగః, తం వేత్తీతి కార్యతత్త్వార్థవిత్'

—కుల్లూకభట్టవ్యాఖ్య

విధాన మనగా వేదము, అగ్నిహోత్రాది కర్మోపాసనాదికమును విధించునది యగుటచే వేదమునకు 'విధాన' మని పేరు.1 అది స్వయంజాతము (స్వయంభూః)

1. "అంతరాత్మక మాకాశం తన్మయం శ్రోత్ర మింద్రియమ్ ।
తస్య శబ్దం గుణం విద్యా న్మూర్తి శాస్త్రవిధానవిత్ ॥"-భార. 12-252-3
"విధానం వేదవాక్యమ్" - నీలకంఠవ్యాఖ్య.
"అపి వా సర్వధర్మః స్యాత్ తన్న్యాయత్వాద్విధానస్య".
జై.సూ.1-3-16.
"విధీయతేఽనేనేతి విధానం శబ్దః । సోఽనుమీయతే స్మృత్యా"
- శాబర.భా.

కాన, నపౌరుషేయము; అచింత్యము - అనంతశాఖావిలసిత మగుటచే నింత యని జెప్ప నలవిగానిది; మీమాంసాది న్యాయసాహాయ్యము లేక దెలియ శక్యము గానిది గాన అప్రమేయము; 'అనుష్ఠేయ మగు జ్యోతిష్టోమాదిరూపధర్మము (కార్యం), వేదాంతవేద్యమగు బ్రహ్మ (తత్త్వం)' — ఇవియే, అనగా నీ ధర్మ - బ్రహ్మ రూపార్థములే. వేద ప్రతి పాద్యార్థములు; అద్వితీయుడగు పరమేశ్వరు డొకడే అచింత్య - అనంత - వేదరహస్యాభిజ్ఞుడు (కార్యతత్త్వార్థవిత్) - అని యర్థము.

సామాన్యముగ 'స్వయంభూః, అచింత్యః, అప్రమేయః'- అను-పదములచే పరమేశ్వరుడు కీర్తింపబడుచుండును. అతడు వేదస్వరూపుడు నని పూర్వము చెప్పబడినది. తత్ప్రతిపాదక వేదరాశియు నిట నా పదముల చేతనే కీర్తింపబడుట గమనార్హము. ఇవి దేవునకు వేదమునకు గల సాధర్మ్యమును దెలియజేయునవి. మఱియు నిట (1) వేదము అపౌరుషేయము, (2) తత్ప్రతిపాద్యార్థము అతీంద్రియ ధర్మ - బ్రహ్మస్వరూపము, (3) అచింత్య — అప్రమేయ వేదరహస్యాభిజ్ఞుడు వేదరూపుడగు పరమేశ్వరుడొకడే — అను విషయములు స్పష్టము చేయబడినవి.

ఇట్లు సంప్రదాయవిదులు వేద మపౌరుషేయ మని ముక్తకంఠముగ కీర్తించిరి. ఈ విషయము వేదమంత్రార్థపరిశీలనము వలనను స్పష్టము కాగలదు

## వేదము పౌరుషేయ మగునా ?

పై నుదహరించిన మంత్రములు సూక్ష్మముగ బరిశీలించినచో వేదములు పురుషబుద్ధికల్పితములు కావనుటయు స్పష్టమగును.

"వేదోఽసి యేన త్వం దేవ వేద దేవేభ్యో
వేదోఽభవః । తేన మహ్యం వేదో భూయాః ।"

ఈ మంత్రమును జూతము.

ఈ వేదశబ్దరాశి పౌరుషేయమే యగుచో 'వేదమా ! నీవు దేవతలకు వేదము అయితివి: నాకును వేదము కమ్ము' అని ప్రార్థించుటేమి ? మొదట మంత్రములు, తర్వాత బ్రాహ్మణములు, తదుపరి ఆరణ్యకములు రచింపబడి

యుండునని గదా: చారిత్రకుల యూహ! అగుచో వారి ననుసరించి, తరువాత రచింప బడిన బ్రాహ్మణములు సంహితాగత మంత్రమునకు యజ్ఞమున వినియోగము చెప్పి యుండవలెను. అట్టియెడ మంత్రరచనాసమయమున నీ మంత్రమునకు యజ్ఞము నందు (దర్భముష్టి నుద్దేశించి చెప్పెడి) వినియోగము లేదుకదా! అగుచో "మహ్యం వేదో భూయాః" అనునెడ 'మహ్యం' అను పదమునకు 'నాకు'- అనగా 'వేద రచయితయగు నాకు'- అనియే యర్థమును జెప్పవలసి యుండును. తనచే రచి యింపబడెడి మంత్రభాగము నుద్దేశించి 'వేదోఽసి' (నీవు వేదముఅయి యున్నావు) అని చెప్పుచు - నీవు దేవతలకు వేదమైతివి అట్లే నాకును వేదము కమ్ము - అని కోరుచు రచయిత వేదమంత్రమును రచించుటలోని సామంజస్యమును గూర్చి కాని, సరస సమన్వయమును గూర్చి గాని విచారింపవలసి యుండును.

మఱియు వేదములు మానవరచనలే యగుచో ఈ ఋక్కులు యజుస్సులు, సామలు అన్నియు నేకకాలమున నొకని చేతనే రచింపబడినవని చెప్పవలనుపడదు. వేఱ్వేఱు కాలములయందు వేఱ్వేఱు రచయితలు వేఱ్వేఱు ఋక్కులు, యజుస్సులు, సామలు రచించి యుండవలెగదా! అట్టితఱి 'ఋచో నామాస్మి, యజూంషి నామాస్మి, సామాని నామాస్మి"- అని వేదరచయిత తనను ఋగ్యజుః సామస్వరూపునిగ భావించుటలోని యౌచిత్యమును గూడ బరిశీలింపవలసి యున్నది. తనచే రచింపబడక వేఱ్వేఱు కాలములందు వేఱ్వేఱు రచయితలచే రచింపబడిన, రచింపబడనున్న ఋగాది మంత్రము లన్నియు నేనే యని చెప్పి కొనుట లోకన్యాయవిరుద్ధము గదా!

ఇదియుగాక ఈ వేదములు మానవరచితములే యగుచో నగ్న్యా దేవతలు గాని, పరమేశ్వరుడు గాని వేదాత్మకు లగుట యెట్లు పొసగును? ఆనాటి రచయితలు ప్రకాశవంతములై గన్పట్టు భౌతికములగు అగ్ని, సూర్య, చంద్రాదుల జూచి దేవతలని భ్రమించినారనిగదా చారిత్రికుల కల్పన. భౌతికములగు నీ అగ్న్యాదులు వేదాత్మకములగుట యెట్లు? 'అగ్నేర్ ఋగ్వేదః వాయోర్యజుర్వేదః సూర్యాత్ సామవేదః'- అని శ్రుతులు జెప్పుచున్నవి. భౌతికములగు నీ యగ్ని వాయ్వాదిత్యుల నుండి వేదము లావిర్భవించుట యెట్లు? ఒకవేళ నెట్లో వీనినుండి యావిర్భవించినవని యనినను నపుడవి మానవరచనలని యెట్లు చెప్పనగును?

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై
వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" — శ్వేతా ఉ 6–18 ; గోపూ. 4-5

పరమేశ్వరుడు మొదట బ్రహ్మను సృజించి యా బ్రహ్మకు వేదముల నను గ్రహించినట్లు పై శ్రుతివాక్యము జెప్పుచున్నది. అట్టియెడ మానవరచితములని చెప్పబడెడి వేదములను పరమేశ్వరుడు బ్రహ్మకిచ్చుటెట్లు పొసగును ? ఇంతే కాదు.

"అహే బుధ్నియ మంత్రం మే గోపాయ ।
య మృషయ స్త్రైవిదా విదుః ।
ఋచః సామాని యజూగ్ంషి ।
సా హి శ్రీ రమృతా సతామ్ ।"

— తై. బ్రా. 1-1-10-3 ;5-2-1-26

"అహే అహింసితవ్య । బుధ్నియ బుధ్నే మూలే జగదాదా
వుత్పన్నా వసథ్య (అగ్నే): త్రీన్ వేదాన్ విదంతీతి త్రివిదః,
త్రివిదాం సంబంధినోఽధ్యేతార స్త్రైవిదా స్తే చ యం మంత్రభాగం
ఋగాది రూపేణ త్రివిధ మాహుః తం గోపాయ'

- పా.భా.తై.సం. 1-1-1-1 ;ఋగ్వేద-సా . వేద భాష్య భూమికలు.

ఇట అవసథ్యాగ్ని 'అహే, బుధ్నియ' యని సంబోధింపబడినాడు. అహింసితవ్యుడు, జగదాదియం దుత్పన్నుడు నగు అగ్ని యని యర్థము. ఋగ్యజుః సామరూప మగు త్రివిధ మంత్రజాతమును దర్శించినవారు త్రివిదులు. వీరే మంత్రద్రష్టలగు ఋషులు వారినుండి యా త్రయీవిద్య నధ్యయనము జేసిన వేద విదులు త్రైవిదులు ఆ సంప్రదాయము ననుసరించి గురుశిష్య పరంపరగా ప్రాప్తమైన యీ వేదమును నేడు నధ్యయనమొనర్చెడి వేదవిదులును త్రైవిదు లగుదురు. ఈ మంత్రజాతమును పరమేశ్వరుడు మొదట హిరణ్యగర్భప్రజాపతి కనుగ్రహించెను. ఆ మంత్రరాశిని మంత్రద్రష్టలగు ఋషులు దర్శించిరి. 'తా మన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్' అనుచు ఋగ్వేదము (10-71-3) నీ విషయమును స్పష్టము జేయుచున్నది. (చూ ఋషి శబ్దము)

పరమేష్ఠి నుండి నేటివఱకును గురుశిష్యపరంపరా రూపమున ప్రాప్తమై యే ఋగాదిరూపమగు మంత్రము (వేదము) నాచే నధ్యయనము చేయబడినదో యదియే యమృతస్వరూప మగు (అమరణ ధర్మము గల) సిరి (శ్రీః). మిగిలిన సిరు లట్టివి గావు. జగత్కారణ భూతుడవు, నిరంతరమారాధనీయుడవు నగు నో యగ్నీ ! అట్టి నా యీ మంత్రమును రక్షింపుము—అని పై మంత్ర తాత్పర్యము.

ఇది మంత్రావిర్భావస్వరూపమును, మంత్రము యొక్క అమృతశ్రీత్వ మును, మంత్రగోపనావశ్యకతయు వివరించెడి మంత్రము. ఈ మంత్రమునకు యజ్ఞకర్మలందే గాక నిత్యము జేయబడు దేవతారాధనమునందును వినియోగము గలదు. అందుచే పరంపరాప్రాప్త మగు నీ త్రయీ రూపమంత్రరాశిని రక్షింపు మనెడి యభ్యర్థనము ప్రతిదినము జేయబడుచుండుట గమనార్హము.

మంత్రములు ఆర్యులనెడి వారి రచనలే యనుచో నీ మంత్రార్థమెట్లు పొసగును ? త్రివిదులగు ద్రష్టలచే దర్శింపబడి, త్రైవిదులచే నధ్యయనము జేయ బడెడి యమృతశ్రీరూప మగు నా యీ ఋగ్యజుః సామరూప మగు మంత్రజాత మును రక్షింపు మని యీ మంత్రము యొక్క రచయిత అగ్నిని ప్రార్థించుటలోని సామంజస్య మేమి ? అభ్యర్థింపబడెడి యగ్ని భౌతికాగ్నియే యగుచో నది మంత్ర మును రక్షించు టెట్లు ? ఋగ్యజుఃసామరూప మంత్రజాత మంతయు ఆ రచయిత యొక్క రచనయే (మే మంత్రం) అగుట యెట్లు ? కాన నధ్యయన పరంపరా ప్రాప్తమైన మంత్రజాతరూప మగు నా యీ సిరి (శ్రీ) ని రక్షింపుమనియెడి యీ యభ్యర్థన, మంత్రములు పురుషకర్తృకము లగుచో పొసగదు: అపౌరుషేయములని యంగీకరించినపుడే యిట్టి యీ మంత్రములకు సరస సమన్వయము లభించును. మంత్రములు పురుషకర్తృకములు గావు; అవి త్రివిదులగు మంత్రద్రష్టల దర్శన ములు; వాని నధ్యయనము జేసి త్రైవిదులై తమ, యీ యమృతంపు సిరిని ఈశ్వరానుగ్రహము బడసి గోపనము చేయవలెను. అని మంత్రము స్పష్టముగ తన స్వరూపమును జెప్పికొనుచున్నది. అనాదికాలము నుండి అవిచ్ఛిన్నముగ అధ్యయన పరంపరాప్రాప్త మగుటచే 'అమృతా శ్రీః' యని శ్రుతియే తన యమృత స్వరూపమును తేటపఱచుకొనుచున్నది.

వేదములు వేఱు వేఱు తెగల (Tribes) వారిచే, భిన్న భిన్న కాలములందు, భిన్న భిన్న దేశములందు రచింపబడుచో నా రచనలకు అమృతత్వ మెట్లు? మఱియు నా రచనల కన్నిటికి గలిపి సామూహికముగ వేదః, శ్రుతిః, బ్రహ్మ - ఇత్యాది నామముల గూర్చిన దెవరు? శ్రుతియే తనను దాను వేదాది నామములతో నన్ని శాఖలయందును వ్యవహరించుకొని యుండుటచే నవి యర్వాచీన కల్పిత సాంకేతిక నామము లని చెప్పవలను పడదుగదా! కనుక వేద మపౌరుషేయ మని యంగీకరించినపుడే యీ నామముల యౌచిత్యము సరసముగ గ్రహింపనగును. అపుడే సకల మంత్రార్థ సమన్వయము సరసముగ గుదురగలదు.

## వేదములలో పౌర్వాపర్యము, విజ్ఞానక్రమవికాసము గలవా ?

అగ్నినుండి ఋక్కులు, వాయువునుండి యజుస్సులు, సూర్యుని నుండి సామలు నుద్భవిల్లినట్లు శ్రుతులు చెప్పుచున్నవి. దీని ననుసరించి మొదట ఋగ్వేదము, తరువాత యజుర్వేదము, నా తర్వాత సామ వేదము పుట్టియుండునని యూహ చేసినచో - మొదట అగ్నియు, తరువాత, క్రమముగ వాయు సూర్యులును బుట్టిరని యనవలసి వచ్చునే! అగ్ని-వాయు-సూర్యులు నిరంతర సాహచర్యము గల మూడు జ్యోతిస్సులు (వీనిని గూర్చి 'భారతీ' శబ్దవిచారమున వివరింపబడినది) పరమేశ్వరుడు అగ్ని వాయ్వాదిత్యాత్మకుడు, ఋగ్యజుస్సామాత్మకుడు నగుటచే 'త్రిధాతుః' అని శ్రుతి యందు గీర్తింపబడినట్లు పూర్వము వివరింపబడినది. అందుచే అగ్ని - వాయు — ఆదిత్యులకు గాని, ఋగ్యజుస్సామలకు గాని పౌర్వాపర్యము, దానినిబట్టి విజ్ఞానక్రమ వికాసము ఉన్నదని చెప్పుట శ్రుతి తాత్పర్యానుగుణము గాదు.

## అంతర్దర్శనము -

కాని భాషను బట్టియు భావమును బట్టియు, ఆ యా కాల స్థితిగతుల బట్టి వేదమున గల సంహితాభాగమునకును, బ్రాహ్మణ - ఆరణ్యక - ఉపనిషద్భాగమునకును పౌర్వాపర్య మున్నదనియు, సంహితయందు (మంత్రభాగమునందు) బాహ్యదర్శనమే కాని యంతర్దర్శనము లేదనియు. ఉపనిషత్తులయందే యంతర్దర్శన

మున్నదనియు చారిత్రికు లూహించిరి. ఇట్టి యీ యూహలు చరిత్రకల్పనాలక్ష్య ముతో జేసిన యూహలు మాత్రమే యగును.

ఈ యూహల నంగీకరించినచో మంత్రములకు సరస సమన్వయము పొనగదు. అతి ప్రాచీనములని చెప్పబడెడి ఋగ్వేద మంత్రములే యీ చారిత్రికుల వాదమును నిరాకరించుట జూతము

న వి జానామి యదివేద మస్మి నిణ్యః సన్నద్ధో మనసా చరామి ।
యదా మాగన్ ప్రథమజా ఋతస్యాదిద్వాచో అశ్నువే భాగ మస్యాః ॥ [1]
— ఋ. 1-164-37; అ. వే. 9-10-15, నిరు. 7-3; 14-22.

1 అహం యదివేదం యదపీదం విశ్వం అస్మి కృత్స్నః ప్రపంచో ప్యహ మేవాస్మి । నామరూపాంశం అపరమార్థం త్యక్త్వా సర్వత్ర అనుగతోఽస్తి భాతి ప్రియమితి యోఽయం సచ్చిదానందాకారోఽస్తి సోఽహ మస్మీతి న విజానామి। వివిచ్య నాజ్ఞాసిషమ్ । పరం శాస్త్రజనిత మిద మహ మస్మీతి జ్ఞానం జాతమ్ । అవివేక్యహ మిత్యర్థః । కార్యకారణయో రభేదాత్ కృత్స్నప్రపంచస్యాపి బ్రహ్మా నన్యత్వేన బ్రహ్మైకత్వావగమే ప్రపంచజాతమపి స్వస్వరూపమేవ భవతి । 'ఇదం సర్వం యదయ మాత్మా, బ్రహ్మై వేదం సర్వం, ఆత్మై వేదం సర్వం, స ఈక్షత బహు స్యాం ప్రజాయేయ' — ఇత్యాది శ్రుతిభ్యః ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞానాత్ । 'తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః, (బ్ర.సూ. 2-1-14) ఇత్యాద్యుపపత్తిభిశ్చ ప్రపంచస్య బ్రహ్మా నన్యత్వం సిద్ధమ్ । యద్వా, ఇవ శబ్దః ఉపమార్థః । యదివ యదాపరోక్ష్యజ్ఞానం సర్వైకాత్మ్యరూప మానుభవిక మస్తి తదివ తద్వదేవాహ మస్మి । ఇదం సర్వ మహ మస్మీతి జ్ఞానం మే జాతమ్ । అపితు ఏత ద్దార్ష్టాంతికభూతమ్ । ఆనుభవికం సార్వాత్మ్యం యదస్తి తన్న వి జానామి న ప్రాప్నోమ్యస్మి । శాస్త్రజనితం సార్వా త్మ్యం జాతం న తు ఆనుభవిక మిత్యర్థః । తత్ర కారణ మాహ । యతోఽహం నిణ్యః । అంతర్హితనామైతత్ । అంతర్హితో మూఢచిత్తః । చిత్తప్రత్యక్ప్రవణ తాభావేన పరిచ్ఛిన్న ఇత్యర్థః । తత్రోపపత్తి మాహ । సంనద్ధః అవిద్యాకామకర్మభిః

యత్ ఇవ ఇదమస్మి న వి జానామి :

దృశ్యమగుచు నిది యేది గలదో యా కృత్స్న ప్రపంచము నేనే అనగా అస్తి (సత్), భాతి (చిత్), ప్రియం (ఆనందం), నామ, రూపం - అనెడి యంశపంచకముతో గన్పట్టుచునది యంతయు నేనే. అందు నామరూపములు పరమార్థములు గావు; వానిని విడిచి సర్వత్ర అనుగతమై యుండెడి సత్ - చిత్ - ఆనంద స్వరూపము నేను అని వివేచన చేసి తెలియజాలనైతిని. అనగా 'ఇదం సర్వం యదయ మాత్మా' 'బ్రహ్మైవేదం సర్వం' 'స ఈక్షత బహుస్యాం ప్రజాయేయ'— ఇత్యాది శాస్త్రజన్య పరోక్షజ్ఞానము కల్గినది గాని యపరోక్షానుభవము కలుగలేదు — అని యీ వాక్యార్థము,

సమ్యగ్బద్ధో వేష్టితః అత ఏవ, మనసా యుక్తో భావనా సహిష్ణునా బహిర్ముఖేన విక్షిప్తేన చేతసా యుక్తః సంచరామి సంసారే। అథవా మనసా సంనద్ధ శ్చరామి ఇంద్రియ పరవశ ఏవ సన్ సంసారే దుఃఖ మనుభవామి । న సార్వాత్మ్యం జానామీతి పరిదేవతే । యాస్కోఽపి ఇమం పరిదేవనార్థత్వే నోద జహార,'అథాపి పరిదేవనా కస్మాచ్చి ద్భావాత్, న విజానామి య దివేద మస్మి' ఇతి । బహిర్ముఖ చేతసః స్వరూపాపరిజ్ఞానజనితం దుఃఖ మన్యత్ర శ్రూయతే 'పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మా త్పరాజ్ పశ్యతి నాంతరాత్మన్' (క. ఉ. 2 -4 -1) ఇతి ।
తర్హి కదైత ద్భవతీ త్యాహ । యదా. మాగన్ ఆగమిష్యతి తదా । కిం తదితి ఉచ్యతే । ఋతస్య పరమార్థస్య సత్యస్య బ్రహ్మణః, ప్రథమజాః ప్రథమోన్మేషః ప్రథమోత్పన్నశ్చిత్తప్రత్యక్ప్రవణజనితః అనుభవః । స యదా మా మాం ప్రాప్నోతి; ఆదిత్ అనంతర మేవ అవ్యవధానేన, అస్యాః, వాచః ఐకాత్మ్యప్రతి పాదికాయా ఉపనిషద్వాచో యదివేదమస్మీ త్యుక్తాయా వా. భాగం భజనీయం శబ్దబ్రహ్మణా ప్రాప్తవ్యం పరం బ్రహ్మపదమ్, అశ్నువే ప్రాప్నోమి । చిత్తస్య బహిర్ముఖతాం పరిత్యజ్య అంతర్ముఖతైవ అదుః సంపాద్యా । సా యదా స్యాత్ తదానీమేవ స్వరూపంద్రష్టుం సుశకం భవతి పశ్చా ద్విలంబాభావాత్ । యథా గిరిశిఖరాత్ పతన్ పాషాణోఽ విలంబేన పతతి తద్వత్ । చిత్తప్రత్యఙ్ముఖత్వస్య దుఃశకత్వ మపి తత్రైవ శ్రూయతే —'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్ (క. ఉ. 2 -4 -1) ఇతి । సా. భా.

నిజ్యః సంసద్ధో మనసా చరామి ;

అట్టి యనుభవము కలుగకపోవుటకు గారణ మేమన — బహిర్ముఖమై విక్షిప్తమైన మనస్సుతో తాదాత్మ్యము చెంది మూఢచిత్తుడనై పరిచ్ఛిన్నుని వోలె సంసారమున చరించుచున్నాను - అని యీ వాక్యార్థము.

యదా ఋతస్య ప్రథమజాః మాగన్, ఆదిత్ అస్యాః వాచః భాగం అశ్నువే :

కాని, యెపుడు బ్రహ్మ విషయకమై చిత్త మేకాగ్రమగుచు నంతర్ముఖ మగునో, అనగా బ్రహ్మవిషయక ప్రథమోన్మేషము (అపరోక్షానుభవము) కలుగునో యపుడే ఐకాత్మ్య ప్రతిపాదక మగు నీ 'య దివేవ పస్మి' ఇత్యాద్యుపనిషద్వాక్యము లచే ప్రతిపాదింపబడిన బ్రహ్మపదము నొందుదును.

(సాయణ భాష్యము, వేంకట మాధవ భాష్యము చూచునది)

ఈ మంత్రము ఋగ్వేదము మొదటి మండలము లోనిది. ఇందు మనస్సు నిరంతరము నిక్షిప్తమై మోహావరవశమై యుండునంతవఱకు సంసారమున బరిభ్రమించుచుండు నని మనస్సు యొక్క స్వాభావికస్థితి చెప్పబడినది. అట్లు బహిర్ముఖముగ నుండునంతవఱకు శాస్త్రమున నెంత పరిశ్రమ జేసినను మనస్సుతో తాదాత్మ్యము విడువక యుండుటచే నేను పరిచ్ఛిన్నుడను (అల్పుడను) అను భావమే వెంటనంటియుండును గాని సచ్చిదానంద రూపముగు నీ కృత్స్న ప్రపంచ మంతయు నేనేయను యథార్థానుభవము కలుగ దనుట స్పష్టము చేయబడినది. చిత్త మంతర్ముఖమైనపు డట్టి యనుభవము గలుగును: అపుడు గూడ నుపనిషత్ మహా వాక్య ప్రమాణము చేతనే యా యపరోక్షానుభవము గల్గును గాని దానియంతట నది సిద్ధింపదు; అనగా నీ యనుభవము శాస్త్రైక సముధిగమ్యమే గాని పురుషబుద్ధికి గోచరము కాదనుట ఈ మంత్రమున స్పష్టము జేయబడినది "ఇతి జ్ఞాతాత్మ స్వరూప ఆహ" అని యనుచు వేంకటమాధవుడును ఇది ఆత్మతత్త్వ జ్ఞాపకమగు మంత్ర మనియే వివరించినాడు.

పాశ్చాత్యుల కల్పనల ననుసరించి యార్య లనువారిచే తొలుదొల్త రచింపబడినది ఋగ్వేదము. వారి వాదము చొప్పున సంహితారచనా కాలమున

బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు నుండియుండుటకు వీలు లేదు. కాని పై మంత్రమున సర్వైకాత్మ్యమును ప్రతిపాదించు 'యదివేద మస్మి' యనెడి యుపనిషద్వాక్య మంతర్గ్రథితమై యున్నది. మరల 'అస్యావాచః' అని 'ఇదం' శబ్దముచే నా వాక్యము పరామర్శింపబడినది కూడ. ఇట్లు సంహితయందు ఉపనిషద్వాక్యమును, ఉపనిషత్తత్త్వము ననువదించుటచే వారి వాదము నిర్మూలమై పరాస్తమగుచున్నది.

సంహితాభాగమున గూడ నచటచట నుపనిషత్సిద్ధాంతములు బీజప్రాయముగ సూచింపబడి యుండవచ్చును- అని చెప్పుటకును వీలు లేదు. ఈ మంత్రమునం దుపనిషద్వాక్యమే సాక్షాదుచ్చరింపబడి మరల 'అస్యాః వాచః' అని 'ఇదం' శబ్దముచే పరామర్శింపబడి యుండుటచేతను, ఉపనిషత్తత్త్వము ప్రతిపాదింపబడుటచేతను ఇవి బీజప్రాయ సూచనలనెడి యూహకు తావులేదు. 'యో జాగార తమృచః కామయన్తే, అగ్నిరస్మి జన్మనా జాత వేదాః' - ఇత్యాది పూర్వోదాహృత ఋక్కులను ఉపనిషత్తత్త్వమునే ప్రతిపాదించుట దర్శించితిమి. ఇంతే కాదు 'అహం మను రభవం సూర్యశ్చాహం (ఋ. 4-26-1); ఇయం మే నాభి రిహ మే సధస్థమిమే మే దేవా అయ మస్మి సర్వః (ఋ. 10-61-19)'— అని యీ రీతిగ ఉపనిషత్ప్రతిపాదిత మగు సర్వాత్మకత్వానుభవమును ప్రతిపాదించు మంత్రము లెన్నియేని ఋగ్వేదమున గలవు దీనినిబట్టి సంహితాభాగ మావిర్భవించిన కాలముననే యుపనిషత్తులు కూడ నావిర్భవించినవనియు, ఉపనిషత్తత్త్వమునంతయు దృష్టియందుంచుకొనియే మంత్రబ్రాహ్మణములు ప్రవృత్తము లయినవనియు, అట్లే మంత్రబ్రాహ్మణ ప్రతిపాదిత కర్మ స్వరూపమును దృష్టియం దుంచుకొనియే ఉపనిషద్భాగ మావిర్భవించిన దనియు దెలియుట సమంజసము. అట్లంగీకరింపనిచో నిట్టి యీ మంత్రములకు సరస సమన్వయము గుదురదు.

ఇంకొక విశేషము. మనస్సు విక్షిప్తమై సంసారమున జరించు నంతవరకు శాస్త్రజన్యజ్ఞాన మనుభవదూరమై యుండును; చిత్త మంతర్ముఖమైన అనఃరోక్షానుభవము గల్గుటకు శాస్త్రజన్యజ్ఞాన మావశ్యకము; అనగా శాస్త్ర (వేద) ప్రతిపాదితమైన విషయము పురుషబుద్ధిచే నేమాత్ర మూహించుటకు శక్యము గాదు'— అని 'న విజానామి' యనెడి పై మంత్రమున స్పష్టముగ తెలియజేయబడినది. అట్టియెడ పురుషబుద్ధికి గోచరములు గాని యీ విషయములను ఆర్యు లనువారెట్లు తమ

రచనల ద్వారా తెలియజేయజాలియుందురు? కాన వేదములు పురుషబుద్ధికల్పితములని గాని, వానియందు పౌర్వాపర్యము విజ్ఞానక్రమవికాసము ఉన్నవని గాని చెప్పుట యుక్తి సహము కాదు; శ్రుతి తాత్పర్యానుగుణమును కాదు.

## ఋగ్వేదము, నానాదేవతలు - ఏకదేవత :-

"ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా
అధి విశ్వే నిషేదుః । యస్తన్న వేద కి మృచా
కరిష్యతి య ఇ త్తద్విదు స్త ఇమే సమాసతే ॥

— ఋ. 1-164-39; అ.వే.9-10-18 తై. బ్రా. 3-10-9-14; తై. ఆ. 2-11-1; నిరు. 13-10:

ఇదియు ఋగ్వేదమున మొదటి మండలములోనిదే. ఈ మంత్రమునకు పూర్వమున నున్న 'అపాఙ్ ప్రాఙేతి' యను ఋక్కున దేహాత్మ జీవాత్మల గూర్చి చెప్పబడినది, ఇందు జీవాత్మయొక్క పారమార్థిక రూపము జెప్పబడుచున్నది.

ఇచట 'ఋచః' అను పదము నాలుగు వేదములకు ఉపలక్షకము' (అత్ర ఋక్ శబ్దేన ఋక్ప్రధానభూతాః సాంగాపరవిద్యాత్మకాః శ్చత్వారో వేదా ఉచ్యన్తే - సా. భా)

అక్షరమ్ :-

ఏతద్వై తదక్షరస్య ప్రశాసనే గార్గి (బృ- ఉ. 3—8), యయాతదక్షరమధిగమ్యతే (ము. 1-1-50), యేనాక్షరం పురుషం వేద సత్యం, (ము. ఉ. 1 - 2-13)— ఇత్యాది శ్రుతులయందు అక్షరముగ అనగా అనశ్వరముగ ప్రసిద్ధమైన బ్రహ్మయే ఇట అక్షరశబ్దము చేతను చెప్పబడుచున్నాడు. సర్వవేదములకును ప్రతిపాద్యుడు బ్రహ్మయే కాన 'ఋక్కులకును అక్షరమునకును' —అనగా వేదములకును బ్రహ్మకునుగల సంబంధము ప్రతిపాద్య ప్రతిపాదకభావరూపము. కనుక, 'ఋచః అక్షరే'- అనగా ఋక్ప్రతిపాద్యమగు బ్రహ్మయందు అని యర్థము.

ఆ అక్షరము 'పరమం వ్యోమ' అనగా ఉత్కృష్టము, నిరతిశయము సర్వాధిష్ఠానమునై సర్వరక్షకమైన తత్త్వము. దానియందే సర్వము అధ్యస్తము. ఆ పరమాత్మయందే సర్వదేవతలు అధివసించి యున్నారు.

లేక 'అక్షరే ఋచః' అనియు జెప్పవచ్చును. ఈ యర్థము ననుసరించి పరమాత్మయందు వేదము లన్నియు పర్యవసన్నములై యుండు ననియు దెలియ నగును (ఉక్తలక్షణే వస్తుని ఋగుపలక్షితాః సర్వే సాంగా వేదాః పర్యవసితా ఇత్యర్థః-సా. భా)

యస్తన్న వేద కి మృచా కరిష్యతి :—

సర్వదేవతాధిష్ఠానరూపుడు, కృత్స్న వేదతాత్పర్య ప్రతిపాద్యుడునగు బ్రహ్మను గూర్చి ఎవడు తెలిసికొనడో అతడు ఋగాది శబ్దజాలముచే నేమి చేయ గలడు? అనగా వేదనసాధన మగు (వేదయతి) వేదముచే వేద్యుడగు బ్రహ్మను దెలియనిచో, వేదము ప్రయోజనరహితమై నిష్ఫల మగుచుండ నిక నా వేదముచే సాధించెడిదేమి? — అని ఋక్కు ప్రశ్నించుచున్నది. ఇట్లు తెలియజాలని వానిని గూర్చి వేదము నిష్ఫలమగునని చెప్పి, తెలిసినవానికి గలుగు ప్రయోజనము నిట్లు ఈ ఋక్కు చెప్పుచున్నది.

'య ఇత్తద్విదు స్త ఇమే సమాసతే' :—

ఎవ రీ తత్త్వము నెఱుగుదురో యా వేదవిదులు లేక బ్రహ్మవిదులు పునరావృత్తి రహితమగు స్వస్వరూపావస్థానము నొందుదురు. (ఇమే జ్ఞాతారః సమాసతే సమ్యక్ తిష్ఠన్తి అపునరావృత్త్యా స్వరూపేఽవస్థానం సమాసనమ్ - సా. భా.) —అని మంత్రార్థము.

ఈ మంత్రమును తైత్తిరీయారణ్యకము ప్రణవపరముగ వ్యాఖ్యానించినది. అపుడు ఋక్ప్రతిపాద్యమగు అక్షరము ప్రణవరూపమగు ఓంకారము. ఇంతే కాదు. ఋగక్షరమనగా ఆదిత్యమండలాంతర్గత పురుషుడనియు చెప్పట గలదు. లేక, ఋక్ అనగా జీవు డనియు, ఋగక్షర మనగా జీవుని వాస్తవిక స్వరూపమగు పరమాత్మ అని చెప్పుటయు గలదు. సూక్ష్మముగ బరిశీలించినచో నన్నిటి తాత్పర్య మొకటియే యని తెలియనగును.

ఇచట 'ఋచః' అను పదముచే సర్వవేదరాశిని గ్రహింపక, ఆర్యులను వారి తొలి రచన యగు ఋగ్వేదములోని ఋక్కులే యని గ్రహించినను ఋక్ ప్రతిపాద్యము అక్షరము; లేక అక్షరమునందు ఋక్కులు - అను నర్థములే సిద్ధించుచున్నవి. ఎట్లు జెప్పినను ఋగధిష్ఠానభూతుడు, ఋక్ప్రతిపాద్యుడు అక్షరరూప బ్రహ్మ యనియే యర్థము జెప్పవలసియుండును. ఆ బ్రహ్మ సర్వదేవతాధిష్ఠానరూపుడు గాన సర్వదేవతాత్మకుడు. కాన ఋక్కులన్నిటిని సర్వదేవతాధిష్ఠానభూత బ్రహ్మతత్త్వప్రతిపాదనమునందే తాత్పర్య మని యీ ఋక్కు స్పష్టీకరించుచున్నది. ఇట్లు ఋక్ స్వభావమును గూర్చి ఋక్కులే స్వయముగ జెప్పికొనుచుండ వాని స్వభావమును చరిత్రకల్పనానుగుణముగ నింకొక తీరుగ వర్ణించుట ఋగభిమతము కాదు. ఇట్టి ఋక్ స్వభావమును దెలియనిచో (య స్తన్న వేద కి మృచా కరిష్యతి) ఈ ఋక్కులతో సాధించెడిదేమి? - అని ఈ ఋక్కు ప్రశ్నించుచున్నది గూడ; తెలిసికొనినచో గల్గెడి ప్రయోజనము గూడ వివరించి; ది.

అందుచే - 'ఆర్యు లనెడి వేదరచయితల దృష్టిలో సూర్యచంద్రాది జ్యోతిస్సులే మొదట దేవతలు; అవియే జగద్యాత్రకు కారణభూతములుగ భావింపబడెను; తర్వాత పెక్కు దేవతలు గల్పింపబడిరి. కొంత కాలమునకు సృష్టికర్తను గూర్చిన జిజ్ఞాస పెఱిగినది. అయినను తత్, సద్, బ్రహ్మ - ఇత్యాది పదములకు ఉపనిషత్తులందు జెప్పెడి తత్త్వార్థములు ఋగ్వేదకాలమున లేవు' — మున్నగు చారిత్రిక కల్పనలు నిరాధారములని యీ ఋక్కు స్పష్టము జేయుచున్నది.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ। యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్। సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి" — ఇత్యాద్యుపనిషద్వాక్యములు "ఋచో అక్షరే పరమే వ్యోమన్ .... య స్తన్న వేద ........ య ఇత్ తద్విదుః ......."అను ఈ ఋక్కుకు ప్రతిబింబరూపములై వర్తిల్లి, ఋగర్థవివరణ రూపములే యగుచున్నవి. 'కాన సంహితలు ప్రతిపాదింపని తత్త్వము క్రొత్తగా ఉపనిషత్తులచే గాని, పురాణేతిహాసాదులచే గాని, శ్రీ శంకరాదులచే గాని, ప్రతిపాదింపబడిన దనుట యుక్తిసహము, శ్రుతిసమ్మతము గాదు; శంకరాదులకును సంమతముగాదు (చూ. అవతారిక) అందుచే ఋగ్వేదకాలమున తత్త్వ

దర్శనము వేఱు; ఉపనిషత్కాలమున తత్త్వదర్శనము వేఱు; శంకరాదుల కాలమున తత్త్వదర్శనము వేఱు—అని వర్ణించుట తగదు.

ఇట ఋచోఽక్షరే— అను ఋక్కుచే; ఋగాది వేదరాశికి బ్రహ్మతత్త్వ ప్రతిపాదనము నందే పరమతాత్పర్యము' —అనుచు వేదము యొక్క వేదత్వము వ్యక్తము గావింపబడినది. ఉపనిషత్ స్వరూప (శబ్దార్థ) పరిశీలనము జేసినను ఈ ఋగర్థతాత్పర్యము —వేదస్వరూపము— ఇంకను తేటపడును. అందుచే ఉపనిషదర్థ తత్స్వరూపములను శ్రుతులే యెట్లు నిర్వచించి నవో దర్శింపవలసియున్నది.

## ఉపనిషత్ :-

'తస్య వా ఏతస్య యజుషః రస ఏవోపనిషత్। తస్మా ద్యావ
న్మాత్ర ఇవాన్నస్య రసః। సర్వ మన్న మవతి। సర్వ మన్న మనువ్యేతి।'
—శ. బ్రా. 10-3-5-12

యజుర్మంత్రబ్రాహ్మణ ప్రసంగాత్ ఉపనిషదోఽర్థం తత్స్వరూపం
వేదితుః ఫలం చ దర్శయతి తస్య వా ఏతస్య యజుష ఇతి। అన్న
రూపస్య యజుషః రసః సార ఏవోపనిషత్। తస్యాశ్చ వేదసారత్వ
మన్నదృష్టాంతేన ప్రతిపాదయతి తస్మా ద్యావ దితి। యథా అన్నస్య
యావాన్ రసః తావాన్ స్వాశ్రయభూతం సర్వ మన్న మవతి;
తర్పయతి; భోగయోగ్యం కరోతి; అనువ్యేతి వ్యాప్నోతి చ।
అతః ఉపనిషత్ సకలం సాంగం వేదం వ్యాప్నోతి।

—సా. భా.

అన్నముయొక్క రసము స్వాశ్రయభూత మగు అన్నము నంతయు వ్యాపించి తృప్తి హేతు వగుచున్నది. అన్నమును భోగయోగ్య మొనర్చుచున్నది. అట్లే వేదసార మగు ఉపనిషత్తు కూడ స్వాశ్రయ రూపము, కాండత్రయాత్మకము నగు సాంగ వేదము నందంతట నంతర్లీనమై వ్యాపించి యుండి (అధికారి యగు సాధకునకు) లోకోత్తరాహ్లాదక మగుచున్నది - వేదము నంతయు రసాస్వాదయోగ్య మొనర్చు చున్నది - అని భావము. దీనివలన నిఖిలవేదరాశియు ఉపనిషదాత్మకమై పరబ్రహ్మ

ప్రతిపాదక మగుచున్నది - అని తెలియును. అందుచే ఋచోఽక్షరే పరమేవ్యోమన్ అగ్ని ర్హాగార త మృచః కామయన్తే; ఏతా విశ్వా విదుషే (చూ. అవతారికా)- ఇత్యాది పూర్వోదాహృత మంత్రతాత్పర్యముతో సంవాదము సిద్ధించుచున్నది. "కావచ్చును; ఉపనిషత్తు లనగా వేదాన్తములు, వేదశిరోరూప గ్రంథములు గదా! వేదములయొక్క అంతిమాధ్యాయ రూప మైన యీ యుపనిషద్గ్రంథభాగము వేదము నం దంతర్నిలీనమై యంతట వ్యాపించి యుండు టెట్లు? అంగి అంగమును వ్యాపించి యుండుట సంభవము అంగము అంగితో సంబద్ధమై యుండును కాని వ్యాపించి యుండదు గదా!" -అని యనవచ్చును ఈ సంశయమును తరువాతి బ్రాహ్మణ మిట్లు తీర్చుచున్నది.

"ఆనంద ఏవాస్య విజ్ఞాన మాత్మా। ఆనందాత్మానో హైవ సర్వే దేవాః। సా హైషైవ దేవానా మద్ధా విద్యా। న హ స న మనుష్యో య ఏవంవిత్। దేవానాం హైవ స ఏకః।" — శ. బ్రా 10-3-5-13

"ఉపనిష త్ప్రతిపాద్యస్వరూప మాహ—ఆనంద ఏవాస్య విజ్ఞాన మాత్మేతి। అస్య ఉపనిషదాత్మకస్య రసస్య ఆనందః విజ్ఞాన మేవ ఆత్మా సచ్చిదానందైకరస మఖండం వస్తుస్వరూప మిత్యర్థః....అద్ధావిద్యా ఆనందాత్మక దేవానాం ప్రతిపాద కత్వా దేషా ఉపనిషత్, అద్ధా అపరోక్షవిద్యా సాక్షా దమర త్వాత్.... ఏవం ఉపనిష దఖండ విజ్ఞానలక్షణ మాత్మా నం జానానో మనుష్యో న భవతి కింతు దేవానాం మధ్యే ఏకో భవతీత్యర్థః।" - సా. భా.

ఉపనిషదాత్మకమైన రసమునకు ఆనందరూప మగు విజ్ఞానమే ఆత్మ. అనగా సచ్చిదానందైక రసస్వరూపము అఖండము నగు వస్తువే ఉపనిషత్తునకు ఆత్మ అని భావము. దేవత లందఱు ఆ యానందస్వరూపులే. అపరోక్షముగ ఆనందాత్మక దేవతాస్వరూపమును బ్రతిపాదించు విద్యయే ఉపనిషత్తు. అట్టిఅఖండ-ఆనంద-విజ్ఞానలక్షణ మగు ఆత్మను దెలిసి కొనిన మానవుడు మానవుడు కాడు; దేవతలలో నొక దేవతయై విలసిల్లును—అని యర్థము.

కనుక ఉపనిషత్ అనగా ఆనందవిజ్ఞాన లక్షణ మగు ఆత్మయొక్క-స్వరూపమును-ఆనందాత్మక దేవతాస్వరూపమును - అపరోక్షముగ ప్రతిపాదించు విద్య ఇదియే బ్రహ్మవిద్య ఈ విద్యను ప్రతిపాదించు వాక్యమునకును లేక గ్రంథ భాగమునకును ఔపచారికముగ ఉపనిషత్ అనిపేరు

ఉదా :- (1) పురుషసూక్తము. ఇది ఋగ్వేదముననే గాక కొలది భేదముతో ఇతర శాఖలయందును గలదు. సామాన్యముగ నానా కర్మలయందు వినియోగింపబడుట ప్రసిద్ధము. అట్టి పురుషసూక్తము ఉపనిషద్రూప మని శ్రుతియే స్వయముగ జెప్పినది:-

"నారద మవలోక్య త మాహ పితామహః—"పురా,
మత్పుత్ర, పురుషసూక్తోపనిషద్రహస్యప్రకార నిరతిశయా కా
రావలంబినా, విరాట్పురుషేణోపదిష్టం రహస్యం తే వివి
చ్యోచ్యతే" —నారదపరివ్రాజకోపనిషత్-2 ఉపదేశ.

(2) అట్లే రుద్రాధ్యాయము. ఇదియు నానా కర్మలలో వినియోగింపబడెడి సంహితాగతమైన ప్రసిద్ధకగు మంత్ర జాతము. ఇది పరమేశ్వరుని సర్వాత్మకత్వము నుపదేశించు ఉపనిషత్తు - అని సంప్రదాయము.

"భూతం భవత్ భవిష్యత్ గిరి తృణ వృక్షాదిక మపి సర్వం రుద్ర ఏవ।
తస్య సార్వాత్మ్యభిధిత్సయా ఇద ముపనిషత్ ప్రవృత్తా।"
రుద్రాధ్యాయ-విష్ణుసూరి భాష్య.

"కర్మప్రకరణే పాఠాత్ కర్మాంగత్వ మపీష్యతే।
జ్ఞానహేతుత్వ మప్యస్య తథోపనిష దీరితం॥" -సా.భా. రుద్రాధ్యాయ.
"అయం చ బ్రహ్మవిద్యారూపత్వాత్ ఉపనిష న్మంత్రరాశిః
ప్రశ్నః। అత ఏవ రహస్యప్రకరణ ఆమ్నాయతే। బ్రాహ్మణ
వినియోగానురోధేన త్వత్ర వ్యాచక్ష్మహే। ఏకశత
మధ్వర్యుశాఖాః తాసు సర్వాసు చేయం రుద్రోపనిష దామ్నా
యతే — అనయా చ రుద్రోపనిషదా బ్రహ్మవిద్యా ప్రతిపాద్యతే...."
భట్ట-భా-రుద్రాధ్యాయ.

(3) శతపథబ్రాహ్మణమున గల మండల బ్రాహ్మణము (10-5-2) కూడ ఉపనిషద్రూపము. బ్రహ్మవిద్యా ప్రతిపాదకము. కర్మకాండ మధ్యవర్తి యగు ఈ భాగము వేదాంతము- ఉపనిషద్రూపము ఎట్లగును? అని భాష్యకర్త యగు హరిస్వామి సూటిగ ప్రశ్నించుకొని, రుద్రాధ్యాయ- పురుషసూక్తముల వలెనే యిదియు కర్మప్రకరణమున కర్మాంగముగ వినియుక్త మగుచుండును; జిజ్ఞాసువు లగు మహాత్ములకు బ్రహ్మవిద్యా ప్రతిపాదకమై భాసించుచుండును- అని శ్రుతి తాత్పర్యమును వివరించినాడు. 'నను కథం వేదాంతః కర్మకాండ మధ్యవర్తీతిచేత్ శతరుద్రవత్ పురుషసూక్తవచ్చ - - - -" —హరిస్వామి భాష్య.

(4) ఋగ్వేదమున 5.78 సూక్తములోని 7,8,9 ఋక్త్రయమునకు 'గర్భస్రావిణ్యుపనిషత్' -అని ప్రసిద్ధి. (చూ.సా.భా.బృ.దే. 5-82 to 86)

అందుచే ఉపనిషత్ అనగా "వేదము యొక్క అంతిమాధ్యాయరూప గ్రంథభాగము మాత్రమే"- అని యనరాదు. బ్రహ్మవిద్యారూపిణి యగు ఉపనిషత్- విద్య- వేదముయొక్క సారమై వేదమునందంతట వ్యాపించి యున్న దని శ్రుతియొక్క తాత్పర్యము. సర్వవేదసారమై, 'కృత్స్నవేద వ్యాపకమై' ప్రసిద్ధమైన ప్రణవము (ఓంకారము) కూడ ఉపనిషత్ అని అరుణికోపనిషత్తు ఇట్లు కీర్తించుచున్నది.

"ఓం హి ఓం హి ఓం హీ త్యేత దుపనిషదం విన్యసేత్"

ప్రణవ ప్రతిపాద్య మగు తత్త్వమే కృత్స్నవేద లక్ష్యము — అని గుర్తింపజేయుటకే అధ్యయనాదికర్మలలో ఆది మధ్యావసాన సమయము లందు ప్రణవోచ్చారణ జేసెడి సంప్రదాయము (చూ-ఆమ్నాయశబ్దము-ప్రణవ).

వేదమునందు కొన్ని యెడల నీ బ్రహ్మవిద్య నపరోక్షముగ ప్రతిపాదించెడి మంత్రజాతము గలదు. 'అగ్నిరస్మి జన్మనా జాతవేదాః; న విజానామి యదివేద మస్మి; ఋచో అక్షరే పరమే వ్యోమన్; - పురుష ఏవేదగ్ం సర్వమ్'- 'ఇత్యాది మంత్రజాతమంతయు ఉపనిషత్తే. కొన్ని యెడల మంత్రములు ధర్మము నపరోక్షముగ ప్రతిపాదించుచుండును; కొన్ని మంత్రములు ఇతిహాసపరములుగను, వర్ణనాత్మకములుగను గన్పట్టవచ్చును. ఆ మంత్రముల యర్థమంతియే కాదు; అవి ప్రత్యక్షముగ నా యా యర్థముల బోధించుచునే పరోక్షముగ బ్రహ్మవిద్యాపరము

అని తెలియనగును. వేదముయొక్క అంతిమాధ్యాయములు ప్రధానముగ బ్రహ్మవిద్య నపరోక్షముగ బోధించు నట్టివి. అందుచే నట్టి గ్రంథభాగమునకు ఉపనిషత్- అని ప్రసిద్ధి. కాని ఆత్మవేత్తకు నిఖిలమగు వేదరాశియు బ్రహ్మవిద్యా రూపమున -ఉపనిష ద్రూపమున- సాక్షాత్కరించును- అని శ్రుతి తాత్పర్యము.

## ఉపనిషత్తు - చారిత్రిక దృష్టి

ఉపనిషత్ పదమునకు 'బ్రహ్మవిద్య; ఉపాసనము; సామము లేక రహస్యార్థము- యోగ్యుడగు అధికారికి చేయబడు రహస్యోపదేశము; తత్ప్రతిపాదక గ్రంథము లేక వాక్యము'-ఇత్యాద్యర్థములు స్వాభావికములు; శిష్టసమ్మతములై సంప్రదాయానుగతములైన సిద్ధాంతములు. ఈ యర్థములు శ్రీ శంకర- రామానుజ- మధ్వాచార్య- సాయణాచార్యాది కృత భాష్యము లందును, కావ్యపురాణేతిహాస వాఙ్మయమం దంతటను, కోశము లందును తఱచుగ కానవచ్చుచుండును. కాని చారిత్రికులు కొందఱు ఈ పదమున కీ యర్థములు స్వాభావికములు కావనుచు నీ పదముయొక్క అర్థవిషయమున నొక క్రమపరిణతిని ఒక చరిత్రను- కల్పించిరి. ఈ చారిత్రిక వాదమున నెంత సామంజస్య మున్నదో పరిశీలింపవలసియున్నది. ఈ ఉపనిషత్ పద విషయమై మాక్సుమల్లర్ పండితుని యభిప్రాయ మిది.

"The true etymological meaning of the word upanishat had been forgotten in India. It is explained by Rahasya or Guhya Adesah, mystery and an artificial etymology is given according to which 'upanishad' would mean destruction of passion or ignorance by means of divine revelation. The original signification of the word, however, must have been that of sitting down near some body in order to listen, or in order to meditate and worship. Thus we find upa + sad used in the sense of sitting and worshipping. R. V. 9 - 11 - 6 నమసా ఇత్ ఉపసీదత; 10. 73- 1. వయ స్సుపర్ణా ఉపసేదు రింద్రమ్.

The root As, which has the same meaning as said to sit, if joined with the preposition upa expressess the same idea as upa + sad i.e. to approach respectfully to worship - - - -. Still more decessive is another passage in the same work (శ. బ్రా. 9-1-3-5) where upenishadin is used in the sense of subject. క్షత్రాయ తద్విశం అధస్తాత్ ఉపనిషాదినీం కరోతి. There can be little doubt, therefore, that upanishat meant originally the act of sitting down near a teacher, of submissively listening to him; and it is easy to trace the steps by which it came to mean implicit faith. (Cha. u. 1-1-10. యదేవ శ్రద్ధయా ఉపనిషదా కరోతి త దేవ వీర్యవత్తరం భవతి) and at last truth of devine revelation."

—History of Ancient Sanskrit Literature P.P. 235, 286.

"ఉపనిషత్ పద మనను వ్యుత్పత్తికి సిద్ధించెడి వాస్తవికార్థము భారత దేశమున నెన్నడో విస్మరింపబడినది. రహస్యము లేక గుహ్య- ఆదేశము- అను నర్థములు సామాన్యముగ జెప్పబడుచున్నవి. బ్రహ్మజ్ఞానముచే రాగద్వేషములను, లేక యవిద్యను, నశింపజేయుట"- అను నర్థము కృత్రిమ నిర్వచనముల ద్వారా కల్పింపబడినది. వినుటకై లేక ధ్యానించుటకై, మఱియు ఉపాసించుటకై యొకరి యొద్ద క్రింద కూర్చుండుట- అనునది యీ పదమునకు తొలుదొలుత గల వ్యుత్పత్త్యర్థముగా గ్రహింపనగును. ఋగ్వేదమున గల 'ఉపసీదత; ఉపసేదుః' ఇత్యాది ప్రయోగముల ననుసరించి ఉప + సద్ ధాతువునకు కూర్చుండుట, ఉపాసించుట యను నర్థముల గాంచుచున్నాము సద్ ధాతువునకు వలెనే ఆస్ ధాతువునకును కూర్చుండుట- అని యర్థము ' ఉప అను నుపసర్గ చేరినచో ఆస్ ధాతువుగూడ, ఉప + సద్ ధాతువు వలెనే, వినయముతో సమీపించుట, ఉపాసించుట- అను నర్థముల బోధించును. ... శతపథ బ్రాహ్మణము నందలి 'ఉపనిషాదినీం'- అను ప్రయోగము వలన విధేయుడు, లేక ఆశ్రితుడు (subject)-అను నర్థము మిగుల స్పష్టముగా ప్రతీతము లగుచున్నవి. కావున ఉపనిషత్ శబ్దమునకు గురువుకడ క్రింద కూర్చుండుట, విధేయుడై వినుట- అను నర్థములే తొలుదొలుత గల

వనుటలో సందేహము లేదు. అటు తరువాత ఈ పదము క్రమక్రమముగా దృఢ విశ్వాసము (ఛాం. ఉ. 1 1.10)—అను నర్థమును బోధించునదియై తుదకు బ్రహ్మ విద్య- యను నర్థమును బోధించునదిగా నెట్లు పరిణతిని గాంచినదో యూహింప నగును" అని యర్థము.

మాక్సుమల్లర్ గావించిన ఈ కల్పననే చారిత్రికులలో పెక్కుమంది యనుసరించిరి. ఈ పదమునకు ఉపాసనారూప మగు అర్థమే అతి ప్రాచీన మని ఓల్డెన్‌బర్గు పండితుని యభిప్రాయము మొదట Secret word, తరువాత Secret text, తదుపరి Secret import- అని అర్థవిషయమై క్రమగతి కలదని డ్యూసెన్ పండితుని యభిప్రాయము. ఉపనిషత్ పదము అనుబంధ గ్రంథము (Subsidiary treatise) - అను నర్థమును బోధించు నది యని హాప్కిన్సు పండితుని యభిప్రాయము. ఇట్లు చారిత్రికులలో ఈ పదము యొక్క స్వాభావికార్థ-క్రమపరిణామ విషయమున విభిన్నములైన యభిప్రాయములు కలవు అయ్యును మాక్సుమల్లరు పండితుని యడుగుజాడలలోనే ఎక్కువ మంది చారిత్రికులు నడచిరి.[1] రాధాకృష్ణ పండితుడును ఆ మార్గముననే పోయెను.[2] అందుచే మాక్సుమల్లర్ కల్పన ప్రధానముగ బరిశీలింపదగియున్నది.

ఉపనిషత్ పదమునకు అవయవశక్తిచే సిద్ధించు స్వాభావికార్థమును భారతదేశ మెన్నడో విస్మరించిన దని యీ పండితు డపోహ పడినాడు. వేదగత పద-వాక్యార్థనిర్ణయమునకై వివిధనిర్వచనాది మార్గముల ద్వారా మొదట శ్రుతులే స్వయముగ ప్రవర్తిల్లినవి అట్టి వేదములును, తత్స్వరూప స్వభావాదుల వివరించుటకై వేదముల తోపాటు వేదాంగము లగు నిరుక్త—వ్యాకరణాదులును, తరువాత ఉపాంగములగు న్యాయ మీమాంసాది దర్శనములును, పురాణేతిహాసాదులును, అన్నియు ననూచానముగా సంశయ విపరీత భావనాదుల దొలిగించుచు భారతదేశము ననే వర్ధిల్లినవి. అట్టి భారతదేశము అత్యంత ప్రసిద్ధమైన ఉపనిషత్ పదము యొక్క స్వాభావికార్థము నెన్నడో విస్మరించిన దనుట సాహసము, అనుచితము.

1. Vedic Index of names and subjects.
2. Indian Philosophy-Vol. P. 137-138.

'సద్' ధాతువునకు వలెనే 'ఆస' ధాతువునకు గూడ కూర్చుండుట యను నర్థము గలదని ఈ పండితునిచే చెప్పబడినది. అది సరికాదు. షద్ (సద్) ధాతువునకు విశరణ-గతి-అవసాదనము లనెడి యర్థములే ధాతుపాఠమున జెప్పబడినవి. అందు కూర్చుండుట యను నర్థము లేదు. ఆస (ఉపవేశనే)- ధాతువునకు కూర్చుండుట యను నర్థము కలదు. కాన ఉప + ఆస్ ధాతువునకు సమీపమున కూర్చుండుట, ఉపాసించుట - అను నర్థము లుండవచ్చును. ఉప + సద్ ధాతు విషయమున నట్లుకాదు. ఈ ధాతువునకు కూర్చుండుట యను నర్థమున ప్రయోగ మెచటను గన్పట్టదు. ఆయన ప్రమాణములుగ జూపిన 'ఉపసేదుః; ఉపసీదత'- అను ప్రయోగములకును సమీపించుట యనియే యర్థము. సాయణాదులును ఈ పదములకు ఉపగచ్ఛత; ఉపసన్నాః - అనియే యర్థముల వివరించిరి.

కాన నీ పదములకు 'వినుటకో లేక ఉపాసించుటకో యొకరికడ విధేయుడై క్రింద కూర్చుండుట'- అనునది వాస్తవికార్థము, లేక ముఖ్యార్థము- అని చెప్పుట తగదు. 'విధేయతతో' అనునది ప్రకరణము వలన తెలియును గాని సహజముగ గాదు. ఎట్లన- ఒకరిని సమీపించుట యనునది పూజ్యులయెడ విధేయతతోను, శత్రువులయెడ పగతో, లేక ద్రోహబుద్ధితోను, ఇతరుల విషయమున నా యా ప్రయోజనముల నుద్దేశించియు జరుగుచుండును.

ఉదా :-

'తిరశ్చా ముపసేదు షామ్'— భట్టికావ్య. 6-185.

ఉపసేదుషాం సమీప ముపగతవతాం- తేషాం సమీపవర్తినాం

ఉపద్రవకారిత్వాత్ - జయమంగళ వ్యాఖ్య.

ఉపద్రవబుద్ధితో సమీపించు (ఉపసేదుషాం) క్రూరమృగములను చంపవగినవి- అని యర్థము. ఇట ఉప + సద్ ధాతువునకు విధేయతతో లేక భక్తితో, ధ్యానించుటకో లేక ఉపాసించుటకో, ఒకరికడ కూర్చుండుట అని యర్థము చెప్పుట ప్రకరణ విరుద్ధము. క్రూరబుద్ధితో సమీపించుటయే యిట ప్రకరణ లభ్యమైన యర్థము. ప్రకరణ లభ్యమైనది శబ్దార్థ మెట్లగును? అనన్యలభ్యః శబ్దార్థః- అనిగదా న్యాయము! ఇట్లు ఉప + సద్ ధాతువునకే కాదు, ఉప + ని + సద్ ధాతువునకు కూడ సమీపించుట అను నర్థము మాత్రమే శ్రుతులయందు ప్రసిద్ధము.

'తం హాను వ్యాహరిష్యన్త ఉపనిషేదుః —షడ్వింశ-బ్రా. 1-4.

'ఉపనిషేదుః సమీపం ప్రాప్తాః'—సా భా

"విశ్వామిత్రం - - ఇంద్రః ---- ఉపనిషసాద" —ఐ ఆ. 2-2-3.

'ఇంద్ర అన్నార్థీ సన్ తం విశ్వామిత్ర ముపససాద' —సా.భా.

మాక్సుమల్లర్ పండితుడు ప్రమాణముగ జూపియున్న శతపథ బ్రాహ్మణము నందలి 'అధః ఉపనిషాదినీం' అను పదమునకు గూడ క్రిందుగ సమీపమున నుండునది'- అనియే యర్థము (అధస్తాత్ అవస్థితాం— సా. భా.) ఇట అధః అను అవ్యయ ముండుటచే 'క్రిందుగా' - అనెడి యర్థము సిద్ధించినది. అంతియే కాని ఉపనిషాదిన్ పదము చేతనే క్రిందుగా నుండునది, విధేయతతో నుండునది (subject)— అను నర్థము ప్రతీత మగుట లేదు. వాచస్పత్యమున గూడ నీ పదమునకు 'సమీపస్థాయినీ' —అనియే యర్థము వివరింపబడినది. కాని ఆప్టేకోశము నందు, బహుశః యీ చారిత్రికుల ననుసరించియే, Subjected; sitting at the feet of another, such as a preceptor— అను నర్థములు గ్రహింపబడియుండును. ఇందుకు ప్రయోగములు చూపబడలేదు.

కాన ఉప+సద్ ధాతువునకు మాక్సుమల్లరు చెప్పిన యర్థము స్వాభావికము, లేక వాస్తవికము, (true etymological sense or original sense) కాజాలదు. మఱియు నీయన ఉపనిషత్ పదమునకు తొలుదొల్త నెట్టి యౌగికార్థ ముండియుండవలె నని యూహించి చెప్పెనో దానికి ఉపష్టంభకముగ ఉపసీదత; ఉపసేదుః: ఉపనిషాదినీం- అను అప్రకృతము లగు ప్రయోగములనే జూపెను గాని స్వాభిమతార్థమును బోధించెడి ఉపనిషత్పదప్రయోగము లచూపనే లేదు. ఉపనిషత్పదమున కెట్టి యిన చరిత్ర నొకదానిని రూపొందింప బూని యీ యర్థమును కల్పించె ననుట స్పష్టము.

విపూర్వక సద్ (నిషీదతి)- ధాతువునకు కూర్చుండుట యను నర్థము కలదు. ఉప యను నుపసర్గ చేరినపుడు ఉప+ని+సద్ ధాతువునకు సమీపమున కూర్చుండుట యను నర్థముండవచ్చును గదా- అని చెప్పుద మన్న నదియు సరికాదు, అర్థప్రసిద్ధి ప్రయోగము ననుసరించి గదా యుండును ! ఈ ధాతువునకు ఆ యర్థమున ప్రయోగమున్నట్లు ఈ పండితునిచే చూపబడలేదు.

ఒక ధాతువున కేవి యేని యర్థము లుండవచ్చును. కాని యా ధాతువు నుండి నిష్పన్నములైన కృదంతశబ్దములు (నామవాచకములు) వేఱేవేఱు వస్తువులను బోధించుచు రూఢములై యుంటుట భాషాస్వభావము. అట్టితఱి యీ రూఢ్యర్థమునందు ధాత్వర్థ మనుగతమై యుండును ఉదా :- 'నయతి' :- ఇది క్రియా పదము; తీసికొనిపోవుట యని యర్థము. నయనమ్; నీతిః, నాయకః- ఇత్యాదు లీ ధాతువునుండి నిష్పన్నములైన కృదన్తరూపములు ఇవి వరుసగా నేత్రము, నీతి, నాయకుడు -అను నర్థములందు ప్రసిద్ధము లగుట స్పష్టము. 'వీనికి అవయవ శక్తి ననుసరించి తీసికొనుపోవుట యను నర్థమే స్వాభావికము (true etymological sense): నేత్రాద్యర్థములు తరువాత కల్పితములు- అని యనుట తగునా ? నయనాది శబ్దము లెపుడు భాషయందు రూపొందినవో యపుడే యవి నేత్రాద్యర్థములందు నియతము లగుచునే యావిర్భవించినవి ధాత్వర్థము గూడ నియతముగా ననుగత మయియే యుండును అట్లే ఉపనిషచ్ఛబ్దమునగూడ దర్శింపనగును. ఉపనిషత్ పదము ఉప + ని + సద్ ధాతువునుండి యేర్పడిన కృదంతరూపము ఈ పదము బ్రహ్మవిద్యాద్యర్థములందు రూఢమై ధాత్వర్థానుగతి గల్గి భాషయందావిర్భూత మైన దని గ్రహింపవలసియున్నది. ఉప + ని + సద్ ధాతువునుండి నిష్పన్నములైన ఉపనిషేదుః, ఉపనిషసాద- ఇత్యాది క్రియాపదము లను గాని, ఉపనిషత్ అను కృదంతరూపమును గాని తొలుదొలుత లోకమున కందించినది శ్రుతియే. అట్టితఱి కృదంతమగు ఉపనిష చ్ఛబ్దముచే బోధితము లయ్యెడి బ్రహ్మవిద్యాది రూపములగు రూఢ్యర్థము లస్వాభావికములనియు, అవయవశక్తిచే (ధాతువుచే లేక క్రియచే) బోధింపబడెడి యర్థము స్వాభావిక మనియు ననుట తగునా ?

మాక్సుమ్యల్లర్ ఉదాహరించిన ఉపనిషాదినీ పదమునకు విధేయుడు, లేక ఆశ్రితుడు (Subject) అను నర్థము లేదని నిరూపింపబడినది. ఒకవేళ నా యర్థమున్నదని యంగీకరించినను అదియే ఉపనిషత్ పదమునకు గల వాస్తవికార్థ మని చెప్పుటయు తగదు. ఏ శతపథబ్రాహ్మణము ఉపనిషాదినీ పదమును తొలుదొలుత లోకమున కందించినదో, ఆ బ్రాహ్మణమే'యజుషః రస ఏవోపనిషత్; ——.... సాహ్యైషైవ దేవానా మద్ధా విద్యా'- అని నిర్వచించుచు ఉపనిషత్ శబ్దమును విద్యా

పరముగ లోకమున కందించి యున్నది. అట్టియెడ 'విధేయకతో క్రిందకూర్చుండుట అను నర్థము స్వాభావిక మనియు, శ్రుతియే స్వయముగ నిర్వచించి చెప్పిన బ్రహ్మ విద్యా వేదసార రూపాద్యర్థము లస్వాభావికములనియు ననుటలో సామంజస్య మేమి గలదు ?

ఏ పదమునకైనను ప్రకరణాద్యనుగుణముగ ప్రసిద్ధార్థమును లేక ముఖ్యార్థ మును దర్శించి తదనుగుణముగ నిగమ - నిరుక్త - వ్యాకరణాదుల ద్వారా నిర్వ చనములను, శబ్దసంస్కారములను జెప్పవలసియున్నది (చూ. అవతారిక). అందుచే నీ యుపనిషత్ పదము బ్రహ్మవిద్యాద్యర్థమునం దెట్లు యాథమై యున్నదో, ఆ విషయమై జెప్పబడిన నిర్వచనము లెట్టివో, అందు ధత్వర్థానుగతి యెట్లు గలదో పరిశీలింపవలసియున్నది.

"ఏష ఆదేశః। ఏషఉపదేశః। ఏషా వేదోపనిషత్" తై.ఉ. ఇది ఆదేశరూపము; ఉపదేశ రూపము; వేదరహస్య విజ్ఞానరూపమగు ఉపనిషత్తు - అని శ్రుతియే కంఠోక్తిగా ఉపనిషత్స్వరూపమును నిర్వచించి చెప్పినది ఉత్తమాధికారి యగు సాధకునకు ప్రభు సమ్మితముగ జేయు ఆదేశము: సుహృత్సమ్మితమై జేయు ఉపదేశము; (కాంతా సమ్మితముగ) ఏకాంతముగ జేయు ప్రియకథాలాపరూపము (ఉపనిషత్) - అని భావము. వేదము సామాన్యముగ ననేకార్థముల బోధించుచున్నట్లు భాసించినను, ఆత్మవేత్తకు వేద మంతయు నుపనిషద్రూపమున సాక్షాత్కరించి అధియజ్ఞ - అధి దైవ రూపార్థము సర్వము అపరోక్షముగ ఆత్మరూపముగనే భాసించును. ఇట్లు సర్వము ఉపనిషత్ (బ్రహ్మవిద్యా) రూపమున భాసించుట, లేక భాసింపజేయు టయే రహస్యము. (చూ. అవతారిక, కవి - కావ్య; భారతీ; ఛందస్ శబ్దములు). అందుచే నిట వేదోపనిషత్ - అను పదమునకు భాష్యకారులు వేదరహస్యమ్ అని వివరించుట యుక్తము; శ్రుతి సమ్మతము. ఇంతే కాదు ఉపనిషత్తులే స్వయముగ తమ్ము గుహ్యము లని కీర్తించుకొనినవి..

'తద్వేద గుహ్యోపనిషత్సు గూఢం, తద్బ్రహ్మా వేదతే
బ్రహ్మయోనిమ్' — శ్వే. ఉ. 5 - 6
'తత్ ప్రకృతం ఆత్మస్వరూపం, వేదానాం గుహ్యోపనిషదః వేద
గుహ్యోపనిషదః, తాసు వేదగుహ్యోపనిషత్సు; గూఢం

అమృతం బ్రహ్మ హిరణ్యగర్భో వేదతే జానాతి - బ్రహ్మయోనిం వేదప్రమాణక మిత్యర్థః" — శం. భా.

వేదరహస్యరూపము లైన ఉపనిషత్తులయందు నిగూఢములై యున్న యమృతమును వేదప్రమాణము చేతనే హిరణ్యగర్భుడును తెలిసికొనుచున్నాడు - అని యర్థము. ఇట్లు ఉపనిషత్తులే తమ్ము తాము వేదరహస్యరూపములని స్వస్వ రూపమును వివరించుకొనుటచే ఉపనిషత్ పదము వేదరహస్యము - అను నర్థమున ప్రసిద్ధమైనది. ఇట్టి యీ యర్థము స్వాభావికమే యగును కాని కృత్రిమ మెట్లగును?

ఉపనిషత్ అనగా గ్రంథప్రతిపాద్య మగు విద్య - అని శ్రుతియే నిర్వచించుట పూర్వము వివరింపబడినది. ఈ విద్య ద్వివిధము. (1) పరావిద్య (2) అపరావిద్య. ఈ విద్యాస్వరూప స్వభావాదుల దర్శించి తదనుగుణముగ ఉపనిషత్తు యొక్క నామరూప (శబ్దార్థ)ముల బరీక్షింపవలసియున్నది. బ్రహ్మవిద్య యవిద్యను, తన్మూల మగు సంసారమును నివర్తింపజేయు స్వభావము గలది. 'నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే; తరతి శోక మాత్మవిత్; త మేవ విదిత్వా అతి మృత్యు మేతి; బ్రహ్మవిదాప్నోతి పరమ్' — ఇత్యాది శ్రుతులిందుకు ప్రమాణము. ఉపనిషచ్ఛబ్ద వాచ్యమైన బ్రహ్మవిద్యకు గల ఈ స్వభావమును యోగశక్తిచే దర్శించి యీ యర్థము న్యాయసమ్మత మగునా, కాదా - యనియు పరీక్షింప వలసియున్నది. శ్రీ శంకరులు చేసిన పరీక్ష ఇట్టిది. తదనుగుణముగ జూపబడిన నిర్వచనము లిట్టివి.

"యే ముముక్షవః దృష్టానుశ్రవిక విషయ వితృష్ణా స్సన్త ఉపనిషచ్ఛబ్దవాచ్యాం వక్ష్యమాణలక్షణాం విద్యాం ఉపసద్య ఉపగమ్య, తన్నిష్ఠతయా నిశ్చయేన శీలయన్తి, తేషాం అవిద్యాదేః సంసారబీజస్య, విశరణాత్ హింసనాత్, ఇత్యనేన అర్థయోగేన, విద్యా ఉపనిషదిత్యుచ్యతే । తథాచ వక్ష్యతి । నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యత ఇతి । పూర్వోక్త విశేషణాన్ ముముక్షూన్వా పరం బ్రహ్మ గమయతీతి బ్రహ్మగమయితృత్వేన యోగాత్ బ్రహ్మవిద్యోపనిషత్ । తథాచ వక్ష్యతి ।

బ్రహ్మప్రాప్తో విరజోఽభూ ద్విమృత్యు రితి ।."

శం. భా - కఠ. ఉ. 1.1

ఇట శ్రీశంకరులు 'విచాయ్యతాం'- అని శ్రుతివాక్యము నుదాహరించుచు 'షద్' ధాతువునకు గల విశరణము (హింసించుట లేక నివర్తింప జేయుట) -అను నర్థము ననుసరించి బ్రహ్మవిద్యకు గల అవిద్యానివర్తకత్వ స్వభావము వివరించిరి. 'బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూన్ విమృత్యుః' -అను శ్రుతివాక్యము నుదహరించుచు 'షద్ల్' ధాతువునకు గల గత్యర్థము ననుసరించి బ్రహ్మవిద్యకు గల బ్రహ్మగమయితృత్వము (బ్రహ్మప్రాపకత్వము) అను స్వభావము రెండవ నిర్వచనము ద్వారా వివరించిరి. ఇట్లే ఉపాసనారూప మగు అర్థమున గూడ ఉపనిషచ్ఛబ్దమును శ్రీ శంకర భగవత్పాదులిట్లు నిర్వచించిరి.

"లోకాదిః బ్రహ్మజజ్ఞో యోఽగ్నిః తద్విషయా యా విద్యా
యా ద్వితీయవరేణ ప్రార్థ్యమానాయాః స్వర్గలోక ఫల
ప్రాప్తి హేతుత్వేన గర్భవాస జన్మ జరా ద్యుపద్రవ బృన్దస్య
లోకాన్తరే పౌనఃపున్యేన ప్రవృత్తస్య అవసాదయితృత్వేన
శైథిల్యాపాదనేన ధాత్వర్థయోగాత్ అగ్నివిద్యా ప్యుపనిష ది
త్యుచ్యతే । తథాచ వక్ష్యతి । స్వర్గలోకా అమృతత్వం భజన్త
ఇత్యాది.॥"

—శం భా. కఠ. ఉ 1 - 1-

ఇట 'స్వర్గలోకా అమృతత్వం భజన్తే' — అను శ్రుతివాక్యము నుదాహరించుచు 'షద్ల్' ధాతువునకు గల అవసాదనము (శైథిల్యాపాదనము)- అను నర్థము ననుసరించి ఉపాసనారూప బ్రహ్మవిద్యకు గల "గర్భవాసాద్యుపద్రవ శిథిలీకరణము. స్వర్గలోక ఫలప్రాప్తి హేతుత్వము" —అను స్వభావమును మూడవ నిర్వచనము ద్వారా వివరించిరి.

ఇట్లు శబ్దానుశాసనమున షద్ల్ ధాతువునకు జేర్కొనబడిన మూడర్థముల ద్వారా ఉపనిషత్తు యొక్క త్రివిధస్వభావము సప్రమాణముగ నిర్వచింపబడినది. ఇట్టి యీ యుపనిషచ్ఛబ్ద నిర్వచనము యుపనిషద్భాష్యారంభమున సామాన్యముగనన్ని యుపనిషద్గ్రంథములందును కాననగును. ఈ నిర్వచనము లు శంకరుని స్వకపోలకల్పితములుగావు. పురాణేతిహాసాదులందు తఱచుగ గానవచ్చు నవియే. శ్రుతి ప్రమాణానుగ్ర

హితములు, ఉపనిషద్రూప బ్రహ్మవిద్యా స్వరూపస్వభావాది నిరూపకములు, ధాత్వర్థానుగతములు నగు నీ నిర్వచనములు కృత్రిమములు (artificial) ఎట్లగును? మాక్సుమల్లరు జూపిన నిర్వచనములు న్యాయనిర్ణీతములు కావు; ఉపనిషత్పదమునకు గల ప్రసిద్ధార్థముల దృష్టియం దుంచుకొని చేసినవి కావు; ఊహాకల్పితములు; నిగమ – నిరుక్త - వ్యాకరణ సంప్రదాయ విరుద్ధములు కాన మాక్సుమల్లరు చెప్పిన యర్థములే కృత్రిమములు; శ్రీ శంకరాదులు జెప్పిన యర్థములే స్వాభావికములు.

ఉపనిషచ్ఛబ్దమునకు దృఢవిశ్వాసము (implicit faith)- అను నర్థము తరువాత కల్పితమై యుండవచ్చు ననుచు మాక్సుమల్లరు ఈ క్రింది ఛాందోగ్య శ్రుతి నుదాహరించినాడు.

"య దేవ శ్రద్ధయోపనిషదా కరోతి త దేవ వీర్యవత్తరం భవతి" ఇందలి ఉపనిషచ్ పదమునకు విశ్వాసము అను నర్థము నీ పండితుడు గ్రహించినాడు. శ్రీ శంకరులు 'యోగేన' అని వ్యాఖ్యానించిరి. 'యోగో దేవతాది విషయం ఉపాసనం'– అని ఆనందగిరికృత వివరణము ఉపనిషచ్ఛబ్దమునకు యోగరూపార్థము శ్రుతిప్రసిద్ధము ఈ విషయము తరువాత వివరింపబడును. మఱియు నిది యుపాసనావిధి ప్రకరణము కాన శ్రీ శంకరుల వ్యాఖ్యానము, ఆనందగిరికృత వివరణము ఉపపన్నములే యగును. ఉపనిషచ్ఛబ్దమునకు శ్రద్ధాద్యర్థములు కూడ ఎనిమిది శ్రుతిప్రసిద్ధములై యున్నవి (చూ. బ్రహ్మవిద్య - కర్మోపాసనాది సాధనావశ్యకత-). కాని 'విశ్వాసము' అను నర్థము కానరాదు ఆ యర్థము ప్రకరణానుగుణము గూడ కాదు. శ్రద్ధతోను యోగముతోను (ఉపాసనతోను)- ఆచరింపబడిన కర్మయే వీర్యవత్తర మగు నని శ్రుత్యర్థము. ఇచట 'శ్రద్ధా' పదము చేతనే విశ్వాసరూప- అర్థము కూడ స్వారసికముగ ప్రతీత మగుచునే యున్నది. విశ్వాసము లేనిచో శ్రద్ధ జనించదు కదా అందుచే నిట ఉపనిషచ్ పదముచే విశ్వాసము అను నర్థము గ్రహింప నవసరములేదు; ఈ యర్థము తరువాత కల్పింపబడియుండు నను యూహకును తావు లేదు

ఇక ఉపనిషచ్ పదమునకు మాక్సుమల్లరు జూపిన నిర్వచన విధానము యుక్త మగునా ? కాదా ? అను సంశయమును పరిశీలింతము.

# నిర్వచన స్వరూపమ్ :

నిర్వచన మనగా నేమి ? నిర్వచన మనగా లక్షణీయార్థమును దెల్పు లక్షణ వాక్యము. (ఈ విషయము అవతారిక యందు విపులముగ వివరింపబడినది) అది అవయవశక్తిని ప్రదర్శించెడి న్యాయనిర్ణీతమైన విగ్రహవాక్యము కావచ్చును. లేక ప్రమాణాంతరాబాధితమైన వస్తుస్వరూప లక్షణమునో, లేక కర్తవ్యతాలక్షణమునో సావధారణముగ నిష్కృష్టముగ బోధించెడి వాక్యము గావచ్చును. నిరుక్తం నిష్కృష్టం సమానాసమాన జాతీయేభ్యో దేశకాల విశిష్టతయేదం తదిత్యుక్తమ్.

శం. భా. తై ఉ.

ఉదా :- 1. పృథివీ. ప్రథనాత్ పృథివీ. ఇది నామనిర్వచనాత్మక లక్షణ వాక్యము.

"గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్"

-తై. ఆ. 10.1

"గంధద్వారాం ఘ్రాణగ్రాహ్యో గంధ ఉపలబ్ధిద్వారం యస్యాః సా గంధద్వారా- అతఏవ గంధవతీ పృథివీతి తార్కికా లక్షణ మాహుః"

— సా భా.

ఇట గంధద్వారా అనునది పృథివి యొక్క వైశిష్ట్యమును తెలియజేయు లక్షణాత్మక నిర్వచనము. ఈ శ్రుతి నను సరించియే తార్కికులును 'తత్ర గంధవతీ పృథివీ'- అని న్యాయనిర్ణీత లక్షణమును నిర్వచించిరి. ఇయ్యది విగ్రహవాక్య ప్రదర్శనాత్మకమగు నామ నిర్వచనము కాదు; వస్తుస్వరూప నిరూపణము చేయు లక్షణాత్మక నిర్వచనము.

2. బ్రహ్మ. బృంహణాత్ బ్రహ్మ- ఇది నామనిర్వచనాత్మక లక్షణ వాక్యము. 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ'- ఇది బ్రహ్మస్వరూప లక్షణపరమైన నిర్వచనవాక్యము.

కనుక నిర్వచన మనగా విగ్రహవాక్య ప్రదర్శనమే కాదు; వస్తుస్వరూపమును గాని, కర్తవ్యతాలక్షణమును గాని నిష్కృష్టముగ నిర్ధారణ చేసి నిర్దేశించు లక్షణ వాక్యములును నిర్వచనములే. ఇట్లు చెప్పుట శ్రుత్యభిమతము; దర్శనకారాద్య

మతము కూడ, 'అత ఊర్ధ్వం సనిర్వచనాః' (తై. ఆ. 1-6-3)- అనుచు శ్రుతియే సూర్య-మండల-స్వరూపలక్షణ పరములైన శ్రుతి వాక్యములను నిర్వచనములుగా పేర్కొనినది. ఏతాసాం భూమికానాం త్వమిదం నిర్వచనం శ్రుణు'— అనుచు, మహోపనిషత్తు (5-26) కూడ వివిధభూమికాస్వరూప 1 లక్షణ పరములైన వాక్యములను, పెక్కింటిని నిర్వచనములుగా నిర్దేశించినది. మహర్షి బోధాయనుడును, భగవద్రామానుజులును ఇట్టివాక్యములను నిర్వచనములుగా బేర్కొనుట గమనార్హము.

అత్ర నిర్వచనమ్। ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః। సత్త్వశుద్ధౌ ధృవా స్మృతి రితి - - - శాంత ఉపాసీ తేతి నిర్వచనమ్ - - - - నిర్వచనం స్మార్త ముదాహృతం భాష్యకారేణ సదా తద్భావభావిత ఇతి। - - - నిర్వచనమ్ క్రియావా నేష బ్రహ్మవిధాం వరిష్ఠః । త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేనేతిచ । - - - నిర్వచనమ్ సత్యేన లభ్యః తేషా మేవైష విరజో బ్రహ్మలోకః-ఇత్యాది

శ్రీభాష్య. బ్ర. సూ; జిజ్ఞాసాధికరణ P.P. 53, 54

ధ్రువా స్మృతిః అను పదము యొక్క అర్థనిర్ణయమునకై భగవద్రామానుజులు అత్ర నిర్వచనమ్ అనుచు బోధాయనకృత వాక్యగ్రంథము నిట ప్రమాణముగ నుదాహరించిరి. ఇట బోధాయనునిచే చూపబడిన నిర్వచనములు వ్యుత్పత్తి లేక పదముల యొక్క అవయవశక్తిని ప్రదర్శించెడి నిర్వచనముల వంటివి కావు. ఇవి లక్షణాత్మక వాక్యరూపములు; కర్తవ్యతా లక్షణ బోధక వాక్యములు. లక్షణము అతివ్యాప్తి- అవ్యాప్తి -అసంభవాది దోషగ్రస్తము గాని ప్రమా

1 "ఏతాసాం భూమికానాం త్వమిదం నిర్వచనం శృణు ।
స్థితిః కిం మూఢ ఏవాస్మి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః ।
వైరాగ్యపూర్వ మిచ్ఛేతి శుభేచ్ఛే త్యుచ్యతే బుధైః ॥
శాస్త్ర సజ్జన సంపర్క వైరాగ్యాభ్యాసపూర్వకమ్ ।
సదాచారప్రవృత్తి ర్యా ప్రోచ్యతే సావిచారణా-" -ఇత్యాది

—మహోపనిషత్-5-26.

ణాంతర బాధితము గాని కారాదు. అట్టే సావధారణ నిర్వచన వాక్యములు గూడ. అందుచే పై శ్రీభాష్యమును వివరించుచు శ్రుతప్రకాశికా వ్యాఖ్యయందు నిర్వచన శబ్దార్థ మిట్లు వివరింపబడినది.

"నిర్వచనం నిష్కృష్టవచనమ్; అప్రమాణేభ్యో నిష్కృష్టమ్:
ప్రమాణభూతం వచన మిత్యర్థః॥ ఆహారశుద్ధా విత్యాది నిర్వచనమ్ —"

కాన అప్రమాణములచే బాధితము కాక, న్యాయనిర్ణీతమై, సునిశ్చితమైన యర్థమును ప్రతిపాదించు ప్రమాణభూత మగు వచనమే నిర్వచనము. నాట్య శాస్త్రము గూడ 'నానాసిద్ధాన్త సాధితమ్'. అనుచు నిట్లే నిరుక్త లక్షణమును చెప్పుట గమనార్హము. (చూ. అవతారిక)

ఉపనిషత్తు లెపు డావిర్భవించినవో యపు డవి బ్రహ్మవిద్య నపరోక్షముగ ప్రతిపాదించెడి స్వభావము గలవి యగుచునే, స్వస్వభావమును నిరూపించుచునే యావిర్భవించినవి.

"తస్య వా ఏతస్య యజుషః రస ఏవోపనిషత్ — — — సా హ్యైషైవ
దేవానా మద్ధా విద్యా (శ.బ్రా.); ఏష ఆదేశః, ఏష ఉపదేశః
ఏషా వేదోపనిషత్ (తై. ఉ.); ఇత్యుపనిషత్; య ఏవం
వేదేత్యుపనిషత్ (తై. ఉ.); తస్యోపనిషత్ సత్యస్య సత్యం
(బృ. ఉ. 2-1-20; మై. ఉ. 6-32), తస్యోపనిషత్ అహ రితి;
తస్యోపనిషత్ అహ మితి, (బృ.ఉ. 3-5-3,4); ఆత్మవిద్యా
తపోమూలం తద్బ్రహ్మోపనిష త్పరమ్ "

(శ్వే. ఉ. 1-16; బ్రహ్మ-ఉ. 3.)

ఇవి ఉపనిషత్స్వరూప లక్షణ పరములైన నిర్వచనవాక్యములు. కాన ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్య; వేదసారము లేక వేదరసము లేక వేదరహస్యము; అందుచే సాంగవేదము నందంతట నిలీనమై నిగూఢమై వ్యాపించి యుండునది-అనెడి శ్రుత్యర్థమును యథాతథముగ గ్రహించుటయే యుక్తము.

ఇట్లు వేద మంతయు ఉపనిషద్రస పరిప్లుత మని గ్రహించి, శ్రుతి నిర్వచనానుగుణముగనే వేదము యొక్క వేదత్వమును గూడ దర్శింపవలసి

యున్నది. వేదము లెపు డావిర్భవించినవో యపు డని స్వస్వరూప స్వభావముల నిట్లు నిర్వచించుచునే యావిర్భవించినవి "వేదవాక్కు లన్నియు నేయార్థములు, నిగూఢార్థ బోధకములు (నిణ్యా వచాంసి); వివిధఫల ప్రాపకములు, (నీథాని); సర్వవిధారకుడు, క్రాంతదర్శి, సర్వజ్ఞుడును నగు అగ్నిని– పరమే శ్వరుని– ఉద్దేశించునవి (హే వేధః, విదుషే కవయే తుభ్యం కావ్యాని); నియమ పూర్వకముగ అధ్యయనము చేయదగినవి, ఉచ్చరింపదగినవి (నివచనాని)-" అనుచు ఋగ్వేదము (4 - 3 - 16) వేదవాక్స్వరూప స్వభావముల నిర్వచించినది (చూ. అవతారిక). ఇక 'ఋచో౽క్షరే పరమే వ్యోమన్' అను మంత్రము మొదటి పాదముచే 'ఋక్కులన్నిటికిని సర్వదేవతాధిష్ఠానభూత– అక్షరాత్మక బ్రహ్మ తత్త్వము నందే తాత్పర్యము'- అని వేదస్వరూప లక్షణమును నిర్వచించినది. తదనుగుణముగ 'య స్తన్న వేద కి మృచా కరిష్యతి - - -' అను ఉత్తరార్థ ముచే 'వేదం బ్రహ్మాణం వేదయతీతి వేదః'– అనెడి నామనిర్వచనాత్మక లక్షణ మును ప్రదర్శించినది. కృత్స్న వేదరాశి యంతయు బ్రహ్మతత్త్వప్రతిపాదనము నందే తాత్పర్యము గలది యగుటచే ఉపనిషద్రూపము– అనెడి వేదస్వరూపము స్పష్టము. "సైషా హ్యుపనిష ద్బ్రాహ్మీ" (భాగ. 10-37-3) అను భాగవత వచనము కూడ కృత్స్న వేదరాశి ఉపనిషద్రూపమని కీర్తించినది. "ద్వే విద్యే వేదితవ్యే - - - పరా చైవాపరా చ" –అనుచు ముండకశ్రుతిచే ప్రతిపాదింపబడిన పరా-అపరా విద్యాస్వరూపమును వివరించుచు శ్రీ శంకర - రంగరామానుజ భాష్యము లందునీ విషయ మభివ్యక్తము చేయబడినది. కావున నిఖిలవేదము సాక్షాత్తుగ గాని, పరోక్షముగ గాని పరబ్రహ్మప్రతిపాదక మగుట స్పష్టము.

మంత్రముల యందు సారరూపమున నంతర్నిలీనమై నిగూఢమై యున్న తత్త్వము నపరోక్షముగ ప్రతిపాదించు నట్టిదియే ఉపనిష ద్గ్రంథభాగము. అంతియే కాని మంత్రములచే జెప్పబడని యొక విలక్షణ తత్త్వమును చెప్పుటకై తరువాత నెన్నడో ఉపనిషత్తులావిర్భవించిన వనెడి చారిత్రికుల యూహ శ్రుతి సమ్మతము కాదు. అందుచేతనే ఉపనిషత్పద విషయమున మాక్సుముల్లరు వంటి తునిచే జేయబడిన నిర్వచనవిధానము ఉపనిషత్సమ్మతము, న్యాయసమ్మతము కానం దున అనాదరణీయమగుచున్నది.

15)

## బ్రహ్మవిద్యా-కర్మోపాసనాది సాధనావశ్యకత

కావచ్చును; 'వేదసార ముపనిషత్తు-అని యనుచో సారరూప మగు ఉపనిషద్భాగమునే గ్రహించిన జాలును; మిగిలిన వేదభాగముతో గాని తద్విహిత కర్మకాండతో గాని పని యేమి ? అందుకై ప్రయాస పడ నేల ?"- అని యనవచ్చును. ఇట్లనుట సరికాదు. ఉపనిషత్ప్రతిపాద్య మగు బ్రహ్మవిద్యయే పరమప్రాప్యము కావచ్చును. కాని యది సిద్ధించు టెట్లు ? ప్రాసాదోపరితలము జేరిన వానికి సోపానపరంపరతో పని లేక పోవచ్చును. కాని యా గమ్యస్థానమును పొంద గోరు వారికి సోపానపంక్తి నాశ్రయింపక తప్పదు. ప్రయత్నము లేకయే ఫలము నుండి రసము స్వయముగ నుద్భూతము కాదు. కాన సాధ్యప్రాప్తికి సాధనావశ్యకత యెంతేని యుండును. ఏ యుపనిషద్గ్రంథము బ్రహ్మవిద్యను ప్రతిపాదించుటకై యావిర్భవించినదో యదియే బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనములను గూడ నిట్లు నిర్దేశించినది.

1. "త మేతం వేదానువచనేన బ్రాహ్మణం వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" —బృ. ఉ. 4-4-22

2. "అథ యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్య మేవ తత్" —ఛా. ఉ. 8-5-1

"అత్ర చ విద్యాసాధనభూతస్య బ్రహ్మచర్యస్య యజ్ఞాదిభిః సంస్తవాత్ యజ్ఞాదీనా మపి హి సాధనభావః సూచ్యతే" —శం.భా: బ్ర. సూ-3-4-26.

.3 "సర్వే వేదా య త్పద మామనన్తి, తపాంసి సర్వాణి చ య ద్వదన్తి, య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి, త త్తే పదం సంగ్రహేణ బ్రవీమి" —కఠ.ఉ 2-15

"ఇత్యేవ మాద్యా చ శ్రుతిః ఆశ్రమకర్మణాం విద్యాసాధనభావం సూచయతి" —శం. భా.

4 "తస్మా దేవంవిత్ శాంతో దాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మ న్యేవాత్మానం పశ్యతి" —బృ. 4-4-23.

ఇట్టి యీ యుపనిషద్వాక్యములు యజ్ఞాదులను, బ్రహ్మచర్యము మున్నగు ఆశ్రమకర్మలను శమదమాదులను బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనములుగ జెప్పుచున్నది. (చూ—బ్ర. సూ; సర్వాపేక్షాధికరణము). ఇట్లు చెప్పుటయే కాదు. ఉపనిషత్తులు కర్మవిషయమై చేసిన హెచ్చరికయు ప్రధానముగ గమనింప దగినది.

"వేద మనూచ్యాచార్యోఽన్తేవాసిన మనుశాస్తి।సత్యం వద। ధర్మం చర స్వాధ్యాయాన్ మా ప్రమదః - - - - ధర్మాన్న ప్రమదితవ్యమ్ - - స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ । దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ । మాతృదేవో భవ । పితృదేవో భవ । ఆచార్య దేవో భవ । అతిథిదేవో భవ । యా న్యనవద్యాని కర్మాణి । తాని సేవితవ్యాని । నో ఇతరాణి - - - "ఏత దనుశాసనమ్- - -"

తై ఉ. 11. 1 నుండి 4.

"వేదమనూచ్యైవమాది కర్తవ్యతోపదేశారంభః ప్రాగ్బ్రహ్మవిజ్ఞానాన్ నియమేన కర్తవ్యాని శ్రౌతస్మార్తాని కర్మాణీత్యేవమర్థః. పురుషసంస్కారార్థత్వాత్, సంస్కృతస్య హి విశుద్ధసత్త్వస్య ఆత్మవిజ్ఞాన మంజసై వోత్పద్యతే । తపసా కల్మషం హన్తి విద్యయా ఽమృత మశ్నుతే ఇతి హి స్మృతిః। వక్ష్యతిచ— తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ ఇతి । అతో విద్యోత్పత్త్యర్థ మనుష్ఠేయాని కర్మాణీతి

—శం.భా.

ఇట యుపనిషత్తు బ్రహ్మవిద్యాప్రాప్తికి పూర్వము నియమముగ అనుష్ఠింపవలసిన శ్రౌతస్మార్తకర్మల జెప్పినది. సత్యపరిపాలనము, ధర్మాచరణము, స్వాధ్యాయప్రవచనములు, మాతృ- పితృ- ఆచార్య- అతిథిపూజ, దేవపితృకార్య విషయములం దప్రమత్తత, నింద్య- నిషిద్ధకర్మనిరాకరణము- మున్నగు నవి ఆవశ్యకర్తవ్యము లని చెప్పినది. ఏత దనుశాసనమ్- ఇది శాసనము- అనుచు హెచ్చరించినది. ఉల్లంఘించినచో బ్రహ్మవిద్యాప్రాప్తికి ప్రతిబంధకము లైన దోషము లావరించి బ్రహ్మవిద్యకు దూరులగుదు రని యీ హెచ్చరిక తాత్పర్యము.

మఱియు శ్రుతి స్మృతి విహితము లైన కర్మలు తత్తత్ఫల ప్రాపకము లగుచు సత్త్వశుద్ధిని కల్గించును సుసంస్కృతచిత్తులై విశుద్ధసత్త్వసంపద గలవారికి బ్రహ్మ విద్యాప్రాప్తి సులభము. కాన బ్రహ్మవిద్యాప్రాప్తికై విహితకర్మానుష్ఠాన మత్యన్తా వశ్యకము— అని భావము ”

భగవద్గీతయందును ఫలాభిసంధిలేక— నిష్కామబుద్ధితో ననుష్ఠించువారికి కర్మలు జ్ఞానసాధనము లగు నని విపులముగ వివరింపబడినది. ఇట్లు బ్రహ్మవిద్యా ప్రాప్తిసాధనము లగుటచే వేదవిహితకర్మలను విద్యాశబ్దవాచ్యములు (తాదర్థ్యాత్ తచ్ఛబ్దవ్యవహారః) ఉపనిషత్తు గూడ ద్వే విద్యే వేదితవ్యే పరా చైవాపరా చ' అనుచు వేదవిహితకర్మను గూడ విద్యనుగా పేర్కొనుట గమనార్హము. కావుననే కర్మారంభసమయమున. 'బ్రహకర్మ సమారభే'- అను సంకల్పించు ఆచారము గూడ నీ సంప్రదాయమును వెల్లడిచేయును. శ్రీమద్భాగవతము కూడ కర్మల యొక్క యావశ్యకత వాని ననుష్ఠింపనిచో గల్గు దోష పరంపరకర్మలు మోక్షార్థ ములగుట- అనెడి యుపనిషత్తాత్పర్యమునే ముక్తకంఠముగ నిట్లు వివరించినది.

పరోక్షవాదో వేదోఽయం బాలానా మనుశాసనమ్ ।
కర్మమోక్షాయ కర్మాణి విధత్తే హ్యగదం యథా ॥
నాచరే ద్యది వేదోక్తం స్వయ మజ్ఞోఽజితేంద్రియః ।
వికర్మణా హ్యధర్మేణ మృత్యో ర్మృత్యు ముపైతి సః ॥
వేదోక్త మేవ కుర్వాణో నిస్సంగోఽర్పిత మీశ్వరే ।
నైష్కర్మ్యం లభతే సిద్ధిం రోచనార్థా ఫలశ్రుతిః ॥

—భాగ-11-3-48 నుండి 50

కాన బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనము లగుటచే వేదవిహితము లైన కర్మ-ఉపాసన లన్నియు నుపాదేయములు; కాన నమల్లంఘనీయములు- అని యుపనిషత్తుల యొక్క పరమతాత్పర్యము. ప్రాసాదము నధిరోహించిన వానికి సోపానములతో నిమిత్తము లేకపోవచ్చును. కాని ప్రాసాదాధిరోహణమునకు సోపానము లనావశ్యకము లని నిందింపడు. అట్లే బ్రహ్మవిద్యాసంపన్ను లగు వారికి తత్ప్రాప్తిసాధనము లైన స్వాధ్యాయాధ్యయనాదికర్మలతో పని లేకపోవచ్చును. కాని యవి యనావశ్యకము లని నిందింపరు, లోకానుగ్రహబుద్ధితో వాని యావశ్య

కతను, విశిష్టతను లోకమున కుపదేశించుచుందురు; యోగ్యత ననుసరించి సాధకు లగు వారిని ఆ యా కర్మలయందు ప్రవర్తింప జేసి, దీక్షాశ్రద్ధాదులను బెంపొందింప జేయుచుందురు ఇట్లు కర్మలను ప్రవర్తింపజేయుము, వాని యావశ్యకతను లోకమున చాటవలె నని శ్రుతియే యిట్లు ప్రబోధించుచున్నది.

"శ్రద్ధయాగ్నిః సమిధ్యతే శ్రద్ధయా హూయతే హవిః ।
శ్రద్ధాం భగస్య మూర్ధని వచసా వేదయామసి ॥

—ఋ 10-151-1; తై.బ్రా. 2-8-8-6; నిరు. 9-31

"జనానా మగ్రే సౌభాగ్యహేతుః శ్రద్ధేతి ప్రఖ్యాపయామః
(వేదయామసి)" —సా. భా-తై. బ్రా.

శ్రద్ధయొక్క మహత్త్వము, ఆవశ్యకతయు నీ ఋగ్వేదసూక్తమున నింకను బెక్కురీతుల వివరింపబడినవి. దీక్షయొక్క మూలరూపమే శ్రద్ధ -అని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"ఏత ద్దీక్షాయై (రూపం) యచ్ఛ్రద్ధా" — శ. బ్రా. 12 - 8 - 2 - 4.

లౌకికకార్య నిర్వహణము నందే, ఇష్టసంప్రాప్తికై దీక్షా శ్రద్ధాదుల యావశ్యకత యెంతేని గలదు ఇక ప్రాపంచిక విషయముల నుండి దృష్టిని మరల్చి - కామక్రోధాదులకు దూరుడై - పరమేశ్వరార్పణ బుద్ధితో చేయదగియున్న వైదికకర్మోపాసనా ద్యనుష్ఠానమున దీక్షా శ్రద్ధాదుల యావశ్యకతను గూర్చి జెప్ప నేల ? వీనిచే క్రమముగ సుసంస్కృతమై శాణోల్లీఢ మగు మణి వలె చిత్తము తేజరిల్లును; అపుడే అంతర్దర్శన సమర్థ మగును; అపుడే సుఖతరముగ ఉపనిషద్విద్యా రసాస్వాద మొనర్చి బుద్ధి తానే బ్రహ్మవిద్యా రూపిణియై యమృతత్వమును సిద్ధింపజేయును. ఇట్లు బ్రహ్మవిద్యాప్రాప్త్యుపాయము లగుట చేతనే యీ శ్రద్ధాదులు గూడ ఉపనిషత్తులుగా (ఉప + ని + గమయితృత్వాత్) శ్రుతియందు కీర్తింపబడినవి.

"అథైతా వేదస్య అష్టా వుపనిషదో భవన్తి । వి త్తిశ్చోప
స్తవశ్చ దమశ్చ శ్రద్ధాచ సంప్రశ్నశ్చానాకాశీకరణం చ
యోగా శ్చాచార్యశుశ్రూషా చేతి" — సంహితా - బ్రా - 3.0 2
"అథ పూర్వోక్తార్థ వేదాధ్యయన విధిప్రాప్తయే ఏతాః

ప్రోచ్యమానాః అష్ట సంఖ్యాకాః ఉపనిషదః అధికారి
విశేషణాని ఉపనిషద్భిః ప్రతిపాదితాని" — సా. భా

విత్తిః = ప్రజ్ఞ, లేక ఆచార్యదక్షిణ; ఉపస్తవః = ఆచార్యస్తుతి; దమః = వివిధ వేదోక్తవ్రత దీక్షలచే బాహ్యశరీరమును, సూక్ష్మశరీరమును నియమించుట; శ్రద్ధా = విద్యాధ్యయనశ్రద్ధ; ఆచార్యభక్తి శ్రద్ధ; ఆస్తిక్యబుద్ధి, సత్యము (శ్రత్ సత్యం, దధాతీతి శ్రద్ధా); సంప్రశ్నః = అధీత వేదభాగమున సంశయముల దొలగించుకొనుటకై చక్కగ ప్రశ్నించుట; అనాశీకరణం = అయోగ్యుని కడ విద్య నభివ్యక్తము చేయకుండుట; యోగః = అభ్యస్తమైన విద్యతో నిరంతర సాహచర్యము. ఆచార్యశుశ్రూషా = ఆచార్యవాక్పాలనము.

ఇవి వేదాధ్యయన విధి ప్రాప్త్యుపాయములుగా ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడిన నియమములు, శ్రుతి వీనికి 'ఉపనిషత్తులు' అని మహాన జ్ఞాకరణము చేయుట చేతచే నివి క్రమముగ బ్రహ్మవిద్యాప్రాప్తి సాధనములు గూడ నగుట సూచిత మగుచున్నది. శ్రుత్యభిమతము గూడ నిదియే యని పూర్వము వివరింపబడినది. ఉపనిషత్ప్రతిపాదిత మైన బ్రహ్మవిద్యకు ఉపనిషత్ అని ప్రసిద్ధి అట్లే, ఉపనిషత్ప్రతిపాదితము అగు నీ శ్రద్ధాదులకును ఉపనిషత్తు లని శ్రుతి యందు ప్రసిద్ధము.

ఇంతే కాదు; ఏ అన్నము, లేక అన్నరసము జీవనహేతువో అదియే జ్వరాదిరోగపీడితులకు విషమై శరీరపతనహేతు వగును (అద్యతేఽత్తిచ భూతాని తస్మా దన్నం త దుచ్యతే) అటులే యే వేదము, లేక వేదరసరూపమగు బ్రహ్మవిద్య అమృతత్వప్రాప్తిహేతువో, అదియే ఐహికభోగాసక్తులకు -కామాది దోష దూషితాంతఃకరణులకు- అనధికారులకు విషాదిరూపమై- అనుపాదేయమై ఉభయ భ్రష్టతకు హేతు వగును ప్రయోగకుశలురైన యభిజ్ఞులచే ప్రయుక్తము లగు విషాదిద్రవ్యములు వినాశహేతువులు కావు; ఉపకారకములై సత్ఫలముల నిచ్చును. అవియే అనభిజ్ఞుల చేతిలో స్వ-పర వినాశహేతువు లగుచుండును. ఉపనిషద్విద్య

గూడ నట్టిరి. అందుచేతనే ఉపనిషత్పదమునకు 'విషాదిద్రవ్యము'- అను నర్థము కూడ వాఙ్మయమున ప్రసిద్ధము.[1]

కాన దీక్షా శ్రద్ధా వైరాగ్యాది సాధనసామగ్రీ సంపన్నులై యోగ్య లగు వారికడ మాత్రమే ఉపనిషద్విద్య కార్యకారి కాగలదని శ్రుతితాత్పర్యము. ఇట్టి యోగ్యతను క్రమముగ పెంపొందింపజేయుట కయియే, పూర్వోదాహృత శ్రుతి తాత్పర్యానుగుణముగ, మహాత్ములు కర్మోపాసనాద్యావశ్యకతను ప్రధానముగ ప్రబోధించుచు, వాని యందు ప్రవర్తింపచేయుచుందురు అట్టి మహాత్ముల దృష్టిలో కాండత్రయాత్మక మైన వేదరాశి యంతయు నుపనిషద్రూపమే. యజ్ఞాదికర్మలు గాని ఉపాసనలుగాని, పూజాదికర్మలు గాని- యెవరేది యొనర్చినను వాని యన్నిటియందా మహాత్ములు దర్శించునది ఉపనిషత్తత్త్వమే. పూర్వోదాహృత 'ఋచోఽక్షరే పరమే వ్యోమన్; ఏతా విశ్వా విపుషే తుభ్యం"—— ఇత్యాది మంత్ర తాత్పర్యము నిదియే.

ఇట్లు వేదోక్త కర్మాదిక మంతయు నధికారిభేదము ననుసరించి ప్రత్యక్షముగనో పరోక్షముగనో పురుషబుద్ధికి గోచరము కాని —యనిర్వచనీయమైన- బ్రహ్మతత్త్వమును ప్రతిపాదించు స్వభావము కలది యగుట స్పష్టము. కాన వేదము నందలి కర్మకాండయొక్క లక్ష్యము వేఱు; ఉపనిషత్కాండ లక్ష్యము వేఱు——అని చెప్పుట తగదు. కృత్స్న వేదలక్ష్య మొకటియే.

పురుషబుద్ధికి గోచరము గానిదగుటచే - 'పరమం వ్యోమ, పరమం పదమ్, అక్షరమ్, తత్, సత్'——అని యీ రీతిగ ఋగాది శ్రుతు లన్నిటి యందును ప్రసిద్ధమైన ఒక వేదమును (బ్రహ్మను) తెలియుజేయుటకై పెక్కు వేదము లావిర్భవించినవి.

"ఏకవేదస్య చాజ్ఞానాత్ వేదా స్తే బహవోఽభవన్" -

అని సనత్సుజాతీయ వచన తాత్పర్యము.

1. "సంధౌ స్థితో వా జనయేత్ స్వవృద్ధిం హన్యాత్పరం వోపనిషత్ప్రయోగైః"
భట్టికావ్యమ్-12—30

శత్రుం ఉపనిష త్ప్రయోగైః విషాదిదానైః హన్యాత్
——జయమంగళ వ్యాఖ్యా.

ఈ సనత్సుజాతీయ వచనమునందలి వేద శబ్దములకు జెప్పబడిన నిర్వచనములను, ఇంతదనుక ఈ శీర్షిక యం దుహరించిన శ్రుతి స్మృతి వచనములను పరిశీలించి చూచినచో—

1. ఋగ్యజుఃసామరూప మంత్రజాతము, హవిస్సులు, హవిర్దాతలగు యజమానులు నే దేవుని సఖ్యము కాంక్షించుచున్నట్లు (యో జాగార త మృచః కామయన్తే - ఇత్యాది) శ్రుతిచే చెప్పబడినదో, విప్రుడును, జాగరూకుడు నగు నా యగ్నియే 'దేవః- వేదః- జాతవేదాః' అని కీర్తింపబడినాడు (జాతవేదసే సునవామ; వేదోఽసి యేన త్వం దేవ వేద- ఇత్యాది).

2. దేవుడును వేదస్వరూపుడు నగు నా యగ్నియే "అగ్నిరస్మి జన్మనా జాతవేదాః; వేదోఽసి; వేదో వై పుత్రనామాసి, అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః" -ఇత్యాది మంత్రములచే జీవుని వాస్తవికస్వరూపుడుగ వివరింపబడినాడు.

3 ఆ యగ్ని పురుషబుద్ధికి గోచరుడు గాడు, శాస్త్రైకవేద్యుడు, సర్వవేదాత్మకుడు; సర్వదేవాత్మకుడు, సర్వాత్మకుడు-నని 'న వి జానామి యది వేద మస్మి; ఋచోఽక్షరే పరమే వ్యోమన్; అయ మస్మి సర్వః'- ఇత్యాది ఋక్కులచే దెల్పబడినాడు.

4. కాన, పవిత్రుడు, మంగళస్వరూపుడు, సర్వాత్మకుడు, యజ్ఞేశ్వరుడు (యజ్ఞస్య దేవః), చిదాత్మయు నగు నా మహాగ్నినే 'అగ్ని మీళే పురోహితమ్'- అని కీర్తించుచు వేదప్రథమావతారరూప మగు ఋగ్వేద మావిర్భవించినది- అని తెలియ నగును. ఇట్టి యగ్ని యొక్క (వేదము యొక్క) తత్త్వము నధికారి భేదము ననుసరించి బోధించుటయే నిఖిల వేదరాశి యొక్క పరమ లక్ష్యము. ఇదియే వేదము యొక్క వేదత్వము. 'వేదం వేదయతీతి వేదస్య వేదత్వమ్.'

వేదము యొక్క వేదత్వము 'ఋషి' శబ్ద పరిశీలనము వలనను స్పష్ట మగును. ఇక వేదము యొక్క ఋషిత్వమును దర్శింతము.

.... )( ....

# ఋ షి :

ఋషీణాం సర్వస్వం ఋషి మథయవాత్రీం సుకృతినాం
వచస్సారోదారాం భరతజనభాగ్యం ప్రథమజామ్ ।
అగాధాం తాం గాథాశతవిలసితాం న్యాయమహితాం
పరాం దేవీం వాచం హరిహృదయలక్ష్మీం హృది భజే॥

—వేదమాతృస్తవః.

త్రిభువనస్య చ సర్జన పాలన
ప్రభృతి కర్మసు మార్గ నిదర్శికామ్ ।
తపసిచాధిగతాం ఋషి సంభృతాం
ప్రథమజాం స్తుమ ఆద్య ఋషిం గిరమ్ ॥

## ఋషిః-శ్రుతి స్మృతి కోశప్రసిద్ధి :-

ఋషి పదము గూడ వేద నామముగ ప్రసిద్ధము.

"ఋషి ర్వేదే వసిష్ఠాదౌ" — మేదినీ.

"ఋషి స్తు వేదే భృగ్వాదౌ జ్ఞానవృద్ధే దిగంబరే" - వైజయన్తీ.

"ఋషి ర్వేదే వసిష్ఠాదౌ దీధితా వపి పఠ్యతే" - విశ్వః.

"ఏత ద్వోఽస్తు తపోయుక్తం దదామీ త్యృషిచోదితమ్"

భార. శాన్తి 11-19.

'ఏత త్కర్మ దదామీతి ఋషిణా మంత్రేణ బోధితం, తథాచ ఇంద్రవాక్యం కర్మకాండే-శ్రు. "దేహి మే దదామి త" ఇతి.

—నీలకంఠవ్యాఖ్యా.

పాణినిమహర్షియు ఋషిపదమును వేదపరముగ బ్రయోగించినాడు.

"అప్లుతవ దుపస్థితే" (6-1-129)- "ఉపస్థితోఽనార్ష ఇతిశబ్దః
"(అవైదికః ఇతిశబ్దః)"
"సంబుద్ధౌ శాకల్య స్యేతా వనార్షే" - 1-1-16.
"ఋషి ర్వేదః - తదుక్తం ఋషిణా ఇత్యాదౌ తథా దర్శనాత్"

—తత్త్వబోధినీ.

"కర్తరి చర్షిదేవతయోః —3-2-186.
"ఋషి ర్వేదమంత్రః, తదుక్తం ఋషిణేతి దర్శనాత్—సిద్ధాన్తకౌముదీ.
"సన్మాత్రే చ ఋషి ర్దర్శనాత్"—5-2-94. వార్తికమ్.
"ఋషిః పఠతి-శృణోత గ్రావాణః"-పాతంజల మహాభాష్యమ్. 3-1-7.
"ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం చ సర్వదా ।"
నృయజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి న హాపయేత్ ॥"

—వాచస్పత్యమ్.

ఇట్లు కోశములందును, భారతాదులందును, శబ్దానుశాసనమునందును ఋషిశబ్దము వేదపరముగ బ్రసిద్ధము బ్రహ్మ యనియు వేదమునకు నామము. అందుచే బ్రహ్మ యజ్ఞము ఋషియజ్ఞ మనియు కీర్తింపబడినది. మఱియు, 'తదుక్తం ఋషిణా'; 'ఏత దధివిధాయ ఋషి రవోచత్;' 'తదేత దృషిః పశ్య న్నభ్యనూవాచ" -అని యీ రీతిగ శ్రుతియే తనను ఋషి యని పెక్కుచోట్ల వ్యవహరించుకొనినది. ఈ యర్థమును వివరించెడి ఋషి ప్రశిష్టా 1, ఋషిచోదనః 2, ఋషిమనాః 3 — ఋషికృత్, ఋషిస్తుతా 4 — ఇత్యాది పదములు వేదవాఙ్మయమున పెక్కులు గలవు.

---

1) అ సం. 11-1-15; 2) ఋ. 8-51-3; 3) ఋ. 9-96-18;
4) ఋ. 1-75-5;

## ఋషిశబ్దము-నిర్వచనము :

'ఋషి ర్దర్శనాత్' అని యాస్క నిర్వచనము. ఋషిగతౌ. ఈ నిర్వచనమును జూచినంతనే దర్శనము చేతనధర్మ మని స్ఫురింపక మానదు. సామాన్యముగ చేతనులై, ద్రష్టలయిన వసిష్ఠాదులను ఈ ఋషిపదము బోధించుట ప్రసిద్ధము. వేదము శబ్దరూపము, కాన, జడము. చేతనము కాదు. అట్టియెడ వేదము ఋషియగుటెట్లు ?

వేదశబ్దము మొదట సర్వజ్ఞుడగు పరమేశ్వరునకు (వేత్తీతి వేదః) వాచక మగుచు, తరువాత తత్స్వరూప నిరూపణపరమై, (వేదయతీతి వేదః) సర్వజ్ఞకల్పమగు ఋగాది శబ్దరాశికిని వాచకమైనది. పిదప తన్మూలములై, తదనుగుణముగ ప్రవృత్తము లయ్యెడి ధర్మ, అర్థ, కామములకు నుపలక్షక మగుచున్నది. అట్లే ఋషిశబ్దముగూడ మొదట సర్వద్రష్ట (దర్శనాత్) యగు పరమేశ్వరుని బోధించుచు పిదప నట్టి పరమేశ్వరుని దర్శింపజేసెడి (దర్శనాత్) ఈ వేదశబ్దరాశికిని వాచకమై వరలినది తరువాత నీ యిరువురు ఋషులును (దేవ - వేదములను) ఆరాధించి తదనుగ్రహముచే ద్రష్టలయి వెలసిన దేవతలకును, వసిష్ఠాదులకును వాచకమై ప్రసిద్ధమైనది.

## పరమేశ్వరుడు - ఋషిత్వము :

"య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా న్యసీద త్పితా నః।
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛ దవరాగ్ం ఆ వివేశ॥"

ఎవ డీ సకల భువనములను లయ మొందించి, అద్వితీయుడై యుండి, మరల సృష్టికాముడై, అద్వితీయము నుత్కృష్టమునైన తన రూపము నాచ్ఛాదింపజేయుచు, జగత్తును భాసింపజేసి, జీవరూపమున నా యా యుపాధుల నావేశించి యుండునో, జగత్పితయగు నా పరమేశ్వరుడు సర్వద్రష్ట యగుటచే నీ మంత్రమున 'ఋషి' యని కీర్తింపబడినాడు. (యూ.సా.భా: ఉవట మహీ-భా; వేం-మా-భా).

'జన్మాద్యస్య యతః శాస్త్రయోనిత్వాత్' — ఇత్యాది బ్రహ్మసూత్రములచే నే పరమేశ్వరలక్షణము బాదరాయణ మహర్షిచే నిరూపింపబడినదో యట్టి పరమేశ్వరలక్షణమునే యీ ఋగ్వేదమంత్రము ప్రదర్శించుచున్నది. సృష్టిస్థితి లయకర్త, సర్వజ్ఞుడు, సర్వద్రష్ట యగు పరమేశ్వరుడు ఆదిఋషి' అద్వితీయుడగు నీ ఋషియే యుపనిషత్తులయందును 'ఏకర్షి' యని కీర్తింపబడినాడు.

(1) ఋ. 10 – 81 – 1; వా సం. 17 - 17; తై సం. 4 – 6 – 21; మై. సం. 2 – 10 – 2; కాఠ. సం. 18 – 1.

"క్రియావంతః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠా స్వయంజుహ్వత
ఏకఋషిం శ్రద్ధయన్తః" — ము ఉ. 2 – 10.
"పూష న్నేకార్షే యమ సూర్య ప్రాజాపత్య...." — ఈశా ఉ. 16.

ఈ ఏకర్షియొక్క అద్వితీయ ద్రష్టృత్వమును ఉపనిషత్తులు —
"నాన్యోఽతోఽస్తిద్రష్టా" బృ. ఉ. 3 – 7 – 23.

యని బహుముఖముల వివరించినవి. ఆధ్యాత్మికముగ మూర్ధభాగమున సహస్రారమునందు వెలుగొందు పరంజ్యోతియే యీ ఏకర్షి.

"తత్ర సూర్యోఽగ్నిర్నామ సూర్యమండలాకృతిః
సహస్రరశ్మిభిః పరివృత ఏకర్షి ర్భూత్వా మూర్ధ్ని
తిష్ఠతి, యస్మాదుక్తః" — ప్రాణాగ్ని. ఉ. 2 – 3.

ఈ యుపనిషత్తు 'యస్మా దుక్తః' అని యనుచు, వేదప్రతిపాదితుడైన పరంజ్యోతియే సహస్రారమున వెలుగొందెడి ఏకర్షి - అని చెప్పుచున్నది. ఏకర్షి యనగా ముఖ్యర్షి యనియు చెప్పబడుచున్నాడు.

"ఏకర్షిః ముఖ్యర్షిః శివః" — బ్ర. సూ. 3 – 3 – 3. శివార్కమణిదీపిక. ఇంతేకాదు. వేదమున ననుసరించియే శివ, విష్ణ్వాది సహస్రనామములందును పరమేశ్వరునకు 'మహర్షి' యనియు నామము ప్రసిద్ధమైనది.

కాన పైవిషయముల బరిశీలించినచో 1. పరమేశ్వరుడు ఏకర్షి లేక ముఖ్యర్షి 2. పరమేశ్వరునకుగల ఋషిత్వము వేదములం దొకతీరుగను, ఉపనిషత్తులయం దింకొక తీరుగను, తరువాత బ్రహ్మసూత్రపురాణాదులందు వేఱ్వేఱు తీరులుగను లేదనుట స్పష్టమైనది.

# వేదము - ఋషిత్వము :

ఋషియగు నీ పరమేశ్వరుని దర్శింపజేయునది యగుటచే (దర్శనాత్) వేదమునకు ఋషి యను నామము సార్థక మని శ్రుతుల వలన దెలియుచున్నది. ఇక వేదమునకు గల ఆర్షధర్మమును జూతము.

"ఏతా[1] అర్షన్తి హృద్యాత్సముద్రా చ్ఛతవ్రజా రిపుణా నావచక్షే ।
ఘృతస్య ధారా అభిచాకశీమి హిరణ్యయో వేతసో మధ్య ఆసామ్ ॥"
ఋ. 4-58-5; వా సం. 1 -13; కాఠ. సం. 40-7.

హృద్యాత్ సముద్రాత్ శతవ్రజా ఏతా అర్షన్తి :
శ్రద్ధ యనెడి యుదకముతో పరిప్లుతమైన నిరంతర దేవతా యాథాత్మ్య చింతనమే సముద్రము అట్టి చింతనము నిగమ - నిరుక్త - నిఘంటు - వ్యాకరణ - శిక్షా - ఛందస్సులచే దోషరహితము గావింపబడి సుసంస్కృతమగుచో హృద్య మగును. హృద్యమగు నీ చింతనసంతానరూప సముద్రము నుండి యీ వేదవాక్కులు ఉద్గమించుచున్నవి (ఏతా అర్షన్తి). అట్టి యీ వాక్కులు శతవ్రజములు; అనగా వివిధార్థబోధకములగుటచే శతపథములై యర్థగాంభీర్యముతో విలసిల్లి యుద్గమించుచున్నవి.

రిపుణా నావచక్షే :
ఇట్టి యీ వాక్కులు 'కుతార్కికవాదము' అనెడి శత్రువునకు లొంగవు; పరాభూతములు కావు.

---

1. మహీ భా :— "ఏతా వాచ అర్షన్తి ఉద్గచ్ఛన్తి । కస్మాత్ । హృద్యాత్ సముద్రాత్ । శ్రద్ధోదక పరిప్లుతా[illegible]వతా యాథాత్మ్యచింతన సంతాన రూపాత్ సముద్రాత్. నిగమ నిరుక్త నిఘంటు వ్యాకరణ శిక్షా చ్ఛందోభిః పావనైః పూతాత్ । కీదృశ్యో వాచః । శతవ్రజాః శతం వ్రజం వ్రజా గతయో యాసాం తాః బహుగతయః । బహ్వర్థా ఇత్యర్థః । యాశ్చ అర్షన్తో రిపుణా కుతార్కికలున్ద శత్రుణా న అవచక్షే న అవచక్ష్యంతే । నాపవదితుం ఖండయితుం శక్యన్తే । తా ఘృతస్య ధారా ఇవాభి చాకశీమి । ఋష్యోపమానమ్ । అహం పశ్యామి । ఆసాం

ఘృతస్య ధారా అభిచాకశీమి :

ఘృతధారలు దేవతలకును, దేవాత్మకుడైన పరమేశ్వరునకును ప్రీతికరము లగునట్లు, ఈవాగ్ధారలను గూడ ప్రీతికరములుగ దర్శించుచున్నాము; ఇంతే కాదు.

హిరణ్యయో వేతసో మధ్య ఆసామ్ :—

ఈ వాక్కులయం దంతర్నిహితుడై తేజోమయుడై వెలుగొందెడి వాగధిష్ఠానభూతుడైన యే యగ్ని కలడో యా జ్యోతిని దర్శించుచున్నాము- అని పై మంత్రార్థము. దీని తరువాతి మంత్రము.

"సమ్యక్ స్రవన్తి సరితో న ధేనా అంతర్ హృదా
మనసా పూయమానాః । ఏతే అర్షన్త్యూర్మయో
ఘృతస్య మృగా ఇవ క్షిపణో రీషమాణాః ।"

—ఋ. 4-58-5; వా. సం. 17-94; 13-38.

ధేనాః అనగా వాక్కులు. జల్లెడతో ధాన్యాదికమును అన్యపదార్థములనుండి వేఱుచేసి శుభ్రపఱచునట్లు శ్రద్ధాది పరిశుద్ధమైన బుద్ధిచే (అన్తర్ హృదా) సుసంస్కృతమైన మనస్సుద్వారా (మనసా) శబ్దదోషములనుండి వేఱుచేయబడి పవిత్రములైన (పూయమానాః) యీ వేదవాక్కులు నదులవలె (సరితో న) నవిచ్ఛిన్నగతితో ప్రవహించి యగ్నిని పొందుచున్నవి బోయవానికి వెఱచి పరుగిడుచున్న లేళ్ళవలె నీ ఘృతధారలును, ఘృతధారల వంటి వాగ్ధారలును 'గమించుచు అగ్నిని తృప్తి నొందించుచున్నవి. ఇట్లు వాగ్ధారలును, ఘృతధారలును, అనగా 'శ్రుతి, ద్రవ్యము'- ఈ రెండును అగ్నికొఱకే ప్రవృత్తము లగుచున్నవి-అని యర్థము.

(చూ. ఉవట, మహీ. భా.)

వాచాం మధ్యే యో హిరణ్యయో హిరణ్మయో దీవ్యమానో వేతసోఽగ్నిః తం చాభిచాకశీమి । అగ్నిర్హి వాచా మధిష్ఠాత్రీ దేవతా । యద్వా ఘృతధారా ఏవోచ్యన్తే । యా ఏతా హృద్యాత్ సముద్రాత్ ఘృతధారా అర్షంతి .... .... యో వేతసోఽగింత రాహవనీయః ఆసాం ధారాణాం మధ్యే స్థితః తం చ పశ్యామి । ద్రవ్యదేవతాత్వాచ్చ యాథాత్మ్యే నాహం పశ్యామీ త్యర్థః ।

(చూ. ఉవట. భా.)

ఈపై రెండు ఋక్కులును వేదవాక్కుల స్వభావమును, వానికిగల ఋషిత్వమునువ్యక్తము చేయుచున్నవి. మొదటి మంత్రమున "ఏతా అర్షన్తి"-అని ఋషిశబ్ద నిర్వచనము (అర్షన్తి, ఋషీ గతౌ, వ్యత్యయేన శప్) జూపబడినది. పరమేశ్వరుని దర్శింపజేయుటచే (వేదయతీతి) మంత్రరాశికి వేదము అని సార్థక నామధేయమైనట్లు, శ్రద్ధాపరిప్లుతమైన బుద్ధిచే షడంగాది సుసంస్కృతమైన మనస్సుద్వారా దోషరహితములు గావింపబడి యుద్గమించి పరమేశ్వరుని దర్శింపచేసెడి లేక పరమేశ్వరుని బొందెడి ఈ వేదవాక్కులకును ఋషి యను నామము సార్థకము. అనగా పరమేశ్వరుని తెలియజేయనిచో వేదమునకు 'వేద' మను నామము సార్థకము కాజాలని రీతిగా, పైన చెప్పిన యట్లు ఉద్గమించి పరమేశ్వరుని దర్శింపజేసి తదభిముఖములు గానిచో వీనికి ఋషి యను నామము సార్థకము కాదనియు నిట సూచిత మగుచున్నది. కాన, వేదశబ్దము వలెనే, ఋషిశబ్దము గూడ ఋగాదిశబ్దరాశికిని పరమేశ్వరునకును గల ప్రతిపాద్య ప్రతిపాదక భావరూప సంబంధమును దృఢపఱచుచున్నది.

ఇంతే కాదు. 'ఏతే అర్షన్త్యూర్మయో ఘృతస్య'- అనుచు నీ రెండవ మంత్రము ఘృతధారలకు గల ఆర్షధర్మము గూడ నుపలక్షింప జేయుచున్నది. వేదమూలములై, తదనుసారులైన ధర్మార్థకామములయందు వేదత్వము ఉపలక్షితమగునట్లు, ఋషిరూప వేదవాక్ప్రవర్తితములై అగ్నిని తృప్తినొందించెడి ఘృతధారలయందు- అనగా హవిస్సులయందును ఋషిత్వ ముపలక్షిత మగునని చెప్పనగును. ఇట్లు వాక్కులును, హవిస్సులును ఋషిత్వోపలక్షకము లగుటచే వానిచే సుసంస్కృతాంతఃకరణుడై వేదమంత్రముల నుచ్చరించుచు, హవిర్దానాదులచే నగ్నిని తృప్తి నొందించెడి యజమానుడును ఋషి యగుట సూచితము.

ఈ మంత్రములు కేవలము వాగ్ధారలను, ఘృతధారలను వర్ణించుటకు ప్రవృత్తములయినవి కావు. ఇవి వేదవాక్కుల స్వభావమెట్టిదో, అవి యెప్పుడెట్లు ఋషులై వెలయునో, తెల్పుటకు ప్రవృత్తము లయినవి. మఱియు యజమానులు శ్రద్ధావంతులై సుసంస్కృతాంతఃకరణులై, అంతర్ముఖులై వాని నుచ్చరించుచు క్రియావంతులై, శ్రోత్రియులై, దేవతల దృష్టి నొందించుచు, క్రమముగ బ్రహ్మనిష్ఠులై ఏకర్షి యగు బ్రహ్మను పొందవలెనని ప్రబోధించుచున్నవి. ఈ విషయమునే ఉపనిషత్తులు నిట్లు ప్రబోధించుచున్నవి.

"క్రియావంతః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠా స్వయం
జుహ్వత ఏకఋషిం శ్రద్ధయ ః న్త ।"

—ము. ఉ. 2-10.

మఱియు పై మొదటి ఋక్కు "రిపుణా నావచక్షే" అనగా శత్రువునకు లొంగవనుచు, వేదవాక్కు 'అజేయము' అని చెప్పినది. కాని యీ శత్రువెవరు ? వేదవాక్కులకు పైన జెప్పబడిన ఆర్షభావమును గమనింపక విమర్శించువారే శత్రువులు. అందుచే 'కుతార్కికబృందమనెడి శత్రువునకు లొంగనిది' యని భాష్యకర్తలు వివరించిరి. ఈ శ్రుత్యర్థమునే మహాకవి భారవియు కిరాతార్జునీయమున నిట్లనువదించినాడు.

"ప్రసాదరమ్య మోజస్వి గరీయో లాఘవాన్వితమ్ ।
సాకాంక్ష మనుపస్కారం విష్వగ్గతి నిరాకులమ్ ॥
న్యాయ నిర్ణీతసారత్వా న్నిరపేక్ష మివాగమే ।
అప్రకంప్యతయాఽన్యేషా మామ్నాయవచనోపమమ్ ॥"

—11. 38, 39.

ఈ శ్లోకములయందు అర్జునుడు ఇంద్రుని వాక్యములను ఆమ్నాయ వచనములతో బోల్చుచు తద్వ్యాజమున శ్రుతివాక్య స్వభావమును వివరించుట గాననగును. శ్రుతివాక్యము ప్రసాదాది గుణములతో నొప్పుటయే గాక 'విష్వగ్గతి' యని చెప్పబడినది. ఇది (విష్వగ్గతి) పై మంత్రమునందలి 'శతవ్రజాః' అను పదము యొక్క అర్థము ననువదించు చున్నది. బహ్వర్థములు గలిగి అర్థగాంభీర్యముతో నొప్పునది యని యర్థము. మఱియు హృద్యాత్ సముద్రాత్ అర్షంతి; అంతర్ హృదా మనసా పూయమానాః; సక్తు మివ తితఉనా పునంతో యత్ర ధీరా మనసా వాచ మక్రత' ఇత్యాది శ్రుతిప్రతిపాదితార్థమే యీ శ్లోకములందు 'న్యాయనిర్ణీత సారత్వాత్ నిరపేక్ష మివాగమే' యను వాక్యముచే ననువదింపబడినది. శిక్షాది షడంగములచేతను న్యాయములచేతను నిర్ణీతార్థము గలిగి న్యాయబద్ధమై అన్యనిరపేక్షమై స్వతః ప్రామాణ్యము గలది యనియర్థము ఇట్లు నిశ్చితార్థములతో విలసిల్లున దగుటచే కుతార్కికవాద మనెడి శత్రువునకు లొంగనిది యనిచెప్పెడి శ్రుత్యర్థమే ఇచట'అప్రకంప్యతయాఽన్యేషాం ఆమ్నాయవచనోపమమ్'

అను వాక్యముచే ననువదింపఁబడినది. ప్రతివాదులు జూపెడి ప్రత్యక్షము, అనుమానము మున్నగు నితర ప్రమాణములచే పరాహతము గాక అజేయమై స్థిరముగ నిల్చినది - అని భావము.

వేదవాక్కులు అప్రకంప్యములు అను శ్రుతిసిద్ధార్థమును శ్రీమద్రామాయణము నిట్లనువదించుచున్నది.

"న శక్త స్త్వం బలా ద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః ।
హేతుభి ర్న్యాయసంయు క్తైర్ధ్రువాం వేదశ్రుతీ మివ ॥"

- రామా. 3 - 51 - 21.

కామోపహతుడై రావణుడు పతివ్రత యగు సీతను బలాత్కరించి గొని పోవుచుండ నా రావణుని వారించుచు జటాయువు పలికిన వాక్య మిది. ఇచట సీతాదేవి వేద శ్రుతితో బోల్చబడి, యా వ్యాజమున శ్రుతియొక్క నిశ్చలత్వము లేక అప్రకంప్యత్వము వివరింపబడినది. "న్యాయనిర్ణీతసారము గలిగి యవిచాల్యమైన వేదవాక్కును కుతార్కిక హేతువాదములు కదలింప జాలని యట్లు, నేను జూచుచుండగా, కామోపహతుడవైన రావణా! నీవు పతివ్రత యగు సీతాదేవిని నీ బలప్రయోగముతో నపహరింపజాలవు" అని యర్థము.

పతివ్రత యగు సీత నిరంతర శ్రీరామచంద్రపరాయణయై అనన్య చిత్త యయినట్లు వేదశ్రుతియు న్యాయ నిర్ణీతసారము గలిగి నిరంతర ధర్మ బ్రహ్మపరాయణమై, అప్రకంప్యమై, యనన్యార్థ ప్రతిపాదకము - అని తాత్పర్యము.

పైన తెల్పబడిన 1. శతపథములై యర్థగాంభీర్యముతో నొప్పియుండుట 2. శిక్షాద్యంగములచే సుసంస్కృతములై న్యాయ నిర్ణీతసారము గల్గి యొప్పుట 3. కుతార్కిక హేతువాదములకు లొంగక, యజేయములై విలసిల్లుట 4. ఈ ధర్మములచే నొప్పుచు యజమానుల నంతర్ముఖుల గావించి నిరంతరము ఏకర్షి పరమేశ్వరతత్త్వమును దర్శింపజేయుటయే (దర్శనాత్) వేదముయొక్క ఋషిత్వమని తెలియనగును.

17)

ఇట్టి యీ వేదవాక్కులు తత్త్వప్రకాశకము లగుటచే పవిత్రములైన ఋషులు — అని శ్రుతి యింకొకచోట యిట్లు వర్ణించుచున్నది.

"సికతా ఇవ సంయన్తి । రశ్మిభిః సముదీరితాః ।
అస్మాల్లోకా దముష్మాచ్చ ఋషిభి రదాత్ పృశ్నిభిః ॥"

తై. ఆ. 1 - 27 - 5

వాయువుచే ప్రేరితములై సైకతరేణువు లొకచోటునుండి మఱియొకచోటునకు బోవుచు నొకదానితో నొకటి గలిసి ప్రోవుపడి విడివడుచుండును. అట్లే కర్మప్రేరితులై సంసారమున గలియుచు, విడివడుచు నా యా లోకముల జరించుచు నుండెడి జీవుల ననుగ్రహించుటకొఱకై పరమేశ్వరుడు తత్త్వప్రకాశకములగు ఋషులచే (వేదములచే) జ్ఞాన మొసగును. — అని యర్థము.

తేషాం సర్వేషాం అనుగ్రహాయ పరమేశ్వరః పృశ్నిభిః శుక్లైః
తత్త్వప్రకాశకైః ఋషిభిః మన్త్రైః అదాత్ జ్ఞానం ప్రయచ్ఛతి - సా. భా.

ఇట "ఋషులు, అనగా వేదమంత్రములు స్వచ్ఛములు" అని చెప్పబడినవి. ఇట్లు చెప్పుటచే పురుషబుద్ధిగత దోషరహితములని సూచిత మగుచున్నది. అట్టి మంత్రములు తత్త్వప్రకాశకములగు ఋషులు - అని భాష్యమున వివరింపబడినది.

భాగవతమునందలి శ్రుతిగీతలలో శ్రుతులే తమ్ము ఋషులుగ నిర్దేశించుకొని 'అత ఋషయో దధు స్త్వయి మనః — మా లక్ష్యము నీవే' యని పరమేశ్వరుని నుతించినవి.

## ఋషిః - నారాయణః - వేదః :-

"న స వేద పరం బ్రహ్మ యో న వేద చతుష్టయమ్ ।
వ్యక్తావ్యక్తంచ య త్తత్త్వం సంప్రోక్తం పరమర్షిణా॥

వ్య క్తం మృత్యుముఖం విద్యా దవ్య క్త మమృతం పదమ్ ।
ప్రవృ త్తిలక్షణం ధర్మ మృషిర్నారాయణోఽ బ్రవీత్॥"

—భార. శాన్తి 217 - 1, 2

'పరమర్షిణా నారాయణేన ।.... .... ఋషి ర్వేదః, స ఏవ
నారాయణవాక్యత్వా న్నారాయణః" —నీలంకఠః

ఇట మొదటి శ్లోకమున నారాయణుడు 'పరమర్షి' యని కీర్తింపబడినాడు. రెండవ శ్లోకమున ఋషి యగు వేదము నారాయణ వాక్య మగుటచే నారాయణః అని చెప్ప బడినది.

## మంత్రద్రష్టలు - ఋషిత్వము :-

ఇంతవఱకు మొదట పరమేశ్వరునియొక్క పరమర్షిత్వమును, తన్నిః సృతమై, తత్ప్రదిపాదకమైన ఋగాదిశబ్దరాశికిని గల ఋషిత్వమును తద్ద్వారా వేద మాక్కుల స్వభావమును దర్శించితిమి, ఇంతి మేకాదు. తత్త్వప్రకాశకములగు నా మంత్రములను దర్శించువారును, వేద చోదితమైన పరమార్థమును (ధర్మ - బ్రహ్మ స్వరూపమును) దర్శించువారును 'ఋషులు' అని వేదమున వ్యవహరింపబడిరి. శ్రుతియే స్వయముగ ఋషి పదమును నిర్వచించుచు నీ విషయమును నిట్లు వివరించినది

"అజాన్ హ వై పృశ్నీగ్ం స్తపస్యమానాన్ బ్రహ్మ
స్వయంభ్వభ్యానర్షత్ । త ఋషయోఽభవన్ । తదృషీణాం
ఋషిత్వమ్ । ఇత్యేవం బ్రాహ్మణేఽపి విచార్యమాణే జ్ఞాయతే ॥"

—దుర్గాచార్య భాష్యమ్.

తపశ్చర్యావరతత్రులయిన మధుచ్ఛందాది మునులకు స్వయంజాతమగు (అకృతకమగు) ఋగ్యజుః సామాత్మక మగు వేదము (బ్రహ్మ), వరఘ్యయనము చేయకయే భాసించెను (అభ్యానర్షత్). అనగా తపోవిశేషముచే దర్శించిరి. అందుచే వారు ఋషులైరి. అదియే ఋషులయొక్క ఋషిత్వము — అని బ్రాహ్మణము వలన గూడ దెలియుచున్నది. అని యర్థము.

మంత్రద్రష్టలగు నీ ఋషులు కర్మబద్ధులై మరల మరల జన్మించువారు కారు. కల్పాదియందు మాత్రమే బ్రహ్మచే సృజించబడువారు. కాన 'అజాః' అని యిట శ్రుతియందు జెప్పబడిరి. వారు సహజముగనే పరిశుద్ధాంతఃకరణులు కాన 'పృశ్నీన్' అని చెప్పబడిరి. అట్లు పరిశుద్ధస్వరూపులయ్యు తప మాచరించిరి. ఆ తపస్సమాధిలో స్వాయంభువమగు బ్రహ్మ (వేదము) వారికి అభివ్యక్తమైనది.

ఇచట 'స్వయంభు - బ్రహ్మ' పదములచే జగత్కారణుడగు పరమేశ్వరుడు చెప్పబడినట్లును గ్రహింపనగును. పరమేశ్వర సాక్షాత్కారమును బొంది యా ఋషులు బ్రహ్మయజ్ఞమును దర్శించినట్లు (త ఏతం బ్రహ్మ యజ్ఞ మపశ్యన్) తరువాతి శ్రుతివాక్యముల వలన తెలియును (చూ. సా. భా). బ్రహ్మయజ్ఞ మనగా స్వాధ్యాయము (స్వాధ్యాయపదమును జూచునది). ఇట్లు వేదములను యజ్ఞములను లోకమున బ్రవర్తింప జేయుటకై కల్పాదియందు ఈశ్వరానుగ్రహముచే నవతరించిన అజులగు ఆధికారిక పురుషులే మంత్రద్రష్టలగు ఋషులని శ్రుతితాత్పర్యము.

'పృశ్ని యన వేదము; పరమేశ్వరుడు పృశ్నిగర్భుడు; దోషరహితములగుటచే మంత్రములును పృశ్నులగు ఋషులు' - అని పూర్వము వివరింపబడినది అట్టి మంత్రములను దర్శించెడి మంత్రద్రష్టలును పృశ్నులగు ఋషులుగ నీ మంత్రమున చెప్పబడుట గమనార్హము.

ఇట్లు 'పృశ్ని' పద పరిశీలనము జేయుచో'పరమేశ్వరుని వలెనే వేదమును పరిశుద్ధము; పురుషబుద్ధిదోషరహితము: అట్లే మంత్రద్రష్టలును పరిశుద్ధాన్తఃకరణులై ఈశ్వరప్రేరితులై, తదనుగ్రహపాత్రులై తపస్సమాధిలో నీ మంత్రజాతమును దర్శించిరి; ఇది వారి స్వకపోలకల్పితము కాదు' అని తెలియనగును.

## తపోజాః _ స్వయంభు _ దైవీవాక్ :

అట్లు తపస్సమాధిలో భాసించునది యగుటచే వేదవాణిని 'తపోజా' అని శ్రుతి కీర్తించుచున్నది.

"తపోజాం వాచ మస్మే నియచ్ఛ దేవాయువమ్ ।" - తై. ఆ. 4-7-3.

"తపోజాం వాచ మస్మై నియచ్ఛ దేవాయువ మిత్యహ ।
యా వై మేధ్యా వాక్ । సా తపోజాః । తామేవావరున్ద్ధే"॥

— తై. ఆ. 5-6-25

'తపోజా మిత్యనేన యజ్ఞయోగ్యా మంత్రరూపా వా గ్వివక్ష్యతే,
తస్యాః తపస్వినా పురుషేణ లభ్యమానత్వాత్' — సా. భా.

(చూ. వా. సం. 37-16; శ. బ్రా. 14-1-4-8)

తపస్సుచే లభించునది యగుటచే తపోజా అనియు, నిరంతరము దేవుని లేక దేవతలను కోరునది లేక లక్షింపజేయునది యగుటచే 'దేవాయువం' అనియు వేదవాణి యిట కీర్తింపబడినది. అనగా దైవీవాక్ అని యర్థము

తపోజా యనుటచే 'అంతకు పూర్వములేక క్రొత్తగా బుట్టినది' అనెడి వాదము తిరస్కృతమగుచున్నది. అనాదిసిద్ధమై యున్న వేదవాణియే తపస్సు వలన నభివ్యక్తమైనదని తెలియును. స్వాయంభువ మగు బ్రహ్మ అనగా వేదము వీరికి తపస్సమాధియందు అభివ్యక్తమైనది. (అభ్యానర్షత్) అని చెప్పుచు పూర్వ మంత్రము గూడ 'నీ వాక్కు అనాదినిధనమైన వాక్కు' అని స్పష్టము జేయుచున్నది. ఈ విషయము ఇంకను చూతము.

## మంత్రకృత్-ఋషికృత్ :

ఇట్లు తపోజా, స్వయంభు - ఇత్యాది పదముల బురస్కరించుకొని యీ దేవీవాక్కు అనాది యని చెప్పుచో వేదమునందచటచట గన్పట్టెడి మంత్రకృత్, ఋషికృత్ - ఇత్యాది పదముల ననుసరించి యీ వాక్కు మంత్రకర్తృ రచితమే యనియు చెప్పనగును గదా! యన నట్లు గాదు. ఈ విషయమును జూతము.

"నమో వాచే యాచోదితా యా చానుదితా తస్యై వాచే నమో
నమో వాచే నమో వాచస్పతయే నమ ఋషిభ్యో మంత్ర
కృద్భ్యో మంత్రపతిభ్యో మా మా మృషయో మంత్రకృతో

మంత్రపతయః । పరాదు ర్మాఽహ మృషీన్ మంత్రకృతో
మంత్రపతీన్ పరాదామ్ । వైశ్వదేవీం వాచ ముద్యాసగ్ం
శివామదస్తాం జుష్టాం దేవేభ్యః ।"

—తై. ఆ. 4-1

ఈ మంత్రమున ఉదితయు అనుదితయు నగు వేదవాక్కునకును, వాచస్పతికిని, మంత్రద్రష్టలు మంత్రపతులు నగు ఋషులకును నమస్కారము చేయబడి, 'అట్టి యా ఋషులకు నేనెన్నడు నవజ్ఞ సేయను. వారును నన్ను అవజ్ఞ చేయకుందురు గాక'- యని వారి యనుగ్రహ మర్థింపబడు చున్నది మఱియు(!) సర్వదేవతా ప్రతిపాదికయు (వైశ్వదేవీ), సర్వమంగళయు (శివా), అనుపక్షీణయు అనగా అనాదినిధనయు (అదస్తా), దేవప్రియయు నగునట్టి వాక్కు నుచ్చరించు చున్నాను' - అని యజమానునిచే చెప్పబడుచున్నది.

ఇట వేదవాక్కు తనను వైశ్వదేవీ, శివా, అదస్తా, దేవజుష్టా యని కీర్తించుకొనుట గమనార్హము. ఈ మంత్రమున ఒకయెడ 'మంత్రకృద్భ్యః, మంత్ర పతిభ్యః'— అను పదములను, ఇంకొకయెడ అదస్తా (అనుపక్షీణావాక్), శివా, వైశ్వదేవీ, దేవజుష్టా యను పదములను గన్నట్టుచున్నవి. ఇచట మంత్రకృత్ పదమునకు మంత్రకర్త యని యర్థము జెప్పుచో అదస్తా ఇత్యాది పదముల యర్థ ములు సంగతములు కావు మంత్రము మంత్రకర్తృరచితమై క్రొత్తగా బుట్టిన దగుచో నా మంత్రము అనుపక్షీణము (పూర్వము లేక అనాది) అని యనుట యెట్లు ? కాన, మంత్రరూపమగు వాక్కు అనాది; అది తపస్సమాధిలో దర్శింప బడి యభివ్యక్తము చేయబడినది; అట్లభివ్యక్తము చేయువారే మంత్రకృత్తులు మంత్రపతులు నగు ఋషులుగ నీ మంత్రమున గీర్తింపబడిరి. అట్లు గ్రహించి నపుడే మంత్రము సరసముగ సమన్వయ మయి, యాపాతముగ కలిగెడి పైశంక లకు తావుండదు. ఈ విషయ మీ క్రింది మంత్రము వలనను స్పష్టమగుచున్నది.

"యా మృషయో మంత్రకృతో మనీషిణః । అన్వైచ్ఛన్
దేవా స్తపసా శ్రమేణ । తాం దేవీం వాచగ్ం హవిషా
యజామహే । సా నో దధాతు సుకృతస్య లోకే ॥"

—తై. బ్రా. 2,8-8

'ధారణశ క్తి యు క్తులును, మంత్రద్రష్టలు నగు ఋషులును, దేవతలును బహుప్రయాససాధ్యమగు తపస్సు ద్వారా ఏ వాక్కును అన్వేషించిరో యట్టి దైవీవాక్కును హవిస్సుచే నారాధించుచున్నాను. అట్టి యా వాక్కు నన్ను సుకృత లోకము నొందించుగాక'—అని యర్థము.

ఇచట ఋషులును, దేవతలును ఎన్నో ప్రయాసల కోర్చి తపస్సు ద్వారా ఈ దైవీవాక్కును అన్వేషించినట్లు గలదు అట్లన్వేషించి దర్శించి యా మంత్రములను లోకమున ప్రవర్తింపజేయుటచే వీరు 'మంత్రకృతః' అని చెప్పబడిరి అందుచే నీ వేదవాణి 'అనాదినిధన' యని యనుటయే శ్రుతి తాత్పర్యము. అట్లు గానిచో, ఆర్యులనెడి వివిధ జాతులవారి రచన లనబడు ఈ మంత్రముల నన్వేషించు టకై దేవతలు దీర్ఘతపస్సమాధినిష్ఠులై శ్రమించుట యేమి? ఇట్లు చెప్పుట యసంగతమే యగును గదా? కాన 'మంత్రకృత్' అనగా మంత్రద్రష్ట యనియే జెప్పవలసి యున్నది ఇంతే కాదు.

"హస్తే దధానో నృమ్ణా విశ్వా న్యమే దేవాన్ ధాత్
గుహా నిషీదన్ । విదన్తీ మత్ర నరో ధియంధా
హృదా యత్ తష్టా మంత్రాగ్ం అశంసన్ ॥"

—ఋ. 1-67. 3; 4.

"అగ్ని హవిస్సులతోగూడ నంతర్హితుడు కాగా, దేవతలు భయపడి, సుసంస్కృతములై హృదయమునుండి యుద్గమించెడి మంత్రములతో నీ యగ్నిని స్తుతించి, గుహాయం దంతర్నిహితుడై యున్న ఆ యగ్నిని తెలిసికొనిరి. అనగా సాక్షాత్కరించుకొనిరి—అని యర్థము."

ఇట 'హృదా తష్టాన్ మంత్రాన్'- అని గలదు. 'హృదయావస్థితయా బుద్ధ్యా నిర్మితాన్ మంత్రాన్'- అని శ్రీ సాయణులు వ్యాఖ్యానించిరి అందుచే 'బుద్ధికుశలతతో రూపొందించిన (అనగా రచించిన) మంత్రములను'- అని యర్థము చెప్పనగును గదా? యన నట్లు గాదు. హవిస్సులతో నంతర్హితుడైన

యగ్నిని సాక్షాత్కరించుకొను టెట్లు ? అని దేవతలకు విచికిత్స గలిగెను. వారు స్వయంప్రతిభాతవేదులు. కాన నిలీనుడైన యా యగ్ని నే మంత్రములతో శంసనము చేయుటయా యని యాలోచించి, హృదయమున నిశ్చయించి, యట్టి మంత్రములతో శంసనము చేసిరి అని యర్థము 'హృదయే సంకల్పితైః మంత్రైః స్తువన్తీత్యర్థః' అని శ్రీ స్కందస్వామియు వ్యాఖ్యానించెను. శ్రీ సాయణుల యభిప్రాయము గూడ నిదియే యని గ్రహింప నగును వేదమంత్రములు పురుష బుద్ధి కల్పితములు కావని గదా సాయణుల హృదయము. వేదములం దెడనెడ నిట్టి ప్రయోగములు గలవు. ఉదా :- 'హృదా తష్టేషు మనసో జవేషు' (ఋ. 10-71-8) 'హృదా బుద్ధిస్థితాం హృదయేన తష్టేషు నిశ్చితేషు పరికల్పితేషు'- అని సాయణుల భాష్యము కాన పై మంత్రమున గూడ హృదయమున వివేచించి నిశ్చితములైన మంత్రములతో దేవతలు శంసనము చేసి రనియే సాయణుల తాత్పర్యముగా గ్రహించుట యుక్తము

కాని యిట్టి ప్రయోగముల నాధారము చేసికొని చారిత్రికులు వేదములు పురుషబుద్ధి కల్పితము లని నిరూపించి చరిత్ర కల్పించుటకై పాటుబడిరి. పోనీ, వారి వాదము నంగీకరింత మన్నను పై మంత్రము ననుసరించి మంత్రములు దేవకర్తృకము లని యనవలసి వచ్చుచున్నది గదా ! అట్లు చెప్పుచో 'మంత్రము లార్యు లనెడివారి రచనలు'- అను వారి యూహ పొసగదు.

మఱియు పూర్వమంత్రమున ఋషులును, దేవతలను తపస్సు చేసి శ్రమించి మంత్రముల నన్వేషించినట్లు గలదు. ఇట, గుహ యందు (ఆకాశము నందు లేక హృదయాకాశమునందు) అంతర్నిహితుడై యున్న యగ్నిని దేవతలు మంత్రములతో సాక్షాత్కరించుకొనినట్లు గలదు. ఇట్లు దేవతలు మంత్రములతో శంసనము జేయుట పెక్కు మంత్రములందు గలదు. మంత్రములు మానవ రచితము లని చెప్పినచో నట్టి మంత్రములతో దేవతలు శంసనము జేసి రనుట సంగత మగునా ?

అగ్ని హవిస్సులతో నదృశ్యుడగుట, దేవతలు మంత్రములతో నగ్నిని స్తుతించి సాక్షాత్కరించుకొనుట- అను నీ యితిహాసము, ఇట్టివే పెక్కులును మహాభారతాది ఇతిహాసములందు తత్త్వార్థోద్దీపకములుగ ప్రపంచింపబడినవి. (చూ. భార- వనపర్వ. అగ్నివంశోపాఖ్యానము) కాన, నీ మంత్రములు అసంబద్ధా

ర్థము లనుట సంప్రదాయాభిమతము కాదు. ఇవి తత్త్వోద్దీపకములనుట సంప్రదాయము. మంత్రములకు సంప్రదాయానుగుణముగ తాత్పర్యము దెలియుట యుక్తము. సంప్రదాయ మెఱిగి, మంత్రకృత్ పదమునకు మంత్రద్రష్ట యని అర్థము జెప్పుటయే తగును. ఇట్లు చెప్పినపుడే వేదవాణికి, తపోజా, స్వయంభు, అదస్తా, వైశ్వదేవీ, దేవజుష్టా- ఇత్యాది విశేషణములు సార్థకములై యుపసన్నము లగును.

తపోజమై, ఋషులయందు నిహితమై యుండిన యీ వేదవాక్కు లోకమున నెట్లు వ్యాప్తమైనదియు నీ క్రింది ఋక్కు వివరించుచున్నది

"యజ్ఞేన వాచః పదవీయ మాయన్ । తా మన్వవిందన్
ఋషిషు ప్రవిష్టామ్ । తా మాభృత్యా వ్యదధుః పురుత్రా ।
తాం సప్త రేభా అభి సం నవన్తే॥" —ఋ. 10-71-3.

యజ్ఞేన వాచః పదవీయ మాయన్ :-

"ధీరులు యజ్ఞము చేతనే వేదవాక్కు యొక్క మార్గమును అనుగమించిరి' అని మంత్రమునందలి మొదటి వాక్యము యొక్క యర్థము.

ఏ వాక్కు యొక్క మార్గము? ఈ వాక్కు స్వకపోల కల్పితమా? లేక ఇతర కల్పితమా? రెండును కాదని మంత్రమునందలి రెండవ వాక్యమిట్లు చెప్పుచున్నది.

తా మన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్ :-

ఋషులయందు ప్రవిష్టమై నిహితమైయున్న యజ్ఞనిష్పాదిక యగు ఆ వాక్కును బొందిరి -- అని యర్థము.

తా మాభృత్యా వ్యదధుః పురుత్రా :-

ఋషుల నుండి యీ వాక్కును గ్రహించి అధ్యాపనము, యజ్ఞము మున్నగువాని ద్వారా పలు విధములుగ వలుచోట్ల వ్యాపింపజేసిరి.
తాం సప్తరేభా అభి నవన్తే :-

అట్టి యీ వాక్కును సప్తచ్ఛందస్సులు అనుగమించుచున్నవి.

—ఋ. సా. భా. ఉద్గీథ. భా.

ఈ మంత్రము పరిశీలించినచో ఋషులచే దర్శింపబడిన ఛందోమయి యగు వేదవాక్కు యాజ్ఞికులచే యజ్ఞాదికర్మలయందు క్రమముగ ప్రవర్తితమై సర్వత్ర వ్యాప్తమైనట్లు దెలియును. శ్రీ శంకరభగవత్పాదులును దేవతాధికరణమున నీ మంత్రమునే యుదహరించి "ఇతి స్థితామేవ వాచమనువిన్నాం దర్శయతి" అని యనుచు నిందుకు వేదవ్యాస వచనమును గూడ నిట్లు జూపిరి

"యుగాంతేఽంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః।

లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతాః స్వయంభువా॥"

పై ప్రమాణముల ననుసరించి పరమేశ్వరానుజాతులై తపఃసమాధిలో వేదమంత్రముల దర్శించినవారును, పరంపరాగతములైన యా మంత్రములతో యజ్ఞాదికర్మల నొనర్చుచు క్రియావంతులై శ్రోత్రియులై క్రమముగ నంతర్ముఖులై పరమార్థమును దర్శించువారును ఋషు లగుదురనియు, నిట్లు పరంపరాప్రాప్తమగుటచే వేదవాక్కు 'అనాదినిధన' యగుట యుక్తమే యనియు దెలియును. కావుననే, వేదము 'వాచా విరూప : నిత్యయా' (ఋ 8-75-6) అని యొక ఋక్కుచే దన స్వరూపమును కీర్తించుకొనినది. ఉత్పత్తిరహిత మగుటచే నిత్యమగు వాక్కు యని యర్థము.

కాన మంత్రకృత్, ఋషికృత్ పదములకు మంత్ర రచయిత యనెడి యర్థము సంగతము కాదు; మంత్రములను దర్శించి ప్రవర్తింపజేసిన యాధికారిక పురుషుడు - అని యర్థము గ్రహించుటయే యుక్తము. ఈ విషయము నింకను జూతము.

# దేవతలు - ఋషిత్వము :–

పూర్వ ముదహరించిన ప్రమాణముల ననుసరించి దేవతలును శ్రమించి తపస్సు చేసి, మంత్రముల దర్శించినట్లు తెలియుచున్నది. మఱియు 'దేవతలు స్వయంప్రతిభాత వేదులు: జగద్యాత్రా నిర్వహణమునకై ప్రతి కల్పము నందును పరమేశ్వరుని చే నియుక్తులై, తమ తమ పదము లందుండి తమ తమ యధికారముల నిర్వర్తించు అధికారిక పురుషులు; అణిమాదిసిద్ధి సంపన్నులు; కాన దేవతా నామములయి గన్పట్టు అగ్ని – ఇంద్రాది శబ్దములును, అట్లే మంత్రకర్తృబోధకములుగ గన్పట్టు వసిష్ఠ విశ్వామిత్రాది నామములును అధికారికపురుష వాచకములే (names denoting offices) కాని, వ్యక్తుల నామములు గావు'— అని సంప్రదాయానుగతమైన ప్రసిద్ధి (చూ. దేవతాధికరణము; శ్రీ శంకరభగవత్పాద- భగవద్రామానుజాది భాష్యములు).

దేవతలు అధికారపురుషులు. స్వయంప్రతిభాతవేదులు - అని యనుటచే జగద్యాత్రానిర్వహణకర్తవ్యమున వీరికి తమ తమ విధుల బోధించెడి యనాదిసిద్ధమైన చట్టము లేక శాస్త్రము వేదమే యగును. కాన, వేదముల దర్శించుటచేతను తదనుగుణముగ నతీంద్రియ సృష్టికార్యనిర్వహణవిధుల దర్శించుటచేతను వీరు ఋషి శబ్దవాచ్యు లగుచున్నారు. శ్రుతి దేవతలును గూడ ఋషులు అని కీర్తించినది.

అగ్నిః ఋషిః

'అగ్నిర్ ఋషిః పవమానః పాంచజన్యః పురోహితః'

—ఋ. 9-66-20; తై. ఆ. 2-5-2.; వా. సం. 26-6 ఇత్యాది.

ఇంద్రః ఋషిః

'ఇంద్రో బ్రహ్మేంద్ర ఋషి రింద్రః పురూ పురుహూతః'

—ఋ. 8-16-7. ఇత్యాది

ఆదిత్యః ఋషిః

'ఋషిర్హా దీర్ఘశ్రుత్తమః'

తై. సం. 1-6-12-2; మై. సం. 4-12-2; తై. ఆ 1-8-8

సోమః ఋషిః

'సోమో మీఢ్వాన్ పవతే గాతువిత్తమ ఋషి ర్విప్రో విచక్షణః'

— ఋ. 9-10-7-7. ఇత్యాది.

ఇట్లు త్రిస్థానదేవతలే కాక సర్వదేవతాత్మకుడు, సమిష్టిలింగశరీరాభిమాని సూత్రాత్మయు నగు హిరణ్యగర్భుడును ఋషి యనియు మహర్షి యనియు శ్రుతుల యందు కీర్తింపబడినాడు.

"యో దేవానాం ప్రథమం పురస్తాత్ విశ్వాధికో రుద్రో
మహర్షిః । హిరణ్య గర్భం పశ్యత జాయమానం"

— తై.ఆ.10-10-3.

"రుద్రః రుత్ వైదికః శబ్దః. తం ద్రవతి ప్రాప్నోతి.
వేదప్రతిపాద్య ఇత్యర్థః ; మహర్షిః ఋషీణాం అతీంద్రియార్థ
ద్రష్టౄణాం మధ్యేమహాన్ యః సర్వజ్ఞః సర్వవిత్ ఇత్యాది
శ్రుతిప్రతిపాద్య ఇత్యర్థః" — సా. భా.

రుద్రుడనగా వేదప్రతిపాద్యుడు; మహర్షి యనగా అతీంద్రియార్థద్రష్టలలో గొప్ప వాడు — అని యర్థము. హిరణ్యగర్భుడు సమిష్టిప్రాణరూపుడు; ప్రాణశబ్దముచే శ్రుతులయందు కీర్తింపబడినాడు.

"ఋషయ స్త్వా ప్రథమజాః దేవేషు" —వా. సం 15-10,

"ప్రాణా వా ఋషయః ప్రథమజాః" — శ, బ్రా, 8-6-1-5.

'అస ద్వా ఇద మగ్ర ఆసీత్ । తదాహుః కిం త దస
దాసీ దితి। ఋషయో వావ తేఽగ్రేఽసదాసీత్ ।

తదాహుః కే తే ఋషయ ఇతి। ప్రాణా వా ఋషయః । తే
య త్పురాఽఽస్మాత్ సర్వస్మా దిద మిచ్ఛన్తః శ్రమేణ

తపసా రిషన్ - తస్మా దృషయః' --శ. బ్రా; 6-1-1-1.

'సృష్టికి బూర్వమున నుండు ఋషులు ప్రాణములు స్వనిష్పాద్యము, స్వాశ్రయము నగు ఈ జగత్తుయొక్క సృష్టిని గూర్చి తపస్సు నాచరించి తెలిసికొనినవి. అందుచే వానికి 'ఋషి' యను యన్వర్థనామము' - అని శ్రుతితాత్పర్యము. ఆధ్యాత్మికముగ వాగాది సప్తేన్ద్రియములకు సప్తప్రాణములని పేరు. వానిని సప్తర్షులని శ్రుతి పేర్కొనినది.

'సప్తఋషయః ప్రతిహితాః శరీరే' — వా. సం. 34- 5.

## వేదములు ఆద్యఋషులు :-

పైన జూపిన శ్రుతివాక్యముల ననుసరించి హిరణ్యగర్భతత్త్వాత్మకములై సృష్టికి బూర్వమున నున్న ప్రాణములు అద్య ఋషులు అని తెలియును. హిరణ్య గర్భుడును (ప్రజాపతి) పూర్వసిద్ధములయి యున్న వేదవాక్యములను సృష్టికి బూర్వము పరమేశ్వరానుగ్రహముచే స్మరించి శ్రుతిప్రకాశితమైన యా సృష్టిని గూర్చి యాలోచన జేసెనని శ్రుతి వర్ణించినది.

"స మనసా వాచం మిథునం సమభవత్" — బృ. ఉ. 1-2-4.

'స మనసా త్రయీ మాలోచితవాన్ ; త్రయీవిహితం
సృష్టిక్రమం మనసాఽన్వాలోచయ దిత్యర్థః —శం. భా.

ఆ ప్రజాపతి మనస్సుతో శ్రుతిప్రకాశితమైన సృష్టిని గూర్చి యాలోచించెనని యర్థము. అట్లాలోచించుటలోని సామంజస్యమును గూర్చియు శ్రీ శంకరభగవత్పాదులిట్లు వివరించిరి.

"అపి చ, చికీర్షిత మర్థ మనుతిష్ఠన్ తస్య వాచకం శబ్దం పూర్వం స్మృత్వా పశ్చాత్ తమర్థ మనుతిష్ఠతీతి సర్వేషాం నః ప్రత్యక్ష మేతత్ । తథా ప్రజాపతే రపి స్రష్టుః సృష్టేః పూర్వం వైదికాః శబ్దాః మనసి ప్రాదుర్బభూవుః । పశ్చా త్తదనుగతా నర్థాన్ ససర్జేతి గమ్యతే । తథాచ శ్రుతిః— "స భూ రితి వ్యాహరన్ స భూమి మసృజత" (తై. బ్రా. 2-2-4-2) ఇత్యేవ మాదికా భూరాదిశబ్దేభ్య ఏవ మనసి ప్రాదుర్భూతేభ్యో భూరాదిలోకాన్ సృష్టాన్ దర్శయతి।"

—బ్ర. సూ- దేవతాధికరణమ్ శం. భా

లోకమున దాము తలపెట్టిన యర్థమును సిద్ధింప జేసికొనుటకు మొదట తద్వాచక శబ్దములను స్మరించి పిదప నా యర్థము ననుష్ఠించుట ప్రత్యక్షసిద్ధమైన విషయము. అట్లే సృష్టికర్తయగు ప్రజాపతియు జగత్తును సృష్టింప గోరి తద్వాచకములగు పూర్వసిద్ధ వేదశబ్దములను మొదట స్మరించి పిదప తదనుగుణముగ సృష్టి గావించె నని తెలియును. శ్రుతిసిద్ధములైన భూః — ఇత్యాది శబ్దములను మనస్సున స్మరించి యా శబ్దముల నుచ్చరించుచు భూరాది లోకముల బ్రజాపతి సృష్టించినట్లు తైత్తిరీయ బ్రాహ్మణ శ్రుతియు జెప్పుచున్నదిఅని యర్థము.

భగవద్రామానుజులు నిట్లే యీ విషయమును వివరించిరి.
అత ఏవ చ నిత్యత్వం॥ యత ఏవేంద్రవసిష్ఠాది శబ్దానాం
దేవర్షివాచినాం తత్తదాకారవాచిత్వం — తత్తచ్ఛబ్దేన తత్త
దర్థ స్మృతి పూర్వికా చ తత్తదర్థసృష్టిః" .... .... ....

"అతః ప్రభవాత్॥ .... .... శ్రుతి స్తావత్ — వేదేన రూపే
వ్యాకరోత్ సతాసతీ ప్రజాపతి రితి - తథా స భూరితి వ్యాహరత్
స భూమి మసృజత .... ఇత్యాది వాచకశబ్దపూర్వకం తత్త
దర్థసంస్థానం స్మరం స్తత్తత్సంస్థాన విశిష్టం తం త మర్థం
సృష్టవా నిత్యర్థః" — (బ్ర. సూ. దేవతాధి కరణమ్. 1-3-28, 1-3-27

ఇచట గమనింపదగిన యంశము గలదు. వేదమంత్రములకు గల ఋషిత్వము వేఱు; ప్రజాపతి మొదలు వసిష్ఠాదులకు గల ఋషిత్వము వేఱు. ఆద్యఋషు లగు వేదములు నిత్యములు; ఉత్పత్తి రహితములు; పూర్వసిద్ధములు, స్వతఃసిద్ధములు నగుటచే వానికి అన్యానుసరణము లేదు. అందుచే అర్థమును ఆ వాక్కు అనుసరించును. (వాచం అర్థో౽నుధావతి) ప్రజాపతియు వసిష్ఠాదులును ఉత్పత్తి గల జీవులు. వారి వాక్కు పూర్వసిద్ధమైయున్న శ్రుతిచోదితార్థమును అనుసరించు చున్నది. (అర్థం వా గనువర్తతే). కాన, పూర్వసిద్ధ శ్రుతిచోదితార్థమును స్మరించి ప్రజాపతి సృష్టిపర్యాలోచనము జేయుట యుక్తమే. ఈ విషయమును మహాకవి భవభూతి చమత్కారముగ నిట్లు వివరించి యున్నాడు.

"లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే ।
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థో౽నుధావతి॥"

(ఉత్తరరామచరితనాటకమ్).

లౌకికులగు సాధువులయొక్క వాక్కు అర్థము ననుసరించుచున్నది. కాని, ఆద్యులగు ఋషులయొక్క వాక్కునే అర్థ మనుసరించుచున్నది- అని యర్థము. అగుచో నిట బేర్కొనబడిన ఆద్యఋషులు ఎవరు ?

ఈ శ్లోకమున మొదట లౌకిక సాధువులు చెప్పబడి, పిదప తద్వ్యతిరేకముగ ఆద్యఋషులు బేర్కొనబడిరి. అందుచే లౌకికభిన్నులగు ఆద్యఋషులు వేదమన్త్రములే యగును. ఇట వాఖ్యాతలును ఇట్లు వివరించిరి.

"ఆద్యానాం వేదప్రసిద్ధానాం; లౌకికానాం ఇత్యతో వ్యతిరేక
నిర్దేశాత్; లోకా దన్యస్య వేదస్యైవ ఋటి త్యవస్థితేః"

లౌకికభిన్నములు వైదికము లగుట శాస్త్రసంప్రదాయము. పతంజలి మహర్షియు మహాభాష్యము నుపక్రమించుచు మొదట—

'అథ శబ్దానుశాసనమ్ । కేషాం శబ్దానాం ? లౌకికానాం వైదికానాం చ' అని లౌకిక శబ్ద భిన్నములు వైదిక శబ్దములు అనెడి యనాది సంప్రదాయమునే వివరించినాడు. కాన పై శ్లోకమున నుదహరింపబడిన లౌకికఋషిభిన్నులగు

ఆద్యఋషులు వేదప్రసిద్ధ ఋషులని చెప్పుట యుక్తమే. ఇట చెప్పబడిన వేద ప్రసిద్ధులగు ఆద్యఋషు లెవరు ? వసిష్ఠాదులను గ్రహించుదమన్న వారు వేద ప్రసిద్ధులు గావచ్చును; కాని లౌకికులు (లోకేభవాః) కూడ. వారు జగద్యాత్రా నిర్వహణమునకై యీశ్వరానుజ్ఞాతులై యవతరించెడి యాధికారిక పురుషులు. శ్లోకమున బేర్కొనబడిన ఆద్యఋషులు లౌకికభిన్నులు గదా ; కనుక వ్యాఖ్యాతలు చెప్పిన వేదప్రసిద్ధఋషులు వేదమాత్ర ప్రసిద్ధములగు వేదమంత్రము లని చెప్పుట యుక్తతరము. అట్లు గ్రహించిననాడే 'స భూరితి వ్యాహరన్ స భూమి మసృజత' ఇత్యాది పూర్వోక్త శ్రుతివాక్యార్థముతో నవిరోధమొ సిద్ధించి సరస సమన్వయము పొసగును.

మఱియు నీ కవి 'లౌకికానాం అర్థం వా గమనవర్తతే' అని మాత్రమే యనక 'సాధూనాం' అను పదమును గూడ జేర్చినాడు. ఇట వ్యాఖ్యాతలు లౌకిక సాధువుల గూర్చి యిట్లు వివరించిరి

'హి యస్మాత్, లోకే ఆప్తత్వేన ప్రసిద్ధాః లౌకికాః, తేషాం
భ్రమప్రమాదరహితానా మిత్యర్థః। సాధూనాం పరోపకార
రతానాం విప్రలిప్సారహితానా మిత్యర్థః । వాక్ ఉక్తిః
అర్థం అభిధేయం, అనువర్తతే తదధీనా భవతి। తే హి
భ్రమ ప్రమాద విప్రలిప్సా ద్యభావా ద్యథావస్థిత
మర్థం వదన్తీతి భావః। భూతార్థవాదిన ఇతి హృదయమ్।"

లౌకికులగు సాధువులు భ్రమప్రమాదాది దోషరహితులైన భూతార్థవాదులని యర్థము. వైదికసంప్రదాయ ప్రవర్తకులగు నాపస్తంబాదులును లౌకిక శబ్దము నీ యర్థము నందే ప్రయోగించుటయు గమనార్హము.

"లౌకికానాం పాకయజ్ఞశబ్దః' — ఆప. గృ. సూ. 1-2-9.
"లోకేభవా లౌకికాః లోకస్మృతిలక్షణా ఇత్యర్థః।
"లోకశబ్దేన శిష్టా ఉచ్యన్తే ।". — హరదత్తః.
"లోకయన్తి వేదై ర్వేదార్థా నితి లోకాః త్రైవిద్య
వృద్ధాః శిష్టాః ద్విజన్మానః" సుదర్శనాచార్యః-.

కాన 'లౌకిక-సాధు' శబ్దములకు వ్యాఖ్యాతలు చెప్పిన యర్థము గ్రహించుట యుక్తమే. అట్టివారు త్రైవిద్యవృద్ధులు, మంత్రద్రష్టలు, స్మృతికర్తలు నగు వసిష్ఠాదులే యగుదురు. వారు పరోపకార రతు లగుచు భూతార్థరూప మగు శ్రుత్యర్థమును స్మరించి తదనుగుణముగ స్మృతుల వెలయింపజేసిరి. అందుచే "సాధువు లయిన వసిష్ఠాది స్మృతికర్తలయొక్క వాక్కు భూతార్థ శ్రుత్యర్థము ననుసరించు చున్నది"-యని చెప్పుట సమంజసముగా నున్నది.

వసిష్ఠాదులే కాదు: శ్రుత్యర్థమును స్మరించి తదనుగుణముగ ధర్మము లను మొట్టమొదట స్మృతిరూపమున వెలయించినవాడు బ్రహ్మ యనియు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముప్వురును శ్రుతి - స్మృతి సమాచారనిర్ణేతలనియు, వేదము నకు గర్త లేదనియు, పితామహుని వలన ధర్మముల గ్రహించి మన్వాదులు స్మృతుల బ్రవర్తింపజేసినా రనియు, మను-పరాశర స్మృతుల వలనను, తద్వ్యాఖ్యానములవలనను దెలియుచున్నది.[1]

'శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛత్' - అని చెప్పుచు మహాకవి కాళిదాసు కూడ నీ విషయమునే ధ్వనింప జేసినాడు.

కాన పై భవభూతి మహాకవి శ్లోకమున బేర్కొనబడిన ఆద్యఋషులు వేదమంత్రములు; లౌకికులగు సాధువులు వసిష్ఠాది స్మృతికర్తలు- అని గ్రహించుట యుక్తము. ఇట 'ఋషి' శబ్దము వేదవాచక మనుట వ్యాఖ్యాత్రభిమతము మాత్రమే గాదు; భవభూతి సమ్మతము గూడ ననియు దెలియ వలసి యున్నది. ఈ విషయ మీ క్రింది శ్లోకము వలన స్పష్టమగును.

'ఋషయో రాక్షసీ మాహు ర్వాచ మున్మత్త దృప్తయోః।
సా యోనిః సర్వవైరాణాం సా హి లోకస్య నిర్‌ృతిః॥"

1. కల్పే కల్పే క్షయోత్పత్త్యా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః ।
శ్రుతి స్మృతి సమాచార నిర్ణేతారశ్చ సర్వదా ॥
న కశ్చిత్ వేదకర్తాచ వేదం శ్రుత్వా చతుర్ముఖః ।
తథైవ ధర్మాన్ స్మరతి మనుః కల్పాంతరేఽంతరే ॥" పరా. స్మృతి.
1-20, 21.

చతుర్ముఖ స్తస్మిం స్తస్మిన్ మహాకల్పే పరమేశ్వరేణ దత్తం వేదం స్మృత్వా తత్ర విప్రకీర్ణాన్ వర్ణాశ్రమాది ధర్మాన్ సంకలయ్య స్మృతిం గ్రంథరూపేణోపనిబధ్నాతి । తథా చ పితామహ వచనాని తత్ర నిబంధనకారై రుదాహ్రియన్తే । చతుర్ముఖస్య స్మృతిశాస్త్ర కర్తృత్వం మనునా ప్యుక్తమ్ ।

ఇదం శాస్త్రం తు కృత్వాఽసౌ మా మేవ స్వయ మాదితః ।
విధివ ద్గ్రాహయామాస మరీచ్యాదీ నహం మునీన్॥ ఇతి.

యథా చతుర్ముఖః తథైవ చ స్వాయంభువో మను స్తస్మిం స్తస్మి న్మన్వాంతరే కల్పే వేదోక్తధర్మాన్ గ్రథ్నాతి" —మాధవీయవ్యాఖ్య

ఋషులు ఉన్మత్తుని యొక్కయు, గరువపోతుయొక్కయు వాక్కు రాక్షసీ వాక్ అని చెప్పిరి. అదియే అన్నివైరములకు మూలము. అదియే లోకమునకు పరిభవ హేతువు'- అని యర్థము. ఇట కవి యుద్దేశించిన ఋషు లెవరు - వేదములే యగును. వేదము లిట్లు చెప్పుచున్నవి.

"యోఽయం రాక్షసీం వాచం వదతి సః ఇతి యాం వై
దృప్తో వదతి యా మున్మత్తః సా వై రాక్షసీ వాక్, ఇతి
నాఽఽత్మనా దృప్యతి నాఽస్య ప్రజాయాం దృప్త
ఆజాయతే య ఏవం వేద ఇతి।" —ఐ. బ్రా. 21-7

"పరహింసాకరము, ఉద్వేజకరము, ఉచ్చైఃస్వరముతో భీతికరమునగు వాక్కు నెవడు ఉచ్చరించునో అతడు రాక్షసవాక్కు నుచ్చరించిన వాడగు

చున్నాడు. గరువపోతుగాని, ఉన్మత్తుడుగాని యుచ్చరించు వాక్కు రాక్షసవాక్కు అగును. వాక్స్వరూపము నిట్లు తెలిసికొని యెవడు గర్వింపడో యతని సంతతి యందెవడును గరువపోతు పుట్టడు" - అని శ్రుత్యర్థము.

ఈ ఐతరేయశ్రుతి వాక్యములను గమనించుచో పై భవభూతి మహాకవి శ్లోకము ఈ శ్రుతివాక్యములకు ప్రతిబింబరూపమే యగుట స్పష్టము. భూతార్థమగు నీ శ్రుత్యర్థమును స్మరించి యా యర్థమును యథాతథముగ శ్లోక రూపమున నీ కవి యనువదించినాడు. వ్యాసవాల్మీకాది మహాకవులు పోయిన వాగ్ద్వారముననే పోయి, భూతార్థముల నిట్లు దర్శించి ప్రదర్శించినాడు. కాన నిట రాక్షస వాక్స్వరూపము నుపదేశించిన ఋషులు శ్రుతులే యగుట భవభూత్య భిమతము.

అందుచే మొదటి శ్లోకమున నిర్దేశింపబడిన లౌకికభిన్నులగు ఆద్య ఋషులు వేదమంత్రములు - అని చెప్పుటయందే కవిసంరంభ విశ్రాన్తి. వేదములయొక్క ఋషిత్వమును మాత్రమేకాక, ఆద్యత్వమును (అనాదిత్వమును) గూడ వెల్లడించుటకై యీ శ్లోకము ప్రవృత్తమైనది.

## ప్రథమజా:

ఇట్లు అనాది యగుటచే ప్రథమజ యనియు వేదవాణికి సార్థకనామము.

"పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ ।
ఉపస్థాయ ప్రథమజా మృతస్యా త్మనాత్మాన
మభి సంవివేశ ॥" వా. సం. 32.11

'ఇదానీం సర్వభూతే ష్వహ మస్మి, సర్వాణీ మయి
భూతానీతి జ్ఞానవతః సర్వమేధయాజినః ముక్తి రుచ్యతే ....
బ్రహ్మజ్ఞానవతః యజమాన స్యాగ్నిహోత్రాదయోఽపి

యజ్ఞాః సర్వమేధా ఏవే తా హ పరీత్య భూతానీతి
కండికాభ్యామ్ । ఏవం జ్ఞానవాన్ సర్వమేధయాజీ ఆత్మనా
జీవరూపేణ ఋతస్య యజ్ఞస్యాత్మానం యజ్ఞాధిష్ఠితారం
పరమాత్మాన మభిసంవివేశ ప్రవిశతి । బ్రహ్మైవ భవతీ
త్యర్థః । కిం కృత్వా । భూతాని పరీత్య సర్వభూతాని బ్రహ్మ
త్వేన విజ్ఞాయ, లోకాన్ భూరాదీన్ పరీత్య బ్రహ్మరూపాన్
జ్ఞాత్వా, సర్వాః ప్రదిశః విదిశః దిశశ్చ పరీత్య తద్రూపా
జ్ఞాత్వా, ప్రథమజాం ప్రథమోత్పన్నాం త్రయీరూపాం
వాచ ముపస్థాయ సంసేవ్య.యజ్ఞాదికృత్యేత్యర్థః ।' "అపి హి
తస్మాత్ పురుషాత్ బ్రహ్మైవ పూర్వమసృజ్యత" ఇతి
శ్రుతేః ప్రథమజా వాక్ వేదరూపా. — మహీ-భా.
(చూ. ఉవట. భా).

ఈ మంత్రమున త్రయీరూపమగు వేదవాక్కు ప్రథమజా యని కీర్తింపబడినది. సర్వమేధయాజియగు యజమానుడు త్రయీరూపమగు నీ వాక్కును సంసేవించి యజ్ఞాధిష్ఠాతయగు పరమాత్మతో నేకీభావము జెంది బ్రహ్మభావాపన్ను డగుచు సర్వము బ్రహ్మరూపమున దర్శించుట యిందు బ్రతిపాదింపబడినది. ఇట 'ఉపస్థాయ ప్రథమజాం' అని యనుటచే ప్రథమజ యగు నీ వాక్కును సేవించుటవలననే బ్రహ్మవిద్య సిద్ధించునని చెప్పబడినది. అనగా ఈ వేదవాక్కును సేవింపనియెడల బ్రహ్మవిద్య సిద్ధింపదని తాత్పర్యము.

ఈ వాక్కు ప్రథమజ యగుట ఋగ్వేదమునందును దర్శింపనగును.

"స పూర్వయా నివిదా కవ్యతాయోః" — ఋ. 1-96-2.

'అగ్నిః పూర్వయా ప్రథమయా, నివిదా కవ్యతా గుణినిష్ఠ
గుణాభిధానరూప లక్షణాం స్తుతిం కుర్వతా స్తూయమానః'

— సా. భా.

కనుక 'ప్రథమజా, పూర్వజా' అను పదములు ఈ వేదవాక్కుయొక్క అనాదిత్వమును చాటుచున్నవి. అందుచేతనే వాల్మీకి మహర్షియు నీ వాక్కును 'అగ్ర్యా వాక్' అని కీర్తించినాడు అనగా అగ్రజయగు వాక్కు.

"స బద్ధో వాగ్భి రగ్ర్యాభి రభితుష్టావ వై సురౌ।
ఇంద్ర మింద్రానుజం చైవ యథావ న్మునిపుత్రకః॥'

— రామా. 1-62-25

యూపబద్ధుడైన శునశ్శేపుడు వేదమంత్రములతో దేవతల స్తుతించెనని యర్థము.

వేదవాక్కునకువలెనే హిరణ్యగర్భునకుగూడ ప్రథమజాః అని పేరు. హిరణ్యగర్భుడు 'ప్రథమశరీరి' యని శాస్త్ర సంప్రదాయము. పరమేశ్వర నియోగముచే సృష్టి కార్య నిర్వహణాధునరకై సృష్టికి బూర్వము శరీరధారణము జేసిన ప్రథమజీవియగు ఈశ్వరుడు హిరణ్యగర్భుడు. ఇట్లు ప్రథమోత్పన్ను డగుటచే ప్రథమజాః అని శ్రుతులయందు కీర్తింపబడినాడు.

"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్।
— ఋ 10-121-1: తై. సం. 4-1-8-3: వాసం. 13-4.

'బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా భువనస్య గోప్తా।'

— ముం. ఉ. 1-1

'స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే। ఆదికర్తా స
భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత'

— శం. భా. బ్ర. సూ. 1-2-23.

ఇట్లు వేదవాక్కునకు, హిరణ్యగర్భునకు నిరువురకును ప్రథమజా అను పేరు వేదమున గన్పట్టుటచే నిందు ప్రాథమ్య మెవరికి ? - అను ప్రశ్న మదయింపవచ్చును. 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై' - ఇత్యాది ప్రమాణముల ననుసరించి హిరణ్యగర్భుడు తనకంటె పూర్వసిద్ధమగు నీ వేదవాక్కును ఈశ్వరానుగ్రహముచే బడసి, శ్రుత్యర్థమును స్మరించుచు సృష్టి విషయక పర్యాలోచన జేయునట్లు పూర్వము వివరింపబడినది. కనుక హిరణ్యగర్భునికంటెను నీ వేదవాక్కునకు ప్రాథమ్య ముండుటచే ప్రథమజయయినది. మఱియు నిది ప్రజాపతియొక్క సృష్టికి ఆలంబనమగుచు ప్రప్రథమమున ఆయన ముఖమునుండి 'స భూ రితి వ్యాహరన్' - ఇత్యాది పూర్వోక్త శ్రుత్యుక్తప్రకారము ఆవిర్భవించి యుండుటచేతను ప్రథమజయై యొప్పినది. ప్రథమజ యన 'అనాది సిద్ధమైన వాక్కే తొలుత ఈశ్వర-హిరణ్యగర్భ ముఖములనుండి వినిఃసృతమై యావిర్భవించినది' - అని యర్థము.

## ఆర్షేయం ధనమ్:

ఆద్యఋషులగుటచే వేదములకు ప్రథమజా యను నామము సార్థక మయినట్లు తెలిసికొంటిమి. కాన ఋషి పదము వేదమునందును రూఢము. అందుచేతనే లౌకిక భిన్నములగు వేద శబ్ద ప్రయోగములకు ఆర్ష ప్రయోగము లను ప్రసిద్ధియు వచ్చినది. పిదప తదనుగతములై వర్తిల్లిన పురాణేతిహాసాదుల యందలి ప్రయోగములకు గూడ ఆర్ష ప్రయోగమను వ్యవహారము గల్గినది. మఱియు ఋషియగు వేదముచే ప్రవర్తితమై పరంపరాగతమైన భారతీయ సంస్కృతియు ఆర్ష సంస్కృతియని ప్రసిద్ధమైనది.

"ఆర్షం ధర్మోపదేశం చ వేద శాస్త్రావిరోధినా ।
య స్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః ॥"

— మను 12-106.

ఋషిదృష్టత్వాత్ ఆర్షం వేదం, ధర్మోపదేశం చ తన్మూల
స్మృత్యాదికం, య స్తదవిరుద్ధేన మీమాంసాదిన్యాయేన విచారయతి
స ధర్మం జానాతి, న తు మీమాంసాఽనభిజ్ఞః

— కుల్లూక వ్యాఖ్య

ఋషిదృష్ట మగుటచే వేదము ఆర్షము. ఆర్షమగు వేదమును, తన్మూల మగు స్మృత్యాదికమును, వేదశాస్త్ర విరుద్ధమగు మీమాంసాది న్యాయముచే బరిశీలనము సేయువాడే ధర్మజ్ఞుడు. మీమాంసాదులతో బరిచయము లేనివాడు ధర్మజ్ఞుడు కాడు - అని యర్థము.

వేదము ఋషి యగుటయే గాక, ఋషి దృష్టమగుటచే 'ఆర్షము' అనియు ప్రసిద్ధమగుట పై స్మృతివలన దెలియుచున్నది. ఋషిదృష్టమై పరంపరా ప్రాప్తమైన యీ వేదమంత్రజాతము 'ఆర్షేయ ధనము' అని ఋగ్వేదశ్రుతియు స్వయముగ నిట్లు వివరించుచున్నది.

"అభి నో అర్ష దివ్యా వసూ న్యభి విశ్వా పార్థివా
పూయమానః । అభి యేన ద్రవిణమశ్నవా
మాఽర్ష్యార్షేయం జమదగ్నివ న్నః ॥"

— ఋ. 9-97-51; సామ 2-778

ఈ మంత్రమున మొదట 'దివ్యములు — పార్థివములు' నగు సంపదల గురియుమని (నః అభ్యర్ష) సోముడు అర్థింపబడినాడు. ఈ సంపదలు రెండును

యజ్ఞాధీనములని తాత్పర్యము. పిదప నట్టి యజ్ఞమును ప్రవర్తింప జేసెడి ఆర్షేయ ధనమగు (ఆర్షేయం ద్రవిణం) మంత్రజాతమును వీర్యవత్తరము గావింపుమని సోము దర్థింపబడినాడు.

అనగా — ఈశ్వరానుగ్రహముచే ఆర్షేయధనమగు మంత్రరాశిని వీర్య వత్తరము గావించుకొనుచు యజ్ఞాదికర్మల ప్రవర్తింపజేసి తత్ప్రభావితములయిన దివ్య — పార్థివ సంపదలు రెంటితో దుఃదూగుచు సుఖింపుడని శ్రుతి యుపదేశముగా గ్రహింపనగును.

## 'ఋషిర్దర్శనాత్' - ఈ దర్శన మెట్టిది?

పై గ్రంథ సందర్భమును బరిశీలించుచో - ఋషి శబ్దము మొదట సర్వద్రష్టయగు పరమేశ్వరుని, పిదప ద్రష్టలగుచేతనే హిరణ్యగర్భాది దేవతలను, మంత్రద్రష్టలగు వసిష్ఠాదులను బోధించునని చెప్పి, అతీంద్రియ దేవర్షి స్వరూప మును, ధర్మ మోక్ష స్వరూపమును దర్శింపజేయునదీ యగుటచే సర్వజ్ఞకల్పమగు తననుగూడ ఋషి యని వేదము వ్యవహరించుకొనినట్లు తెలియును. ఇంతేకాదు, ఈ మంత్రరాశిని సేవించి (ఉపస్థాయ ప్రథమజాం), యజ్ఞాదికర్మల నొనర్చుచు క్రియావంతులై, శ్రోత్రియులై, క్రమముగా బ్రహ్మనిష్ఠులయి 'ఏకర్షి బ్రహ్మ భావము నొందెడివారును ఋషులగుటయు శ్రుతి వివరించినది.

తన 'ఋషిర్దర్శనాత్' అను నిర్వచనము ననుసరించి దర్శనమనగా:—
1) ఈశ్వర హిరణ్యగర్భాది విషయమున సర్వద్రష్టృత్వము లేక క్రాంతదర్శనము, 2) మంత్రద్రష్టల విషయముల అతీంద్రియ మంత్ర దర్శనము, క్రాంతదర్శనము 3) బ్రహ్మనిష్ఠుని విషయమున బ్రహ్మాత్మ భావ దర్శనము 4) వేదశబ్దరాశి విషయమున అతీంద్రియ ధర్మ మోక్ష స్వరూప ప్రదర్శనము — అని యీ రీతిగ

ఋషిశబ్దము యొక్క ప్రవృత్తి నిమిత్తమగు దర్శనము సర్వత్ర అనుగతమైనట్లు గ్రహింపనగునని శ్రుతి, స్మృతు లుపదేశించుట గాంచితిమి. ఇట నొక విశేషము. వేదశబ్దరాశి సృష్టికి సహకారికారణ మని చెప్పబడుటచే హిరణ్యగర్భాదుల ద్రష్టత్వము వేద మూలము వేదమునకుగల దర్శనము (ఋషిత్వము) అనన్యాపేక్ష మగుటచే స్వతంత్రము – అనియు స్పష్టమైనది.

## ఋషి శబ్దము - చారిత్రికులు :-

విషయ మిట్లుండ చారిత్రికులు కొందఱు 'ఋషి' యనగా మంత్రములను రచించినవాడు—అని యర్థమును జెప్పుచున్నారు.

"Rsi, 'Seer' is primarily a composer of hymns to ods .... "— A. A. Macdonell and A. B. Keith

—Vedic Index,

"Rishi or Seer means no more than the subject or the author of a hymn .... .... the concepts of these Gods and the hymns adressed to them sprang up spontaneously and without any pre-established plan."

— Max Muller—What India can Teach us. PP. 148.

ఈ చారిత్రికులు ఋషి శబ్దమునకు 'Seer' అని యనువదించుచునే 'మంత్ర రచయిత' యని యర్థమును గల్పించుచున్నారు. వేదగత పదములకు వేద సంప్రదాయానుగుణముగ నర్థము జెప్పుట యుక్తము. 'ఋషి' యను

పదమునకు 'ద్రష్ట' అను నర్థమే సంప్రదాయసిద్ధము. 'రచయిత' అను అర్థము కాదు. ఈ పదమునకు రచయితయను నర్థము జెప్పుటయందు శ్రుతికి ప్రవృత్తియే లేదు, పరమేశ్వరుడు మొదలు హిరణ్యగర్భాది దేవతలు, వసిష్ఠాది మంత్ర ద్రష్టలు, వేదవాక్కు, బ్రహ్మనిష్ఠులు - వీరందఱియందును ఋషిత్వము అనగా దర్శనము, అనుగతమై యున్నట్లు పైన వివరింపబడినది. ఋషిశబ్దమునకు 'రచయిత' యనునది ముఖ్యార్థమని (Primarily) చారిత్రికు లభిప్రాయపడిరి. అట్లు గ్రహించుచో పరమేశ్వరుడు మొదలుగాగల ఋషులయందు అనుగతమైన ప్రవృత్తినిమిత్తము (ఋషిత్వము) ఎట్లు పొసగును? ప్రవృత్తినిమిత్తమును పాటింపక యేదియో యర్థమును కల్పించుట శ్రుతి సమ్మతము కాదు సంస్కృత భాషా స్వభావ విరుద్ధము

మఱియు 'వేద మంత్రములయందు బాహ్యదర్శనమే కాని యాంత ర్దర్శనము లేదు. బాహ్యప్రకృతి దృశ్యములను జూచి సంభ్రమాశ్చర్య పరవశులై నిర్దిష్టమగు నొక తాత్త్వికసంస్కారము లేకయే (without any pre-established plan) దేవతాదులంగూర్చి చేసిన స్తోత్రములే యీ మంత్రములు. ఇట్టి మంత్రరచయితలే ఋషులు' — అని చారిత్రికుల యభిప్రాయము. సామాన్య ముగ బాహ్య ప్రకృతి దృశ్యములను, వివిధ సంఘటనలను జూచి పరవశులయి, భావోద్రేకముతో గద్యపద్యముల గూర్చుట చూచుచునే యున్నాము. అట్టి రచయితయే 'ఋషి' యని చారిత్రికు లభిప్రాయపడినట్లు తెలియుచున్నది. కాని శ్రుతి తాత్పర్య మది కాదు ద్రష్టయే ఋషి, రచయిత కాదు. అతీంద్రియార్థ దర్శనమే ఋషిశబ్దముచే వివక్షితమైనట్లు శ్రుతి స్మృత్యాది ప్రమాణములు నిరూ పించుచున్నవి, అతీంద్రియార్థముల దర్శింపజేయుటకే తాను ప్రవృత్తమైనట్లు శ్రుతి తనకు గల 'ఋషి, తపోజాః, స్వయంభు, ప్రథమజా, వేదః' — ఇత్యాది నామములచే నభివ్యక్తము చేసికొనుచున్నది కూడ. కాన వేద మంత్రజాతము అంతర్దర్శనము ప్రబోధించి తత్త్వమును దర్శింపజేయుటయే లక్ష్యముగా గలది. కావుననే ఇది శాస్త్ర మయినది. శాస్త్ర మనుచో నది అజ్ఞాతజ్ఞాపకము కావలెను

ఈ విషయము వేద శబ్దమున వివరింపబడినది. కేవల లోకసిద్ధార్థములనే బోధించుటకు లేక వర్ణించుటకు నిది ప్రవృత్తమైనదని చెప్పుచో వేదమునకు గల వేద - ఋషి - శాస్త్రాది నామములు సార్థకములు కావు. నిరర్థకము లనుట శ్రుతి (శాస్త్ర) సమ్మతము కాదు.

మఱియు ఋషి పదమునకు మంత్రరచయిత యను నర్థము జెప్పుచో వేదమునకుగల ప్రథమజా యను నామము సార్థకము కాదు. వేదములు మానవ రచితము లగు నెడల వేద భాగమంతయు నొకేసారి యొకే కాలమున రచింపబడి యుండుటకు వీలులేదు. అట్లగుచో భిన్న భిన్న కాలములలో భిన్న భిన్న రచయితలచే రచితములని చెప్పబడెడి భాగములలో నే భాగమునకు ప్రథమజా అనియు, ఆద్యాః ఋషయః - అనియు వ్యవహారము సిద్ధింపవలయును? వేదములో గొంతభాగమునకు ఆద్యత్వము మఱికొంత భాగమునకు అనాద్యత్వము కల్పించుట శ్రుతిసమ్మతము కాదు. త్రయీ రూపమైన వేదవాక్యంతయు తపోజమై ప్రథమ జమై, ఆద్యఋషియై విలసిల్లుటయే శ్రుతిస్మృత్యాది సిద్ధమైన సంప్రదాయము. కాన పరమేశ్వరు ననుగ్రహముచే సృష్టికి బూర్వము ప్రజాపతికి భాసించి, సృష్టియం దాలంబనమై వెలయుటచే వేదమునకు 'ప్రథమజా, ఆద్యః ఋషిః' ఇత్యాది నామ ములు సార్థకములైన వనెడి భారతీయ సంప్రదాయమే గ్రహించుచో శ్రుతివాక్యము లకు సరస సమన్వయము పొసగును.

## రచయితృత్వము : ఋషిత్వము :-

మఱియు ఋషిశబ్దము 'అంతర్దర్శనము, లేక క్రాంతదర్శనము ప్రవృత్తి నిమిత్తముగా గలది' యని దర్శించితిమి. కావుననే ఆర్షదృష్టి యనగా అలౌకిక దృష్టి, లేక దివ్యదృష్టి యను నర్థము ప్రసిద్ధము. దర్శనకారులు దీనినీ యోగజ ప్రత్యక్షము, యోగజ ప్రత్యాసత్తి - అన్ని యీ రీతిగ వివరించిరి. ఇట్టి దృష్టిగల ద్రష్టలే ఋషులు.

'ఋషి ర్విప్రః కావ్యేన' 1 ఋ. 8-79-1

ఇత్యాది ఋక్కులు వేదమంత్రదర్శనము వలననే సమ్యగ్దర్శిత్వము, ఋషిత్వము (క్రాంతదర్శనము) సిద్ధించునని చెప్పుచున్నవి. ఋషిత్వమునకు ద్రష్టృత్వము, క్రాంతదర్శనము ప్రధానలక్షణము. భావోద్రేకముతో పరవశులై గద్యపద్యములను కూర్చుట యనెడి రచయితృత్వము ఋషిత్వమునకు లక్షణము కాదు. వ్యాస వాల్మీకాది మహర్షులు భారత, రామాయణాది లోకోత్తర గ్రంథములను రచించిరి. వారు మహర్షులై యా గ్రంథముల రచించిరి గాని, రచనక్రియవలన మహర్షులు కాలేదు. మఱియు 'నానృషిః కురుతే కావ్యమ్': ఋషి కానివాడు కావ్యమును కూర్పలేడు - అని అభియుక్తోక్తి అనగా కావ్య నిర్మాణమునకు ఋషిత్వ మావశ్యక మని భావము. కాగా కావ్యము ఋషిత్వానుమాపకము. వ్యాస వాల్మీకాదులు ఆర్ష(వేద) చక్షుస్సుతోనే తమ తమ కావ్యముల వెలయింప జేసినట్లు వారి కావ్యములు చెప్పుచున్నవి.

వేదవిదులలో నగ్రగణ్యుడు, తపః స్వాధ్యాయ నిరతుడు, దేవర్షియనగు నారదుని యొక్క యుపదేశముచే, తపస్వియగు వాల్మీకి పరిశుద్ధాంతఃకరణుడై తమసాతీరమున కేగెను. అచట క్రౌంచద్వంద్వ వియోగదృశ్య జనిత శోకపరిప్లుత మానసుడైన వాల్మీకియొక్క ముఖమునుండి యప్రయత్నముగ ఛందోబద్ధ మగుచు వాక్కు వెలువడినది. అట్టి తన వాక్కును జూచి విస్మితుడై, తదేకధ్యాన చిత్తుడయి యుండ చతుర్ముఖుడగు బ్రహ్మ సాక్షాత్కరించి 'నా ప్రేరణ చేతనే నీ ముఖమునుండి వాక్కు ఇట్లు వెలువడినది. నారదుని వలన వినిన శ్రీరామచరితమును జెప్పుము. నా యనుగ్రహముచే యావద్వృత్తాంతము కనులకు గట్టగలదు. నీ వాక్కు అనృతము కాదు. అనగా నీ వాక్కు భూతార్థవాదిని యగును' అని చెప్పి యంతర్హితు డయ్యెను.

1. విప్రః సమ్యగ్దర్శీ, కావ్యేన గాయత్ర్యాది ఛందోనిబద్ధ కావ్యరూప మంత్ర దర్శనేన, ఋషి ర్భవతి — తాదృశం మంత్రద్రష్టృత్వ మేవ ఋషిత్వే ప్రధానం లక్షణమ్ ।

— స్వాధ్యాయమండల ప్రకాశిత కృష్ణ యజుర్వేద భూమికా. P. P. 11

ఈ విషయమును మహాకవి భవభూతి యిట్లు వివరించినాడు.

"తేన ఖలు పునస్సమయేన తం భగవంత మావిర్భూత శబ్దబ్రహ్మ ప్రకాశ మృషి ముపగమ్య భగవాన్ భూత భావనః పద్మయోని రవోచత్, 'ఋషే ! ప్రబుద్ధో వాగాత్మని, త ద్బ్రూహి రామచరితం, అవ్యాహతజ్యోతి రార్షం తే చక్షుః ప్రతిభాతి, ఆద్యః కవి రసి త్యుక్త్వా త త్రైవాంతర్హితః । అథ భగవాన్ ప్రాచేతసః .... రామాయణ మృషిః ప్రణినాయ" - ఉత్తర రామచరితమ్ – 2 అంక.

మహాతపస్వి యగు వాల్మీకి, నారదగురూపదేశ పూతచిత్తుడై, శబ్దబ్రహ్మ సాక్షాత్కారము నొంది, ఆర్షమగు చక్షుస్సుతో విరాజిల్లి ఋషియై, బ్రహ్మ యాదేశముచే రామాయణ మహాకావ్య రచనమునకు బూనుకొనినట్లు పై వాక్యముల వలన దెలియును. కావ వాల్మీకి ఋషియైదర్శి (క్రాంతయై) శ్రుత్యనుగ్రహీత బుద్ధితో రామాయణరచన గావించుటచేతనే యా మహాకావ్యము వాల్మీకిగత ఋషిత్వానుమాపకమై విలసిల్లినది కాన ఋషిత్వము వేఱు; రచయితృత్వము వేఱు.

పురాణాదులయందు మహాతపస్సంపన్నులు, వేదపారగులు నగు ఋషు లెందఱో యున్నట్లు గాంచగలము. వీరందఱు రచయితలు గారు. మంత్ర ద్రష్టలును గారు కాని అతీంద్రియార్థదర్శనము గలవారగుటచే ఋషిపదము వీరియెడ ప్రసిద్ధము, సార్థకము నయి యొప్పినది. కాన, ఋషిపదము ప్రధానముగ మంత్రరచయిత' యను నర్థమున ప్రసిద్ధ మని చెప్పెడి చారిత్రికవచనములు యుక్తిసహములు గావు, ఇంకొక విషయము.

"అగ్నిః పూర్వేభిః ఋషిభి రీడ్యో నూతనై రుత" — ఋ. 1-1-2.

"అగ్ని పూర్వ ఋషులచేతను, నూతనుల చేతను గూడ స్తోతవ్యుడు" అని యర్థము, ఇది ఋగ్వేదము మొదటిసూక్తములోని రెండవమంత్రము ఋగ్వేదమున గల యిట్టి మంత్రముల గొన్నిటి నాధారముజేసికొని 'మంత్రరచయిత లగు ఋషులు తమకంటె బ్రాచీనులగు ఋషులను, సమకాలికులగు రచయితలను గూర్చి తఱుచుగ ప్రస్తావించుట ఋగ్వేదమున గలదు'— అని చారిత్రికులు చెప్పుచున్నారు.

"In the Rugveda reference is often made to previous singers and to contemporary poets"

Vedic Index -- A.A. Macdonell and A.B. Keith

ఇట పూర్వఋషులు "Singers" (గానము చేసెడి వారు) అనియు, సమకాలికులు poets (రచయితలు) అనియు వేఱుచేసి యీ చారిత్రికులచే నిర్దేశింపబడిరి. అందులకు గారణ మేమో చెప్పబడలేదు.

ఇక మంత్రార్థమును జూతము. ఇది అగ్నిదేవతా స్తుతిపర మైన మంత్రము. ఇట స్తోతవ్యుడైన యగ్ని జగత్కారణభూతుడైన పరమేశ్వరుడని పూర్వము వేదశబ్దమున వివరింపబడినది. అట్టి మహాగ్ని మహాతపః సంపన్నులైన ఋషుల కెందఱకో పూర్వము (యుగయుగములనుండి) యారాధ్యుడయ్యెను. నూతనులగు ఋషులకు గూడ నారాధనీయు డా మహాగ్నియే. మహాత్ములగు ఋషులకే యారాధనీయు డగు నన్నచో నిక నన్యుల విషయము చెప్పనేల ? ఏ కాలమున గాని యెవరికిగాని యారాధనీయు డా యగ్నియే- యని యగ్నియొక్క మహానుభావత్వ మిట శ్రుతిచే కీర్తింపబడుచున్నది. కావుననే ఋగ్వేదము అగ్నిని 'యుగే యుగే విదథ్యమ్' (ఋ 6-8-5) - అనియు కీర్తించినది. (యుగే యుగే కాలే కాలే విదథ్యం విదథో యజ్ఞః తదర్హః తం - సా. భా.). సర్వకాలములందును యజ్ఞాదులచే నారాధనీయుడు — అని యర్థము. కాన అగ్ని (పరమేశ్వరుని) యొక్క సార్వకాలికమైన యారాధనమును ప్రశంసించుటకే పై మంత్రము ప్రవృత్తమైన దనుట స్పష్టము. ఇది సంప్రదాయానుగతమైన యర్థము. ఇందలి ఋషి పదము 'అతీంద్రియార్థదర్శనము గల ఋషులు' - అను నర్థమున బ్రయుక్తము గాని 'రచయితలు' అను నర్థమున గాదు. ఆ పదమున కట్టి యర్థమున బ్రవృత్తియే లేదని పూర్వము నిరూపింపబడినది. భారతీయుల దృష్టిలో ఆర్షదృష్టి యిట్టిది. 'ఋషి ర్దర్శనాత్' అను నిర్వచనము ననుసరించి ఋషి యనగా ప్రకరణానుగుణముగ వేదము, పరమేశ్వరుడు, మంత్రద్రష్ట, అతీంద్రియార్థద్రష్ట - ఇత్యాద్యర్థముల గ్రహించెడి సంప్రదాయమే శ్రుతితాత్పర్యానుగుణము, మంత్రరచయిత యని కాదు.

## మంత్రకృత్ — ఋషికృత్ — మధుకృత్
## లోక ప్రసిద్ధి

మంత్ర — ఋషి పదముల చివర "కృత్" అని కన్పట్టుటచే నీ పదములచే మంత్రకర్త లేక రచయిత యను నర్థము స్ఫురించుట సహజము. చారిత్రికు లీ యర్థమునే గ్రహించి చరిత్రకల్పనకై పాటుబడిరి గదా! ఈ వాదం కాదనుటకు వీలులేతిదా యనినట్లు భాసించుచుండును. కాన నీ పదముల యర్థమును నిర్ణయించు విషయమున భాషా సంప్రదాయ స్వభావముల సమగ్రముగ దర్శింప వలసి యున్నది.

"డు కృఞ్ కరణే" :— ఈ ధాతువునకు కరణము అనగా చేయుట యని యర్థము. చేయుట యనగా ఉత్పత్తి చేయుట, నిర్మాణము చేయుట, రచన చేయుట యని మాత్రమే గాదు ఇది సర్వక్రియా వ్యాపకమై ప్రకరణము ననుసరించి విభిన్న క్రియలను లక్షింప చేయుచుండును.

ఉదా :— మధుకృత్ లేక మధుకరః

ఇట మధుశబ్దము చివర "కృఞ్" ధాతు ప్రయోగము గలదు. కాని యీ పదములకు మధువును (తేనెను) చేయునది లేక తయారు చేయునది లేక నిర్మించునది యను నర్థము లిట భాసగవు. మధుకర మనగా తేనెటీగ. ఇది పువ్వు పువ్వున ప్రాలి యందు సిద్ధమై యున్న మకరందము నాస్వాదించి ప్రోగుచేసి కూడబెట్టునే గాని పూవులయందు లేని పుష్పరసమును (మకరందః పుష్పరసః) తాను క్రొత్తగా నుత్పత్తి చేయదు. చేయు శక్తియు దానికి లేదు. కాన మధుకృత్ - మధుకర పదములకు తేనెను తయారు చేయునది అను నర్థము చెప్పుట లోక విరుద్ధము. తేనెను ప్రోగు చేయునది - కూడబెట్టు యను నర్థములే లోక సమ్మతములు. ప్రకృతమున మంత్రకృత్ — ఋషికృత్ పదములకును నిట్లే అర్థమును దర్శింపవలసి యున్నాము. తేనెటీగలు పూర్వసిద్ధ మయి యున్న మధువునే దర్శించి, గ్రోలి కూడబెట్టు నట్లు ఋషులును అనాదిసిద్ధ మయి యున్న

మంత్రములనే దర్శించి, తద్రసానుభూతి నొంది వాని నొకచో గూర్చిన వారు అనియే యర్థమును గ్రహింపవలయును.

'కృఞ్' ధాతువున కిట్టి యర్థమున ప్రయోగములు పెక్కులు గలవు. జైమిని మహర్షియు 'ఆదానే కరోతి శబ్దః' (4-2-6) అను సూత్రమున ఆదానము (గ్రహించుట, కూడబెట్టుట, ప్రోగు చేయుట) అను నర్థము 'కృఞ్' ధాతువునకు ప్రసిద్ధ మగుట తెలియజేసినాడు. శబరస్వామియు ఈ విషయము నిట్లు వివరించి నాడు.

> "ఆదానే కరోతి శబ్దో భవిష్యతి। స్వరుం కరోతి స్వరు మాదత్త ఇతి।
> యథా కాష్ఠాని కరోతి, గోమయాని కరోతీతి ఆదానే కరోతి
> శబ్దో భవతి ఏవ మిహాపి ద్రష్టవ్యమ్।"

కాష్ఠాని కరోతి = కట్టెల ప్రోగు చేయుచున్నాడు, గోమయాని కరోతి = పేడను ప్రోగు చేయుచున్నాడు - ఇత్యాది స్థలములయందు 'కృఞ్' ధాతువునకు ఆదానార్థమే చెల్లును గాని ఉత్పత్తి చేయుట యను నర్థము పొసగదు.

కాన మంత్రకృత్ ఇత్యాది పదముల యందు 'కృఞ్' ధాతువునకు ఆదానార్థము చెప్పుట భాషా సంప్రదాయానుగతమై యొప్పును. కానిమ్ము 'కృఞ్' ధాతువునకు కొన్ని యెడల ఆదానము అను నర్థము గూడ ప్రసిద్ధము కావచ్చును ప్రకృతమున మధుకృత్ ఇత్యాది ఉదాహరణముల జూపి మంత్ర కృత్ ఇత్యాది పదములకు మంత్రద్రష్ట అనెడి యర్థమునే గ్రహింపవలయు ననుటలో ప్రమాణ మేమి? రచయిత యనియే యేల చెప్పరాదు? అని యన వచ్చును. అట్లు చెప్పుట తగదు. ఏలయన నది శ్రుతి సంప్రదాయము కాదు. కాన నీ విషయమై శ్రుతి సంప్రదాయమును జూతము

## మంత్రము : ఋషి - చ్ఛందో - దేవతా పరిజ్ఞానము

ప్రథమజా శబ్ది పరిశీలనమున కృత్స్న వేదరాశిని దర్శించిన ఋషి హిరణ్యగర్భ బ్రహ్మయే యగు నని పూర్వము వివరింపబడినది. ఇట నొక

విషయము. యజన యాజనా ధ్యాపనాది క్రియల యందు ఋషి చ్ఛందో దేవతా జ్ఞాన మావశ్యక మనియు, లేనిచో ప్రత్యవాయము సంభవించు ననియు శ్రుతి స్మృతు లిట్లు శాసించుచున్నవి.

"యో హ వా అవిదితార్షేయ చ్ఛందో దైవత బ్రాహ్మణేన మంత్రేణ యజతి యాజయతి వాఽధ్యాపయతి వా స్థాణుం వర్ఛతి గర్తే వా పాత్యతే ప్రమీయతే పాపీయాన్ భవతి — — — తస్మా దేతాని మంత్రే మంత్రే విద్యాత్"

— ఆర్షేయ, బ్రా 1-1-6 (చూ. సాయణకృత తై. సం, భాష్య భూమికా)

అవిదిత్వా ఋషి చ్ఛందో దైవతం యోగ మేవ వా।
యోఽధ్యాపయే జ్జపే ద్వాపి పాపీయాన్ స తు జాయతే ॥

బృ. దే. 8-136.

పై వచనముల ననుసరించి మంత్ర ప్రయోగ సమయమున వివిధ వేద భాగములకు ఋషి చ్ఛందో దైవత బ్రాహ్మణ పరిజ్ఞాన మావశ్యక మని తెలియును. అగుచో నిట ఋషి పరిజ్ఞాన మావశ్యక మన్నచో నే ఋషి పరిజ్ఞానము ? సర్వ వేదద్రష్టయై 'విశ్వాధికో రుద్రో మహర్షిః' అని కీర్తింపబడిన హిరణ్యగర్భుడా ? లేక వేత్వేఱు వేద భాగముల దర్శించిన గృత్స మద విశ్వామిత్రాది ఋషి వర్గమా ? ఈ గృత్సమదాది ఋషుల స్మరించుట వలన (గల్గెడి) ప్రయోజన మేమి ? పోనీ; ఈ గృత్సమదాది ఋషిజ్ఞానమే అవశ్యక మని గ్రహింత మన్నను వీరిని గూర్చి ఐతరేయక శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"ఏత మేవ సంతం శతర్చిన ఇత్యాచక్షతే, తస్మాద్ గృత్సమద ఇత్యా చక్షత ఏత మేవ సంతం, — — — తస్మా ద్విశ్వామిత్ర ఇత్యా చక్షత ఏత మేవ సంతం,

--- తస్మా ద్వామదేవ ఇత్యా చక్షత ఏత మేవ సంతం -- - తా వా ఏతా స్సర్వా ఋచః సర్వే వేదాః సర్వే ఘోషాః ఏకైవ వ్యాహృతిః ప్రాణ ఏవప్రాణ ఋచ ఇత్యేవ విద్యాత్ - ఇతి" — ఐ. ఆ. 2. 2-1

ఇట శ్రుతి ఆ యా మంత్రద్రష్టలకు వాచకము లైన గృత్సమద-విశ్వామిత్రాది శబ్దములకు గల నిర్వచనముల బ్రదర్శించినది ఈ నిర్వచనముల ననుసరించి ఈ శబ్దము లన్నియు ప్రాణదేవతను బోధించునవి కాన విశ్వామిత్రాది శబ్దము లన్నిటి చేతను ప్రా దేవతనె దర్శింపవలె నని ఈ శ్రుతి చెప్పుచున్నది. దీని ననుసరించి ఋషి పరిజ్ఞాన మనగా నిఖిల వేదరాశికి ద్రష్టయైన హిరణ్యగర్భ ఋషి పరిజ్ఞానమే కాని తదితర ఋషి పరిజ్ఞానము కాదని తెలియును. కాన యజన యాజనాదులందు వసిష్ఠాది ఋషి విశేష పరిజ్ఞాన మనావశ్యకమే గదా? అని శంకింపవచ్చును.

ఇట్లు శంకించుట తనిదు. "పశ్యతో హ్యాభా వపి" 1- ఇరువురును ద్రష్టలే. అనగా హిరణ్యగర్భుడును, గృత్సమదాది ఋషులును, ఉభయులును ద్రష్టలే. ఈశ్వరానుగ్రహముచే హిరణ్యగర్భుడు నిఖిల వేద ద్రష్ట యయ్యెను. తదనుగ్రహపాత్రులై ష్ఠాదులును వివిధ మంత్రద్రష్టలై వేదవాణిని లోకమున యజ్ఞాది మార్గమున వ్యాప్తి నొందించిరి. కావుననే వీరు "ఇదం నమ ఋషిభ్యః పూర్వజేభ్యః పూర్వేభ్యః పథికృద్భ్యః"

(ఋ. 10-14-15; అం. సం. 18-2-2; తై. ఆ. 6-5-1)" అని కీర్తింపబడుచున్నారు. వీరు యజ్ఞాది శుభమార్గముల బ్రవర్తింప జేసినవారు. (పథికృద్భ్యః = శోభన మార్గకారిభ్యః. సా. భా. కనుక స్మరణీయులే యగుదురు.

ఇట నొక విషయము గమనింప దగినది. ప్రాణదేవతయగు హిరణ్యగర్భుడు ఉపాసకు లగు ఋషుల ననుగ్రహించు విషయమును శ్రుతి యిట్లువర్ణించుచున్నది,

---

1. చూ. దుర్గాచార్య భాష్య. నిరు. 1-4.

"ఏష ఇమం లోక మభ్యార్చ్య త్పురుష రూపేణ, య ఏష తపతి
ప్రాణో వా తదభ్యార్చ్యన్, ప్రాణో హ్యేష య ఏష తపతి, తం శతం
వర్షా ణ్యభ్యార్చత్, తస్మా చ్ఛతం వర్షాణి పురుషాయుషో భవంతి, తం
య చ్ఛతం వర్షా ణ్యభ్యార్చన్ తస్మా చ్ఛతర్చినః తస్మా చ్ఛతర్చిన
ఇత్యాచక్షత ఏత మేవ సంతమ్" --- ఐ. ఆ. 2.2-1.

ఆదిత్య మండలాంతర్గతమై ఆదిత్యరూపమున ప్రకాశించు ప్రాణ దేవతయే పురుషరూపమున (అనగా ఉపాసక జీవరూపమున) ఉపాసకుని దేహము నందు ప్రకాశించుచు తన యునికిచే నా దేహము నంతయు అర్చనీయము గావించు చున్నది. (య ఏష ఆదిత్యే మండలే తపతి న ఏష పురుష రూపేణ ఉపాసక జీవ రూపేణ ఇమం లోక మవలోక్యమాన మిమ ముపాసక దేహం అభ్యార్చన్ స్వప్రవేశే నాభితో౽ర్చనీయ మకరోత్ — సా. భా.) పురుష రూపము (అనగా ఉపాసక జీవరూపము) లేని దేహము శవరూపమై పూజనీయము కాదు. ఉపాసకుని దేహము నందు ప్రాణదేవత ప్రతిష్ఠితమై నూరు వత్సరములు నిలిచి యా దేహము నర్చనీయము గానించుచుండును. ఇట్లు ప్రాణావతార భూతులై ఉపాసకులైన మంత్రద్రష్ట లగు ఋషుల దేహములు శత వత్సర కాల పర్యంత మర్చనీయములుగ ప్రాణదేవతచే జేయబడుటచే వారు శతర్చినః అను అన్వర్థ నామములతో నొప్పిరి ఈ ఋషులు వస్తుతః ప్రాణదేవతారూపులే యయ్యును శతర్చి నామకు లగు మునులుగ వ్యవహరింప బడుచున్నారు. కాన ముని రూపమున ప్రాణదేవత నుపాసింప దగును (ప్రాణస్య తన్మువి రూపత్వం ధ్యాయే దిత్యర్థః- సా. భా.) అని యర్థము.

ఈ శ్రుత్యర్థమును బరిశీలించుచుచో సాధనాభ్యాస పాటవము కొలది ఉపాసకుని దేహము క్రమముగ ప్రాణశక్త్యభినిష్టమై ప్రాణదేవతానుగ్రహపాత్రమై పూజనీయమై వరలును. ఉపాసకుడు కానట్టి యతని దేహము శవప్రాయమై యర్చనీయము కాదు ఇట్లు మానవదేహమే కాదు; మంత్రోచ్చారణ జేసి విధి పూర్వకముగ ప్రాణప్రతిష్ఠ నొందిన లోహశిలాప్రతిమలు, దారు మూర్తులు,

(పసుపుతో గాని, మృత్తికతో గాని రూపొందింప బడిన వివిధ మూర్తులు తుదకు కుశ ఖండములు సైతము) జడము లయ్యును తత్తద్దేవతారూపమున నర్చనీయములై యొప్పుచు భారతదేశమునం దెల్లెడల నర్చింపబడుచున్నవి. ప్రాణ ప్రతిష్ఠ నొందని శిలాప్రతిమాదు లర్చనీయము లగుట లేదు. అట ప్రతిష్ఠింపబడు దేవతామూర్తి పుంరూపము గావచ్చును; స్త్రీ రూపము గావచ్చును. ఆ మూర్తులు శివ విష్ణ్వంబికాది విభిన్న నామములతో, రూపములతో నొప్పి యుండవచ్చును. దేవతామూర్తి ఏయే రూపముతో నే యే నామముతో నొప్పి యున్నను దేవాలయము లందు గాని, గృహములందు గాని ఆ మూర్తియందు జరుగునది సర్వదేవతాత్మక ప్రాణదేవతా ప్రతిష్ఠయే. కావుననే ఏ దేవత కైనను 'ప్రాణాయ స్వాహా, అపానాయ స్వాహా' — అని యీ రీతిగనే 'నివేదన' జరుగును. నేటికిని భారతీయుల భోజనారంభమున 'ప్రాణాయ స్వాహా' యనుచు ప్రాణదేవతా నివేదన పూర్వకముగ ప్రాణోపాసన జరుగుచుండుట గమనార్హము. అనగా సర్వదేవతాత్మక ప్రాణదేవతయే యుపాసింపబడుచున్నది. దేవతానామము లన్నియు గూఢ యోగశక్తిచే పరమేశ్వర తత్త్వప లక్షకము లగుచుండును. (ఈ విషయము మున్ముందు బ్రహ్మ మొ॥ ప్రకరణములలో వివరింపబడును.) అందుచే నిఖిల దేవతల యందును నిఖిల ప్రాణుల యందును అనుస్యూతమై యున్న ప్రాణదేవతా తత్త్వమును స్ఫురింప జేయుటకే యీ 'నివేదన రూప సంప్రదాయము' భారతీయాచారము నందు ప్రతిష్ఠితమై యున్నది. ఈ వైదిక సంప్రదాయ రహస్యము నెఱుగని చారిత్రికులు మన్నగువారు నేటికిని గూడ భారతీయులు జడములైన విగ్రహాదుల నారాధింతురు" అని పరిహసించుచుందురు. కాన పై శ్రుతి ప్రమాణము ననుసరించి భారతీయుల విగ్రహారాధనమంతయు ప్రాణదేవతారాధనము; ఈశ్వరారాధనము; జడవస్త్వారాధనము కాదు అని తెలిసికొనదగినది.

వస్తుతః ప్రాణదేవతా స్వరూప లయ్యును వివిధ నామ రూపములతో వివిధ దేవత లర్చనీయు లగునట్లే, వస్తుతః ప్రాణదేవతాస్వరూపు లయ్యును వివిధ మంత్రద్రష్ట లగు గృత్సమదాది ఋషులును అర్చనీయు లగుదురు. ప్రాణ

దేవతోపాసన యందు పరాకాష్ఠ నొంది తదాత్మకు లగుట చేతనే వారును మంత్ర ద్రష్టలు కాగల్గిరి. అట్టి యుత్తమ స్థితిని పొందుట యెల్లరకు సాధ్యము కాదు. అట్లర్చనీయు లగుట చేతనే మంత్ర ప్రయోగకాలమున వీరు స్మర్తవ్యు లగుచున్నారు. ఛాందోగ్య శ్రుతియు మంత్ర ప్రయోగ కాలమున నిట్టి యీ వివిధ ఋషుల పరిజ్ఞాన మావశ్యకమని యిట్లు శాసించుచున్నది.



"యేన సామ్నా స్తోష్య న్స్యాత్ త త్సామోపధావేత్, యస్యా
మృచి తా మృచం య దార్షేయం త మృషిమ్"



1-3.8, 9

కాన యజన యాజనాది సమయమున ఋషి విశేష పరిజ్ఞానము, ఛందో విశేష పరిజ్ఞానము, దేవతా విశేష పరిజ్ఞానము ఆవశ్యక మని తెలియును. యజమానుడు జిజ్ఞాసుపై సాధనాభ్యాస పాటవము గల్గి ఉపాసన యందు పరినిష్ఠితు డగు కొలది ఈ వివిధ ఋషి చ్ఛందో దేవతా నామము లన్నియు ప్రాణదేవతా తత్త్వోప లక్షకములై సాక్షాత్కరించుచుండును. తుదకు ప్రాణదేవతా సారూప్యము నొందుటకు తోడ్పడును. "ఋషి చ్ఛందో దేవతల యందు ప్రాణదృష్టి శాస్త్ర విహితము కాన వీని నీ దృష్టితో భావన చేయవలెను" అని బృహద్దేవతయు నిట్లు చెప్పుచున్నది.



ఋషి చ్ఛందో దైవతాది జ్ఞానం యజ్ఞాదిషు శ్రుతమ్ ।
త దాశ్రిత్య ప్రాణదృష్టి ర్విహితాऽ త్రేతి గమ్యతామ్ ।

— 8-135.

ఇంతే కాదు గాయత్ర్యాది ఛందస్సులు వానితోపాటు అగ్న్యాది దేవతలను ప్రాణదేవత యగు ప్రజాపతి నుండి యావిర్భవించి నట్లు శ్రుతులు (ఋ. 10-130-4, 5; తై. సం. 7-1-1-4, 5) చెప్పుచున్నవి. ఈ ఛందస్సులు వేదమూర్తి యగు ప్రజాపతియొక్క అంగములుగాను తదాత్మకములు (ప్రాణములుగా)గాను చెప్పబడుచున్నవి.

"ప్రజాపతే ర్వా ఏతా న్యంగాని య చ్ఛందాంసి" - ఐ బ్రా. 2-19.
"ప్రాణా వై ఛందాంసి" కౌషీ. బ్రా. 7. 9; 11-8; 17-2.

మఱియు ప్రజాపతి గాయత్ర్యాది ఛందోమయ మగు రథము (వేద రథము) నధిష్ఠించి ఆదిత్యరూపమున సంచరించుచుండు ననియు అట్లు సంచరించు చున్నట్లు యజమానుడు భావన చేయవలె ననియు (తై. బ్రా, 5-12) శ్రుతి తెల్పు చున్నది. వేదమూర్తి యగు ప్రజాపతి ఛందోమయుడై యుండినట్లే వేదవిదు డగు యజమానుడును ఛందోమయుడై ప్రజాపతి పదము నొందుట కర్హుడు. కాన ఛందస్సులు ప్రజాపతికి అవయవభూతము లగుట జేసి తద్విశేష పరిజ్ఞానము గల్గి, ఛందఃక్రమము నతిక్రమింపక వాని ననువచింపవలె నని శ్రుతి యాదేశము

"యదా ఛందస మనూచ్యః ప్రాతరనువాకః, ప్రజాపతే ర్వా ఏతా న్యంగాని య చ్ఛందాంసి, ఏష ఉ ఏవ ప్రజాపతి ర్యో యజతే తద్యజమానాయ హితమ్" — ఐ. బ్రా. 7-8.

"అనుక్రమే ణావస్థితాని గాయత్ర్యాదీని ఛందాం స్యనతి క్రమ్యేతి యథాఛందసమ్। ఛందః క్రమేణై వాయ మనువచనీయః, ఛంద సాం ప్రజాపతి సృష్టత్వేన తదవయవత్వాత్। యజమానస్య చ ప్రజాపతి పద ప్రాప్తి యోగ్యత్వేన ప్రజాపతి రూపత్వాత్। తదంగ రూప చ్ఛందసాం క్రమేణానువచనం యజమానావయవ విప ర్యాసరాహిత్యేన హితం భవతి తస్మాత్ - - - — సా భా.

పైన నుదహరించిన ప్రమాణముల ననుసరించి ప్రాణదేవత యగు ప్రజాపతి సర్వ ఋష్యాత్మకుడు, సర్వ చ్ఛందోమయుడు, సర్వదేవతాత్మకుడు. అని తెలియును. ఇంతే కాదు, పరమేశ్వరుని నిఖిల ఋషి-వేద-దేవతాత్మకత్వము 'ఇయం మే నాభి రిహ మే సధస్థ మిమే దేవా అయ మస్మి సర్వః (ఋ 10-61-19) ఇత్యాది నాభానేదిష్ఠాది వ్పష్టముగా కాన నగును. (చూ. భారతీశబ్ద-శిల్పములు-ఆత్మసంస్కృతి)

కాన నిట్టి మహిమాన్విత మైన యీ ఋషి చ్ఛందః పరిజ్ఞానము ప్రతి మంత్ర ప్రయోగకాలమున అత్యన్తావశ్యకమే యని తెలియును.

ఇంతియే కాదు. ఋషి చ్ఛందో దేవతా పరిజ్ఞానావశ్యకతను వివరించుచు బృహద్దేవత తుట్టతుదకు ఋక్కుల యొక్క లక్ష్యము నిట్లు వివరించినది.

"అర్థేప్సవః ఖల్వృషయః ఛందోభి ర్దేవతాః పురా
అభ్యధావ న్నితి చ్ఛందో మధ్యేత్యాహు ర్మహర్షయః ॥"
"ఋషిం తు ప్రథమం బ్రూయాత్ ఛంద స్తు తదనంతరమ్ ।
దేవతా మథ మంత్రాణాం కర్మ స్వేవ మితి శ్రుతిః ॥"
"ఆధారం వా ప్యనాధారం వివిచ్యాత్మాన మాత్మని ।
ఈక్షమాణో హ్యుభౌ సంధిం ఋచో దైవతవిత్ పఠేత్ ॥"
"న బ్రహ్మా మృత మత్య న్తం యోనిం సదసతో ర్ధ్రువమ్ ।
మహ చ్చాణు చ విశ్వేశం విశతి జ్యోతి రు త్తరమ్ ॥"

— బృ. దే. 137-140.

ఋషులు తమ యభీప్సితార్థముల (పురుషార్థముల) బొంద గోరి ఛందస్సులతో (ఛందోబద్ధము లగు మంత్రములతో) దేవతల నభిముఖుల గావించుకొనిరి. అందుచే మహర్షులు ఛందస్సులను, ఋషులకును, దేవతలకును నడుమ జెప్పిరి. కాన కర్మల యందు మంత్రములకు మొదట ఋషిని తరువాత ఛందస్సును చివరకు దేవతను జెప్పవలెను. ఆత్మ జగత్కర్త యైనను అకర్తనుగా బుద్ధియందు వివేచన చేసికొని 1 "కర్తృ-అకర్తృ-ఆత్మ స్వరూపముల రెంటిని అట్టి అట్టి స్వరూపముల ప్రతిపాదించి బుద్ధిని ఆత్మయందు సంధింప జేసెడి లక్ష్యము గలవిగా ఛందస్సును-సంధిం-ఛందోబద్ధ మగు మంత్రమును) 2

1) "తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్" – భ. గీ. 6-13
"ఆత్మాన మఖిలా ధార మాశ్రయే" —వేదాంతసార.

2) సంధీయతే అనయా ఇతి సంధిః వాక్ (ఋక్)

దర్శించుచు, నిట్టి దేవతా పరిజ్ఞానము గలవాడై ఋక్కుల బఠింపవలెను. ఇట్లు బఠించువాడు పరమ పురుషార్థరూప మగు బ్రహ్మామృత పదము నొందును - అని యర్థము.

కాన యజన-యాజన-అధ్యయన-అధ్యాపన క్రియ లందు మంత్రముల నే దృష్టితో నెట్లు పఠింపవలెనో పై శ్రుతి స్మృతి వచనముల వలన దెలియుచున్నది. ఇట్లు ప్రతి మంత్ర ప్రయోగకాలమున దర్శించుచో —

"అనాదిసిద్ధమై యున్న మంత్రరాశి యే మొదట ఈశ్వరానుగ్రహముచే తదుపాసనా పరిణిష్ఠితు లైన మంత్రద్రష్టలకు భాసించి పిదప గురుశిష్య పరంపరా ప్రాప్తమై వెలసినది. కాన నిది యనాదినిధనము; స్వయంభువు; అపౌరుషేయము; స్వతః ప్రమాణము" — అను విషయము లడుగడుగున స్ఫురించు చుండును. ఇంతే కాదు. ఇట్టి మంత్రరాశి సాహాయ్యముతో తదారాధకులు సర్వఋష్యాత్మక-సర్వచ్ఛందోమయ- సర్వదేవతాత్మక ప్రాణదేవతా సాయుజ్యమును తుదకు బ్రహ్మామృత పదము నొందుదు రను విషయమును ఋష్యాది విజ్ఞానము దర్శింపజేయుచుండును. ఇట్టి తన స్వరూప స్వభావముల నడుగడుగున దర్శింప జేయుటకే అంతర్దర్శనము కల్గించుటకే - ఋషి చ్ఛందో దేవతా బ్రాహ్మణ పరిజ్ఞానము ప్రతి మంత్ర ప్రయోగకాలమున నావశ్యక మని శ్రుతి శాసించుటలోని తాత్పర్యము. అట్లు దర్శింపజేయుటయే వేదము యొక్క ఋషిత్వము.

ఇట్లు గాక (అనగా వేదమును వేదచోదిత విధానమున గాక) మఱి యే రీతిని బఠించినను యెంత పరిశీలించినను ఆ మంత్రరాశి కేవల శబ్దరాశియై గోచరించునే కాని అంతర్దర్శనమును గలిగించెడి ఋషియై సాక్షాత్కరి పదు; అసందర్భ రచనముగ తోచునే గాని ఆద్యఋషిగా ప్రథమజగా తోచదు.

బ్రహ్మ యను నామము గూడ వేదమునకు గల యనాది నిధనత్వమును నిరూపించునట్టిది. ఇక బ్రహ్మ శబ్దమును జూతము.

# బ్రహ్మ

బ్రహ్మ బృంహణశీల ఇత్యభిహితో నిత్యో విశుద్ధః పుమాన్
యావ ద్బ్రహ్మ చ విష్ఠితం భగవతీ వాక్ తావతీ విశ్రుతా ।
బ్రహ్మైకం ప్రవిగాతు మావి రభవత్ శాఖాసహస్రోజ్జ్వలా
బ్రహ్మాఖ్యాం దధతీ హరిప్రియతమా సా భారతీ పాతు నః ॥

నిరతిశయ పదస్థః సచ్చిదానంద మూర్తిః
నిరతిశయపదం యం వేద మాస్థాయ, బ్రాహ్మం ।
దథమధికురుతే నం రక్షతిబ్రహ్మ కర్మా
ణ్యవితథ పదరమ్యాం తాం స్తుమో బ్రహ్మవాణీమ్ ॥

— వేదమాతృస్తవః

## బ్రహ్మశబ్దము - చారిత్రికులు :-

వేదమునకు వేదమంత్రమునకును, స్తుతిలక్షణమగు వేదవాక్యానకును బ్రహ్మ యనియు నామము ప్రసిద్ధము. కాని, యీ విషయమున చారిత్రికుల యభి ప్రాయము లింకొకతీఱుగ నిట్లు గన్పట్టుచున్నవి. వానిని జూతము.

బ్రహ్మ శబ్దము (నపుంసకలింగము) వేదమున బ్రాహ్మణజాతి వాచకము; పుంలింగ బ్రహ్మ శబ్దము ఋగ్వేదమునను, తరువాత మిగిలిన వేదములందును

'పురోహితు'డను నర్థమునందే ప్రసిద్ధము; 'బ్రహ్మ యగు నీ పురోహితుడు ఋత్విజులలో నొకడు కాదని కొందఱు చారిత్రికుల యభిప్రాయము; బ్రహ్మ యను నామము మొదట 'హోత' యను ఋత్విజునకును, క్రమముగ కొంతకాలమునకు యజ్ఞక్రియ నంతయు నమీక్షించుచు దానిని తన మాంత్రికశక్తి (Magic spell)తో గాపాడెడి బ్రహ్మ యను ఋత్విజునకును సంక్రమించి యుండునని కొందఱి చారిత్రికుల యభిప్రాయము; కాలక్రమమున మంత్రములలో పాటవము తగ్గి మాంత్రిక శక్తిచే యజ్ఞమును గాపాడెడి పురోహితుడు కావలసివచ్చెను; ఆ పురోహితుడే బ్రహ్మ."

— Vedic Index - A. B. Keith and Macdonell.

చారిత్రికులయొక్క యీ వైదిక కోశవచనముల ననుసరించి బ్రహ్మ శబ్దమునకు వేద మనిగాని, ఈశ్వరుడు లేక పరతత్త్వ మనిగాని యర్థ మున్నటుల చెప్పబడనే లేదు. ఇక కొ ఱు చారిత్రికులు బ్రహ్మశబ్దమునకు స్తోత్రము, పర తత్త్వము - ఇత్యాద్యర్థములు గలవని యంగీకరించిరి. కాని, ఆ యర్థము విషయమున పలువురు పలు రీతుల త్ర కల్పనల గావించిరి. సంగ్రహముగ నా యా వాదముల స్వరూపమిది :—

"1. హాగ్ (Haug) పండితుని యభిప్రాయము :- బ్రహ్మ శబ్దము 'బృహ్' ధాతువు నుండి పుట్టినది. ఆ ధాతువునకు ఉబ్బుట, లేక పెరుగుట (To swell or to grow) -అని యర్థము. బ్రహ్మ శబ్దము మొదట పెంపుదల (Growth)కు గారణము ల స్తోత్రములను, పిదప భౌతికశక్తి (Force of nature)ని బోధింప జొచ్చినది.

2. రూథ్ (Roth) పండితుని యభిప్రాయము :- బ్రహ్మ శబ్దము మొదట దేవతావిషయక మగు ఇచ్ఛాశక్తిని (Force of will directed to the gods), తరువాత మంత్రమునకు (Sacred Formula)ను తుదకు పర తత్త్వమునకును వాచకమైనది.

3. ఓల్డెన్‌బర్గ్ (Oldenberg) పండితుని యభిప్రాయము :— వేదకాలమున లోకమంతయు నద్భుతశక్తుల (mysterious forces)తో ప్రజలకు సుఖదుఃఖములను గల్గించెడి దేవతల నారాధించెడి ప్రజలతో నిండి యుండెడిది. ఆ కాలమున మాంత్రికశక్తితో గోరినదెల్ల సమకూర్చగల వైద్యునకు విశేషప్రాధాన్య ముండెడిది. ఆ రోజులలో 'బ్రహ్మ' యనగా మాంత్రికశక్తి (Magic spell) అని యర్థము. బ్రాహ్మణముల కాలమున బ్రహ్మ యనగా యజ్ఞమున నుపయోగించెడి మంత్రము లని యర్థము. బహుశః అద్భుతశక్తుల (magical effects) ప్రదర్శించుటకు మంత్రము లుపయోగింపబడి యుండును. బ్రహ్మశబ్దము క్రమముగ నీ యర్థము నుండి మరలి తుదకు జగత్కారణ మగు నొక కేంద్రశక్తి (central energy)ని బోధించుట కుపయోగింపబడినది.

4. డ్యూసెన్ (Deussen) పండితుని యభిప్రాయము :— 'బ్రహ్మ' శబ్దమునకు మొదట మానసికౌన్నత్యమును బెంపొందించెడి స్తోత్ర మని యర్థము. పిదప సత్యమును దర్శించినపుడు ఆ సత్యమే బ్రహ్మ శబ్దముచే గూడ బోధింపబడ జొచ్చినది.

5. మాక్సుముల్లరు పండితుని యభిప్రాయము :— 'బ్రహ్మ' యనగా శబ్ద మని యర్థము. బృహస్పతి లేక వాచస్పతి శబ్దములబట్టి జూచిన నీ విషయము స్పష్ట మగును. ఏది యుచ్చరించునో యది బ్రహ్మ (That which utters is Brahman).

బ్రహ్మశబ్దము యొక్క పదనిష్పత్తి (etymology)ని గూర్చి శ్రమ పడుట యనావశ్యకము. మొత్తము మీద నేది వృద్ధి జెందుచుండునో, శ్వాసక్రియ నల్పునో లేక పెంపొందునో యట్టి వాస్తవిక తత్త్వము బ్రహ్మయగుట స్పష్టము. (Brahman means reality which grows, breaths or swells)." (చూ- యస్. రాధాకృష్ణన్ - Indian Philosophy Vol.I PP 163 - 164).

ఈ చారిత్రికుల ననుసరించి బ్రహ్మ శబ్దము ఉపనిషత్కాండయందు మాత్రమే పరతత్త్వమును బోధించు ననుట యందఱకు సంమతము. తద్భిన్నవేద భాగమునందు కాదు. సంహితా - బ్రాహ్మణ - ఉపనిషద్భాగములం దీ పదము యొక్క యర్థము క్రమక్రమముగ మార్పు జెందినదని వీరి యభిప్రాయము ఈ పదము యొక్క పదనిష్పత్తితో నిమిత్తము లేదనియు గొందఱి యభిప్రాయము. మొత్తము మీద బ్రహ్మ శబ్దమునకు వేద మను నర్థ మున్నటుల చరిత్రకారులు గ్రహింపలేదు.

చరిత్రకల్పనాలక్ష్యముతోనే, వేదభాగములకు పౌర్వాపర్య ముండియుండ వలె నని మొదట యూహించుకొని, తదనుగుణముగ బ్రహ్మ శబ్దము యొక్క యర్థము విషయముననను క్రమపరిణామము గలదని చెప్పుటకే చారిత్రికులు యత్నించి నట్లు గన్పట్టును. అందుచే తమ తమ యూహల కనుగుణముగ, పరస్పరవిభిన్న మార్గముల నిట్టి విభిన్నకల్పనలు సాగినవి. పదము యొక్క అర్థనిర్ణయమునకై చరిత్రను బ్రాతిపదికగ గైకొనవలచుటయే ! యిట్టి వైమత్యమునకు గారణమైనది. ఇక శ్రుతి స్మృత్యాది – అనాదిసిద్ధప్రమాణముల గ్రహించి బ్రహ్మ శబ్దము యొక్క సంప్రదాయానుగతములగు నర్థముల జూతము.

## బ్రహ్మ యన వేదము - శ్రుతిస్మృతిప్రసిద్ధి :–

"ఉప బ్రహ్మాణి వాఘతః" — ఋ. 1–3–5, 6.
'బ్రహ్మాణి వేదరూపాణి స్తోత్రాణి' — సా. భా.
"కణ్వాసో వాం బ్రహ్మ కృణ్వ న్త్యధ్వరే" — ఋ. 1–47–2.
'బ్రహ్మ, స్తోత్రరూపం మంత్రం' — సా. భా.
"దేవత్తం బ్రహ్మగాయత" — ఋ, 8–32–27.
'దేవప్రసాదలబ్ధం స్తోత్రం' — సా. భా.
"విశ్వేషా మి జ్జనితా బ్రహ్మణా మసి" — ఋ. 2–23–2
'విశ్వేషాం సర్వేషాం బ్రహ్మణాం జనితా' — సా భా.

"బ్రహ్మాణి హి చక్రషే వర్ధనాని" — ఋ. 6-23-6.
"స శ్రాంత స్తేపానో బ్రహ్మైవ ప్రథమ మసృజత
త్రయీ మేవ విద్యామ్" — శ. బ్రా. 6-1-1-5.
"బ్రహ్మ స్వయంభు సను మేవ మాగాత్" — తై. ఆ. 3-15-1.
"బ్రహ్మ ప్రావాదిష్మ తన్నో మాహాసీత్" — తై. ఆ. 4-42-5.
"తస్మా దేతత్ బ్రహ్మ నామరూప మన్నం చ జాయతే

— ము. ఉ. 1-1-9.

"అగ్ని వాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్ ।
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం ఋగ్యజుః సామలక్షణమ్॥"

— మను. స్మృ. 1-23.

"తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే" — భాగ. 1-1.
"బ్రహ్మాక్షర సముద్భవమ్" — భ గీ. 3-15.

ఇట్లు శ్రుతి స్మృతుల యందు వేదమునకును, వేదమంత్రములకును వాచకమై బ్రహ్మశబ్దము ప్రసిద్ధమై యున్నది. ఇట్లు నీ శబ్దము నపుంసకలింగమై వేదమునకును, మంత్రమునకును, వేదమంత్రరూపస్తోత్రమునకును వాచక మగుట గమనార్హము. అందుచే 'నపుంసకలింగ మగు నీ శబ్దము వేదమున బ్రాహ్మణజాతి వాచకమే యగును' -ఇత్యాది చారిత్రికుల వైదికకోశవచనము లాదరణీయములు కావు; శ్రుతి స్మృతి విరుద్ధములు.

## బ్రహ్మశబ్దము - నిర్వచనము :-

"బ్రహ్మ బృంహణాత్ బృంహంతి వర్ధతే నిరతిశయ
మహత్త్వలక్షణవృద్ధిమాన్ భవతీత్యర్థః వేదః"—శబ్దకల్పద్రుమః.

బ్రహ్మ యనగా బృంహణశీలము గలది. ఇంతయని పరిమితిలేని వర్ధనము (వృద్ధిబృ) హణము: పరిమితులు గల వస్తువుల యొక్క వృద్ధి వాని కంటె

మహత్తరమైన వస్తువుల యొక్క వృద్ధి కంటె న్యూనమై పూర్ణము గాదు. నిరతిశయమహత్త్వము గల వృద్ధి పూర్ణమై విరాజిల్లును. అట్టి పూర్ణతతో, లేక నిరతిశయమహత్త్వముతో నొప్పునది బ్రహ్మ. అట్టి మహత్త్వము లేక పూర్ణత్వము గలది యగుటచే వేదము బ్రహ్మ యగును- అని యర్థము.

## పరమాత్మ - బ్రహ్మత్వము :-

ఇట్టి పూర్ణతాలక్షణమైన బృంహణముతో నొప్పుటచే బ్రహ్మశబ్దము పరమాత్మకును వాచకము.

"బ్రహ్మశబ్దస్య హి వ్యుత్పాద్యమానస్య నిత్యశుద్ధత్వాదయోఽర్థాః
ప్రతీయన్తే, బృహతే ర్ధాతో రర్థానుగమాత్"

—శం భా. బ్ర. సూ. జిజ్ఞాసాధికరణమ్.

శ్రుతౌ సూత్రే బ్రహ్మశబ్దస్య ప్రయోగాఽన్యథాఽనుపపత్త్యా కశ్చిదర్థోఽస్తీతి జ్ఞాయతే। ప్రమాణవాక్యే నిరర్థక శబ్ద ప్రయోగదర్శనాత్ । సచార్థో మహత్వ రూప ఇతి వ్యాకరణా న్నిశ్చీయతే । 'బృహి వృద్ధౌ' ఇతి స్మరణాత్ । సా చ వృద్ధి ర్నిరవధికమహత్త్వ మితి, సంకోచకాఽభావాత్ శ్రుతౌ వసంతపదేన సహ ప్రయోగాచ్చ జ్ఞాయతే, నిరవధికమహత్త్వం చాంతవత్త్వాది దోషవత్త్వే సర్వజ్ఞత్వాది గుణహీనత్వే చ న సంభవతిః లోకే గుణహీనదోషవతో రల్పత్వప్రసిద్ధేః । అతో బృంహణా ద్బ్రహ్మేతి వ్యుత్పత్త్యా దేశకాల వస్తుతః పరిచ్ఛేదాభావరూపం నిత్యత్వం ప్రతీయతే.... ఏవం సకలదోషశూన్యం నిర్గుణమ్ ప్రసిద్ధమ్ । తథా సర్వజ్ఞత్వాది గుణకం చ తత్పదవాచ్యం ప్రసిద్ధమ్" —రత్నప్రభా.

పై వాక్యముల బరిశీలించుచో బ్రహ్మశబ్దము నిరతిశయ మహత్త్వ లక్షణము గల వేదమునకు వాచకమైనట్లే నిరతిశయమహత్త్వ లక్షణము గల పరమాత్మకు (సగుణ నిర్గుణ బ్రహ్మలకు) వాచక మగుట స్పష్టము. కనుక, బ్రహ్మశబ్దము గూడ, వేద - ఋషి శబ్దములవలె, పరమాత్మకును వేదమునకు వాచకము. పరమాత్మకు గల యీ నిరతిశయమహత్త్వమును శ్రుతు లిట్లు చెప్పుచున్నవి.

"ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్ పరః ॥
మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః ।
పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః ॥

—కఠ. ఉ. 3-10.

ఇట స్థూలములగు ఇంద్రియములు మొదలుకొని సూక్ష్మతారతమ్య క్రమమున నన్నిటికంటె పరమాత్మయే సూక్ష్మతరుడు, సర్వకారణ కారణము, సర్వమహత్తరుడు, సర్వవ్యాపకుడు నగుటచేతనే 'పురుషుడు' అనియు నిర్దేశింపబడినాడు. పురుష దనగా సర్వపురాణస్వభావము గలవాడు' (పురుషః సర్వపూరణాత్ శం. భా) 'సహస్రశీర్షా పురుషః - ఏవేదం సర్వమ్' - అనుచు నిట్టి పురుషు నుద్దేశించి ప్రవృత్తమైనదే పురుషసూక్తము. ఈ సూక్తము ఋగ్వేదమునందును, వేదశాఖ లన్నిటియందును గలదు. ఈ పురుషుని యొక్క నిరతిశయమహత్త్వమును లేక సర్వవ్యాపకత్వమును

'తద్విష్ణోః పరమం పదమ్; ఋచో అక్షరే పరమే వ్యోమన్;
యో అధ్యక్షః పరమే వ్యోమన్; ఇద మస్మి; అయ మస్మి సర్వః'

-అని యీ రీతిగ ఋగ్వేదము పెక్కు రీతుల నిరూపించినది. ఇంతే. కాదు.

"హంసః శుచషత్.... ఋతం బృహత్" —ఋ. 4-40

అనయా సౌర్యర్చా -' య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః
పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః (ఛా. ఉ. 1-6-6)' - ఇత్యాది
శ్రుతుక్తో మండలాభిమానీ దేవోఽస్తి, యశ్చ సర్వప్రాణి
చిత్తరూప స్థితః పరమాత్మా, యచ్చ నిరస్త సమస్తోపాధికం
పరంబ్రహ్మ తత్సర్వ మేక మేవేతి ప్రతిపాద్యతే .... ఋతం
బృహత్ సత్య మబాధ్యం సర్వాధిష్ఠా । బ్రహ్మతత్త్వమ్"—సా. భా.

ఋగ్వేద మిట్టి మంత్రములచే సత్యము, నిరతిశయ మహత్త్వలక్షణము, సర్వజగదధిష్ఠానభూతము నగు నా పురుషుని యొక్క బృంహణశీలము నభివ్యక్తము జేసినది. మఱియు కొన్ని యెడల-

"బృహచ్ఛరీరో: విమిమాన ఋక్వభిః"—. ఋ. 1-155-6.

ఇత్యాది మంత్రములయందు 'బృహచ్ఛరీరః' - అనుచు ముక్తకంఠముగ పరమాత్మయొక్క బృహత్త్వము నభివర్ణించినది. (ఏవం కాలాత్మకః విష్ణుః బృహచ్ఛరీరః విరాడాత్మనా సర్వదేవ మనుష్యాది శరీరాణాం స్వశరీరత్వాత్ । బృహచ్ఛరీరత్వ మేవోపపాదయతి .... సా. భా) ఇంతేకాదు. ఆ పరమ పురుషుని 'బ్రహ్మ' శబ్దముచే ఋగ్వేదము పలుచోట్ల పేర్కొనినది.

బ్రహ్మ దేవానాం పదవీః కవీనాం" ఋ. 9-96-6; తై. ఆ. 10-10-1.

ఇది పరమేశ్వర విభూతిప్రతిపాదక మంత్రము. అగ్నీంద్రాది దేవతలలో బ్రహ్మయై (చతుర్ముఖుడై) పరమేశ్వరుడు నియామకు డగుచు విలసిల్లు చున్నాడు (దేవానా మగ్నీంద్రాదీనాం మధ్యే బ్రహ్మ చతుర్ముఖో భూత్వా పరమేశ్వరో నియామకత్వే నావతిష్ఠతే - సా. భా) – అని యర్థము.

"ఇంద్రో బ్రహ్మే ంద్ర ఋషిః" — ఋ. 8-16-7.
"ఇంద్రో బ్రహ్మ బ్రాహ్మణాత్ సుష్టుభః" —అ. సం. 20-2-3.
'ఇంద్రః పరమైశ్వర్యాది గుణయుక్తో దేవః, స ఏవ బ్రహ్మ।
బృహత్వాద్ బ్రాహ్మణత్వా చ్చ । ఇంద్రస్య బ్రహ్మాత్మనా స్తుతిః,
'ఇంద్రో బ్రహ్మేంద్రఋషిః (ఋ. 8-16-7)' – ఇత్యాది మంత్రవర్ణా దవగంతవ్యా' — అ. సం - సా. భా.

ఇట ఋగ్వేదమునందును, అథర్వవేదమునందును పరమైశ్వర్యాది గుణయుక్తుడగు ఇంద్రుడు బృంహణశీలము గలవాడగుటచే బ్రహ్మ యని స్తుతింపబడినాడు.

"బ్రహ్మాణం బ్రహ్మవాహసమ్" -ఋ. 6-45-7-
'బ్రహ్మాణం పరివృఢం, బ్రహ్మవాహసం బ్రహ్మభిః
స్తోత్రైర్వహనీయమ్' —సా. భా.

"సఖాయో బ్రహ్మ వాహ సేఽర్చత" —ఋ, 6-45-4.

'బ్రహ్మవాహసే బ్రహ్మభి ర్మంత్రై ర్వహనీయాయ ప్రాప్తవ్యా యేంద్రాయ' సా, భా.

ఇట నపుంసకలింగ బ్రహ్మశబ్దము మంత్రవాచకముగను, పుంలింగ బ్రహ్మ శబ్దము పరమాత్మవాచకముగను, బ్రయోగింపబడుట స్పష్టము. బ్రహ్మ యగు పరమేశ్వరుడు బ్రహ్మవాహను డని యర్థము. బ్రహ్మలచే – మంత్రములచే – ప్రాప్యుడు లేక ప్రతిపాద్యు డని భావము. కాన 'వేదములందు పుంలింగ బ్రహ్మశబ్దము పురోహితు డను నర్థమునందును, నపుంసకలింగ బ్రహ్మశబ్దము బ్రాహ్మణజాతి యను నర్థమునందుమాత్రమే ప్రసిద్ధము'- అనెడి చారిత్రికుల వచనము శ్రుతిస్మృతిసంప్రదాయ విరుద్ధము. బ్రహ్మ శబ్దము ఉపనిషత్తుల యందును, పురాణేతిహాసాదులయందును, నెట్లు పరతత్త్వవాచకముగను వేద వాచకముగను బ్రసిద్ధమో యట్లే ఋగ్వేదమునను బ్రసిద్ధమై యుండుట దర్శించితిమి. అనగా బ్రహ్మశబ్దార్థవిషయమున చారిత్రికు లూహించెడి —క్రమపరిణతి శ్రుత్యభిమతము గాదు. ఇట్లు పరతత్త్వమే గాదు. పరమేశ్వరుని తర్వాత హిరణ్యగర్భుడును శ్రుతులయందు బ్రహ్మపదముచే గీర్తింపబడినాడు.

"యో బ్రహ్మణం విదధాతి పూర్వం యో వై వేదాం శ్చ
ప్రహిణోతి తస్మై" -గో.పూ.4-[illegible]; శ్వేతా, ఉ. 6-18.

"యత్త త్కారణ మవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్।
త ద్విసృష్టః స పురుషో లోకే బ్రహ్మేతి కీర్త్యతే॥ -మను. 1-10.

"బ్రహ్మ దేవానాం ప్రథమ స్సంబభూవ విశ్వస్య కర్తా
భువనస్య గోప్తా" -ముం. 1-1.

ఈ హిరణ్యగర్భునియొక్క బ్రహ్మత్వమును (పరివృద్ధత్వమును) స్మృతు లిట్లు వివరించినవి.

"జ్ఞానమప్రతిమం యస్య వైరాగ్యం చ జగత్పతేః॥
ఐశ్వర్యం చైవ ధర్మ శ్చ సహసిద్ధం చతుష్టయమ్॥"

ఇతి స్మరణాత్ ధర్మ జ్ఞాన వైరాగ్యైశ్వర్యైః సర్వా నన్యా
నతిక్రమ్య వర్తత ఇతి పరివృఢత్వం సిద్ధ మిత్యర్థః

--ఆనందగిరి. ముం.ఉ. 1-1.

హిరణ్యగర్భునకు ధర్మ జ్ఞాన వైరాగ్యైశ్వర్యములు సహజసిద్ధములు వీనిచే నందఱ నతిశయించి సర్వమహత్తరుడై వర్తిల్లుట జేసి యీయనకు బ్రహ్మత్వము (పరివృఢత్వము) సిద్ధమైనది- అని యర్థము. ఋగ్వేదము 'హిరణ్యగర్భః సమవర్తతాగ్రే' అని యనుచు, నొక సూక్తముచే (10-121) ప్రజాపతి యగు హిరణ్యగర్భునియొక్క నిరతిశయమహత్త్వలక్షణ బ్రహ్మత్వము నభివ్యక్తము చేసి యున్నది. ఇంకను పెక్కు నామములతో నీ ప్రాణదేవుని మహత్వమును కీర్తించుటను మున్ముందు గాంచగలము. ఇక వేదముయొక్క బ్రహ్మత్వమును పరిశీలింతము.

## వేదము - బ్రహ్మత్వము :-

వేదపురుషుడగు బ్రహ్మను ప్రతిపాదించునది యగుటచే వేదశబ్దరాశికిని బ్రహ్మయని యన్వర్థనామము.

"బ్రహ్మశబ్దో జగత్కారణే పరమాత్మని ముఖ్యతయా వేదే
ప్రయుజ్యతే తథా చైతరేయిణః స్వకీయోపనిషది సమా
మనంతి -- 'ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ' ఇతి।
తైత్తిరీయాశ్చ -- 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ఇతి'।
వాజసనేయినశ్చ -- విజ్ఞాన మానందం బ్రహ్మ" ఇతి।
ఏవం సతి బ్రహ్మశబ్దస్య తత్ప్రతిపాదక వర్ణమాత్ర
పరత్వేఽపి పరం బ్రహ్మణః సహసా బుద్ధిస్థత్వా
దర్థా న్మంగళాచరణం సంపద్యతే। తస్య బ్రహ్మణః ప్రతి
పాదకత్వేన వేదోఽపి బ్రహ్మ శబ్ద స్యార్థః। తతో గ్రంథాదౌ
వేదపురుషోఽప్యనుస్మృతో భవతి" -- తై. బ్రా. 1-1-1. సా. భా

తైత్తిరీయబ్రాహ్మణము 'బ్రహ్మ సంధత్తం' అనుచు బ్రహ్మ శబ్దముతో ప్రారంభమగుచున్నది. వేదమున బ్రహ్మశబ్దము ముఖ్యముగా నుపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మ యందే యుపయుక్తమగుచున్నది. అట్టి బ్రహ్మను ప్రతిపాదించునది యగుటచే వేదముకూడ బ్రహ్మశబ్దవాచ్యమగుచున్నది. అందుచే నీ గ్రంథాదియందున్న బ్రహ్మ శబ్దము వేదమును, వేదపురుషుని- ఇరువురిని బోధించుచు మంగళవాచక మగుచున్నది -యని అర్థము. ఈ విషయమును శ్రుతియే యిట్లు చెప్పుచున్నది.

'బ్రహ్మాయం వాచః పరమం వ్యోమః' — ఋ. 1-164-35.
'బ్రహ్మపై వాచః పరమం వ్యోమః — తై. బ్రా. 3-9-5-౦

మంత్రాది రూపమగు నీ వాక్కునకు పరమలక్ష్యము, ఆ వాగుత్పత్తికి గారణమైన పరమ పదము నీ బ్రహ్మయే - యనుచు ఋగ్వేదము కీర్తించినది. (అయం బ్రహ్మ ప్రజాపతిరేవ వాచః మంత్రాది రూపాయాః పరమం వ్యోమ ఉత్కృష్టం రక్షకం స్థానం। తత్రైవోత్పత్తే స్తత్రైవపర్యవసానాచ్చ — సా. భా.)· కనుక వేదపురుషునినుండి యావిర్భూతమైన తనయొక్క పరమ లక్ష్యము వేద పురుషుడగు బ్రహ్మయే యనిశ్రుతి తన స్వభావమును వివరించికొనుట యిట గాంచ నగును. ఇంతేగాదు. ఋగ్వేదము మరియొక ఋక్కుచే వాక్కుయొక్క నిరతిశయ మహత్త్వము నిట్లు కీర్తించినది.

"యావ ద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్" — ఋ 10-114-8.

"యావ ద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాగితి యత్ర హ క్వ చ
బ్రహ్మ త ద్వాక్ యత్ర వా వాక్ తద్వా బ్రహ్మే త్యేత
దుక్తం భవతి" ఐ. బ్రా. 1, 3, 8, 16.

"బ్రహ్మై వాభిధేయం జగత్పదార్థరూపేణ యత్రాస్తి
తత్రాభిధాయకం నామ। తథా యత్ర యత్ర వాచకః
శబ్దః తత్రాభిధేయ పదార్థం బ్రహ్మ - ఇత్యేవ మన్యోన్య
వ్యాప్తి స్వరూపం భవతి" — సా. భా

ఋగ్వేద మిట్టి మంత్రములచే సత్యము, నిరతిశయ మహత్త్వలక్షణము, సర్వజగదధిష్ఠానభూతము నగు నా పురుషుని యొక్క బృంహణశీలము నభివ్యక్తము జేసినది. మఱియు కొన్నియెడల-

"బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిః"—. ఋ. 1-155-6.

ఇత్యాది మంత్రములయందు 'బృహచ్ఛరీరః' - అనుచు ముక్తకంఠముగ పరమాత్మయొక్క బృహత్త్వము నభివర్ణించినది. (ఏవం కాలాత్మకః విష్ణుః బృహచ్ఛరీరః విరాడాత్మనా సర్వదేవ మనుష్యాది శరీరాణాం స్వశరీరత్వాత్। బృహచ్ఛరీరత్వ మేవోపపాదయతి .... సా. భా) ఇంతేకాదు. ఆ పరమ పురుషుని 'బ్రహ్మ' శబ్దముచే ఋగ్వేదము పలుచోట్ల పేర్కొనినది.

బ్రహ్మా దేవానాం పదవీః కవీనాం" ఋ. 9-96-6; తై. ఆ. 10-10-1.

ఇది పరమేశ్వర విభూతిప్రతిపాదక మంత్రము. అగ్నీంద్రాది దేవతలలో బ్రహ్మయై (చతుర్ముఖుడై) పరమేశ్వరుడు నియామకు డగుచు విలసిల్లు చున్నాడు (దేవానా మగ్నీంద్రాదీనాం మధ్యే బ్రహ్మా చతుర్ముఖో భూత్వా పరమశ్వరో నియామకత్వే నావతిష్ఠతే - సా. భా) – అని యర్థము.

"ఇంద్రో బ్రహ్మే బ్రహ్మణః" — ఋ. 8-16-7.
"ఇంద్రో బ్రహ్మ బ్రాహ్మణాత్ సుష్టుభః" —అ. సం. 20-2-3.
'ఇంద్రః పరమైశ్వర్యాది గుణయుక్తో దేవః, స ఏవ బ్రహ్మా।
బృహత్వాద్ బ్రాహ్మణత్వా చ్చ। ఇంద్రస్య బ్రహ్మాత్మనా స్తుతిః,
'ఇంద్రో బ్రహ్మేంద్రఋషిః (ఋ. 8-16-7)' – ఇత్యాది మంత్రవర్ణా
దవగంతవ్యా' — అ. సం - సా. భా.

ఇట ఋగ్వేదమునందును, అథర్వవేదమునందును పరమైశ్వర్యాది గుణయుక్తుడగు ఇంద్రుడు బృంహణశీలము గలవాడగుటచే బ్రహ్మ యని స్తుతింపబడినాడు.

"బ్రహ్మాణం బ్రహ్మవాహసమ్" -ఋ. 6-45-7-
'బ్రహ్మాణం పరివృఢం, బ్రహ్మవాహసం బ్రహ్మభిః
స్తోత్రైహవిర్భిర్వా ప్రాపణీయమ్' -సా. భా.

"ద్రవ్యపక్షేఽపి సర్వశబ్దానాం అసత్యోపాధ్య వచ్ఛిన్నం బ్రహ్మ తత్త్వం వాచ్య మితి నిత్యతా" — కైయటః, మహాభాష్య పస్పశాహ్నికమ్.

లౌకిక భాషాపదములవలె గాక, గో, అశ్వాది పశువాచక పదములుగాని-గంగా సరస్వతీత్యాది నదీ నామములుగాని, అగ్నీంద్రాది దేవతానామములుగాని — ఇట్లు సంస్కృతపదము లన్నియును వ్యావహారికముగ నా యా యర్థముల బోధించునవి యైనను తమ తమ ప్రవృత్తి నిమిత్తములచే పరమార్థరూపుడగు బ్రహ్మ నుపలక్షింపజేయుట సంస్కృత భాషాస్వభావమని తెలియనగును. ఇట్లు దేవతాతత్త్వోపలక్షకము లగుటచేతనే వేదపదములను దేవ పదములని శతపథశ్రుతి యిట్లు కీర్తించినది.

'అప్యేకం దేవపద మధీయీతైవ' — శ. బ్రా. 1-15-69.

ఇంతేకాదు. సంస్కృతభాష యందలి యే యొక పదమునైన బాగుగ దెలిసికొని, ప్రయోగించినచో నా శబ్దము కామధేనువయి యిహపర లోకములందు గోరికల గురియించుననియు శ్రుతి చెప్పుచున్నది.

'ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే
కామధుక్ భవతి' —(చూ. పస్పశాహ్నికమ్ - మహాభాష్యమ్)

పై ప్రమాణములు రెండును సంస్కృతపదములలో నే యొక పదమునైన నధ్యయనము జేయు డనియు, ఏ యొక పదమునైనను దాని స్వభావమును జక్కగా బరిశీలించి ప్రయోగింపుడనియు ప్రబోధించుచున్నవి. రెండిటి తాత్పర్య మొక్కటియే.

ఏ పదము నధ్యయనము జేయ మొదలిడినను మొదట నా పదమునకు గల ప్రకృతి ప్రత్యయ విభాగాది సంస్కారము, ప్రవృత్తి నిమిత్తము పరిశీలింపవలసి యుండును. తరువాత శ్రుతి స్మృతి పురాణేతిహాస కావ్య నాటక కోశాదులయందు ఆ పదమునకు గల ప్రసిద్ధి దర్శింపవలసి యుండును. అప్పుడు ఆ పదము శతపథమై యర్థ గాంభీర్యముతో నొప్పుచు తుదకు పరమార్థోపలక్షకమై

యెట్లు వరలునో తెలియవలసి యుండును. అట్లు తెలిసి ప్రయోగింపవలసి యున్న దని శ్రుతి తాత్పర్యము. బీజము వృక్ష రూపమున విస్తరించినట్లు, సంస్కృత పదము మొదట లౌకికార్థబోధక మైనట్లు కన్పడియు పరిశీలనము చేయు కొలది యర్థ గాంభీర్యముతో సాక్షాత్కరించి, పెక్కు సంప్రదాయముల వివరించి మనన శక్తిని పెంపొందించి తన మహత్త్వమును (బృహత్త్వమును) గోచరింప జేయును. సామాన్యముగ వేదమున గల పదము లన్నియు నిట్టి లక్ష్యము గలవియే. అందుచే నవి దేవ పదము లని శ్రుతి తాత్పర్యము.

"నమో వృక్షేభ్యః హరికేశేభ్యః ---నమః కులాలేభ్యః కర్మారేభ్యః ---
---స్తేనానాం పతయే నమః---"

అని యీ రీతిగ రుద్రాధ్యాయము (తై. సం. 4-5; వా. సం. 16 మొ.) లోకమున సామాన్యముగ గోచరించెడి స్థావర జంగమాది పదార్థము లన్నియును తుదకు నింద్యు లగు స్తేనాదులు సైతము స్తుత్యర్హ దేవతా స్వరూపములే యని ముక్త కంఠముగ బేర్కొనుచున్నది లోకసిద్ధము లగు జడ వస్తువులకు గాని నింద్యులగు స్తేనాదులకు గాని స్తుత్యర్హత యెట్లు? అని యనవచ్చును. ఇట శ్రుతి నిఖిల పదార్థముల యందనుగతమై యున్న దేవతా తత్త్వమును లక్షింప జేయుటకే ప్రవృత్తమైనది. ప్రసిద్ధము లగు అర్థముల ద్వారా అప్రసిద్ధము (అలౌకికము) లగు అర్థములను శాఖాచంద్ర న్యాయమున నిట ప్రదర్శించుచున్నది. స్తేనాది శరీరములందు ఈశ్వరుడు జీవరూపముననను, ఈశ్వర రూపముననను ద్వివిధముగ నుండును. అందు జీవరూప మగు అర్థము స్తేనాది శబ్దములకు వాచ్యార్థము. అదియే శాస్త్రము లందు నిందితము. ఈశ్వరరూప మగు అర్థము లక్షితము. ఇదియే యిట అనుసంధాతవ్యము, స్తుత్యర్హము నగు అర్థము. ఇట్లంతట ననుగతమై యుండి ఈశ్వరత్వమును అను సంధానము

చేయుట పాపక్షయ హేతువు, పరమ పురుషార్థమున్ను ఈ విషయము నుద్దీపింప జేయుటకే—లక్ష్యార్థ వివక్షచేతనే వేదములందు లౌకిక శబ్దములు ప్రయోగింప బడు చుండును. 1

ఈ విషయమై నిరుక్తము కూడ నిట్లే జెప్పినది దేవతలు కానట్టి అశ్వాదులు వేదము లందు స్తుతింపబడు టెట్లు? లేక, అవి దేవతలు కాక పోయినను దేవతల వలె స్తుతింపబడుచున్నవా? — అను పూర్వ పక్షములను పరాస్తము జేసి, "అశ్వాదు లన్నియు దేవతా నామములే; అశ్వాదుల స్తుతి దేవతా స్తుతియే – అని సిద్ధాన్తీ కరింపబడినది (నిరు. 7–4) మఱియు "ఓషధే త్రాయ స్వైనం; స్వధితే మైనం హింసీః" — ఇత్యాది వేద వాక్యముల యందు గన్పట్టు ఓషధి — స్వధితి శబ్దములు లౌకికములైన ఓషధి రూపా ద్యర్థములనే కాక తదధి ష్ఠానదేవతా వాచకములు కూడ నగు నని శ్రుతి తాత్పర్యానుగుణముగ నిరూపింప బడినది. (నిరు. 1–15; చూ. జై. సూ. 1–2-35; 1–2-46) కాన వేదపదము లన్నియు వేదపదములే.

ఇట్టి పదములతో నొప్పి బ్రహ్మతత్త్వమును ప్రతిపాదించుటకై యవ తరించిన వేదము నిరతిశయ మహత్త్వము గలది యగుట సూచితమగుచున్నది. ఇంతేగాక పరమేశ్వరు డనంతు డగుటచే నా యనంతత్వమును ప్రబోధించుటకై

1. "స్తేనాది శరీరేషు రుద్రో ద్వేధా వర్తతే – జీవరూపే ణేశ్వర రూపేణ చ తత్ర చ య జ్జీవరూపం తత్ స్తేనాది శబ్దానాం వాచ్యః అర్థః స ఏవ శాస్త్రేషు నింద్యః య త్త్వీశ్వర రూపం తత్ స్తేనాది శబ్దై రూప లక్ష్యతే తదను సంధానం తు పాపక్షయ హేతుత్వేన పరమ పురుషార్థ ఇతి లక్ష్యార్థ వివక్షయా మంత్రేషు లౌకికాః శబ్దాః ప్రయుజ్యన్త ఇతి ద్రష్టవ్యమ్ ఉపలక్షక వాచ్యార్థ ద్వారేణ లక్ష్యార్థో ముగ్ధై రపి సహసా సమ్యగ్బోద్ధుం శక్యతే యథా శాఖాగ్రే చంద్ర ఇత్యత్ర తస్మాత్ లక్ష్యార్థస్యైవ వివక్షయా మపి సుఖావబోధ ద్వారత్వేన ముఖ్యార్థ వాచకాః శబ్దాః ప్రయోక్తవ్యాః"

— సా. భా. తై. సం. 4-5-6-1-

యనంతవేదము లావశ్యకము లయినవి. 'అనంతా వై వేదాః' (తై. బ్రా. 3-10-11-4) అని శ్రుతి తన యనంతత్వమును చెప్పుకొనినది. ఇట్లు అర్థ గాంభీర్యముతో నొప్పెడి దేవ పదములతో సముల్లసితమై యనంతునివలె ననంతశాఖలతో ననంతరూపిణియై, బ్రహ్మకును తనకును గల నిత్య సంపృక్తత్వమును ప్రబోధించుచు శ్రుతి 'బ్రహ్మ' యను సార్థక నామముతో వరలినది. ఇంతేగాదు. శ్రుతియే తనయొక్క బ్రహ్మత్వమును నింకొక తీరుగ గూడ నిట్లు నిర్వచించుకొనుచున్నది.

("వాగితి) ఏత దేషాం (నామ్నాం) బ్రహ్మైతద్ధి
సర్వాణి నామాని బిభర్తి" — శ. బ్రా. 14-4-4-1.

మృత్తు సామాన్యరూపము. ఘటాదులు తద్విశేష రూపములు. ఘటాది విశేషరూపములకు సామాన్యరూపమగు మృత్తు ఉపాదాన కారణము. అట్లే వాక్కు సామాన్యరూపము. నామములు తద్విశేషరూపములు. విశేష రూపములగు నామములకు వాక్కు ఉపాదాన కారణము. వాక్కు ఉపాదాన కారణమై వాగ్విశేషములగు నామముల భరించుచున్నది. కాన భరణ రూపమగు ప్రవృత్తి నిమిత్తముచే వాక్కు బ్రహ్మ యగునని భావము. మఱియు కారణము కంటె కార్యము భిన్నము కాదు. అందుచే శ్రుతులయందు వాక్కు, వాగ్విశేషమగు వేదము కూడ బ్రహ్మ యని పలుచోట్ల కీర్తింపబడినది.

"వాగ్వై బ్రహ్మ" — ఐ. బ్రా. 6-3, శ. బ్రా. 2-1-4-10.
"వాక్ బ్రహ్మ" — గో. పూ. 2-10.
"సా యా సా వాక్ బ్రహ్మైవ తత్" — జై. ఉ. 2-13-2.
"వా గితి త ద్బ్రహ్మ" ॥ — 2-9-6.
"వాగ్ధి బ్రహ్మ" — ఐ. బ్రా. 2-15; 4-21.
"వేదో బ్రహ్మ" — జై. ఉ. 4-25-3.

వేదవాక్కు సర్వనామముల ధరించుచు సృష్టియందు బ్రహ్మకు సహకారి కారణమై యొప్పుట 'వేద - ఋషి - ప్రథమజా' శబ్దములందు వివరింపబడినది. కాన ఇట్లు సర్వనామములను ధరించుటచేతను (బిభర్తి) వేదములకు బ్రహ్మ యని యన్వర్థ సంజ్ఞ, 'బిభర్తి సర్వభూతాని వేద శాస్త్రం సనాతనమ్' అనెడి మనుస్మృతి వాక్యము గూడ నీ విషయమునే యుపలక్షింప జేయుచున్నది.

## బ్రహ్మర్షి :-

బ్రహ్మర్షి పద పరిశీలనము వలనను వేదము యొక్క బ్రహ్మత్వ మభివ్యక్తమగును. వసిష్ఠాదులకు బ్రహ్మర్షులని ప్రసిద్ధి. 'బ్రహ్మ వేదం పర బ్రహ్మ వా ఋషతి వేత్తీతి। వసిష్ఠాది మునిగణః' — అని బ్రహ్మర్షి పద నిర్వచనము (చూ. శబ్ద. ద్రు; వాచ.). వేదమును గాని, పరబ్రహ్మను గాని యపరోక్షముగ సాక్షాత్కరింప జేసికొనినవాడు — అని యర్థము. అప రోక్ష బ్రహ్మాత్మానుభవము గలవాడు, స్వయంప్రతిభాత వేదుడు బ్రహ్మర్షి యగు నని భావము. వసిష్ఠాదు లటివారు. రామాయణమునందలి విశ్వామిత్ర వృత్తాంత మీ విషయమును వివరించును.

"తతః సురగణాః సర్వే పితామహ పురోగమాః।
విశ్వామిత్రం మహాత్మానం మధురం వాక్య మబ్రువన్ ॥
బ్రహ్మర్షే స్వాగతం తేఽస్తు తపసా స్మ సుతోషితాః।
బ్రాహ్మణ్యం తపసోగ్రేణ ప్రాప్తవానసి కౌశిక ॥
దీర్ఘ మాయుశ్చ తే బ్రహ్మన్ దదామి సమరుద్గణః।
స్వస్తి ప్రాప్నుహి భద్రం తే గచ్ఛ సౌమ్య యథాసుఖమ్ ॥

పితామహవచః శ్రుత్వా సర్వేషాం చ దివౌకసామ్ ।
కృత్వా ప్రణామం ముదితో వ్యాజహార మహామునిః ॥
బ్రాహ్మణ్యం యది మే ప్రాప్తం దీర్ఘ మాయు స్తథైవ చ ।
ఓంకారశ్చ వషట్కారో వేదాశ్చ వరయంతు మామ్ ॥

విశ్వామిత్రుడు బ్రహ్మర్షిత్వము సిద్ధించుటకై ఘోర తప మొనర్చెను. ఆ తపమునకు మెచ్చి దేవతాగణ సమేతుడై బ్రహ్మ సాక్షాత్కరించి — "ఓ బ్రహ్మర్షీ! ఉగ్రతపశ్చర్యా ఫలముగ బ్రాహ్మణ్యము (బ్రహ్మర్షిత్వము) సిద్ధించి నీ కోరిక ఈడేరినది. చిరజీవివై సుఖ భద్రములతో వర్ధిల్లుము" అని పలికెను. అంతట విశ్వామిత్రుడు ప్రహృష్టాంతరంగుడై చేతులు జోడించి యా దేవసేవున కిట్లనియెను. "బ్రాహ్మణ్యము దీర్ఘాయుస్సు నాకు సిద్ధించుచో ఓంకారము, వషట్కారము, వేదములను స్వయముగ నాకు భాసించుగాక (మాం వరయంతు స్వత ఏవా యాంతు – మహేశ్వర తీర్థః) — అని యర్థము.

ఈ కథా సందర్భమును బట్టి యెవనికి స్వయముగ ఓంకార వషట్కార వేదములు భాసించునో – అనగా నెవడు స్వయంప్రతిభాత వేదుడో – యతడు బ్రహ్మర్షి యని బ్రహ్మర్షి లక్షణము దెలియనగును. కాన పరబ్రహ్మమునుగాని, వేదమును గాని దర్శించినవాడు బ్రహ్మర్షి – యనెడి పైన జెప్పిన నిర్వ చనము సమన్న మగును. (చూ. వషట్కార శబ్దము). ఇటు బ్రహ్మయొక్క యను గ్రహము చేతనే విశ్వామిత్రునకు బ్రహ్మ భాసించి బ్రహ్మర్షి యయ్యెనని తెలియు చున్నది. ఇట్టి సంప్రదాయము శ్రుతి స్మృతి పురాణేతిహాసముల యందు బహుళ ముగ గాననగును. ఇతిహాస పురాణాదులయందు గన్పట్టెడి యిట్టి కథ లతి శయోక్తులు కావు; వానిని యథాస్థితార్థ కథనములుగనే గ్రహింపనగును — అని శ్రీ శంకర భగవత్పాదులు బ్రహ్మసూత్ర దేవతాధికరణమున (1-3-33) నిట్లు వివరించిరి.

"తస్మా ద్ధర్మోత్కర్షవశా చ్చిరంతనా దేవాదిభిః ప్రత్యక్షం వ్యవ జహ్రు రితి శ్లిష్యతే । అపిచ స్మరంతి - స్వాధ్యాయా దిష్టదేవతా సంప్రయోగః (యో. సూ. 2-44). - ఇత్యాది । యోగో ఽప్యణిమాద్యైశ్వర్య ప్రాప్తిఫలః స్మర్యమాణో న శక్యతే సాహసమాత్రేణ ప్రత్యాఖ్యాతుమ్ । శ్రుతిశ్చ యోగ మాహాత్మ్యం ఖ్యాపయతి — 'పృథివ్యప్తేజో ఽనిల ఖే సముత్థితే, పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే । న తస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్ని మయం శరీరమ్ ॥ (శ్వేతా. ఉ. 2-12.)

— ఋషీణా మపి మంత్ర బ్రాహ్మణ దర్శినాం సామర్థ్యం నాస్మదీయేన సామర్థ్యే నోపమాతుం యుక్తమ్ । తస్మాత్ సమూల మితిహాస పురాణమ్ ।"

తత్త్వావబోధమునకు వేదవిహిత కర్మానుష్ఠానముతోపాటు యమనియమా ద్యష్టాంగ యోగ సంపత్తియు నావశ్యకము. స్వాధ్యాయము వలన నిష్ట దేవతా సాన్నిధ్యము, దేవతలతోడి సంభాషణము సిద్ధించునని పాతంజల యోగసూత్రము చెప్పుచున్నది. యోగ విద్య యోగాగ్నిమయ దేహమును, అణిమాద్యష్టైశ్వర్యము లను బ్రసాదించి దైవీశక్తి సంపన్నుని గావించునని శ్వేతాశ్వతరశ్రుతి చెప్పు చున్నది. అట్టి యోగవిద్య లేదు - అని చెప్పుట సాహసమే యగును. మన ప్రాచీన ఋషు లిట్టి దైవీశక్తి సంపన్నులు, మంత్ర బ్రాహ్మణ ద్రష్టలు నయి వెలుగొందిరి. స్వాధ్యాయ తపోయోగ నిష్ఠితులయిన యా బ్రహ్మర్షుల సామర్థ్య మును మన సామర్థ్యముతో బోల్చి చూచుకొనుట యెంత మాత్రము సమంజసము కాదు. ధర్మపరాయణులై ధ్యాన పారవశ్యమున నుండి వా రాయా దేవతలతో బ్రత్యక్షముగ మాటలాడిరనుట యుక్తమే. కాన నట్టి గాథాదికమును వివరించు నితిహాస పురాణములు సప్రమాణములే గాని నిష్ప్రమాణములు గావు — అని యర్థము.

కాన బ్రహ్మ విశ్వామిత్రునకు వేదము లను 'మనసా' - సంకల్ప మాత్ర మున నే - అనుగ్రహించుట, విశ్వామిత్రునకు స్వయముగ వేదములు భాసించి బ్రహ్మర్షి యగుట యను నీ గాథయు సప్రమాణమే యగునని గ్రహింపనగును. కావుననే దర్శనకారులందఱును మహామహిమ ప్రఖ్యాపకమైన యీ యోగవిద్య నాదరించిరి మన ప్రాచీనాచార్యులును వేదవిహిత కర్మానుష్ఠానపరులు మాత్రమే కాక, యోగశక్తి సంపన్నులు నగుచు దర్శన స్పర్శనాదులచేతనే శిష్యులకు సకల వేదములు, శాస్త్రములు భాసించునట్లను గ్రహింపగల్గిరి 'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' - అనుచు శ్రుతియు, 'తేనే బ్రహ్మ హృదా య ఆది కవయే' — యనుచు భాగవతమును నిట్టి సంప్రదాయమును సూచించుచున్నవి యోగేశ్వరుడగు పరమేశ్వరు డాదికవి యగు బ్రహ్మకు వేదము లను 'మనసా' యను గ్రహించెనని భావము. ఈ సంప్రదాయమునే మహా భారతము పౌష్య పర్వమున ధౌమ్య శిష్యగాథా రూపమున వెలయించినది. అందు ధౌమ్యుడు శిష్యుల బలరీతుల బరీక్షించి వారుత్తమాధికారులని తెలిసికొని - 'సర్వే వేదాస్తే ప్రతిభాస్యన్తి, ధర్మశాస్త్రాణి చ' — అన్ని వేదములును ధర్మశాస్త్రము లును భాసించు గాక యని వారి ననుగ్రహించుట కాననగును ఇట్లు స్వమహిమా త్మకములు లేక స్వశక్తి స్వరూపములగు విద్యలను అధికారులగు శిష్యులకు 'మనసా' యనుగ్రహించుటయే 'శక్తిపాతము' — అను పేర ప్రసిద్ధమైనది.

"జ్ఞానం వేదాంత వాక్యోత్థం బ్రహ్మాత్మైకత్వ గోచరమ్ ।
తచ్చ దేవప్రసాదేన గురోః సాక్షా న్నిరీక్షణాత్ ॥
జాయతే శక్తి పాతేన వాక్యా దేవాధికారిణామ్ ।"

— సూత. సం. 4-8-7.

ఉత్తమాధికారియైన శిష్యునకు దేవతాప్రసాదముచే, అనుగ్రహపూర్ణమగు గురువుయొక్క ప్రసన్న వీక్షణము చేతనే, శక్తిపాతముద్వారా, వేదాంత మహా వాక్య జన్య—అపరోక్ష బ్రహ్మాత్మానుభవము సిద్ధించును - అని యర్థము.

ఆచార్యునియందు ప్రతిష్ఠితమైయున్న విద్య శిష్యుని యందును జాగరితమగునని భావము. ఇదియే శక్తిపాతము. విద్య భాసించుటకు శిష్యునియందు ప్రతిబంధకముగా నున్న యజ్ఞానావరణము ఈశ్వరానుగ్రహము వలనను, గుర్వనుగ్రహము వలనను దొలగి, నిరావరణమైన శిష్యుని మనోవీధియందు విద్య స్వయముగ భాసించుటయే జాగరితమగుట యని గ్రహించనగును. ఈ సంప్రదాయ మనూచానముగ భారతదేశమున నెలకొనియున్నది. ఈ సంప్రదాయమును పార్వతీ విద్యాభ్యాస వర్ణనావ్యాజమున మహాకవి కాళిదాసు కుమార సంభవ కావ్యమున (1-30) నిట్లు గుర్తింప జేయుచున్నాడు;

"తాం హంసమాలాః శరదీవ గంగాం
మహౌషధీం నక్తమివాత్మభాసః
స్థిరోపదేశా ముపదేశకాలే
ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః ॥"

హంసశ్రేణులు శరత్కాలమున గంగను బొందునట్లును, రాత్రులందు మహౌషధులు తమ కాంతులను బొందునట్లును, గురూపదేశకాలమున పార్వతిని ప్రాక్తన జన్మ విద్యలు పొందినవి—అని యర్థము.

ఇట గమనించవలసిన యంశములు గలవు హంసలన్నియు నొక్కమాఱుగా గంగానదిని జేరవు. ఒక శ్రేణి వెంట మఱియొక శ్రేణి క్రమముగ వచ్చి చేరుచుండును. అట్లే సంస్కారాతిశయ క్రమము ననుసరించి పార్వతి యందు విద్యలు నొకదాని వెంట నొకటి వచ్చి భాసించినవి. కాని హంసల యునికిపట్టు గంగ కాదు. అవి వేఱొక చోటునుండి గంగ కడకు రావలెను. రెండవ యుపమాన మీ లోటును గూడ దీర్చినది. మహౌషధులు సహజముగ కాంతిమంతములు. ఆ కాంతులు వేఱొక చోటునుండి రానక్కరలేదు. కాని యవి పగలు సూర్యకాంతి పరాహతములై భాసింపవు. పగలు అనభివ్యక్తములై యణగియుండిన యా కాంతులు రాత్రులయందు ప్రతిబంధకము లేనందున సహజ

ప్తులతో నభివ్యక్తము లగుచుందును. అట్లే పార్వతి యందణిగియున్నట్లున్న యా విద్యలు గురూపదేశకాలమున (ఉపదేశ మను వ్యాజముచే) నావరణము తొలగి నంతనే సహజ తేజస్సులతో భాసించిన వని భావము.

మఱియు హంసశ్రేణి సమాగమమునకు శరత్కాలము, మహౌషధులు సహజదీప్తులతో దేజరిల్లుటకు రాత్రియు యుక్తములగు కాలములు. అట్లే యాత్మ భావ స్వరూపములగు విద్యలు భాసించుటకు అనుగ్రహపూర్ణ గురూపదేశకాలముయుక్త సమయమనియు నిట సూచితము అనగానాచార్యుడు శిష్యునియందలి యజ్ఞానావరణమును దొలగించి యాతనియందణగియున్న విద్యలను స్వయముగ భాసింపజేయునను సంప్రదాయము నీకవి యిటగుర్తింప జేయుచున్నాడు. అంతియే కాదు పార్వతి పరాదేవత. అయ్యును గురూపదేశకాలముననే విద్యలు భాసిల్లినవి అంతకు బూర్వము గాదు. అట్లే శిష్యుడెంతటి ప్రజాశాలి యైనను గురూపదేశ సంస్కృత చిత్తుడు గానిచో నాతని యందున్న విద్య భాసింపదు. అనగా నా విద్య యాతనికి పురుషార్థ సాధకము గాదు. అందుచేతనే.

యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥ — శ్వేతా. ఉ

అని శ్రుతి గురుదేవతా భక్తి వైశిష్ట్యమును బ్రతిపాదించినది. గురు - ఈశ్వరానుగ్రహపాత్రులగు వారికి మాత్రమే విద్య అనుభూతికి వచ్చి ప్రకాశించునని భావము. కాన గుర్వనుగ్రహము చేతను, దేవతానుగ్రహము చేతను ఆవరణము (ప్రతిబంధము) తొలగి శిష్యునియందు విద్య స్వయముగ జాగరిత మగుటయే శక్తిపాతము. ఘోర తపశ్చర్య వలనను, ఈశ్వరానుగ్రహము వలనను గాని విశ్వామిత్రుని యందలి ప్రతిబంధము నివర్తింపలేదు. తొలగినంతనే బ్రహ్మ యొక్క అనుగ్రహము చేతను, వసిష్ఠమహర్షియొక్క సాక్షాన్నిరీక్షణ భాషణాదులు వలనను విశ్వామిత్రునియందు ఓంకార, వషట్కార, వేద విద్యలు స్వయముగా

భాసించి యాతడు బ్రహ్మర్షి పదము నధిష్ఠించినాడు. 'బ్రహ్మర్షిస్త్వం న సందేహః సర్వం సంపత్స్యతే తవ' - నీవు బ్రహ్మర్షివి. సందియము లేదు. నీకు సర్వము సంపన్నమగును - అని చతుర్వేదవిదుడు బ్రహ్మిష్ఠుడు నగు వసిష్ఠు డనినంతనే వేదవాక్కామ ధేనువు విశ్వామిత్రునకును వశవర్తిని యైనది. ఇక కామధేనువును గూర్చిన వివాదమునకు తావు లేకపోయెను. అట్టి కామధేనువుతోబాటు బ్రాహ్మణ్యమును బొంది విశ్వామిత్రుడు వసిష్ఠుని బూజించినట్లును రామాయణము చెప్పుచున్నది. వసిష్ఠ విశ్వామిత్రాదు లిట్టి బ్రహ్మర్షులు.

ఈ సంప్రదాయము ననుసరించి బ్రహ్మణస్పతి యగు ఈశ్వరునియందు ప్రతిష్ఠితమై యున్న వేదవిద్య హిరణ్యగర్భునియందును, పిదప మంత్రద్రష్టలగు ఋషుల యందును, పరమాచార్యుడగు ఈశ్వరుని సంకల్ప మాత్రముననే జాగరితమై విలసిల్లినదని తెలియును. 'తా మన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్; దేవత్తం బ్రహ్మ గాయత' - ఇత్యాది ఋక్కులు నీశ్వరానుగ్రహముచే నీ వేద విద్య ఋషులయందు జాగరితమైనదనియు, దేవప్రసాద లబ్ధమగు నిట్టి బ్రహ్మను (వేదమును) గానము జేయు డనియు నుద్బోధించుచున్నవి.

## బ్రహ్మ, బ్రహ్మణస్పతి, బృహస్పతి- చారిత్రికుల యూహలు :-

పరమేశ్వరునకు బ్రహ్మ యను నామమే గాక బ్రహ్మ (వేద) సంరక్షకు డగుటచే వాక్పతి, వాచస్పతి, బృహస్పతి — ఇత్యాది నామములు శ్రుతి

స్మృతులందు ప్రసిద్ధములు. కాని చరిత్రకారులు బ్రహ్మ యను పదము ఋగ్వేదమున మంత్రములకు లేక స్తోత్రములకు మాత్రమే వాచకము.[1] బ్రహ్మణస్పతి యను నీ దేవత తరువాత కల్పింపబడినది, ఈ దేవత మొదట స్తోత్రముల కధిపతి. కాని, యనతికాలములోనే యజ్ఞదేవు డయ్యెను. నిరాడంబర మైన వేదకాలపు మత దృక్పథము నుండి బ్రాహ్మణముల కాలమునాటి మతము జెందిన పరివర్తన మీ బ్రహ్మణస్పతి యందు చూడగలము.[2] అని యీ రీతిగ జెప్పుచున్నారు. ఇట్లు చెప్పుట శ్రుతి విరుద్ధము. ఏలయన :—

"బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ" .... ఋ. 1-164-35.
"యావ ద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్" .... ఋ 10-114-8.
బ్రహ్మా దేవానాం పదవీః కవీనామ్" .... ఋ. 9-96-6.
బ్రహ్మాణం బ్రహ్మవాహసమ్" .... ఋ. 6-45-7.
"బ్రహ్మ తేన పునీహి నః" .... ఋ. 9-67-23; వా. సం. 19-41

1. S. Radhakrishnan - Indian Philosophy. Vol. I. 'Brahman in the Regveda means a hymn or a prayer addressed to God'. .... Page 124

2. Brahmanaspati is a very late God, belonging to the period when sacrifics began to come into vogue. Originally the lord of praper, he soon became the God of sacrifics. We see in him the transition between the spirit of the pure Vedic religion and the later Brahmanism.

.... Page 89.

—ఇత్యా ద్యనేక ఋగ్వేదమంత్రములందు బ్రహ్మపదము పరమేశ్వర వాచకముగ ప్రసిద్ధము. భాష్యకర్తలందఱును నిట్టి యెడ నీ పదమును పరమేశ్వర వాచకముగనే గ్రహించి వ్యాఖ్యానించిరి. ఇందుదాహరించిన కొన్ని మంత్రముల తాత్పర్యము పూర్వము వివరింపబడినది గూడ. కాన, బ్రహ్మ యను పదము ఋగ్వేదమున మంత్రమును, లేక, స్తోత్రమును, లేక, పురోహితుని మాత్రమే బోధించుననుట యుక్తము కాదు. ఇక 'బ్రహ్మణస్పతి తరువాత కల్పింపబడిన దేవత' —అని యనుటయు తగదు. ఈ బ్రహ్మణస్పతి యొక్క బ్రహ్మణస్పతిత్వమును ఋగ్వేదమే యిట్లు వివరించుచున్నది.

"ప్ర నూనం బ్రహ్మణస్పతి ర్మంత్రం వద త్యుక్థ్యమ్ ।
యస్మి న్నింద్రో వరుణో మిత్రో అర్యమా దేవా ఓకాంసి
చక్రిరే ॥" —ఋ. 1-40-5; వా. సం. 34-57.

ఇయ్యది మంత్రస్వభావమును వివరించు మంత్రము. ఈ మంత్రమున 'బ్రహ్మణస్పతి (పరమేశ్వరుడు) యజ్ఞమునందు హోతృముఖమున నిలిచి ఇంద్రవరుణాది సర్వదేవతానిలయ మగు మంత్రమును నిజముగ నుచ్చరించుచున్నాడు' —అని చెప్పబడుచున్నది. ఈ బ్రహ్మణస్పతి యెవరు ? బ్రహ్మ లనగా మంత్రములు. అవి యింద్రవరుణాది దేవతలకు నిలయములు. అట్టి బ్రహ్మలకు, అనగా మంత్రములకు పతి యగువాడు బ్రహ్మణస్పతి. ఆ బ్రహ్మణస్పతియే యజ్ఞాది కర్మల యందు హోతృముఖమున మంత్రజాతము నుచ్చరించుచున్నా డని యిట జెప్పబడినది. అనగా ఋత్విజ్ముఖముల నుండి మంత్రముల వెలువరింప జేయునది బ్రహ్మణస్పతియే యని గుర్తించుచు మంత్రముల నుచ్చరింప వలెనని తాత్పర్యము. ఈ బ్రహ్మణస్పతియే బృహస్పతి యనియు, అతడే సర్వజగన్నియంత యగు

ఈశ్వరు డనియు, నీ క్రింది ఋక్కు చెప్పుచున్నది.

"సేమా మవిడ్ఢి ప్రభృతిం య ఈశిషేఽయా విధేమ
నవయా మహా గిరా । యథా నో మీఢ్వాన్ స్తవతే సఖా
తవ బృహస్పతే సీషధః సోతనో మతిమ్ ॥" ‒ఋ. 2‒24‒1.

ఇది బ్రహ్మణస్పతిదేవతాక మంత్రము. బ్రహ్మణస్పతియే యిట 'బృహస్పతే' యని సంబోధింపబడినాడు. కాన బ్రహ్మణస్పతియే బృహస్పతి. ఈ రెండు శబ్దములకు గల ప్రవృత్తినిమిత్త మొకటియే. 'బృహస్పతే ‒ బృహతో బ్రహ్మణో మంత్రస్య స్వామిన్' (సా. భా.) మంత్రపతి లేక మంత్రస్వామి అని యిట పరమేశ్వరుడు సంబోధింపబడినాడు.

"హే బ్రహ్మణస్పతే యః త్వం ఈశిషే సర్వస్య జగత
ఈశ్వరో భవసి సః త్వం, ఇమాం అస్మదీయాం, ప్రభృతిం
ప్రకర్షేణ భృతాం స్తుతిం, అవిడ్ఢి ప్రాప్నుహి' ‒సా. భా.

కాన నిచట బ్రహ్మణస్పతి (బృహస్పతి) సర్వజగన్నియంత యగు ఈశ్వరుడుగ కీర్తింపబడుచున్నాడు. ఈ బృహస్పతి నుండియే బృహత్త్వముతో నొప్పుచు మంత్రము లన్నియు నావిర్భూతము లయినట్లు ఈ క్రింది ఋక్కు కూడ. చెప్పుచున్నది.

"ఉస్రా ఇవ సూర్యో జ్యోతిషా మహో విశ్వేషా మి జ్జనితా
బ్రహ్మణా మసి" ‒ ఋ. 2‒23‒2.

తేజశ్శాలి యగు సూర్యుడు కిరణముల జనియింప చేయునట్లు ఓ బృహస్పతీ! అన్ని మంత్రములను జనియింప జేయుచున్నావు ‒ అని యర్థము.

సూర్యుని నుండి యత్నప్రయత్నముగ కిరణములు ప్రసరించుచున్నట్లు వేద మంత్రములను పరమేశ్వరుని నుండి యప్రయత్నముగ నిఃసృతము లగునని యీ మంత్ర తాత్పర్యము. 'విశ్వేషాం బ్రహ్మణాం జనితా' – అని యనుటచే బృహస్పతి యొక్క బ్రహ్మణస్పతిత్వము, అనగా సర్వమంత్ర ప్రవర్తకత్వము చెప్పబడినది. కాన, బృహస్పతియే బ్రహ్మణస్పతి. మాధవీయ ఋగ్వేదానుక్రమణిక యందు బ్రహ్మణస్పతి శబ్దము బృహస్పతి నామములలో పఠింపబడి యున్నది.

'బృహస్పతి ర్గణపతిః సప్తాస్యో బ్రహ్మణస్పతిః।
అంగిరసో నీలపృష్ఠః సప్తగు శ్చ బృహస్పతేః॥

కాన ఈ ఋగ్వేదమున బ్రహ్మణస్పతి బృహస్పతికంటె భిన్నుడు కాదని తెలియును. ఇంతియే కాదు. తైత్తిరీయశ్రుతియు (3-11-4-2) "బృహస్పతే బ్రహ్మణస్పతే' అని బృహస్పతిని బ్రహ్మణస్పతిగా కీర్తించినది.

## బృహస్పతి - బ్రహ్మణస్పతి - మంత్ర విభాగము :-

కాని ఋగ్వేదమున కొన్ని మంత్రములకు బార్హస్పత్య మంత్రములనియు, కొన్ని మంత్రములకు బ్రాహ్మణస్పత్య మంత్రములనియు విభాగము గలదు.

'యాసు బృహస్పతిశబ్దః శ్రూయతే తా బార్హస్పత్యాః।
శిష్టా బ్రాహ్మణస్పత్యాః' –– సా. భా. (ఋ. 2-23; 2-24 మొ॥సూ॥)

బృహస్పతియే బ్రహ్మణస్పతి యని చెప్పుచో నీ మంత్రవిభాగమునకు కారణ మేమి ? ఈ విషయము బరిశీలింప వలసియున్నది.

"మహాభాగ్యా ద్దేవతాయాః ఏక ఆత్మా బహుధా స్తూయతే॥"

నిరు. 7-1-4.

ఈశ్వరు డనియు, నీ క్రింది ఋక్కు చెప్పుచున్నది.

"సేమా మవిడ్ఢి ప్రభృతిం య ఈశిషేఽయా విధేమ
నవయా మహా గిరా । యథా నో మీఢ్వాన్ స్తవతే సఖా
తవ బృహస్పతే సీషథః సోతనో మతిమ్ ॥" —ఋ. 2-24-1.

ఇది బ్రహ్మణస్పతిదేవతాక మంత్రము. బ్రహ్మణస్పతియే యిట 'బృహస్పతే' యని సంబోధింపబడినాడు. కాన బ్రహ్మణస్పతియే బృహస్పతి. ఈ రెండు శబ్దములకు గల ప్రవృత్తినిమిత్త మొకటియే. 'బృహస్పతే - బృహతో బ్రహ్మణో మంత్రస్య స్వామిన్' (సా. భా.) మంత్రపతి లేక మంత్రస్వామి అని యిట పరమేశ్వరుడు సంబోధింపబడినాడు.

"హే బ్రహ్మణస్పతే యః త్వం ఈశిషే సర్వస్య జగత
ఈశ్వరో భవసి సః త్వం, ఇమాం అస్మదీయాం, ప్రభృతిం
ప్రకర్షేణ భృతాం స్తుతిం, అవిడ్ఢి ప్రాప్నుహి' —సా. భా.

కాన నిచట బ్రహ్మణస్పతి (బృహస్పతి) సర్వజగన్నియంత యగు ఈశ్వరుడుగ కీర్తింపబడుచున్నాడు. ఈ బృహస్పతి నుండియే బృహత్త్వముతో నొప్పుచు మంత్రము లన్నియు నావిర్భూతము లయినట్లు ఈ క్రింది ఋక్కు కూడ చెప్పుచున్నది.

"ఉస్రా ఇవ సూర్యో జ్యోతిషా మహో విశ్వేషా మి జ్జనితా
బ్రహ్మణా మసి" — ఋ. 2-23-2.

తేజశ్శాలి యగు సూర్యుడు కిరణముల జనియింప చేయునట్లు ఓ బృహస్పతీ! అన్ని మంత్రములను జనియింప జేయుచున్నావు - అని యర్థము.

ఏష ఉ ఏవ బృహస్పతిః । వాగ్వై బృహతీ । తస్యాఏష
పతిః తస్మాదు బృహస్పతిః॥ —22

ఏష ఉ ఏవ బ్రహ్మణస్పతిః। వాగ్వై బ్రహ్మ। తస్యా
ఏష పతిః తస్మాదు బ్రహ్మణస్పతిః॥ -23

ఏష ఉ ఏవ సామ। వాగ్వై సా। అమైషః। సా చామ
శ్చేతి తత్సామ్నః సామత్వమ్ ॥ —24

యద్ ఉ ఏవ సమః ప్లుషిణా । సమో మశకేన। సమో
నాగేన। సమ ఏభి స్త్రిభి ర్లోకైః । సమోఽనేన సర్వేణ ।
తస్మాద్ ఉ ఏవ సామ।" —శ. బ్రా. 14-1-1-21నుండి24.

ఈ మంత్రమున నొకే ప్రాణదేవతయొక్క విభిన్న మహిమలను దెలియ జేసెడి విభిన్న నామములు నిర్వచింపబడుచున్నవి.

## ఆంగిరసః :-

శరీరమునందలి యే అవయవము నుండి యైనను ప్రాణశక్తి యుత్క్రమించినపుడు ఆ యవయవము నీరసపడి శుష్కించుచున్నది. ప్రాణశక్తిగల యవయవములు నీరసపడుట లేదు; శుష్కించుటలేదు. కాన ప్రాణము అంగముల రసము (సారము). అంగరసభూతు డగుటచే, అనగా, స్థూల, సూక్ష్మ శరీరములకు ఆత్మ యగుటచే ప్రాణమునకు 'ఆంగిరసః' అని పేరు. ఈ ఆంగిరసుడగు సూత్రాత్మయే (ప్రాణదేవుడే) బృహస్పతి. ఇట ఆంగిరస పదముచే ప్రాణదేవతకు రూపప్రపంచాత్మత్వము చెప్పబడినది. ఇక బృహస్పతి, బ్రహ్మణస్పతి సామ అను మూడు శబ్దములచే నామ ప్రపంచాత్మత్వము చెప్పబడుచున్నది.

## బృహస్పతిః :-

ఈ అంగిరసుడే బృహస్పతి. వాక్కు బృహతి. బృహతికి పతి గాన బృహస్పతి. తరువాత 24వ మంత్రములో 'ఏష ఉ పై సామ' -'ఇతడే సామ' యని యీ ప్రాణదేవతకు వాగ్విశేషమగు సామతో సామానాధికరణ్యము చెప్పబడు చున్నది. అందుచే నీ మంత్రమున 'వాక్' పదముచే వాగ్విశేషములగు ఋక్కులు లక్షితము లగుచున్నవి. ఋక్కులన్నియు బృహతీ ఛందస్సునందు అంతర్భావము చెందు నని శ్రుతి మఱియొకచోట[1] చెప్పుచున్నది. మఱియు 'వా గ్వా అనుష్టుప్' (శ. బ్రా. 7-1-2-18) అను శ్రుతిప్రమాణముచే వాక్ అనగా అనుష్టుప్ ఛందస్సు; 32 అక్షరములు గలది. బృహతీఛందస్సునకు అక్షరములు 36. మహాసంఖ్య యందవాంతరసంఖ్య యంతర్భావము చెందును. బృహతి యందు అనుష్టుప్ (వాక్) అంతర్భావము చెందును గాన వాక్కు బృహతీ యని ఇట చెప్పబడినది. ఇట్లు వాగ్రూప యగు బృహతికి, అనగా ఋక్కునకు, పతి యగుటచే నా ప్రాణ దేవునకు బృహస్పతి యని పేరు.

## బ్రహ్మణస్పతిః :-

ఈ బృహస్పతియే బ్రహ్మణస్పతి. వాక్కు బ్రహ్మ. బ్రహ్మరూపిణి యగు వాక్కునకు పతి గాన బ్రహ్మణస్పతి. వాక్కుచే పూర్వము ఋక్కులు లక్షితములు. అందుచే ఇట వాక్ పదముచే యజుస్సులు గ్రహింపబడుచున్నవి. వాగ్విశేషములగు యజుస్సులే యిట బ్రహ్మశబ్దలక్షితములు. అట్టి బ్రహ్మలకు

---

1. స ఋచో వ్యౌహ ద్వాదశ బృహతీసహస్రా ణ్యేతావత్యో హర్చో యాః ప్రజాపతి సృష్టాః — శ. బ్రా. 10-4-2-23.

అనగా యజుస్సులకు పతి గాన నా ప్రాణదేవుడే బ్రహ్మణస్పతి యగుచున్నాడు. బ్రహ్మశబ్దము నిఖిల మంత్రములకు నామ మయ్యును నిట నా శబ్దముచే యజుస్సులు చెప్పబడు చున్నవి.

## సామం -

బృహస్పతియు, బ్రహ్మణస్పతియు నగు నా యాంగీరసుడే యిట సామ శబ్దముచే చెప్పబడుచున్నాడు. 'సా చ అమ శ్చ అని సామశబ్ద మిట నిర్వచింపబడి నది. 'సా' అనగా వాక్కు. యనగా ప్రాణము. సామ శబ్దముచే వా క్ప్రాణరూప మిథునము చెప్పబడుచున్నది, కాన సామ వాక్ -ప్రాణాత్మక మగును. అట్టి సామకు ప్రవృత్తిహేతువగు ప్రాణమే యిట సామ శబ్దవాచ్యుడు - అని యర్థము.

మఱియు 'సా' అనునది సర్వనామ తచ్ఛబ్దము యొక్క స్త్రీలింగ రూపము. ఇది నిఖిల స్త్రీలింగ శబ్దములకు ఉపలక్షకము, నిఖిల స్త్రీలింగశబ్ద బోధ్య మగు వస్తుజాత మంతయు నిట 'సా' అను శబ్దముచే, అనగా వాక్కుచే లక్షిత మగుచున్నది. అట్లే 'అమ' యను శబ్దము నిఖిల పుంలింగ శబ్దములకు ఉపలక్ష కము. నిఖిల పుంలింగ శబ్ద బోధ్య మగు వస్తుజాతమంతయు నిట 'అమ' శబ్దముచే లక్షిత మగుచున్నది. కాన స్త్రీపుంసాత్మకమగు జగత్తే సామ. అట్టి సామకు ప్రవృత్తిహేతువగు ప్రాణమే యిట 'సామ' రూపము.

మఱియు లోకములో స్థూల సూక్ష్మ తారతమ్యములు గల శరీరము లనేకములు గలవు. సూక్ష్మాతిసూక్ష్మములగు కీటకాది శరీరముల తోను, స్థూలములగు గజాది శరీరములతోను, ఈ మూడు లోకములతోను, ఇది యది యదనేల - దృశ్యమగు నీ సర్వప్రపంచముతో 'సముడు' అనగా సమాన పరిణామము గలవాడు; కాన ప్రాణమునకు 'సామ' యని సార్థక నామము —అని శ్రుతి తాత్పర్యము. (చూ. శం. భా; హరిస్వామి - భా.)

కాన నాకే ప్రాణదేవుడు 'అంగానాం రసః' -అను ప్రవృత్తి నిమిత్తము ననుసరించి అంగిరసు డైనాడు; ఋగ్రూపమగు బృహతికి (వాక్కుకు) పతియై బృహస్పతియైనాడు; యజూరూపమగు బ్రహ్మకు (వాక్కుకు) పతియై బ్రహ్మణస్పతి యైనాడు., వాక్ప్రాణాత్మకమైన గీతిరూపమగు సామకు ప్రవృత్తిహేతు వగుచు 'సామ' రూపుడుగ జెప్పబడినాడు; మఱియు స్త్రీపుంసాత్మక జగత్తు అనెడు సామకు, ప్రవృత్తిహేతువగుచు సామరూపుడుగ జెప్పబడినాడు; స్థూలసూక్ష్మాది రూపమైన నిఖిల జగత్తుతో సముడు గాన సామరూపుడుగను జెప్పబడినాడు. అందు వలన బృహస్పత్యాది శబ్దములు ఒకే దేవతను బోధించునవి యైనను, అవి యా దేవతయందలి యొక్కొక్క విశిష్టగుణము నుపలక్షింపజేయు నట్టివి. విశిష్టగుణ స్ఫోరకము లగుటచే నీ నామములు గల మంత్రములకు ప్రత్యేక పరిగణన చేయ బడినది. అట్లు పరిగణన చేయబడిన మాత్రమున బృహస్పతి వేఱు, బ్రహ్మణస్పతి వేఱు, అంగిరసుడు వేఱు అని యనుట శ్రుతి విరుద్ధము. ఇట్లు ఆపాతముగ దోచు నానాత్వమునందు సంస్కార క్రమ సంపన్నులై యేకత్వమును దర్శించుట శ్రుతిసమ్మతమైన సంప్రదాయము.

పై బ్రాహ్మణ నిర్వచనము లందలి విశేషము గమనింప దగియున్నది. రూపప్రపంచమునకు ఆత్మయై, అంగిరసుడై, విలసిల్లిన హిరణ్యగర్భుడే శబ్దప్రపంచమునకు ఆత్మయై బృహస్పతియు, బ్రహ్మణస్పతియు నయి తుదకు సామరూపుడగు చున్నాడు. అనగా ఋక్కులకు, యజుస్సులకు పతియై వరలెడి ప్రాణదేవుడు సామలకు పతిగా చెప్పబడలేదు. సామరూపుడుగ కీర్తింపబడినాడు. ఇంతియే కాదు వాక్కునందు గల ఋగ్యజుఃసామరూపత్రైవిధ్యముచే నాకే ప్రాణదేవతయందు త్రైవిధ్యము చూపబడినది. (ఈ త్రైవిధ్యమును గూర్చి మున్ముందింకను వివరింప బడును.

మఱియొక విశేషము. ఋఙ్మంత్రములు దేవతాహ్వానరూపములు; దేవతా స్తోత్ర రూపములును, ఈ మంత్రములు దేవతాగణములకు నిలయము లనియు (యస్మిన్ ఇంద్రో .... దేవాః ఓకాంసి చక్రిరే) బృహస్పతి యా మంత్రములను

ప్రవర్తింపజేయువాడనియు పూర్వము చెప్పబడినది. అట్లు మంత్రరూపవాక్ప్రవర్తకుడై బృహస్పతి యగుచున్నాడు. ఇక బ్రహ్మణస్పతి బ్రహ్మలకు, అనగా యజుస్సులకు పతి, అని చెప్పబడినాడు. యజుస్సులు కర్మ స్వరూప బోధకములు; కాన కర్మ స్వరూప బోధకములగు బ్రహ్మలకు (మంత్రములకు) పాలకు డగుటచే బ్రహ్మణస్పతి యని యన్వర్థనామము. కర్మప్రవర్తకములగు మంత్రములకు స్వామి యగుట చేతనే భారతీయులచే ప్రతి శుభకార్యారంభసమయము నందును పరమేశ్వరుడు బ్రహ్మణస్పతిగా నీ క్రింది ఋక్కుచే నారాధింపబడుచున్నాడు.

'గణానాం త్వా గణపతిం హవామహే కవిం కవీనా
ముపమశ్రవస్తమమ్। జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆ నః శృణ్వ న్నూతిభిః సీద సాదనమ్॥" —ఋ. 2.-23-1.

ఇట (1) 'గణానాం గణపతిం' అనుటచే ఈశ్వరుడు నిఖిలగణరూపుడు, 1 నిఖిలగణపాలకుడు నని చెప్పబడినాడు; (2) 'బ్రహ్మణాం బ్రహ్మణస్పతే' అని యనుటచే నిఖిల మంత్రరూపుడు; నిఖిల మంత్రపాలకుడు అనియు చెప్పబడినాడు. (3) 'జ్యేష్ఠరాజం, ఉపమశ్రవస్తమం: కవీనాం కవిం' ఇత్యాదిపదములచే నా పరమేశ్వరుని యొక్క నిరతిశయ మహత్త్వము చెప్పబడుచున్నది. అందుచే 1. రూపప్రపంచాత్మత్వము 2. శబ్దప్రపంచాత్వము 3. నిరతిశయమహత్త్వము -అని ఈ ఋక్కునందు సంగ్రహముగ నిరూపితములైన యర్థములనే పై బృహదారణ్యకశ్రుతి విస్తరించి నిర్వచించినదని గ్రహింప నగును. నిఖిల నామ రూప ప్రపంచాత్మకుడై కర్మ ప్రవర్తక మంత్రస్వరూపుడు, తత్పాలకుడగుటచే మంత్రములును, కర్మలును, వీర్య వత్తరములై శుభప్రదములగుటకు బ్రహ్మణస్పతిగా

1. గణానాం మధ్యే గణపతిం గణరూపేణ పాలకం
—మహీ. భాష్య. వా. సం. 23-19,

పరమేశ్వరుని ఆరాధించెడి సంప్రదాయము పరంపరాగతమై ప్రసిద్ధమైనది - సంప్రదాయానుగతమైన యీ యాచారము కూడ బ్రహ్మణస్పతి యొక్క అనాదిత్వమును, ఈశ్వరత్వమును రెండింటి నుపలక్షింపజేయుచున్నది.

అందుచే 'ఆర్యులనెడి జాతివారికి ఇంద్రుడు ప్రధానదేవత; అతి ప్రాచీనదేవత; ఈ దేవతను గూర్చి పెక్కు సూక్తములు గలవు, బ్రహ్మణస్పతి అర్వాచీన కల్పితదేవత; ఈ దేవత నుద్దేశించిన సూక్తములు చాల తక్కువ; ఈ దేవత మొదట మంత్రములకు అధిపతియై పిదప యజ్ఞమును ప్రవర్తింపజేయు దేవత యయ్యెను' —ఇత్యాది చారిత్రిక కల్పనలు దేవతాతత్త్వ స్వరూపనిరూపకములుగావు. శ్రుతి సమ్మతములును గావు అతి ప్రాచీనుడని చెప్పబడెడి ఇంద్రదేవతతోనే బ్రహ్మణస్పతికిని, బృహస్పతికిని నిరంతర సాహచర్య మున్నట్లు 'ఇంద్రా బ్రహ్మణస్పతీ' (ఋ. 2-24-2) 'ఇంద్రా బృహస్పతీ' (ఋ. 4-49- ;4;5;6) —ఇత్యాది సమస్త పదముల ద్వారా ఋగ్వేదము తెలియజేయుచున్నది.

## అగ్నియే ఆంగిరసుడు, బృహస్పతి, బ్రహ్మణస్పతి:-

ఇంతే కాదు. ఈ బ్రహ్మణస్పతి తర్వాత నెప్పుడో యజ్ఞదేవతయై వెలి నాడనుటయు యుక్తము కాదు. ఋగ్వేదము మొదటి మంత్రమున 'అగ్నిమీడే పురోహితం యజ్ఞస్య దేవమ్' అని, యే మహాగ్ని తొలుదొలుత యజ్ఞదేవుడుగను, యజ్ఞపురోహితుడుగను కీర్తింపబడినాడో యా మహాగ్నియే ఆంగిరసుడు; 1 అతడే బృహస్పతి; 2అతడే బ్రహ్మణస్పతి 3 అతడే సోమ; అతడే ఇంద్రాదిదేవతాత్మకుడును -అని ఋగ్వేదమే విస్పష్టముగ దెల్పుచున్నది. అగ్నియే గాదు, సోముడు గూడ ఋగ్వే

1. ఋ. 1-1-6; 1-31-; 2; 17 ఇత్యాది.

2. 1-139-10

3. ఋ. 2-21 సూక్తమునంతయు చూచునది.

దమున నొకచోట బ్రహ్మయనియు ('బ్రహ్మా దేవానాం', 9-96-6), మఱొకచో బ్రహ్మణస్పతి యనియు ('పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే,' 9-83-1) కీర్తింప బడినాడు. కాన నీ దేవతానామములు ఆ యా దేవతలకు కేవల సాంకేతిక నామములు గావు. ఇవి తమ ప్రవృత్తినిమిత్తములచే పరమేశ్వరుని నిరతిశయ మహత్త్వము (బ్రహ్మత్వము) నుద్దీపింప జేయుచున్నవి.

## దేవతానామములు - విశేషణవాచకములు :-

కాని ఒకచో నగ్నికి, ఇంకొకచో బృహస్పతికి, ఇట్లే సోమునకు, ఇంద్రునకు, విశ్వకర్మకు, సవితృదేవత మున్నగు వారికిని యీ నిరతిశయ మహత్త్వము శ్రుతులయందు వేఱ్వేఱు స్థలములయందు గన్పట్టుచుండుటచే వేఱ్వేఱు కాలములందు వేఱ్వేఱు రచయితలచే నిట్లు కల్పింపబడినట్లు చారిత్రికులచే పలుతీరులుగ నూహింపబడుచున్నది. ఈ దేవతా నామములు కేవలము సంకేతము లనుకొనుటచే నిట్టి యూహలు జనించి యుండవచ్చును. ఇవి కేవల సాంకేతిక పదములు కావు. ఏలయన-

'ఇంద్రతమా హి ధిష్ణ్యా మరుత్తమా దస్రా' — ఋ. 1-182-2.

అని యీ మంత్రమున అశ్వినులు 'ఇంద్రతమౌ, మరుత్తమౌ' యని కీర్తింపబడినారు. సామాన్యముగ దేవతావాచకములుగ ప్రసిద్ధము లయిన 'ఇంద్ర మరుత్' శబ్దము లిచట విశేషణవాచకములుగ బ్రయోగింపబడినవి. ఈ పదములకు గల యౌగికార్థముల గ్రహించినచో గాని యిట నర్థము పొసగదనుట స్పష్టము. అశ్వినుల యందు అతిశయించు ఇంద్రత్వము (పరమైశ్వర్యము) మరుత్త్వము (వేగగామిత్వము లేక మితరాగిత్వము) దర్శింపబడవలెనని శ్రుతితాత్పర్యము. (ఇంద్రతమా హి ఈశ్వరతమౌ ఖలు మరుత్తమా మరుద్వద్వేగగామినౌ మితరాగిణౌ మితరావిణౌ వా' —' సా భా ఇట్లే యుషోదేవతయు మఱియొక ఋక్కు (1-

73-3) నందు 'ఇంద్రతమా' యనియు, 'అంగిరస్తమా' యనియు బేర్కొనబడినది. (సర్వస్య ఈశ్వరతమా; గంతృతమా". "సా. భా.) వహ్ని శబ్దము అగ్నిదేవతా వాచక మయ్యును నొకచో ప్రజాపతి గూడ "వహ్నితమః" అని చెప్పబడినాడు. "దేవానా మసి వహ్నితమః" (ప్ర. ఉ. 2-8) (దేవానాం ఇంద్రాదీనాం అసి భవసి త్వం వహ్నితమః హవిషాం ప్రాపయితృతమః —శం. భా)

ఇంతియే గాక ఒక దేవతావాచక పదము ఇతర దేవతావాచక పదమునకు విశేషణముగ బ్రయోగింపబడుట శ్రుతులందు బ్రసిద్ధము. అట్టియెడ యౌగికార్థమును గ్రహించిననే గాని యర్థము పొసగదు.

"బ్రహ్మేంద్ర మగ్నిం జగతః ప్రతిష్ఠాం। దివ ఆత్మానగ్ం
సవితారం బృహస్పతిం। చతుర్హోతారం ప్రదిశోనుక్లృప్తం
వాచో వీర్యం తపసాన్వవిందన్।" — తై. ఆ. 3-11.2. (చూ సా. భా.)

ఈ ఋక్కునందు వేదవాక్ప్రభూతుడగు (వాచోవీర్యం) పరమేశ్వరుడు ఇంద్రశబ్దముచే చెప్పబడినాడు. ఇట 'జగతః ప్రతిష్ఠాం' ఇత్యాది విశేషణములతో పాటు 'అగ్నిం సవితారం', బృహస్పతిం' అని దేవతావాచకపదములు కూడ ఇంద్రునకు (పరమేశ్వరునకు) విశేషణములుగ నిర్దేశింపబడినవి. అనగా నీ పదముల యొక్క ప్రవృత్తినిమిత్తముల ద్వారా పరమేశ్వరుని యందలి విభిన్న మహత్త్వముల దర్శింపవలె నని శ్రుతి యుద్బోధించు చున్నది. ఇట్లు ఈ పదముల యందు నిగూఢమై యున్న శక్తిని, గాంభీర్యమును దర్శించి, యివి యన్నియు పరమేశ్వరతత్త్వోపలక్షకము లని గ్రహించుట యుక్తము. అట్లుగాక, యౌగిక శక్తిని విడిచి వీనిని కేవలము సాంకేతిక నామములుగ గ్రహించుటగాని, దేవతల యందు ప్రాచీనార్వాచీన భావముల బెంపొందింప జేసికొనుటగాని శ్రుతి విరుద్ధములగు నర్థముల జెప్పుటయే యగును.

# బ్రహ్మ - బ్రహ్మకర్మ :-

'బ్రహ్మణాం బ్రహ్మణస్పతే' —ఇత్యాది ప్రమాణములచే కర్మప్రవర్తకములగు మంత్రములు బ్రహ్మలగుట దర్శించితిమి. కాన, అట్టి బ్రహ్మలచే (మంత్రములచే) నిర్వర్తింపబడు కర్మలును, స్తోత్రములును, హవిరాదులు గూడ 'బ్రహ్మలే' యని శ్రుతులయందు ప్రసిద్ధములయినవి. బ్రహ్మరూపము లగుటచేతను, బ్రహ్మలచే (మంత్రములచే) సుసంస్కృతములగుట చేతను కర్మలకు 'బ్రహ్మకర్మ' లనియు ప్రసిద్ధి యేర్పడినది. కావుననే నేటికినిగూడ నిత్యనైమిత్తిక కర్మలన్నిటియందును 'పరమేశ్వర ప్రీత్యర్థం బ్రహ్మకర్మ సమారభే' యని సంకల్పించెడి యాచారము సంప్రదాయానుగతమై వచ్చుచున్నది.

కాని, (1) బ్రహ్మ యనిన సామాన్యముగ నుపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మ యను నర్థము స్ఫురించును. అగుచో బ్రహ్మను ప్రతిపాదించెడి యుపనిషద్భాగమునకు మాత్రమే బ్రహ్మ యను నామ ముండుట సమంజసముగ నుండిన నుండవచ్చును. తదితర వేదభాగమునకుగాని, యా వేదభాగముచే ప్రతిపాదింపబడు కర్మలు మున్నగువానికి గాని బ్రహ్మ యను నామమెట్లు సార్థకమగును ? (2) సంహితలలోని మంత్రములకును, తత్ప్రతిపాదిత కర్మలు మొదలగువానికిని గల బ్రహ్మ యను సాంకేతిక నామమునే తరువాత ఉపనిషత్కాండయు గ్రహించి స్వప్రతిపాద్యకమగు వస్తువునకును బ్రహ్మ యను నామమును కల్పించినదా?

ఇట్లనుట తగదు. బ్రహ్మ యనునది యొక సాంకేతికనామము కాదు. అది యర్థవత్తరము. నిరతిశయ మహత్త్వాది వివిధార్థోపబృంహితము. ఈ విషయము సప్రమాణముగ నిరూపితము. అట్టిచో నిది కేవల నిరర్థక సాంకేతికపదమనుటెట్లు ? ఈ పదము ఋగ్వేదమున నెట్టి యర్థముతో విలసిల్లినదో యా

యర్థమే ఉపనిషత్కాండయందు విస్తరించి నిర్వచింప బడినవి. మంత్రములు స్తుతిరూపములై సూత్రాత్మకములై ప్రవర్తిల్లినవి; మిగిలిన వేదభాగము తద్వివరణమునకై ప్రవర్తిల్లినవి. ఈ విషయమును అడుగడుగున భాష్యకర్తలును స్పష్టము చేసిరి అందుచే శ్రుతియం దొక భాగముచే ప్రతిపాద్యమగు అర్థము వేఱు. ఇంకొక భాగముచే ప్రతిపాద్యమగు అర్థము వేఱు అన వలదు. ఒకే లక్ష్యమును అధికారిభేదము ననుసరించి యుద్బోధించుటకై శ్రుతి వివిధరూపములతో నవతరించినది. అందుకై కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ అను నామములును అధికారిభేదము ననుసరించి ప్రవృత్తము లయినవి. అంతియే, వీని యన్నిటి లక్ష్యము ఒకటియే. ఆ యొకటియే బ్రహ్మ

బ్రహ్మ యనిన యుపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మయే కాదు. సగుణమూర్తియై సృష్టి లయస్థితి కర్త యగు పరమేశ్వరుడును బ్రహ్మయే. తదనుగ్రహముచే నావిర్భవించిన ప్రథమశరీరియు, ఈశ్వరుడునగు హిరణ్యగర్భుడును బ్రహ్మయే. విరాట్టు బ్రహ్మయే. ఈ నలువురియందును కొలది భేదములతో బ్రహ్మత్వ మనుగతమై యొప్పును. ఇట్టి బ్రహ్మత్వమును అధికారిభేదము ననుసరించి బోధించుటకే యన్ని బ్రహ్మలు (మంత్రములు, కర్మలు మొ.) ప్రవృత్తము లయినవి. కావున, కృత్స్న వేదలక్ష్యము ఒకటియే. ఈ విషయమును ఋక్కులే అనేక విధములుగ వర్ణించి యున్నవి. వేదవాక్యములు, కర్మలు మున్నగునవన్నియు మత్స్వరూపావబోధకములే అని పరమేశ్వరుడు స్వయముగ జెప్పుట ఋగ్వేదము యొక్క మొదటి మండలము నందలి ఇంద్రమరుత్సంవాదమున స్పష్టముగ గాంచ నగును.

"బ్రహ్మాణి మే మతయః శం సుతాసః శుష్మ ఇయర్తి ప్రభృతో
మే అద్రిః। ఆ శాసతే ప్రతి హర్యన్త్యుక్థేమా హరీ వహత
స్తా నో అచ్ఛ॥" —ఋ. 1-165-4; వా. సం. 33-78.

'హే మరుతః, బ్రహ్మాణి మంత్రవాక్యాత్మకాని స్తుతివచాంసి,
హవీంషి వా సోమాజ్యాదీని, మే మమ స్వభూతాని, చోదనా
వాక్యేఽగ్న్యాదిదేవతాంతరసంబంధేన ప్రతీయమానా న్యపి
సర్వదేవతా ప్రాణాత్మనో మమేంద్రస్యైవ తానీతి భావః।
మతయః మననయుక్తాః స్తుతయోఽపి, శం మమ సుఖో
త్పాదికాః, అతో యజ్ఞే గంతవ్య మితి భావః' —మహీ. భా.

ఈ మంత్రముగల ఇంద్రశబ్దము సర్వదేవతా ప్రాణాత్మ యయిన పర మేశ్వరవాచకము సర్వదేవతా ప్రాణాత్మ స్వరూపుడు మొదట పరమేశ్వరుడు, తరువాత హిరణ్యగర్భుడును గూడ నగుదురు ఇంద్రాగ్న్యాది శబ్దములు దేవతా వాచకములు అయ్యును కొన్నియెడల ప్రకరణము ననుసరించి పరమేశ్వరవాచకములు గూడ నగుచుండునని పూర్వము వివరింపబడినది. పరమేశ్వరుడు లోకోత్తర మహా భాగ్య సంపన్ను డగుటచే, ఆయన మహామహిమలను ప్రస్తుతించుటకు ఎన్నియేని నామములు శ్రుతియందు గానవచ్చును. ఇంద్రశబ్దము అట్టిదే (ఇది పరమైశ్వర్యే). ఇంద్రుడన పరమేశ్వరు డని యర్థము ఇంద్రశబ్దమొక దేవతా వాచకము కాదే కాక పరమేశ్వరవాచకముగ శ్రుతులయం దు బహుళముగ ప్రసిద్ధము. అందుచేతనే భాష్యకర్తలు ఈ మంత్రము నందలి ఇంద్రపదమును సర్వదేవతా ప్రాణాత్మరూపు డగు పరమేశ్వరపరముగ గ్రహించి వ్యాఖ్యానించిరి. ఇక మంత్రార్థమును జూతము.

ఆ యా దేవతల నుద్దేశించి చేయబడు మంత్రవాక్యాత్మకములగు స్తుతివచనములు. సోమాజ్యాది హవిస్సులు, నన్నియు నావియే. అనగా శ్రుతివాక్యము నందు అగ్ని మున్నగు నితరదేవతల నుద్దేశించినట్లు ప్రతీయమానములగు స్తోత్ర హవిరాదు లన్నియు సర్వదేవతాప్రాణాత్మరూపుడ నగుటచే నావియే యగును. మఱియు మననయుక్తములగు స్తుతులు (మతయః) నాకు ప్రీతికరములు. కావున నో మరుత్తులారా, నేను యజ్ఞమున కేగ వలసి యున్నది. ఈ స్తోత్రహ

విరాదు లన్నియు ఆత్మీయములగుట చేతనే యజ్ఞభూమికేగుట కాదు; యజమానులు వారిచే ప్రవర్తింపజేయబడు స్తోత్ర శస్త్రము లన్నియు నన్నే యభిలషించుచున్నవి.' అందుచే గూడ యజ్ఞమున కేగవలెను. మీరును రండు' -అని మంత్రార్థము.

ఋగాది మంత్రములును, సోమాది హవిస్సులన్నియును 'తవాహమస్మి -'నేను నీ దాసను' అని యీ రీతిగ ననుచు పరమేశ్వరునినే కాంక్షించుచుండును; అ దేవునే పొందుచుండును. -అని 'యో జాగార త మృచః కామయన్తే' (ఋ. 5-45-14, 15)అను మంత్రము వివరించుచున్నది. ఈ విషయము వేదశబ్దమున వివరింపబడినది. 'బ్రహ్మ బ్రహ్మయే జుజుషుర్హవి ర్హవిః' (ఋ. 9-77-3). ఇత్యాది ఋక్కులు మంత్రాత్మకమగు ప్రతి స్తోత్రము (బ్రహ్మ బ్రహ్మ) ప్రతి హవిస్సు సోముని (పరమేశ్వరుని) సేవించుచున్నట్లు చెప్పుచున్నవి. ఈ యర్థమునే భగవద్గీతయు నిట్లనువదించినది.

"యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మా మేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకమ్॥
అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ,
న తు మా మభిజానంతి తత్త్వే నాత శ్చ్యవన్తి తే॥" -9-23, 24

మఱియు పై మంత్రమున 'బ్రహ్మాణి మే, మతయః మే' అని యనుటచే మంత్ర - హవి రాదులన్నియు నానుండియే, నా కొఱకే - అనగా పరమేశ్వరుని కొఱకే - యను విషయము స్పష్టమగుచున్నది. ఇంతే గాదు. పరమేశ్వరుడగు నింద్రుడు మంత్రములను స్వయముగ ప్రవర్తింపచేసి నట్లును, అవియు స్వయముగ (అనగా నిరపేక్షముగ) పురుషార్థ సాధకము లగుటయు మఱియొక ఋక్కునందును గాంచనగును.

బ్రహ్మాణి హి చకృషే వర్ధనాని తావత్త ఇంద్ర మతిభి
ర్వివిష్మః। సుతే సోమే సుతపాః శం తమాని రాంద్ర్యా
క్రియాస్మ వక్షణాని యజ్ఞైః॥" —ఋ. 6-23-6. (మా. సా. భా.)

ఇట 'బహ్మాణి హి చకృషే' - అని యనుటచే పరమేశ్వరుడే బ్రహ్మ (మంత్ర) ప్రవర్తకుడగుట చెప్పబడినది; ఈ మంత్రములు స్వయముగనే పురుషార్థ సాధకము లగుచు (వర్ధనాని స్వయమేవ వృద్ధికరాణి), నిరతిశయానందకములు (శంతమాని శుభకృత్తమాని); కావున రమణీయములు (రాంద్ర్యా, రాంద్ర్యాణి రమణీయాని); హవిర్యుక్తములై వాహకములు (యజ్ఞైః హవిర్భి ర్యుక్తాని వక్షణాని వాహకాని) - అగుట గమనింప దగినది.

పై ఋక్కులను బరిశీలించినచో (1) యజ్ఞకర్తయు, యజ్ఞ సంరక్షకుడును, యజ్ఞములకు ప్రధానలక్ష్యభూతుడును, తత్తత్కర్మఫలప్రదుడును బ్రహ్మయే అనగా పరమేశ్వరుడే. (2) మంత్రములు, ఆ యా దేవత నుద్దేశించి చేయబడు స్తోత్రశస్త్రములు, త్యాగము చేయబడు హవిరాదులు - అన్నియు పరమేశ్వరునివే- ఇట్టి యీ బ్రహ్మలు అన్యనిరపేక్షముగ పురుషార్థసాధకము లగుచు నిరతిశయానందదాయకములు, కావున, రమణీయములు అనియు తెలిసినది ఇవి యిట్లు బ్రహ్మనుండి లేక బ్రహ్మకొఱకే ప్రవర్తిల్లుటచే వీనికి 'బ్రహ్మ' యను నామము సార్థకమగుటయు గాంచనగును. (3) మఱియు నివి 'శంతమాని, రాంద్ర్యాణి' యను విశేషణములచే, యజమానుడు యజ్ఞాదికర్మల ననుష్ఠించుచు మనన యుక్తములగు నీ మంత్రముల (మతయః) మననము చేయుకొలది క్రమముగ చిత్తపరిపాకవశమున నిరతిశయానంద స్వరూప బ్రహ్మభావబోధకములై, తమయందు నిగూఢములైన రమణీయార్థముల దర్శింపజేయగల వనియు నిట సూచిత మగుచున్నది యజ్ఞాదికర్మ లన్నియు చిత్తశుద్ధి సంపాదనము ద్వారా క్రమముగ బ్రహ్మవిద్యా సాధనము అగుట శ్రుతులు నిట్లు వివరించినవి.

"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన
దానేన తపసాఽ నాశకేన" —బృ. ఉ. 4.4-22.

ఈ విషయము బ్రహ్మసూత్రములందు సర్వాపేక్షాధికరణమున విపులముగ జర్చించి వివరింపబడియున్నది. కాన మంత్రము లిట్లు క్రమము గ బ్రహ్మస్వరూప ప్రాప్తిహేతువు లగుటచే గూడ వానికి 'బ్రహ్మణి' యను నామము సార్థకము. పైన చెప్పినట్లు ఈ బ్రహ్మ (మంత్రము లేక స్తోత్రము) దేవ ప్రసాద లబ్ధమ గుటచే దీనిని గానము చేయు డనియు ఋగ్వేదము ప్రబోధించుచున్నది.

దేవత్తం బ్రహ్మ గాయత" —ఋ. 8-32-27.

'దేవప్రసాదలబ్ధం, బ్రహ్మస్తోత్రం, ప్రగాయత'— సా. భా.

ఇట్లు దేవదత్తములైన యా మంత్రములను (బ్రహ్మలను) శ్రుతి. చమత్కారముగ బ్రహ్మవాహనము లని వర్ణించినది.

"బ్రహ్మణం బ్రహ్మవాహసం" —ఋ. 6-45-7.

"బ్రహ్మవాహ స్తమం" —ఋ. 6-45-19.

"బ్రహ్మవాహః" —ఋ. 4-41-3.

"బ్రహ్మవాహ సే" —ఋ. 5.34-1.

"సఖాయో బ్రహ్మవాహసః" —ఋ 6-46-4.

బ్రహ్మణి స్తోత్రాణి స్తుత్యతయా వహతీతి బ్రహవాహాః

బ్రహ్మణా స్తోత్రేణ ప్రాప్యతే ఇతివా; అతిశయేన బ్రహ్మభి స్మంత్రైర్వాహనీయః' —సా. భా.

బ్రహ్మలను (మంత్రములను) వహించువాడు। బ్రహ్మలచే వహింపదగినవాడు: కాన బ్రహ్మవాహనుడు - అని యర్థము. ఇట వాహనము బ్రహ్మ,

వహింపబడునది బ్రహ్మ. కాన మంత్రమునకును బ్రహ్మకును గల ప్రతిపాద్య ప్రతిపాదకభావరూప సంబంధము ఈ బ్రహ్మశబ్ద పరిశీలనము జేయుకొలది దృఢతర మగు చున్నది. అందుచే బ్రహ్మలచే (వేదములచే) వహింపబడునది అనగా తెలియజేయబడునది. లౌకికవిషయములు కావు; అలౌకికములు నతీంద్రియములగు ధర్మ బ్రహ్మలే - యను విషయ మీ 'బ్రహ్మాణం బ్రహ్మవాహనం' ఇత్యాది పదముల ద్వారా శ్రుతి బోధించుచున్నది. ఈ యర్థమును పురాణేతిహాసములు వేయినోళ్ళ గీర్తించియే యున్నవి.

## బ్రహ్మ - అబ్రహ్మ :-

మంత్రములు బ్రహ్మ లగుటచేతను, బ్రహ్మతత్త్వ ప్రతిపాదనమే ఏకైకలక్ష్యముగా గలది యగుటచే కృత్స్న వేదరాశికిని బ్రహ్మ యను నామము ప్రసిద్ధమైనది. బ్రహ్మతత్త్వప్రతిపాదనము లక్ష్యముగా గలది యగుచుజేసి శ్రుతి తనను బ్రహ్మ యనియు, అట్టి లక్ష్యము లేని లౌకిక వాఙ్మయమును అబ్రహ్మ యనియు జెప్పుచున్నది.

"యచ్చ బ్రహ్మ యచ్చాబ్రహ్మ। అంత ర్బ్రహ్మన్ ప్రతిష్ఠితమ్॥"
—తై బ్రా. 3–12–8–2.

'బ్రహ్మ వేదః। అబ్రహ్మ పౌరుషేయగ్రంథాః। అంత ర్బ్రహ్మన్
వేదమధ్యే, ప్రతిష్ఠితమ్ కర్మ జ్ఞానం చ' —సా. భా.

ఈ మంత్రము వేదము యనియు, దానియందు కర్మజ్ఞానములు ప్రతిష్ఠితము లైనవనియు జెప్పి అట్లు ప్రతిష్ఠితము కానట్టి పౌరుషేయ మగు వాఙ్మయము అబ్రహ్మ యనియు దెల్పుచున్నది. అందుచే కర్మ జ్ఞాన ప్రబోధమునకే యీ వేద శాస్త్ర మవతరించిన దని శ్రుతివలన దెలియును.

# శబ్దబ్రహ్మ :-

వేదము బ్రహ్మయనియే గాక శబ్దబ్రహ్మ యనియు అపరబ్రహ్మ యనియు మిగుల బ్రసిద్ధమైనది

"ద్వే విద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మ పరం చ యత్।
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి॥"

—అమృతబిందు. ఉ. 17; విష్ణు. పు. 6-5-64; 5-1-35.

"అహం వై సర్వభూతాని భూతాత్మా భూతభావనః।
శబ్దబ్రహ్మ పరబ్రహ్మ మమోభే శాశ్వతీ తనూ॥" -భాగ. 6-16-51.

"త్వం హి బ్రహ్మ పరంజ్యోతిః గూఢం బ్రహ్మణి వాఙ్మయే।"

భాగ, 10-63-36.

"పరావరే బ్రహ్మణి ధర్మతో వ్రతైః।
స్నాతస్య మే న్యూన మలం విచక్ష్వ॥" —భాగ. 1-5-7.

తస్మా ద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసు శ్శ్రేయ ఉత్తమమ్॥"
శాబ్దే పరే చ నిష్ణాతం బ్రహ్మ ణ్యుపశమాశ్రయమ్ ॥"

—భాగ. 3-11-25.

శబ్దబ్రహ్మ, లేక అపరబ్రహ్మ యగు వేదమునందు నిష్ణాతుడగువాడే, యందు నిగూఢమై యున్న పరబ్రహ్మతత్త్వమును తెలియగలడు. అందుచే శబ్దబ్రహ్మయందు నిష్ణాతుడై యపరోక్షాత్మానుభవ కుశలుడైన గురువును జిజ్ఞాసువు నధికారియు నగువాడు సేవింపవలెను - అని పై శ్లోకముల తాత్పర్యము. ఈ పై వాక్యము లన్నియు "బ్రహ్మబిందు బ్రహ్మవాహనం" ఇత్యాది శ్రుతితాత్పర్యము ననువదించునవి యగుట స్పష్టము.

దేవాలయము లందు జరుపబడు బ్రహ్మోత్సవములు రథోత్సవ-గరుడ, వృషభాది వివిధ వాహనోత్సవములు మున్నగున వన్నియు "బ్రహ్మణం బ్రహ్మవాహనమ్" - ఇత్యాది శ్రుత్యర్థముల నుపలక్షింప జేయునవియే యని సంప్రదాయము. కాన నిట్లు శబ్దబ్రహ్మ యని ప్రసిద్ధి గాంచిన యీ వేదరాశిని లౌకిక చరిత్రను బోధించు లక్ష్యము గలదిగా గ్రహించుట యనుచితము.

## బ్రహ్మ - బ్రహ్మపురము :-

బ్రహ్మశబ్దము ప్రధానముగ పరమేశ్వరునకును, హిరణ్యగర్భాదులకును తత్ప్రతిపాదకమగు వేదరాశికిని, తద్విహిత కర్మజాతమునకును వాచక మగుట దర్శించితిమి. త్రైలోక్యశరీరము (విరాట్స్వరూపము లేక బృహచ్ఛరీరము) బ్రహ్మశబ్ద లక్షిత మైనట్లే స్థూల - సూక్ష్మ- కారణరూపత్రైవిధ్యము గల్గి బ్రహ్మ కర్మసాధన మగు యజమానుని శరీరముకూడ బ్రహ్మశబ్దిత మని ఋగ్వేదము వలన తెలియుచున్నది.

"యత్తే పవిత్ర మర్చి షగ్నే వితత మంతరా।
బ్రహ్మ తేన పునీహి నః।" —ఋ. 9-67-2 .

ఇది పవమాన గుణవిశిష్ట - అగ్నిదేవతాక మంత్రము. "ఓ పవమానాగ్నీ! అగ్ని విద్యు దాదిత్య రూపమయిన నీ తేజస్సునందు అంతర్నిహితమై, సర్వవ్యాప్తమై, పావనమై (అంతః ఆవితతం పవిత్రం) యే దివ్యతేజస్సు (శక్తి) గలదో, యా దివ్యతేజముతో మా యీ బ్రహ్మను (శరీరమును) పావనము చేయుము" -అని యర్థము. (చూ. సా. భా; వేం మా. మా. భా.).
దీని ననుసరించి బ్రహ్మకర్మ సాధనమైన శరీరము బ్రహ్మయగుట స్పష్టము. పరమేశ్వరుని త్రైలోక్యశరీర మెట్లు అగ్నీంద్రాది దేవతా నిలయమో, అట్లే ప్రతిశరీరముగూడ

దేవతానిలయముగ (దేవాలయముగ) గుర్తింప నగునని శ్రుతి ప్రత్యక్షముగను, పరోక్షముగను, ప్రబోధించుచున్నది.

"శం నో మిత్రః శం వరుణః శం నో భవ త్వర్యమా ।
శం న ఇంద్రో బృహస్పతిః శం నో విష్ణురురుక్రమః॥"
— ఋ. 1-90-9.

"నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వ మేవ ప్రత్యక్షం
బ్రహ్మాసిత్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి" — తై. ఉ. శిక్షావల్లి.

ఇట మిత్ర వరుణాది దేవతలు 'శం' కరులగు నుతింపబడుచున్నారు. వీరందరు నధ్యాత్మదేవతలు. ఆధిదైవికముగ జగద్యాత్రా నిర్వహణ సహకారు లయిన యీ దేవతలు ఆధ్యాత్మికముగ శరీరయాత్రా నిర్వహణమున గూడ ప్రాణ దేవతా సహకారులగు చున్నారు.

ఇందు ప్రాణవృత్త్యభిమాన దేవతయు, అహరభిమాన దేవతయు మిత్రుడు. అపానవృత్త్యభిమాన దేవతయు, రాత్ర్యభిమాన దేవతయు, వరుణుడు. చక్షురభిమాన దేవతయు, ఆదిత్యాభిమాన దేవతయు అర్యముడు. బలమున ఇంద్రుడును, వాగ్బుద్ధులయందు బృహస్పతియు. పాదములయందు (గతియందు) ఉరుక్రముడగు విష్ణువును దేవతలు. ఇట్లు అధ్యాత్మప్రాణ కరణ (ఇంద్రియ) అభిమాని దేవతలయొక్క అనుగ్రహమద్దినబడి, తరువాత సమిష్టి దేవతాత్మకుడు ముఖ్య ప్రాణరూపుడు నగు వాయు దేవత 'త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మాసి' -అని కీర్తింప బడి యర్థింప బడుచున్నాడు. వాయువు సూత్రాత్మ (హిరణ్యగర్భుడు) రూపమున పరోక్షముగ నుండునే కాని ప్రత్యక్షముగాదు. కాని ఆధ్యాత్మిక ప్రాణరూపమున సాక్షివేద్యమై, ప్రత్యక్షమగు చుండును. గాన వాయువు ప్రత్యక్ష బ్రహ్మగా నిట స్తుతింపబడినాడు (మా. శం. భా).

ఇట్లు శరీరము దేవతానిలయమై జ్ఞేయుడు, జీవునకు స్వరూపభూతుడు

నగు బ్రహ్మకు నిలయమై వెలయుచుండుటచే శరీరము దేవాలయ మనియు బ్రహ్మ పుర మనియు వైదికవాఙ్మయమున బ్రసిద్ధమైనది.

"అష్టాచక్రా నవద్వారా। దేవానాం పూ రయోధ్యా।
తస్యాగ్ంహిరణ్యః కోశః। స్వర్గో లోకో జ్యోతిషాఽవృతః।
యో వై తాం బ్రహ్మణో వేద। అమృతే నాఽఽవృతాం పురీమ్।
తస్మై బ్రహ్మ చ బ్రహ్మచ ఆయుః కీర్తిం ప్రజాం దదుః।"

—అథ 10. 2-31; తై. ఆ. 1.27-2,3

"త్వగాద్యష్ట ధాతు రూపములగు అష్టచక్రములతోను, ఇంద్రియాది నవ ద్వారములతోను, అయోధ్య యను సార్థకనామమున బరగుచు నజేయమై దేవతా నిలయమగు నీ శరీరమనెడి పుర మొప్పుచుండును. ఈ పురమున జ్యోతిర్మయ మైన కోశము స్వర్గలోకము. అయ్యది జీవచైతన్యరూపమగు జ్యోతిస్సుచే నావృ తమై యుండును.

కావున నీ పురిని సత్యజ్ఞానానందలక్షణ బ్రహ్మకు సంబంధినదనియు అమృతముతో (పరమానందముతో) నావృత మైనదనియు నెవడు తెలిసికొనునో యట్టి విద్వాంసునకు బ్రహ్మయు, అనగా పరమాత్మయు, అనగా ప్రజాపతియు ఆయురాది ఫలముల నొసగుదురు." -యని యర్థము.

"దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవః సనాతనః"

ఇత్యాది వాక్యములన్నియు పై శ్రుతితాత్పర్యమునే యుద్బోధించుచున్నవి. అందుచే బాహ్యప్రపంచము వలెనే యాంతర ప్రపంచము గూడ దేవతానిలయము. బ్రహ్మపురము ననియు స్పష్టము. ఇట్టి యాంతరదర్శనము నుద్బోధించుటకే శ్రుతి తననే గాక శరీరమును గూడ బ్రహ్మ యని కీర్తించినది.

## బ్రహ్మకోశః :-

ఇంతియే కాదు. బ్రహ్మకు సంబంధించిన దగుటచేతనే వేదమునకు 'బ్రహ్మకోశ' మని వ్యవహారము.

ప్రజాపతే ర్బ్రహ్మకోశం బ్రహ్మ ప్రపద్యే" —తై. నా. 4-42-2.

'ప్రజాపతేః సంబంధి బ్రహ్మకోశం సర్వమంత్రాధారభూతం బ్రహ్మ వేదస్వరూపం ప్రపద్యే' —సా. భా.

'క్షాత్రో ధర్మః శ్రిత ఇవ తనుం బ్రహ్మకోశస్య గుప్త్యై'

—ఉత్తర రామచరితమ్ అ. 9.

సర్వమంత్రములకు నాధారభూత మగుటచే వేదము బ్రహ్మకోశ మని ప్రసిద్ధము. ఈ కోశము సృష్టికర్త యగు ప్రజాపతికి సంబంధించినది (ప్రజాపతేః బ్రహ్మకోశం) -అని యిట జెప్పబడినది. వేదమునకే కాక ప్రణవమునకును బ్రహ్మకోశ మని వ్యవహారము గలదు.

"బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః" తై. శిక్షావల్లీ.

ప్రణవము నిఖిల వేదాత్మకము. ఒఱలో ఖడ్గము వలె నీ ప్రణవమునందు బ్రహ్మ విగూఢమై యుండును. ఇట్లు బ్రహ్మయొక్క కోశమై యొప్పుటఁ జేసి ప్రణవము బ్రహ్మకోశము. వేదము బ్రహ్మయొక్క కోశమే గాని లౌకిక విషయకోశము గాదని తాత్పర్యము.

## బ్రహ్మచారీ - నిధిరక్షకః :-

ఈ విషయమునే యాథర్వణ శ్రుతియు భంగ్యంతరముగ నిట్లు వివరించుచున్నది.

"అర్వాగ్ అన్యః పరో అన్యో దివ స్పృష్ఠాద్ గుహా నిధీ
నిహితౌ బ్రాహ్మణస్య । తౌ రక్షతి తపసా బ్రహ్మచారీ
త త్కేవలం కృణుతే బ్రహ్మ విద్వాన్ ॥' —అ. వే. 11-5-10.

'దివః ద్యులోకస్య పృష్ఠాత్ ఉపరిభాగాత్ అధః భూలోకే అన్యః ఏకః నిధిః వేదాత్మకః గుహా గుహాయాం ఆచార్యహృదయరూపాయాం నిక్షిప్తః । అన్యః అపరః నిధిః తత్ప్రతిపాద్యదేవతారూపః పరః పరస్తా దుపరి దేశే గుహాయాం జ్ఞాతు మశక్యే స్థానే నిక్షిప్తః। బ్రాహ్మణస్య అధీత వేదస్య సంబంధినౌ తౌ నిహితౌ నిక్షిప్తౌ నిధీ బ్రహ్మచారీ తపసా బ్రహ్మచర్యనియమేన రక్షతి పాలయతి । విద్వాన్ వేదార్థ రహస్యాభిజ్ఞః తత్ శబ్ద తదర్థాత్మకం నిధిద్వయం కేవలం నిష్ప్రపంచం బ్రహ్మ కృణుతే । స్వాత్మభూతే పరబ్రహ్మణి వేదరాశే స్తదర్థస్య చ అధ్యస్తత్వేన అధిష్ఠానభూతం బ్రహ్మైవ త ద్రూపేణ సాక్షాత్కరోతీ త్యర్థః'.

—సా. భా.

వేదాధ్యయనపరులయిన బ్రాహ్మణ్యులయందు రెండు నిధులుగలవు. అందొకటి వేదరూపమైన నిధి. ఇది భూలోకమున నాచార్యహృదయ మనెడి గుహయందునిక్షిప్తము. ఇక వేదప్రతిపాద్య దేవతారూప మయిన నిధి రెండవది. ఇదియును గుహ యందు - అనగా దుర్జ్ఞేయ మగు స్థానమున- నిహితమై యుండును. వేదాధ్యయనపరుడు నిరంతర మీ బ్రహ్మయందు జరించుచు బ్రహ్మచారియై బ్రహ్మచర్య నియమములతో నీ రెండు నిధులను సంరక్షించు చుండును. వేదార్థ రహస్యాభిజ్ఞు డగు విద్వాంసుడు' వాగర్థ' రూపములగు నీ రెండు నిధులనుదర్శించితుదకు అధిష్ఠానభూత-నిష్ప్రపంచ - బ్రహ్మరూపమననే యా వాగర్థరూప నిధిద్వయమును సాక్షాత్కరించుకొనును - అని యర్థము. ఈ మంత్రము వేదము యొక్కయనూచానత్వమును, దాని లక్ష్యమును, నియమపూర్వకముగ దానిని సంరక్షించు విధానమును, తాను, స్వప్రతిపాద్యవస్తువు - రెండును నిధులగుటయు, నిధి సాక్షాత్కారము నొందు అధికారి యొక్క స్వరూపమును కాంతాసంమితముగ వివరించినది.

త్ర ఊర్ధ్వమ్' 'ఇవి మన్త్రములు, ఇకమీద కల్పము' అనుచు తనయందలి మంత్రభాగమును కల్పభాగమును వేఱువఱచి చూపుచున్నది. కాన నేది నేడు బ్రాహ్మణభాగమని ప్రసిద్ధమై యున్నదో యదియు మంత్రబ్రాహ్మణాత్మకమే యగుట స్పష్టము. 'మంత్ర బ్రాహ్మణయోర్వేదనామధేయమ్' అని వేదలక్షణము, మంత్ర బ్రాహ్మణాత్మకము లగుటచే, బ్రాహ్మణ - ఆరణ్యక - ఉపనిషద్ రూపములగు బ్రాహ్మణ భాగము లందును ఈ వేదలక్షణము సువ్యవస్థిత మగుచున్నది, ఇట్లు మంత్ర బ్రాహ్మణాత్మకమై వేదలక్షణలక్షితమగుటజేసి, బ్రాహ్మణము తనను బ్రహ్మ (వేదము) యని కీర్తించుకొనుట యుపపన్నమే. షడ్వింశ బ్రాహ్మణము గూడదనను ముక్తకంఠముగ వేద మని కీర్తించుకొనినది.

"య ఏతం వేద మనుబ్రూతే యదా వా ఏతం వేద మను
బ్రూతే, అథ హైనం శృణ్వ న్త్యసౌ వన్వోచతేతి
తద్వై స జాయతే' —షడ్వింశ. బ్రా. 1.16.

ఇది షడ్వింశబ్రాహ్మణ వాక్యము 'ఏతం వేదం' ఈ (వేదమును) అనుచు ఈ బ్రాహ్మణము తనను 'వేద' మని కీర్తించుకొనుట స్పష్టము. ఇట్లే యీ బ్రాహ్మణము మఱియొకచోట మన్త్రబ్రాహ్మణాత్మక శబ్దరాశిని 'బ్రహ్మ' యని కీర్తించినది.

"త మోషధీభ్య శ్చ వనస్పతిభ్య శ్చ గోభ్య శ్చ పశుభ్య
శ్చాదిత్యాచ్చ బ్రహ్మణ శ్చ బ్రాహ్మణాః సం నయంతే।
తస్మాత్ సాంనాయ్యస్య సాంనాయ్యత్వమ్' —షడ్వింశ. బ్రా. 5-6-3.
'బ్రహ్మ మంత్రాద్యాత్మకో వేదః, తస్మాత్' —సా. భా

సంప్రదాయ ప్రవర్తకుల వాక్యములు నిందుకు ప్రమాణము.
'తథాచ న్యాయవిదాం స్మరణమ్—

"కుర్యా త్క్రియేత కర్తవ్యం భవే త్స్యాదితి పంచమమ్ ।
ఏత త్స్యా త్సర్వవేదేషు నియతం విధిలక్షణమ్ ॥ ఇతి"

శం. భా. బ్ర. సూ. 3. 4,22.

1. కుర్యాత్ (చేయవలయును), 2. క్రియేత (చేయబడవలయును), 3 కర్తవ్యం (చేయదగినది), 4. భవేత్ (కావలెను), 5. స్యాత్ (ఉండును. లేక ఉండవలెను) అనునవి యైదును సర్వవేదము లందును ప్రసిద్ధము లయిన విధిలక్షణములు - అని న్యాయవేత్తల యభిప్రాయము. వేదములందు సామాన్యముగ గన్పట్టు. లిఙ్, తవ్య ప్రత్యయాదులు వేద వాక్య విధిత్వ జ్ఞాపకములు అనగా నివి విధివాక్యము లని తెలియజేయునట్టివి - అని తాత్పర్యము.

బ్రాహ్మణ మనగా మంత్రభిన్న మయిన తత్తత్కర్మ విధాయక మగు వాక్యము - అనగా విధివాక్య జాతమునకు బ్రాహ్మణ మని పేరు. అట్టి విధివాక్య జాతమును న్యాయవిదులు వేద మని వ్యవహరించుట పై శ్లోకమున గాంచనగును.

## బ్రహ్మయజ్ఞః - బ్రహ్మ - బ్రాహ్మణమ్ :-

తైత్తిరీయారణ్యకము నందును, శతపథబ్రాహ్మణము నందును బ్రహ్మయజ్ఞ ప్రశంస గలదు. ఈశ్వరానుగ్రహముచే ఋషులు బ్రహ్మయజ్ఞమును దర్శించినట్లు (తై. ఆ. 2-9-1) పూర్వము వివరింపబడినది. (చూ. ఋషిశబ్దము). బ్రహ్మయజ్ఞ మనగా స్వాధ్యాయము. నిత్య మనుష్ఠింపవలసిన వేదమంత్ర జప యజ్ఞము - అని శ్రుతి యిట్లు వివరించుచున్నది.

"య దృచో ఽధ్యగీషత తాః పయ ఆహుతయో దేవానా
మభవన్, య ద్యజూంషి ఘృతాహుతయో, య త్సామాని
సోమాహుతయో, య దథర్వాంగిరసో మధ్వాహుతయో,
య ద్బ్రాహ్మణానీతిహాసాన్ పురాణాని, కల్పాన్ గాథా

బ్రాహ్మణ శబ్దములచే గీర్తింపబడినారు. ఇట్టి యీ సంప్రదాయము లౌకిక వ్యవహారమున గూడ ననుగతమైనది.

> సమానార్థావేతౌ బ్రహ్మన్ శబ్దో బ్రాహ్మణశబ్దశ్చ। అతశ్చ
> సమానార్థౌ। ఏవం హ్యాహ - కుతో ను చరసి బ్రహ్మన్,
> కుతో ను చరసి బ్రాహ్మణః ఇతి"......మహాభాష్య. సా. సూ .

కాన నీ శబ్దములు భిన్న ప్రవృత్తినిమిత్తములు గలవి యగుటచే నొకే వస్తువునకు వాచకములు కాజాల వనుట యుక్తము గాదు. మఱియు బ్రాహ్మణమే తనను బ్రహ్మ యని కీర్తించుకొనుచున్నది..

"యచ్చ బ్రహ్మ యచ్చాబ్రహ్మ । అంతః బ్రహ్మన్ ప్రతిష్ఠితమ్।"

(ఈ మంత్రార్థ మింతకు పూర్వమే వివరింపబడినది) ఈ బ్రాహ్మణము ఈ వాక్యమును జెప్పుటకు బూర్వము 'ఋచో యజూంషి సామాని అథర్వాంగి రసశ్చ యే' - అని చతుర్విధ మంత్రజాతమును బేర్కొనినది. అందు నీచే వాక్యమున గల 'బ్రహ్మ' పదము మంత్రపరము గాదు. మంత్రపరమగుచో పునరుక్తి యగును. అందుచే దీనిని కృత్స్నవేదపరముగనే గ్రహింపవలసి యున్నది. భాష్యకర్తలు నట్లే గ్రహించిరి. కనుక నిట 'బ్రహ్మ' పదము మంత్ర బ్రాహ్మణాత్మక కృత్స్నవేదపరము.

ఇంతేకాదు. ఈ బ్రాహ్మణము తనను బ్రహ్మయని కీర్తించుకొనుచునే పరోక్షముగా దనకు గల బ్రాహ్మణత్వము నిట్లు వివరించుకొనినది. కర్మజ్ఞానము లెచ్చోట ప్రతిష్ఠితము లయి యుండునో యది బ్రహ్మ. అటు కాని పౌరుషేయ వాఙ్మయము అబ్రహ్మ. కాన, కర్మజ్ఞాన ప్రతిష్ఠితత్వము బ్రహ్మరూప (మంత్ర బ్రాహ్మణాత్మక) వేదలక్షణముగా నిట సూచితమగుచున్నది. ఇట్టి లక్షణము నాది యని స్ఫురింపజేయుచు బ్రాహ్మణము తనను బ్రహ్మయని యిట కీర్తించుకొను చున్నది. మఱియు దనకు గల బ్రహ్మత్వమును స్ఫురింపజేయుచు నీ తైత్తిరీయబ్రాహ్మణము 'బ్రహ్మ సంధత్తమ్' అనుచు బ్రహ్మశబ్దముతో బ్రవృత్తమైనది. (చూ. సా. భా.) ఈ బ్రాహ్మణభాగములే

కొన్నియెడల దనుయందలి మంత్రముల వాఖ్యానించు వట్టున 'అథ బ్రాహ్మణమ్' అనుచు సాగిపోవుచుండును. ఇంతవఱకు బ్రహ్మ (మంత్ర)భాగము; ఇకమీద బ్రాహ్మణము అని యర్థము. అందుచే నీ వేదభాగమునకు బ్రహ్మ బ్రాహ్మణ నామ యము లర్వాచీన కల్పితములు గావు.

ఈ బ్రాహ్మణభాగమును వ్యాకరణాది దర్శనములు; పురాణేతిహాసాదులు బ్రహ్మ బ్రాహ్మణ శబ్దములచే బలుచోట్ల గీర్తించియున్నవి.

ఇంతియే కాదు. సంహితాభాగము కంటె భిన్నమైన వేదభాగమునకు బ్రాహ్మణ మని సామాన్యముగ బ్రసిద్ధి. ఈ వేదభాగమున 'బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు' అని మూడు అవాంతరభాగములు గలవు. ఈ మూడింటికి కలిపి బ్రాహ్మణభాగ మని వ్యవహారము. కాని, 'బ్రాహ్మణమనగా సంహితాభాగముకంటె భిన్నమైనది' - యను నీ లక్షణము సర్వత్ర అనుగతము కాదు. కృష్ణయజుర్వేదీయ సంహితయందే కొంత బ్రాహ్మణ భాగము గూడ కలదు. అట్లున్నను మొత్తమునకు సంహిత యనియే ప్రసిద్ధి. సంహితయందలి బ్రాహ్మణమేగాక, మరల తైత్తిరీయశాఖకు బ్రత్యేకముగ బ్రాహ్మణము గలదు. అందుకే సంహిత కంటె భిన్నమైనదియే బ్రాహ్మణము - అనులక్షణము వ్యవస్థిత మగుట లేదు. ఇట్లు వ్యవస్థితములు గాని లక్షణముల నన్నిటిని కాదని, ఋగ్వేద భాష్యభూమిక యందు శ్రీ సాయణులు 'మంత్రవ్యతిరిక్తభాగములు బ్రాహ్మణములు' అని జైమిన్యాది మహర్షులు జూపిన సంప్రదాయము ననుసరించి నిర్ణయించిరి. కాన మంత్రవ్యతిరిక్తభాగము బ్రాహ్మణము. అనగా సంహితలలో గాని, బ్రాహ్మణారణ్యకోపనిషత్తులలో గాని కన్పట్టు మంత్రములు మంత్రభాగమనియు, తద్భిన్నములు బ్రాహ్మణభాగ మనియు అర్థము.

బ్రాహ్మణము గూడ నచ్చటచ్చట 'అథ బ్రాహ్మణమ్' - 'ఇకమీద బ్రాహ్మణము' అనుచు, తనయందు గల య.తకు పూర్వభాగము మంత్రభాగ మను విషయమును స్ఫురింపజేయుచునే యున్నది. ఇంతేగాక 'ఇతి మంత్రాః; కల్పోఽ

మంత్రప్రవర్తకుడును, పాలకుడును, అందుచే వాక్పతియు నగు బృహస్పతి ఋగ్వేదమున బ్రహ్మచారి యని కీర్తింపబడినాడు.

'బ్రహ్మచారీ చరతి వేవిషద్విషః స దేవానాం భవత్యేకమఙ్గమ్। తేన జాయా మవిందద్ బృహస్పతిః సోమేన నీతాం జుహ్వం న దేవాః' —ఋ. 10. 109-5.

పరాదేవతయు దేవీపురాణము (45 అధ్యా.) న బ్రహ్మచారిణి యని కీర్తింపబడినది.

'వేదేషు చరతే యస్మా త్తేన సా బ్రహ్మచారిణీ'

(చూ. వాచస్పత్యమ్)

## బ్రహ్మ - బ్రాహ్మణమ్ :-

ఇట్లు కృత్స్నవేదరాశికిని బ్రహ్మ యను నామము గలదని దర్శించితిమి. ఇట నొక విషయము పరిశీలింపనగును. వేదములో గొంతభాగమునకు బ్రాహ్మణ మని పేరు. బ్రహ్మ అనగా మంత్రములు. బ్రాహ్మణము తద్వ్యాఖ్యాన రూపము. ఇట్లు బ్రహ్మసంబంధి యగుటజేసి యీ భాగమునకు బ్రాహ్మణ మనిపేరు. అందుచే నీ బ్రాహ్మణ మను నామము మంత్రములకు గల బ్రహ్మత్వమును నిరూపించుచున్నది గాన మంత్రములు బ్రహ్మశబ్ద వాచ్యములు గావచ్చును. కాని బ్రహ్మభిన్న మగు బ్రాహ్మణభాగమునకు బ్రహ్మయను నామ మెట్లు పొసగును ? ఒకవేళ నున్నదని యనినను ఈ వేద భాగమునకు 'బ్రహ్మ — బ్రాహ్మణ' నామములు రెండు నుండుటలోని సామంజస్య మేమి ? ఈ విషయమును జూతము.

పరమేశ్వరునకు గల యనేక నామములలో బ్రహ్మ, బ్రాహ్మణ శబ్దములు గూడ గలవు.

"బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మ వివర్ధనః।
బ్రహ్మవిద్ బ్రాహ్మణో బ్రహ్మీ" —విష్ణుసహస్రనామ.
తస్మై నమో బ్రహ్మణే బ్రాహ్మణాయ" భార. 12-270-17.
'బ్రాహ్మణాయ బ్రహ్మవిదభిన్నాయ' —నీలకంఠః.

బ్రాహ్మణు డన బ్రహ్మవిత్స్వరూపు డని యర్థము. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' -అను గీతావచనము నీ యర్థమును స్ఫురింప జేయుచున్నది.

బ్రహ్మ — బ్రాహ్మణశబ్దములచే జెప్పబడు నర్థము వేఱు గావచ్చును కాని, రెండు నొకే పరమేశ్వరునకు నామములై యా దేవునియందలి విభిన్న మహత్త్వమును దెలియజేయుచున్నవి. అందుచే పరమేశ్వరుడు బ్రహ్మయు బ్రాహ్మణుడు గూడ నగుచున్నాడు. కాన బ్రహ్మ, బ్రాహ్మణశబ్దముల ప్రవృత్తి నిమిత్తములు భిన్నము లయిననూ నా రెండుశబ్దములొకే తత్త్వమును బోధించునవి. ఈ సంప్రదాయము శ్రుతిసిద్ధమైనదే. ఒకే యగ్ని శ్రుతుల యందు బ్రహ్మ బ్రాహ్మణశబ్దములచే గీర్తింప బడుట గాంచ నగును.

"ఉత నో బ్రహ్మ న్నవిష ఉక్థేషు" —ఋ. 3-13-6.
"త్వం బ్రహ్మా రయివిత్ బ్రహ్మణస్పతే" —ఋ. 2-1.3.

ఈ మంత్రములయం దగ్ని బ్రహ్మ యని కీర్తింపబడినాడు.

"అగ్నే మహా నసి బ్రాహ్మణ భారత" — తై. సం. 2-5-9-1.
ఇట అగ్ని బ్రాహ్మణ శబ్దముచే గీర్తింపబడినాడు.

కనుక నొకే యగ్ని బ్రహ్మయు బ్రాహ్మణుడు నగుచున్నాడు. ఇంతే గాదు. యజ్ఞమును నిర్వర్తించెడి ఋత్విజులు శ్రుతులయందు బలుచోట్ల బ్రహ్మ

నారాశగంసీ ర్మేదాహుతయో దేవానా మభవన్. .... తై. ఆ.2-9-1.
కొలది మార్పులతో ఈ మంత్రము శతపథబ్రాహ్మణము నందును (11-5-6-8నుండి 8) గలదు. ఇచట ఋగ్యజుస్సామాథర్వణ మంత్రములతోపాటు బ్రాహ్మణభాగాధ్యయనము కూడ విధింపబడి మొత్తము మంత్ర బ్రాహ్మణాత్మకమైన వేదము యొక్క యధ్యయనము బ్రహ్మయజ్ఞ మనియు, స్వాధ్యాయ మనియు చెప్పబడినది. కాన మంత్రబ్రాహ్మణాత్మక వేదరాశికి బ్రహ్మ యను ప్రసిద్ధి సర్వవేదశాఖాసమ్మత మగుట స్పష్టము.

ఈ కారణములచే బ్రాహ్మణభాగమునకు, 'బ్రహ్మ - బ్రాహ్మణ' నామములు రెండును శ్రుతిప్రసిద్ధములై యొప్పును. ఈ విషయ మింకను 'ఛందస్' శబ్దమున వివరింపబడును.

## బ్రహ్మ - ప్రతిష్ఠా :-

వేదమునకు 'ప్రతిష్ఠ' యనియు నామము. ప్రతిష్ఠా శబ్దమునకు ఆలంబనము లేక ఆధారము అని యర్థము సర్వప్రాణులకు ఆధారమాత మగుటచే పృథివికి 'ప్రతిష్ఠ' యని పేరు. 'స ఇమాం ప్రతిష్ఠా మవిందత' (తై. బ్రా. 2-2-9-6 ఉత్పతనాది క్రియల కాలంబన మగుటచే పక్షికి పుచ్ఛము (తోక) ప్రతిష్ఠ యగుచున్నది. 'ప్రతిష్ఠా పుచ్ఛం వయసాం'- (తై. ఆ, 1-4-18.) అట్లే సృష్ట్యాది క్రియలకు ఆలంబన మగుటచే ప్రజాపతికి త్రయీవిద్యారూప మగు వేదము ప్రతిష్ఠయై యొప్పుచున్నది. ఇట్లు ప్రజాపతికి ప్రతిష్ఠారూపమై వెలయుటచే బ్రహ్మ (వేదము) సర్వమునకును ప్రతిష్ఠ యగునని శతపథ బ్రాహ్మణ మిట్లు చెప్పుచున్నది.

"సోఽయం పురుషః ప్రజాపతి రకామయత - భూయా
న్స్యామ్, ప్రజాయేయేతేతి । సోఽశ్రామ్యత్ । స తపోఽ

తపృత । స శ్రాంత స్తేపానో బ్రహ్మైవ ప్రథమ మసృజత ।
త్రయీ మేవ విద్యామ్ । సైవా స్మై ప్రతిష్ఠాऽభవత్ । తస్మా
దాహుః - "బ్రహ్మ స్య సర్వస్య ప్రతిష్ఠా" ఇతి । తస్మా
దనూచ్య ప్రతితిష్ఠతి । ప్రతిష్ఠా హ్యేషా - య ద్బ్రహ్మ ।
తస్యాం ప్రతిష్ఠాయాం ప్రతిష్ఠితోऽతపృత॥" — శ. బ్రా 6-1-18
సైవ త్రయీవిద్యా అస్మై ప్రజాపతేః ప్రతిష్ఠా జాతా,
ఉత్తరసృష్టే రాలంబనం జాత మిత్యర్థః । ....యతః సర్వస్య
త్రయీవిద్యా ప్రతిష్ఠా తస్మాత్ త్రయీం అనూచ్య అధీత్య
అనుష్ఠాయ చ ప్రతితిష్ఠతి" — సా. భా.

పై శ్రుతివాక్యముల వలన ప్రజాపతికి సృష్టికార్య నిర్వహణమున కాలం బన మగుటచే వేదమునకు ప్రతిష్ఠ యని సార్థకనామ మగుట తెలియును. ఇంతియ గాక ప్రతిష్ఠారూప వేదము నధ్యయనము జేసినవారును, తదనుగుణముగ ననుష్ఠించు వారును ఆ 'ప్రతిష్ఠ' యందు ప్రతిష్ఠితు లగుదురు. అనగా తద్రూపు (వేదరూపు) లగుదు రని భావము. ప్రజాపతియు త్రయీవిద్యా ప్రతిష్ఠితుడై సృష్టినిగూర్చి యాలోచించి, యందు ప్రతిష్ఠితుడయ్యెనని శ్రుతి ప్రతిపాదించుచున్నది. అందుచే బ్రహ్మ(వేదము) సర్వమునకు ప్రతిష్ఠ

ప్రతిష్ఠాశబ్దమునకు బ్రహ్మయనియు నర్థము. కల్పితవస్తువు అధిష్ఠాన వస్తువు నందే లయము నొందును. భ్రాంతిచే రజ్జువునందు కల్పితమైన సర్పము అధిష్ఠానమగు రజ్జువునందే లయము చెందును. అట్లే బ్రహ్మయందు అవిద్యాకల్పిత మైన జగత్తు బ్రహ్మయందే లయము చెందును. (ప్రతితిష్ఠతి) కాన జగత్తునకు బ్రహ్మ ప్రతిష్ఠ యగుచున్నాడు.

"బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఆనందవల్లి.

"సర్వస్యావిద్యాపరికల్పితస్య ద్వైతస్యావసానభూత
మద్వైతం బ్రహ్మ ప్రతిష్ఠా" — శం. భా.

"ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ" — ఐ. ఉ. 5-3.

పై సందర్భమువలన వేదమునకును, తత్ప్రతిపాద్య మగు బ్రహ్మకును 'ప్రతిష్ఠా' యను నామము శ్రుతిప్రసిద్ధము, సార్థకము నగుట దర్శించితిమి.

ప్రజాపతికి సృష్టికార్య నిర్వహణమునం దాలంబన మగుటచే వేదమునకు "ప్రతిష్ఠ" యనునది సార్థకనామ మగుట శతపథశ్రుతి వలన దెలిసినది. అంతియే గాదు. బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనము లేక ఆలంబన మగుటవలనను వేదమునకు ప్రతిష్ఠ యను నామ మన్వర్థమగుట కేనోపనిషత్తు వలనను దెలియుచున్నది.

తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః సర్వాంగాని
సత్య మాయతనమ్ ।" — కేన. ఉ. 48.

బ్రహ్మ చర్యాది తపస్సు, దమము, అగ్నిహోత్రాది కర్మ, చతుర్వేదములు తదంగములు సత్యము-అన్నియు బ్రహ్మవిద్యకు ప్రతిష్ఠాభూతములు.

ఏతేషు హి సత్సు బ్రాహ్మ్యుపనిష త్ప్రతిష్ఠితా భవతి. వేదాః
చత్వారః అంగాని చ సర్వాణి; ప్రతిష్ఠే త్యనువర్తతే'

— శం. వాక్య. భాష్య.

ఇచట వేదములే గాక వేదాంగములును, వేదవిహితములయి బహిరంగ సాధనము లయిన యజ్ఞాదికర్మలును, అంతరంగ సాధనము లయిన శమదమాదులును గూడ ప్రతిష్ఠా శబ్దముచే జెప్పబడుచున్నవి. ఇవి యన్నియు 'బ్రహ్మ' శబ్ద వాచ్యములై యొప్పినట్లే బ్రహ్మవిద్యాప్రాప్తి సాధనములై 'ప్రతిష్ఠా యను నన్వర్థ సంజ్ఞతో గూడ నొప్పుచున్నవి. ఇట కేనోపనిషత్తుచే సంగ్రహముగ వివరింపబడిన

యీ విషయమును తైత్తిరీయారణ్యకము (10-63) ఆఖ్యాయికారూపమున విపులముగ వివరించినది. 'కిం భగవంతః వరమం వదంతి' - ఓ ప్రజాపతీ ! పూజ్యులు మోక్షసాధనములలో వేనిని ఉత్కృష్టములు (పరమములు)గా జెప్పుదురు? అని జిజ్ఞాసువులై తనకడకేతెంచిన యారుణికి ప్రజాపతి యిట్లు మోక్షసాధనముల నుపదేశించినట్లు అందు గలదు.

1) "సత్యం వాచః ప్రతిష్ఠా । సత్యే సర్వం ప్రతిష్ఠితమ్ ।
తస్మాత్ సత్యం పరమం వదన్తి".

2) తపసి సర్వం ప్రతిష్ఠితం తస్మాత్ తపః పరమం వదన్తి।

3) దమే సర్వం ప్రతిష్ఠితం తస్మాత్ దమః పరమం వదన్తి।

4) శమే సర్వం ప్రతిష్ఠితం తస్మా చ్ఛమః పరమం వదన్తి।

5) దానే సర్వం ప్రతిష్ఠితం తస్మా ద్దానం పరమం వదన్తి।

6) ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా....ధర్మే సర్వం ప్రతిష్ఠితం।
తస్మా ద్ధర్మం పరమం వదన్తి.

7) ప్రజననం వై ప్రతిష్ఠా....తస్మా త్ప్రజననం పరమం వదన్తి।

8) అగ్నయో వై త్రయీ విద్యా.... తస్మా దగ్నీన్ పరమంవదన్తి।

9) అగ్నిహోత్రగ్ం సాయం ప్రాత ర్గృహాణాం నిష్కృతిః....
తస్మా దగ్నిహోత్రం పరమం వదన్తి।

10) యజ్ఞే సర్వం ప్రతిష్ఠితం తస్మా ద్యజ్ఞం పరమం వదన్తి।

11) మానసే సర్వం ప్రతిష్ఠితం తస్మా న్మానసం పరమం వదన్తి।

12) న్యాస ఇత్యాహు ర్మనీషిణో బ్రహ్మాణం....తస్మాన్న్యాస
మేషాం తపసా మతిరిక్త మాహుః।"

ఇట మోక్షసాధనములు 12 ఉపదేశింపబడినవి అందు మొదట 'సత్యం వాచః ప్రతిష్ఠా। సత్యే సర్వం ప్రతిష్ఠితమ్' అని మొదటి సాధనముగ జెప్పబడినది.

త్రైకాలిక సత్య మగు బ్రహ్మయే సత్యము. ఈ సత్యమే వాక్కునకు ప్రతిష్ఠ (ఆధారము; లక్ష్యము). 'బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ; 'యావ ద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్' ఇత్యాది వచనములు నీ యర్థమునే వివరించుట దర్శించితిమి. వాక్ప్రతిష్ఠారూపమగు నట్టిసత్యమును లేక బ్రహ్మను బొందుటకు సత్యవాక్పాల నము మొదటి సాధనముగ నిట జెప్పఁబడినది. పిదప క్రమముగ తపో, దమశమా దులు, అగ్నిహోత్రాదులు జెప్పఁబడి తుదకు న్యాసము(సంన్యాసము)సర్వోత్కృష్ట సాధనముగ జెప్పబడినది. వేదవిహితములైన నివి యన్నియు గ్రమముగ బ్రహ్మ విద్యాప్రాప్తి సాధనము లగుచు ప్రతిష్ఠా శబ్దవాచ్యము లగుచున్నవి. ఇట్లు బ్రహ్మ విద్యాప్రాప్తికి సాధనములు గానియపుడు వేదములకుగాని, వేదవిహితము లయిన యీ సాధనములకు గాని 'ప్రతిష్ఠా' అను నీ నామము అన్వర్థమై యొప్పదు.

మఱియు ప్రతిష్ఠా శబ్దము అవిచ్ఛిన్నమై అనూచానమైన స్థితిని బోధించు నది (అశీమహి గాధ ముత ప్రతిష్ఠాం నమో దివే బృహతే సాదనాయ - ఋ. 5-47-7. చూ. సా. భా; ముద్గల. భా). ఇట్టి స్థితి గలవాడు త్రైకాలిక సత్యరూపు డగు బ్రహ్మ. అందుచే బ్రహ్మ, 'ప్రతిష్ఠా' శబ్దలక్షితుడైనాడు. ఇక వేదమ్ము అనాది. సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు పూర్వకల్పీయ వేదమును స్మరించి హిరణ్య గర్భున కనుగ్రహించుట పూర్వము వివరింపబడినది. ముద ఇట్లు వేదగూ అవిచ్ఛి న్నమై యనూచానమైన స్థితి గలది యగుచున్నది. అందుచేతనే శతపథశ్రుతం "బ్రహ్మాస్య సర్వస్య ప్రతిష్ఠా - ఇతి" వేదమే సర్వమునకు 'ప్రతిష్ఠ' యని కీర్తిన చుటయు నుపపన్న మగుచున్నది.

ఇట్టి ప్రతిష్ఠాస్ఫూర్తిలక్ష్యము నుద్బోధించుటకో యనునట్లు శ్రీమద్రా మాయణ మహాకావ్యరచనమునకు మూలకందమై—

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః।
య త్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్ ॥"

అని ఛందోమయి యగుచు సరస్వతి, ప్రతిష్ఠాశబ్ద సుసంఘటితమై మహర్షి ముఖమునుండి యావిర్భవించినది.

ఇట్లు ప్రతిష్ఠాశబ్దము తత్ప్రతిపాద్య మగు బ్రహ్మకును, తద్విహిత ములై బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధనము లయిన పై సాధనములకును వాచకమై వెలయుచు వేదము యొక్క లక్ష్యమును, అనాదిత్వమును తెలియజేయుచున్నది. వేదమే యిట్లు 'ప్రతిష్ఠా' నామము ద్వారా తనకు గల సుప్రతిష్ఠితత్వమును వివరించు కొనుచుండ, అదికాదని వేదములు మానవరచితము లనియు, అందు బాహ్యదర్శ నమే కాని యాంతరదర్శనము లేదనియు జెప్పుట శ్రుతిసమ్మతము కాదు.

## బ్రహ్మ - శ్రీః :-

బ్రహ్మ యగు వేదము సర్వప్రతిష్ఠారూపమై వెలయుట దర్శించితిమి. ఋగ్యజుఃసామాత్మకమైన యీ బ్రహ్మను "శ్రీః" అని శ్రుతి కీర్తించుకొను చున్నది.

"అహే బుధ్నియ మంత్రం మే గోపాయ। యమృషయ
స్త్రయివిదా విదుః। ఋచః సామాని యజూగ్ంషి। సా హి
శ్రీ రమృతా సతామ్ ॥" —తై. బ్రా, 1-2-1-26.

అహే, బుధ్నియ - అని యిట ఆవసథ్యాగ్ని సంబోధింప బడుచున్నాడు. నాశరహితుడు, జగదాదియం దుత్పన్నుడు నగు అగ్ని - అని యర్థము. అట్టి ఓః యగ్నీ। వేదత్రయాభిజ్ఞులు, అతీంద్రియద్రష్టలు నగు ఋషులు ఏ మంత్రమును (వేదమును) ఋక్ - యజుస్ - సామాత్మకముగ దెలిసికొనిరో యట్టి నా యీ మంత్రమును రక్షింపుము. అదియే సత్పురుషులపాలిటి యమృతరూపిణి యైన సిరి (శ్రీః) -అని యర్థము.

లౌకికపగు ధనము వినాశశీలము గలది. ఋగాదిమంత్రరూప మగు ధనము అట్టిది కాదు; మరణధర్మము లేనిది. అనగా అవిచ్ఛిన్నమై యనూచానమై స్థితి (ప్రతిష్ఠ) గల్గి సత్పురుషుల కాశ్రయణీయమై "అమృతా శ్రీః" అగుచున్నది- అని తాత్పర్యము-

అహో, బుధ్నియ. యని యగ్నికి గల విశేషణములు అధియజ్ఞముగ ఆవసథ్యాగ్నిని, అధిదైవికముగ సృష్ట్యాదియం దావిర్భూతమైన హిరణ్యగర్భాఖ్య పగు మహాగ్నిని, తన్మూలభూత మగు పరంజ్యోతిని, ఆధ్యాత్మికముగ శరీరాంతర్గత మగు జ్యోతిస్సును ఉపలక్షింప జేయుచున్నవి. అట్టి మహాగ్నిని సంబోధించెడి మంత్ర మగుటచే వేదవాణి యొక్కయు తద్విహిత యజ్ఞాదికర్మల యొక్కయు అనూచానత్వము సూచిత మగుచున్నది మఱియు త్రయీవిదులగు మహర్షులు ఏ మంత్రమును (వేదరాశిని) దర్శించిరో యా మంత్రమునే నే నుచ్చరించుచున్నాను; దానిని రక్షింపుము -అని యనుటచే వేదమంత్రములు పురుషబుద్ధి కల్పితములు కావనుటయు, మంత్రము లనూచానము లనుటయు స్పష్టము చేయబడుచున్నది.

'సా హి శ్రీః అమృతా' —అనుటచే ఋగ్యజుఃసామాత్మక మగు త్రయీవిద్యయే శ్రీవిద్య. ఈ శ్రీవిద్యయే బ్రహ్మవిద్య యని ప్రసిద్ధము. బ్రహ్మవిద్యారూపిణి యగు పరాదేవతయే 'శ్రీ' రూపిణిగా ఋగ్వేదమున శ్రీసూక్తముచే కీర్తింపబడుచున్నది (చూ. ఖిలకాండ).

షడ్వింశబ్రాహ్మణమున సర్వదేవాత్మకము, సర్వవేదాత్మకము నగు 'సుబ్రహ్మణ్యా' సామకు "బ్రహ్మశ్రీః" అను నామము గలదు.

"బ్రహ్మశ్రీ ర్హైవ నామైతత్ సామ యత్ సుబ్రహ్మణ్యా"

—షడ్వింశ. బ్రా 1-2-10.

"అయం సుబ్రహ్మణ్యానిగదో బ్రహ్మశ్రీర్హైవ, బ్రహ్మణా వేదేన శ్రీయతే బ్రహ్మ వేదం శ్రయతీతి వా బ్రహ్మశ్రీ రేవ"

— సా. భా.

"బ్రహ్మశ్రీః" —అనెడి నామముగల యీ సుబ్రహ్మణ్యసామ బ్రహ్మ (వేద) సారభూతముగుటచే "సుబ్రహ్మణ్య" యగునని ఐతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది.

"త దాహుః కిం సుబ్రహ్మణ్యాయై సుబ్రహ్మణ్యాత్వ మితి,
వా గే వేతి బ్రూయాత్, వాగ్వై బ్రహ్మ చ సుబ్రహ్మ చేతి ॥
—ఐ. బ్రా. 6-3-1.

బ్రహ్మ వేదో, వా గ్వై వాగాత్మక ఏవ తస్మి న్నపి
వేదే సుష్ఠు బ్రహ్మ సారభూతం వేదవాక్యం తద్రూపేయం
వాగ్దేవతా । తస్మాత్ సారభూతస్య నిగదస్య సుబ్రహ్మణ్యేతి
నామధేయమ్' —సా. భా.

ఈ సుబ్రహ్మణ్యసామ సుబ్రహ్మణ్యదేవతాకము. అనగా ఇంద్రదేవతాకము. 'ఇంద్రాగచ్ఛ" యని యింద్రు డాహ్వానింపబడును.

"శోభనం బ్రహ్మ సుబ్రహ్మ వేదః, తస్మై హితః సుబ్రహ్మణ్య
ఇంద్రః" తై. ఆ. 1-12-, సా. భా.

అని సుబ్రహ్మణ్యశబ్ద నిర్వచనము. సుబ్రహ్మ యనగా కల్యాణప్రదమగు వేదము. అట్టి వేదవాణికి హితు డగుటచే ఇంద్రునకు సుబ్రహ్మణ్యుడని యన్వర్థ నామము. ఈ నిర్వచనము పూర్వము తెల్పిన 'బ్రహ్మణం బ్రహ్మవాహసమ్' — ఇత్యాది ఋక్ప్రతిపాదితమైన యర్థమునే యనువదించుచున్నది. కాన యనంతవేదశాఖావాహనుడై తత్ప్రతిపాద్యుడై వెలయు పరమేశ్వరుడే సుబ్రహ్మణ్యుడు – అని యర్థము. తత్ప్రతిపాదక విద్యారూప మగుటజేసియు, తదాహ్వానమునకై వేదముచే నాశ్రయింపబడుటజేసియు సుబ్రహ్మణ్య సామకు' బ్రహ్మశ్రీః' అని యన్వర్థనామము.

నేటికిని బ్రహ్మణ్యులను, పూజ్యులు నగు వారిని 'బ్రహ్మశ్రీ వేదమూర్తులు' అని సంబోధించుట శ్రుత్యనుగుణమైన సంప్రదాయముగ వచ్చుచున్నది. బ్రహ్మచే (వేదముచే) నాశ్రయణీయు లగుటచేతను లేక బ్రహ్మను (వేదమును) ఆశ్రయించువా రగుటచేగూడను, వేదమూర్తులగు బ్రహ్మణ్యులు బ్రహ్మశ్రీ శబ్ద వాచ్యులని తాత్పర్యము.

ఇట్లు బ్రహ్మ శబ్దము వేదరూపార్థమునను, పరమేశ్వర రూపార్థమునను శ్రుతిస్మృత్యాదులయందే గాక దైనందిన వ్యవహారమున గూడ బహుళ ప్రశస్తి గాంచియున్నది.

## బ్రహ్మాంజలి :-

"పాఠే బ్రహ్మాంజలిః; పాఠే విప్రుషో బ్రహ్మబిందవః" —అమర

'బ్రహ్మణే వేదాయ అంజలిః బ్రహ్మాంజలిః; బ్రహ్మణి వేదపాఠే బిందవః బ్రహ్మబిందవః' —గురుబాలప్రబోధికా

వేదపాఠమున మ్రొక్కుటకై ఘటించెడి యంజలి బ్రహ్మాంజలి. వేదాధ్యయన సమయమున వెడలెడి నోటి తుంపురులు బ్రహ్మబిందువులు అని యర్థము.

## బ్రహ్మవర్చః :-

"స్యాత్ బ్రహ్మవర్చసం వృత్తాధ్యయనర్ధిః" —అమరః.

'బ్రహ్మణో వేదస్య తపసో వా వర్చః' —అమరసుధా.

వేదాధ్యయనము లేక తపస్సు వలన సిద్ధించెడి తేజమునకు 'బ్రహ్మవర్చః' అని పేరు.

## బ్రహ్మసూత్రమ్ :-

బ్రహ్మణి వేదగ్రహణకాలే ఉచితం సూత్రమ్, బ్రహ్మసూత్రమ్
బ్రహ్మప్రతిపాదకం సూత్రం బ్రహ్మ సూత్రమ్ (శారీరకసూత్రమ్)
—వాచస్పత్యమ్)

'బ్రహ్మణః సూచకాని వాక్యాని బ్రహ్మసూత్రాణి -శం. భా. (భ.గీ.13-4.)

బ్రహ్మసూత్ర మనగా (1) వేదగ్రహణకాలోచితమగు యజ్ఞోపవీతము. (2) బ్రహ్మప్రతిపాదక శారీరకసూత్రములు (3) బ్రహ్మసూచకములగు వేదవాక్యములు – అని యర్థము.

## బ్రహ్మస్థలి :-

అగ్నిష్టే ష్వగ్నిశాలాసు తథా బ్రహ్మస్థలీషు చ।
సరీసృపాణి దృశ్యన్తే హవ్యేషు చ పిపీలికాః॥" —రామా. 6-10-16

సీతాపహరణ మనెడి యపచారము వలన లంకయందు గల్గినదుర్నిమిత్తములను విభీషణుడు నిండు కొలువులో. రావణునకు వివరించె డిశ్లోక మిది.

"మహారాజా। మహానసముల (పాకగృహముల) యందును, అగ్నిహోత్రశాలలయందును, బ్రహ్మస్థలుల (వేదాధ్యయనస్థానముల) యందును సర్ప

ములు గన్పట్టుచున్నవి: దేవతల కొసగెడి ఆజ్యపురోడాశాది హవ్యములయందు పురుగులు గోచరించుచున్నవి -అని యర్థము.

ఇట బేర్కొనబడిన పవిత్రస్థానములలో బ్రహ్మస్థలులను గలవు. రాజు కామోపహతుడై చేసెడి యపచారముల వలన దేశమున గల పవిత్రములు, ప్రశాంతములు నగు స్థలములయందు గల్గెడి సంక్షోభ మిట విభీషణునిచే వివరింపబడినది.

ఇట్లు బ్రహ్మశబ్దమున కనుమానముగ స్మృతిపురాణేతిహాస కావ్యాది వాఙ్మయమునందును దైనందిన వ్యవహారమునందును బ్రసిద్ధములై యే యర్థములు గన్పట్టుచున్నవో ఋగాదివేదరాశియందు నిట్టి యర్థములే ప్రసిద్ధములై యుండుట దర్శించితిమి. అందుచే నీ శబ్దముయొక్క యర్థము విషయమై క్రమపరిణతి గలదనెడి చారిత్రికుల యూహ శ్రుతిస్మృత్యాది సంప్రదాయ విరుద్ధము. పై గ్రంథసందర్భము ననుసరించి చూచినచో పరమేశ్వరునకును వేదమునకును గల ప్రతిపాద్య - ప్రతిపాదక భావసంబంధము నుపలక్షింప జేయుటకే, వేద - ఋషి శబ్దముల వలెనే, బ్రహ్మ - ప్రతిష్ఠా శబ్దములుగూడ పరమేశ్వరునకును వేదమునకునుగూడ వాచకములై బ్రసిద్ధము లయినట్లు స్పష్టమగును కాన బ్రహ్మ యనగా వేద మనుట నిర్వివాదము. ఇది యత్యంతపవిత్రము. అందుచే నిరంతరాధ్యయనాభ్యాసాదుల ద్వారా తరతరములనుండి సంప్రాప్తమైన యీ బ్రహ్మవృక్షము విషయమై యనాదరము వలదు; రక్షించుకొనుడు; తత్ఫలముల నాస్వాదింపుడు-అని మహాభారత మిట్లు ప్రబోధించుచున్నది.

"బ్రహ్మవృక్షో రక్ష్యమాణో మధు హేమ చ వర్షతి।
అరక్ష్యమాణః సతత మశ్రు పాపం చ వర్షతి॥"

—భార. 12-73-14.

ఇట్లు నిరంతరాధ్యయనాభ్యాసాదులచే రక్షింపబడునది యగుటచే వేదమునకు ఆమ్నాయః అని పేరు. ఇక వేదముయొక్క ఆమ్నాయ శబ్దమును జూతము.

# ఆమ్నాయః - శ్రుతిః

గురుశిష్య పరంపరావభాసాం
శ్రవణామ్నాయ సమాహితా ముదారామ్ ।
అవిలంఘ్యపదాం కుహేతువాదైః
శ్రుతి మాద్యాం కలయే హరిప్రియాం తామ్॥

— వేదమాతృస్తవః.

అంగైరుపాంగై స్సముపాస్య మానా
యజ్ఞాది కర్మ స్వమ వర్తతే యా।
సనాతనీ నిత్యనవా భవన్తీ
సా వేద మాతాఽ వతు దేవమాతా॥

శ్రుతిః, ఆమ్నాయః — అనియు వేదమునకు నామములు.

శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః' — అమరకోశము.

నియమపూర్వకముగ మరల మరల నావృత్తి చేయబడుచు నభ్యసింపబడునది యని ఆమ్నాయశబ్దార్థము. (అ - మ్నా - అభ్యాసే - కర్మణి ఘఞ్: 'ఆమ్నాయః సమ్యగభ్యాసః సమ్యక్ పాఠశ్చ - అభ్యాసస్య సమ్యక్త్వం చ నియమ ధారణ పూర్వకత్వం, గురుముఖ శ్రవణ పూర్వకత్వం చ - ఆమ్నాయస్య క్రియార్థత్వా. - జై. సూ. (వాచస్పత్యమ్.)

పై యర్థమును బరిశీలించుచో ఆమ్నాయపదముచే, వేదము గురు ముఖోచ్చారణానూచ్చారణ రూపమున శ్రూయమాణ మగుచు ననాది కాలమునుండి

నేటివఱకును గురుశిష్యపరంపరాప్రాప్తమై నిలిచి యుండుట - తెలియుచున్నది. కావుననే యీ వేదవిద్య సంప్రదాయవిద్య యని ప్రసిద్ధి జెందినది. 'అథామ్నాయః సంప్రదాయః' (అమరః) అని ఆమ్నాయపదము సంప్రదాయము - అను నర్థమున ప్రసిద్ధ మగుటయు నిందుకు దార్ఢ్యము. ఇట్లు సంప్రదాయానుగతమై, శ్రూయమాణమై వర్తిల్లునది యగుటచే వేదమునకు శ్రుతి యనియు సార్థకనామము. శ్రుతి యనియే గాదు; శ్రుతా, అనుశ్రవ, - ఇత్యాది నామములు గూడ ప్రసిద్ధములు

శ్రుతా :-

"గిరః శ్రుతాయాః పుష్పిణ్యాః" —— భాగ. 4-2-25.

"శ్రుతాయాః వేదరూపాయాః" —— శ్రీధర

"అభూన్నృపో విబుధసఖః పరంతపః శ్రుతాన్వితో దశరథ

ఇత్యుదాహృతః" .... భట్టి 1-1.

శ్రూయన్త ఇతి శ్రుతాని, వేదాదీని, తైరన్వితః .... జయమంగళ.

అనుశ్రవః :-

"అనుశ్రవిక ఏవ నౌ కశ్యప ఇతి" .... తై. ఆ. 1-7-3

గురూపదేశ మను శ్రూయత ఇత్యనుశ్రవో వేదః తత్ర

వావగతః అనుశ్రవికః. .... సా. భా.

"దేవానాం గుణలింగానా మానుశ్రవిక కర్మణే" —— భా. 2-2-32

"గురో రుచ్చారణ మను శ్రూయాత ఇత్యనుశ్రవో వేదః;
తద్విహితమానుశ్రవికం — శ్రీధరః

"అనుసృత్య అవిచ్ఛిన్న పాఠపరంపరా శ్రూయత ఇత్యనుశ్రవో వేదః.
తద్విహిత మానుశ్రవికమ్" —— వీరరాఘవీయవ్యాఖ్య,

'అనుశ్రవిక' పదము సాంఖ్య, యోగాది దర్శనములయందు నీ యర్థమున నత్యంత ప్రసిద్ధము;

ఈ శ్రుతి, శ్రుతా, అనుశ్రవ, ఆమ్నాయ - శబ్దము లన్నియు వేదముల యొక్క అవిచ్ఛిన్న గురుశిష్యపరంపరాప్రాప్తిని దెలియజేయునట్టివి. అనగా నీ నాడు గురుముఖమునుండి వేదము శిష్యునిచే నెట్లు ప్రాప్త మగుచున్నదో, యనాది నుండియు నట్లే గురుముఖమునుండి ప్రాప్తమగుచు వచ్చినది.

వేదస్యాధ్యయనం సర్వం గుర్వధ్యయనపూర్వకమ్ ।
వేదాధ్యయనసామాన్యా దధునాఽధ్యయనం యథా ॥"

అను నీ మీమాంసకన్యాయము 'శ్రుతి — ఆమ్నాయ' శబ్దార్థముల దలపింపజేయు చున్నది. ఈ శబ్దార్థ పర్యాలోచనల ననుసరించి వేదములు మానవ రచితములును లిఖితములును గావనియు; లిఖిత వేదపఠనము సంప్రదాయ విరుద్ధము (శ్రుతి - ఆమ్నాయ శబ్దతాత్పర్య విరుద్ధము) అనియు నర్థములు స్ఫురించుచున్నవి.

## శ్రుతర్షిః - శ్రుతర్ణః :-

పరమేశ్వరునకు ఏకర్షి, ముఖ్యర్షి యను నామములవలెనే (చూ. ఋషి శబ్దము) శ్రుతర్షి యనియు నామము గలదు.

"శ్రుతర్షి ముగ్ర మభి మాతిషాహమ్" .... తై. బ్రా. 2-5-6-1.

'శ్రుతర్ణిం ఋషిషు మంత్రేషు ఇంద్రసూక్తాదిషు
శ్రూయమాణం' .... సా. భా.

శ్రుతిరూపము లగు స్తుతుల నాదరముతో వినుచుండు వాడగుటచే అగ్నీంద్రాదులకు 'శ్రుత్కర్ణః' అని పేరు.

'శ్రుత్ స్తుతీః సమ్యక్ శృణ్వన్ కర్ణః శ్రోత్రేన్ద్రియం
యస్య' .... సా. భా 10-140-6.

ఈ యగ్నీంద్రాది నామములు మానవకల్పితములు గావు. శ్రుతిచోదితములని యనుచు తనకు గల శ్రుతిత్వమును శ్రుతి యిట్లభివ్యక్తము జేయుచున్నది.

"పదో యత్త్వం పరమః ఆ జనిష్ఠాః పరావతి శ్రుత్యం నామ
బిభ్రత్" .... ఋ. 5-30-5.

ఈ మంత్రమున సర్వోన్నతు డగు నింద్రుడు శ్రుత్యమగు నామమును ధరించి యెల్లెడల నభివ్యక్త మగుచున్నట్లు చెప్పబడినది. శ్రుత్య మనగా శ్రుతిసిద్ధమై యజ్ఞమున శస్త్ర - స్తోత్రాదులయందు శ్రవణీయ మగు నామము (శ్రుతిః స్తుతిః తత్ర భవం శ్రుత్యమ్ - సా. భా. ఋ. 1-117-23) అని యర్థము.

## పూర్వ్యం బ్రహ్మ :-

వేదవిద్యయొక్క యనూచానత్వమును శ్రుతియే స్వయముగ నిట్లు జెప్పి కొనినది.

"యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిః" — ఋ. 10-13-1
అ. వే. 18-3-34; వా. సం. 11-5; తై సం. -1-1-2.

"పూర్వ్యం పూర్వస్మిన్ కాలే భవం అనాదికాలప్రవృత్త
మిత్యర్థం। ఏవంభూతం బ్రహ్మ మంత్యమ్" .... సా. భా,

ఈ మంత్రమున గల 'పూర్వ్యం బ్రహ్మ' అను పదములు వేదమనాది కాలప్రవృత్త మగుటను స్పష్టముగ దెలియజేయుచున్నవి.

## పిత్ర్యా - సనజా - పూర్వ్యా :-

ఇట్లనాదికాల ప్రవృత్త మనియే కాక, పితృపరంపరాప్రాప్తమై, సనాతనమై యలరారుటయు శ్రుతి యిట్లు వివరించియున్నది.

"దివశ్చిదా పూర్వ్యా జాయమానా వి జాగృవి ర్విదథే
శస్యమానా భద్రా వస్త్రాణ్యర్జునా వసానా సేయ మస్మే
సనజా పిత్ర్యాధీః ॥" .... ఋ. 3-39-2

ఈ మంత్రమున ఇంద్రు నుద్దేశించిన స్తుతిలక్షణమగు వాక్కుయొక్క స్వరూపము వివరింపబడుచున్నది. స్తుతిరూపమైన యీ వే వాక్కు (పిత్ర్యా పితృ క్రమాగతా, అతఏవ సనజా పురాతనీ సతీ ధీః తవ స్తుతిర్భవతి' —సా.భా.) పితృక్రమాగత మగుచు, అందుచే పురాతనమైనది యని యర్థము. మఱియు నీ వేదవాక్కు యజ్ఞమున వినియుక్త మగు నపుడు (విదథే శస్యమానా) జాగరణ శీలమై, అనగా స్తోతవ్యుడగు నింద్రుని ప్రబోధించునదై (జాగృవిః స్తుత్యస్య తవ జాగరణం కుర్వాణా), కల్యాణకరములు దోషరహితములు దివ్యతేజఃసంపన్నము లగు వస్త్రములను అనగా తేజస్సులను దాల్చినదై (భద్రా కల్యాణాని అర్జునా శుక్లవర్ణాని, వస్త్రాణి యోగ్యతయా తేజాంసి, వసానా), వెలయునని యిట వివరింపబడినది. మఱియు 'దివశ్చిత్ ఆజాయమానా పూర్వ్యా' -అని యనుటచే దివముకంటెనుగూడ పురాతనమై యావిర్భవించినది యను నర్థమును ప్రతీతమగు

చున్నది. (ద్యులోకమునుండి యావిర్భూతమై పురాతనమైనది —ద్యులోకాత్ ఉదీయమానా పురాతనీ —అని. వేం. మా. భా.).

ఈ మంత్రము ననుసరించి వేదవాక్కు అతిపురాతనము; అందుచేసనాతనము; పితృపరంపరాప్రాప్తము.; యజ్ఞాదికర్మలయందు వినియుక్తమగునపుడు దేవతాప్రబోధకము -అనగా దేవతాతత్త్వ ప్రకాశక మగు వేదమై వెలయును; దివ్యతేజఃసంపన్నమై యొప్పును; లేనిచో నక్షరరాశిగ మాత్రమే కనుపట్టును-అను విషయ మిట సూచితము.

మఱియు నీ మంత్రము నందలి 'సనజా, పిత్ర్యా, పూర్వ్యా, విదథే శస్యమానా' —ఇత్యాది పదము లర్థవంతములు వీనివలన వేదమంత్రములు మానవరచితములు గావనియు ఈ వాక్కులకు అనాదికాలమునుండియు యజ్ఞాదికర్మల యందు మాత్రమే వినియోగము; దేవతాతత్త్వ ప్రకాశనమునందే లక్ష్యము లౌకికగ్రంథములకు వలె లౌకికసంఘటనల వర్ణించుటయందు తాత్పర్యము లేదనుటయు సూచిత మగుచున్నది.

అనాదికాలప్రవృత్తము, పితృపరంపరాప్రాప్తము—అగుటచేనన్యభాష. యందును, రచనలయందును కాలక్రమానుగతములై కన్పట్టెడి పరిణామము లీ వైదికవాణియందు దొరలియుండ లేదనుటయు స్పష్టమగుచున్నది. కాన, భాషా పరిణామ, భాషాసామ్యాది సిద్ధాంతముల బురస్కరించుకొని వేదభాగములకు పౌర్వాపర్యము ను గల్పించుటయు, చరిత్ర కల్పనల జేయబూనుటయు శ్రుతి సంమతము గాదు. ఒకవేళనట్లు చేయబూనుచో నపుడీ వేదవాక్కునకుగల పూర్వ్యా. పిత్ర్యా, సనజా, విదథే శస్యమానా, జాగృవిః -ఇత్యాది విశేషణము లుపపన్నము లగుట యెట్లు ?

కాని యీ పదములగూర్చి చరిత్రకారులిట్లు చెప్పుచున్నారు

Old Poems were inherited and refurbished by members of the composers's family, but the greataim of the

singers was to produce new and approved hymns. It is not till the time of the Brahmanas that the composition of the hymns appears to have fallen into disuse, though Poetry was still produced, for example. in the form of Gathas, which the priests were required to compose themselves and sing to the accoman.ment of the lute at the sacrifice."

(Vedic Index - చూ. ఋషిశబ్దము)

"ఋగ్వేదకాలమున మంత్రరచయితలు (ఋషులు) పితృపరంపరగా తమకు సంక్రమించిన పద్యముల (Poems)ను తమ కుటుంబసభ్యుల సాహాయ్యముతో మెఱుగులు దిద్దెడివారు; కాని సర్వామోదమును గాంచగల నూతనమంత్రముల (hymns) రచించుటయందే వారికి దృష్టి హెచ్చు; బ్రాహ్మణముల కాలమున నూత్నమంత్రరచనోద్యమము సన్నగిలినది; అయ్యును పురోహితులు గాథారూపములగు పద్యముల రచించి యజ్ఞములందు వానిని వీణమీద గానము చేయవలెననెడి నియమము రూపొందినది." -అని యర్థము. మఱియు ఋగ్వేదమున. గొన్ని యెడల 'పూర్వ, పూర్వ్య, నవ, నవ్య' -ఇత్యాది విశేషణములు మంత్రములచే జేయబడు స్తోత్రములకు' గలవు.

"తాన్ పూర్వయా నివిదా హూమహే" ఋ. 1-89-3.

"ఇయం తే పూష న్నా ఘృణే సుష్టుతి ర్దేవ నవ్యసీ"

—ఋ. 3-62-7

ఇట పూర్వమంత్రమున 'పూర్వయా నివిదా' అనియు, రెండవ మంత్రమున 'నవీయసీ సుష్టుతిః' అనియు స్తుతివిశేషణములు గన్పట్టుచున్నవి. ఇట్లు,

పూర్వయా, నవీయసీ'— ఇత్యాది విశేషణములు గన్పట్టుట వలన ఋగ్వేదము
గొన్నిమంత్రములు పూర్వ్యములు పితరులనుండి రచయితలకు సంక్రమించినవి
మఱికొన్ని నవ్యములు -నూతనముగా రచయితలచే రచింపబడినవి -అని చారిత్ర
కులు చెప్పుచున్నారు. ఇందలి సామంజస్యమును జూతము.

## నవ - నవ్య - నవీయసీ :-

లోకవ్యవహారమున నవ, నవ్య నవీయసీ— ఇత్యాది పదములు
నూతనమైనది యను నర్థము ప్రసిద్ధము. ఈ యర్థమున మాత్రమే గ్రహిం
చారిత్రికులు మంత్రార్థవివరణమునకు బూనిరి. ఈ పదముల కర్థ మింతియేకాద
ఇంతియే యగుచో నీ క్రిందిమంత్రముల కర్థము పొసగదు.

'తం త్వా వయం సుధ్యో నవ్య మగ్నే' —ఋ. 6-1-

'తం త్వా ను నవ్యం సహసో యువన్ వయమ్' -ఋ. 1-141-1

ఈ మంత్రములయందు అగ్నికి 'నవ్యం' అను విశేషణము గలదు'

"అవిద ద్దక్షం మిత్రో నవీయాన్" -ఋ. 6-44-

"శర్ధంతం శిమ్యు ముచథస్య నవ్యః" -ఋ. 7-18-

ఈ మంత్రములయందు ఇంద్రుడు 'నవీయాన్, నవ్యః' అని కీర్తిం
బడినాడు. చారిత్రికుల వాదము ననుసరించి ఇంద్రుడును, అగ్నియును, ఆది
లనెడివారి కత్యంత ప్రాచీన దేవతలు గదా! వారు నవ్యలని కీర్తింపబడు
యెట్లు ? వారి వాదము ననుసరించియు నిట నవ్య-నవీయః పదములకు నూతను
(క్రొత్తవాడు) అను నర్థము పొసగదు. అందుచే శ్రుతి తాత్పర్యానుగుణముగ
యగ్నీంద్రాదుల నవ్యత్వ మెట్టిదో దర్శించి తదనుగుణముగ మంత్రము
లేక స్తోత్రముల యొక్క నవ్యత్వమును దర్శింపవలసియున్నది.

'నూయతే స్తూయతే ఇతి నవః -ణు స్తుతౌ' -అమరసుధా.

పై నిర్వచనము ననుసరించి 'నవ' శబ్దమునకు స్తుత్యుడు, లేక స్తుత్యము-అని యర్థము. భాష్యకారులు నీ యర్థమునే గ్రహించిరి. ఉదా॥

"ప్రాతా రథో నవో యోజి సస్నిః" -ఋ 2-18-1.

'రథః రంహణో ద్రథో యజ్ఞః, స చ నవః। నూయతే స్తూయతే ఽత్రేతి నవః స్తుతిమాన్। సస్నిః ష్ణా శౌచే శుద్ధః। ఏవంవిధో యజ్ఞః ప్రాతఃకాలే యోజి అయో జ్యస్మాభిః' -సా. భా'

'స్తుత్యము, పరిశుద్ధము నగు యజ్ఞమనెడి రథము ప్రాతఃకాలమున ఆయత్తము చేయబడినది -అని యర్థము. నిరంతరము రంహణశీలము (గమనశీలము) గలది యగుటచే నిట యజ్ఞము రథముగా గీర్తింపబడినది. నవ మనగా స్తుత్యము. నిరంతరము స్తుత్యమై పరిశుద్ధ మగుటచే నా యజ్ఞరథము నవః' సస్నిః -అని కీర్తింపబడినది. ఈ యజ్ఞరథ మతి ప్రాచీనము. అయ్యును నిరంతరస్తుత్యమై ప్రతిదినము ప్రాతఃకాలమున ప్రాతః సవనముతో బ్రవర్తిత మగుచుండును. అందుచే నిత్యనూతనము నయియు నొప్పును. సూర్యచంద్రు లతిప్రాచీనులు. అయ్యును ప్రతిదినము నుదయించుచు నిత్యనూతనములై యొప్పుదు రని శ్రుతియిట్లు కీర్తించుచున్నది.

'నవో నవో భవతి జాయమానః' -ఋ. 10-85-19.

కాన, 'నవః' అను పదమునకు స్తుత్యుడు నూతనుడు - అనెడి యర్థములు రెండును గ్రాహ్యములు.

నవ శబ్దమునకు గల యీ రెండర్థములను కాళిదాసమహాకవియు నిట్లు వ్యక్తము చేసినాడు.

"పంచానా మపి భూతానా ముత్కర్షం పుపుషు ర్గుణాః।
నవే తస్మిన్ మహీపాలే సర్వం నవ మివాభవత్" -రఘు, 4-11

దిలీపానంతరము రఘుమహారాజు సింహాసనము నధిష్ఠించినంపనే పృథి వ్యాది పంచభూతముల యొక్క గంధాదిగుణము లుత్కర్షతో — అపూర్వమహత్త్వముతో — విరాజిల్లినవి. ఆ రఘువు నవభూపాలు డయినంతనే యిట్లుసర్వము నవ మయినట్లు తోచెను. పూర్వ మేభూతజాత ముండెనో యదియేపూజ్యుడు, స్తుత్యుడు నగు రఘువు నూతనముగ రాజపదమునధిష్ఠించినతరువాతను గలదు. కాని, యపుడది యపూర్వగుణసంపత్తిచేనపూర్వమై ప్రశస్తమైనది(స్తుత్యమైనది) వోలె నొప్పెనని తాత్పర్యము. ఇట జమత్కారముగ నవశబ్దమునకు గల రెండర్థములును నభివ్యక్తము జేయబడినవి.

అగ్నీంద్రాదిదేవత లతిప్రాచీనులయ్యును ప్రతిదినమును యజ్ఞము లందు లేక కర్మానుష్ఠానములందు స్తూయమానులై యావిర్భవించుట జేసి నవ్యులగుదురు. అనగా "స్తుత్యులు — నిత్యనూతనులు" — అగుదురని యర్థము కావుననే, భాష్యకారులు నీ పదముల నిట్లువ్యాఖ్యానించిరి.

"ఇంద్రః నవీయాన్, నవతరః కల్యాణః, స్తుత్యః।'
—సా. భా. ఋ. 6।44।7.

"ఉక్థైః శస్త్రైః, నవ్యః స్తుత్యో య ఇంద్రః।" —సా, భా, 1,61।13.

"నమసా నవ్యో అర్కైః" — ఋ, 1।62।11.

"హే ఇంద్ర అర్కైః శస్త్రరూపైః మంత్రైః, నమసా నమస్కారేణ, యః త్వం, నవ్యః స్తుత్యో, భవసి" —సా, భా,

పై మంత్రముల బరిశీలించినచో ఇంద్రుడు లేక అగ్ని స్తోత్రములచే స్తూయమాను డగుటచే "నవ్యః, నవీయాన్" అని కీర్తింపబడుట స్పష్టము. ఈః మంత్రము లన్నియు అగ్నీంద్రాదుల యొక్క సార్వకాలీనస్తుత్యత్వమును "నవ్య" పదముచే దెలియజేయుచున్నవి. అందుచేతనే అగ్ని "సదానవః" —

(ఋ, 3।11।5.) అనికీర్తింపబడినాడు. నిరంతరస్తుత్యుడని యర్థము. అత్యంత ప్రాచీను డయ్యును నిత్య నూతను డని తాత్పర్యము.ఈ విషయమునుఋగ్వేదమే యిట్లు జెప్పుచున్నది.

"యః పూర్వ్యాయ వేధసే నవీయసే" -ఋ. 1-156-2.

"పూర్వ్యాయ పూర్వకాలీనాయ నిత్యాయేత్యర్థః,- వేధసే వివిధ జగత్కర్త్రే, నవీయసే నిత్యనూతనాయ, అత్యంత రమణీయా యేత్యర్థః" —సా, భా.

"ధియో రథేష్ఠా మజరం నవీయో" -ఋ. 6-21-1.

"హే ఇంద్ర। త్వాం హవన్తే హ్వాయంతి, కీదృశమ్। రథేష్ఠా రథే స్థితం, అజసం జరారహితం, నవీయః నవీయాంసం నవతరమ్" —సా. భా.

ఇట నీ పై రెండు మంత్రములందును పరమేశ్వరుడు పూర్వ్యుడయ్యును నవ్యుడు - నిత్యనూతనుడు - అత్యంత రమణీయుడు అని కీర్తింపబడినాడు. అనగా నిత్యుడు, నిత్యస్తుత్యుడు నని తాత్పర్యము. పరమేశ్వరునకు జెప్పబడెడి 'పూర్వ్య - నవ్య' ఇత్యాది విశేషణములే, ఋగ్వేదమున మంత్రమునకును, మంత్రములచే నొనర్చబడు స్తుతిరూపమగు వేదవాక్కునకును గూడ జెప్పబడినవి. యజ్ఞమెట్లు ప్రాచీనమై నవ్యమో, యజ్ఞదేవుడగు అగ్ని (పరమేశ్వరుడు) యెట్లు పూర్వ్యుడై నవ్యుడో, యట్లే యజ్ఞమునందుపయుక్తమయ్యెడి వేదవాక్కు గూడ పూర్వ్యమై నవ్యము నగును- అనగా - నిత్యము, స్తుత్యము నగును. అందుచేతనే పై నుదహరించిన 'పూర్వయా నివిదా' యను పదములను శ్రీసాయణు లిట్లే వ్యాఖ్యానించినారు.

'పూర్వయా పూర్వకాలీనయా నిత్యయా నివిదా వేదాత్మికయా వాచా'

ఇట నొక యాక్షేపము. వేదవాక్కు పూర్వ్యమై నవ్యమగు నవియు-అందుచే నిత్య మనియు జెప్పుట తగదు. స్తుతిరూపమగు మంత్రజాతము యజ్ఞములయందు నూతనముగ నుత్పన్న మగునని ఋగ్వేదమున జెప్పబడుచున్నది.

ఉదా :-

1. "నవం ను స్తోమ మగ్నయే దివః శ్యేనాయ జీజనమ్"

—ఋ. 7-15-4.

"అగ్నయే నవం నూతనం స్తోమం జీజనం జనయామి"

-సా. భా.

అగ్నికొఱకై నూతనమగు స్తోమమును జనింపజేయుచున్నాను -అని యర్థము.

2. "శుచిం ను స్తోమం నవజాత మద్యేంద్రాగ్నీ వృత్రహణా జుషేథామ్"

-ఋ. 7-93-1.

'హే ఇంద్రాగ్నీ ! శుచిం శుద్ధం నిరవద్యం, నవజాతం ఇదానీ ముత్పన్నం స్తోమం అస్మదీయం స్తోత్రం, అద్య అస్మిన్ కాలే, ను క్షిప్రం జుషేథామ్ సేవేథామ్'

-సా. భా.

ఓ ఇంద్రాగ్నులారా ! ఇపుడు నూతనముగ నిష్పన్నమైన మా యీ స్తోత్రము శుద్ధము - నిర్దోషము. దానిని మీరు గ్రహింతురు గాక యని యర్థము.

3. "శ్రుష్ట్యగ్నే నవస్య మేస్తోమస్య వీర విశ్పతే" -ఋ. 8-23-14.

హేవీర ; విశ్పతే అగ్నే నవస్య ఇదానీం క్రియమాణత్వా న్నూతనం, మే మదీయం, స్తోమస్యస్తోత్ర శస్త్రాదికం శ్రుష్టి శ్రుత్వా'

సా. భా.

ఓ యగ్నీ ! ఇపుడు మాచే జేయబడిన యీ నూతన స్తోమమును (స్తోత్రశస్త్రాదికమును) విని .... అని యర్థము.

ఇట్లు పై మంత్రములందు స్తోత్రములు నూతనముగ నుత్పన్నము లగుట దెలియును. కాన వేదవాక్కు నిత్యమని యనుట యెట్లు ?

ఈ యాక్షేపము సరికాదు. ఇట నూతనముగ నుత్పన్నము లగు నట్లు చెప్పబడినవి స్తోత్రములు; మంత్రములు గావు. మంత్రములు వేఱు; స్తోత్రములు వేఱు. కాన సంప్రదాయము ననుసరించి స్తోత్రస్వరూపమును దర్శింపవలసి యున్నది. పూర్వసిద్ధము లయిన వేఱ్వేఱు పుష్పములతో మాలలను గ్రుచ్చుదురు. ఇట పుష్పములు స్వకల్పితములు గావు. హారములు మాత్రమే నవజాతములు - నూతనముగ నిష్పాదితములు, అట్లే యజ్ఞమున జేయబడు స్తోత్రములు నవజాతములు. ఈ స్తోత్రములందు గూర్చబడెడి మంత్రములు నవజాతములు గావు; పూర్వసిద్ధములు.

శస్త్రము, స్తోత్రము- అని యజ్ఞమునందు జేయబడు స్తుతి రెండు విధములు, ఋఙ్మంత్రములచే హోత యను ఋత్విక్కు చేయు శంసనమునకు "శస్త్ర" మనియు, "పుష్టి" యనియు పేరు. ఈ విషయమును ఋగ్వేదమే యిట్లు చెప్పుచున్నది.

"ఋచాం త్వః పోష మాస్తే పుపుష్వాన్" —ఋ. 10-72-11.

హోతృనామక ఏక ఋత్విక్ యజ్ఞ కాలే స్వకీయ వేదగతానాం ఋచాం పుష్టిం కుర్వ న్నాస్తే। భిన్నప్రదేశే ష్వామ్నాతానాం ఋచాం సంఘాత మేకత్ర సంపాద్యైతావ దిదం శస్త్ర మితి

క్లృప్తిం కరోతి; సేయం పుష్టిః" —సాయణ ఋగ్వేద భాష్యభూమికా.

"ఏకో హోతృనామకః ఋత్విక్ తత్ర విప్రకీర్ణత్వే నాధీతానాం ఋచాం యజ్ఞానుష్ఠానకాలే సంఘీభావ మాపాద్య పుష్టిం కుర్వన్నాస్తే" —సాయణ సామవేదభాష్యభూమికా.

యజ్ఞానుష్ఠానకాలమున హోత యను ఋత్విక్కు స్వకీయవేదగతము లయిన ఋక్కులకు బుష్టిని కూర్చుచుండును. తా నధ్యయనము జేసిన వేదములో భిన్నప్రదేశముల యందు బఠితము లయిన ఋక్కులను హోత యజ్ఞానుష్ఠాన కాలమునం దొక సంఘాతముగ సంపాదించును. ఇట్లు కూర్చబడిన మంత్రసముదాయమే శస్త్రము, ఇదియే పుష్టి - అని యర్థము. కాన నిట్లు శస్త్రములు హోతచే నిష్పన్నములు చేయబడుచుండును; మంత్రములు గావు. పూర్వసిద్ధము లయిన మంత్రముల చేతనే భిన్న భిన్న సవనములందు (ప్రాతఃసవన, మాధ్యందినసవన, తృతీయసవనములందు) భిన్నభిన్న దేవతల నుద్దేశించి భిన్నభిన్న శస్త్రములు నిష్పన్నము లగు చుండును.

ఇక స్తోత్రము 'సామ్నా స్తువీత' -సామలచేతనే స్తోత్రము చేయబడవలెనని శ్రుతిశాసనము (మా. జై. సూ. 9-2-30). కాని సామలచే చేయబడు స్తుతికి స్తోత్రమని పేరు. సామ యనగా గానము. ఋక్కులయందే సామలు గానము చేయబడును. 'ఋచి అధ్యూఢం సామ' — (ఛాం. ఉ. 1-6-1): (ఋచి సామ గీయతే' -శ. బ్రా. 8-1-3-3— అనుచు శ్రుతి యీ సంప్రదాయమును వివరించుచున్నది. కాన, యజ్ఞసమయములందు ఋక్కులయందు జేయబడు గానమునకు, సామ యని పేరు. కొన్నియెడల సామయొక ఋక్కునందే గానము జేయబడును. దానికి, 'ఏకర్చగాన' మని పేరు. మఱికొన్నియెడల 'ఏకం సామ తృచే క్రియతే స్తోత్రియమ్' అను నియమము ననుసరించి యొకే సామ మూడు ఋక్కుల యందు గానము జేయవలెను. కొన్నియెడల నొకే సామ రెండు ఋక్కుల యందే గానము జేయవలెను. అట్టియెడ పై నియమము ననుసరించి యీ రెండు ఋక్కులను మూడు ఋక్కులుగ ప్రగథనముజేసి సామ గానము జేయవలసి యుండును. దీనికి 'ప్రగాథ' మని పేరు. ఋక్త్రయము నందు జేయబడెడి సామ గానమునకు 'తృచగాన' మని పేరు. ఇట్లు ఈ సామగాన రూపమగు స్తోత్రము సవన - దేవతా - ఛందోభేదముల ననుసరించి వివిధగతుల మార్పు చెందుచుండును. ఋత్విజులు తత్కాలమున శ్రుత్యుక్తప్రకారము వీని నూహించి

చేయవలసియుండును. కాన, స్తోత్రము గూడ యజ్ఞకాలమున నూత్నరూపముల నిష్పన్న మగుచుండును. ఈ విషయమును ఋగ్వేద మిట్లుచెప్పుచున్నది.

"గాయత్రం త్వో గాయతి శక్వరీషు" —ఋ. 10-72-11.

'ఉద్గాతృ నామక ఏక ఋత్విక్ గాయత్ర శబ్దాభిధేయం స్తోత్రం శక్వరీశబ్దాభిధేయాసు ఋక్షు గాయతి ధాతూనా మనికార్థత్వేన స్తుతిక్రియా వాచినో గాయతి ధాతో రుత్పన్నో గాయత్రశబ్దః'

—సాయణ. ఋగ్వేదభాష్యభూమికా.

ఉద్గాత యను ఋత్విక్కు శక్వరీనామకము లగు ఋక్కులయందు గాయత్రమను పేరు గల స్తోత్రమును (సామను) గానము చేయుచున్నాడు—అని యర్థము. కాన క్రత్వనుగుణముగ నా యా ఋక్కులయందు సామనూహించి గానము చేయు సాంప్రదాయ మీ మంత్రము వలన దెలియును. ఇట్లు శస్త్ర—స్తోత్రము లనునవి పూర్వసిద్ధము లయిన మంత్రముల చేతనే తత్కాలమున శ్రుతిప్రోక్తవిధముగ ఋత్విజులచే యజ్ఞములందు గూర్పబడుచుండును. ఇందు శస్త్రముల గూర్చెడి ఋత్విజుని "ఉక్థభృత్" అనియు, సామల (స్తోత్రముల) గూర్చెడి ఋత్విజుల "సామభృత్" అనియు ఋగ్వేద మిట్లు కీర్తించుచున్నది.

'ఉక్థభృతం సామభృతం బిభర్తి'—ఋ. 7-34-14.

"ఉక్థభృతం శస్త్రాణాం సంభర్తారం" "సామభృతం ఉద్గాతారం" —సా, భా.

(శస్త్ర—సామస్వరూపము, తద్గాననియమాదుల వివరణము సాయణ ఋక్—సామ వేదభాష్యోపక్రమణికలయందును, తాండ్య మహాబ్రాహ్మణోపోద్ఘాతాదుల యందును గాంచనగును) పైగ్రంథసందర్భము ననుసరించి "గానయుక్తమంత్రసాధ్యమగు స్తుతి స్తోత్రము; గానరహిత మంత్రసాధ్యమగు స్తుతి శస్త్రము"-అనితెలిసినది ఈ విషయము సాయణులచే స్పష్టముగ నిట్లు చెప్పబడినది.

'అప్రగీతమంత్రసాధ్యా స్తుతిః శస్త్రమ్, ప్రగీతమంత్రసాధ్యా స్తుతిః స్తోత్రమ్' సా. భా. తై. సం 3-2-7-3.

అందుచే ఋక్సామాత్మకములై కూర్పబడెడి శస్త్ర - స్తోత్రములు శ్రుతిప్రోక్తములై ప్రాచీనము లయ్యును నవజాతము లగుచుండునని శ్రుతి కీర్తించుట యుక్తమే. ఈ విషయము 'హరియోజన' శబ్ద పరిశీలనము వలనను స్పష్టమగును.

## హరియోజనః :-

ఇంద్రుని యశ్వములకు 'హరీ' యను పేరు శ్రుతులయందు ప్రసిద్ధము. ఇంద్రుడు యజ్ఞార్థమై యేతెంచునపుడు హరులనెడి యీ యశ్వద్వయము రథమునకు యోజనము చేయబడును. కాన నింద్రునకు 'హరియోజనః' అని ప్రసిద్ధి. ఇంద్రుని యీ రథాశ్వము లేవియో పరిశీలింతము.

"ఋక్సామే వా ఇంద్రస్య హరీ"

తై. సం, 6-5-9-2; ఐ. బ్రా 2-24' తై. బ్రా, 1-6-3-9.

"ఋక్సామే వై హరీ" — శ, బ్రా, 4-'-3-6.

"ఋక్సామవేదాత్మకౌ వింద్రస్యాశ్వౌ" -సా, బ్రా తై సం, 1-4-23-10.

ఋక్సామవేదము లింద్రుని యశ్వములని యర్థము. ఋత్విజులు క్రతువ్వనుగుణముగ దత్కాలమున నూహించి చేసెడు శస్త్రముల వలనను స్తోత్రముల వలనను ఋక్సామాత్మకములగు వేదము లింద్రుని రథాశ్వములుగ రూపొందుచుండును.

"బ్రహ్మణా తే బ్రహ్మయుజా యునజ్మి హరీ" -ఋ, 3-35-4.

"హే ఇంద్ర బ్రహ్మయుజా బ్రహ్మణా మంత్రేణ యోక్తవ్యౌ....
తే తవ హరీ అశ్వౌ బ్రహ్మణా స్తోత్రేణ, యునజ్మి
రథే సంయోజయామి" -సా భా.

ఇట నింద్రాశ్వములు 'బ్రహ్మయుజా' అని పేర్కొనబడినవి బ్రహ్మచే (మంత్రరూపస్తోత్రముచే) యోక్తవ్యములు. కాన, బ్రహ్మచే (స్తోత్రముచే) యోజన చేయబడుచున్నట్లు చెప్పబడినది.

"యజ్ఞం విమాయ కవయో మనీష
ఋక్సామాభ్యాం ప్రరథం వర్తయ ని' ....ఋ, 10-114-6.

"ఛందాంసి గాయత్ర్యాదీనితత శస్త్రాదిరూపేణ
ధారయన్తః, కవయః, మనీషా-మనీషయా బుద్ధ్యా, ఏవం
యజ్ఞం విమాయ నిర్మాయ, రథం రమన్తేఽత్రేతి రథో యజ్ఞః
తం రథం యజ్ఞం, ఋక్సామాభ్యాం ప్రవర్తయన్తి ప్రకర్షేణ
సంపాదయన్తి" -సా. భా

ఋత్విజులు తమ బుద్ధితో వివేచన జేసి స్తోత్ర - శస్త్రముల జేయుచు ఋక్సామలచే యజ్ఞరథమును బ్రవర్తింప జేయుచున్నారు - అని యర్థము.

కాన, మొత్తము మీద వేదమంత్రము లతి ప్రాచీనములు. శస్త్ర స్తోత్రములు ఋత్విజులచే తత్కాలమున క్రత్వనుగుణముగ (బ్రాహ్మణ - కల్ప- అనుసారముగ) నూహించి రూపొందింపబడుట స్పష్టము. ఇట్లు, దేవతాహ్వాన స్తుతిసాధనములైన వీనిని "నవ్యము" లని, ఋగ్వేదము పలుచోట్ల నిట్లు కీర్తించినది.

"నవ్య మతక్ష ద్బ్రహ్మ హరియోజనాయ". --ఋ. 1-62-13.

'హరియోజనాయ ఇంద్రాయ నవ్యం నూతనం బ్రహ్మ
ఏతత్సూక్త రూపం స్తోత్రం అతక్షత్ అకరోత్' -సా, భా.
"ఇంద్రయస్తే నవీయసీం గిరం మంద్రా మజీజనత్"
-ఋ. 8-95-5.

'హే ఇంద్ర! యః యజమానః నవీయసీం నవతరాం పునః పునః క్రియమాణయా, మంద్రాం మదకరీం, గిరం స్తుతి లక్షణాం వాచం తే త్వదర్థం అజీజనత్ ఉదపీపదత్ అకార్షీ దిత్యర్థః' సా- భా.

ఇట స్తుతిలక్షణమగు వేదవాక్కు యజ్ఞమున ఋత్విజులచే పునః పునః క్రియామాణ మగుటచేతను, దేవతాహ్వాన స్తుతి సాధనమై స్తుత్యమై ప్రశస్తమై యొప్పుటచేతను 'నవ్య-నవీయసీ' యని కీర్తింపబడినది.

ఇట్లు నిరంతరాధ్యయనాభ్యాసాదుల చేతను, యజ్ఞాదికర్మలయందు శస్త్ర స్తోత్రాదిరూపమున పునః పున రావర్తితమై యామ్నాతమగుచు నిత్యనూతనమై విల సిల్లుటచేతను శ్రుతికి 'ఆమ్నాయ' మని సార్థకనామము. శ్రుతులయందలి 'నవ-నవ్య' ఇత్యాది పదములు శ్రుతి యొక్క ఆమ్నాయత్వోద్బోధకములు ఈ పదముల తత్త్వము నిట్లు దర్శింపక, వీని నాధారము జేసికొని ఋగ్వేదకాలమున నూత్నమంత్ర రచనోద్యమము గలదని చెప్పెడి చారిత్రికుల కల్పన యుక్తిసహము కాదు; శ్రుతి తాత్పర్యానుగుణమును గాదు.

## నవ - ప్రణవః :-

ఇంతవఱకును దేవతలు, మంత్రములు, స్తోత్రములు పూర్వ్య-నవ ఇత్యాది పదములచే గీర్తింపబడుట గాంచితిమి. ఈ శబ్దములు 'స్తుత్యము, ప్రశస్తము, నిత్యనూతనము, నిత్యము' అను నర్థముల బోధించుటయు జూచితిమి. అందుచేతనే సర్వదేవాత్మకుడు, సర్వవేదాత్మకుడు నగు పరమేశ్వరుని బోధించెడి సర్వవేదాత్మకము, వేదమూలభూతము నగు ఓంకారము గూడ 'ప్రణవః' అను సార్థకనామధేయముతో నొప్పినది

'ప్రణూయతే ప్రస్తూయతే ఇతి ప్రణవః' —అమరసుధా.

అతిశయించి, మరల మరల స్తూయమాను డగుటచే పరమేశ్వరునకు ప్రణవశబ్దము వాచకమైనది.

"తస్య వాచకః ప్రణవః" —యోగ.సూ.

నిరంతరము స్తూయమాన మగుటచే ఓంకారమునకును 'ప్రణవః' అని పేరు.

"ప్రణౌతీతి ప్రణవః, తస్మాదోమితి ప్రణౌతి ఇతి శ్రుతేః"

—శం. భా. (విష్ణు స.)

ఈ ప్రణవ నామౌచిత్యము మహాభాష్యమున నిట్లు చెప్పబడినది.

"ప్రణవ ష్టేః" — పా సూ.

'ప్రణవ ఇత్యుచ్యతే। కః ప్రణవో నామ ? పాదస్య వా౽
ర్ధర్చస్య వా౽న్త్య మక్షర ముపసంహృత్య తదాద్యక్షర
శేషస్య స్థానే త్రిమాత్ర మోంకారం త్రిమాత్ర మోంకారం
వా విదధతి తం ప్రణవ ఇత్యాచక్షతే।" —మహాభాష్య.

యజ్ఞకర్మణి టేః ప్రణవః ఆదేశో భవతి —ఇత్యాది"

....కాశికా.

యజ్ఞకర్మ యందు ఋక్పాదముయొక్క గాని, ఋగర్ధభాగముయొక్క గాని చివర 'టీ' భాగమునకు విధింపబడెడి త్రిమాత్రమగు ఓంకారము లేక ఓకారము ప్రణవము. ఉదా :—

'అపాం రేతాంసి జిన్వ తోజమ్'
'దేవాన్ జిగాతి సుమ్నయోజమ్' —ఇత్యాది.

ఇట్లు యజ్ఞకర్మ యందు మరల మరల ప్రస్తూయమాన మగుటచేసి 'ఓం' కారమునకు, లేక 'ఓ' కారమునకు ప్రణవ మనెడి సార్థకనామము సిద్ధించి

నట్లు మహాభాష్యవచనము వలన గ్రహింపనగును. ఈ సంప్రదాయము నేటికిః యజ్ఞములందు గాంచనగును. శస్త్రముల చివర ప్రణవోచ్చారణము నాంతరీయకః మని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"ప్రణవైః శస్త్రాణాగ్ం రూపమ్" —వా. సం. 19-27

'ప్రణవైః ఓంకారైః శస్త్రాణాం రూప మాప్యతే'

—ఉవట మహీధరౌ.

యజ్ఞాదులయందే గాదు. వేదాధ్యయనాదులు, వేదమంత్రోచ్చారణము. వీనినెపుడు జేసినను నాద్యంతముల యందు ప్రణవోచ్చారణము చేయవలె నని శ్రుతి సంప్రదాయము.

"యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠితః"

--తై. ఆ. 10-10-3.

ఇట్లు ఓంకారము వేదాధ్యయనాదుల యందును, యజ్ఞాదికర్మల యందును పునఃపునరావృత్తమై ప్రస్తూయమాన మగుచు, నిత్యనూతన మగుచు ప్రశస్తమై 'ప్రణవ' రూప మగుచున్నది. యజ్ఞాదికర్మలయందు అగ్నియు (పరమేశ్వరుడు) పునఃపునః ప్రస్తూయమాను డగుచు నిత్యనూతను డగుట చేతనే 'సదా నవః' (ఋ. 3-!!- ) అని ఋగ్వేదమున కీర్తింపబడినాడు. ఈ సదానవత్వమే ప్రణవత్వము, ఇట్లే ప్రణవస్వరూప పరిశీలనము వలనను నవ శబ్దము 'స్తుత్యము, ప్రశస్తము. నిత్యనూతనము' అను నర్థముల బోధించుట స్పష్టము. కాన శ్రుతులయందు గల 'పూర్వ్య - నవ్య' ఇత్యాది పదములచే గీర్తింపబడెడి వేదవాక్కు 'స్తుత్యము, ప్రశస్తము, నిత్యనూతనము, అందుచే నిత్యము' —నవి గ్రహించుటయే సంప్రదాభిమతము. కావుననే,

'వాచా విరూప నిత్యయా" —ఋ. 8-75-6

యనుచు ఋగ్వేదమే "వేదవాక్కు నిత్యము" – అని ముక్తకంఠముగ కీర్తించినది. కాన, "ఋగ్వేదకాలమున మంత్రరచనోద్యమము సాగినది; బ్రాహ్మణములకాలమున సన్నగిల్లినది" – యనెడి చారిత్రికుల కల్పన నిర్మూలనమై పరాస్తమగుచున్నది. ఇక "బ్రాహ్మణములకాలమున మంత్ర రచన సన్నగిల్లినను పురోహితుడు గాథారూపములగు పద్యముల (మంత్రముల) రచించి యజ్ఞము లందు వానిని గానము చేయవలె ననెడి నియమమేర్పడినది" –యనెడి చారిత్రికుల కల్పన యందలి సామంజస్యమును జూతము.

## స్వయంకృత గాథా గానము శ్రుతులు :-

అశ్వమేధయాగమున స్వయంకృతములైన గాథలను వీణ మీద గానము చేయు సంప్రదాయము శ్రుతి సిద్ధము. కాని యిది పురోహిత (ఋత్విక్) కృత్యము (The priests were required to compose and sing .... ....at the sacrifice) –అని యనుట శ్రుతి సంప్రదాయవిరుద్ధము. గానము నందును గద్య - పద్య - రచనమునందును కౌశలము గల యొక బ్రాహ్మణుడును, నొక క్షత్రియుడును నీ కృత్యమును నిర్వర్తింపవలె నని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"తస్యై ప్రయాజేషు తాయమానేషు బ్రాహ్మణో వీణాగాథీ
దక్షిణత ఉత్తరమంద్రా ముదాఘ్నాన్ త్రిస్రః స్వయం
సంభృతా గాథా గాయతి" ఇత్యయజత, ఇత్యదదా దితి"

—శ. బ్రా. 13-4-2-8

"అథ సాయం ధృతిషు హూయమానేషు రాజన్యో వీణాగాథి
దక్షిణత ఉత్తరమంద్రా ముదాఘ్నున్ త్రిస్రః స్వయం
సంభృతా గాథా గాయతి, ఇత్యయుధ్యత, ఇత్యముం
సంగ్రామ మజయదితి" -శ. బ్రా. 13-4-3-5.

"దివా బ్రాహ్మణో గాయేత్। నక్తగ్ం రాజన్యః...."
"ఇత్యదదా ఇత్యయజథా ఇత్యపచ ఇతి బ్రాహ్మణో గాయేత్"
"ఇత్యజినా ఇత్యయుధ్యథా ఇత్యముగ్ం సంగ్రామ మహన్నితి
రాజన్యః" --తై బ్రా. 3-9-14-2, 3.

అశ్వమేధయాగమున పగలు ప్రయాజహోమ సమయమున బ్రాహ్మణుడును, సాయంహోమ సమయమున రాజన్యుడును "ఉత్తరమంద్ర" యనెడి వీణ మీద స్వయంకృతములయిన మూడు గాథలను గానము చేయవలెను. అందు బ్రాహ్మణుడు - "యజ్ఞదీక్షితుడగు ఈ రాజు ఇట్లు యజ్ఞము చేసెను; ఇట్లు దానము చేసెను; ఇట్లు శాకపాకాదుల వండించెను" -అని వర్ణించుచు స్వకీయమైన గద్య_పద్య రచనముతో గానము చేయవలెను. ఇక క్షత్రియుడు - "ఈ రాజిట్లు యుద్ధము చేసెను: ఇట్లు సంగ్రామమున శత్రువుల సంహరించెను: ఇట్లు జయించెను," అని వర్ణించుచు స్వకీయమైన గద్య పద్య రచనలతో గానము చేయవలెను -అని యర్థము.

ఈ శ్రుతి వాక్యముల బరిశీలించుచో గద్యపద్యముల రచించి గానము చేసెడి కృత్యము పురోహిత (ఋత్విక్) ధర్మము గాదని స్పష్టము. ఇట్లు రచింపబడి గానము చేయబడెడి గాథలు వేఱ్వేఱు అశ్వమేధయాగము లందు, వేఱ్వేఱు దీక్షితులయిన రాజుల ప్రశంసించుచు, వేఱ్వేఱు గాయకులచే, వేఱ్వేఱు కాలము లందు రచింపబడుచుండును.

(తతో బ్రాహ్మణః స్వోచితార్థప్రతిపాదకై ర్గద్యైః పద్యైశ్చ గాయేత్....
అత ఏవ తద్విషయై ర్గద్యైః పద్యైశ్చ రాజన్యో గాయేత్ -తై. బ్రా.

ఇట్లు ఈ గాథలు (రచనలు) ఎప్పటికప్పుడు మాఱిపోవుచుండును. కావున నివి మంత్రములు గావనుట స్పష్టము. మంత్రములకు మార్పు ఉండదు. "స్వయం కృతాభిః" అను విశేషణముచే గాయకులచే నివి స్వయంరచితము లని తెల్పబడుటచే నీ గాథలు మంత్రములు గావు- అని శ్రుతియే స్పష్టము చేయుచున్నది.

మఱియు నిట్టి గాథలు స్వయంకృతములని చెప్పబడుటచే ఋత్విజులచే యజ్ఞమున వినియోగింపబడెడి తదితరమంత్రములు "స్వయంకృతములు గావు; పురుషరచితములు గావు; అపౌరుషేయములు గావు; అపౌరుషేయమును" -అను విషయము గూడ నిట శ్రుతిచే స్పష్టము జేయబడినది. కాన బ్రాహ్మణముల కాలమున గాథలనెడి మంత్రజాతమును పురోహితులు రచింపవలెనను నియమ మేర్పడిన దని జెప్పెడి చారిత్రికుల కల్పన శ్రుతిసంప్రదాయ విరుద్ధము. ఇట్టి యీ పదముల నాధారము జేసికొని మంత్రములు మానవరచితములని చెప్పబూనుట యుక్తముగాదు

కాన పూర్వోదాహృతము లయిన శ్రుతి, శ్రుత, అనుశ్రవ, పిత్ర్యా సనజా, పూర్వ్యా, నవ్య, నవజాత - ఇత్యాది పదములు శ్రుతి యొక్క అనూచానత్వమును, ఆమ్నాయత్వము నుత్పాదించునవియే యగుట స్పష్టము. ఇంతేకాదు అనుశాసన, అనూచానాది పదముల వలన నీ విషయ మింకను తేటపడగలదు.

## అనుశాసనమ్ :-

ఈ వైదికవాణి నియమపూర్వకముగ గురుముఖము నుండియే గ్రహింపబడవలె నను సంప్రదాయమును శ్రుతియే —

"వేద మనూచ్యాచార్యోఽన్తేవాసిన మనుశాస్తి" — శిక్షావల్లి.

ఇత్యాద్యనుశాసనముల ద్వారా తెలియజేయుచున్నది. తనను అభ్యసించు విషయమై శ్రుతి యిట్లు అనుశాసించు చేమి ?

1. వేదమంత్రోచ్చారణ విషయమునను, 2. మంత్ర వినియోగ విషయమునను' 3. అర్థావబోధ విషయమునను — పరంపరాప్రాప్తమైన

సంప్రదాయములను సంప్రదాయ పరినిష్ఠితుడైన యాచార్యుని ముఖము నుం గ్రహింపవలెనని శ్రుతి తాత్పర్యము. అట్లుఆచార్యుని ముఖము నుం గ్రహింపక లిఖిత పాఠాది గ్రంథ సాహాయ్యమున నెవరికి దోచిన యట్లు వార లధ్యయనము జేయ బూనుచో పురుష బుద్ధిగత భ్రమ ప్రమాదాది దోషములచే నప్రయత్నముగనే యుచ్చారణాదులయందు వైషమ్యము సంభవించు సహజము. సంప్రదాయానుగతమైన యర్థావగతి గలుగక విపరీతార్థ ప్రతీతిం గలుగుట సంభవమగును. అట్టిచో శ్రుత్యుద్దిష్టమైన లక్ష్యము నెఱవేఱదు. లిఖిత గ్రంథాది సాహాయ్యముచే నుచ్చరింపబడు వాక్కుగాని, దానిని యథోచితము ననువదించి కల్పించెడి చరిత్ర కల్పనగాని 'నిత్యము, సనాతనము' పూర్వ్యము దేవతా జాగరణ శీలము కాజాలదు. అందుచే నాచార్య ముఖమునుండి నియమ పూర్వకముగ నుచ్చారణానుచ్చారణ రూపమున గ్రహింపబడవలెనని శ్రుతి యను శాసించుచున్నది.

## వాకః - అనువాకః - అనూచానః - అనూక్తమ్ :-

పై తైత్తిరీయ శ్రుతి వాక్యమున 'వేదం అనూచ్య' అను పదము వేదాధ్యయన మనగా వేదానువచనము — అను విషయమును వ్యక్తము చేయు చున్నవి. 'త మేతం వేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషన్తి' — ఇత్యాది శ్రుతి వాక్యములును వేదాధ్యయనమునకు గల వేదాను వచనత్వ ప్రసిద్ధిని దృఢ పఱచుచున్నవి.

భరద్వాజుడు ఇంద్రానుగ్రహముచే త్రిపురుషాయుర్దాయమును బడసి వేదాధ్యయనము జేసెను. ఆయన జేసిన అధ్యయనము గురుముఖోచ్చారణా నూచ్చారణరూపమే — అనగా వేదానువచన రూపమే — యగుట ఇంద్ర వాక్యమువలన దెలియుచున్నది.

"స హోవాచ। భరద్వాజే త్వామన్వ్రి। వేదా వా ఏతే।
అనంతా వై వేదాః। ఏత ద్వా ఏతైః స్త్రిభి రాయుర్భి
రన్వవోచథాః" తై. బ్రా. 3-10-11-4.

'త్వ మేతైః స్త్రిభి రాయుర్భిః ఏత స్మృష్టిత్రయ పరిమితం
వేదజాతం గురూపదేశ మన్వధీతవా నసి' సా. భా.

ఇట, 'అన్వవోచథాః" అను పదముచే వేదాధ్యయనము 'అనువచన రూపమే' యను సంప్రదాయమును శ్రుతి తెలియజేయుచున్నది. ఇట్టి సంప్రదాయమును శ్రుతి యడుగడుగున అనూచ్య, అన్వవోచత్ - ఇత్యాది క్రియల ద్వారా చాటుచునే యున్నది. శతపథశ్రుతియు వాక్త్రైవిధ్యము నిట్లు చెప్పుచున్నది.

"ధీరసి దక్షిణాఽసి (వా. సం. 4-29) ఇతి। ధియా ధియా
హ్యేతయా మనుష్యా జుజ్యూషన్తి అనూక్తేనేవ,
ప్రకామోద్యేనేవ, గాథాభి రివ, తస్మా దాహ - ధీరసీతి"

— శ. బ్రా. 3-2-4-16.

'ధియా ఇత్థం వదిష్యా మీతి బుద్ధ్యా చిప దభివదన రూపేణ
కర్మణా వా। ధీరితి కర్మ నామ। జుజ్యూషన్తి జీవితు మిచ్ఛన్తి
మనుష్యాః। .... అనూక్తేన అనువచనేన వేదాధ్యయనే నేత్యర్థః।
ప్రకామోద్యం ఇచ్ఛయా లౌకిక భాషణం। గాథా గద్యపద్యగీత్యా
ద్యాత్మికా। సర్వత్ర ఇవ శబ్దో వాక్యాలంకారార్థః। ఏవంవిధై
ర్వాగ్విశేషైర్యతో జీవితు మిచ్ఛన్తి అతో ధీరసీత్యుక్తమ్" - సా. భా.

సోమక్రయణీరూపిణి యగు ధేనువు వాగ్రూపిణిగ నిట స్తుతింపబడుచున్నది (వాగ్రూపాధ్యారోపకల్పనయా సోమక్రయణీ గౌః స్తూయతే - ఉవట,

మహీధర. భా.). ఇట్లు చెప్పెద నని మొదట బుద్ధిచే నిశ్చయించి యా యర్థము తరువాత వాక్కుచే ప్రకాశింపచేయబడును. ఈ వాక్కు లోక వ్యవహారమునకు మూలము. అట్టి వాక్కు 'అనూక్తము - ప్రకామోద్యము - గాథ' యని మూడు విధములు. అనూక్త మన అనువచనము - వేదాధ్యయనము ప్రకామోద్యమనగా స్వేచ్ఛగా నొనరించెడి లౌకిక భాషణము. గాథ యన గద్య పద్య గీత్యాది రూపము. ఇట్టి వాగ్విశేషముల చేతనే మానవ జీవితము నడుచును. సోమ క్రయణి యగు ధేనువు త్రివిధవాగ్రూపిణి; వాక్కు ధీరూపము. అందుచే 'ధీరసి' యని స్తుతింపబడినది - యని యర్థము.

ఇట పేర్కొనబడిన త్రివిధవాక్కులలో నొకటి అనూక్తము (వేదాధ్యయనము) చెప్పబడినది. అందుచే నిది తదితర లౌకిక భాషణ, గాథా రూపములగు వాక్కులకంటె విలక్షణ మగుట స్పష్టము. అనగా అనూచ్యమానత్వ మను ధర్మము వేదవాక్కునకే గాని తదితర వాక్కులకు లేదనెడు విషయమిట స్పష్టము జేయబడినది.

ఇట్లు అనూచానముగ అనూచ్యమాన మగుచుండుటచే వేదమునకు 'అనూవాకః, అనూచాః' ఇత్యాది నామములును ప్రసిద్ధములైనవి.

## అనువాకః - వాకః -

'అనూచ్యతే (అను + వచ్ + ఘఞ్) - గానశూన్యే ఋగ్విశేషే, ఋగ్యజుఃసమూహే శత్రునామ్నా ఖ్యాతే వేదాంశే'

— వాచసత్యమ్.

ఈ నిఘంటువు ననుసరించి ఋగ్యజుస్సమూహరూప వేదమునకును శత్రురూప వేదభాగమునకును 'అనువాకః' అని ప్రసిద్ధి యున్నట్లు తెలియు

చున్నది. కాని, మహాభారతము ననుసరించి కృత్స్న వేదపాఠమునకు 'అనువాక' మని పేరున్నట్లు తెలియుచున్నది.

"శ్రోత్రియస్యేవ తే రాజన్ మందకస్యావిపశ్చితః ।
అనువాకహతా బుద్ధి ర్నైషా తత్త్వార్థదర్శినీ ॥"

— భా ఆర. 3-35-19.

'అనువాకః గురూక్తి మనువచనమ్, తేన హతా అర్థజ్ఞాన శూన్యస్య వేదాక్షరమాత్రాభ్యావినః' — నీలకంఠః

ఈ వివరణము ననుసరించి అనువాక మనగా గురుముఖోచ్చారణ అనూచ్చారణరూపమైన వేదాధ్యయనము; గురూపదేశము ననుసరించి యథాతథముగ మరల మరల నావృత్తి జేయబడు వేదమంత్ర పాఠము — అని యర్థము.

మహాభారతమున నింకొక యెడ 'వాక, అనువాక' శబ్దముల ప్రయోగ మిట్లు గలదు.

"యం వాకే ష్వనువాకేషు నిష త్సూపనిషత్సు చ ।
గృణన్తి సత్యకర్మాణం సత్యం సత్యేషు సామసు ॥"

— భారత. 12-47-26.

'వాకేషు మంత్రేషు సామాన్యతః కర్మప్రకాశకేషు, అనువాకేషు మంత్రార్థవివరణభూతేషు బ్రాహ్మణవాక్యేషు, నిషత్సు కర్మాంగాద్యవబద్ధ దేవతాదిజ్ఞానవాక్యేషు, ఉపనిషత్సు కేవలాత్మజ్ఞాపక వాక్యేషు - గృణన్తి ధ్యాయన్తి, సత్యం, అబాధితం, సత్యేషు అబాధితార్థేషు, సామసు జ్యేష్ఠ సామాదిషు'. — నీలకంఠః

వాకము లనగా సామాన్యముగ గర్మం ప్రకాశింపజేసెడి మంత్రములు అనువాకము లనగా మంత్రార్థ వివరణ రూపములగు బ్రాహ్మణ వాక్యములు. నిషత్తు లనగా కర్మలకును, తదంగములకును సంబంధించిన దేవతాదిజ్ఞానమును బోధించు వాక్యములు; ఉపనిషత్తు లనగా కేవలాత్మ జ్ఞాపక వాక్యములు — అని యర్థము.

భారతము ననుసరించి యనువాక మనగా 'వేదానువచనము' అనునర్థము పూర్వ శ్లోకమున తెల్పబడినది. ఈ శ్లోకమున మంత్రార్థ వివరణ రూపము లగు బ్రాహ్మణము లని యర్థము తెల్పబడినది. మొత్తముమీద అనూచ్యమాన ధర్మము గలవి యగుట జేసి ఋగాది మంత్రములకును అనువాకము లని పేరు. ఇంతే కాదు.

## అనూచానః - నిధిః :-

పై కారణములచేతనే వేదములకు 'అనూచానః' అను నామము శ్రుతి ప్రసిద్ధము.

"అథ యదేవాఽనుబ్రువీత - తేన ఋషిభ్య ఋణం జాయతే ।
తద్ధ్యేభ్య ఏతత్ కరోతి — ఋషీణాం నిధిగోపః - ఇతి
హ్యనూచాన మాహుః ॥" .... శ. బ్రా. 1-7-2-3.

'అథేతి అనుబ్రువీత అనువచనం కుర్యాత్ అధీయేతేత్యర్థః ।
నిధిగోప ఇతీతి । ఉపభుజ్యమానోఽపి యో న వినశ్యతి స
నిధిః । తాదృశః ఋషీణాం సంబంధీ యో వేదాఖ్యో నిధిః
తస్య గోపయితా ఇతి వేదం అనూచ్యమానం ఆహుః బుధాః ।
అతస్తేషాం ప్రవచనం ధన మితి గమ్యతే ॥' — సా. భా.

ఎంత యనుభవించినను నేది తఱుగదో యది నిధి. వేదము అట్టి నిధి. ఋషులు దీర్ఘ తపఃసమాధిలో దర్శించి యనుగ్రహబుద్ధితో లోకమున కొసగిన పెన్నిధి యది. కావున నది ఋషినిధి. నియమపూర్వకముగ నధ్యయనముజేసి ఋషి ఋణమును తీర్చికొనవలెను. అట్లు ఋషిఋణమును తీర్చికొనెడి వేదరక్షకులకు 'నిధిగోపాః' అని పేరు. అనూచానముగ ఋషిఋణవిముక్తికై యనూచ్యమాన పఠగుటజేసి వేదమును 'అనూచాన' మని చెప్పుదురు. అట్టి రక్షకులకు ప్రవచనమే ధనము-అని శ్రుత్యర్థము. పై శ్రుతివలన వేదమునకు 'అనూచానః 'అను పేరు ప్రసిద్ధము. 'అనూచానః ప్రవచనేసాంగేఽధీతీ' యని యమరసింహుని వచనము. కాన, షడంగసహితమగు అనూచానము (వేదము) నధ్యయనముజేయువారును'అనుచానాః'అని చెప్పబడుదురు. 'యే వా అనూచానాస్తే కవయః,ఐ (బ్రా.2–2; 2–3ర) అనుచు శ్రుతి కవులను 'అనుచానాః'అని కీర్తించినది 'అత్ర కవిశబ్దేన అనుచానాః షడంగసహిత వేదాధ్యాయినఉచ్యంతే,-అని యనుచు, శ్రీ సాయణుడును షడంగ వేదాధ్యయనపరులు అనూచానులు; వారే కవులని వివరించినాడు.

మఱియు వేదము ఒక నిధి; తత్ప్రతిపాద్య మగు బ్రహ్మ రెండవ నిధి; వేదాధ్యయనపరుడు బ్రహ్మచారి యగుచు తపస్సుచే నీ నిధుల రెంటిని కాపాడుచుండు నని అథర్వణశ్రుతి (అ వే. 1-5-10)చే పూర్వము వివరింపబడినది. (చూ. బ్రహ్మశబ్దము). అక్షయ వేదనిధి స్వరూపుకు సంప్రదాయ ప్రవర్తకుడు నగు గురువుగా నారదుడు శిశుపాల వధ మహాకావ్యమున నిట్లు ప్రశంసింపబడినాడు.

"సదోపయోగేఽపి గురు స్త్వ మక్షయో నిధిః శ్రుతీనాం
ధనసంపదా మివ" —— శిశు. 1-28.

ఈప్రమాణముల ననుసరించి వేదాధ్యయన మనాదినుండి ఋషిఋణవిముక్తికై చేయబడుచు,ఋషు లొసగిన యీ పెన్నిధిని యథాతథముగ గాపాడుటకై యుద్దేశింపబడినదని తెలియును.

దేవ, ఋషి, పితృఋణ విముక్తి నొందుటకై యే విధముగ నియమపూర్వక వేదాధ్యయనము జేసి విహిత కర్మానుష్ఠానపరు లగుచు నిధిరక్షకులు గావలెనో శ్రుతి స్మృతి పురాణేతిహాసాదులు పెక్కురీతుల నాదేశించినవి.

1. విద్యా హ వై బ్రాహ్మణ మాజగామ గోపాయ మా శేవధి ష్టే"
ఽహ మస్మి। అసూయకా యానృజవే ఽయతాయ న మా బ్రూయా
వీర్యవతీ తథా స్యామ్ ॥

2. య ఆతృణ త్త్యవితథేన కర్ణా వదుఃఖం కుర్వ న్నమృతం
సంప్రయచ్ఛన్ । తం మన్యేత పితరం మాతరం చ తస్మై న
ద్రుహ్యేత్ కతమ చ్చ నాహ ॥

3. అధ్యాపితా యే గురుం నాద్రియన్తే విప్రా వాచా మనసా
కర్మణా । యథైవ తే న గురో ర్భోజనియ స్తథైవ తా న్న
భునక్తి శ్రుతం తత్ ॥

4. య మేవ విద్యాః శుచి మప్రమత్తం మేధావినిం బ్రహ్మ
చర్యోపపన్నమ్ । య స్తేన ద్రుహ్యేత్ కతమచ్చ నాహ
తస్మై మా బ్రూయా నిధిపాయ బ్రహ్మన్ ॥"

సంహితోపనిషద్బ్రాహ్మణమ్ 3; నిరు. 2-4; విష్ణు. స్మృ. 29, 30. అధ్యా;
వాసిష్ఠ. స్మృ. 2-8; మను. స్మృ. 2-114, 115, 145.

'ఋణాని త్రీ ణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్ ।
అనపాకృత్య మోక్షం తు సేవమానః వ్రజ త్యధః॥'

— మను. 6-35.

పూర్వోక్త ప్రమాణముల ననుసరించి దేవదత్తము, ఋషిప్రోక్తము, పితృ పరంపరాప్రాప్తము నైన నిధి యగుటచే, దేవ - ఋషి - పితృ ఋణ విముక్తి నొందుటకై యీ వేదము అధ్యయన, అధ్యాపన, కర్మానుష్ఠానముల ద్వారా తరతరములుగ సంరక్షింపబడుచు వచ్చినదని తెలియును. అందుచే వేదమునకును, లేక వేదాభ్యాసమునకును, అనువాక, అనూచానాది నామములు సార్థకములై యొప్పుచున్నవి.

## ఆమ్నాయాంబుధిమంథనమ్ - అమృతపానమ్ :-

ఆమ్నాయ పద లక్షితార్థము గూడ నిదియే ఆమ్నాయ మనగా నిరంతరాభ్యాసపూర్వకముగ నధ్యయనము జేయబడునది - అని యర్థము. అధ్యయనము లేక యభ్యాసమనగా కేవల శబ్దరాశిని కంఠస్థము చేయుట. కంఠస్థము చేసి మరల మరల నావృత్తము జేయుట మాత్రమే యర్థము గాదు. ఆ మంత్రముల నా యా కర్మలయందు వినియోగపరచుటయు మాత్రమే గాదు. అంతియే యైనచో నది తత్త్వార్థదర్శిని కాజాలదు. 'నైషా తత్త్వార్థదర్శినీ' యని మహాభారతశ్లోకము హెచ్చరించుచున్నది. ఆ యభ్యాస స్వరూపమును మనుస్మృతి యిట్లు వివరించుచున్నది.

"వేదాభ్యాసేన సతతం శౌచేన తపసైవ చ ।
అద్రోహేణ చ భూతానాం జాతిం స్మరతి పౌర్వికీమ్ ॥
పౌర్వికీం సంస్మరన్ జాతిం బ్రహ్మాభ్యస్యతే పునః ।
బ్రహ్మాభ్యాసేన చాజస్ర మనంతం సుఖ మశ్నుతే ॥"

—మను. స్మృ. 4-148, 149.

శౌచ-సంతోషములు, తపస్సు భూతస్నేహము - వీనితో గూడిన వేదాభ్యాసము వలన వేదవిదుడు జాతిస్మరుడై (పూర్వజన్మస్మృతి గలవాడై) బ్రహ్మాభ్యాసము చేసి యనంతసుఖమును బడయగలడు—అని యర్థము.

ఇందలి బ్రహ్మాభ్యాసపదమును వ్యాఖ్యాత లిట్లు వివరించిరి.

"సంసారే విరజ్యన్ బ్రహ్మైవ అజస్ర మభ్యస్యతి, శ్రవణ మనన ధ్యానై స్సాక్షాత్కరోతి." వేదము బ్రహ్మశబ్దవాచ్య మగుట సోపపత్తికముగ పూర్వ శీర్షికయందు వివరింపబడినది. ఇట కేవలమంత్రపాఠాభ్యాసము వేదాభ్యాసమనియు, క్రమముగ విరక్తుడై తత్వజిజ్ఞాసతో జేయు శ్రవణ, మనన, ధ్యానరూప మగు అభ్యాసము బ్రహ్మాభ్యాస మనియు, నధికారిభేదము ననుసరించి యభ్యాస స్వరూప మీ శ్లోకములందు వివరింపబడినది. కాన, ఆమ్నాయ మనగా కేవల మంత్ర పాఠాభ్యాసమే గాక తత్త్వదర్శక మగు బ్రహ్మాభ్యాస మనియు నర్థము గ్రహింప వలెను. 'బ్రహ్మాణం బ్రహ్మవాహసం. ఇత్యాది ఋక్కుల పరమార్థము 'ఆమ్నాయ, పద పరమార్థమును గ్రహించినపుడే సాధ్య మగును.

సుదృఢమైన భక్తితో నర్థానుసంధాన పూర్వకముగ మంత్రముల మననము జేయుచు నందు నిగూఢమై యున్న యమృతము నాస్వాదించుట 'ఆమ్నాయ' లక్ష్యార్థముగా శ్రీ శంకర భగవత్పాదులును రూపక విన్యాసమున నిట్లు వివరించిరి.

"ఆమ్నాయంబుధి మాదరేణ సుమనస్సంఘా స్సముద్య న్మనో
మంథానం దృఢభక్తి రజ్జుసహితం కృత్వా మథిత్వా తతః।
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతామ్
నిత్యానందసుధాం నిరంతర రమాసౌభాగ్య మాతన్వతే॥"

— శివానందలహరి.

సుమనసు లనగా దేవతలు. విద్వాంసులు గూడ సుమన శ్శబ్దముచే చెప్పబడుదురు. దేవతలు క్షీరసాగరమును మథించి చంద్రుడు, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి మున్నగు వానిని బొందినట్లు మననశీలురగు విద్వాంసులు శాస్త్రార్థవిజ్ఞాన కుశలమైన మనస్సు అనెడి కవ్వమును దృఢభక్తి యనెడి త్రాటితో

బిగించి, ఆమ్నాయ మనెడి యంబుధిని ఆదరముతో మథించి, మథించి యందు భక్తుల పాలిటి కల్పవృక్షము, కామధేనువు, చింతామణియు నిత్యానందసుధా స్వరూపుడు, మోక్షలక్ష్మీ సౌభాగ్యస్వరూపుడు నగు సోముని (ఉమాసహితుడగు పరమేశ్వరుని) పొందుదురు — అని యర్థము.

ఇట జెప్పినట్లు, ఆమ్నాయమును భక్తిపురఃసరముగ నాదరముతో మథించు కొలదియు, మొదట అక్షరరాశిగ, అనగా అక్షరరూప సముద్ర ముగ మాత్రమే గన్పట్టెడి వేదవాణి క్రమముగా బ్రహ్మవిద్యా స్వరూపిణి యగుచు తన నారాధించెడి సుమనసుల పాలిటి కల్పలతయై, కామధేనువై, చింతామణియై, తుదకు ఉమా (బ్రహ్మవిద్యా) సహితుడగుసోముని పొందింపజేయు ననెడి భావము గూడ లక్షిత మగుచునే యున్నది, 'సా హి శ్రీ రమృతా సతామ్' అని పూర్వ ముద హరించినశ్రుతిచే లక్షిత మగు నర్థము గూడ నిదియే.

'ఆమ్నాయ' పదముచే నుద్దిష్టమైన నిరంతరాభ్యాసమే మథనము. అదియే పై శ్లోకమున ప్రబోధింప బడినది. ఇట్టి మథనముచే లభించెడి యమృతము దేవతాదులకు గూడ దుర్లభము; ఆచార్యోపదేశైక లభ్యము- అని పరమగురుస్తవ రూపమున శ్రీశంకరభగవత్పాదు లిట్లు వివరించిరి.

"ప్రజ్ఞా వైశాఖవేధక్షుభితజలనిధే ర్వేదనామ్నోఽంతరస్థం
భూతా న్యాలోక్య మగ్నా న్యవిరతవననగ్రాహఘోరే సముద్రే।
కారుణ్యా దుద్ధారామృత మిద మమరై ర్దుర్లభం భూతహేతో
ర్య స్తం పూజ్యాభిపూజ్యం పరమగురు మముం పాదపాతై
ర్నతోఽస్మి"॥ — గౌడపాదకారికా - అ. శా. ప్రకరణమ్.

ఘోరమగు సంసారసాగరమున బడి యీదులాడెడి జనుల నుద్ధ రించుటకై కరుణతో, వేదసాగరమును మథించి, దేవతలకు గూడ దుర్లభమైన నీ యద్వైత తత్త్వామృతము నుద్ధరించి (విష్ణువు దేవతలకు వోలె) సుమన

స్సంఘములకు బంచి యిచ్చిన పరమ గురువులు, పూజ్యాభిపూజ్యులు నగు శ్రీ భగవద్గౌడపాదాచార్యులకు సాష్టాంగ ప్రణామము - అని యర్థము.

కాన (1) ఆమ్నాయముయొక్క పరమ తాత్పర్యము మోక్ష లక్ష్మీ సామ్రాజ్యమే యనియు. (2) అట్టి యమృతపానము సుమనస్సంఘమునకు మాత్రమే లభ్యమనియు, (3) వారికిని గూడ గురూపదేశాదుల ననుసరించి. అనగా సంప్రదాయమార్గమున, మథించిననేగాని లభ్యము కాదనియు పై శ్లోకముల వలన దెలియనగును.

ఇపుడు శ్రుతి. ఆమ్నాయ శబ్దార్థముల బరిశీలించినచో 'ఆమ్నాయః' అను నామము శ్రుతి యొక్క శ్రుతిత్వము, అట్లే శ్రుతియను పదము ఆమ్నాయము యొక్క ఆమ్నాయత్వమును అన్య నిరపేక్షముగ పరస్పరము నిరూపించుకొను చున్నవని తెలియనగును.

## సమామ్నాయః :_

అర్థానుసంధానపూర్వకముగ అధ్యయనము జేయబడు ఆమ్నాయమే సమామ్నాయ మనియు జెప్పబడుచున్నది.

"ఏత దంతః సమామ్నాయో యోగః సాంఖ్యో మనీషిణామ్ ।
త్యాగ స్తపో దమః సత్యం సముద్రాంతా ఇవాపగాః ॥"

— భాగ. 10-47-33.

"ఏషః మనోరథః అంతః సమాప్తి ఫలం యస్య సః సమామ్నాయః వేదః" (— శ్రీధరః), సమామ్నాయము యొక్క అనగా వేదముయొక్క లక్ష్యము మోక్షమని భావము.

# విద్యా - ఆమ్నాయ యోగము :-

ఇట్లు ఆమ్నాయ, అనువాక, వాక, అనూచాన, అనుశ్రవ, సమామ్నాయ, శ్రుతి, శ్రుతా, శ్రస, అనుశ్రవ, పిత్ర్యా, సనజా, పూర్వ్యా, నిధి — ఇత్యాది పదములన్నియు సార్ధకములై, వేదము అనాది యనియు, ఋషిప్రోక్త మనియు, పితృ పరంపరాప్రాప్త మనియు తఱుగని నిధి యనియు, సంప్రదాయము ననుసరించి నిరంతరాభ్యాసాదిరూప మథనము జేయకొలదియు సుమనసులకు నమృతము నావిర్భవింప జేయు క్షీరసాగరమనియు దెలియ జేయుచున్నవి.

అందుచే నీ వేదములు వేఱ్వేఱు రచయితల రచన లనియు, నిందు పౌర్వాపర్యము గలదనియు, ఆంతరదర్శనము లేదనియు, లౌకిక దృశ్య సంఘటనాదుల వర్ణన లనియు, అసంబద్ధ ప్రలాపము లనియు, జెప్పుట తగదు. అట్లు జెప్పుచో వేదవాణి స్వరూప స్వభావాదుల దెలియజేయుటకై ప్రవృత్తములయిన యీ పదములు సార్థకములుగాక నిరర్థకములే గావలసి వచ్చును. అట్లగుట శ్రుతి సంమతము కాదు గదా ! అందుచే శ్రుత్యుక్తము, సంప్రదాయానుగతమునైన దృష్టితో మాత్రమే, అనగా నామ్నాయాది శబ్దార్థముల గుర్తెఱిగి యీ యామ్నాయాంబుధిని మథింప బూనినపుడే యందలి పదములు సార్థకములై, సుమనసులగు శంకరాదులకు వలె, నమృతప్రాప్తికి దోహదకారులగును. లేనిచో గావు — అవి అమ్నాయాది శబ్ద తాత్పర్యము.

వాల్మీకి మహర్షియు భంగ్యంతరముగ ఆమ్నాయముల యొక్క ఆమ్నాయత్వము నిట్లు వివరించినాడు.

"తస్య సందిదిహే బుద్ధి ర్మహం స్సీతాం నిరీక్ష్య తు ।
అమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ ॥

దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్ !
సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్ ॥"

— రామా. 5 15-38,39.

ఆమ్నాయ మన నిరంతరాభ్యాసము; అది శ్రవణ మనన నిదిధ్యా, రూపము. అట్టి ఆమ్నాయములు లేని విద్య సంస్కారహీనమై, ప్రశిథిలమై 'అదియే యిది' యని గుర్తించుటకు శక్యము గాక యుండును. అట్టి విద్య వలె, సంస్కారహీనమై అనలంకృతమై యున్న సీతను జూచి 'సీత యీమెయా!' యని హనుమంతుడు సందేహించెను తరువాత నెట్లో యతి కష్టము మీద'ఈమె సీతయే' యనియు, సంస్కారహీనమైన వాక్కు వివక్షితార్థమును గాక విపరీతార్థము బొంది యుండురీతి, సీమెయు సంస్కారహీనమై యవశయై రావణుని యధీనమున నున్నది యని తెలిసికొనెను—అని అర్థము.

ఇట శ్లోకములలో విద్యా, వాక్ పదములచే జెప్పబడిన విద్యగాని వాక్కుగాని యేది? హనుమంతుడు కిష్కింధకాండయందు 'నాన్నృగ్వేద వినీతస్య నాయజుర్వేదధారిణః। నాసామవేద విదుషః శక్య మేవం ప్రభాషితుమ్' (4-3-28) ఇత్యాది శ్లోకములచే వేదవి ద్గ్రేసరుడుగ శ్రీరామునిచే గొనియాడబడినాడు. అట్టివాని దృష్టిలో విద్య యన వేదవిద్యయే యగును. శ్రుతులయందును పురాణాదులయందును విద్య యన త్రయీవిద్యయే, ఆమ్నాయావశ్యకత త్రయీవిద్యకు జెప్పబడినట్లుగ మఱి యే విద్యకును ప్రసిద్ధము కాదు. అట్టి ఆమ్నాయావశ్యకత గలది యగుట చేతనే యా విద్యకు ఆమ్నాయత్వ ప్రసిద్ధి వచ్చినట్లు పూర్వము వివరింపబడినది.

ధర్మ, బ్రహ్మ రూప పురుషార్థముల దెలియజేయునది (వేదయతి) యగుటచే వేదవిద్యకు విద్య యని సార్థకనామము. అట్లు దెలిసికొనుటకు కేవల వేదమంత్ర పాఠ్యాభ్యాసము చాలదు, ధర్మ జిజ్ఞాస జేసి ధర్మస్వరూపమును,

శ్రవణమననాదుల ద్వారా బ్రహ్మ స్వరూపమును దెలియవలసి యున్నది. కర్మ వినియోగమునకును, పరమార్థదర్శనమునకు నుపయోగపడని కేవల వేదరాశియందు విద్యాత్వము నామమాత్రావశిష్టమై యుంటి 'నిజముగ నిది విద్యయా ?' యని యాపాతముగ సందేహమునకు దాపు గల్గుచుండును.

ఇక సీతవిషయము. రావణాంతఃపురములో రూపవతులగు స్త్రీల నెందఱినో హనుమంతుడు గాంచియుండెను. అందే యొకరియందును, తన మనసున ప్రతిష్ఠితమై యున్న సీతాదేవియొక్క రూపముగాని, వైశిష్ట్యము గాని హనుమంతునకు గన్పట్టలేదు. అశోకవనికయం దనలంకృతయై యవశయై శోకసమాక్రాన్తయై, స్పష్టముగా నభివ్యక్తముగాని తేజముతో గూడినదై యున్న సీతను గాంచి, హనుమంతు డామెయందు స్వమనఃపట ముద్రితసీతాదివ్య, రూపమును గాంచెను. కాని, నిజముగ నీమె సీతయా ? సీత యగుచో నిట్లున్న దేమి ? యని సందేహించెను.

పర విద్యాస్వరూపిణియగు నీ దేవత. ప్రశిథిలవిద్య వోలె, నిట్లు గన్పట్టు టేమి ? - యని సందియపడి హనుమంతుడు విద్యాస్వరూపమును, వాక్స్వ రూపము నెఱిగిన వాడగుటచే 'సంస్కారహీన మైనపుడు వాక్కు వివక్షితార్థమును జెప్పక విపరీతార్థమును బొందునట్లు, ఈమెయు పతి సాన్నిధ్యము లేక యసంస్కృతయై, యవశయై, పరాధీనయై యున్నటుల నున్నది యని సమాధాన పడెను.

ఇట సంస్కారవతియగు వాక్కు యేది ? వేదవిదుడగు హనుమంతుని దృష్టిలో గల సంస్కారవతియగు వాక్కు వేదవాణియే. సంస్కారమనగా ప్రకృతి ప్రత్యయాది సంస్కారము శబ్దవ్యుత్పత్తి, ప్రవృత్తి నిమిత్తములుగల వాక్కు సంస్కృతరూపిణియై వేదవాక్కే యగును. అట్టి సంస్కారము అన్య వాక్కులకు బ్రసిద్ధము గాదు ఆ ప్రసిద్ధి వేదవాక్కునకే గలదు.

శబ్దవ్యుత్పత్తియు, ప్రవృత్తి నిమిత్తము దెలియని యపుడు, ఆ వాక్కు ఏదియేని విపరీతార్థమునందు ప్రవృత్తమయి యున్నట్లున్నను, తత్సంస్కారాదుల నెఱిగి మననము జేసినపుడు వివక్షితమగు పరమార్థమునే లక్షింప జేయుచుండును.

'సీత యిపుడు సంస్కారము లేనిదై పరాధీనయై యున్నట్లు గన్పట్టినను, వాస్తవమునకు పరాధీన కాదు; పతి సాన్నిధ్యమును బొంది సుసంస్కృతయై సహజతేజముతో, తానుద్దేశించిన సీతా రూపమున నలరారగలదు' అని యూహించుకొని, హనుమంతుడిట్లతికష్టముమీద 'ఇట్లున్నను ఈమె సీతయే గావచ్చు' నని కొంతవరకు సమాధానపడినాడు. (దుఃఖేన బుబుధే) ఇట్లే మఱికొన్ని యుపపత్తుల ద్వారా తర్క వితర్కముల జేసి 'యీమె సీతయే' యని తుదకు నిర్ధారించుకొనినట్లు తరువాత శ్లోకముల వలన దెలియును.

పై శ్లోకమువలన (1) శబ్దవ్యుత్పత్తి, ప్రవృత్తి నిమిత్తముల యావశ్యకతయు (2) అవి దెలిసికొని ఆమ్నాయము జేయవలసిన - అనగా శ్రవణ మననాద్యభ్యాసము జేయవలసిన - యావశ్యకతయు, కాంతాసమ్మితముగా జెప్పబడినది. అట్లు జేయనివాడు ఆ వేదవాక్కు వివక్షిత పరమార్థమును గాక, విపరీతార్థముల బోధింప గలదనియు నట్టియెడ నది 'ప్రశిథిల విద్య'యై సంస్కారహీనయై నామమాత్రావశిష్టయై వర్తిల్లగలదనియు హెచ్చరికగూడ నిందిమిడి యున్నది.

కాన వేదముయొక్క ఆమ్నాయత్వ మిట్టిది. వాక్యార్థజ్ఞానమునకు పదార్థజ్ఞానము (శబ్దార్థజ్ఞానము) కారణము. పదార్థజ్ఞానము సిద్ధించుటకు స్వర సంస్కారజ్ఞానము ఆవశ్యకము. దానిచే శబ్ద ప్రవృత్తి నిమిత్తముల దెలిసికొని యా పదముచే దెలియనగు యావదర్థమును దర్శింపవలెను. ఇట్లు దెలిపి, ఉపక్రమోపసంహారాది షట్-లింగములచే సంప్రదాయానుగుణముగ వాక్యతాత్పర్యము నిర్ణయించి, శ్రవణమననాదుల ద్వారా బ్రహ్మాభ్యాస మొనర్పవలయును. అపుడే

యా వేదవాక్కు అవివక్షిత విరుద్ధార్థముల గాక' వివక్షిత పరమార్థమును దర్శింప జేసి, 'విద్య' యను సార్థకనామమున విలసిల్లగలదు — అని మహర్షి తాత్పర్యము.

స్వరసంస్కారములు పదార్థ జ్ఞానమును దెలియజేయ సమర్థములు - అనెడి విషయము సోపపత్తికముగ యాస్కనిరుక్తము నందిట్లు వివరింపబడినది.

"త ద్యేషు పదేషు స్వరసంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన
గుణే నాన్వితౌ స్యాతాం తథా తాని నిర్బ్రూయాత్" —ని. 2-1-1.

వ్యాస వాల్మీకాదుల యడుగుజాడలలో నడచిన మహాకవి కాళిదాసు గూడ కుశలవులతో గూడిన సీతాదేవిని స్వరసంస్కారములలో నొప్పు వేదవాక్కుతో బోల్చుట గమనార్హము.

"స్వరసంస్కారవత్యాఽసౌ పుత్రాభ్యా మథ సీతయా।
ఋచే వోదర్చిషం సూర్యం రామం ముని రుపస్థితః॥"

— రఘు. 15-76.

స్వరసంస్కారాదుల ద్వారా మంత్రార్థము నెఱిగి యజ్ఞమున వినియుక్త మయినపుడు (విదథే శస్యమానా) వేదవాక్కు కల్యాణకరములు, స్వచ్ఛములునగు దివ్య తేజస్సులతో (భద్రా వాస్రాణ్యర్జు వసానా) విలసిల్లును; జాగరణశీలమై వివక్షిత దేవతార్థ ప్రబోధకమై (జాగృవిః) యలరారును. అట్లు వినియుక్తము గానిచో కేవల శబ్దరాశిగ మాత్రమే గన్పట్టును-అను నీ యర్థమును 'దివశ్చి దా పూర్వ్యా' (ఋ 3-39-2) అను ఋక్కుచెప్పుచున్నట్లు పూర్వము వివరించబడినది. ఆశ్రుత్యర్థమే యిటచమత్కారముగ వాల్మికి మహర్షిచే ననువదింపబడిన దనుట గమనార్హము.

ఇట సీతాదేవి వేదవాక్కుతో పోల్చబడుటచే ఆమె ప్రసాదముననున్నను, అడవియందున్నను, అలంకృతయైనను, ననలంకృతయై గన్పట్టినను, అనగా పతి

సాన్నిధ్యమున నున్నను, ఆమె లక్ష్యము పతి యగు శ్రీరామచంద్రుడే యయినట్లు, వేదవాక్కు-గూడ సంస్కృతమై యున్నట్టినను, నసంస్కృతమై యున్నట్లు గన్పట్టినను ఆ వాక్కు-కు పరమ లక్ష్యము యజ్ఞేశ్వరుడగు పరమేశ్వరుడే యగుటయు నిట ధ్వనితము.

## వేదశ్రుతిః:-

పరమార్థమే లక్ష్యముగా గలిగి; న్యాయసంసిద్ధములగు హేతువులచే సుదృఢముగా ప్రతిష్ఠితమై, కుతార్కి-కులకు అప్రకంప్యమై, యనన్యనిరపేక్షమై, యానూచానమై వెలయుటచే నీ యామ్నాయము 'ధ్రువా వేదశ్రుతిః' యని ప్రసిద్ధమైనట్లు పూర్వము వివరింపబడినది (చూ. ఋషిశబ్దము.) వేదశ్రుతి యనగా స్వతః ప్రమాణభూతమైన శ్రుతి యనిఅర్థము;

"వేదయతి వేదః, స్వతః ప్రమాణభూతాం శ్రుతి మిత్యర్థః"

—గోవిందరాజీయవ్యాఖ్య—రామా.3-50-21.

కాన శ్రుతి-అమ్నాయ శబ్దముల బరిశీలించుచో—

(1) నిరంతరము గురుముఖోచ్చారణానూచ్చారణ రూపమున ననాది నుండియు శ్రూయమాణమగుచు వరలునది, (2) శ్రూయమాణ మగుటయేగాక నియమపూర్వకముగా ప్రతిదిన మధ్యయనాదుల ద్వారా యభ్యసింప బడుచుండునది; యజ్ఞాదికర్మల యందు మరల మరల శస్త్రస్తోత్రాదిరూపమున వినియుజ్యమానమగుచు నిత్యనూతనమై వెలయునది; (4) నిరంతర శ్రవణమననాదులచే బ్రహ్మవిద్యారూపిణియై సాక్షాత్క-రించునది—యని వేదవాక్స్వరూపము స్పష్ట మగును. ఇట్టిగురుముఖమున గ్రహింపబడకయు, నియమపూర్వకామ్నాయములు లేకయు, కర్మయందు వినియుక్త ము గాకయు,నిరంతర శ్రవణమననాది రహితమై యీ వేదవాణి యెవరి కడ నుండునో,యది సంస్కా-రహీనమై లంకలోనున్న సీతాదేవివలె, ప్రశిథిలవిద్యయై యొప్పును. అందుచే నట్టివేదవాక్కు- వివక్షితార్థప్రతిపాదకము గాక, యవివక్షితార్థ ప్రతిపాదనశీల వలె గన్పట్టును. అయ్యును వాస్తవముగ దాని లక్ష్యము పరమార్థమేయగుననియు దెలిసినది. శ్రుతి-ఆమ్నాయస్వరూప మిట్టిది.

ఇట్టి ఆమ్నాయమే స్వాధ్యాయము. ఇక స్వాధ్యాయ శబ్దమును జూతము.

# స్వాధ్యాయః

స్వాధ్యాయ సింధు మధనాత్ క్రమతేచ యా శ్రీః
సంమోహ్య కామ్యనిరతాన్ కృతభేదవాదాన్ ।
దత్తే సుధాం స్వపద మార్గణ దీక్షితేభ్యః
సంస్తౌమి శోభనవిధాం హరిరూపిణీం తామ్ ॥

ఋషిం త్వాం వేదం త్వాం సువిమలతపోజాం ప్రథమజాం
త్రయీం స్వాధ్యాయం త్వాం భిషజ మనఘం బ్రహ్మ పరమమ్।
స్వతః ప్రామాణ్యాం త్వాం సురగిర మథామ్నాయమహితాం
స్వయంజాతాం దివ్యాం హరిహృదయలక్ష్మీం హృది భజే॥

—వేదమాతృస్తవః.

## అధ్యాయః - వేదః :-

అధ్యయనము లేకయభ్యాసము నన నెట్టిదో యామ్నాయశబ్దమున వివరింప బడినది. అధ్యయన మనగా బ్రహ్మయజ్ఞములేక వేద-వేదాంగాధ్యయన మనియే సామాన్యముగా బ్రసిద్ధి.

'అధ్యయనం బ్రహ్మయజ్ఞః స్యాత్' అభిధానచింతామణి.

అధ్యయనము జేయదగినది యగుటచే వేదమునకు అధ్యాయః అని పేరు.

'అధీయన్త ఇత్యధ్యాయాః వేదాః'—విజ్ఞానేశ్వరీయ (యాజ్ఞ. 1-?-12.)

— స్మృతిచంద్రిక (సంస్కారకాండ - ఉపాకర్మ).

ఇంతేగాక 'స్వాధ్యాయః' అనియు వేదమునకు నామము ప్రసిద్ధము.

## స్వాధ్యాయః వేదః :-

'స్వాధ్యాయో ఽ ధ్యేతవ్యః' -తై. ఆ. 2-16; శ. బ్రా- 11-5-6-3.

స్వాధ్యాయమును, అనగా వేదము నధ్యయనము జేయవలెను -అని శ్రుతి విధించుచున్నది- ఇంతేగాక-

'బ్రాహ్మణేన నిష్కారణః షడంగో వేదో ఽ ధ్యేతవ్యో జ్ఞేయశ్చ" యనియు సాక్షాత్తు వేదపదము నుచ్చరించుచు షడంగసహిత వేదాధ్యయనమును, తదర్థమీ మాంసను జేయవలె ననియు శ్రుతి శాసించుచున్నది.

1. "నష్ట జ్వలన సంపాతా ప్రశాంతాధ్యాయ సత్కథా ।
తిమిరేణాభిలిప్తేవ తదా సా నగరీ బభౌ" — రామా. 2-48-34.

'అధ్యాయః వేదః; సత్కథా పురాణాదిః; నివృత్తవేదాధ్యయన పురాణ పాఠేత్యర్థః' — గోవిందరాజీయవ్యాఖ్య.

'నేతి ప్రతిషేధార్థీయో భాషాయామ్ । ఉభయ మన్వధ్యాయమ్'

— నిరు. 1-5.

'ప్రతిషేధార్థీయ ఉపమార్థీయ శ్చేత్యుభయ మన్వధ్యాయమ్ ఛందసి ప్రసిద్ధమ్' — ముకుందశర్మ వ్యాఖ్య.

"ద్వితీయం ప్రాప్యానుపూర్వ్యాత్ జన్మోపనయనం ద్విజః।
వసన్ గురుకులే దాంతః బ్రహ్మాధీయీత వాగ్యతః"

—భాగ. 11-17-21.

ఇట 'బ్రహ్మ' పద ముచ్చరింపబడి వేదాధ్యయనము విధింపబడినది. కాన' పై ప్రమాణముల ననుసరించి స్వాధ్యాయ - వేద - బ్రహ్మపదములు సమానార్థకము లగుట శ్రుతి స్మృతి సంమతము. కాని, యీ విషయమై కొన్ని యాక్షేపములు గలవు.

## స్వాధ్యాయ శబ్దార్థము - పూర్వపక్షములు :-

1) స్వాధ్యాయపదమునకు 'స్వశాఖారూప మగు వేదము (స్వః స్వశాఖారూపః అధ్యాయః వేదః') -అను నర్థము కూడ సంప్రదాయానుగతమై వచ్చుచున్నది. కాని. యీ యర్థమును మాత్రమే గ్రహించి కొందఱు పై శ్రుతివాక్యమునకు 'స్వశాఖారూపమగు వేదము నధ్యయనము జేయవలెను' -అను నర్థమును మాత్రమే చెప్పుచున్నారు. అట్టి తఱి కృత్స్న వేదాధ్యయనము శ్రుతివిహితమా? లేక స్వశాఖాధ్యయనము మాత్రమే శ్రుతివిహితమా?

2) కృత్స్న వేదాధ్యయనమే శ్రుతిసంమత మగుచో 'అధ్యాయోఽధ్యేతవ్యః' -అని చెప్పిన జాలును గదా! సాధ్యాయః -అని యనుచు 'స్వ' పదమును గూడ జేర్చుట లోని తాత్పర్య మేమి?

అందుచే "స్వాధ్యాయో ఽధ్యేతవ్యః" -అను వాక్యము యొక్క యర్థ విచారము జేసి శ్రుతి స్మృత్యనుగుణముగ "స్వాధ్యాయ" స్వరూపమును దర్శింపవలసి యున్నది.

స్వాధ్యాయ మనగా స్వశాఖారూప వేదమే - యని చెప్పినచో నధ్యయనము జేయువారికి తదితరశాఖలు స్వాధ్యాయములు కాకపోవలసివచ్చును. అనగా తదితరశాఖాధ్యయనము విధివిహితము గాకపోవలసి వచ్చును. అందుచే

నొకవేళ నితరశాఖాధ్యయనమును గూడ నెవరేని జేసినచో వారు విధిచోదితముగాని యధ్యయనము జేసినవారే కావలెను. అదియును గాక "స్వశాఖాధ్యయనము విధి విహిత మనినంతమాత్రమున నన్యశాఖాధ్యయనము నిషిద్ధము గాదు; అందుచే నితర శాఖాధ్యయనము గూడ జేసిన జేయవచ్చు" -నని యనుటకును వీలులేదు. అన్య శాఖాధ్యయనము శ్రుతినిషిద్ధము గాదని యనినచో నది విధివిహిత మగునా ? కనుక నీ యర్థమునే యనుసరించుచో నన్యశాఖాధ్యయనము స్వాధ్యాయము కాజాలదు. అన్యశాఖ లెట్లయినను స్వశాఖలు కానేరవు గదా !

అట్లని యితర వేదశాఖాధ్యయనముతో నిమిత్తము లేదని యనుటకును వీలులేదు. 'అథాఽతో ధర్మజిజ్ఞాసా' 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' -యని జైమినిబాదరాయణ మహర్షులు వేదధ్యయానంతరము ధర్మ-బ్రహ్మ జిజ్ఞాసలజేయుట శ్రుతివిహిత మనుచు, నధికారిభేదము ననుసరించి, కర్తవ్యము నుపదేశించి యున్నారు. ధర్మ జిజ్ఞాస గాని, బ్రహ్మజిజ్ఞాస గాని స్వశాఖామాత్ర పరిమితజిజ్ఞాసలు కానేరవు అందు అధికరణమర్యాదా పురఃసరముగ కృత్స్న వేదార్థపరిశీలనము జేసి ధర్మ బ్రహ్మజిజ్ఞాసలు చేయబడినవి. స్వశాఖయందుగాని, యన్యశాఖలయందుగాని, యే వేదమందైనను విధివిహితమైనదేదియో యది ధర్మము.

'వేదో ఽఖిలో ధర్మమూలమ్' —మను. 2-6.

కాన, పై సూత్రముల తాత్పర్యము బరిశీలించిన కృత్స్న వేదశాఖాధ్యయ నావశ్యకత తేటపడుచున్నది.

## స్మృతులు - కృత్స్నవేదాధ్యయనము :-

"షట్త్రింశ దాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్।
తదర్ధికం పాదికం వా గ్రహణాంతిక మేవ వా ॥

వేదా నధీత్య వేదౌ వా వేదం వాఽపి యథాక్రమమ్ ।
అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావసేత్ ॥" మను. 3-1,2.

తపోవిశేషై ర్వివిధై ర్వ్రతై శ్చవిధిచోదితైః ।
వేదః కృత్స్నో ఽధిగంతవ్యఃసరహస్యో ద్విజన్మనా॥"

—మను. 2-165.

"ప్రతివేదం బ్రహ్మచర్యం ద్వాదశాబ్దాని పంచ వా ।
గ్రహణాంతిక మిత్యేకే కేశాంత శ్చైవ షోడశే॥" —యాజ్ఞ. 2-36.

"వేదం వేదౌ తథా వేదాన్ వేదాం శ్చ చతురో ద్విజాః।
అధీత్య గురవే దత్వా దక్షిణాం చ భవే ద్గృహీ॥"

-సౌర. పు. 17.-4.

"ఏవం వేదం వేదౌ వేదాన్ వా స్వీకుర్యాత్, తతో
వేదాంగాని-" విష్ణు. పు. 28.

"వేదం వేదౌ తథా వేదాన్ వేదా న్వా చతురో ద్విజః।
అధీత్య చాధిగమ్యార్థం తతః స్నాయా ద్ద్విజోత్తమః॥" -కూర్మ.

వసే ద్ద్వాదశవర్షాణి చతుర్వింశతి మేవ వా।
ష ట్త్రింశతం వా వర్షాణి ప్రతివేదం వ్రతం చరేత్॥" -యమ. స్మృ.
ప్రతివేదం బ్రహ్మచర్యం ద్వాదశాబ్దాని పంచ వా।"

—యోగీశ్వరయాజ్ఞవల్క్య.

వేదాన్ కృత్స్నాన్ బ్రాహ్మణః ప్రాప్నుయాత్"

భార. 13-20-81.

అధీత్య వేదా నఖిలాన్ గురుశుశ్రూషణే రతః ।
గురూణా మనృణో భూత్వా సమావర్తేత యజ్ఞవిత్॥"

భార. 12-234-3.

"ద్వాదశవర్షా ణ్యేకవేదే బ్రహ్మచర్యం చరేత్;
ప్రతిద్వాదశ వా సర్వేషు; గ్రహణాంతం వా...."

—గౌ. ధర్మ. సూ. 1-2-51, 52, 53.

'వేద మధీత్య స్నాయాత్" -- ఆప. గృ. సూ. 5-1.

'వేద మిత్యవివక్షిత మేకవచనమ్ । వేదం వేదౌ వేదాన్ వా అధీత్య' --హరదత్తః.

వేదం మన్త్ర బ్రాహ్మణలక్షణం; ఏకవచనం జాత్యభిప్రాయమ్'

-- సుదర్శనాచార్యః ।

"ద్వాదశ వర్షాణి వేదబ్రహ్మచర్యమ్" "గ్రహణాంతం వా"

--అశ్వ. గృ. 1-22-3-4.

'వేదగ్రహణం కథమ్ ? ఏకైకస్య ద్వాదశవర్షాణి బ్రహ్మచర్యం స్యా దితి । తేన ద్వయో శ్చతుర్వింశతిః త్రయాణాం షట్ త్రింశత్ । చతుర్ణా మష్టాచత్వారింశత్' --నారాయణవృత్తిః.

పై వచనముల ననుసరించి కృత్స్న వేదాధ్యయనము విధింపబడుచున్నటుల దెలియును. అంతియే గాదు. సామర్థ్యమును బట్టి వేదములు నాలుగు గాని, మూడు గాని, రెండు గాని తుదకొకటి గాని యధ్యయనము జేయదగు నని శ్రుతి తాత్పర్యము వివరింపబడినది.

పాండవులు నిఖిలవేదాధ్యయనము జేసినట్లు మహాభారతము వచించుచున్నది.

తేఽధీత్య సకలాన్ వేదాన్ శాస్త్రాణి వివిధాని చ ।
న్యవసన్ పాండవా స్తత్ర పూజితా అకుతోభయాః ॥"

--భార. 1-1-31.

చతుర్వేదవిదులగు విప్రులు వేలకొలది యున్నట్లును మహాభారతము వలన దెలియుచున్నది.

"తతః సహస్రం విప్రాణం చతుర్వేదవిదాం తథా ।
గవాం సహస్రే ణైకైకం వాచయామాస మాధవః ॥"

-భార. 12-53-8.

శ్రీకృష్ణుడు "సాంగ నిఖిల వేదాధ్యయనము గావించినట్లు శ్రీమద్భాగవత మిట్లు చెప్పుచున్నది.

"ప్రోవాచ వేదా నఖిలాన్ సాంగోపనిషదో గురుః" -భాగ. 10-45-3.

శ్రీమద్రామాయణము గూడ శ్రీరామచంద్రుని సాంగ నిఖిల వేదవేత్తగ వర్ణించినది.

"సమ్యగ్విద్యావ్రతస్నాతః యథావత్సాంగవేదవిత్" -2-1-20.

'అధీత్య స్నాయా దితి విధ్యుక్తరీత్యా సమ్యగ్వేదా నధీత్య

వ్రతాని చ కృత్వా కృతసమావర్తనః' అని వ్యాఖ్యాతలు వివరించిరి. భరతుడు చిత్రకూటమునకు వచ్చినపుడు 'కచ్చిత్తే సఫలా వేదాః' అని శ్రీరామ చంద్రుడు భరతుని యడుగుచున్నాడు. ఇంతేగాదు రామాయణ రచనానంతరము దీని నెవరి కుపదేశించుటయా ? -యని వాల్మీకి యాలోచించు సమయమున కుశలవు లేతెంచిరి. వారు నిఖిల వేదముల యందు పరినిష్ఠితు లయినట్లు రామాయ ణము వర్ణించుచున్నది.

"స తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ॥" -రామా. 1-4-6.

'వేదేషు ఋగ్ యజుః సామాథర్వణ లక్షణేషు చతుర్షు

విషయే .... ....పరిష్ఠితౌ' —గోవిందరాజీయమ్.

ఉత్తరరామచరితమున గూడ కుశలవులు అన్వీక్షక్యాది విద్యలతోపాటు త్రయీవిద్యయందు బరినిష్ఠితు లైనట్లు చెప్పబడినది.

"నిర్వృత్త చౌలకర్మణో స్త్రయీవర్జ మితరా స్తిస్రో విద్యాః
సావధానేన పరినిష్ఠాపితాః సమనంతరం చ గర్భైకాదశే
వర్షే క్షాత్రేణ కల్పే నోపనీయ త్రయీవిద్యా మధ్యాపితౌ"

2. అంక.

మిథిలాధిపతియగు జనకుడు సర్వవేదములయందును, శాస్త్రములందును బరినిష్ఠితుడు. అట్టి మహనీయుని నీవే స్వయముగ నాహ్వానించి యశ్వమేధయాగమునకు గొనితెమ్మని దశరథునితో వసిష్ఠు డిట్లు జెప్పుచున్నాడు.

"మిథిలాధిపతిం శూరం జనకం సత్యవిక్రమమ్ ।
నిష్ఠితం సర్వశాస్త్రేషు తథా వేదేషు నిష్ఠితమ్ ॥
త మానయ మహాభాగం స్వయ మేవ సుసత్కృతమ్ ।"

—రామా. 1-1-13-20, 21.

## స్వాధ్యాయాధ్యయ మన కృత్స్న వేదాధ్యయనమే :-

పై ప్రమాణముల ననుసరించి స్వాధ్యాయాధ్యయన మనగా నిఖిలవేదాధ్యయన మని శ్రుతిస్మృతిప్రసిద్ధమైన యభిప్రాయముగ జెప్పవలసియున్నది. వాల్మీకి మహర్షికి శ్రీరామచరితము నుపదేశించిన నారదుడు "తపః స్వాధ్యాయ నిరతః .... వాగ్విదాం వరః" అని శ్రీమద్రామాయణము మొదటి శ్లోకమున బేర్కొనబడినాడు. ఇట "స్వాధ్యాయ నిరతః అను . పదముచే నారదుడు స్వశాఖాధ్యయనమాత్ర నిరతుడు — అని చెప్పుట సమంజసము. కాదు. ఏలయన, నారదుడు నిఖిలవేదాధ్యయమునపరు డగుట ప్రసిద్ధము.

"పదోపయోగేఽపి గురు స్త్వ మక్షయో
నిధిః శ్రుతీనాం ధనసంపదా మివ ।" —శిశు. 1-28.

ఇట నారదుడు అక్షయ నిఖిల వేదనిధి స్వరూపుడు, సంప్రదాయప్రవర్త కుడునగు గురువుగ కీర్తింపబడినాడు, ఛాందోగ్య శ్రుతియు నారదుడు సాంగ నిఖిల వేదాధ్యయనపరు డని తెల్పుచున్నది.

"ఋగ్వేదం భగవోఽ ధ్యేమి, యజుర్వేదం సామ వేద
మాథర్వణం చేతి" ఛాం. ఉం. 1-1-2.

కాన, నారదుడు నిఖిలవేదాధ్యయనరూప - స్వాధ్యాయ, నిరతు డగుట పై రామాయణశ్లోక తాత్పర్యము.వాఖ్యాతలు ల్లే వివరించిరి.

"సోఽధ్యైష్ట వేదాన్" —భట్టికావ్య. 1-2.
'సః (దశరథః) వేదాన్ అధ్యైష్ట అధీతవా నితి స్వాధ్యాయ
ఉక్తః —జయమంగళ వ్యాఖ్య

ఇట దశరథుడు నిఖిలవేదాధ్యయన మొనర్చినట్లు భట్టికావ్యము చెప్పుచున్నది. అట్లధ్యయనము గావింపబడిన చతుర్వేదములను స్వాధ్యాయముగా జయమంగళ వ్యాఖ్యానము వివరించినది.

ఛందోలోక మగు బ్రహ్మలోకమును బొందగోరు నైష్ఠిక బ్రహ్మచారి యధిక నియమ వ్రత పరాయణుడై, స్వాధ్యాయార్థమై, తన దేహమును గురువున కర్పింపవలెనని, అనగా తనదేహమును గురుశుశ్రూష కొఱకు మాత్రమే వినియోగించుచుండ వలెనని భాగవత మిట్లు చెప్పుచున్నది.

"యద్యసౌ ఛందసాం లోక మారోక్ష్యన్ బ్రహ్మవిష్టపమ్ ।
గురవే విన్యసే ద్దేహం స్వాధ్యాయార్థం బృహద్వ్రతః ॥"

—భా. 11-17-30

ఈ శ్లోకము నందలి 'స్వాధ్యాయార్థం' అను పదమునకు అధిక స్వాధ్యాయార్థం' అను పదమునకు 'అధిక స్వాధ్యాయార్థం -అని వ్యాఖ్యాతలు వివరించిరి. అట్లు చెప్పబడుటచేతను స్వశాఖాధ్యయనము మాత్రమే గాక యధికముగ జేయబడు నితర వేదశాఖాధ్యయనము గూడ స్వాధ్యాయాధ్యయనమే యగుట తెలియును.

"న చ తస్మిన్ శయనే స్వాధ్యాయ మధీయీత" –గౌ. ధ. సూ.9-27.

'తస్మిన్ శయనే నాధీయీత, స్వాధ్యాయగ్రహణాత్ వేదమ్'

—మస్కరీభాష్య

'న తస్మిన్ వేద మధీయీత' —హరదత్తవ్యాఖ్య

పాన్పునందుండి స్వాధ్యాయాధ్యయనము జేయగూడ దను నియమ మిట జెప్పబడుచున్నది.

"తస్య వా ఏతస్య యజ్ఞస్య ద్వౌ వనధ్యాయౌ

యదాత్మాఽశుచి ర్యద్దేశః" –తై. ఆ. 2-15-1

తాను అశుచిగా నున్నపుడును, దేశ మశుచిగా నున్నపుడును, స్వాధ్యాయాధ్యయనము చేయరాదు – అను నియమమును శ్రుతి చెప్పుచున్నది.

ఇట్టి పై వాక్యముల ననుసరించి స్వాధ్యాయాధ్యయనము చేయరాదన 'స్వశాఖాధ్యయనము చేయరాదు; అన్యశాఖాధ్యయ ము చేయవచ్చును' -అని చెప్పు యుక్తము కాదు గదా ! కావుననే, వ్యాఖ్యాతలిట 'వేదాధ్యయనముచేయరాదు' - అను నర్థమునే వివరించిరి. కాన నిట స్వాధ్యాయ పదము స్వశాఖారూప వే మాత్రపరము గాక నిఖిలవేదపరమని గ్రహింపక తప్పదు.

## కోశములు - స్వాధ్యాయపదము :-

కోశములును వేద, స్వాధ్యాయ శబ్దములను పర్యాయపదములుగ పేర్కొనినది.

'స్వాధ్యాయో జప ఇత్యుక్తో వేదాధ్యయనకర్మణి'

—శబ్దరత్నావళి (వాచస్పత్యమ్)

'స్వాధ్యాయో వేదతపసోః' —వైజయన్తీ.

స్వాధ్యాయః శ్రుతి రామ్నాయ శ్ఛందో వేదః' —అభిదానచింతామణి.

'స్వాధ్యాయో జప వేదయోః' -నానార్థరత్నమాల.

## శ్రుతులు - వేదాధ్యయన సంప్రదాయము :-

ఇక శ్రుతులయందు వేదాధ్యయనమును గూర్చిన సంప్రదాయ మెట్లున్నదో దర్శింతము.

"శతధార ముత్స మక్షీయమాణం విపశ్చితం పితరం
వక్త్వానామ్ ।మేళిం మదంతం పిత్రో రుపస్థే తం రూదసీ
పిపృతమ్॥" --ఋ. 4-26-9.

ఈ మంత్రమున విశ్వామిత్రుడు తనకు విద్యాదాతయైన యాచార్యుని ప్రశంసించుచు, నభిమత ఫలముల నిచ్చి తన యాచార్యుని రక్షింపవలసినదిగా దేవతల ప్రార్థించుచున్నాడు. విశ్వామిత్రుడొనర్చిన యాచార్యప్రశంసావ్యాజమున నాచార్య లక్షణములను శ్రుతి యిట పేర్కొనుచున్నది. విశ్వామిత్రుని యాచార్యుడు—

1) అక్షీయమాణ బహుముఖ నదీ ప్రవాహము వలె నవిచ్ఛిన్న, బహుముఖవాగ్ఝరీ సమేతుడు. (శతధారం అపరిమిత జలధారా యుక్తం అక్షీయమాణం న కదాపి విచ్ఛిన్న ప్రవాహం, ఉత్సం ఉత్స/ మివ సతత ప్రవాహోపేతం స్రోత ఇవ అవిచ్ఛిన్న వాక్సరణీ సమేతం).

2) సకల శాస్త్రాభిజ్ఞుడైన మేధావి. (విపశ్చితం మేధావినం సకల శాస్త్రాభిజ్ఞం).

3) విద్యాశరీర ప్రదాత; పాలకుడును. (పితరం శిష్యాణాదో విష్యం దేశేన పాలకం)

4) నానా శ్రుతిశాఖాగతము లయిన వాక్యముల నేకైక లక్ష్యమగు పురుషార్థము నందు సమన్వయపఱచి బోధించువాడు. (వక్త్వానాం వక్తవ్యానాం వేద వాక్యానాం, మేళిం మేళకం నానా శాఖాగతానాం వాక్యానాం ఏకస్మి న్నర్థే సంకలయ్య వక్తారం).

5) పితరుల సన్నిధిలో అనగా ద్యావాపృథువులయొక్క సన్నిధిలో జ్ఞానాతిశయముచే నిర్భరానంద పరవశుఁడు; కావుననే సత్యవాది. (పిత్రోః ద్యావా పృథివ్యోః ఉపస్థే మదంతం జ్ఞానాతిశయేన హృష్యంతం అతఏవ సత్యవాచం అజ్ఞాతార్థాభావాత్ పరప్రతారణే చ కారణాభావాత్ సత్యవాదినం సా. భా.)

శ్రుతిచోదితమైన పై యాచార్యలక్షణముల బరిశీలించుచో నాచార్యుడు మేధావియై,సకలశాస్త్రాభిజ్ఞుడై నిఖిల వేదశాఖాగత వాక్యముల నొకే లక్ష్యమునందు సమన్వయము జేయగల మహావిద్వాంసుడు- అనితెలియు చున్నది. 'తత్తు సమన్వయాత్' అని మహర్షి బాదరాయణు డుద్దేశింప నిఖిల శ్రుతివాక్య సమన్వయ మిట్టిదే. కాన నిఖిల వేదాధ్యయనము గూడ శ్రుతిసంమత మయిన సంప్రదాయము- అని గ్రహింపనగును.ఈ సంప్రదాయము ఛాందోగ్యశ్రుతి వలనను నిట్లు తెలియును.

"స హ ద్వాదశ వర్ష ఉపేత్య చతుర్వింశతి వర్షః సర్వా న్వేదా
నధీత్య మహామనా అనూచానమానీ స్తబ్ధ ఏయాయ"

--ఛాందో. ఉ.6-2.

'యావ చ్చతుర్వింశతివర్షో బభూవ తావత్సర్వాన్ వేదాన్
చతురోఽన్యధీత్య తదర్థం చ బుద్ధ్వా' -శం. భా.

శ్వేతకేతువు పండ్రెండు వత్సరములు గురుకులవాసము జేసినాలుగు వేదముల నధ్యయనము జేసినట్లు ఈ శ్రుతివలన దెలియును. నారదుడు చతుర్వేదాధ్యయనము జేసినట్లు ఈశ్రుతియే మఱియొకచోట(7-1-3)వివరించినది.

## నిఖిలశాఖాధ్యయనము - ఏకశాఖాధ్యయనము :-

"స్మర్యతే చ వైశంపాయనః సర్వశాఖాధ్యాయీ' కఠః పున
రిమాం కేవలాం శాఖా మధ్యాపయాంబభూవేతి। న బహు
శాఖాధ్యాయినాం సన్నిధా వేకశాఖాధ్యాయీ అన్యాం శాఖా
మనధీయానః -శాబరభాష్య, జై. సూ. 1-1-30.

వైశంపాయనుడు సర్వవేదశాఖాధ్యాయి. ఇట్లు బహుశాఖాధ్యయనము జేసిన వారెందఱో యుండగా కఠుడొకే శాఖ నధ్యయనము జేసెను, ఇతరశాఖల నధ్యయనము చేయక యా శాఖనే ప్రవచించెను-అనియర్థము. ఇట్లు సర్వశాఖాధ్యయనము, ఏకశాఖాధ్యయనము-అను రెండు సంప్రదాయములు నున్నట్లు మీమాంసాదర్శనము వలన దెలియును.

## వేదశాఖాధ్యయనము - సంప్రదాయము :-

నిఖిల వేదాధ్యయనముగూడ శ్రుతి స్మృతి సంమత మని యింతవరకును వివరింపబడినది. ఇట నొక నొక విషయము గమనింపదగినది. నిఖిల వేదాధ్యయన మనగా స్వశాఖాధ్యయన పూర్వకమైనయితరస్వశాఖాధ్యయన మనియే గ్రహింపవలెను. స్వశాఖను విడిచి యన్యశాఖాధ్యయనము జేయుట దోషముగ గూడ బరిగణింపబడినది. ఈ విషయము పరాశరమాధవీయమున నిట్లు వివరింపబడినది.

"తదాహ వసిష్ఠః—

"పారంపర్యాగతో యేషాం వేదః సపరిబృంహణః।
తచ్ఛాఖాకర్మ కుర్వీత తచ్ఛాఖాధ్యయనం తథా॥" ఇతి.

స్వశాఖాపరిత్యాగం స ఏవ నిషేధతి.

"స్వీయశాఖోజ్ఝితా యేన బ్రహ్మ తేనోజ్ఝితం పరమ్।
బ్రహ్మహైవ స విజ్ఞేయః సద్భి ర్నిత్యం విగర్హితః॥" ఇతి.

స్వశాఖాధ్యయనపూర్వకం తు అన్యశాఖాధ్యయనం తేనై
వాంగీకృతమ్.

"అధీత్య శాఖామాత్మీయాం పరశాఖాం తతః పఠేత్ ఇతి"

—ఆచారకాండ. 1-38.

దీని ననుసరించి స్వశాఖాధ్యయనము జేసియే యితర శాఖాధ్యయనమును జేయదగు ననెడి సంప్రదాయము స్పష్టము. స్వశాఖ యన నేది ?

"యద్య ప్యేకైకస్య వేదస్య బహ్వ్యః శాఖాః। ఏకత్రింశతిధా[1]
బహ్వృచః, ఏకశతం యజుఃశాఖాః, సహస్రవర్త్మా
సామవేదః, నవధాఽథర్వణో వేద ఇతి। తథాపి తత్ర తత్ర
వేదే పూర్వై రధ్యయనానుష్ఠానాభ్యాం పరిగృహీతా యావతీ
శాఖా తావ త్యత్ర వేదశబ్దేన వివక్షితా। య ఏకం వేద
మధీతే స ద్వాదశ వర్షాణి గురుకులే బ్రహ్మచర్యం చరేత్।
య స్తు చతురో వేదా నధ్యేతుం శక్తః స ప్రతిద్వాదశ
ప్రతివేదే ద్వాదశ వర్షాణీత్యర్థః। యదాహ ఆపస్తంబః-
'ఉపేత స్యాచార్యకులే బ్రహ్మచారివాసో ఽష్టచత్వారింశ
ద్వర్షాణీ'తి। యావతా కాలేనైకో వేదో ద్వౌ వా గ్రహీతుం
శక్యౌ స్తావంతం కాల మితి కేచిత్॥

—హరదత్తమితాక్షరా, గౌ. ధ. సూ. 1-2-51, 52. 53.

1. ఇట హరదత్తు ననుసరించి ముప్పదియొక్క శాఖలని తెలియుచున్నది. కాని మహ
చరణవ్యూహాది గ్రంథముల ననుసరించి ఋగ్వేదశాఖ లిరువది యొకటియని తెలి

ఒకొక్క వేదమునకు అనేక శాఖ లున్నవి. ఋగ్వేదమునకు శాఖలు ముప్పదియొక్కటి. యజుర్వేదమునకు శాఖలు నూటఒక్కటి. సామవేదము సహస్రశాఖాత్మకము. అథర్వణవేదమునకు శాఖలు తొమ్మిది. ఇట్లు బహుశాఖలతో నొప్పు వేదముల నాల్గింటి నెవ డధ్యయనము చేయగలడో యత డొక్కొక్క వేదమునకు 12 సంవత్సరములచొప్పున నలుబది యెనిమిది వత్సరములుగాని లేక యెంతకాలమావశ్యకమో యంతవరకు గాని గురుకులమున నుండవలెను. అట్లు కృత్స్నవేదము నధ్యయనము చేయజాలనివాడు మూడుగాని రెండుగాని, తుదకొకటిగాని వేదము నధ్యయనము చేయవలెను. ఏ యొక వేదమునకైనను పెక్కు శాఖలుగలవు అశక్తు డన్ని శాఖలతో నొప్పు వేదము నధ్యయనము చేయలేక పోవచ్చును. అట్టి యతడు తనపూర్వులచే సంప్రదాయానుగతముగనే శాఖ లేక యే శాఖ అధ్యయనము జేయబడుచు వచ్చినవో వాని నధ్యయనము జేయవలయును. పరంపరాగత శాఖాధ్యాయాధ్యయన మగును. (చూ మస్కరి భాష్యముగూడ).

పరంపరాగతశాఖనే గాక యన్యశాఖలను గూడ నధ్యయనము చేయగల శక్తిసంపన్నుడు సైతము స్వశాఖను విడచి మొదట నన్యశాఖా ధ్యయనమును చేయరాదు; స్వశాఖాధ్యయనము జేసియే యన్యశాఖాధ్యయనము నకు గడగవలెను-అని పై ప్రమాణముల వలన తెలియుచున్నది.

కాని 'స్వశాఖాధ్యయనము మాత్రమే స్వాధ్యాయాధ్యయనము, ఇతర శాఖాధ్యయనము స్వాధ్యాయాధ్యయనము కాదు-అను నిషేధము గాని,నిర్ణయము గాని యీ వచనముల వలన గన్పట్టుట లేదు.

ఈ విషయమును వివరించుచు భాట్టచింతామణి యందొక విశేష మిట్లు చెప్పబడుచున్నది.

> "యే కులంపరయైవ ద్వివేదిన స్త్రివేదినో వా తేషా
> మిష్యైకశాఖాధ్యయనం నిత్యం, అన్య దభ్యుదయార్థ
> మైచ్ఛిక మితి ద్యోతనార్థత్వేన సార్థక్యాత్ । తేన వేదా నధీత్య
> వేదౌ వా వేదం వాఽపి యథాక్రమ మితి స్మృతే రియ
> మేవ శ్రుతి ర్మూల మితి ద్రష్టవ్యమ్।"

—భాట్టచింతామణి 1-1; భాట్టదీపికావ్యాఖ్య.

కులపారంపర్యము ననుసరించి కొందఱు చతుర్వేదులు, అట్లే మఱి కొందఱు త్రివేదులు, ద్వివేదులు, ఏకవేదులును గావచ్చును. అట్టివారికిగూడ నేకశాఖాధ్యయనము నిత్యము, తదితరశాఖాధ్యయనమైచ్ఛికము, అభ్యుదయార్థము నని తెలియుటకే 'స్వాధ్యాయ' పదము నందలి 'స్వ' శబ్ద ముపాత్తము స్వశాఖనే గాక యొకటి గాని, రెండు గాని, మూడు గాని వేదముల నధ్యయనము జేయ నగునని చెప్పెడి 'వేదా నధీత్య వేదౌ వా వేదం వాఽపి యథాక్రమ' మిత్యాది స్మృతివచనములకును 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అనెడి శ్రుతియే మూలము - అని యర్థము.

పై సంప్రదాయములను దృష్టియం దిడుకొనియే శ్రీసాయణాచార్యులును స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను వాక్యము నిట్లు వివరించిరి.

> తస్మాత్ అధ్యాపనస్య విధి రేవ నా స్తీతి సిద్ధమ్। తదభావేన
> స్వవిధిప్రయుక్తత్వైవ అధ్యయనస్య। న చ 'అధ్యయన
> సంస్కృతేనైవ స్వాధ్యాయేన అర్థం జానీయాత్' ఇతి
> విధత్తే ఇతి కృత్స్నస్యాపి వేదరాశేః వివక్షితార్థత్వేన
> స్వతః ప్రామాణ్యాత్ తదంతర్గతస్య (అథర్వవేదస్య)
> వ్యాఖ్యానం కర్తుం యుక్తమేవేతి సిద్ధమ్।"

— అథర్వణవేద భాష్యభూమిక

అధ్యయనసంస్కృత మయిన స్వాధ్యాయము (వేదము)చే నర్థమును గ్రహింపవలె నని శ్రుతిచే విధింపబడుచున్నందున 'కృత్స్న వేదము' నధ్యయనము జేసి తదుపరి యర్థమును గ్రహింపవలె నని స్వాధ్యాయ శ్రుతి తాత్పర్యము-అని యర్థము. శ్రీ సాయణులు అశక్తుల విషయమున నిట్లు చెప్పిరి.

"తేషాం చ వేదానాం సర్వేషాం అన్యతమస్య వా స్వప్రజ్ఞాను
సారేణ అధ్యయనం ఉపనీతేన కర్తవ్యమ్। తథా చ యాజ్ఞ
వల్క్యః స్మరతి-వేదా నధీత్య వేదౌ వా వేదం వాఽపి యథా
క్రమమితి- ఏకవేదపక్షే పితృపితామహాది పరంపరా ప్రాప్త
ఏవ వేదో ఽధ్యేతవ్య ఇత్యభిప్రేత్య స్వాధ్యాయో ఽధ్యేతవ్య
ఇతి స్వశబ్ద ఆమ్నాతః" —ఋగ్వేద భాష్యభూమిక.

ఉపనీతుడగువాడు వేదములన్నిటిని గాని లేక వానిలో నొకటి గాని తన శక్తి ననుసరించి అధ్యయన మొనర్పవలెను. యాజ్ఞవల్క్యస్మృతియు నీ విషయమే చెప్పుచున్నది. ఏకవేదపక్షమున మాత్రము పితృపితామహాది పరంపరాప్రాప్తమగు వేదమునే యధ్యయనము జేయవలె నని తెలియజేయుటకే 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను శ్రుతియందు 'స్వ' శబ్దము ఆమ్నాతమైనది - అని యర్థము.

కనుక శ్రీసాయణు ననుసరించి ఏకవేదపక్షము, బహువేదపక్షము-అను రెండు పక్షములను 'స్వాధాయోఽధ్యేతవ్యః' అను శ్రుతి తాత్పర్యము ననుసరించి సిద్ధము లగుచున్నవని తెలియుచున్నది.

ఇట్లు రెండు పక్షము లున్నట్లు తంత్రవార్తికమునందును, తద్వ్యాఖ్యయగు న్యాయసుధ యందు నిట్లు జెప్పబడుచున్నది.

"యో ఽల్పేన కాలేన బహూన్ వేదా నధ్యేతుం సమర్థ స్తం
ప్రతి బహువేదపక్షో ఽసమర్థం ప్రత్యల్పవేదపక్ష ఇతి సామర్థ్య
మంగీకృత్య గార్హస్థ్యాశ్రమాయోగ్యం ప్రతి బహువేదపక్షః,

తద్యోగం ప్రత్యల్మ వేదపక్ష ఇత్యాశ్రమ యోగ్యత్వ మంగీ
కృత్యాపేక్ష్యేత న్మనునోచ్యత ఇత్యర్థః

—భాట్టసోమేశ్వరః —న్యాయసుధా (తంత్రవార్తికవ్యాఖ్యా) 1-3-4.

కావున (1) బహువేదాధ్యయనము (2) అశక్తుల విషయమున స్వశాఖా ధ్యయనము - రెండును 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను శ్రుతి ననుసరించిన సంప్రదాయములే. ఇంతియే కాదు, అశక్తుల స్వాధ్యాయమును గూర్చి మీమాంసా దర్శనకారుల యభిప్రాయ మిట్లున్నది.

"జ్ఞాతే చ వాచనం న హ్యవిద్వాన్ విహితోఽస్తి"

—జై. సూ. 3-8-18.

'తత్ర హోమమాత్రే చోదితే వేదాధ్యాయీ శక్త ఇత్యధి
క్రియతే, నావిద్వాన్। క్రియతా పున ర్విదితేన విద్వా నధి
క్రియత ఇతి। యావతా విదితేన శక్తో భవతి యథోక్తం
క్రతు మభినిర్వర్తయితుం తావ ద్యో వేద స తేన క్రతునాఽ
ధిక్రియతే। నను వేద మధీయీతేతి వచనా త్కృత్స్నో
వేదో ఽధ్యేతవ్య ఇతి భవతి, న వేదావయవేనాధిక్రియత
ఇతి। ఉచ్యతే। క్రతూనాం జ్ఞానార్థం వేదాధ్యయనం
కార్యమ్। తత్రాన్యస్మిన్ క్రతౌ కర్తవ్యే ఽన్యక్రతుజ్ఞానం
న దృష్టాయ భవతి। తస్మాత్ క్రత్వంతరజ్ఞానం అధికారే
నాఽఽదర్తవ్యమ్। క్రత్వంతర జ్ఞానాయ క్రత్వంతరగ్రంథః।
సర్వే క్రతవః కథం జ్ఞాయేరన్ పృథ గ్పృథ గితి కృత్స్నస్య
వేదస్య అధ్యయనం శ్రూయతే। తస్మాత్ స్వపదార్థజ్ఞో
ఽధిక్రియేతేతి। తేన అన్యపదార్థజ్ఞస్య కర్తైవన్నాస్తి।
కథ మసౌ వాచ్యేత। తస్మాత్ సాధ్వభిధీయతే జ్ఞ ఏవ
వాచయితవ్య ఇతి' —శాబర భాష్యమ్.

'యద్యపి స్వాధ్యాయగ్రహణేన సకలో వేదః పరిగృహీత
స్తథాఽపి దర్శపూర్ణమాసౌ కుర్వాణస్య జ్యౌతిష్టోమిక
మంత్రబ్రాహ్మణం న క్వచి దుపయుజ్యత ఇతి, అసదపి
నాధికారం వ్యావర్తయతి, ఇష్టివేదేనైవ యోగ్యతాయాః
సిద్ధత్వాత్। తేన తద్యాజినః తావా నేవ స్వాధ్యాయః।....
కామశ్రుత్యపరిగ్రహా చ్చ నర్వై రనారభ్యవాద విధ్యధీతో
వేదో ఽపేక్షిత ఇత్యవశ్యం బ్రహ్మచర్యకాల ఏవ నమస్తో
వేదో ఽధ్యేతవ్యః। యది తు కశ్చి దశక్తో నాధీతే సకలం,
అగ్నిహోత్ర దర్శపూర్ణమాత్రం కథంచి దధిగచ్ఛతి న
తస్య తత్రానధికారః। ఏవం చ సతి బాహ్యజ్ఞానం దూర
విప్రకృష్ట మేవ। యత్తు ఆత్మజ్ఞానం తేన వినా ప్రవృత్తి
రేవ నాస్తి, అతః సర్వకర్మార్థ మంగేకర్తవ్యమ్ ।'

—తంత్రవార్తికమ్.

'స్వాధ్యాయో ఽధ్యేతవ్యః, వేద మధీయీత' - ఇత్యాది వచనములచే సకల వేదాధ్యయనము విధింపబడుచున్నది. కాని యాశక్తుడగు నత డగ్నిహోత్ర దర్శపూర్ణమాసాది కర్మల ననుష్ఠించుటకై, యా కర్మభాగమునకు సంబంధించిన వేదభాగమును మాత్ర మెట్లో యధ్యయనము జేసి యా కర్మలయందు ప్రవృత్తుడు గావచ్చును. అట్టి వాని విషయమై యత డొనర్చిన యా వేదభాగాధ్యయన మతనికి స్వాధ్యాయమే (తేన తద్యాజినః తావా నేవ స్వాధ్యాయః) యగును. అనగా నా యా క్రతువులకు సంబంధించిన వేదభాగమునైన నియమపూర్వకముగ ముంద ధ్యయనము జేసి తర్వాత నా కర్మలయందు ప్రవృత్తుడు గావలయును. శక్తుడగు వాడు బ్రహ్మచర్య కాలముననే కృత్స్న వేదము నధ్యయనము జేయవలెను. ఇట్లు జేసియు 'స్వ' పదార్థజ్ఞుడు గానిచో వానికి గర్మలయం దధికారము లేదు. 'స్వ' పదార్థ జ్ఞానమనగా ఆత్మజ్ఞానము; దేహాతిరిక్తుడై కర్తయు, కర్మ ఫల భోక్తయునై విలసిల్లు ఆత్మను గూర్చిన జ్ఞానమని యర్థము. ఈ జ్ఞానములేనిది కర్మలయందు

ప్రవృత్తియే యుండదు, కాన ఆత్మజ్ఞానము సర్వకర్మార్థ మంగీ కర్తవ్యము - అని పై వచనముల తాత్పర్యము.

దీనివలన 1) బహువేదపక్షము 2) ఏకవేదపక్షము మాత్రమే గాక 3) క్రత్వర్థమై నియమపూర్వకముగ నధ్యయనము జేయబడు వేదభాగముకూడ నా క్రతుయాజికి 'స్వాధ్యాయ' మగుటయు దెలియనగును. ఈ మూడును సంప్రదాయములే. అందుచే ఏకవేదపక్షమున, శ్రీ సాయణులు చెప్పినట్లు, స్వాధ్యాయ పదము నందలి 'స్వ' శబ్దమునకు 'స్వశాఖారూపమగు వేదము' అని యర్థమును సంకోచము చేసి చెప్పుట యుక్తమే.

కాని యిట నొక విషయము పరిశీలింపనగును. మహర్షి వేదవ్యాసుడు వేద విభాగము చేసిన తరువాత నా యా శాఖా ప్రవర్తకుల ననుసరించి స్వశాఖాధ్యయనము సంప్రదాయానుగత మయినట్లు[1] పురాణాదుల వలన దెలియుచున్నది. కావున వేదవిభాగాద్యనంతరము స్వాధ్యాయ మనగా స్వశాఖారూప వేదాధ్యయన మనెడి యర్థము సంప్రదాయానుగత మైనట్లు కొందఱు చెప్పుటయు గలదు. అట్టిచో వేదశాఖాది విభాగమునకు బూర్వము శ్రుతియందలి 'స్వాధ్యాయ' పదము లోని 'స్వ' శబ్దమున కర్థ మేమయి యుండును ?

అంతే కాదు. స్వాధ్యాయ పదమును వేదపర్యాయవాచకముగా గ్రహింపక, 'స్వః అధ్యాయః' అని విగ్రహమును జెప్పి స్వశబ్దము స్వశాఖాపర మని చెప్పుచో బహువేదాధ్యయన పక్షమున స్వాధ్యాయపదము నందలి 'స్వ' శబ్దమున కర్థమేమి ? లేక స్వాధ్యాయశబ్దము వేదసామాన్యమునందు గాక 'స్వశాఖారూప వేదము' అను నర్థము నందే రూఢమా ? ఈ విషయముల బరిశీలింతము.

1. పరాశరమాధవీయమ్; ఆచారకాండ. 12-0; భాగ. 12-6; విష్ణు. 3-3-7; వాయు. 1-60. 2-52; అగ్ని. 150-271; కూర్మ. 1-52; నారద. 150; బ్రహ్మాండ. 1-33-5.

# స్వాధ్యాయము యొక్క స్వాధ్యాయత్వము

మహాభాష్యమునందు స్వాధ్యాయ శబ్దమును గూర్చి యిట్లు చర్చింప బడినది.

"కః పున రర్హ తి స్వాధ్యాయశబ్దం ద్వారాదిషు పఠితుమ్ ?
ఏవం కిల పఠ్యేత - 'స్వ మధ్యయనం స్వాధ్యాయ ఇతి'।
తచ్చ న। సుష్ఠువాऽధ్యయనం స్వాధాయః। శోభనం వా
ऽధ్యయనం స్వాధ్యాయః। అథాऽపి స్వ మధ్యయనం
స్వాధ్యాయః। ఏవ మపి న దోషః। అచా మాదే రితి
వర్తత ఇతి" —— మహాభాష్య–ద్వారాదీన౦ చ–పా. సూ. 7–3–4.

ఇట మహాభాష్యమున మొదట 'సుష్ఠువా ऽధ్యయనం స్వాధ్యాయః శోభనంవా ऽధ్యయనం స్వాధ్యాయః' అను వ్యుత్పత్తులు ప్రదర్శింపబడినవి. తుదకు 'స్వ మధ్యయనం స్వాధ్యాయః' అను వ్యుత్పత్తిని జెప్పినను రూపనిష్పత్తి యందు దోషము లేదని చెప్పబడినది. దీనిని బట్టి పై మూడు విధములగు వ్యుత్పత్తులును భాష్యకారాభిమతములే యగును. 'స్వాధ్యాయ' పదము స్వశాఖా రూప వేదమునందు మాత్రమే రూఢమై యున్నచో భాష్యకారుడు మొదటి రెండు వ్యుత్పత్తుల నట్లు ప్రదర్శించి యుండడు. కాన స్వాధ్యాయ పదము 'స్వశాఖారూప వేదము అను నర్థము రూఢము కాదనుట స్పష్టము.

భాష్యకారు ననుసరించియే అమర సుధాకారాదులను రెండు విధములగు వ్యుత్పత్తుల బ్రదర్శించిరి.

1) సు అతీవ ఆవృత్య అధ్యయనమ్ – యజశ్చ — ఘఞ్.

— పా. సూ. 3-3-21.

2) స్వార్థం అధ్యయనం వా .... అమరసుధా.

1) సు+అ+అధి ఇజః భావే ఘఞ్

2) స్వః స్వకీయత్వేన విహితః అధ్యాయః .... వాచస్పత్యమ్.

1) సు, సుకృతాయ ఆవృత్య అధ్యాయోఽ ధీతః స్వాధ్యాయః

2) సుష్ఠు ఆవృత్య అధ్యాయః వేదాధ్యయన మితి —శబ్దకల్పద్రుమః.

ఇట్లు రెండు వ్యుత్పత్తులు గూడ ప్రదర్శింప బడుచుండుటచే 'స్వాధ్యాయ' పదము స్వశాఖారూపవేదము అను నర్థమున మాత్రమే రూఢము గాదనుట స్పష్టము.

ఇందు మొదటి వ్యుత్పత్త్యర్థము ననుసరించి నిరంతర మావృత్తి జేసి చక్కగ నధ్యయనము జేయబడు వేదము 'స్వాధ్యాయ ' మగుచున్నది. అట్లు నిరంతర మభ్యసింపబడని, లేక మననము జేయబడని వేదము స్వాధ్యాయము గాదనియు భావము. ఇట్లు చెప్పినచో స్వాధ్యాయశబ్దము పైన జెప్పిన ఆమ్నాయశబ్దితత్త్వమును వివరించిన దగును.

ఇక అమరసుధాకారుని రెండవ వ్యుత్పత్తిని జూతము. 'స్వార్థమధ్యయన 'స్వాధ్యాయః' – ఆత్మార్థమగు, అనగా ఆత్మస్వరూపప్రాప్తి కొఱకైన, లేక పరమపురుషార్థము కొఱకైన, యధ్యయనము వేదము— అని యర్థము. అట్లుగాక తనకొఱకు, అనగా తన యశస్సు కొఱకో లేక ధనలాభాదికము కొఱకో చేయబడెడి యధ్యయనము 'స్వాధ్యాయ' మని చెప్పరాదు. అట్లుచెప్పిన 'బ్రాహ్మణేన నిష్కారణః షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ' యనెడి శ్రుతివాక్యముతో విరోధము సంభవించును కాన ఆత్మార్థమైన, అనగా ఆత్మస్వరూపావబోధార్థమై యధ్యయనమే 'స్వాధ్యాయ మని-యర్థము జెప్పుట యుక్తతరము.

నిఖిలవేదములకు సాక్షాత్తుగ గాని, పరంపరగ గాని యాత్మ స్వరూపమును దర్శింపజేయుటయే లక్ష్య మని 'వేద, ఋషి, బ్రహ్మాది' శబ్దవిచారమునందు వివరింపబడినది. అటులే వేదమునకు గల యీ స్వాధ్యాయ మను నామముగూడ వేదముయొక్క లక్ష్యము పరమ పురుషార్థదర్శమే - యని తెలియజేయుచున్నదని గ్రహింపనగును.

శ్రీసాయణాచార్యులు, భాష్యకారుడు ప్రదర్శించిన మూడవ వ్యుత్పత్తి ననుసరించి 'స్వః అధ్యాయః స్వాధ్యాయః' అని చెప్పినట్లు గన్పట్టును. 'స్వః అధ్యాయః'- అను పదములకు ప్రకరణము ననుసరించి' స్వశాఖారూపమగు వేదము' అను నర్థమును జెప్పినను, పైన జూపిన వ్యుత్పత్తి ననుసరించి యనుగతమైన యర్థమును గూడ గ్రహింపవలసి యున్నందున 'స్వం ఆత్మవిషయకం అధ్యయనం స్వాధ్యాయః' అను నర్థమును గూడ అధికారిభేదము ననుసరించి గ్రహింపవలసి యుండును.

శ్రీ శబరస్వామియు 'తస్మాత్ స్వపదార్థజ్ఞో ఽధిక్రియేతేతి, తేన అస్వపదార్థజ్ఞస్య కర్మైవ నాస్తి' (జై. సూ. 3-8-18) —— 'స్వ' పదార్థజ్ఞుడే కర్మలయందధికృతుడు; 'స్వ' పదార్థజ్ఞుడు గానివానికి కర్మయే లేదు' —— అనుచు, కర్మలకు 'స్వ' పదార్థజ్ఞానము నాంతరీయకము: కర్మానుష్ఠాన సమయమున స్థూలదేహాతిరిక్తుడును, కర్మఫలభోక్తయు నగు ఆత్మను ('స్వ' పదార్థమును) గూర్చిన జ్ఞానము, ఆవశ్యకము — అని చెప్పుచు స్వాధ్యాయము యొక్క ఆత్మపరత్వమును (స్వపరత్వమును) నిపుణముగ దెలియజేయుట దర్శింపనగును.

శ్రీ కుమారిలభట్టపాదులును పై శబరవాక్యమును — 'యత్ర ఆత్మజ్ఞానం, తేన వినా ప్రవృత్తి రేవ నాస్తి, అతః సర్వకర్మార్థ మంగీ కర్తవ్యమ్' —— అని వివరించుచు స్వాధ్యాయము క్రత్వర్థమైనను దానికి గల ఆత్మ పరత్వమును విస్మరింపరాదని హెచ్చరించుటయు గమనార్హము.

శ్రీకుమారిలభట్టపాదుల హృదయమును భట్టసోమేశ్వరుడును న్యాయ సుధయందిట్లు వివరించినాడు.

'శరీరాది వ్యతిరిక్తాత్మ ప్రతిపాదక వాక్యానాం తర్హి కర్మజ్ఞానా
నువయోగాత్ సగుణోపాసన వాక్యవచ్చాభ్యుదయ ఫలత్వా
భావాత్ నిర్గుణోపాసన వాక్యవద్వాఽపవర్గ ఫలత్వాభావాత్
అనర్థక మధ్యయనం స్యా దిత్యాశంక్యాహ యత్త్వితి'

శరీరాతిరిక్త - ఆత్మజ్ఞానమును బోధించెడి వాక్యములకు సాక్షాత్తుగ క్రతువున వినియోగము లేకపోయినను, ఆ యాత్మజ్ఞానము లేనిది క్రతువే లేదు; కనుక స్వాధ్యాయము క్రత్వర్థమైనను దానియొక్క ఆత్మ పరత్వము గుర్తించుట యత్యన్తావశ్యకము - అని తాత్పర్యము.

పైన బేర్కొనిన 'యద్యసౌ ఛందసాం లోకం' అను భాగవత శ్లోకము (11-17-30) నైష్ఠిక బ్రహ్మచారి యొక్క స్వాధ్యాయమునకు (కృత్స్న వేదాధ్యయనమునకు) లక్ష్యము ఛందోలోకమైన బ్రహ్మలోక మని చెప్పుచున్నది. స్వాధ్యాయమునకు గల యీ యర్థమును (ఆత్మను, లేక బ్రహ్మను గూర్చిన యధ్యయన) గ్రహించినపుడే భాగవతోద్దిష్టమైన లక్ష్య మువపన్న మగును.

'వేదా బ్రహ్మాత్మ విషయా స్త్రికాండ విషయా ఇమే' (భాగ. 11-36); వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః; సర్వే వేదా య త్పద మామనంతి; బ్రహ్మాణం బ్రహ్మవాహనమ్' - ఇత్యాది శ్రుతి స్మృతి వచనములందు బేర్కొన బడిన 'బ్రహ్మ, ఆత్మా, అహమ్, పరమం పదమ్' అనునవి స్వాధ్యాయ లక్ష్యము లగుట 'స్వ' శబ్దముచే దెలియనగును.

## స్వాధ్యాయమే బ్రహ్మయజ్ఞము :-

"స్వాధ్యాయో బ్రహ్మయజ్ఞః" అని శతపథబ్రాహ్మణము (1-5-6-2) నందలి బ్రహ్మ యజ్ఞాధికార ప్రకరణములోని వాక్యము. స్వాధ్యాయమే బ్రహ్మ యజ్ఞ మని యర్థము. సాంగ నిఖిల వేదాధ్యయనము లేక అధ్యాపనము, బ్రహ్మ యజ్ఞ మగును. ఇది ప్రతిదినము జేయవలసిన పంచ మహాయజ్ఞములలో నొకటి. ఇట్టి బ్రహ్మయజ్ఞమును జేయు సంప్రదాయము నేటికిని గలదు. ఇట శ్రుతి స్వాధ్యాయ, బ్రహ్మయజ్ఞ శబ్దములు రెండింటిని పర్యాయపదములుగ బ్రయోగించుట స్పష్టము.

స్వాధ్యాయ, బ్రహ్మయజ్ఞ శబ్దములు రెండును పర్యాయపదములను విషయము ఆపస్తంబ ధర్మసూత్రములందు నిట్లు గలదు.

"అథాపి వాజసనేయ బ్రాహ్మణమ్ - బ్రహ్మయజ్ఞో హ
వా ఏష యత్ స్వాధ్యాయః" — 1-4-3.

'అథాపి అపి చ స్వాధ్యాయో నామ య ఏష బ్రహ్మయజ్ఞః
బ్రహ్మ వేదః, తత్సాధనో యాగః। యథా దర్శపూర్ణ
మాసాదయః పురోడాశాది సాధనాః। హ వై శబ్దౌ ప్రసిద్ధిం
ద్యోతయతః' — హరదత్తవ్యాఖ్య.

స్వాధ్యాయమే బ్రహ్మయజ్ఞ మని వాజసనేయ బ్రాహ్మణము; ఇందలి హ, వై శబ్దములు స్వాధ్యాయమునకు గల బ్రహ్మయజ్ఞత్వ ప్రసిద్ధి నభివ్యక్తము జేయునట్టివి. దర్శ పూర్ణమాసాది కర్మలకు పురోడాశాదు లెట్లు సాధనములో యీ స్వాధ్యాయ యజ్ఞమునకు బ్రహ్మ (వేదము) సాధనము — అని యర్థము.

ఇట హరదత్తవ్యాఖ్య ననుసరించి బ్రహ్మయజ్ఞ మనగా బ్రహ్మ (వేదము) సాధనముగా గల యజ్ఞము - అని యర్థము సిద్ధించుచున్నది. వేదాభ్యాసము జేయు బ్రహ్మచారి విషయమున నిది బ్రహ్మప్రాప్తికి – బ్రహ్మరూప వేదశబ్దరాశి ప్రాప్తికి – సాధనమని యర్థము. కాని యభ్యాసము జేయుకొలది యధికారి భేదము ననుసరించి యీ స్వాధ్యాయము వేదరూపుడగు బ్రహ్మయొక్క ప్రాప్తికి సాధనమగు నను విషయము గూడ నిట సూచితము. 'ఏకవేదస్యాజ్ఞానాత్ వేదాస్తే బహవోఽభవన్' – ఇత్యాది పూర్వోదాహృత వాక్యములు ఏకవేద (జ్ఞాన) స్వరూపుడగు పరమాత్మను దెలియ జేయుటకే వేదము లన్నియు సాధనములై వెలసినట్లు చెప్పుచున్నవి. శ్రీ సాయణుడును స్వాధ్యాయరూప బ్రహ్మయజ్ఞము పరమ పురుషార్థ సాధనమని చెప్పినాడు.

"యస్మాత్ స్వాధ్యాయవ్యతిరేకేణ సుకృతమార్గో న జ్ఞాయతే
తస్మాత్ స్వాధ్యాయో ఽధ్యేతవ్యః, గ్రహణాధ్యయనం
బ్రహ్మయజ్ఞాధ్యయనం చ కర్తవ్యమ్। తచ్చోభయం పరమ
పురుషార్థ సాధనమ్' — సా. భా. తై. ఆ. 2-15.

కాన స్వాధ్యాయము యొక్క పరమలక్ష్య మదియే యని 'స్వాధ్యాయో బ్రహ్మయజ్ఞః' అను శ్రుతివాక్యము దర్శింపజేయుచున్నటుల గ్రహింపనగును.

స్వాధ్యాయము బ్రహ్మయజ్ఞ మని యింతవరకు దర్శించితిమి. ఇంతేకాదు.

## ప్రణవజపము - స్వాధ్యాయము :-

అధికారిభేదము ననుసరించి స్వాధ్యాయ మనగా ప్రణవజపము — అనునర్థము గూడ సంప్రదాయసిద్ధమై గన్పట్టుచున్నది.

"తపః స్వాధ్యాయ ఈశ్వరప్రణిధానాని క్రియాయోగః"

—యోగ. సూ. 2-1.

'స్వాధ్యాయః ప్రణవాది పవిత్రాణాం జపః మోక్షశాస్త్రాధ్యయనం వా.'

—వ్యాసభాష్య.

"శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః"

—యోగ సూ. 2-32.

'స్వాధ్యాయో మోక్షశాస్త్రాణా మధ్యయనం, ప్రణవజపో వా'

—వ్యాసభాష్య.

పై వ్యాసభాష్యమును వివరించుచు శ్రీవాచస్పతిమిశ్రుడు తన తత్త్వవైశారదీ వ్యాఖ్యయందు యోగశాస్త్రమున బేర్కొనబడిన యీ యమనియమములే విష్ణుపురాణము (6-7అధ్యా)గూడ వివరించుచున్నట్లు ఈశ్లోకముల నుదహరించినాడు.

"బ్రహ్మచర్య మహింసాం చ సత్యాస్తేయాపరిగ్రహాన్।
సేవేత యోగీ నిష్కామో యోగ్యతాం స్వమనో నయన్॥
స్వాధ్యాయ శౌచ సంతోష తపాంసి నియతాత్మవాన్।
కుర్వీత బ్రహ్మణి తథా పరస్మిన్ ప్రవణం మనః॥
ఏతే యమాః సనియమాఃపంచ ప చ ప్రకీర్తితాః।
విశిష్టఫలదాః కామ్యానిష్కామాణాం విముక్తిదాః॥"

—వి. పు. 6-7-36, 37, 38.

కాన స్వాధ్యాయ మనగా 'ప్రణవజపము లేక మోక్షశాస్త్రాధ్యయన' మనియు నర్థము లుండుట స్పష్టము. స్వాధ్యాయాది యమ నియమముల ఫలాభిసంధి

గలవారికి విశిష్టఫలప్రదములు; ఫలాభిసంధిలేని నిష్కామయోగులకు మోక్షసాధనము లని విష్ణుపురాణము వర్ణనను దెలియుచున్నది.

ధర్మశాస్త్రములందు మునికి స్వాధ్యాయము విధింపబడినది. ఇట స్వాధ్యాయ మనగా ప్రణవజప మనియే యర్థము.

"అనగ్ని రనికేతః స్యా దశర్మా ఽశరణో మునిః।
స్వాధ్యాయఏవోత్సృజమానో వాచం గ్రామే ప్రాణవృత్తిం
ప్రతిలభ్యాఽనిహోఽనమత్రశ్చరేత్" — ఆప ధసూ. 2-21-10.

'స్వాధ్యాయః ప్రణవాది పవిత్రాణాం జపః అత్ర బౌధాయనః -
వృక్షమూలికో వేదసంన్యాసీ, వేదో వృక్షః తస్య మూలం
ప్రణవః, ప్రణవాత్మకో వేదః; ప్రణవో బ్రహ్మభూయాయ
కల్పత ఇతి హోవాచ ప్రజాపతి రితి। (బోధా. ధ. సూ. 2-10-29 నుండి 33 వరకు)

తత్రైవ వాచం విసృజేత్ అన్యత్ర మౌనవ్రతః స్యాత్'

— హరదత్త వ్యాఖ్య.

"అనగ్ని రనికేతః స్యా దశర్మాఽశరణో మునిః। భైక్షార్థీ
గ్రామ మన్విచ్ఛేత్। స్వాధ్యాయే వాచ ముత్సృజే, దితి॥"

(బోధాయన ధ. సూ. 2-10-25, 26, 27)

"స్వాధ్యాయః ప్రణవః, సమస్తవేదో వా" (గోవిందస్వామి వ్యాఖ్య)

పాపమును ఛేదించునది యగుటచే వేదము వృక్షము (వృక్షో వ్రశ్చనాత్ పాపస్య.) వేద వృక్షమునకు మూలము ప్రణవము. అందుచే వేదము ప్రణవా

త్మకము. ముని యగువాడు చేయవలసిన స్వాధ్యాయ మీ ప్రణవ జపము – అని ధర్మశాస్త్ర వచనముల తాత్పర్యము.

ఇట గమనింపవలసిన యంశము గలదు. కృత్స్న వేద ప్రతీతిథిరూప మగు ప్రణవము స్వాధ్యాయ మని చెప్పబడుటచే. స్వాధ్యాయపదము కృత్స్న వేదమునకు వాచక మగుట స్పష్టము. మఱియు పరమేశ్వర వాచకమగు నీ ప్రణవము స్వాధ్యాయ మగుచో నపుడు స్వాధ్యాయపదము లోని "స్వ" శబ్దము ఆత్మ లేక పరమేశ్వరపరముగనే గ్రహింపబడవలసియున్నది. ప్రణవజప మొనర్చెడి ముని విషయమున 'స్వశాఖారూప వేదము' అను నర్థమునకు ప్రసక్తియే యుండదు.

## స్వాధ్యాయము మోక్షశాస్త్రాధ్యయనము:-

బ్రహ్మ జిజ్ఞాసయం దధికృతులగువారు గురువుకడ జేసెడి మోక్ష శాస్త్రాధ్యయనమునకును స్వాధ్యాయ మని పేరు.

"స ఆవృణో త్యవృతం సంప్రయచ్ఛం స్తస్మై న ద్రుహ్యే
త్కృత మస్య జానన్ ।గురుం శిష్యో నిత్య
మభివాదయీత, స్వాధ్యాయ మిచ్ఛే చ్ఛుచిదా ఽప్రమత్తః ॥"

— సనత్సుజాతీయమ్. –8.

పరమ పురుషార్థసిద్ధి యాచార్యాధీన మని యిట జెప్పబడుచున్నది. పూర్ణానంద స్వరూపుడగు బ్రహ్మకు 'అమృత' మని పేరు. ఆ బ్రహ్మయే ఆత్మ. ఆచార్యుడు శిష్యుని కీ యమృతము నొసగుచు నిరంతర మాతనిని తత్స్వ రూపమున నిలుపును. (ఆవృణోతి ఆపూరయతి అమృతం పూర్ణానందం బ్రహ్మ ఆత్మత్వేన సంప్రయచ్ఛన్ - శం. భా; సత్యేన చిదాత్మనా ప్రకర్షేణ ఆవృణోతి

సబాహ్యాభ్యంతరం వాసయతి। ద్వైతోత్థ భయనివారణేన పాలయతీత్యర్థః - నీల కంఠః) అట్లు శిష్యుని తత్స్వరూపమున నిలిపి జడము, అసత్యము నగు ద్వైత ప్రపంచ వాసనల వలన గలిగెడి భయమును వారించి పాలించుచుండును. అమృత ప్రదుడగు నా గురువు విషయమై యెట్టి ద్రోహమును దలపెట్టరాదు: ప్రణిపాత పూర్వకముగ నిరంతరము గురువుకడ నప్రమత్తుడై స్వాధ్యాయపరుడు - శ్రవణ మననాది పరుడు - గావలెను. (స్వాధ్యాయ మిచ్ఛే చ్ఛ్రవణాదిపరో భవేత్ - (శం. భా.) - అని యర్థము.

ఇటి బ్రహ్మజిజ్ఞాసయం దధికృతుడైన శిష్యుడు గురువుకడ జేసెడి స్వాధ్యాయము వేదాంత వాక్య శ్రవణ మననాది రూపమని శ్రీ శంకర భగవత్పాద భాష్యము వలన దెలియుచున్నది.

ఇంతియే కాదు. స్వాధ్యాయ మన వేదవాక్యోచ్చారణ సంప్రదాయా భిజ్ఞుడై కుశలుడై చేయు అధ్యాపనము అను నర్థము గూడ సంప్రదాయాను గతము. బృహదారణ్యక శ్రుతిని వివరించుచు శ్రీ శంకరు లీ విషయము నిట్లు వివరించిరి.

'మంత్ర శ్చాయం స్వాధ్యాయార్థో జపార్థ శ్చ'

— శం. భా. బృ. ఉ. 2-6-3.

'స్వాధ్యాయః స్వాధీనోచ్చారణక్షమత్వే సత్యధ్యాపనం,

జపస్తు ప్రత్యహ మావృత్తి రితి భేదః' — ఆనందగిరి.

బృహదారణ్యక శ్రుతి యందలి మధుకాండవంశబ్రాహ్మణాత్మక మగు మంత్రముగూడ స్వాధ్యాయార్థము-జపార్థము నగును. స్వాధ్యాయ మనగా అధ్యా పనము (స్వాధీనోచ్చారణక్షమత్వే సత్యధ్యాపనమ్) - అని యర్థము.

పాతంజలమహాభాష్యమున స్వాధ్యాయ మన వేదాభ్యాస మనియు నర్థము జెప్పబడినది.

'చతుర్భిశ్చ ప్రకారై ర్విద్యోపయుక్తా భవతి । ఆగమకాలేన, స్వాధ్యాయకాలేన, ప్రవచనకాలేన, వ్యవహారకాలేనేతి'

— మహాభాష్య. 1-1-1

'ఆగమకాలః - గ్రహణకాలః, స్వాధ్యాయకాలః - అభ్యాసకాలః ప్రవచనకాలః - అధ్యాపనకాలః. వ్యవహారః యాజ్ఞే కర్మణి'

— కైయటః.

అగమకాల మన వేదగ్రహణకాలము, స్వాధ్యాయకాల మన అభ్యాస కాలము, ప్రవచనకాల మన అధ్యాపన కాలము. యాజ్ఞకర్మలయందు విని యోగించుట వ్యవహారకాలము. ఇట్లు విద్య చతుర్విధముల నుపయుక్తమగు చుండునని యర్థము.

కాన స్వాధ్యాయన మన వేదాభ్యాసము, వేదాధ్యాపనము - అను నర్థము లను గ్రాహ్యము లని తెలియును.

పై గ్రంథ సందర్భము నంతయు బరిశీలించినచో స్వాధ్యాయ మనగా ప్రకరణము ననుసరించియు నధికారిభేదము ననుసరించియు (1) నిఖిల వేదము, తదధ్యయనము (2) స్వశాఖాధ్యయనపూర్వకముగ యథాశక్తి జేయ బడెడి యన్యవేదధ్యయనము (3) స్వశాఖాధ్యయనము (4) క్రతర్థమైన వేదభాగాధ్యయనము (5) అధ్యాపనము (6) వేదాన్తవాక్య శ్రవణ మననా దికము (7) మునిజేయు ప్రణవజపము - అను నర్థములు సంప్రదాయాను గతములయి సిద్ధము లగుచున్నవి. ఇట్లు ఈ యర్థము లన్నియు గ్రాహ్యములే. అయ్యును, వీని యన్నిటియందు ననుగతమై యొప్పెడి స్వాధ్యాయత్వమును దర్శించుట ప్రధాన కర్తవ్యము. అది యెద్ది ?

క్రతవ్వర్థమై వేదములో నే కొంతభాగము నధ్యయనము జేసినను లేక స్వశాఖాధ్యయనమును జేసినను, లేక శక్తులై స్వశాఖాధ్యయనపూర్వక నిఖిల వేదాధ్యయనము నొనర్చినను, లేక జిజ్ఞాసువులై శ్రవణమననాదికము నొనర్చినను లేక మునియై ప్రణవజపము నొనర్చినను — వీని యన్నిటి పరమ లక్ష్యము బ్రహ్మయే లేక ఆత్మయే - యని తెలియజేయుటయే స్వాధ్యాయము యొక్క స్వాధ్యాయత్వము

## స్వాధ్యాయ ప్రశంస :-

శతపథశ్రుతియు స్వాధాయాధ్యయనమును విధించి, స్వాధ్యాయము యొక్క యనితర సాధారణ మహిమాతిశయ సంపన్నత్వమును జక్కగ వివరించుచు, 'తస్మాత్ స్వాధ్యాయో ఽధ్యేతవ్యః' - అని పలుమాఱులు చెప్పుచు స్వాధ్యాయావశ్యకత నిట్లు ప్రబోధించినది.

"అథాతః స్వాధ్యాయప్రశంసా । ప్రియే స్వాధ్యాయప్రవచనే భవతః । యుక్తమనా భవతి । అపరాధీనో ఽహరహ ర్థాన్ సాధయతే । సుఖం స్వపితి । పరమచికిత్సక ఆత్మనో భవతి । ఇంద్రియ సంయమ శ్చ । ఏకారామతా భవతి । ప్రజ్ఞా వృద్ధిః । యశో లోకపక్తిః । — శ. బ్రా 11-5-7-1.

ఇట శ్రుతి స్వాధ్యాయ ప్రశంస నారంభించుచు 1) స్వాధ్యాయ, ప్రవచనములు రెండును ప్రియములు - అని పేర్కొనినది; ప్రియములనగా అనుకూల వేదనీయము లని యర్థము. వాస్తవముగ స్వాధ్యాయాధ్యయనము గాని, అధ్యాపనము గాని రెండు నత్యంత శ్రమసాధ్యములు. శ్రమసాధ్యములైనను వీనియందు వైముఖ్యము కూడదు. ఏదేని యుత్కృష్టఫలము నాశించి చేసెడి శ్రమ యంతయు, ఆశించిన ఫలము దృష్టియందుండుటచే, శ్రమ యనిపించదు.

ఫలప్రాప్త్యనంతరము తాను పడిన శ్రమ ప్రియమయియే యొప్పును. అప్రియము కాదు. ఇట్లు లౌకిక ఫలప్రాప్తికై చేసెడి శ్రమయే ప్రియమై యొప్పుచుండ, అనన్యలభ్యమగు మహోత్కృష్ట ఫలములు సిద్ధింపజేసెడి స్వాధ్యాయాధ్యయనము గాని అధ్యాపనము గాని ప్రియములై యొప్పుటలో నాశ్చర్యము లేదు. కావున నివి ప్రియములు 'అనుకూల వేదనీయములు' అని శ్రుతి ప్రబోధించుచున్నది.

2) 'యుక్తమనా భవతి' — స్వాధ్యాయనమునకు గాని, అధ్యాపనముకు గాని యేకాగ్రత యావశ్యకము అది లేనిది యీ రెండును సిద్ధింపవు. స్వాధ్యాయ ప్రవచనములు చేయుచో చేయు కొలది యేకాగ్రతయు ననుగతమై యప్రయత్నముగ సిద్ధించుచుండును. కావుననే శ్రుతి యట్టివాడు 'యుక్తమనా భవతి' ఏకాగ్రచిత్తుడగును అని కీర్తించినది.

3) 'అపరాధీనో ఽహరహ ర్థాన్ సాధయతే' — స్వాధ్యాయ ప్రవచనపరుడై యేకాగ్రత సిద్ధించిన వేదవిదుడు పరాధీనుడు గాకయే, యనన్యాపేక్షముగ దైనందినము ధర్మాద్యర్థముల సాధించుకొనగలడు. స్వధర్మ ప్రతిష్ఠితుడై యోగ్యార్థసాధకుడగు నని యర్థము.

'సుఖం స్వపితి' — స్వధర్మనిరతుడై యా వేదవిదుడు సుఖస్వాపము చెందును; అనగా నిర్విచారుడై సుఖముగ నుండు నని భావము.

5) 'పరమ చికిత్సక ఆత్మనో భవతి' —

'ఆత్మనః స్వస్య, పరమచికిత్సకో భవతి। అన్యే హి భిషజ ఔషధాదినా శరీరస్యైవ తాత్కాలికీ మేవ ఉదర శిరోరోగాది పీడాం నివర్తయంతి। విద్వాం స్తు దేహవ్యతిరిక్తస్యాత్మనః ఉక్తేన స్వాధ్యాయేన పున ర్మృత్యుప్రాప్తి రూపాం పీడాం సర్వదైవ నివర్తయతీతి పరమచికిత్సకత్వం తస్యేత్యర్థః'

— సా. భా.

వైద్యులు ఔషధాదులచే శరీరమునకు దాత్కాలికముగ గలిగెడి యుదర శిరోరోగాది బాధలనే నివర్తింప జేయుదురు. వేదవిదు డట్లుగాక యీ స్వాధ్యాయ మనెడి దివ్యౌషధముచే దేహాతిరిక్తుడగు ఆత్మకు (జీవునకు) సంసారపునరావృత్తి రూప మృత్యువనెడి పీడను శాశ్వతముగ నివర్తింప జేసికొనును. కావున స్వాధ్యాయపరుడు ఆత్మకు పరమ చికిత్సకుడుగ పేర్కొనబడినాడు.

(6) ఆత్మచికిత్సాపరుడగు స్వాధ్యాయపరు డనర్థహేతువు లగు విషయములమండి యింద్రియముల మరల్చి సంయమియై, యాత్మారాముడై వెలయు ననియు, నట్లు వెలయు కొలది, ప్రజ్ఞావృద్ధి కల్గి క్రాంతదర్శియై, యశస్సంపన్నుడై లోకప్రతిష్ఠితుడగును – అని శ్రుతి తాత్పర్యము.

ఈ శతపథశ్రుతియందు స్వాధ్యాయ ప్రశంస యింకను గలదు. ఇట శ్రుతి యొనర్చిన స్వాధ్యాయ ప్రశంస భూతార్థవాదము. అనగా యథా స్థితార్థ కథనము; రాజాదిప్రశంసవలె నతిశయోక్తి గాదు.

దేహాతిరిక్తుడగు ఆత్మయొక్క చికిత్స స్వాధ్యాయముచేతనే సిద్ధించును గాని యన్యసాధనములచే సిద్ధింప దనెడి యజ్ఞాత విషయమును దెలియజేయుటకై స్వాధ్యాయ ప్రశంస యిట నారబ్ధమైనది.

ఇట్లు ఆత్మ చికిత్సక మని చెప్పబడుటచే స్వాధ్యాయాధ్యయనమనగా శబ్దరాశిని కంఠస్థము జేయుటయే కాదు; యోగ్యత ననుసరించి ధర్మ బ్రహ్మ జిజ్ఞాసల నొనర్చి శ్రుతి ప్రతిపాదితార్థముల నవగతము జేసికొనుటయే ఆత్మకు జేయబడెడి చికిత్స యగును. అట్టి చికిత్స వలన గలిగెడి యింద్రియ సంయమాదుల ద్వారా లభించునదియే ఆత్మారామత్వము. అదియే స్వాధ్యాయ లక్ష్యము అని పై స్వాధ్యాయప్రశంసాశ్రుతి తాత్పర్యము.

కావున – స్వం అధ్యయనం స్వాధ్యాయః – అను మహాభాష్యోక్త నిర్వచనము ననుసరించి స్వం ఆత్మ విషయకం అధ్యయనం స్వాధ్యాయః – ఆత్మ

విషయకమైన యధ్యయనము స్వాధ్యాయమని గ్రహింపనగును. అట్లు బ్రహ్మ (ఆత్మ) విషయక స్మరణ హేతువగుటచేత తత్ప్రతిపాదక గ్రంథమునకును 'స్వాధ్యాయః'అని పేరు. కనుకనే స్వాధ్యాయపదము బ్రహ్మతాత్పర్యక 'వేద' పదమునకు బర్యాయపదముగ బ్రసిద్ధమై నిఘంటుకారులచే గూడ గ్రహింపబడినది.

ఇట్లు స్వాధ్యాయశబ్ద పరిశీలనమువలన వేదములు 'స్వ' పరములు కాని లౌకిక చారిత్రిక విషయ బోధనతత్పరములు గావు. అట్లు 'స్వ' పరములుగ దర్శించి యధ్యయనము చేసినపుడే వేదము స్వాధ్యాయమై వెలయు గలదు అవి స్వాధ్యాయ శ్రుతి తాత్పర్యము.

## స్వాధ్యాయము - చరిత్రకారులు :-

SVADHYAYA (reciting to one self) in the Brahmanas denotes the study or repetition of the Vedic Texts.

—*Vedic Index: A. A. Macdonell & A. B. Keith.*

"స్వాధ్యాయ పదమునకు 'స్వయముగ (తనకు దాను) వల్లె వేసి కొనుట' యని యర్థము. బ్రాహ్మణములలో నీ పదము వైదిక సంహితా భాగము లను చదువుట లేక ఆవృత్తి చేయుటను తెలియజేయును" — అని యర్థము.

దీనినిబట్టి యీ చరిత్రకారులు స్వాధ్యాయ మనగా 'వేదము' అను నర్థము గ్రహించినట్లే కన్పట్టదు. మఱియు బ్రాహ్మణములలో గన్పట్టు స్వాధ్యాయ దపము 'వేదము' అను నర్థమును బోధించుటలేదనియు పై వాక్యముల వలన దెలియుచున్నది. అది యుక్తము కాదు.

'స్వాధ్యాయో ఽ ధ్యేతవ్యః' — శ. బ్రా. 11-5-6-3.
'ప్రియే స్వాధ్యాయ ప్రవచనే భవతః' — శ. బ్రా. 11-5-7-1.
'అహ రహః స్వాధ్యాయ మధీతే' — శ. బ్రా. 11-5-6.

ఇత్యాది బ్రాహ్మణవాక్యము లన్నియు స్వాధ్యాయపదమును వేద పర్యాయపదముగనే గ్రహించినవి. ఈ పదము శ్రుతి, స్మృతి, పురాణ, కోశాదుల యందు వేద పర్యాయ వాచకముగ సుప్రసిద్ధము. కాన బ్రాహ్మణములలో నీ పదము 'వైదిక సంహితల జదువుట లేక యావృత్తి జేయుట — యను నర్థమును మాత్రమే బోధించుచున్న దనుట తగదు.

మఱియు స్వాధ్యాయపదము 'తనకు దాను వల్లెవేసికొనుట[1]' — యను నర్థము మాత్రమే చెప్పుచున్నదనుటయు సంగతము గాదు. కృత్స్న వేదాధ్యయనము, అధికారిభేదము ననుసరించి చేయబడెడి స్వశాఖాధ్యయనము, క్రత్వర్థమై చేయబడు వేదభాగాధ్యయనము మఱియు బ్రహ్మ యజ్ఞము, తుదకు ప్రణవ జపము, మోక్షశాస్త్రాధ్యయనము — అన్నియు స్వాధ్యాయపద వాచ్యములగుట శ్రుతి, స్మృత్యాది ప్రమాణసిద్ధము.

స్వాధ్యాయపదమునకు 'తనకు తాను ఆవృత్తి జేసికొనుట' యను నర్థముగూడ లేకపోలేదు. కాని యా పదమునే దెలియవలసిన తాత్పర్య మంతియే కాదు. అంతియే యగుచో నమర కోశాది గ్రంథములను భౌతిక శాస్త్రాదులను, ఇతర పారాయణోపయుక్త గ్రంథములను లేక గ్రంథభాగములను, కంఠస్థము చేసి యావృత్తి జేసికొనెడి యాచారము గలదు కాని, వానికి 'స్వాధ్యాయ' మనుప్రసిద్ధి లేదు. అందుచే స్వాధ్యాయ మన 'తనకు దాను ఆవృత్తి జేసికొనుట' అని మాత్రమే జెప్పిన చాలదు. దేనిని ఆవృత్తి జేసికొన వలెను ? ఎందుకు ? ఎట్లు ? — అను నాకాంక్షాపరిపూర్తి యీ చరిత్రకారుల యర్థనివరణము వలన సిద్ధించుట లేదు. స్వాధ్యాయాధ్యయన స్వరూపమును,

1 స్వయంవర్ధనా—వైదికకోశ – సూర్యకాన్త. (మాగ్డొనెల్, కీత్ పండితుల వేదిక్ ఇండెక్సును ఆధారముగ జేసికొనిన హిందీ వైదిక కోశము.

స్వాధ్యాయ బ్రాహ్మణములే చక్కగ వివరించియున్నవి. అందుచే బ్రాహ్మణ విహిత మయిన స్వాధ్యాయాధ్యయన స్వరూపము దెలియవలసి యున్నది.

స్వాధ్యాయో ఽధ్యేతవ్యః — అనునది నియమవిధి యని సంప్రదాయము. అధ్యయనము విషయమై యొక విశిష్ట నియమమును బోధించునది యని యర్థము. కావున స్వాధ్యాయము నధ్యయనము జేయవలె ననగా కేవల శబ్దరాశిని కంఠస్థము జేయుట యని యర్థము కాదు. అధ్యయన సంస్కృతమైన స్వాధ్యాయము (వేదము) చేతనే యర్థమును గ్రహింపవలె నను నియమమును శ్రుతి యిట విధించుచున్నది (తస్మాత్ అధ్యయన సంస్కృతేనైవ స్వాధ్యాయేన అర్థం జానీయాత్ ఇతి విధత్తే).

(సాయణః, అథర్వవేద భాష్యభూమికా)

నియమపూర్వకముగ, పితృపరంపరాప్రాప్తమైన విధముగ, వేదమును గురువు నొద్ద నధ్యయనము జేసి సంప్రదాయానుగుణముగ ధర్మ - బ్రహ్మరూపార్థముల గ్రహింపవలె నని యీ నియమతాత్పర్యము అంతియేగాని లిఖితపాఠ - భాషాంతరీకరణాద్యధ్యయనాదుల ద్వారా యర్థజ్ఞానమునకై యత్నించుట స్వాధ్యాయాధ్యయనము గాదని స్వాధ్యాయ శ్రుతి తాత్పర్యము. ఈ విషయము మీమాంసా శాస్త్రమున విపులముగ జర్చించి వివరింపబడినది. (చూ. జిజ్ఞాసాధికరణము, శాస్త్ర దీపిక, భాట్టదీపిక మొ. చూ. భామతీ. బ్ర. సూ. 1–3–34 మొ.)

అందుచే 'స్వాధ్యాయ పదము తనకు దాను వల్లించుట' యను నర్థమును మాత్రమే చెప్పుచున్న దనుట శ్రుతి విరుద్ధము. స్వాధ్యాయాధ్యయనమనగా 'శ్రవణమననాద్యభ్యాసరూప మగు నధ్యయనము' అనియు నర్థము బ్రాహ్మణముల వలన దెలియును.

"స హోవాచాహ మప్యేత న్న వేద, సదస్యేవ వయం
స్వాధ్యాయ మధీత్య హరామహే, య న్నః పరే దద
త్యేహ్యుభౌ గమిష్యావ ఇతి" — కౌషీ. ఉ. 1–1.

గార్గ్యాయణి యగు చిత్రుడను నాతడు (రాజు) యజ్ఞమును జేయగోరెను. ఆ యజ్ఞమును బ్రవర్తింప జేయుటకై ఆరుణి యను ఋత్విజుడు వచ్చెను, కాని యట చిత్రు డడిగిన బ్రహ్మతత్త్వవిషయకము లయి విగూఢము లయిన ప్రశ్నలకు బదులు చెప్పలేక యింటి కేగి యాచార్యుడగు తండ్రి నడిగెను. తండ్రి యపుడు కుమారునితో జెప్పిన వాక్యము లివి.

'నాయనా! ఇది నాకును దెలియదు. సదస్సు (సభ) నందే మనము స్వాధ్యాయాధ్యయనము జేయుదము. చిత్రునివలన నీ విషయమును దెలిసి కొందము. రమ్ము. పోదము.' — అని పై శ్రుతి వాక్యముల కర్థము.

పిదప సమిత్పాణులై యేగి వారు చిత్రుని వలన విద్యోపదేశము బొంది నట్లు గలదు. ఇచట స్వాధ్యాయాధ్యయనమనగా దనకు దాను వల్లించుకొనుట యను నర్థము పొసగదు. గురువును జేరి చేయు వేదార్థ విచారరూపమగు నధ్య యనమే యిట స్వాధ్యాయాధ్యయనము — ఆత్మతత్త్వప్రతిపాదక వేద వాక్య శ్రవణ మననాదిరూపము.

"స్వాధ్యాయ మధీత్య। ఏత దర్థప్రతిపాదకం వేదభాగం సార్థ
మధిగమ్య చిత్రాత్ గార్గ్యాయణేః హరామహే ఉధిగచ్ఛామః"

అనియే శ్రీశంకరానందులును పై శ్రుతివాక్యముల కర్థమును వివరించిరి. ఏ యర్థము (బ్రహ్మ)ను గూర్చి సందియము గలిగినదో యా యర్థమును బ్రతిపా దించెడి స్వాధ్యాయమును (వేదభాగమును) గురుముఖముననే, సభలో, నర్థజ్ఞాన పూర్వకముగ దెలిసికొందమని యర్థము. కాన స్వాధ్యాయమనగా 'శబ్దరాశిని (సంహితాభాగమును) తనకు దాను వల్లెవేసికొనుట' యను నర్థమే బ్రాహ్మణము లందు బ్రసిద్ధ మనియెడి చారిత్రికుల యర్థ కల్పనము శ్రుతివిరుద్ధము. ఇట స్వాధ్యాయ మన 'ఆత్మవిషయకమైన అధ్యాయ (వేద) మనియు నర్థస్ఫూర్తి గలుగు చున్నది.

కాన స్వాధ్యాయ మనగా ఆత్మచికిత్సకొఱకైన యధ్యయనము. దేహేంద్రియ నియామకుడు, కర్తయు, భోక్తయు నైన ఆత్మయొక్క చికిత్స మొదట వేదాధ్యయనముతో నారంభమై, వివిధ కర్మానుష్ఠానాదులయందును వ్యాప్తమై, స్వధర్మప్రతిష్ఠితుని గావించి, క్రమముగ నధికారము సిద్ధించుకొలది శ్రవణ మననాద్యభ్యాసరూపమగు నధ్యయనముద్వారా ఆత్మారామత్వము సిద్ధింపజేసి నివృత్త మగును. ఇట్లు స్వ (ఆత్మ) చికిత్స కొఱకైన యధ్యయనము (స్వార్థం అధ్యయనం) స్వాధ్యాయము.

స్వాధ్యాయాధ్యయనము వలన ధర్మ-బ్రహ్మావబోధము కలుగుటయు అభ్యుదయ నిఃశ్రేయస ప్రయోజనములు సిద్ధించుటయు శ్రీ వాచస్పతి మిశ్రునిచే నిట్లు వివరింపబడినది.

"దృష్టశ్చ స్వాధ్యాయస్యాధ్యయన సంస్కారః। తేన హి పురుషేణ స ప్రాప్యతే, ప్రాప్తశ్చ ఫలవత్కర్మ బ్రహ్మావబోధ మభ్యుదయ నిఃశ్రేయసప్రయోజన ముపజనయతి ... యదా చాధ్యయనసంస్కృతేన స్వాధ్యాయేన ఫలవత్కర్మ బ్రహ్మావబోధో భావ్యమానో ఽభ్యుదయ నిఃశ్రేయస ప్రయోజన ఇతి స్థాపితమ్, తదా యస్యాధ్యయనం తస్యైవ కర్మబ్రహ్మావబోధో ఽభ్యుదయ నిఃశ్రేయస ప్రయోజనో నాన్యస్య...." —భామతీ బ్ర. సూ. 1-3-34.

మఱియు బ్రాహ్మణములందు గల యీ స్వాధ్యాయపదము సంహితాభాగములను జదువుట, ఆవృత్తి జేయుట యను నర్థమును తెల్పు ననెడి చారిత్రికుల వివరణము సరియైనది కాదు. సంహితలే గాదు; అనుశాసన, విద్యా, వాకోవాక్య, ఇతిహాస, పురాణగాథాదిరూప మగు బ్రాహ్మణభాగముగూడ నిత్యము నధ్యయనము జేయుటయే బ్రహ్మయజ్ఞమని స్వాధ్యాయబ్రాహ్మణములు విధించుచున్నవి.

"మధ్వాహుతయో హ వా ఏతా దేవానాం యదనుశాసనాని విద్యా, వాకోవాక్య మితిహాస పురాణం గాథానారాశంస్యః।

న య ఏవం విద్వా ననుశాసనాని విద్యా వాకోవాక్య
మితిహస పురాణం గాథా నారాశంసీరితి అహరహః
స్వాధ్యాయ మధీతే। మధ్వాహుతిభి రేవ తద్దేవాం స్తర్పయతి"

—శ. బ్రా. 11-5-6-1.

'తత్ర ఋగాదిశబ్దైః మంత్రభాగ స్వాధ్యయనం ప్రతిపాదితమ్ ।
అధునా బ్రాహ్మణభాగస్యాధ్యయనం ప్రతిపాద్యతే' —సా. భా.

తైత్తిరీయశ్రుతియందు స్వాధ్యాయబ్రాహ్మణము ఋగాదిమంత్రాధ్యయనము విధించి, తర్వాత బ్రాహ్మణభాగాధ్యయనమును గూడ నిట్లు విధించినది.

'య ద్బ్రాహ్మణా నీతిహాసాన్ పురాణా నికల్పాన్
గాథా నారాశగ్ంసీ ర్మేదాహుతయో దేవానా మభవన్....
బ్రహ్మణః సాయుజ్యం ఋషయో ఽగచ్ఛన్' —తై. ఆ. 2-9-1.

కర్మబ్రహ్మబోధక మగు మంత్రబ్రాహ్మణాత్మక వేదరాశి నధ్యయనము జేయుట స్వాధ్యాయరూప బ్రహ్మయజ్ఞ మనియు, బ్రహ్మజ్ఞానసిద్ధిద్వారా బ్రహ్మయజ్ఞము ముక్తిహేతు వనియు పై బ్రాహ్మణముల వలన దెలియును.

'బ్రహ్మజ్ఞానోత్పాదన ద్వారా ముక్తిహేతుత్వం బ్రహ్మయజ్ఞస్య
యుక్తమ్.' —సా. భా.

అందుచేతనే 'యజ్ఞానాం బ్రహ్మయజ్ఞోఽహమ్' భాగ. 11-16-23)
అని పరమేశ్వరుడు తనను బ్రహ్మయజ్ఞస్వరూపునిగ గీర్తించుకొనినాడు.

స్వాధ్యాయరూప బ్రహ్మయజ్ఞ మిట్లు అత్యంత ముత్కృష్ట మైనది గను కనే యెంతటి దుర్బలుడైనను తుదకు 'అప్యేకం దేవపదం మధీయీతైవ, - దేవతాతత్త్వప్రకాశక మగు నీ స్వాధ్యాయపదము నొక్కటియైన నధ్యయనముజేయ

వలెను గాని యూరకుండరాదు' అని శతపథశ్రుతి బ్రహ్మయజ్ఞప్రకరణమున నత్యంత దుర్బలుని గూడ హెచ్చరించుచున్నది.

## స్వాధ్యాయః - తపః :-

తైత్తిరీయ శ్రుతియు పురుషార్థసాధనోపాయములను మతభేదోపన్యాస వ్యాజమున పెక్కు ప్రదర్శించి తుదకు స్వాధ్యాయ ప్రవచనములే పురుషార్థసాధనము అని ప్రవచించినది.

'ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ సత్యంచ స్వాధ్యాయ ప్రవచనేచ । తప శ్చ స్వాధ్యాయప్రవచనే చ। దమ శ్చ స్వాధ్యాయప్రవచనే చ। శమ శ్చ స్వాధ్యాయప్రవచనే చ। అగ్నయ శ్చ స్వాధ్యాయ ప్రవచనే చ। అగ్నిహోత్రం చ స్వాధ్యాయ ప్రవచనే చ। అతిథయ శ్చ స్వాధ్యాయప్రవచనే చ। మానుషం చ స్వాధ్యాయ ప్రవచనే చ। ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ। ప్రజన శ్చ స్వాధ్యాయప్రవచనే చ। ప్రజాతి శ్చ స్వాధ్యాయప్రవచనే చ। సత్య మితి సత్యవచా రాథీతరః। తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టిః। స్వాధ్యాయప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః తద్ధి తప స్తద్ధి తపః। —తై. ఉ. 1-9-1.

ఇట శ్రుతియందు ఋతము, సత్యము, తపము, దమము, శమము, అగ్నులు, (ఆధానము చేయవగినవి), అగ్నిహోత్రము, అతిథిసత్కారము, మానుషము (లౌకికవ్యవహారదక్షత), సత్సంతానము, నియమబద్ధ గార్హస్థ్యము, పుత్రోత్పత్తి - ఇందు గొన్నిటిని గాని, లేక యన్నిటిని గాని సాధించుచున్నను, లేక సాధించిననుగూడ స్వాధ్యాయప్రవచనములు, రెండును ప్రయత్నపూర్వకముగ

ననుష్ఠింపవలసిన వని తెల్పుటకే యందలి ప్రతియొకదానితో గూడ స్వాధ్యాయ ప్రవచనములు చేర్చబడినవి. స్వాధ్యాయ ప్రవచనములు యథావిధిగ జేయుచో బైన బేర్కొనిన శమ దమాదులన్నియు ననుగతములే యగుచుండును. కనుక స్వాధ్యాయప్రవచనములే పురుషార్థ సాధక మగు తపస్సుగా నిర్దేశింపబడినది. 'తపో హి స్వాధ్యాయః (తై. ఆ. 2-9)

## స్వాధ్యాయము - పరమోత్కృష్టశ్రమ :-

"యే హ వై కే చ శ్రమాః। ఇమే ద్యావాపృథివీ
అంతరేణ। స్వాధ్యాయో హైవ తేషాం పరమతా కాష్ఠా।
య ఏవం విద్వాన్ స్వాధ్యాయ మధీతే। తస్మాత్ స్వాధ్యాయో
ఽధ్యేతవ్యః।" —శ. బ్రా 11-5-7-2.

భూమ్యా కాశములమధ్య, లోకమందు, ఎన్నియేని శ్రమలు - శ్రమ సాధ్యములగు తపస్సులు - గలవు. శ్రమసాధ్యములగు నీ తపస్సులకు పరాకాష్ఠ స్వాధ్యాయరూపమగు తపస్సు. ఇట్టి దీని యుత్కృష్టత నెఱిగి యధ్యయనము జేయువాడే విద్వాంసుడు. అతడే తత్ఫలావ్యాప్తి నొందును. కాన స్వాధ్యాయము నధ్యయనము జేయవలెను - అని యర్థము.

లోకమున నేదియేని సుఖము గాని ఫలము గాని సాధించుటకై దీక్ష బూనెడివా రెంతటి శ్రమకైన వెనుదీయరు. ఫలము సిద్ధించువఱకు నిద్రింపరు. అగాధము లగు సముద్రముల జొత్తురు, ఉత్తుంగపర్వతశిఖరాగ్రముల నధిరోహింతురు అనంతాకాశపథమున దూసికొని పోదురు. ఇట్లు దీక్షగా నేదియేని పనిని నిర్వహించి కృతార్థులైనను, లేక విఫలులైనను 'దీనికై తపస్సు చేసితి' ననుట లోకసహజము. ఇవి శ్రమసాధ్యములైన తపస్సులే. ఇట్టివి సుఖదాయకములు గను, కీర్తిదాయకములుగను గన్పట్టుచు మఱల మరల నుద్యమింప జేయుచుండును. ఇట్టి శ్రమలు నిరవధికముగ సాగుచునే యుండును. కాని యవి సుఖదుఃఖమిశ్రితములు; అభిలషితమైన సుఖముతోపాటు ఆనభిలషణీయ మైన దుఃఖమును గూడ

దెచ్చిపెట్టుచు, మనస్సును వ్యామోహపఱచి, సంసారబంధమున జిక్కుపడజేయుచు, ఆత్మకు సుఖశాంతుల నీయజాలవు.

ఆత్మకు యథార్థసుఖశాంతుల నీయగల విద్యయే విద్య. అట్టి విద్యలలో నత్యంత ముత్కృష్టమైనది. తపోరూపమైన స్వాధ్యాయము. ఆత్మచికిత్సాకరమగుచు, ప్రవృత్తినివృత్తిరూప ధర్మదీక్షితుల నొనర్చి సుఖశాంతుల గూర్చుటయే స్వాధ్యాయతపస్సు యొక్క యుత్కృష్టత.

"హుతేన శామ్యతే పాపం స్వాధ్యాయైః శాంతి రుత్తమా"

అని యనుచు మహాభారతము (12-191-2) గూడ నుత్తమ శాంతియే స్వాధ్యాయఫల మని చెప్పుచున్నది. పరమాత్మదర్శనమే స్వాధ్యాయము యొక్క పరమప్రయోజన మని విష్ణుపురాణముగూడ నిట్లు చెప్పుచున్నది.

"స్వాధ్యాయసంయమాభ్యాం, స దృశ్యతే పురుషోత్తమః ।
తత్ప్రాప్తికారణం బ్రహ్మ తదేత దితి పఠ్యతే॥
స్వాధ్యాయా ద్యోగ మాసీత యోగాత్స్వాధ్యాయ మావసేత్,
స్వాధ్యాయయోగ సంపత్త్యా పరమాత్మా ప్రకాశతే॥
తదీక్షణాయ స్వాధ్యాయ శ్చక్షు ర్యోగ స్తథా పరమ్।
న మాంసచక్షుషా ద్రష్టుం బ్రహ్మభూత స్స శక్యతే॥"

—విష్ణు. పు. 6-6-1, 2- 3.

స్వాధ్యాయము, యోగము - ఈ రెండిటివలననే పరమాత్మ దర్శింపబడును. పరమాత్మయే పురుషోత్తముడు - బ్రహ్మ. బ్రహ్మప్రాప్తిసాధనములగుటచే నీ స్వాధ్యాయ - యోగములకును 'బ్రహ్మ' యని ప్రసిద్ధి. స్వాధ్యాయము వలన యోగమును, యోగము వలన స్వాధ్యాయమును ఉపాసింపవలెను. ఈ స్వాధ్యాయ - యోగసంపత్తి చేతనే పరమాత్మ ప్రకాశించును (దర్శింపశక్యమగును), అతీంద్రియుడు, సర్వకారణకారణుడునగు పరమాత్మను మాంసచక్షుస్సుతో (స్థూలదృష్టితో) దర్శింప శక్యముకాదు. ఆ బ్రహ్మను దర్శించుటకు యోగ్యములైన నేత్రములు స్వాధ్యాయ యోగములు అని యర్థము.

ఇట యోగసంపన్నమగు స్వాధ్యాయమునకు పరబ్రహ్మ సాక్షాత్కారమే పరమప్రయోజనము; బ్రహ్మప్రాప్తిసాధన మగుటచే నిట్టి స్వాధ్యాయమునకు బ్రహ్మ యని ప్రసిద్ధి - యని చెప్పబడుచున్నది కాన నాత్మచికిత్సక మగుచు, నాత్మను దర్శింపజేయుటయే స్వాధ్యాయముయొక్క స్వాధ్యాయత్వ మని తాత్పర్యము. యాజ్ఞవల్క్యస్మృతియు నీ విషయము నిట్లు చెప్పుచున్నది.

"ఇజ్యాచార దమా ఒహింసా దాన స్వాధ్యాయ కర్మణామ్॥
అయం తు పరమో ధర్మో యద్యోగేనాత్మదర్శనమ్॥ —1-8.

"ఇజ్యాదీనాం కర్మణా మయ మేవ పరమో ధర్మః య ద్యోగేన
బాహ్య చిత్తవృత్తినిరోధేనాత్మనో దర్శనం యథాతథ్య జ్ఞానమ్"

—విజ్ఞానేశ్వరీయమ్.

బాహ్యచిత్తవృత్తి నిరోధమునకు యోగ మని పేరు. ఇట్టి యోగముచే నాత్మను దర్శింపజేయుటయే యాగ - ఆచార - దమ - అహింసా - దాన స్వాధ్యాయకర్మలకు పరమధర్మము (పరమప్రయోజనము)-అని యర్థము. యోగసంపన్నమగు స్వాధ్యాయ మాత్మదర్శనసాధన మగు ననెడి పూర్వోక్తార్థమే యిట వివరింపబడుట స్పష్టము.

వేదములు మానవరచితములే యయి, వానికి లౌకికదృశ్యములను మఱియు నాఁటి సాంఘిక సంఘటనలను వర్ణించుటయందే పరమతాత్పర్య మగుచో నివియు నితర గ్రంథముల వలెనే చూడబడెడివి. వానిని యావజ్జీవము ప్రతిదినము బ్రహ్మయజ్ఞరూపమున నధ్యయనము జేయవలసిన యావశ్యకతగాని యజ్ఞాదికర్మలయందు నిరంతరము వినియోగింపవలసిన యావశ్యకతగాని యుండెడిది గాదు. ఒక తపస్సుగ నధ్యయనము జేయవలసిన యావశ్యకత, నియమము, సంప్రదాయము స్వాధ్యాయమునకు గలవు. 'తద్ధి తప స్తద్ధి తపః'-అనుచు శ్రుతియే స్వయముగ స్వాధ్యాయమును ముఖ్యతపస్సుగ వేయినోళ్లతో కీర్తించినది.

స్వాధ్యాయ మట్టిది. అట్టి ముఖ్యతపోరూప స్వాధ్యాయమే తపః స్వాధ్యాయము. లేక స్వాధ్యాయ తపము కావుననే మహర్షులు తపః స్వాధ్యాయ నిరతులుగ పురాణేతిహాసాదులయందు దఱచుగ గీర్తింపబడిరి.

'యజ్ఞైస్తు దేవాన్ ప్రీణాతి స్వాధ్యాయతపసా మునీన్"

—భార. 1-120-19.

"ఛందాం స్యధీత్య ధర్మేణ తపఃస్వాధ్యాయ సంయుతః"

—భాగ. 12-8-7.

నారదు డట్టి తపఃస్వాధ్యాయ నిరతుడు. తపఃస్వాధ్యాయ నిరతత్వమును ప్రబోధించుటకో యనునట్లు 'తపఃస్వాధ్యాయనిరత' పదముతో శ్రీమద్రామాయణ మహాకావ్యారంభము మహర్షిచే గావింపబడినది.

స్వాహా, స్వధా, వషట్ శబ్దములు గూడ స్వాధ్యాయ తాత్పర్యమును వివరించు వేదనామములు. ఇక నా శబ్దముల జూతము.

# స్వాహా

అసంసేవ్యాం దాసై రనధిగమనీయాం బహుధనై।
అనాస్వాద్యాం రాగై రనుపసరణీయాం శతమఖైః।
అగంతవ్యాం తర్కై రనుదితవిపక్షాం యుగశతైః
స్వధాం స్వాహాం దేవీం హరిహృదయలక్ష్మీం హృది భజే॥

ప్రజాపతే ర్యైవ భువనస్య భర్తుః
స్వకీయవాగాహ సరస్వతీ యా।
స్వాహేతి నామ్నా శ్రుతిషు ప్రసిద్ధా
హరిప్రియా రక్షతు వేదమాతా॥ —వేదమాతృస్తవః.

## స్వాహాశబ్దము వేదవాచకమగునా :-

స్వాధ్యాయ పదమువలెనే స్వాహాపదము కూడ వేదవాచక మని చెప్ప బడినది. కాని స్వాహాశబ్దము వేదవాచక మగునా ? ఈ శబ్దము సామాన్యముగ హోమార్థము అయిన మంత్రముల తుదిని వినవచ్చుచుండును. అందుచే నిది హోమసూచకమైన సాంకేతికపదముగ గ్రహింపబడుచుండును

"స్వాహాకారో హోమార్థ మంత్రాంత జ్ఞాపనార్థః"

శం. భా; తై. ఉ. 1-4.

ఈ పదమునకు స్వాహాదేవి యనియు, హవిః ప్రదాన యనియు, హవి ప్రదాన మనియు రెండర్థములు కోశముల వలన దెలియును.

"అథాగ్నాయీ, స్వాహా చ హుతభుక్ప్రియా" —అమరకోశము.

"స్వాహాగ్నాయీ ప్రియాఽస్య చ" —అభిధానచింతామణి.

"స్వాహాగ్నాయీ చ తత్ప్రియా" —వైజయంతి.

"స్వాహా దేవహవిర్దానే శ్రౌషట్ వషట్ వషట్ స్వధా"

—అమరకోశము.

"శ్రౌషట్ వషట్ వషట్ స్వాహా స్వధా దేవహవిర్హుతౌ"

—అభిధానచింతామణి.

స్వాహాశబ్దమువలెనే స్వధాశబ్దముగూడ హోమసూచకమయిన సాంకేతిక పదముగ గ్రహింపబడుచుండును. దేవతల నుద్దేశించి 'స్వాహా' యనియు హవిస్సు లీయబడుచుండును. కాని వైదిక నిఘంటువునందు మాధవీయ ఋగ్వేదక్రమణిక యందును స్వాహాపదము వాఙ్నామములలో బఠింపబడియున్నది. 'వాక్' పదము కొన్నియెడల వాగింద్రియారి రూపమున గన్పట్టినను, వేదములందు సామాన్యముగ వేదవాక్కు, వేదమంత్రము, లేక వాగ్దేవత - యను నర్థము లందు ప్రసిద్ధము. ఎట్లయినను హోమసూచకమై సాంకేతిక ప్రసిద్ధమయిన స్వాహాశబ్దము వాఙ్నామము లలో బఠింపబడుట యెట్లు ? అనగా నిది వేదవాచకమగుట యెట్లు ? వేద వాచక మగుచో నే యర్థమును బోధించును ?

వైదికనిఘంటువున వాక్కునకు శ్లోకాది బేకురాన్త నామములు ఏబది యేడు గలవు. మాధవీయ ఋగ్వేదానుక్రమణిక యందు స్తుతి నామములు ఎనుబది

గలవు. ఇన్ని నామము లున్నను, నిత్య నైమిత్తిక కర్మలు, యాగాది క్రియలు నన్నియు స్వాహాకార పూర్వక మగు నాచమనక్రియతో నారంభ మగుచున్నవి. స్వాహా స్వధాకార వివర్జితము లయిన హోమములు సామాన్యముగ నుండవు. కాన మిగిలిన నామములకంటె స్వాహా స్వధా శబ్దములం దొకవైలక్షణ్య మున్న టుల గన్పట్టును. అది యేది ?

## స్వాహా, స్వధా – వైశిష్ట్యము :-

స్వాహా, స్వధా యను నీ రెండును మహిమాన్వితము లయిన మంత్రములని దేవీభాగవత మిట్లు పేర్కొనుచున్నది.

"స్వాహా స్వధా నామ మనుప్రభావై
తృప్యన్తి దేవాః పితర స్తథైవ ।
యజ్ఞేషు సర్వేషు ముదా హరన్తి
యన్నామయుగ్మం శ్రుతిభి ర్మునీంద్రాః॥" —దేవీ. భా. 3-24-25.

అన్నిర్మలయంమను వేదమంత్రములకు జివర స్వాహా స్వధా యను నీ మంత్రద్వయమును జేర్చి హవిర్దానము జేసినపుడే యా మంత్రద్వయ ప్రభావముచే దేవతలును పితరులును దృప్తి నొందెదరు - అని యర్థము కాని మంత్రములకు జివర స్వాహా స్వధా పదముల జేర్చు టెందుకు ? అను ప్రశ్నకు సమాధానముగా దేవతల జీవనము స్వాహాశక్త్యధీనమనియు దేవీభాగవత మిట్లు చెప్పుచున్నది.

యజ్ఞేషు దేవి యది నామ న తే వదన్తి
స్వాహేతి వేదవిదుషో హవనే కృతేఽపి ।
న ప్రాప్నువంతి సతతం మఖభాగధేయం
దేవా స్త్వమేవ విబుధేష్వపి వృత్తిదాఽసి॥" —1-7-35.

ఓ దేవీ! స్వాహా యను నీ నామము నుచ్చరించక, వేదవిదులు యజ్ఞము లందు హోమ మొనర్చినను, దేవత లా యజ్ఞభాగముల నొందలేరు. కాన నీవే స్వాహా యను నామముద్వారా దేవతలకు జీవనదాత్రి (వృత్తిదా) వగుచున్నావు-అని యర్థము. కాన 'స్వాహా' స్వధా యను నీ రెండును దేవతాప్రీతికరములు, దేవతా జీవనహేతువులు నగు మహిమాన్వితములగు మంత్రము లగుట సంప్రదాయ మని పెక్కు పురాణముల వలన దెలియుచున్నది.[1] ఈ సంప్రదాయము శ్రుతిసిద్ధమైన దగుట యీ క్రింది ఋక్కు వలన దెలియనగును.

'స్వాహా స్తోమస్య వర్ధనా' —ఋ. 8-8-5.

'హే అశ్వినౌ, స్వాహా స్వాహాకృతౌ, స్వాహాకారేణ సమ్య గిష్టౌ సన్తౌ, యద్వా స్వాహేతి వాఙ్నామ, స్తుతిరూపయా వాచా స్తుతౌ, వాచా స్తోమస్య స్తోతుః ప్రవర్ధకౌ" —సా. భా.

అశ్వినులు స్వాహాకారముచే బాగుగ నర్చింపబడినవారై, లేక స్తుతిరూప మగు వేదవాక్కుచే స్తుతింపబడినవారై, యీ వాక్కుతో స్తోత్రము జేసెడి స్తోతను వర్ధిల్లజేయునట్టివారు – అని యర్థము.

ఇచట స్వాహా పదమునకు (1) స్వాహాకారపూర్వక మయిన హవిర్దానము (2) స్తుతిలక్షణమగు వేదవాక్కు - అను రెండర్థములు జెప్పినను 'స్వాహా' పదోచ్చారణముచే దేవతలు ప్రీతినొందుటయు, అట్లు ప్రీతినొందిన దేవతలు స్తోత్రము చేయు స్తోతను వర్ధిల్లజేయుటయు జెప్పబడినవి. ఇట్టి స్తోతను వర్ధిల్ల

1. త్వన్నామోచ్చార్య మంత్రాంతే యో దాస్యతి హవి ర్నరః।
సురేభ్యః తత్ప్రాప్నువంతి సులాః స్వానందపూర్వకమ్ ॥ —బ్ర. వై. పు.

జేయుట యనగా స్తోతయొక్క వేదమంత్రరూపమైన వాక్కులో నొకవిధమగు నతిశయమును (ప్రభావమును) చేకూర్చి యుద్ధరించుట యని భావము. కాన పైన దేవీభాగవతవచనములు నిట్టి శ్రుత్యర్థము ననువదించుచున్న వనుట స్పష్టము.

## స్వాహాంతి :-

ఇక శ్రుతియందు స్వాహా శబ్దమునకు గల సంప్రదాయానుగతము లయిన యర్థముల జాతము. కేశవాయ స్వాహా; ప్రాణాయ స్వాహా;ఇంద్రాయ స్వాహా;సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా ఇత్యాది స్థలముల యందు స్వాహా పదమునకు సామాన్యముగ "స్వాహూతమస్తు, సుహూతమస్తు" అనగా తత్తద్దేవతో ద్దిష్టమైన హవిస్సు సుహూత మగుగాక, లేక స్వాహూతి యగుగాక-యను నర్థము తలచుగ గన్పట్టుచుండును. ఇచట సుహూత మగుట యనసేమి? అగ్ని యందు ప్రక్షిప్త మగు అజ్యాదిద్రవ్యము స్వయముగనే దగ్ధమగును. ఆప్లేలోనిన గ్రహించెడి జలాదికము గూడ స్వయముగనే జీర్ణ మగును. ఇట్లు అగ్నియందు సమర్పింపబడు ద్రవ్యము ప్రత్యక్షముగ దగ్ధమై, లేక జీర్ణమై, రూపఱుచుండనిక దేవతలకును, పితరులకును జెందునదేమి? స్వాహాకారముతో ప్రయోజనమేమి యనశంకలు సామాన్యముగ గలుగవచ్చును. కనుక శ్రుత్యుద్దిష్టమై స్వాహూతి స్వరూపమును దర్శించి సాహాశబ్దార్థమును దర్శింపవలసి యున్నాము.

వేదము సనాతనమైన శాస్త్రము ; శాస్త్రము అజ్ఞాతజ్ఞాపకము (వేదయతి) అనగా లోకసిద్ధము లయిన యర్థములను మరల యనువదించి చెప్పుటకు బ్రవృత్తమైనది కాదు అట్లు చెప్పుచో దానికి శాస్త్రత్వమేయుపపన్నము గాదు. అందుచే లోకసిద్ధములుగాని యతీంద్రియము లయిన యర్థముల దర్శింపజేయుటకు బ్రవృత్తమైనది-యని పూర్వము వివరింపబడినది. కావ స్వాహూతి యనగా వస్తువుల నగ్నియందు జక్కగ దగ్ధము జేయుట, లేక జీర్ణ మొందించుట మాత్రమే

శ్రుతితాత్పర్యమని గ్రహింపరాదు. యజ్ఞాదిక్రియలు, వానికి సంబంధించిన పరికరములు, అగ్నియందా యా ద్రవ్యముల నర్పించుట-మున్నగునవన్నియు ప్రత్యక్షగోచరములయి లౌకికములుగ గన్పట్టవచ్చును. ఇందు ఆరాధింపబడెడి యగ్నివాయ్వాదులును గూడ భౌతికములుగా (జడపదార్థములుగ) గన్పట్టవచ్చును. కాని వైదికదృష్టి వేఱు.

"అస్త్యుత్తరస్యాం దిశిదేవతాత్మాహిమాలయో నామ నగాధిరాజః"

ఇది కుమారసంభవ మహాకావ్యము నందలి హిమవంతుని వర్ణనము ఇట కాళిదాసమహాకవి 'దేవతాత్మా—నగాధిరాజః' అను రెండుపదముల ద్వారా హిమవంతునకు దేవతాశరీరము, భౌతికశరీరము రెండును గలవని దేవతావిషయకమైన వైదికసంప్రదాయమును వివరించినాడు అట్లే అగ్నిమీదే-ఇత్యాది మంత్రముల సూక్ష్మముగ బరిశీలించుచో అగ్ని వాయ్వాదులకును దేవతాశరీరములు, భౌతికశరీరములు - రెండు నుండుట శ్రుతిసమ్మతమైన సంప్రదాయముగ దెలియును కానిదేవతాస్వరూప మతీంద్రియ మగుటచే కర్మానుష్ఠానసమయమున నా యా దివ్యరూపముల నారాధించుట కా యా దేవతల భౌతికరూపముల నాలంబనముగ గ్రహించుటయుక్తిసహము, శ్రుతిసమ్మతము గూడ. ఇంతే కాదు.

## ఆహుతులు, అగ్ని - యజమాన - దేవయోనితము :-

'అగ్నిర్వై దేవయోనిః సోఽగ్నే ర్దేవయోన్యా ఆహుతిభ్య
స్సంభవతి-ఇతి" —ఐ.బ్రా.4—5—22.

అగ్నేః దేవయోనిత్వే ప్రసిద్ధ్యర్థో వై శబ్దః ।అగ్నేః
కర్మణి....దేవరూపేణ జాయమానత్వాత్ సా ప్రసిద్ధి
ర్ద్రష్టవ్యా। సైవప్రసిద్ధిః సోఽగ్నేరిత్యాదినా స్పష్టీక్రియతే।

స యజమానో దేవాయోనిరూపా దగ్నే రనుష్ఠితాభ్య
అహుతిభ్య శ్చ దేవతారూపః సంభవత్యుత్పద్యతే." —సా. భా.

ఈ మంత్రమువలన (1) కర్మానుష్ఠానసమయమున అగ్ని సర్వ దేవతాత్మకుడై, దేవరూపుడై యావిర్భవించుటచే అగ్నికి 'దేవయోని' యను సార్థక నామము సిద్ధించుటయు, (2) దేవయోని యయిన యా యగ్నివలనను, ఆ యా దేవతల నుద్దేశించిన యాహుతుల వలనను యజమానుడు దేవతా రూపుడు (దివ్య శక్తిసంపన్నుడు) అగుటయు దెలియనగును. ఇంతే కాదు.

"ఋఙ్మయో యజుర్మయః సామమయో వేదమయో
బ్రహ్మమయోఽమృతమయః సంభూయ దేవతా
అప్యేతి య ఏవం వేద య శ్చైవం విద్వా నేతేన
యజ్ఞ క్రతునా యజతే" ఐ. బ్రా. 4-5-22.

పై 'అగ్ని ర్వై దేవయోనిః' అనెడి శ్రుతి ననుసరించి యగ్ని యొక్క దేవతాత్మకత్వమును, అట్లే యజమానునకు గల్గెడి దివ్యత్వమును నెవరు తెలిసికొనగల్గుదురో, తెలిసికొని యనుష్ఠింతురో యట్టివారికి సర్వవేదమయత్వము సర్వదేవమయత్వము, క్రమముగ నమృతత్వము సిద్ధించునని యీ శ్రుతి తెలియ జేయుచున్నది (వేదయతి). మఱియు కర్మానుష్ఠానసమయమున నగ్నియొక్క దేవయోనిత్వము, యజమానునకును సిద్ధించెడి దివ్యత్వమును దెలిసికొనుట యత్యం తావశ్యకము (య ఏవం వేద) అనియు నిట శ్రుతి హెచ్చరించుచున్నది. ఇట్టి ఇట్టి దేవతాత్మవిజ్ఞానముచే సుసంస్కృతుడయిన యజమానునకు స్వాహాకారమొన ర్చుచు మంత్రపూర్వకముగను, దేవతాహ్వాన పురఃసరముగను అగ్ని (ప్రాణాగ్ని మొ॥) యందు సమర్పించునదియే ఆహుతి, లేక హవిస్సు, లేక హవ్యము అగు చున్నది. ఇట్టి యాహుతులవలన యజమానునకు దివ్యత్వము సిద్ధించునని శ్రుతి

తాత్పర్యము. ఈ 'ఆహూతి' యొక్క స్వరూపమును శ్రుతి యిట్లు వివరించు చున్నది.

## ఆహూతి - ఆహితి: దేవతల పరోక్ష ప్రియత్వము : భోక్తృ భోగ్య స్వరూపము :-

"ద్వయం వా ఇదమ్ - అత్తా చైవాద్యం చ తద్ యదోభయో సమాగచ్ఛతీ- అత్తైవాఖ్యాయతే । నాద్యమ్ స వై యః సోఽత్తా- అగ్ని రేవ సః। తస్మిన్ యత్ కించ అభ్యాదధాతి- అహితయ ఏ వాస్య తాః అహితయో హ వై తా ఆహూతయ ఇత్యాచక్షతే పరోక్షమ్। పరోక్షకామా హి దేవాః"

—శ. బ్రా 10-6-2-2.

'అత్తా - అద్యము, అనగా భోక్త - భోగ్యము' అని ద్వయాత్మకమగు భోక్తృ భోగ్య రూప మగు నీ జగత్తు ఏకీభూత మగునపుడు రెంటిని గలిపి 'అత్తా' యనియే, అనగా భోక్త యనియే వ్యవహారము. భోగ్యము అను వ్యవహారము లేదు. ఆ భోక్త ఎవరు ? అగ్నియే అగ్ని యనగా అధియజ్ఞముగ ఆజ్యాదిహవిస్సుల గ్రహించెడి యగ్ని, అధిదైవికముగ నాదిత్యుడు, ఆధ్యాత్మికముగ ప్రాణము (ప్రాణాగ్ని) అట్టి యగ్నియందు సంతతముగ నుంచబడెడి ఆజ్యసోమ అన్నాదిహవిస్సులకు 'అహితయః' అని పేరు. అగ్నియందా ధానము చేయబడునవి (ఆధానా దాహితయః - సా. భా) యని యర్థము. ఇట్లివి వాస్తవముగ 'అహితయః' అని చెప్పబడవలసియున్నను, పరోక్షముగ 'ఆహూతయః (ఆహూతులు)' అని చెప్పబడుచుండును. అట్లేల చెప్పబడవలెను ? దేవతలు పరోక్ష ప్రియులు. అందుచే నట్లే చెప్పబడవలెను- అని శ్రుతితాత్పర్యము.

ఇట ఆహూతులయందు పరోక్షముగ, అనగా నిగూఢముగ, నున్న 'ఆహి తత్త్వము'ను శ్రుతి దర్శింపజేయుచున్నది ఆట్లే యజ్ఞాది కర్మనామముల యందును అగ్ని - ఇంద్రాది దేవతనామముల యందును పరోక్షముగ నిగూఢమై యుండెడి యర్థముల బరిశీలించి దర్శింపవలె నని తెలియజేయుటకే శ్రుతి యడుగడుగున 'పరోక్షప్రియా ఇవ హి దేవాః' 'దేవతలు పరోక్షప్రియులు' అని హెచ్చరించు చున్నది. ఇట భోక్త యని చెప్పబడిన అగ్ని యెవరు ?

## అగ్నిః - అగ్రిః :-

"స యదస్య సర్వస్యాగ్ర మసృజ్యత తస్మా దగ్రి ర్హ వై
త మగ్ని రిత్యాచక్షతే పరోక్షమ్ ।"

—శ. బ్రా. 6-1-1-11; చూ. శ. బ్రా. 2, 2, 4, 2.

అగ్నికి 'అగ్రిః' అనునది ప్రత్యక్షనామము. సర్వమునకు అగ్రమున (పూర్వమున) సృజింపబడినవాడు-అని యర్థము. 'అగ్నిః' అనునది పరోక్షనామము. ఆట్లే ఇంద్రశబ్దమును బరిశీలింతము.

## ఇంద్రః - ఇంధః - భోక్తృ భోగ్య స్వరూపము:-

"ఇంధో హ వై నామైష యోఽయం దక్షిణేఽక్షన్ పురుష స్తం
వాఽఎత మింధగ్ం సంత మింద్ర ఇత్యాచక్షతే పరోఽక్షే
ణైన పరోక్షప్రియా ఇవ హి దేవాః ప్రత్యక్షద్వేషః।
ఆథైత ద్వామేఽక్షణిపురుషరూప మేషాఽస్య పత్నీ విరాట్

తయో రేష సగ్ంస్తావో య ఏషోఽ న్తర్హృదయ ఆకాశో
ఽథైనయో రేతదన్నం య ఏషోఽ న్తర్హృదయే లోహిత
పిండః" — బృ. ఉ. 4-2-2, 3.

ఆదిత్యమండలాంతర్గత పురుషుడే ఆధ్యాత్మికముగ దక్షిణనేత్రమున విశేషముగ నభివ్యక్తమగుచుండును. దక్షిణాక్షిగత పురుషజ్యోతికి ఇంధః అని పేరు. దీప్తిగుణాతిశయముచే నీ జ్యోతి కిది ప్రత్యక్షనామము. ఈ ఇంధుని పరోక్షముగ ఇంద్రుడని వ్యవహరింతురు. వామనేత్రమునగల పురుషార్ధప్రకాశము నకు 'ఇంద్రాణి' యని పేరు. ఈ ఇంద్రాణియే విరాడ్రూపమునను, భోగ్య- అన్న రూపమునను నొప్పును. భోక్తయగు నింద్రుడును, భోగ్యరూపయగు నింద్రాణియు హృదయపుండరీకాంతర్గతాకాశమున పరస్పరతాదాత్మ్యభావనతో మిథునీభావము జెంది వినోదించుచుందురు ఈ మిథునము జాగరితమున వైశ్వానరనామమునను, స్వప్న మున తైజసనామమునను బరగుచు జాగరస్వప్నావస్థలయందు పుత్ర, మిత్ర, బంధు దర్శనాది రూప క్రీడల సలిపి సలిపి యలసి విశ్రాంతి జెందును. ఇట్టి విశ్రాంతికి సుషుప్తి యని పేరు. ఈ స్థితియందీ మిథునము 'ప్రాజ్ఞ' నామమున బరగుచు, స్వస్వరూపానందమున బ్రతిష్ఠితమై యుండి తిరిగి హృదయదేశమునుండి యూర్ధ్వముగ బ్రసృతమగు 'సంచరణీ' నాడీ మార్గమున జాగ్రదవస్థ నొందు చుండును. (మా. శం. భా.)

పై శ్రుత్యర్థమునే శ్రీ శంకరభగవత్పాదు లిట్లు శతశ్లోకియందును వివ రించిరి.

"ఇంద్రేంద్రాణ్యోః ప్రకామం సురతసుఖజుషోః స్యా ద్రతాంతః
సుషుప్తిః, తస్యామానందసాంద్రం పద మతిగహనం య త్స
ఆనందకోశః। తస్మి న్నో వేద కించి న్నిరతిశయ సుఖాభ్యంతరే

లీయమానో, దుఃఖీ స్యా ద్బోధితః న న్నితి కుశలమతి
ర్బోధయే న్నైవ సుప్తమ్ ॥ — శతశ్లోకీ. 65.

ఇట్లు శ్రుతి యగ్నీంద్రాదులయొక్క ప్రత్యక్ష పరోక్ష నామముల నుప దేశించి యా యా దేవతాతత్త్వమును దెలియజేయుటయే గాక, యతీంద్రియమగు 'భోక్తృ-భోగ్య' స్వరూపమునుగూడ వివరించుచున్నది.

స్థూలశరీరాతిరిక్తుడగు జీవుడు భోక్త. అతని యుపభోగమున కయిన వస్తుజాతమంతయు భోగ్యము. జగత్తు ఇట్టి భోక్తృ — భోగ్యాత్మకమని పూర్వ మంత్రమున జెప్పఁబడినది భోగ్యపదార్థము భోక్తచే గ్రహింపబడి, భోక్తతో నేకీభూత మగునపుడు అది భోక్తరూపముననే వ్యవహరింపబడుచుండును. కావుననే భోక్తృభోగ్యాత్మకమగు శరీరముతో తాదాత్మ్యముచెంది జీవుడు 'అహమ్' అని (భోక్తృరూపముననే) వ్యవహరించును. అనగా ప్రాణాగ్నియందు ఆహితమై, ఆహుతిరూపమై, భోగ్యవస్తుజాత మంతయు ప్రాణాత్మకుడును, భోక్తయు నగు జీవుని రూపముననే వ్యవహరింపబడుచున్నది. ఇట్టి జీవుడు జాగ్రద్దశయందు వైశ్వానరుడు, స్వప్నమున తైజసుడు, సుషుప్తియందు ప్రాజ్ఞుడు - అను రూపముల బరగి విలసిల్లుచుండునని శ్రుతి చెప్పుచున్నది. ఇంతియే కాదు. భోక్తయై ప్రసిద్ధుడైన జీవుడు 'ఇంద్ర—ఇంద్రాణీ దేవతామిథునరూపుడు' అనియు శ్రుతి చెప్పుచున్నది. అందును మఱల ఇంద్రుడు భోక్త; ఇంద్రాణి భోగ్యవిరాడన్నరూపిణి. ఈ దేవతామిథునీభావమే జగద్యాత్రకు మూలము భోక్తృభోగ్యరూపమగు ఈ దేవతామిథునమే భోక్తయగు జీవరూపమున బ్రసిద్ధమగుచున్నది.

## ప్రాణము స్వప్న స్వరూపము :-

శతపథబ్రాహ్మణము మఱియొకచోటగూడ (10-5-2-9) నిట్లే ఇంద్రేంద్రాణీ దేవతామిథునస్వరూపము వివరించినది పిదప నా యక్షి పురుషుని ముఖ్య ప్రాణస్వరూపునిగ జెప్పి స్వప్నస్వరూపునిగగూడ నిట్లు వివరించినది.

"ఏష ఉ ఏవ ప్రాణః, ఏష హీమాః సర్వాః ప్రజాః
ప్రణయతి । తస్యైతే ప్రాణాః స్వాః । స యదా స్వపితి —
అథైన మేతే ప్రాణాః స్వాః అపియన్తి । తస్మాత్
స్వాప్యయః । స్వాప్యయో హ వైతం స్వప్న ఇత్యాచక్షతే—
పరోక్షమ్ । పరోఽక్షకామా హి దేవాః" — శ. బ్రా. 10-5-'-14.

ఈ యక్షిపురుషుడే (సూర్యమండలాంతర్గత పురుషుడే) ప్రాణము. ఇతడు సర్వప్రజలను ప్రణయనము జేయును. అనగా లోకాంతరము నొందించును. కాన 'ప్రాణ' శబ్దవాచ్యుడు. (ప్రణయతి, లోకాంతరం ప్రాపయతీతి ప్రాణః - సా. భా) ప్రాణరూపుడగు అక్షిపురుషునకు ప్రాణాపానాదులును, ఇంద్రియములును స్వకీయములు ('స్వాః'). ఆ యక్షి పురుషుడెపుడు నిదురించునో యపుడీ యింద్రియాదిప్రాణములును ఆ పురుషునే పొందును (అపియన్తి). ఇట్లు 'స్వకీయుల అవ్యయము (లయము)' గలవాడగుటచే నా పురుషునకు 'స్వాప్యయః' అని పేరు. ఇది యా పురుషునకు ప్రత్యక్షనామము కాని దేవతలు పరోక్షప్రియులు. అందుచే 'స్వప్న' మనునది పరోక్షనామ మైనది. అని శ్రుత్యర్థము.

ఇట్లు దేవతాతత్త్వమును దెలిపెడి ప్రత్యక్ష పరోక్ష నామములు పెక్కులు గలవు. వానిని దెలిసి, దేవతాతత్త్వమును, భోక్తృభోగ్య స్వరూపమును, ఆహుతి స్వరూపమును, యజ్ఞాది క్రియా సమగ్ర స్వరూపమును గమనింపవలసి యున్నది. 'అగ్నియందు ఆహితమైనది, అనగా ఆధానము జేయబడిన హవిస్సు- ఆహితి; దీని పరోక్షనామము ఆహుతి' - యని శ్రుతి తెల్పుచున్నది. అధియజ్ఞముగను, అధిదైవికముగను, అధ్యాత్మికముగను, హవిర్భోక్తయగు 'అగ్ని' యొక్క స్వరూపము నిట్లు శ్రుత్యనుగుణముగ దెలిసిననేగాని 'ఆహుతి' యొక్క ఆహితిత్వము స్పష్టము గాదు. అట్టి యగ్నియందు సమంత్రకముగ నాధానము చేయబడు హవిస్సు 'ఆహుతి' యని యింతవరకు దెలిసినది. శ్రుతి యింకను ఆహుతి స్వరూపము నిట్లు వివరించుచున్నది.

## ఆహుతి దేవతాహ్వానరూపము :-

"ఆహూతయో వై నామైతా యదాహుతయ ఏతాభి ర్వై దేవాన్
యజమానో హ్వయతి తదాహుతీనా మాహూతిత్వమ్ ।"

— ఐ. బ్రా. 1-2-2.

'ఆహుతులు' అని యేవి చెప్పబడుచున్నవో యవి ఆహూతులు. యజమానుడు వీనిచే దేవతల నాహ్వానించును. కాన నీ యాహూతులకు ఆహూతిత్వ ముపపన్న మగుచున్నది. అందుచే ఆహూతులన దేవతాహ్వానరూపములు (హ్వయ త్యాభి రితి తద్వ్యుత్పత్తిః । జుహోతి ధాతో రుత్పన్నః శబ్దః పూర్వం ప్రసిద్ధః । అయం తు హ్వయతి ధాతో రుత్పన్న ఇతి విశేషః — సా. భా.)

ఆహుతి యనగా దేవత నుద్దేశించి హోమము జేయబడునది యను నర్థము మాత్రమే గాక, 'దేవతాహ్వానరూపము'— అను విశేషార్థ మిట ప్రదర్శింపబడినది. అందుచే భాష్యకర్తలు ఆహుతి శబ్దమునకు రెండర్థములను గ్రహించిరి. ఇంతే గాదు. ఆహుతి యాహ్వాన రూపమగుటను శతపథశ్రుతి యింకొక విధముగ గూడ నిట్లు వివరించుచున్నది.

## ఆహుతి యజమానాహ్వానరూపము :-

"అథ యా మేతా మాహుతిం జుహోతి । ఏషా హ వా
అస్యాహుతి రముష్మిన్ లోక ఆత్మా భవతి । స యదైవంవి
దస్మా ల్లోకాత్ ప్రైతి । అథైన మేషాఽఽహుతిరేతస్య

వృష్ఠే సత్యాహ్వాయతి । ఏహి, అయం వై త ఆహోత్మాఽ
స్మీతి । తద్యదాహ్వాయతి । తస్మా దాహుతి ర్నామ ।"

— శ. బ్రా. 11-2-2-6.

యజ్ఞములయందు స్వాహాకారపూర్వకముగగాని, వషట్కారపూర్వకముగ గాని యొసగబడెడి యాహుతి స్వర్గలోకమున హవిర్దాతయగు యజమానుని యాత్మయై, అనగా శరీరమై, యొప్పును. ఆహుతిస్వరూపము విట్లు తెలిసికొనిన యజమానుడు స్వర్గమున కేగినపు డాతని వెనుక నిలిచి యీ యాహుతి "ఇటు రమ్ము; నీ యొక్క అత్మనై నే నిట నున్నాను" — అని యా యజమాను నాహ్వానించును. ఇట్లు 'ఆత్మ' రూపమున నొప్పి, యజమాను నాహ్వానించు నట్టిది యగుటజేసి 'ఆహుతి' యని సార్థకనామము - అని యర్థము. ఇట్లు ఆహుతులు యజమానాహ్వానరూపము లగుట ఆథర్వణికశ్రుతి వలనను దెలియును.

"ఏహ్యేహీతి త మాహుతయః సువర్చసః సూర్యస్య
రశ్మిభి ర్యజమానం వహన్తి । ప్రియాం వాచ మభివదన్త్యోఽ
ర్చయన్త్య ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః ॥"

— ముండక. ఉ. 1-2-6.

ఈ శ్రుతి వచనముల వలన ఆహుతులు స్వర్గాది సుకృతలోకములందు యజమానునకు ఫలభోగసాధనశరీరములై, అనగా మూర్తిమంతములై యొప్పి, యజమానుల నాహ్వానించునట్టివి యని తెలిసినది.

## ఆహుతులు స్వాహాకృతములు :-

ఆహుతులు స్వాహాకార, వషట్కార పూర్వకముగ అగ్నియందు ఆహితము (ఆధానము చేయబడినవి) లయినపుడే ఆహుతిత్వమునొంది, యవి పైన

దెల్పినటుల దేవతాహ్వానరూపములు. యజమానాహ్వాన రూపములు నయి యొప్పును. లేనిచో గావు.

"స్వాహాకృతో హంతి రేతు దేవాన్" — తై. బ్రా. 3-7-11-1.
"న హ వై తా ఆహుతయో దేవాన్ గచ్ఛన్తి యా
అవషట్కృతా వాఽస్వాహాకృతా వా భవన్తి।"

— కౌ. బ్రా. 12-4; శ. బ్రా. 9-3-6-14.

స్వాహాకార వషట్కార పూర్వకములుగాని యాహుతులు దేవతలకు చెందనే చెందవని యర్థము. ఇట్లు స్వాహాకారపూర్వకము లగుటచేతనే హవిస్సులకు స్వాహాకృతములను నామము వేదమున బ్రసిద్ధము

"స్వాహాకృతాన్యా గహ్యేవ హవ్యాని వీతయే"

— ఋ. 1-142-13.

"అస్య హోతుః ప్రదిశ్యృతస్య వాచి స్వాహాకృతం హవి
రదన్తు దేవాః" ఋ. 10-110-11; నిరు. 8-21.

"స్వాహాకృతం స్వాహాకారబలాత్ మంత్రేణ ప్రక్షిప్తం హవిః"

— దుర్గాచార్యభాష్య.

"స్వాహాకారేణ సంస్కృతం హవిః" — సా. భా.

స్వాహాకృతములగు నిట్టి హవిస్సుల స్వీకరించు వారగుట జేసి దేవతలకును 'స్వాహాకృతయః' అని పేరు వేదమున బ్రసిద్ధము.

"తదాహుః కా దేవతాః ? స్వాహాకృతయ ఇతి, విశ్వేదేవా
ఇతి బ్రూయాత్, తస్మాత్ స్వాహాకృతం హవిరదన్తు
దేవా, ఇతి యజంతీతి, ఇతి" .... ఐ. బ్రా. 3-13-5.

ఈ శ్రుతి వచనములవలన దేవతలందఱును 'స్వాహాకృతి' నామకులని తెలియును.

## స్వాహాకారము - శ్రుతి యాదేశము :-

స్వాహాకార మొనర్చియే హవిర్దానము చేయుదని శ్రుతియు పెక్కుచోట్ల నాదేశించుచున్నది.

"స్వాహా గాయత్రవేపసే హవ్య మింద్రాయ కర్తన"

.... ఋ. 1-142-12.

సర్వదేవాత్మకుడు: సామరూపుడు (గాయత్రవేపసే) నగు ఇంద్రునకు హవిస్సు నర్పించుటకై స్వాహాకారము చేయుడు — అని యర్థము.

"స్వాహాయజ్ఞం కృణోత సేంద్రాయ యజ్వనో గృహే"

.... ఋ. 1-13-12.

యజమానుని గృహమున ఇంద్రుని ప్రీతికొఱకై స్వాహాయజ్ఞమును చేయుడు - స్వాహాకార సంస్కృతములైన హవిస్సులతో యజ్ఞమును నిర్వర్తింపుడని భావము.

## వేదవాక్ - స్వాహాకార - యజ్ఞ - అవినాభావ సంబంధము :-

ఇంతవరకును పై ప్రమాణములచే (1) స్వాహాకారముయొక్క వైశిష్ట్యము (2) అగ్నియొక్క దేవయోనిత్వమును, యజమానుని దేవతారూప

త్వము (3) ఆహుతియొక్క ఆహితిత్వము, అహూతిత్వము, (4) భోక్తృ భోగ్యస్వరూపము (5) హవిస్సుల స్వాహాకృతత్వము (6) దేవతల స్వాహా కృతిత్వము (7) స్వాహాకార విషయమై శ్రుతి యాదేశము, (8) అందుచే స్వాహాకారపూర్వకములగు హవిస్సులకే స్వాహుతిత్వము - మున్నగు విషయములు స్పష్టము లయినవి. వీనివలన స్వాహాశబ్దమునకును, వేదవాక్కునకును, యజ్ఞాదికర్మలకును అవినాభావసంబంధము గలదనుటయు స్పష్టమైనది. శ్రుతి యీ సంబంధము నిట్లు స్పష్టీకరించుచున్నది.

'అథ యత్ - 'స్వాహా స్వాహా' ఇతి కరోతి । యజ్ఞో వై
స్వాహాకారః । వాగ్వై యజ్ఞః । యజ్ఞ మేవై తదాత్మన్
వాచం యచ్ఛతి । వాగ్వై యజ్ఞః । యజ్ఞ మేవైత దాత్మన్
ధత్తే ।" .... శ. బ్రా. 3-1-3-27.

'యజ్ఞో వై స్వాహాకారః । యజ్ఞియ మేవైత దిదం సర్వ్
సర్వం కరోతి ।' — శ. బ్రా. 7-2-3-44

"వాగ్ఘి యజ్ఞః" — శ. బ్రా. 3-1-1-2.

"అథ వాచం యచ్ఛతి । వాగ్వై యజ్ఞః । అవిక్షుబ్ధో యజ్ఞం
తనవా ఇతి ।" .... శ. బ్రా' 1-1-2-2.

"అథ యద్దీక్షితః ఋచం వా యజుర్వా సామ వా వ్యాహరతి-
అభిస్థిర మభిస్థిర మేవైత ద్యజ్ఞ మారభతే।తస్మా దముత్రై
వాంగుళీ ర్న్యచే దముత్ర వాచం యచ్ఛేత్।
అథ య ద్వాచం యచ్ఛతి వాగ్వై యజ్ఞః। యజ్ఞ మేవైత
దాత్మన్ ధత్తే" —శ.బ్రా 3. 2-1-3‹,38.

యజ్ఞము హవిస్త్యాగాత్మకము: హవిస్త్యాగము స్వాహాకారపూర్వకము; స్వాహాకారము హవిస్త్యాగాదికమునుసర్వమును యజ్ఞియ మొనర్చును. కావున

స్వాహాకారము యజ్ఞాత్మకము; యజ్ఞము స్వాహాకారాత్మకము నగుచున్నది. మఱియు యజ్ఞము ఋగ్యజుఃసామాత్మక వేదమంత్రసాధ్యము; కావున యజ్ఞము వేదవాగాత్మకము, యజ్ఞదీక్షితుడగువాడు ఇట్టి వాక్కును తనయందు నియత మొనర్చుకొనుటచే యజ్ఞమునే తనయందు ధరించినవాడగుచున్నాడు. కావుననే దీక్షితుడైన యజమానుడు న్యక్నాంగులియై (గుప్పిలివట్టి), దేవతానంబంధ రహితమగు లౌకిక వాగ్వ్యవహారమును మాని, దైవీవాక్కునే అనగా సంస్కృతభాషనే యాశ్రయించుచు యజ్ఞనిర్వహణమున కావశ్యకములగు ఋగాది మంత్రోచ్చారణ సేయుచు, యజ్ఞము నాత్మయందు ధరించియుండును — అని తాత్పర్యము. (చూ, తై. బ్రా 1-2-1.) కావున వేదమంత్రరూపమగు వాక్కునకును, యజ్ఞాదికర్మకును స్వాహాకారమునకు నవినాభావసంబంధము.

## స్వాహాశబ్దము - సార్థకత :-

ఇట్లు మహిమాన్వితముగ గీర్తింపబడెడి స్వాహాశబ్దము హోమ సూచకమైన సాంకేతికపదము మాత్రమే కాదు; సార్థకమగు వాఙ్నామము. దీని సార్థకత యాస్కనిరుక్తమున (8-20) నిట్లు వివరింపబడినది.

(1) స్వాహే త్యేతత్ సు ఆహేతి వా (సు ఆహ)
(2) స్వా వాగాహేతి వా (స్వా వాక్ ఆహ)
(3) స్వం ప్రాహేతి వా (స్వం ప్రాహ)
(4) స్వాహుతం హవి ర్జుహోతీతి వా (సు.ఆ జుహోతి)

భాష్యకారు లందఱు యథోచితముగ నీ యర్థముల నన్నిటి గ్రహించిరి. (చూ సా, భా. ఋ. 10-110-11; అ వే. 2-16-1 మొ )

ఈ వ్యుత్పత్తుల నన్నిటిని బరిశీలించినచో స్వాహాస్వరూపము జేటపడగలదు. ఈ నిర్వచనములలో నొక వైశిష్ట్యముగూడ గాననగును. అందుచే నాల్గవ వ్యుత్పత్తిని మొదట జూతము.

## 1) స్వాహుతం హవిర్జుహోతి (సు ఆ జుహోతి) :-

దీనిని వ్యాఖ్యాత లిట్లు వివరించిరి.

> "య దనేనై వ హవి ర్జుహోతీతి తదేవ సుష్ఠ్వాపాద్య యథాభిధాన మగ్నౌ జుహోతీతి హవిఃప్రధానోఽత్ర నిర్దేశః"—దుర్గా. భాష్య.

> "యదనేన స్వాహాకారేణ జుహోతి తదేవ సుష్ఠు మర్యాదయా జుహోతీతి" —నిఘంటువ్యాఖ్య. దేవరాజయజ్వ.

స్వాహాకార పూర్వకముగనే హవిస్సును హోమము జేయుట యనగా సౌష్ఠవమును(దివ్యత్వమును) ఆపాదించి యథావిధిగ హోమము చేయుట, లేక హవిస్త్యాగము చేయుట—అని యర్థము. ఆగుచో నీ దివ్యత్వాపాదన మెవరికి ? ఎట్లు? వాగ్వై యజ్ఞః; యజ్ఞో వై స్వాహాకారః— ఇత్యాది శ్రుతుల ననుసరించి యజ్ఞము వేదవాగాత్మకము, స్వాహాకారాత్మకము. అట్టి యజ్ఞాది కర్మానుష్ఠాన సమయమున అగ్ని దేవయోనియై యావిర్భవించుటయు, దేవయోనియగు నా యగ్ని వలనను, స్వాహాకృతములగు నాహుతుల వలనను యజమానుకు దైవీసంపదతో నొప్పారుటయు పైన వివరించబడినది. 'స్వాహా స్తోమస్య వర్ధనా' ఇత్యాది శ్రుతి వాక్యములవలన స్వాహాకారముచే, లేక స్వాహారూప వేదవాక్కుచే అభిష్టుతులు, అర్చితులునగు దేవతలు స్తోత్రమునం దొకవిధమగు నతిశయము (దివ్యత్వము)ను ఆపాదించిస్తోతనువర్ధిల్లజేయుటయు పైన వివరింపబడినది కావ స్వాహా యనగా 1) అగ్నియందును (2) యజమానియందును (3) వేదవాగాత్మకమగు స్తుతియందును

(4)హవిస్సునందును— సౌష్ఠవమును (దివ్యత్వమును) ఆపాదించునది యని తాత్పర్యము. ఇట్టి శ్రుతితాత్పర్యమునే 'స్వాహాతం హవి ర్జుహోతీ' యను వ్యుత్పత్తి ద్వారా యాస్కుడు ప్రదర్శించినట్లు గ్రహింపనగును. ఈ వ్యుత్పత్తి వలన 'స్వాహా' యనునది 'దివ్యత్వా పాదక శక్తిరూప' మగుట దెలియును, దీనియందలి యీ వైశిష్ట్యము మిగిలిన మూడు వ్యుత్పత్తుల వలన గ్రమముగ గాంచనగును.

## 2) స్వా వాక్ అహ – 'స్వాహా' వేదవాక్ :-

శ్రుతియే యీ వ్యుత్పత్త్యర్థము నొక యాఖ్యాయికారూపమున నిట్లు వివరించినది.

"ప్రజాపతి రగ్ని మసృజత । తం ప్రజా అన్వసృజ్యన్త ।
త మభాగ ఉపాస్త । సోఽస్య ప్రజాభి రపాక్రామన్ । త
మవరురుత్సమానో ఽన్వైత్ । త మవరుధ న్నాశక్నోత్ । స
తపోఽతప్యత । సోఽగ్ని రుపారమతాతాపి వై న్య ప్రజాపతి
రితి । స రరాటా దుదమృష్ట ।

తద్ ఘృత మభవత్ । .... । త దగ్నౌ ప్రాగృహ్ణాత్ । త
ద్వ్యచికిత్సత్। జుహవానీ 3 మహౌషా 3 మితి । త
ద్విచికిత్సాయై జన్మ, ఇతి । య ఏవం విద్వాన్ విచికిత్సతి ।

వసీయ ఏవ చేతయతే, ఇతి । తం వా గభ్యవద జ్జుహుధీతి ।
సోఽబ్రవీత్ । క స్త్వమసీతి । స్వైవ తే వా గిత్యబ్రవీత్ । సో
ఽజుహోత్ స్వాహేతి । త త్స్వాహాకారస్య జన్మ, ఇతి ।
య ఏవగ్ం స్వాహాకారస్య జన్మ వేద । కరోతి స్వాహాకారేణ

వీర్యం, ఇతి । యస్యైవం విదుషః స్వాహాకారేణ జుహ్వతి ।
భోగాయైవాస్య హుతం భవతి, ఇతి ।"

— తై. బ్రా. 2-1-2-1, 2, 3, 4.

"ప్రజాపతిచే నగ్నియు, నగ్నితోపాటు ప్రజలును సృజింపబడిరి. అగ్ని కొంతకాలము ప్రజాపతి నుపాసించుచు యజ్ఞభాగరహితు డైనందున ప్రజాపతినుండి ప్రజలతోపాటు తొలగిపోయెను. ఆ యగ్ని నడ్డగించుటకై ప్రజాపతి యాతని వెన్నంటెను. కాని యడ్డగింపలేకపోయెను. అంతట ప్రజాపతి తప మొనర్పగా నగ్నియు విడిచిపోవుట మానెను. తపస్సంతప్తుడైన ప్రజాపతి తన లలాటమునుండి స్వేదజలమును తుడిచెను. అది ఘృతమై యావిర్భవించెను. దాని నగ్నియందు హోమము చేయుటకై గ్రహించినంతనే — దీనితో నగ్నియందు హోమము చేయుటయా? మానుటయా?" యను విచికిత్స ప్రజాపతికి పొడమెను. ఇదియే విచికిత్సయొక్క జన్మ. లోకమున విచికిత్స యిట్లావిర్భవించినది.

ప్రజాపతికి గలిగిన యీ విచికిత్సోత్పత్తిని గూర్చి తెలిసికొని స్వయముగ నెవడు శాస్త్రార్థవిచారము సేయునో యాతడే వస్తుతత్త్వమును నిశ్చయించుకొనువాడు. అనగా వస్తుతత్త్వవిషయక నిశ్చయాత్మకజ్ఞానము కలుగునని భావము.

అట్లు విచికిత్సాపన్నుడైన ప్రజాపతి నుద్దేశించి యశరీరిణియగు నొక వాక్కు 'జుహుధి—హోమము చేయుము'—అని పలికెను. నీ వెవరవు? అని ప్రజాపతి యడిగెను. నీ స్వభూతమైన వాక్కు నేను (స్వైవ తే వాక్) అని యా యదృశ్యవాణి పలికెను. అంతట ప్రజాపతి 'స్వాహా'యని యుచ్చరించుచు హోమము జేసెను ఇట్లు 'స్వా—ఆహా'అను రెండు పదముల చేరికచే స్వాహాకారమావిర్భవించి నది స్వాహాకారోత్పత్తిని(సార్థకతను లేక స్వరూపమును) ఇట్లెవరు తెలిసికొందురో వారే స్వాహాకారముచే వీర్యమును (సౌష్ఠమును, లేక దివ్యత్వమును) అపాదింతురు.

ఎవరిట్లు తెలిసికొనినవారై స్వాహాకారపూర్వకముగ హోమము చేయుదురో ఆ యాహుతి స్వాహుతి యగుచు తద్భోగమునకే యగును. అనగా నభీష్టసిద్ధి నొసగుటకు సమర్థమగును"—అని శ్రుత్యర్థము.

ఈ శ్రుత్యర్థమును బరిశీలింతము:-

ఇచట యజ్ఞభాగవివర్జితు డగుటచే అగ్నియు, అగ్నితోపాటు ప్రజయు మొదట ప్రజాపతికి దూరమయిరి. కాని తప మాచరించిన యంతనే అగ్ని తిరిగి యావిర్భవించెను. అనగా అగ్నికి నెవరు భాగము కల్పింపరో వారి కగ్నియు, అగ్నితోపాటు ప్రజయు దూరమగుదురు. అట్లుగాక నియమవ్రత పరాయణులై శ్రుతిచోదిత కర్మానుష్ఠానతత్పరు లగుచు నెవరు తపః సంపన్నులగుదురో యట్టివారికి అగ్ని దేవయోనియై యావిర్భవించును - అనెడి 'అగ్ని ర్వై దేవయోనిః ఇత్యాది పూర్వోక్త శ్రుత్యుక్తార్థము ఇట సూచితము.

తపఃసంపన్నుడైన ప్రజాపతి లలాటభాగమున పొడమిన స్వేదము నగ్నియందు హోమము చేయుటకై గ్రహింప నది'ఘృత' మయ్యెను. ఘృతమనగా నేయి యని సామాన్యముగ నర్థము. ఘృతమును 'తేజో' రూపముగ శ్రుతి[1] పెక్కుచోట్ల కీర్తించినది. కాన నిట హోమమునకు గ్రహింపబడిన ఘృతరూప హవిస్సును-తపసంభూత బ్రహ్మతేజోరూపముగ గ్రహింపనగును తపస్సంపన్ను

1. ఘృతస్య నామ గుహ్యం యదస్తి జిహ్వా దేవానా మమృతస్య నాభిః'
—ఋ. 4-58-1,2; వా. సం 17-88,90; తై. ఆ. 10-10-2.

"తేజోఽసి శుక్రమ స్యమృత మసి ధామ నామాసి। ప్రియం దేవానా మనాధృష్టం దేవయజన మసి।—వా.సం.1-31;శ.బ్రా 1-3-1-18-

"ఘృతం తేజో మధుమ దింద్రియమ్ । మయ్యయ మగ్ని ర్దధాతు"
—తై. ఆ. 3-11-8.

లగువారు బ్రహ్మతేజోవిరాజితులగుట ప్రసిద్ధమే. కాన కర్మానుష్ఠాన సమయమున దేవయోనియై యావిర్భవించెడి యగ్నియందు వ్రేల్చెడి ఘృతమును ప్రజాపతి యొక్క బ్రహ్మజోరూపముగ (ద్వైపీనంపద్విలసితముగ) దర్శింప నగునని తాత్పర్యము.

అట్లావిర్భవించిన ఘృతమును ఆ యగ్నియందు హోమము చేయు టయా? మానుటయా? యను విచికిత్స (వివిధస్య కేతనస్య జ్ఞానస్యేచ్ఛా విచికిత్సా' కోటిద్వయాత్మకః సంశయ ఇత్యర్థః–సా.భా) ప్రజాపతికి కలిగెను. అట్టి సందేహము సామాన్యముగ నందఱకు గలుగ వచ్చును. కాని యీ సందియములు తీఱు టెట్లు? ప్రజాపతికిగల్గిన సందియము గూడ దానియంతట నది నివర్తింప లేదు. ఇది యతీంద్రియవిషయము జన్మచే మహాభాగ్యసంపన్ను డగుటచే నశరీరిణి యైన యొక వాక్కు' సంశయింపకుము; హోమము జేయుము (జుహుధి)' అని ప్రబోధించినది. ఆ సందియమును తీర్చిన యదృశ్యవాక్కు ఏది? అది ప్రజాపతికి స్వభూతమైన వాక్కు (స్వైవ తే వాక్) ఇట్లు ప్రజాపతికి స్వభూతమైన వాక్కు ఏది యగును? ప్రజాపతికి స్వభూతయై సృష్టిరచన యందు సహకారిణియై విలసిల్లిన వాక్కు–వేదవాక్కు–అని పూర్వము బ్రహ్మ, ఋషి ప్రథమజా, తపోజాది శబ్దముల యందు వివరించబడినది. కాన నిట సందియమును దొలగించుచు 'జుహుధి' యని కర్తవ్యమును బోధించిన వాక్కు వేదవాక్కే యగుట శ్రుతితాత్పర్యానుగుణమే యగును. ప్రజాపతికి వాకు స్వభూతము అని తాండ్య. కాఠకశ్రుతులును నిట్లు పేర్కొనుచున్నవి.

'ప్రజాపతి ర్వా ఇద మేక ఆసీత్ తస్య వాగేవ స్వ మాసీత్'

తాం.బ్రా. 20-14-2; కాఠ.సం. 12-5; 27-1.

ప్రజాపతి వాక్పతి యగుట శ్రుతులయందు ప్రసిద్ధము. (చూ. వాచస్పతి; బ్రహ్మణస్పతి, బృహస్పతి—శబ్దములు).

'ప్రజాపతి ర్వై వాక్పతిః' —శ.బ్రా. 3-1-3-2.

స మనసా వాచం మిథునం సమభవత్' —ఉ.బృ. 1-2-4.

కాన ప్రజాపతికి స్వభూతమైన వాక్కు వేదవాక్కే యగుట శ్రుతి తాత్పర్యమని చెప్పనగును. మఱియు:—

## స్వయం తే సరస్వతీ ఆహ - స్వాహా :-

శ్రీభాస్కరమిశ్రుడు ఆ వాక్కు 'సరస్వతి' యని యిట్లు వ్యాఖ్యానించినాడు.

> 'స్వయం సరస్వతీ ఆహ బ్రుతే'స్వైవ తే వా గిత్యబ్రవీత్-
> ఇతి బ్రాహ్మణమ్। స్వయ మేవాహేత్యస్యార్థస్య ద్యోతకో
> ఽయం నిపాతః। ప్రదేశాంతరేఽపి విభక్త్యన్త సముదాయాత్మ
> నిపాతః స్వాహేతి, సంస్కారవిశేషవ ధారిణాన్ నావగృహ్యతే'
>
> —నిఘంటువ్యాఖ్య—దేవరాజయజ్వ'

సరస్వతి యను నామము వాగ్దేవికిని' వేదవాక్కునకును ప్రసిద్ధము (చూ. భారతీశబ్దము). కాన శ్రీ భాస్కరమిశ్రుని వ్యాఖ్యానము ననుసరించి (స్వయం తే సరస్వతీ ఆహ — స్వాహా) ప్రజాపతికి స్వభూతమైన సరస్వతి వేదవాణియే యగుచున్నది. శ్రీ సాయణాచార్యులును స్వాహా శబ్దమునకు పెక్కుచోట్ల 'స్వకీయా సరస్వతీ ఆహ' స్వకీయా వా గాహ'-అనియే యర్థమును వ్రాసిరి. (చూ. తై. సం. 1-11-9-1; చిత్తిపన్న మంత్రములు).

కాగా' ప్రజాపతికి గల్గిన సందియమును ప్రజాపతికి స్వభూతమైన వేదవాక్కు తీర్చెననుట స్పష్టము. అట్లే యీ వేదవాక్కు నెవరి కర్థ్యయనాదులద్వారా స్వభూత మగుచుండునో వారికి గల సందియము లన్నియు తదనుగ్రహముచే విడివడుచుండు నని తాత్పర్యము. ఇట్లనుటచే వేదము యొక్క వేదత్వము—అనగా అజ్ఞాతజ్ఞాపకత్వ మిట సూచిత మగు చున్నది కాన

స్వాహాపదము అడుగడుగున 'కర్మానుష్ఠాన విషయమున నెట్టిసంశయమువలదు, యథావిధిగ జేయుడు' — అని బ్రహ్మకు స్వభూత మైన వాగ్దేవి యొక్క, అనగా సరస్వతియొక్క ప్రబోధమును స్మరింప జేయునట్టిది. ఇదియుగాక:—

## స్వః వంహిమా ఆహ - స్వాహా :-

స్వాహాకారోత్పత్తిని గూర్చిన యిట్టి యాఖ్యాయిక మైత్రాయణీ సంహిత యందును (I-8-1) గలదు. కొంది మార్పులతో నిది శతపథ బ్రాహ్మణము నందిట్లు గలదు.

"స వ్యచికిత్సత్ జుహవాని 3 మాహౌషా 3 మితి। తం
స్వో మహిమా ఽ భ్యువాద। జుహుధీతి । స ప్రజాపతిః
విదాంచకార-స్వో వై మా మహిమాహేతి। స స్వాహే
త్యేవాజుహోత్-తస్మా దు స్వాహే త్యేవ హూయతే।

—శ. బ్రా. 2-2-4-6.

విచికిత్స నొందిన ప్రజాపతి తన మహిమయే 'జుహుధి—యని చెప్పినట్లు (స్వో మహిమా ఆహ) తెలిసికొని స్వాహా యనియే, హోమము చేసెను. అందువలన స్వాహా యనియే హోమము చేయబడుచున్నది—అని యర్థము. ప్రజాపతికి స్వభూతమైన ఈ మహిమ యేది యగును? యీ మహిమ వాక్కే—యని శ్రుతియే స్వయముగ నిట్లు వివరించినది.

'వాగ్వా అస్య (ప్రజాపతేః) స్వో మహిమా' —శ. బ్రా. 2-2-4-4.

కాన ప్రజాపతికి స్వభూతమైన మహిమ పైన దెల్పిన రీతి వేదవాక్కే యగుట స్పష్టము. వేదవాక్కు స్వభూతమగుచో (అధ్యయనాదుల ద్వారా) ప్రజా

పతికి వలెనే మహిమరూపమై యొప్పి సందియముల దీర్చుచుండునని భావము. వేదవిదుని మహిమ వేదవాక్కే - యని తాత్పర్యము. ఇంతే కాదు.

'అగ్నేః స్వో మహిమా - ఈ వాక్కే అగ్నియొక్క స్వభూతమైన మహిమ యనియు శ్రుతి స్పష్టము జేయుచున్నది.

"స్వం మహిమాన మావహ, ఇతి" — తై. బ్రా. 3-5-3-1.

'త్త స్వం మహిమాన మావోఢ్వా అహ। వాగ్వా అస్య
(అగ్నేః) స్వో మహిమా। త ద్వాచ మావోఢ్వా అహ।'

.... శ. బ్రా. 1-4-2-17,

'అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతత్, పతంగో వాచం మనసా బిభర్తి' (ఋ. 10-177-2) - ఇత్యాది శ్రుతి ప్రామాణ్యముచే మొదట పరమేశ్వరునకు స్వభూతమై యొప్పిన వేదవాణియే పిదప ప్రజాపతికిని (హిరణ్యగర్భునకును), పిమ్మట నగ్నికిని (విరాడగ్నికి) స్వభూతమై - స్వమహిమాత్మకమై - విలసిల్లినది. అందుచే పరమేశ్వర, ప్రజాపతులవలెనే యగ్నియు, వాక్పతి యని ప్రసిద్ధుడైనాడు. కాన స్వాహారూపిణియగు నీ వాక్కు 'అగ్నాయీ' యనియు గీర్తింపబడుచున్నది.

"తస్మా దగ్నే ర్వాచ శ్చ సంబంధాత్ అగ్నాయీ స్వాహా
వా గిత్యుచ్యతే" — నిఘంటువ్యాఖ్య - దేవరాజయజ్వ.

'స్వాహావరః' అనియు అగ్ని శ్రుతులయందు (ఋః 8-63-5) గీర్తింపబడుట గలదు. కాన అగ్నియొక్క స్వాహాపతిత్వము 'వేదవాక్పతిత్వమే' యని గ్రహింపగును.

—

'ఈ స్వా వాక్ ఆహ', లేక 'స్వయం సరస్వతీ ఆహ', లేక 'స్వో మహిమా ఆహ' - అను నీ వ్యుత్పత్తుల ననుసరించి 'స్వభూత (స్వకీయ లేక ఆత్మీయ)గా జేసికొనుచో ప్రజాపతికి వలెనే విచికిత్సల బోగొట్టి కర్తవ్యమును బోధించుదానను' - అని వేదవాక్కు తన మహిమను తలపింప జేయుచు స్వాహా రూపిణియై యడుగడుగున ప్రబోధించుచున్నది యని గుర్తింపనగును.

మఱియు 'స్వయం తే సరస్వతీ ఆహ' - ప్రజాపతికి స్వభూతమైన సరస్వతి యగు వేదవాక్కు చెప్పినది యని నీ వ్యుత్పత్తి వేదవాక్కు యొక్క స్వతః ప్రమాణత్వమును గూడ దెలియజేయుచున్నది.

## 3) సు ఆహ-స్వాహా :-

అతీంద్రియ విషయములందు ప్రమాణమై, సంశయవిచ్ఛేదకము గుచు కల్యాణకరమగు నర్థమును (పురుషార్థమును) ప్రబోధించునట్టిది వేద మంత్రరూప వాక్కే. ఈ యర్థమే 'సు ఆహ స్వాహా' యను యాస్కుని మొదటి వ్యుత్పత్తిచే దెలియబడుచున్నది.

"అయ మర్థః యస్యాస్తే శ్రూయతే స హోమమంత్రః
శోభన మర్థ మాహ' నిఘంటువ్యాఖ్య-దేవరాజయజ్వ.

(చూ. దుర్గాచార్య, భా.

## 4) స్వం ఆహ స్వాహా :-

స్వం ఆత్మానం ఆహ-ఆత్మను గూర్చి చెప్పునది యని యర్థము. ఈ నిర్వచనము ననుసరించి యాత్మ స్వరూప ప్రబోధకము అని చెప్పుచో స్వాహాపదము స్వాధ్యాయశక్తిమును తెలుపింపఁజేయునది యగును.

# స్వాహా - వేదశరీరిణీ - పరాదేవతా (పరమాత్మా) :-

(1) ఇట్లు ఆత్మతత్త్వబోధకము గావుననే, పరదేవత స్వాహాశబ్ద ప్రతిపాద్యయు, స్వాహాకారాత్మికయు నగునని శ్రుతి చెప్పుచున్నది,

"అవరం స్వాహాకారం కరోతి। పరాం దేవతామ్। ఏష వై
స్వాహాకారః। య ఏష తపతి। ఏష ఉ ప్రవర్గ్యః। త
దేత మేవైత త్ప్రీణాతి। తస్మా దవరం స్వాహాకారం
కరోతి పరాం దేవతామ్।" —శ. బ్రా. 14-1-3-26.
'కథం స్వాహాకారస్య పరదేవతాత్మకతా ? ఇతి। తత్రాహ।
ఏష వా ఇతి। య ఏషః సూర్య స్తపతి। ఏషఃఖలు
స్వాహాకారః స్వాహాశబ్ద ప్రతి పాద్యః స్వాహాకారాత్మకో వా'
—సా. భా.

పై శ్రుతివలన పరదేవతాస్వరూపుడగు నాదిత్యుడు స్వాహాశబ్ద ప్రతిపాద్యుడు, లేక స్వాహాకారాత్మకు డగుట తెలియును. అనగా వేద ప్రతిపాద్యుడు వేదాత్మకుడు - అని తాత్పర్యము. "వేదై రశూన్య స్త్రిభి రేతి సూర్యః సైషా త్రయ్యేవ విద్యా తపతి య ఏషోఽన్త రాదిత్యే హిరణ్మయః పురుషః" మున్నగు శ్రుతు లనేకము లాదిత్యుడు వేదాత్మకుడని కీర్తించినవి.

(2) ఇంతియే కాదు పరాదేవియగు స్వాహాదేవి యొక్క స్వరూపమును ప్రశ్నోత్తరరూపమున షడ్వింశబ్రాహ్మణ మిట్లు వివరించుచున్నది.

"స్వాహా వై కుతః సంభూతా? కస్య దుహితా? కేన
ప్రకృతా? కిం గోత్రా కత్యక్షరా? కతి పదా ? కతి మాత్రా?

కతి వర్ణా? కత్యవ్యాసా? కిం చాస్యాః శరీరమ్? కాన్యంగాని?
కాని లోమాని? కతి శిరాంసి? కతి వా చక్షూంషి? కి మస్యా
ఆస్యమ్? కిం ప్రావృతా? కౌ బాహూ- కౌ పాదౌ?
క్వ చ స్థితా? కిమధిష్ఠానా? కథం చ స్వాహాం ప్రతిగృహ్ణాసి?"

"స్వాహా వై సత్యసంభూతా। బ్రాహ్మణో దుహితా।
బ్రహ్మప్రకృతా లాతవ్యసగోత్రా। త్రీణ్యక్షరాణి। ఏకం
పదమ్। త్రయోఽస్యై వర్ణాః। శుక్లః పద్మః సువర్ణ ఇతి।
చత్వారోఽస్యై వేదాః శరీరమ్। షడంగాన్యంగాని। ఓషధి
వనస్పతయో లోమాని। ద్వే చాస్యాః శిరసీ। ఏకం శిరోఽ
మావాస్యా। ద్వితీయా పౌర్ణమాసీ। చక్షు శ్చంద్రాదిత్యౌ।
ఆజ్యభాగౌ హుతమ్। దక్షిణా ప్రావృతా। బృహద్రథంతరమ్।
ఋగ్యజుః సామగతిః। సా స్వాహా। సా స్వధా। స
వషట్కారః। సైషా దేవేషు వషట్కారభూతా ప్రయుజ్యతే।
పితృయజ్ఞేషు స్వధాభూతా। శకటీముఖీం పృథివీ మంతరిక్షేణ
విపర్యేతి। తస్యా అగ్ని ర్దైవతమ్। బ్రాహ్మణో రూపమ్।
యత్కామాస్తే జుహుమ స్త న్నో అస్తు। వయం స్యామ
పతయో రయీణామ్। స్వాహేతి।" —ష. వి. బ్రా 5-7.

ఇట స్వాహాదేవివర్ణనము విరాట్పురుషవర్ణనమును బోలియుండుట స్పష్టము. షడంగసహిత వేదచతుష్టయ మీమె శరీరము; స్వాహా స్వధావషట్కారము లామెయే, బ్రహ్మయొక్క దుహిత; సత్యసంభూత; ఋగ్యజుఃసామ సంచారిణి; వేదవిదుడగు బ్రహ్మనిష్ఠు డామె రూపము-ఇత్యాది వర్ణనలు 'స్వాహ యన వేదాత్మిక యగు వాగ్దేవియే'- యగుట స్పష్టము జేయుచున్నవి.

(3) 'స్వాహా'యన పరమేశ్వర వశవర్తిని యగు మాయాశక్తి యని గోపాలపూర్వతాపనీయోపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది.

"కృష్ణం సంతం విప్రా బహుధా యజన్తి 'గోవిందం సంతం
బహుధా రసన్తి। గోపీజనవల్లభో భువనాని దధ్రే'
స్వాహాశ్రితో జగ దైజయ త్సురేతాః॥" —1-3.

'కేనేదం విశం సంసరతీతి। .... .... స్వాహేదం సంసరతీతి ...
కా స్వాహేతి?....తన్మాయా చేతి।" -1.

శ్రీకృష్ణుడు పరబ్రహ్మ, తదాశ్రిత మాయాశక్తియే స్వాహాదేవి. ఈ మాయాశక్తిచేతనే జగత్తు ప్రాదుర్భవించును - అని యర్థము.

(4) లలితాసహస్రనామ స్తోత్రమునందు పరాదేవత స్వాహా, స్వధా స్వశబ్దములతో బేర్కొనబడినది.

(5) దేవీభాగవతమునగూడ నీ పరాదేవతయే గాయత్రి యనియు, స్వాహ యనియు, స్వధా యనియు, వేదకళాస్వరూపిణి యనియు నిట్లు వర్ణింప బడినది.

"గాయత్ర్యసి ప్రథమ వేదకళా త్వ మేవ।
స్వాహా స్వధా భగవతీ సగుణార్ధమాత్రా।
ఆమ్నాయ ఏవ విహితో నిగమో భవత్యా
సంజీవనాయ సతతం సురపూర్వజానామ్।" -దేవీ భా. 3-4-45.

ఇంతేగాక, వేదములందుగల స్వాహా ప్రసిద్ధిని. ప్రశస్తిని దేవీభాగవత మిట్లు చెప్పుచున్నది.

న వేదా స్త్వా మేవం కలయితు మిహాపన్నపటవో
యత స్తే నోచు స్త్వాం సకలజనధాత్రీ మవికలామ్।
స్వాహాభూతా దేవీ సకల మఖహోమేషు విహితా
తదా త్వం సర్వజ్ఞా జనని ఖలు జాతా త్రిభువనే॥

జననీ ! భువనేశ్వరీ ! నీవు సకల జనధాత్రివి సర్వజ్ఞత్వాది గుణ సంపన్నవు. వైకల్యరహితవు. పరాదేవతవు. వేదములు నిన్ను ఈ రీతిగా వర్ణింపక పోవచ్చును. అంతమాత్రమున నిన్ను బ్రతిపాదించుటకు వేదములు సమర్థములుకావు- అని యనుట తగదు. వేదములచే సకల యజ్ఞక్రియా హోమములయందు 'స్వాహా రూపమున నీవు' విధింపబడితివి. అందుచేతనే సర్వజ్ఞవుగా త్రిభువనముల యందు బ్రసిద్ధి గాంచితివి-అని యర్థము.

ఈ శ్లోకమును బరిశీలించుచో నిఖిల వేదములకు లక్ష్యము ఏ పరాదేవతయో సర్వజ్ఞయగు నా దేవియే స్వాహారూపమున నిఖిల యజ్ఞాదికర్మలయందు స్మరింప బడుట శ్రుతి తాత్పర్యమని స్పష్టమగుచున్నది. కర్మలయందు హోమవాచకమై (హవిర్దానవాచకమై) శ్రూయమాణమగు స్వాహాపదము పరదేవతావాచకము -పర తత్త్వప్రతిపాదకము - అని భావము. ఇట్లు శ్రుతి, పురాణాది గ్రంథ సందర్భము ననుసరించి స్వాహాయన 'స్వం ఆత్మానం ఆహ-ఆత్మను లేక పరాదేవతను బోధించు నది'- యను నర్థము పర్యవసిత మగుచున్నది.

## స్వాహాశబ్దము - వ్యుత్పత్తులక్రమగతి :-

వాఙ్నామము, లేక వాగ్దేవతానామమగు నీ స్వాహాశబ్దమునకు వ్యుత్పత్తుల బ్రవర్తించుటలో యాస్కమహర్షి యొక్క క్రమగతిని సూచించుచున్నట్లు తోచును.

(1) అందు మొదటి వ్యుత్పత్తి 'సుష్ఠు ఆహ స్వాహా' - శోభనముక్త మాహ — అనగా మంత్రము యొక్క కల్యాణార్థ బోధకత్వమును తెలియజేయునది యని యర్థము. ఇది ఎట్లు తెలియజేయును ?

(2) స్వా వాక్ ఆహ స్వాహా - ఇది పరమేశ్వరునకును, ప్రజాపతికిని, అగ్నికిని స్వభూతమైన వాక్కు యొక్క లేక వాగ్దేవత యొక్క ప్రబోధరూపము. కావుననే-

(3) స్వం ప్రాహ స్వాహా – ఆత్మను, లేక పరాదేవతను ప్రబోధించునది; అనగా అట్లు ప్రబోధించు పరాదేవతావాచకమగు మంత్రము. అందుచే–

(4) స్వాహుతం హవి ర్జుహోతీతి స్వాహా దివ్యత్వము నాపాదించు హవిర్దాన వాచకము —అగుచున్నది.

ఇట్లు యాస్కమహర్షిచే ప్రదర్శింపబడిన పై నిర్వచనములు మాత్రమేగాక సంప్రదాయానుగతములైన యితర నిర్వచనములును గలవు

(1) సుష్ఠు హూయతే యయా ఇతి స్వాహా
సా పంచమప్రయాజదేవతా। –భట్టభాస్కరః (తై.బ్రా) 3-౯-1.

(2) సుష్ఠు ఆహ్వయతి స్వాహా —క్షీరస్వామి (నిఘంటువ్యాఖ్య)

(3) (స్వాహా సుహుత మస్తు) అథవా స్వస్యాహాన మస్తు।
హాసం హా న హా అహాః స్వస్యాహా ఉపరిత్యాగ ఆత్మనో
ద్రవ్యస్య వేతి। —దేవత్రాతభాష్యమ్–అగ్నిహోత్రచంద్రికా. 20.

ఇందు మొదటి వ్యుత్పత్తి ననుసరించి 'ఆహ్వానింపబడు దేవత' –యని యర్థము. అనగా అగ్నయే స్వాహా, ఇంద్రాయ స్వాహా – ఇత్యాది స్థలములందు అగ్నీంద్రాది రూపమున నాహ్వానింపబడు దేవత వస్తుతః పరాదేవతయే – అని భావము. రెండవ వ్యుత్పత్తి ననుసరించి 'దేవతాహ్వానవాచకము.' ఇక మూడవ నిర్వచనము ననుసరించి తనను (యజమానుని) తనచే విధిపూర్వకముగ త్యాగము చేయబడిన ద్రవ్యమును ఆ దేవత త్యజింపకుండుగాక' –యని యర్థము. అనగా స్వాహాకార పూర్వకముగ హవిస్సు నొసగుచో నా దేవత తప్పక దానిని గ్రహించి యజమానుని విడువకయుండు (దేవతాత్వము నావేశింపజేయు)నని తాత్పర్యము. ఇది 'సుహుతమస్తు' అని సామాన్యముగ జెప్పు నర్థమునకు తాత్పర్య వివరణాత్మకమే యగును. ఇట్టి వ్యుత్పత్తులు భిన్నములుగ గన్పట్టినను యాస్కమహర్షి చూపిన వ్యుత్పత్తులలో నంతర్భావము నొందుచునే యున్న వనవచ్చును.

ఒక శబ్దమున కనేకార్థము లుండవచ్చును. ఆ యా యర్థముల నా యా ప్రకరణానుసారముగ గ్రహించెడి సంప్రదాయము గలదు. కాని స్వాహాశబ్దమున కట్లుగాక దీనికి ప్రదర్శింపబడిన యర్థముల నన్నియెడల గ్రహింపవలసి యున్నది. భాష్యకారుల యభిప్రాయము నట్లే కన్పట్టును ఉదా :- "ప్రాణాపానౌ మృత్యోర్మా పాతం స్వాహా" —అ. సం. 2-16-1. అను మంత్రము నందలి స్వాహా పదమునకు శ్రీసాయణాచార్యులు 'స్వాహుత మస్తు' అని సామాన్యముగ నర్థము చెప్పి - స్వాహా ఇతి దేవానాం హవిర్దానే .... ....అక్షరార్థస్తు యాస్కేనోక్తః" -అని యనుచు స్వాహాశబ్దమునకు యాస్కమహర్షి ప్రదర్శించిన నిర్వచనముల నన్నింటిని జూపినాడు. అందుచే హవిర్దానవాచకముగ సామాన్యముగ గ్రహింప బడెడి యీ స్వాహాశబ్దమునకు అక్షరార్థము నన్నియెడల నీ నిర్వచనములద్వారా గ్రహింపనగుననియే శ్రీ సాయణాభిమతము.

కాని యిట నొక విశేషము. మంత్రాంతమున శ్రూయమాణ మగు స్వాహా శబ్దమునకు పై యర్థము లన్నియు గ్రాహ్యములే యగును. కాని మంత్ర మధ్యపతిత మగు స్వాహా శబ్దము హవిఃప్రదానవాచకము గాదు. అట్టియెడల హవిర్దానరూపార్థము తప్ప మిగిలిన యర్థములు గ్రాహ్యము లగుచుండును. ఉదా:-

"మనసస్పత ఇమం నో దివి దేవేషు యజ్ఞమ్। స్వాహా దివి
స్వాహా పృథివ్యాం స్వాహాన్తరిక్షే స్వాహా వాతేధాం స్వాహా॥"

—అ. సం 7-97-8.

"హే మనసస్పతే । సర్వభూతానా మంతరాత్మతాయా మన
సోఽపి పతే, హే దేవ ! .... ....నః అస్మదీయం ఇమం
యజ్ఞం, దివి ద్యులోకే వర్తమానేషు దేవేషు అగ్న్యాదిషు
ధాం, పురుషవ్యత్యయః, ధాః ధేహి స్థాపయ ఇతి, స్వాహా
సరస్వతీ, అబ్రవీ దిత్యర్థః। మంత్రమధ్యవర్తినాం స్వాహా
శబ్దానాం ప్రదానార్థత్వాభావాత్। వస్తుత శ్చ స్వాహాశబ్దస్య

వాక్కర్తృక వచనరూపేఽర్థే నిరుక్తత్వాత్ స్వా స్వకీయా
ప్రజాపతి సంబంధినీ వాక్, ఆహ అబ్రవీత్ ఇతి స్వాహా
శబ్దస్య అర్థ ఉక్తః। తథాచ తైత్తిరీయకే వాక్ప్రజాపత్యో
రుక్తిప్రత్యుక్తిరూపం వాక్యం ఏవం శ్రూయతే 'తం వాగ
భ్యవదత్ - త త్స్వాహాకారస్య జన్మ' ఇతి। అనంతరం
ద్యుపృథివ్యన్తరిక్షలోకేషు అస్మదీయం యజ్ఞం, ధాః
స్థాపయేతి సరస్వత్యాహేతి। తతః అస్మదీయం యజ్ఞం,
వాతే సర్వకర్మాధారే ధాః స్థాపయ। యస్మాత్ అయం
యజ్ఞః ప్రవృత్తః తస్మిన్నేవ వాతే స్థాపయ। వాతా
దధ్వర్యుః యజ్ఞం ప్రయుఙ్క్తే' (తై. బ్రా. 3-3-9-12)
ఇతి శ్రుతేః। 'మనసస్పతినా దేవేన వాతా ద్యజ్ఞః
ప్రయుజ్యతామ్' ఇతి చ (తై. బ్రా. 3-7-4-1)। స్వాహా
ఇదం ఆజ్యం స్వాహుత మస్తు ఇతి అంతిమ స్వాహాశబ్దస్య
ప్రదానార్థతా।" —సా. భా.

సర్వభూతాంతరాత్మయై మనస్సునుగూడ నియమించెడి యో దేవా! మా యీ యజ్ఞమును ద్యులోకమున నుండెడి అగ్న్యాదిదేవతలయం దుంచుము —అని స్వాహాదేవి యగు సరస్వతి యాదేశించుచున్నది. అట్లే పృథివ్యన్తరిక్షద్యులోకముల యందును, సర్వకర్మాధారభూతమగు వాతమునందును - అనగా సర్వ పరిస్పందాశ్రయభూతుడగు పరమేశ్వరుని యందును[1] — స్థాపింపుమని స్వాహాదేవి

1. 'మనస్పతినా మనసోఽపి పాలయిత్రా పరమాత్మనా దేవేన దీప్తిమతా వాతాత్ సర్వపరిస్పందాశ్రయాత్ ప్రాణాత్ ఈశ్వరస్యక్రియాశక్తిరూపాత్.
—భట్టభాస్కరః తై. బ్రా. 3-7-4-1.

'వాతః వాయుః సర్వపరిస్పందాశ్రయః క్రియాశక్తి రీశ్వరస్య'
భట్టభాస్కరః –తై బ్రా. 3-3-9-12.

యగు సరస్వతి యాదేశించుచున్నది. మనసస్పతియగు నా దేవునికై యీ హవిస్సు సుహుత మగు గాక — అని మంత్రార్థము.

ఈ మంత్రమున మంత్రమధ్యమునందును, మంత్రాంతమునందును స్వాహాశబ్దము గలదు. మంత్రమధ్య పతిత మగు స్వాహాశబ్దము హవిర్దాన వాచకము గాదు. అందుచే నా స్వాహాపదమునకు సరస్వతి యనియే యర్థము. 'స్వా స్వకీయా ప్రజాపతికిసంబంధినీ వాక్ అహ' యనెడి పూర్వోదాహృత శ్రుత్యుక్త నిర్వచనము ననుసరించి ప్రజాపతి స్వభూతమైన వాగ్దేవి లేక వేదవాక్కు పలికెను- అను నర్థమే యిట గ్రహింపవలెను. అనగా యజ్ఞమును, పైన చెప్పినట్లు, సర్వత్ర విలసిల్లజేయుట సరస్వతి యాదేశముగా గ్రహింపనగును. మంత్రాంతమున గల స్వాహా శబ్దము హవిర్దానవాచకము గూడ నగును. అందుచే నీ హవిస్సు సుహుతమగుగాక యని యర్థవివరణము శ్రీ సాయణులంచే జేయబడినది.

కావ స్వాహాశబ్దము వాఙ్నామములలో బఠింపబడుట యుక్తమే. ఇది యితర వాఙ్నామముల వలె కేవలము వాఙ్నామ మగుటయే గాదు: మహామహిమాన్వితమైన యొక మంత్రముగ గూడ నగుచు విలసిల్లినది. అందుచేతనే కొన్ని యెడల నే యితర వేదమంత్రము నుచ్చరింపకయే కేవలము స్వాహామంత్రోచ్చారణము జేయవలె ననెడి సంప్రదాయము శ్రుతులయందు గలదు. (వా. సం.7-2; మై. సం. 1-8-1; కా. సం. 4-13; ఐ. బ్రా. 7-2-3; శ. బ్రా. 2-2-1-4; తై. బ్రా. 2-1-2-3 మొ.)

పై గ్రంథసందర్భము ననుసరించి స్వాహా యనగా- 'మంత్రగత కల్యాణార్థ బోధకము, ప్రజాపతి స్వభూత వేదవాక్ప్రబోధరూపము, లేక వాగ్దేవతాప్రబోధ రూపము, ఆత్మతత్త్వ ప్రబోధకము, పరిదేవతావాచకము నగుచు దివ్యత్వము నాపాదించు హవిర్దానవాచక మగు మంత్రరాజము' -అని యర్థము. ఇట్టిది గనుగనే యెన్ని వాఙ్నామము లున్నను నిత్యనైమిత్తికకర్మలు, యాగాదికర్మలు నన్నియు స్వాహాకారపూర్వకమగు నాచమనక్రియతో నారంభ మగుచున్నవి.

ఇక శ్రుతి స్మృత్యనుగుణముగ స్వధాస్వరూపమును బరిశీలింతము.

# స్వధా

విధానం ధర్మాణాం ప్రథితప్రణిధానం రసజుషాం
నిధానం విద్యానాం విమలపరిధానం శ్రుతవతామ్।
సమాధానం బుద్ధేః ధన మిహ పరం నః ప్రవిమలం
స్వధాం దేవీం వందే వినుతగుణధాసీం బుధనుతామ్॥

స్వస్మిన్ దధానా హ్యఖిలం చ విశ్వం
స్వధాఽసి శక్తిర్జగతః పితుస్త్వమ్।
పత్నీ పితౄణాం వసు రుద్ర సూర్య
ప్రభా స్వధా పాహి హరిప్రియా నః॥

— వేదమాతృస్తవః.

స్వాహాదేవియే పితృయజ్ఞములందు స్వధారూపిణి యగుచున్నదని షడ్వింశ బ్రాహ్మణము చెప్పుచున్నది. (పితృయజ్ఞేషు స్వధాభూతా). కాన స్వాహాశబ్దమువలెనే స్వధాశబ్దము కూడ మహిమాన్విత మని తెలియును. దేవీ భాగవతముకూడా 'స్వాహా స్వధా నామ మన్త్రపభాషైః' అను శ్లోకమున నీ విషయము స్పష్టము చేసినట్లు పూర్వము వివరింపబడినది. 'పితృభ్యః స్వధాస్తు, పితృభ్యః స్వధా నమః' - అని పితరుల నుద్దేశించిన స్వధాకారము చేయబడు చుండును. ఇదియే పితరుల నుద్దేశించిన వషట్కారము (స్వధా నమ ఇతి వషట్కారః - శ. బ్రా. 2-6-1-24) అని చెప్పబడుచున్నది. ఇట్టి స్వధా స్వరూపమును బరిశీలింతము.

## స్వధా-భోగ్య వస్తుజాతరూప ప్రకృతి-పారమేశ్వర శక్తి (భోగ్య - భోక్తృ స్వరూపము) :-

స్వధా శబ్దమునకు సామాన్యముగ 'అన్నము' అను నర్థము ప్రసిద్ధము. అన్నమనియు, హవిర్లక్షణమగు అన్న మనియు మాత్రమేగాక, భోగ్యమగు వస్తుజాత మంతయు అన్న శబ్దముచే నుపలక్షిత మగుచుండును. అనగా నా యా యింద్రియములచే నుపభోగ్యమగు శబ్ద స్పర్శ రూప రస గంధాదిరూప విషయజాత మంతయు అన్నశబ్దముచే నుపలక్షితము. కాన భోగ్యవస్తుజాతమయ మగు ప్రకృతి యంతయు 'స్వధ' యగుచు అందు చేతనే ద్యావాపృథువులు రెండును స్వధారూపములుగ ప్రసిద్ధములైనవి (ఋ. 9-86-10). వైదిక నిఘంటువునందును 'స్వధే, పురంధీ' యనుచు ద్యావాపృథివీనామములలో స్వధా శబ్దము పఠింపబడినది. ఇంతేకాక ప్రకృతికి గారణభూతమగు పారమేశ్వర శక్తికి (మాయాశక్తి) స్వధ యని పేరు.

"తిరశ్చీనో వితతో రశ్మి రేషా మధః స్విదాసీ 3 దుపరి
స్వీదాసీ 3 త్ । రేతోధా ఆసన్ మహిమాన ఆసన్ స్వధా
అవస్తా త్ప్రయతిః పరస్తాత్ ।"

—ఋ. 10-129-5; వా. సం. 33-74; తై. బ్రా. 2-8-9-5.

ఇది 'నాస దాసీత్' సూక్తములోని మంత్రము. దీనికి బూర్వ మంత్రములందు అవిద్యా-కామ-కర్మలు సృష్టిహేతువులుగ వివరింప బడినవి. వీనిలో కర్మలకు కామము, కామమునకు అవిద్యయు గారణములు. అనగా జగత్సృష్టి హేతువు అవిద్య. ఈ యవిద్యయే మాయాశక్తి. ఈశక్తికే 'స్వధా'

అని పేరు స్వధాశబ్ద వాచ్యములైన ఈ మాయా - అవిద్యాది శబ్దములచే చెప్ప బడెడి యే పారమేశ్వరశక్తి కలదో యది జగత్తునకు అధమమగు (స్వధా అవస్తాత్) కారణము. అనగా స్వతంత్ర మగు కారణము కాదు. ఈ మాయా శక్తికి నాధారభూతుడగు పరమాత్మయే ప్రయతి (ప్రయతితా భోక్తా—సా. భా. ఋగ్భాష్య) భోక్తయు, మాయాధ్యక్షుడు నగు ఈ పరమాత్మయే జగత్తుకు నుత్తమకారణము (ప్రయతిః పరస్తాత్). ఇట్లు జగత్కారణభూతు లయిన శక్తి-పర మాత్మలే ప్రకృతిపురుష (భోగ్య-భోక్త)లని శాస్త్రములందు నిర్దేశింపబడుచున్నారు.

'ఏవం స్వధాశబ్దవాచ్య మాయాఽవిద్యాది శబ్దేనాభిధీయమానా పారమేశ్వరశక్తి రవస్తా దధమం కారణమ్। ప్రయతిః సా శక్తిః। ప్రయతతే యస్మిన్ పరమాత్మని సోఽయం శక్తి ప్రయత్నాధారః పరమాత్మా ప్రయతిః। స చ పరస్తాత్ పరమ ముత్తమం కారణమ్। తా వేతౌ శక్తిపరమాత్మానా వేవ జగత్కారణభూతౌ ప్రకృతిపురుషా వితి శాస్త్రేషు వ్యపదిశ్యేతే' —సా.భా.తై.బ్రా. (మా.వా.సం; ఉవట మహీధర భాష్యములు).

ఇంతే కాదు. ఈ సూక్తముననే రెండవ ఋక్కునందును సర్వ జగత్కారణ రూప మాయాశక్తిగా ఈ స్వధాశక్తి పేర్కొనబడినది.

"ఆనీ దవాతం స్వధయా త దేకమ్"

—ఋ. 10-129-2; తై.బ్రా. 2-8-9-4.

'స్వస్మిన్ ధీయతే ధ్రియత ఆశ్రిత్య వర్తత ఇతి స్వధా మాయా, తయా తద్ బ్రహ్మైక మవిభాగాపన్న మాసీత్'

—సా. భా. ఋగ్భాష్య.

ప్రళయకాలమున స్వధారూపిణి యగు మాయాశక్తి బ్రహ్మ నాశ్ర యించి యుండి యా బ్రహ్మకంటె వేఱుగాక, బ్రహ్మతో నవిభాగా పన్నమై

యుండెను. అనగా బ్రహ్మతత్త్వము మాయతో నవిభాగాపన్నమై ప్రాణితమై (ఆనీత్ అవాతం) యుండె నని భావము. ఈశ్రుత్యర్థమే శతశ్లోకియందు శ్రీ శంకరభగవత్పాదులచే నిట్లు వివరింపబడినది.

"అప్రాణం శుద్ధ మేకం సమభవ దథ త న్మాయయా కర్తృసంజ్ఞమ్।
తస్మా దన్యచ్చ నాసీత్ పరివృత మజయా జీవభూతం తదేవ॥"

—శతశ్లోకి 24

పై శ్రుతియందలి 'స్వధా' శబ్దము 'మాయయా - అజయా' అను శబ్దములచే నిట వివరింపబడుట గమనార్హము. కనుక పై శ్రుతివాక్యముల ననుసరించి పరమేశ్వరుడు భోక్తయు, పురుషుడు ననియు, స్వధ యనగా జగత్కారణ మగు పరమేశ్వరశక్తి యనియు నంతేగాక తత్కార్యము, భోగ్యజాత రూపము నగు ప్రకృతి యనియు దెలిసినది. 'స్వస్మిన్ ధీయతే ధ్రియత ఆశ్రిత్య వర్తత ఇతి స్వధా' అను నిర్వచనము ననుసరించి ఆత్మయందు, లేక పరమాత్మయందు ఆశ్రయించి యుండునది యని యర్థము దీని ననుసరించి బ్రహ్మ నమసరించి యుండి, తదభిన్నమై యొప్పునది యనెడి పై శ్రుత్యర్థమే సంగ్రహముగ నిరూపితమగుచున్నది.

## స్వధా - భోక్త లేక పరమేశ్వరుడు :-

భోగ్యజాతరూపమగు ప్రకృతిగాని, లేక తత్కారణమగు మాయాశక్తిగాని తదధిష్ఠానరూపుడును చిద్రూపుడు నగు ఏ బ్రహ్మ నాశ్రయించి వరలుచుండునో ఆ బ్రహ్మయు స్వధాశబ్ద వాచ్య దగుట శ్రుతులయందు బ్రసిద్ధమే.

"త్రిధా హితం పణిభి ర్గుహ్యమానం గవి దేవాసో ఘృత
మన్వవిందన్। ఇంద్ర ఏకగ్ం సూర్య ఏకం జజానా వేనా
దేకగ్ం స్వధయా నిష్టతక్షుః।" తై. ఆ. 10-10-3.

'చత్వారి శృంగా త్రయో అస్య పాదా' -అనునది దీని పూర్వమంత్రము. దానిచే ప్రణవము యొక్క స్వరూపమును, ఈ మంత్రముచే తత్ప్రీతి పాదార్థ్యమును ప్రవచింపబడినది. ఈ మంత్రమునందలి 'ఘృత' శబ్దముచే స్వప్రకాశాత్మకమగు బ్రహ్మతత్త్వము చెప్పబడుచున్నది. ఆ బ్రహ్మతత్త్వము శరీరమున 'విశ్వ తైజస-ప్రాజ్ఞ' రూపముననను, బ్రహ్మాండమున 'విరాట్- హిరణ్యగర్భ-అవ్యాకృత' తత్త్వరూపముననను -ఇట్లు త్రివిధముగ విలసిల్లుచుండును (త్రిధాహితం). ఇట్టి తత్త్వమును సాత్త్వికులై, యంతర్ముఖులై, దివ్యశక్తి సంపన్నులైన పురుషులు వేదాత్మిక యగు గోవునందు అనగా వేదవాక్కునందు దర్శింతురు. (గవి దేవాసో ఘృత మన్వవిందన్). ఇట్టి బ్రహ్మతత్త్వరూపమగు ఘృతము దుర్జ్ఞేయము; శ్రోతలు లేక ఉపదేష్టలు నగు ఆచార్యులు ఈ ఘృతమును గాపాడుచుందురు (పణిభిః గుహ్యమానం). అనగా గురూపదేశైకలభ్య మని యర్థము.

ఇంద్రుడనగా నిట పరమైశ్వర్యయుక్తు డగు విరాట్పురుషుడు. సూర్యుడన నిట హిరణ్యగర్భుడు. వేను డనగా సర్వదుఃఖరహితము, కమనీయము నగు అవ్యాకృత - ఈశ్వరతత్త్వము. వీరిలో ఇంద్రుడు జాగరణమునకును, సూర్యుడు స్వప్నమునకును, వేనుడు సుషుప్తికిని గారకులు. కాని యీ ముమ్వురును ఈజాగ్రత్స్వప్నసుషుప్తులకు స్వతంత్రముగా కారకులు. ఇట స్వధా యన, చిద్రూపుడగు (చైతన్యరూపుడగు) బ్రహ్మ యని యర్థము. అట్టి స్వధచే చిద్రూపుడగు బ్రహ్మచే నావిష్టుడై ఈ యింద్ర-సూర్య-వేనులు జాగ్రత్స్వప్న సుషుప్తులను రూపొందించుచున్నారు (స్వధయా నిష్టతక్షుః) -అని యర్థము. ఇందలి స్వధాశబ్దమిట్లు నిర్వచింపబడినది.

"స్వస్మిన్నేవ ధీయతే ఉవస్థాప్యత ఇత్యాశ్రయాంతర రహితా బ్రహ్మరూపా చిత్ స్వధా శబ్దేనోచ్యతే, 'స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని 'ఇతి శ్రుత్యంతరాత్ । తయా స్వధయా బ్రహ్మరూపయా చితా' —సా.భా.

కాన పై నిర్వచనము ననుసరించి 'స్వధా' యన 'తనయందే ప్రతిష్ఠితమై యుండునది; అనగా ఆశ్రయాంత రహితము అని యర్థము. ఆశ్రయాంతరరహితుడు బ్రహ్మయే. అందుచే స్వధాశబ్దవాచ్యుడైనాడు. 'స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని' అను శ్రుత్యర్థమే యిట స్వధాశబ్ద నిర్వచనము ద్వారా ప్రదర్శింపబడినది.

ఇట్లు స్వప్రతిష్ఠితుడగుటచేతనే పరమేశ్వరుడు 'స్వధృతః' అనియు గీర్తింపబడినాడు. "స్వేనైవ ఆత్మనా ధార్యత ఇతి స్వధృతః, 'స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని' ఇతి శ్రుతేః"

—శం.భా; విష్ణుసహస్రనామస్తోత్రమ్.

కాగా, భోగ్యము–భోక్త; ప్రకృతి-పురుషుడు; లేక శక్తి –శక్తి మంతుడు– ఇరువురును స్వధారూపులు, లేక స్వధాశబ్దవాచ్యులు నగుదురని తెలిసినది. జగత్కారణభూతులగుటచే 'జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ' – అని యారీతిగ వీరిరువురు జగత్పితరులుగ బ్రసిద్ధులైనారు.

## స్వధా - త్రయీవిద్య :-

ఆశ్రయాంతరరహితుడై జగత్ప్రతిష్ఠా హేతువైన బ్రహ్మ స్వధాశబ్ద వాచ్యుడయినట్లు. ఆశ్రయాంతర రహితమై జగత్ప్రతిష్ఠాహేతువై స్వతఃప్రమాణమై విరాజిల్లు వేదవిద్యలు (చూ. ప్రతిష్ఠా శబ్దము) పై 'స్వస్మిన్ ధీయతే' -యను నిర్వచనము ననుసరించి స్వధాశబ్దవాచ్యము గూడ నగును.

"యా మైరయం శ్చంద్రమసి స్వధాభిః" —వా. సం. 1-28.

'స్వధాశబ్దో యద్యప్యన్నవాచీ, తథాప్యత్రాన్నహేతుభూతా వేదత్రయీ కథ్యతే। యాం చంద్రమసి బ్రహ్మణా దధుః (శ. బ్రా 1-2-5-19) ఇతి శ్రుతేః'

—మహీధరభాష్య (చూ. ఉపటభాష్య).

ఈ వాజసనేయశ్రుతి యందలి 'స్వధాభిః' యనుపదమును శతపథశ్రుతి 'బ్రహ్మణా' యని వివరించినది. బ్రహ్మ యన వేదము. కాన నిట స్వధ (స్వధాభిః) యన త్రయీవిద్య యని వివరింపబడినది. ('బ్రహ్మణా మంత్రేణ-ఏతచ్చ స్వధాభి రిత్యస్య వ్యాఖ్యానమ్') — సా. భా. శ. బ్రా. 1-2-5-19.

కనుక నిట్లు వేదవిద్యయు, తత్ప్రతిపాద్యుడగు బ్రహ్మయు—ఇరువురును గూడ స్వధాశబ్దవాచ్యు లగుట గమనార్హము. వేదవాణియు తత్ప్రతిపాద్యుడగు బ్రహ్మయు నిరువురును గూడ వేద, బ్రహ్మ, ఋషి, స్వాహా శబ్దవాచ్యులగుటయు గాననగును.

## అగ్ని వాయు సూర్యులు (వసు-రుద్ర-ఆదిత్యులు) పితరులు; స్వధారూపులు :-

జగత్పిత యయిన పరమేశ్వరు నాజ్ఞానువర్తులై లోకయాత్రను నిర్వహించెడి అగ్ని – వాయు – సూర్యులు పితరు లని శ్రుతులందు ప్రసిద్ధము.

"తిస్రో మాతౄ స్త్రీన్ పితౄన్ బిభ్ర దేక ఊర్ధ్వ స్తస్థౌ"

— ఋ. 1-164-10.

ఈ ఋక్కునందు జగత్పాలకులును, లోకత్రయాభిమానులు నగు అగ్ని - వాయు - సూర్యులు మువ్వురు పితరులుగను, సస్యవృష్ట్యాదుల బెంపొందింపజేయు భూ ర్భువః సువర్లోకములు మూడును మాతలుగను నిర్దేశింపబడినవి. ఈ మాయపితరులను అద్వితీయుడు నసహాయుడు నగు పరమేశ్వరుడు భరించుచున్నట్లును, అతడీ ముల్వురికంటె నతీతుడై యూర్ధ్వముగ నున్నట్లును (బిభ్ర దేక ఊర్ధ్వ స్తస్థౌ) ఇట చెప్పబడినది.

అగ్ని వాయు సూర్యులు లోకత్రయాభిమానదేవతలు. ఈ విషయమును బృహద్దేవత యిట్లు తెల్పుచున్నది.

"వ్యాహృతీనాం సమస్తానాం దైవతం తు ప్రజాపతిః :
వ్యస్తానా మయ మగిం శ్చ వాయుః సూర్య శ్చ దేవతా ॥"

— బృ. దే. 2-124.

'భూః-భువః-స్వః' - అను నీ మూడును వ్యాహృతులు. సమిష్టిగ నీ మూడింటికి ప్రజాపతి దేవత. వ్యష్టిగ వీనికి అగ్ని వాయు సూర్యులు క్రమముగ దేవతలు, లోకత్రయపాలకు లగుటచే నీ ముప్పురును పితరులుగ పై ఋక్కునందు జెప్పబడిరి పితరులగు నీ అగ్ని వాయు సూర్యులు 'స్వధా' రూపులుగను ఋగ్వేదమున నిట్లు కీర్తింపబడుచున్నారు.

"త్రిభిః పవిత్రై రపుపో ద్ధ్యర్కం హృదా మతిం జ్యోతి
రను ప్రజానన్ । వర్షిష్ఠం రత్న మకృత స్వధాభి రాది ద్ద్యావా
పృథివీ పర్యపశ్యత్ ॥ — ఋ 3-26-8.

ఇయ్యది 'అగ్ని రస్మి జన్మనా జాతవేదాః' (చూ. వేదశబ్దము) అను మంత్రము తరువాతిది పరతత్త్వమును సాక్షాత్కరించుకొనిన యగ్ని ముక్త పురుషుడై తన సర్వాత్మకత్వానుభవమును ఆవిష్కరించుకొనుట యిట వివరింపబడినది. (అగ్న్యద్వైతవాదినీ త్రిష్టుప్ - మహీధరః).

అగ్నివాయుసూర్యులు జగత్పావనులు, కాన పవిత్రులు. పవిత్రులగు నీ ముప్పురికంటెనుగూడ వారిచే అర్చనీయుడగు ఆత్మను అతి పవిత్రునిగా ముక్తపురుషుడైన అగ్ని దర్శి చెను. ఇట్లు దర్శించిన అగ్ని యత్యుత్తమ మగు స్వాత్మరూపమును స్వధారూపులయిన అగ్ని వాయు సూర్యులచే రమణీయ ముగ నొనర్చెను (రత్న మకృత స్వధాభిః) అనగా నగ్ని వాయు సూర్యులు ఆత్మస్వరూప మగు జగత్తునందు భోగ్యజాతమును ప్రవర్తింప జేసి రమణీయ ముగ నొనర్చి రని భావము 'యస్మిన్ జ్ఞాతే సర్వం జ్ఞానం భవతి' - ఆత్మ స్వరూపము దెలిసినంత నే సర్వము దెలియబడగనే, ఆ యాత్మయందు ప్రతిష్ఠిత మైన ద్యావాపృథివ్యాత్మకమగు (స్థూల సూక్ష్మ) జగత్తు నంతయు స్వాత్మరూపముగ నగ్ని దర్శించెను-అని యర్థము

ఈ మంత్రమున అగ్ని వాయు సూర్యులు జగత్పావను లగుటచే బవిత్రులుగను, భోగ్యజాతమును ప్రవర్తింప జేసి ముల్లోకముల ధరించు వారగుటచే స్వధారూపులుగను గీర్తింపబడినారు. ఈకారణము చేత నే అగ్ని-ఇంద్రాదులు 'స్వధావాన్, స్వధాపతిః స్వధావః'-అనియీ రీతిగ శ్రుతులయందు బ్రసిద్ధులయినారు (ఋ. 1-95- ; 1-173-6; 1-63-6; 1-36-12;6-44-1,3 మొ.)

'స్వధాభిః, స్వేన లోకాన్ దధాతీతి స్వధా, తైః
అగ్నివాయుసూర్యైః' —సా. భా.

ఆత్మచే, లేక పరమాత్మచే బ్రేరితులయి లోకముల ధరించువారు- అని యర్థము. ఇట్లు స్వధారూప భోగ్యజాతమయ మగు లోకత్రయమును బాలించెడి పితరులగు అగ్నివాయు సూర్యులును స్వధా రూపులుగ బ్రసిద్ధులయినారు. అనగా 'భోగ్యము -భోక్త' - ఇరువురును స్వధారూపులు లేక స్వధాశబ్దవాచ్యులగుట గమ నార్హము.

అగ్ని వాయు సూర్యులు వేదత్రయాత్మకు లగుట శ్రుతి ప్రసిద్ధమే (చూ. భారతీశబ్దము). అందుచేగూడ స్వధారూప వేదాత్మకు లగుటచే గూడ నీ ముప్పురును స్వధారూపు లగుటయు దెలియనగును.

## స్వధా - జీవుని భోగము ; భోగాయతనమగు శరీరము :.

"అపాఙ్ ప్రాఙేతి స్వధయా గృభీతోఽమర్త్యో
మర్త్యేనా సయోనిః" — ఋ. 1-164-38; నిరు. 14-23.

ఆత్మ లేక జీవుడు మరణధర్మము లేనివాడు. భూతాత్మకమగు దేహము మరణధర్మము గలది. అయ్యును జీవుడు దేహముతోపాటు సమానస్థానము గలవాడు, లేక సమానోత్పత్తి గలవానివలె నొప్పుచున్నాడు. (అమర్త్యో మర్త్యేన సయోనిః) మఱియు నమర్త్యుడగు నీ జీవుడు స్వధావశుడై, అనగా స్వకర్మవశుడై లేక భోగాయతన శరీరాభిమానియై (స్వధయా గృభీతః) అశుభకర్మ నాచరించి యధోగతి నొందును. (అపాఙ్ ఏతి); పుణ్యకర్మల నాచరించి యూర్ధ్వగతి నొందును. (ప్రాఙ్ ఏతి) - అని యర్థము.

'స్వధయా అన్నోపలక్షిత తద్భోగేన గృభీతః। యద్వా
స్వధాశబ్దేన అన్నమయం శరీరం లక్ష్యతే, తేన గృహీతః
సన్' — సా. భా.

ఇట స్వధాశబ్దము స్వకీయభోగమునకును, అన్నమయ శరీరమునకు నుపలక్షక మని చెప్పబడినది భోగమునకుగాని, శరీరమునకు గాని స్వధ (అన్నము) నిమిత్త మగుటచే స్వధాశబ్దము వాని నిట నుపలక్షింప జేయుచున్నది. జీవుడు స్వధాగృహీతుడై జీవించుటను గూర్చి ఋగ్వేదము మఱియొక ఋక్కున నిట్లు చెప్పుచున్నది.

"జీవో మృతస్య చరతి స్వధాభి రమర్త్యో మర్త్యేనా సయోనిః"

— ఋ. 1-164-30.

అమర్త్యుడగు జీవుడు మర్త్యమగు దేహముతో సమానస్థానము లేక ఉత్పత్తి గలవాడై, మృతదేహమును విడిచి స్వధలతో జరించుచుండును. అనగా 'స్వ విద్యాకర్మల' ననుసరించి చరించును; పుత్రాదిదత్తములగు స్వధలతో హవిస్తర్పణములతో దృప్తుడై చరించుచుండు ననియు నర్థము. కావున జీవుని యాతాయాతమునకు గారణము స్వధలు. అవి యేవి ? అవి జీవుని వెంట నంటి వచ్చు విద్యాకర్మలు, పూర్వప్రజ్ఞయు నగును. ఈ విషయమును బృహదారణ్యక శ్రుతి యిట్లు వివరించుచున్నది.

"తం విద్యాకర్మణీ సమన్వారభేతే, పూర్వప్రజ్ఞా చ"

— బృ. ఉ. 4-4-?.

"తం పరలోకాయ గచ్ఛంత మాత్మానాం, విద్యాకర్మణీ ....
విద్యా సర్వప్రకారా విహితా ప్రతిషిద్ధా చ, అవిహితా ఽ
ప్రతిషిద్ధా చ, తథా కర్మ విహితం ప్రతిషిద్ధం చ, అవిహిత
మప్రతిషిద్ధం చ, సమన్వారభేతే సమ్యగన్వారభేతే అన్వా
లభేతే అనుగచ్ఛతః, పూర్వప్రజ్ఞా చ పూర్వానుభూత విషయా
ప్రజ్ఞా, అతీత కర్మఫలానుభవవాస నేత్యర్థః। సాచ వాసనా
ఽపూర్వకర్మారంభే కర్మవిపాకే చాంగం భవతి। తేనాఽసా
వన్వారభతే .... తస్మా దేత త్త్రియం శాకటికసంభార
స్థానీయం పరలోకపథ్యదనం విద్యాకర్మ పూర్వప్రజ్ఞాఖ్యమ్।"

— శం. భా.

శరీరమునుండి యుత్క్రమించు జీవునివెంట యాత దార్జించిన విద్యాకర్మలు రెండును ననుగతము లగుచుండును. విద్య యనగా 'శాస్త్రవిహితము, అవిహితము, శాస్త్రనిషిద్ధము, అనిషిద్ధము' నగు విద్య యని యర్థము. అట్లే కర్మ యనగా 'శాస్త్రవిహితము, అవిహితము, శాస్త్రనిషిద్ధము, అనిషిద్ధము' నగు

కర్మ యని యర్థము ఇట్టి విద్యాకర్మలు రెండును జీవుని ననుగమించుచుండును. ఇంతే కాదు. పూర్వప్రజ్ఞయు ననుగమించును. పూర్వప్రజ్ఞ యనగా పూర్వానుభూత విషయమైన ప్రజ్ఞ యని యర్థము. అనగా నతీత కర్మ ఫలానుభవ వాసన. ఇట్టి యపూర్వప్రజ్ఞ, లేక వాసన (సంస్కారము) అనుగత మగుచుండుట చేతనే జీవుడు నూతన శరీరముల దాల్చి పూర్వానుభూత విద్యా సంస్కార బలముచే వివిధ విద్యలయందు (గాన, చిత్రకర్మాది విద్యలందును) ఎక్కువ యభ్యాసము లేకయే కౌశలము గల్గి యుండుటయు, లేక ఎన్ని సౌకర్యము లున్నను ఎంత యభ్యాస మొనర్చినను కౌశలము గడింపలేక పోవుటయు సంభవించుచున్నది కాన వాసనా వైచిత్ర్యమే యా యా కర్మలయందు ప్రవృత్తికి, నివృత్తికిని గారణము కాగా 'విద్యా-కర్మ-పూర్వప్రజ్ఞ'లను నీ మూడును జీవుని అనుగమించు చుండునని భావము.

ఈ బృహదారణ్యక శ్రుతి ననుసరించి పై రెండు ఋక్కులలోని 'అమర్త్యః స్వధయా గృభీతః; జీవః మృతస్య చరతి స్వధాభిః' అను వాక్యములకు జీవుడు 'విద్యా–కర్మ-పూర్వప్రజ్ఞ' లనెడి స్వధలతో భోగ శరీరముతో ఊర్ధ్వాధో లోకముల జరించుచుండు ననియే తాత్పర్యమును గ్రహింపనగును.

## జీవేశ్వరులు - స్వధాశక్తి:-

ఇట గమనింపవలసిన యంశములు గలవు.

ఆశ్రయాంతర రహితుడగుటచే పరమేశ్వరునకు స్వధ యని పేరు. అట్లే ఆశ్రయాంతర రహితమైన స్వతఃప్రమాణమై పరమేశ్వరునియందు ప్రతిష్ఠితమై యుండెడి త్రయీవిద్యకును స్వధ యని పేరు. పరమేశ్వరాధిష్ఠితమై విలసిల్లెడి ప్రకృతికిని, మాయాశక్తికిని స్వధ యని పేరు. కాన భోక్తయు, పురుషుడునగు పరమేశ్వరుడును, భోగ్యవస్తుజాతమయమగు ప్రకృతియు, పరమేశ్వరశక్తియు,

సృష్టికార్యమునందు పరమేశ్వరునకు సహకారిణియై విలసిల్లు త్రయీవిద్యయు, అగ్ని వాయు సూర్యులు - అంతయు స్వధారూపమే యగుట దర్శించితిమి.

కాని ప్రకృతికి లేక మాయాశక్తికి, లేక త్రయీవిద్యకును గల స్వధాత్వము వేఱు పురుషుడును భోక్తయునగు పరమేశ్వరునకు గల స్వధాత్వము వేఱు కావచ్చును. ప్రకృతిగాని, మాయాశక్తిగాని, త్రయీవిద్యగాని, అగ్ని వాయు సూర్యులుగాని పురుషుని (పరమేశ్వరుని) కంటె అనన్యము లగుటచే పురుషుని యందు గల స్వధాత్వము వీనియందును ననుగత మగుచుండునని గ్రహింపనగును. కాన వీనియందు గల భిన్న భిన్న స్వధాత్వముల దర్శించుచు, వీని యందనుగతమై యనువృత్త మగుచుండు స్వధాత్వమును (స్వప్రతిష్ఠితత్వమును) దర్శింపవలెను. అనగా వీనియం దనుగతమగుచుండెడి స్వధారూప బ్రహ్మతత్త్వమును దర్శింపవలసి యున్నది. ఆపుడే దీనికి గల స్వధాత్వము పరమేశ్వరుని స్వధాత్వము కంటె భిన్నము గాదని తెలియును.

మరియొక విశేషము ; చిద్రూపుడైన పరమేశ్వరుడు స్వధా (మాయా) గృహీతశరీరుడై వసురుద్రాదిత్యరూపములతో (స్వధలతో) స్వాత్మరూపమగు జగత్తును రమణీయమొనర్చి (త్రిభిః పవిత్రైః .... రత్న సం కృత స్వధాభిః) చరించుచున్నాడు. అట్లే అమర్త్యుడగు జీవుడును స్వధాగృహీతశరీరుడై కర్మ-విద్యా-పూర్వప్రజ్ఞలతో (స్వధలతో) జరించుచున్నాడు. (స్వధయా గృహీతః స్వధాభిః చరతి). కాని యిట భేదము గలదు. 'పరమేశ్వర వశవర్తినియైన స్వధ సృష్టిస్థితిలయములకు గారణము జీవుడు. స్వధా (అవిద్యావశుడై స్వకర్మాను గుణముగ) నూర్ధ్వాధోలోకముల నొందుచు జరించుచున్నాడు' - అని గ్రహింప దగును.

అగుచో నిట్లు స్వకర్మ పరవశులయి యూర్ధ్వాధోలోకముల బరిభ్రమించెడి జీవులు పితృదేవత లెట్లగుదురు ? శ్రాద్ధాదులచే నెట్లు తృప్తులగుదురు ? తామే

యశక్తులగుచు వారు పుత్రాదుల నెట్లు తరింప జేయగలరు ? - ఈ విషయముల బరిశీలింపవలసి యున్నది.

## వసురుద్రాదిత్యులు - పితృపితామహప్రపితామహులు :-

భూర్భువస్సువర్లోకపాలకు లగు అగ్ని వాయు సూర్యులు పితరులనియు స్వధారూపులనియు బూర్వము చెల్పబడినది. ఈ అగ్ని వాయు సూర్యులే వసురుద్రాదిత్యరూపులు (చూ. భారతీశబ్దము). వీరే శ్రాద్ధదేవులగు పితరులు.

"వసురుద్రాదిసుతాః పితరః శ్రాద్ధదేవతాః ।
ప్రీణయన్తి మనుష్యాణాం పితౄన్ శ్రాద్ధేన తర్పితాః ॥
ఆయుః ప్రజాం ధనం స్వర్గం మోక్షం సుఖాని చ ।
ప్రయచ్ఛన్తి తథా రాజ్యం ప్రీతా నృణాం పితామహాః ॥

— యాజ్ఞ. స్మృ. 1-10-69, 70; అగ్ని. పు. 163-40, 41.

వసురుద్రాదిత్యులు [శ్రాద్ధదేవతలగు పితరులు, శ్రాద్ధముచే తర్పితులై వీరు మనుష్య పితరులను తృప్తి నందింతురు. మఱియు నీ వస్వాది పితరులు ప్రీతులగుచో ఆయుష్య ప్రజాధనాది ఫలములను, స్వర్గ మోక్ష సుఖములను నొసగుదురు 1 — అని యర్థము.

1. విజ్ఞానేశ్వరీయమ్ - న హ్యత్ర దేవదత్తాదయ ఏవ శ్రాద్ధకర్మణి సంప్రదాన భూతాః పిత్రాది శబ్దై రుచ్యన్తే, కింత్వధిష్ఠాతృ వస్వాది దేవతా సహితా వవ। యథా దేవదత్తాది శబ్దై ర్న శరీరమాత్రాది, నా ప్యాత్మ మాత్రం, కింతు శరీర విశిష్టా ఆత్మానా ఉచ్యన్తే, ఏవ మధిష్ఠాతృ దేవతా

స్వకృతములగు శుభాశుభకర్మల ననుసరించి స్వర్గనరకాదుల బొందు చుండెడి మనుష్య పితరులు పుత్రాదులచే నొసగబడెడి యన్నపానాదులచే నెట్లు తృప్తి నొందుదురు? తృప్తి నొందినను అశక్తు లగుటచే వారు పుత్రాదులకు స్వర్గాది ఫలముల నెట్లీయగలరు? — అను శంకలకు సమాధానములుగ పై స్మృతి వచనములు ప్రవర్తిల్లినవి.

శ్రాద్ధకర్మయందు ఉద్దిష్టులగు పితరులు (సంప్రదానభూతాః) మనుష్య పితరులే. కాని వారు వసురుద్రాదిత్యరూపులుగ నర్చింపబడుచుందురు. ఇది సంప్రదాయము. అనగా మనుష్యపితరులగు దేవదత్తాదులు మాత్రమే. యిట పితృ శబ్దముచే గ్రహింపబడుట లేదు. దివ్య పితరులను శ్రాద్ధదేవులు నగు వసు–

సహితా ఏవ దేవదత్తాదయః పిత్రాది శబ్దై రుచ్యన్తే। అత శ్చాధిష్ఠాతృ దేవతా వస్వాదయః పుత్రాదిభి ర్దత్తే నాన్నపానాదినా తృప్తాః సన్త స్తా నపి దేవదత్తాదీం స్తర్పయన్తి, కర్త్రూం శ్చ పుత్రాదీన్ ఫలేన సంయోజయంతి। యథా మాతా గర్భపోషణా యాన్య దత్తేన దోహదాన్న పానాదినా స్వయ ముపభుక్తేన తృప్తా సతీ స్వ జఠరగత మప్యపత్యం తర్పయతి, దోహదాన్నాది ప్రదాయిన శ్చ ప్రత్యుపకారఫలేన సంయోజయంతి తద్వి ద్వసవో రుద్రా అదితిసూతాః ఆదిత్యా ఏవ యే పితరః పితృ–పితామహ-ప్రపితామహ శబ్దవాచ్యాః న కేవలం దేవదత్తాదయ ఏవ శ్రాద్ధ దేవతాః శ్రాద్ధ కర్మణి సంప్రదానభూతాః కింతు మనుష్యాణాం పితౄన్ దేవదత్తాదీన్ స్వయం శ్రాద్ధేన తర్పితా స్తర్పయన్తి జ్ఞానశక్త్యతిశయయోగేన. కించ న కేవలం పితౄం స్తర్పయన్తి అపి తు శ్రాద్ధ కారిభ్యః ఆయుః—రాజ్యం చ శాస్త్రోక్త మన్యదపి ఫలం స్వయం ప్రీతాః పితామహాః వస్వాదయః ప్రయచ్ఛంతీతి।

రుద్ర-ఆదిత్యులచే నధిష్టితులగు దేవదత్తాదిరూప మనుష్యపితరులే యిట పితృ క్రియలయందు 'పితృ' శబ్దముచే గ్రహింపబడుచున్నారు.

లోకమున దేవదత్తాది శబ్దములచే కేవలము శరీరముగాని, కేవలము ఆత్మగాని గ్రహింపబడక శరీరవిశిష్టమగు నాత్మయే వ్యవహారమున గ్రహింపబడు చున్నది. అట్లే అధిష్ఠాతృ దేవతాసహితులగు దేవదత్తాది మనుష్యపితరులే యిట పితృ-పితామహ - ప్రపితామహ శబ్దములచే గ్రహింపబడుచుందురు. అధిష్ఠాతృ దేవతలగు వస్వాదులు పుత్రాదులచే నొసగబడెడి హవిస్తర్పణాదులచే తాము తృప్తులగుచు దేవదత్తాది మనుష్యపితరుల దృప్తి నొందింతురు; కర్తలగు పుత్రాదులకు ఆయుఃప్రజాది వివిధ ఫలముల నొసగుచుందురు.

గర్భపోషణకై యితరులచే నొసగబడెడి దోహదాన్నపానాదులచే దాను తృప్తి జెందుచు తల్లి స్వగర్భస్థశిశువును గూడ తృప్తి నొందించును. గర్భ దోహదమునకై యన్నపానాదుల నొసగిన యితరులను ప్రత్యుపకారాదులచే దృప్తి నొందించును. అట్లే దివ్యపితరులగు వసురుద్రాదిత్యులును తమయం దధిష్ఠితులయి యున్న మనుష్యపితరులను తృప్తి నొందించి కర్తలగు పుత్రాదులకు ఆయుః ప్రజాది ఫలముల నొసగుదురు.

మను-దేవల-శాతాతప స్మృతులును పితృ పితామహ ప్రపితామహులను వసురుద్రాదిత్యులకంటె నభిన్నులుగ దర్శింపవలెనని యిట్లు జెప్పుచున్నవి.

"వసవః పితరో జ్ఞేయా రుద్రా జ్ఞేయా పితామహాః ।
ప్రపితామహా స్తథాऽదిత్యాః శ్రుతి రేషా సనాతనీ ॥

"వసూన్ వదన్తి పితౄన్ య ద్రుద్రాంశ్చైవ పితామహాన్ ।
ప్రపితామహాం స్తథాదిత్యాన్ శ్రుతి రేషా సనాతనీ ॥"

— మను. 3-284.

'యస్మాత్ పిత్రాదయో వస్వాదయ ఇతి ఏషా మనాదిభూతా శ్రుతి రస్తి' అతః పితౄన్ వస్వాఖ్యదేవాన్, పితామహాన్ రుద్రాన్, ప్రపితామహా నాదిత్యాన్ మన్వాదయో వదన్తి। తతశ్చ సిద్ధబోధనపరై ర్యర్థాత్ శ్రాద్ధే పిత్రాదయో వస్వాది రూపేణ ధ్యేయా ఇతి విధిః కల్ప్యతే, అతఏవ పైఠీనసిః– 'య ఏవం విద్వాన్ పితౄన్ యజతే వసవో రుద్రా ఆదిత్యా శ్చాస్య ప్రీతా భవన్తి ఇతి.' — బాలంభట్టవ్యాఖ్య.

పిత్రాదులు వసురుద్రాదిరూపు లని యనాదిశ్రుతి జెప్పుచున్నది. అందుచే మన్వాదులు నట్లే చెప్పుచున్నారు. కాన మన్వాదుల ననుసరించి పిత్రాదులను వస్వాదులుగ దర్శింపవలె ననెడి విధి యనాదిశ్రుతిసిద్ధ మని తెలియును. పితరుల నర్చించుచో వసురుద్రాదిత్యులు నర్చితులై ప్రీతు లగుదు రని పైఠీనసియు జెప్పుచున్నాడు—అని యర్థము.

హేమాద్రి (చతుర్వర్గచింతామణి) యందును శ్రాద్ధమునం దుద్దిష్టులగు పితరు లెవరు? వస్వాదులా? లేక మనుష్యపితరులా? వీరికి సముచ్చయమా? లేక వికల్పమా?' - ఇత్యాది విషయము లన్నియు విపులముగ చర్చింపబడినవి. వివిధ స్మృతి పురాణ వచనములకు సమన్వయము జూపి, యివి యన్నియు నభేద దృష్టిని బోధించు వచనములే - యని నిర్ణయము చేయబడినవి.

1. నంది పురాణమున బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పితృ పితామహ ప్రపితా మహరూపులుగ జెప్పబడిరి.

"విష్ణుః పితాఽస్య జగతో దివ్యో యజ్ఞః స ఏవ చ।

బ్రహ్మా పితామహో జ్ఞేయో హ్యహం చ ప్రపితామహః॥"

భవిష్య పురాణమున నిట్లు గలదు.

"అభేదదృష్టివిధయో వై తే। అయం తు పక్షః సిద్ధాన్తతయాఽ-
భ్యుపగంతుం న్యాయ్యః। అయ మేవ హ్యాచారే దృశ్యతే।
అయ మేవ హి సర్వేషాం విశ్వరూపాదీనాం సమ్మతః।
అయ యేవ హ్యానవద ః"

— హేమాద్రి - శ్రాద్ధకల్ప - దేవతానిర్ణయ ప్రకరణమ్.

పై యాజ్ఞవల్క్య' మను, దేవతాది స్మృతి వచనముల ననుసరించే నిర్ణయసింధుకర్తయు (కమలాకరభట్టు) 'తదభేద ధ్యానార్థమ్' - అనియే యనినాడు. కనుక పితృ-పితామహ-ప్రపితామహులను వసు-రుద్ర-ఆదిత్యులకంటె నభిన్నులుగ

"అనిరుద్ధః స్వయం జ్ఞేయః ప్రద్యుమ్న శ్చ పితా స్మృతః।
సంకర్షణ స్తజ్జనకో వాసుదేవ స్తు తత్పితా ॥"

అనిరుద్ధుడు స్వయంకర్త. ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవులు పితృ పితామహ ప్రపితామహులు — అని యర్థము.

"ప్రథమో వరుణో జ్ఞేయః ప్రాజాపత్య స్తథాఽపరః।
తృతీయోఽగ్నిః స్మృతః పిండో హ్యేష పిండవిధిః స్మృతః॥"

వరుణ-ప్రాజాపత్య-అగ్నులు పిండరూపులగు పితృపితామహ ప్రపితామహులు - అని యర్థము.

ఆదిత్య పురాణమున మాస - ఋతు - సంవత్సరములు పితృపితామహ ప్రపితా మహులని చెప్పబడినది.

"మాసా శ్చ పితరో జ్ఞేయా ఋతవ శ్చ పితామహాః।
సంవత్సరః ప్రజానాం చ సుష్ఠ్వైకః ప్రపితామహః॥"

దర్శింపవలె ననియే యన్నిటి తాత్పర్యము. బ్రహ్మపురాణమునం దింకను 'పితరులను-స్వధను' గూర్చి యిట్లు చెప్పబడినది.

"అగ్ని ర్వాయు శ్చ సూర్య శ్చ స్థానం హి భవతా మితి।
బ్రహ్మ విష్ణు శ్చ రుద్ర శ్చ భవతా మధిపూరుషాః॥

ఆదిత్యా వసవో రుద్రా భవతాం మూర్తయ స్త్విమాః।
యోగినో యోగదేహాశ్చ యోగధారాశ్చ సువ్రతాః॥

కామతో విచరిష్యధ్వం ఫలదాః సర్వజన్తుషు।
స్వర్గస్థాన్ నరకస్థాంశ్చ భూమిస్థాంశ్చ చరాచరాన్॥

నిజ యోగబలేనైవాఽప్యాయయిష్యధ్వ ముత్తమాః।
ఇయ మూర్జా శశిసుతా కీలాలమధువిగ్రహా॥

భవిష్యతి మహాభాగా దక్షస్య దుహితా స్వధా।
తత్రేయం భవతాం పత్నీ భవిష్యతి వరాననా॥"

— 14- 01 నుండి 105.

'పితరులకు అగ్ని-వాయు - సూర్యలోకములు స్థానములు; వసు-రుద్ర-ఆదిత్యులు మూర్తులు: బ్రహ్మ-విష్ణు-మహేశ్వరు లధిపూరుషులు. వసురుద్రాదిత్య రూపులగు నీ పితరులు యోగులై, యోగశరీరధారు లగుచు కామచారులై నిజ యోగబలముచేత సర్వప్రాణుల నధిష్ఠించి యుందురు; స్వర్గ నరకాది లోకములందలి చరాచరములను తృప్తి నొందింతురు; అన్న, జల, మధురూపిణి-అమృతరూపిణి-శక్తిరూపిణి యగు స్వధ 'శశిసుత, దక్షదుహిత, పితృపత్ని' యనియు నిట గీర్తింపబడినది.

మత్స్యపురాణమున గూడ పితరుల స్వరూపము, పితృకార్యావశ్యకతయు నిట్లు వివరింపబడినది.

ఋషయః—

"కథం కవ్యాని దత్తాని హవ్యాని చ జనై రిహ।
గచ్ఛంతి పితృలోకస్థాన్ ప్రాపకః కోఽత్ర గద్యతే ?

యది మర్త్యో ద్విజో భుక్తే హూయతే యది చాపరే।
శుభాశుభాత్మకం ప్రేతదత్తం తద్భుజ్యతే కథమ్ ?"

సూతః—

"వసూన్ వదన్తి చ పితౄన్ రుద్రాం శ్చైవ పితామహాన్।
ప్రపితామహాం స్తథాఽదిత్యా నిత్యేవం వైదికీ శ్రుతిః॥

నామగోత్రే పితౄణాం తు ప్రాపకం హవ్యకవ్యయోః ।
శ్రాద్ధస్య మంత్రాః శ్రద్ధా చ ఉపయోజ్యాశ్చ భక్తితః ॥

అగ్నిష్వాత్తాదయ స్తేషా మాధిపత్యే వ్యవస్థితాః।
నామగోత్రం కాలదేశాః భవాంతరగతా నపి॥
ప్రాణినః ప్రీణయం త్యేతే తదాహారత్వ మాగతాన్॥"

— 19-1 నుండి 5 శ్లో.

పుత్రాదులచే నొసగబడెడి హవ్యకవ్యములు పితరుల నెట్లు చెందును ? అనెడి ఋషుల ప్రశ్నకు సూతుని సమాధానమిది. 'పితృ-పితామహ-ప్రపితామహులు వసురుద్రాదిత్యరూపు లని యనాదిశ్రుతి. నామగోత్ర సంకీర్తనము జేయుచు వేదమంత్రోచ్చారణపూర్వకముగా పితృకార్యముల శ్రద్ధాభక్తులతో ననుష్ఠించుచో నా పితరు లే కాలమున, నే దేశమున నేజన్మ నందియున్నను, పుత్రాదులచే వారి కీబ నొసగబడు హవ్యకవ్యములు వారి కాహారమగుచు వారల దృప్తి నొందించును—' అని తాత్పర్యము.

పై పురాణవచనముల వలనను పితృ పితామహ ప్రపితామహులు వసురుద్రాదిత్యాధిష్ఠితులై, తద్రూపులై,తృప్తినొందుట దెలియుచున్నది.

## పితృ - పితామహప్రపితామహులు -విష్ణుస్వరూపులు :-

పితృ పితామహ ప్రపితామహులు విష్ణుస్వరూపు లని మహాభారత మిట్లు చెప్పుచున్నది.

"పితా పితామహ శ్చైవ తథైవ ప్రపితామహః।
అహ మేవాత్ర విజ్ఞేయ స్త్రిషు పిండేషు సంస్థితః॥

నాస్తి మత్తోఽధికః కశ్చిత్ కోఽనాన్యోఽర్చ్యో మయా స్వయమ్
కో వా మమ పితా లోకే అహ మేవ పితామహః॥

పితామహపితా చైవ అహ మే వాత్ర కారణమ్।
ఇత్యేత దుక్త్వా వచనం దేవదేవో వృషాకపిః"

—భార. 12-34[illegible]-2[illegible], 22, 23.

పిండత్రయరూపమున నర్చింపబడు పితృ-పితామహ-ప్రపితామహులు నేనే: పిండత్రయము నధిష్ఠించి యుండి యర్చింపబడునది నేనే-యని యిట దేవదేవుడగు శ్రీ మహావిష్ణువు చెప్పుచున్నాడు. పితరుల నర్చించుచో తదధిష్ఠాతృదేవతలు, దివ్యపితరులు, శ్రాద్ధదేవులును నగు వసురుద్రాదిత్యు లర్చితులై తాము తృప్తులై, మనుష్యపితరులను తత్పుత్రాదులను తృప్తినొందింతు రని పూర్వము చెప్పబడినది. పితరుల నర్చించుచో శ్రీమహావిష్ణువే యర్చితు డగుచున్న ట్లిట మహాభారతమున జెప్పబడుచున్నది.

కాన నీ వచనముల బట్టి పితరుల నర్చించుచో తదధిష్ఠాతృదేవతలగు వసురుద్రాదిత్యులను, నా యధిష్ఠారించుచతృదేవతల ఖ (బిభ్రదేక ఊర్ధ్వ స్తస్థౌ) తద్రు

పుడు, తదతీతుడు, సర్వాధిష్ఠానరూపుడునై విరాజిల్లెడి శ్రీమహావిష్ణువు ప్రీతుడై పితరుల దృప్తి నొందించి తద్ద్వారా తత్పుత్రాదుల నా యా ఫలముల నొసగి సంరక్షించుచుండునని గ్రహింపనగును.

శ్రుతియు అగ్నివాయ్వాదిత్య లోకములగు భూర్భువస్స్వర్లోకములు శ్రీమహావిష్ణువు యొక్క మూడు పదము లనియు, అవి స్వధామయము లనియు నిట్లు చెప్పుచున్నది.

> "యస్య త్రీ పూర్ణా మధునా పదా న్యక్షీయమాణా స్వధయా
> మదంతి। య ఉ త్రిధాతు పృథివీ ముత ద్యా మేకో దాధార
> భువనాని విశ్వా" —ఋ 1-154-4.

ఏ శ్రీ మహావిష్ణువు ద్యావాపృథివ్యంతరిక్షములను, సర్వభువనములను కాలత్రయవిశిష్టముగను లేక గుణత్రయ (త్రిధాతు) విశిష్టముగను నొనర్చి యద్వితీయుడై ధరించి యుండెనో, యాదేవుని యొక్క యీ త్రిపదములు (అగ్ని-వాయుసూర్యలోకములు) మధుర దివ్యామృత పూర్ణములై, యక్షయములై స్వధచే (అన్నముచే- తత్తదుపభోగ్యవస్తుజాతముచే)జనుల నానందింపజేయుచున్నవి (యస్య విష్ణోః మధురేణ దివ్యే నామృతేన, పూర్ణా పూర్ణాని, త్రీణి పదాని పాద ప్రక్షేపణాని, అక్షీయమాణా అక్షీయమాణాని, స్వధయా అన్నేన, మదన్తి మాదయన్తి తదాశ్రితజనాన్ -సా.భా.)-అని యర్థము.

అగ్ని వాయు సూర్యులు స్వధారూపులవి పూర్వమంత్రముల వలన దెలిసినది. ఈ మంత్రము వలన శ్రీమహావిష్ణువు యొక్క యనుగ్రహముచే అగ్ని వాయు సూర్యులు భూర్భువస్స్వర్లోకములను తత్తదుపభోగ్యవస్తుజాతముచే (స్వధచే) నింపి జనుల నానందింప జేయుదురని గ్రహింపనగును. కావున "పితరుల సర్వేశుడో నేనే [illegible] పంచుచున్నాను; పితృ-పితామహ-ప్రపితామహ స్వరూపుడ నేనే"-యను భారతమునందలి పరమేశ్వరుని వచనము శ్రుతితాత్పర్యాను

గుణమే యయి యున్నది. 'అహం హి సర్వయాజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవ చ'- అను గీతావచనము కూడ నీ విషయమునే స్పష్టీకరించుచున్నది.

ఆదిత్యమండలాంతర్గత పురుషుడు నారాయణు డని సంప్రదాయము. అట్టి యాదిత్యునిచే (విష్ణువుచే) పితరు లుపజీవితు లగుదురని శ్రుతి యిట్లు చెప్పు చున్నది.

"అథ యత్ప్రథమా స్తమితే తన్నిధనం తదస్య పితరోఽ
న్వాయత్తా స్తస్మా త్తాన్నిదధతి నిధనభాజినో హ్యేతస్య
సామ్న ఏవం ఖల్వాము మాదిత్యగ్ం సప్తవిధగ్ం సామో
పాస్తే." —ఛాం.ఉ. 2-9-8.

'అథ యత్ప్రథమా స్తమితేఽదర్శనం జిగమిషతి సవితరి
తన్నిధనం,తదస్య పితరోఽన్వాయత్తా స్తస్మాత్తా న్నిదధతి
పితృ-పితామహ-ప్రపితామహరూపేణ దర్భేషు నిక్షిపంతి,
తాం స్తదర్థం పిండాన్ వా స్థాపయన్తి। నిధనసంబంధా
న్నిధనభాజినో హ్యేతస్య సామ్నః పితరః-' —శం.భా.

ఆదిత్యునకు వాస్తవముగ నుదయాస్తమయములు లేవు. ఎల్లయెడల నేక రూపుడుకాన సముడు. మరియు నందరకు నేక రూపుడై పొడగట్టును కాన సముడు. ఇట్లు సర్వదా సర్వస్వము డగుటచే నాదిత్యుని సామ రూపునిగ నుపాసింపవలె నని శ్రుతిచే బూర్వము విధింపబడినది. మఱియు సామమునకు 'హింకార—ప్రస్తావ – ఆది—ఉద్గీథ—ప్రతిహార-ఉపద్రవ—నిధనము" లనెడి సప్తావయవములు గలవు. అందు హింకారాది సామావయవ రూపము నను,ఆదిత్యోపాసన విధించబడినది. ఇట ఆదిత్యుని విధనరూపునిగ నుపాసింప వలె నని విధింపబడుచున్నది.

అసోన్ముఖుడగు నాదిత్యుడు నిధనరూపుడు. నిధనరూపుడగు నాదిత్యు ననుగమించుచు నా యాదిత్యునిచే పితరు లుపజీవితు లగుదురు. కావుననే యా సమయమున దర్భలయందు పితృ-పితామహ-ప్రపితామహ రూపులగు పితరులను నిక్షేపింతురు. (నిధధతి); లేక తద్రూపమున దర్భలయందు పిండముల నుంచు దురు (నిదధతి). ఇట్లు పిండనిధన సంబంధముచే నిధన భాజనుడగు ఆదిత్యుని యనుగమించుచు నాదిత్యునిచే పితరు లుపజీవితు లగుచుందురు. ఇట్లు సప్తవిధ సామరూపునిగ నాదిత్యు నుపాసింపవలెను — అని యర్థము. ఆదిత్యునిచే పితరు లుపజీవితు లగుదురని చెప్పుటచే ఆదిత్య మండలాంతర్గత పురుషుడగు శ్రీ మహా విష్ణువుచే నుపజీవితు లగుదురనియే తాత్పర్యము. కాన పితరుల నర్చించినచో తద్రూపమున శ్రీ మహావిష్ణువే యర్చితు డగుచున్నాడు.

## గయాశీర్ష - వట (అధిభౌతిక-అధిదైవిక-ఆధ్యాత్మిక అర్థములు) :-

మరియు సూర్యు డస్తోన్ముఖు డగు కాలము అపరాహ్ణకాలము శ్రాద్ధ కాలమని సంప్రదాయము. 'గయాశీర్షే వటే చైవ పితౄణాం దత్త మక్షయమ్'- అను సంప్రదాయ వచనము శ్రాద్ధకాలము లందు పఠింపబడుచుండును. ఉత్తర భారతదేశము నందలి గయాక్షేత్రములో విష్ణుపదమున, వటవృక్షమూలమున పితరుల నుద్దేశించి పిండముల నిక్షేపించు నాచార మనాదిసిద్ధమై వచ్చుచున్నది. పై వచనము నందలి గయాశీర్ష-వట శబ్దములు రెండును లౌకికముగా (అధిభౌతికముగా) గయా క్షేత్ర- వట వృక్షము లను బోధించుచునే అధి దైవికముగ అస్తోన్ముఖుడగు ఆదిత్యుడు-అను నర్థమును గూడ బోధించును. 'ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్' అను ఋఙ్మంత్రము శ్రాద్ధకర్మ లందు పఠింపబడుచుండును. ఈ ఋక్కు నిరుక్తమున (12-22) నిట్లు వివరింపబడినది.

"పృధివ్యా మంతరిక్షే దివీతి శాకపూణిః; సమారోహణే విష్ణుపదే గయ శిరసీ త్యౌర్ణవాభః"

పృధివ్యంతరిక్షద్యులోకములు మూడును విష్ణు పాదన్యాస స్థానములు-అని శాకపూణి మతము సమారోహణ - విష్ణుపద - గయాశీర్షములు (పూర్వాహ్ణము మధ్యాహ్న - అపరాహ్ణములు) మూడును విష్ణుపదము అని ఔర్ణవాభుని మతము. ఈ రెండు పక్షములు గ్రాహ్యములుగా యాస్కు డాదరించెను. కాన గయాశీర్ష మనగా విష్ణు యొక్క తృతీయపదము. ఈ పద మిట్లు వ్యాఖ్యానింపబడినది.

'గయశిరసి ఉత్తరాహ్ణే పశ్చిమాయాం దిశి గయః అస్తం గృహానామ వైదిక. నిఘం.) గయే అస్తే గృహే శిరో యస్మిన్ కాలే దేశే వా స కాలో దేశో వా గయశిరాః తస్మిన్ — నిరు. బ్రహ్మముని వ్యాఖ్య.

కాన ఆధిదైవికముగ గయాశీర్ష మనగా (1) సూర్యుని అస్తోన్ముఖ కాలము లేక అపరాహ్ణకాల మనియు, (2) ఏ ప్రదేశమున సూర్యు డస్తోన్ముఖుడై-యుండునో అట్టి ప్రదేశ మనియు - అర్థములు. కాన నట్టి శ్రాద్ధకాలము, శ్రాద్ధ దేశమును -రెండును గయాస్త్రిరస్ శబ్దవ్యపదేశ్యములు.

ఇక వట శబ్దమునకు సూర్యు డని యర్థము. 'వట సూర్యే తరౌలోకే అని శాశ్వత నిఘంటువు ఈ యర్థమున ప్రామాణిక ప్రయోగములును గలవు. (చూ. హనుమన్నాటకమ్. 3 అంక.) ఈ యర్థము ననుసరించి సూర్యుడు అస్తో న్ముఖు డగుచుండగా (వటే గయా శీర్షే సతి), అనగా నపరాహ్ణకాలమున (విష్ణు' పదమున) పితరుల నుద్దేశించి చేయబడెడి పిండోదక క్రియ అక్షయ మగునని తాత్పర్యము. (వట శబ్దమునకు లోకము - అనగా జనుడు - అని పై కోశము వలన నర్థము దెలియుచున్నది. జనులు (జీవులు) గయాక్షేత్రమున పిండోదక క్రియలు సలుపుటయు, నాటనుండియు విషయవాసనలు విడుచునట్లు వటవృక్షమున కభిముఖులై నిలిచి వాగ్దానములు సేయుటయు అనుచాన మైన యాచారము.

తదుపలక్షకముగ నేవియో కొన్నిటినైన శాకఫలాదుల విడచిపుచ్చుచుండుట నేటికిని వచ్చుచున్నయాచారము. జీవభావము నుండి క్రమక్రమముగ దూరులు కావలెనని యీ ఆచారము యొక్క లక్ష్యము. అందుచే (జీవభావము)నన్తోన్ముఖము గావించుకొనుచు, అనగా విషయవాసనలనుండి దూరు డగుచు త్యాగబుద్ధితో పితరుల కొసగెడి పిండోదక క్రియ అక్షయ మగు ననియు 'గయాశ్రేవచే చైవ ప్రిత్రూణాం దత్త మక్షయమ్'— అను పై వచనమునకు ఆధ్యాత్మికముగ నర్థము.

మరియు వటశబ్దమునకు పై కోశముననుసరించి లోకము- అని యర్థము. అనగా సంసారవృక్ష మని భావము. స్వల్పాతిస్వల్పమైన వట బీజము నుండి యొక మహావృక్ష ముత్పన్నమై; దానినుండి మరల శతసహసంఖ్యా కము లైన బీజములు అందుండి మరల మహావృక్షములు నుద్భవించుచున్న టులే, కామము అనెడి బీజము (మాయాబీజము) నుండి జగద్రూపమున విశాల సంసార మహావృక్షము విస్తరించుచున్నది. కావుననే సంసారమును వటవృక్షము తోను, అస్వత్థవృక్షముతోను పోల్చి చెప్పుట బహుళముగ గాన నగును. ఇంతేకాదు ఈ సంసారము పరమేశ్వరాత్మక మగుట పరమేశ్వరుడును వట (న్యగ్రోధ)-అశ్వత్థాది వృక్షరూపుడుగ కీర్తింపబడుటయు కలదు. 1 అందుచే వటవృక్షము యొక్క పత్రమూలాదుల యందు పరమేశ్వరు

(1) న్యగ్రోధరూపః = న్యక్ నీచైః రోహతీతి- ఊర్ధ్వమూలో హ్యవాక్ఛాక్ శాఖః ఏషోఽశ్వత్థః సనాతనః —ఇతి శ్రుతిప్రసిద్ధః సంసారవృక్షః;

(2) న్యగ్రోధః= వటరూపః వటనికటవాసీ దక్షిణామూర్తిరూప ఇత్యర్థః మార్కండేయ దృష్టో వా పకార్ణవస్థో వటః తచ్ఛాయీ బాలకృష్ణరూపీ మహావిష్ణుర్వా.

(3) వృక్షకల్పస్థితిః- యథైకస్మా ద్బీజా దేకో వటః తతోఽనంతానిబీజాని తేభ్య స్తావంతో వటా ఇతి ఉత్తరోత్తర వృద్ధిపత్యా కార్యస్యానంత్యం, తతక్కల్పా తత ఈషన్న్యూనా స్థితిః సంసారవృక్షపాలనం యస్య సః — మార్కండేయస్యాపి

డున్నటుల పురాణాదుల యందు వర్ణింపబడుచున్నది. సంసారవటవృక్షమునకు మూలభూతుడు పరమేశ్వరు డని తెలియజెప్పుటయే వాని లక్ష్యము. జగద్గురువు, జగత్పతియు నగు శ్రీ మహావిష్ణువు బాలకృష్ణరూపియై వటపత్రశాయియై క్రీడించుట ప్రసిద్ధమే. ఇట్టి చిత్రరువులు శిల్పములు భారతదేశమునం దెల్లెడల కాననగును. అంతే కాదు.

చిత్రం వట తరో ర్మూలే వృద్ధాః శిష్యాః గురు ర్యువా।
గురో స్తు మౌన వ్యాఖ్యానం శిష్యా స్తు ఛిన్నసంశయాః॥

సుప్రసిద్ధ మైన యీ శ్లోకము శ్రీ దక్షిణామూర్తి వర్ణనమై యున్నది. "వటతరుమూలమున జగద్గురువు శ్రీ దక్షిణామూర్తి (వేదమూర్తి) నిత్య తరుణుడు; శిష్యులు వృద్ధులు; గురువు యొక్క మౌనమే వ్యాఖ్యానము; తద్వారా శిష్యుల సందేహములు పటాపంచలైనవి; ఇదెంత చిత్రము"-అనియర్థము.

ఈ వర్ణనము గూడ పరమేశ్వరుడు సంసార వటవృక్షమునకు మూల యుండుటను తెల్పుచున్నది.

ఇట్టి సంసారమును జీవు డన్తోన్ముఖము గావించుకొని, అనగా విషయ వాసనల నుండి దూరు డగుచు పితరులకు చేసెడి పిండదానాదిక్రియ అక్షయ మగు ననియు తాత్పర్యము. గయాక్షేత్రమున వటవృక్షమూలమున పిండముల నిక్షేపించుట యనగా సంసార వటవృక్ష మూలభూతు డగు శ్రీ మహావిష్ణువు యొక్క పదమున (త ద్విష్ణోః పరమం పదమ్) నిక్షేపించుట యనుదైవీ భావనా సంపత్తి పెంపొంది వ జేయుటకే—అని ఆధిదైవికాధ్యాత్మికార్థముల వలన దెలియ వగును కావుననే అపరాహ్ణకాలమున విష్ణుపదే - (గయశిరసి) వ దేశమున గాని, పితరుల

---

పర్ణాన్వపే బ్రహ్మణ్యేకదేశే సంసారవటో ల్పో వ్యనంతప్రరోహా స్తీతి భగవతా స్వమాయారూపం వటవ్యాజేన ప్రదర్శితమ్—నీలకంఠః, మ.భా అనుశాసన.17 అధ్యా 54.

నుద్దేశించి చేయబడు శ్రాద్ధాదు లందు ఆధిభౌతిక - ఆధిదైవిక - ఆధ్యాత్మికతత్త్వముల నుద్దేశింప జేసెడి 'గయా శీర్షే వటే' చైవ అను నీసంప్రదాయ వచనమును పఠించి "గయాయాం దత్త మస్తు" 'గయేయమ్, గయేయమ్' - (ఇదియే గయ ఇదియే గయ) యని యీ రీతిగ భావన చేయు , లేక ధ్యానముచేయు, సంప్రదాయ మనూచానమై వచ్చుచున్నది. కాన పితరుల నర్చించుచో శ్రీ మహావిష్ణువే అర్చితు డగుచున్నా డనుట సంప్రదాయానుగతమైన ఆచారాదుల వలనను స్పష్టమగుచున్నది.

తల్లి తన కొసగబడిన యాహారముతో తాను తృప్తి చెందుచు గర్భస్థ శిశువును తృప్తి నొందించునటుల గదాధర రూపులు భోక్తలను భావనచేసి, పితరుల, ర్చించుచో పరమేశ్వరుడు ప్రీతు డగుచు, స్వగర్భస్థ పితరులను - (వసురుద్రాదిత్యన రూప పితరులను ),తదాశ్రితు లగు పితృ-పితామహాది పితరులను తృప్తి నొందించి యజమానున కక్షయఫలముల చేకూర్చునని తాత్పర్యము.

పూర్వప్రకరణము లందు, (చూ-ఋషి, బ్రహ్మ ) పరమేశ్వరునకున్ను అట్లే ప్రాణదేవత యగు హిరణ్యగర్భునకును సర్వ ఋష్యాత్మకత్వము, సర్వ చ్ఛందోమయత్వము, సర్వదేవతాత్మ కత్వము వివరింపబడినది. ఇట సర్వపితాత్మ కత్వము, సర్వభూతాత్మకత్వము (అనగా భోగ్య—భోక్త్రాది సర్వాత్మకత్వము)వర్ణింప నగును.

1. "అన్నం బ్రహ్మాత్మకం ధ్యాత్వా ద్విజ మాత్మాన మేవ చ
శ్రాద్ధభూమిం గయాం ధ్యాత్వా భోక్తారం చ గదాధరమ్"

— వైదమధదీక్షితీయమ్.

## స్వధా పితృభ్యః (అస్తు స్వధా) :-

కావ, పై గ్రంథసందర్భము ననుసరించి పితృక్రియలందు జెప్పబడెడి 'స్వధా పితృభ్యః, అస్తు స్వధా' - అను మంత్రములయొక్క వివిధార్థముల నిట్లు దెలియనగును.

(1) ఇట నర్చించుట కుద్దిష్టులైనది పితృ - పితామహ - ప్రపితామహ రూప మనుష్యపితరులే. అయినను నర్చింపబడునది తదధిష్ఠాతృ దేవతలగు వసు-రుద్ర-ఆదిత్యులును, వారల కధిష్ఠానరూపుడు జగత్పితయు నగు పరమేశ్వరుడు నని తెలియనగును. ఈ విషయమును స్ఫురింపజేయుటకే 'స్వధా పితృభ్యః' - అని స్వధాకారము చేయబడుచున్నది. స్వధామయులు, స్వధా ప్రవర్తకులునగు పితరులు మొదట పరమేశ్వరుడు, తరువాత అగ్ని - వాయు - సూర్యులును గదా! అందుచే 'స్వధా పితృభ్యః' - అను నీ మంత్రము పుత్రులచే నర్పింపబడెడి హవిర్లక్షణాన్నరూపమగు స్వధ పరమేశ్వర శక్తిరూపమై (స్వధయై), తదనుగ్రహముచే పితరులకు జీవనహేతువగు నమృతమై (ఊర్జా-కీలాలమధువిగ్రహా- పితృపత్నీ - బ్రహ్మ పు ) వరలుననెడి యర్థము స్ఫురింప జేయుచుండును.

(2) జీవులు ముక్తు లగువరకు స్వధాపరవశులై, విద్యా-కర్మ-పూర్వప్రజ్ఞ లనెడి స్వధలతో నూర్ధ్వలోకముల జరించుచుందురని చెప్పబడినది. ఊర్ధ్వాధోగతులకు గారణ మగుచుండ నీ స్వధల నుండి క్రమముగ విముక్తులై స్వప్రతిష్ఠితులు, జగత్పితయు నగు పరమేశ్వరు ననుగ్రహమువలనను, స్వధారూపిణియైన త్రయీవిద్యాశక్తి వలనను, పునరావృత్తిరహిత స్థితికి గారణమగు స్వధను (పారమేశ్వరశక్తిని) పితరులు పొందుదురు గాక - యను నర్థమును గూడ 'స్వధా పితృభ్యః' యను నీ మంత్రము స్ఫురింప జేయుచుండును. అందుచేత నే 'పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోక నిత్యనివాస సిద్ధిరస్తు' - అని కర్మాచరణసమయమున పుత్రాదు లాచరించుటయు నిందుకు దార్కాణము.

(3) 'స్వర్గం లోక దధాతి యజమానస్యేతి స్వధా (సా. భా. ఋ. 3-17-5) పితరుల యూర్ధ్వలోకగతికి గారణమయ్యెడి స్వధాశక్తియే యజమానుని యూర్ధ్వగతికిని గారణ మగునని భావము. కావున 'స్వధా పితృభ్యః' 'అస్తు స్వధా' యను నీ మంత్రములు (1) విద్యా-కర్మ-ప్రజ్ఞ లనెడి స్వధలు జీవుల యూర్ధ్వాధో లోకగతులకు గారణము లని గుర్తింప జేయుచు యజమానుల హెచ్చరించు చుండును. (2) మఱియు నుత్తమ గతులకు గారణభూతమైన త్రయీవిద్యా రూప స్వధ (వేదవాక్కు) పైపునకు యజమానుల దృష్టిని మరల్చుచు, తచ్చోదిత కర్మానుష్ఠానమునందు శ్రద్ధ నినుమడింపజేయును. ఏలయన 'స్వర్గం లోకం దధాతి' యను నీ నిర్వచనము ననుసరించి స్వర్గలోక ప్రాపకత్వము హవిర్లక్షణమైన స్వధకే గాక, తత్కారణభూతమగు త్రయీవిద్యారూప స్వధకును నొప్పును. వేదవాక్కు హవిర్దానాదిహేతువై స్వర్గప్రాప్తిహేతు వగుట ప్రసిద్ధమే.

"పతంగో వాచం మనసా బిభర్తి తాం గంధర్వోఽవద ద్గర్భే
అంతః। తాం ద్యోతమానాం స్వర్యం మనీషా మృతస్య పదే
కవయో నిపాంతి॥"

—ఋ. 10-177-2; తై.ఆ. 3. 11- 1.

"ద్యోతమానాం స్వర్యం స్వర్గమయిత్రీం, స్వర్గాయ హితం
వా, మనీషాం మనస ఈశిత్రీం, తాం త్రయీరూపాం
వాచమ్" —సా.భా

పతంగుడన సూర్యుడు, లేక పరమాత్మ యని యర్థము. ఆ పతంగుని యందు విలసిల్లెడి యీ త్రయీరూపమగు వాక్కు స్వయంప్రకాశశీలము (ద్యోతమానా)। స్వర్గప్రాప్తిహేతువు (స్వర్యం); మనోనియామకము (మనీషా); పరబ్రహ్మవిషయకము (ఋతస్య పదే కవయో నిపాంతి).- అని వేదవాక్కు వర్ణింపబడినది. జైమినీయోపనిషద్బ్రాహ్మణము గూడ ప్రాణము (ప్రాణాత్మ) పతంగ మనుచు నీ ఋక్కు నిట్లు వివరించుచున్నది.

పతంగో వాచం మనసా బిభర్తీతి। ప్రాణో వై పతంగః
తాం ద్యోతమానాం, స్వర్యం మనీషా మితి। స్వర్యా

హ్యేషా మనీషా య ద్వాక్" —జై. ఉ.బ్రా. 3-36-1.

కాన 'అస్తు స్వధా-స్వధా పితృభ్యః' అను నీ మంత్రములు స్వర్గాది—ఊర్ధ్వగతికి గారణమగు నను నర్థమునుగూడ స్ఫురింపజేయునవి.

(4)స్వం ఆత్మానం దధాతీతి స్వధా—(సా.భా.ఋ. 3-36-10)ఆత్మను ధరించునది—అనగా—ఆత్మవిధారకమగు శక్తి, బలము, లేక. తేజస్సు అని యర్థము, ఆత్మను లేక పరమాత్మను బ్రతిపాదించునది యగుచు ధరించునది గాన (గవి దేవాసో ఘృత మన్వవిందన్ తై. ఆ. 10-10-3) వేదవాక్కు స్వధ యన నొప్పును. ఆత్మరూపుడగు పరమేశ్వరుని ధరించునవి యగుటచేతనే యుదకము (ఆపః) లకు స్వధా యను నామము బ్రసిద్ధము

స్వం ఆత్మానం సర్వాంతర్యామిణం భగవంతం నారాయణం
ధారయతీతి స్వధా।

'ఆపో 1 నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః।
అయనం తస్య తాం పూర్వం తేన నారాయణః స్మృతః॥.ఇతి।'

—వైదిక నిఘంటువ్యాఖ్య - దేవరాజయజ్వ.

1. ఇచట "ఆపః" అను శబ్దమునకు జలములని మాత్రమే యర్థము గాదు. "అప్" శబ్దము పంచభూతముల కుపలక్షకము. సర్వవ్యాపన శీలము లగుట జేసి పంచభూతములకు "ఆపః"అను వ్యవహార ముపపన్న మగును. మఱియు "అప్" రూపములగు నీ పంచభూతములకు

కాన స్వధాకారము జేయుచు పితరుల కొసగబడెడి యన్నజలాదికము పితరుల కాత్మవిధారకశక్తియై లేక తేజమై వెలయును; మఱియు నా యన్నోదకములు తమయందు అంతర్యామియై విలసిల్లు నారాయణుని ధరించునవై స్వధా రూపములై వరలి పితరులను, పుత్రాదియజమానులను తరింపజేయును అని 'స్వధా' యను పితృభ్యః అస్తు స్వధామంత్రములు స్ఫురింపజేయును.

## శ్రాద్ధవృత్తి :-

(5) ఇట్లు అంతర్యామియై విరాజిల్లు నారాయణుడే శ్రద్ధావంతులకు శ్రాద్ధవృత్తిప్రణేత యగుచుండునని హరివంశ మిట్లు చెప్పుచున్నది.

"ఆసన్నః సన్నతరః సాధనానాం
శ్రద్ధావతాం శ్రాద్ధవృత్తిప్రణేతా।
పతిర్గుణానాం మహతాం సత్కృతీనాం
పాయా స్మేషః పూరిణః షడ్గుణానామ్॥ —హరివంశ. 2-72-52.

'ఆసన్నః అంతర్యామిత్వేన నికటగః। సాధనానాం తద్వతాం తు సన్నతరః అనావృతః, శ్రాద్ధవృత్తిః శ్రద్ధాగృహీత మహావాక్యజా వృత్తి రహం బ్రహ్మాస్మీతి జ్ఞానం, తస్య

---

"వాక్" అను వ్యవహారము గూడ శ్రుతిప్రసిద్ధము.
సోఽపోఽసృజత—వాచ ఏవ లోకాత్ । వాగేవాస్యాసృజ్యత।
సేదం సర్వ మాప్నోత్ । యదిదం కించ . యదాప్నోత్ తస్మా దాపః
య దవృణోత్ తస్మా ద్వాః।" —శ.బ్రా 6-1-1-9.
"అనేన అపాం వాక్త్వబుద్ధ్యా వ్యవహార్యత్వ ముక్త మితి మంతవ్యమ్"—సా.భా.
(మా.బ్ర.ఉ. 1-2-2; ఆనందగిరిటీకా.)

ప్రదాతా। మా మాం ఈః షః ఇష్యమాణస్యార్థస్య పూరణః
షడ్గుణానాం చ సర్వజ్ఞత్వాదీనాం పూరణః'  —నీలకంఠః.

అంతర్యామియై సకలప్రాణులకు సమీపవర్తి యయ్యును, పరమేశ్వరుడు సాధనసంపత్తిగల యుత్తమసాధకులకు అనావృతుడై— అపరోక్షముగా ననుభూయమాను డగును, శాస్త్రవిహితమగు రీతిని శ్రద్ధతో నుచ్చరింపబడెడి 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది మహావాక్యముల వలన అఖండ బ్రహ్మాకార వృత్తిరూప మగు జ్ఞానమును ప్రసాదించువాడు. ఈ పరమేశ్వరుడే నిఖిల గణములకు పతి (గణపతి). ఉత్తమ సత్కర్మలకును, తత్కర్తలకును పాలకుడు. సర్వజ్ఞత్వాది షడ్గుణైశ్వర్య సంపన్నుడు— అని యర్థము.

ఇట శ్రాద్ధవృత్తి యనగా శ్రద్ధవలన సిద్ధించెడి బ్రహ్మవిద్య యని వివరింపబడినది. ఈ క్రింది వాజసనేయశ్రుతి వలన నీ విషయము స్పష్టమగును.

'శ్రద్ధయా సత్య మాప్యతే' —వా.సం. 19–30.
'శ్రదితి సత్యనామసు పఠితమ్—శ్రత్ సత్యం ధీయతే యస్యాం
సా శ్రద్ధా ఆస్తిక్యబుద్ధిః, పుణ్యవతాం మనోవిశేషః।
శ్రద్ధయా సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మాప్యతే ప్రాప్యతే।
శ్రద్ధాం వినా జ్ఞానాభావాత్' —ఉవట మహీధరౌ.

'శ్రత్' అను పదము సత్యనామములలో బఠింపబడినది. 'శ్రత్' అనగా సత్యము–సత్యజ్ఞానానంతరూపము. అట్టి సత్యమును ధరించెడి లేక దర్శింపజేసెడి యాస్తిక్యబుద్ధికి శ్రద్ధ యని పేరు కాన శ్రద్ధచే సత్యము (బ్రహ్మ) ప్రాప్తమగును అని యర్థము. ఇట్టి ప్రశస్తమే యిట హరివంశముచే ననువదింపబడిన దనుట స్పష్టము.

శ్రాద్ధకర్మలయందు సామాన్యముగ, 'అన్నం బ్రహ్మ, అహం చ బ్రహ్మ, భోక్తా చ బ్రహ్మ'– అని యీ రీతిగ కర్తృ భోక్తృ భోగ్య (అన్న) రూపమగు

సర్వము బ్రహ్మాత్మకముగ దర్శించెడి లేక దర్శింపజేసెడి సంప్రదాయ మనూచానముగ వచ్చుచున్నది ఇట్లు కర్మసమయములందు శ్రద్ధాపూర్వకముగ నుచ్చరింపబడెడి మహావాక్యముల వలన నుదయించెడి జ్ఞానమే శ్రాద్ధవృత్తి యని పై హరివంశవచనము వలన దెలియును. ఇట్టి జ్ఞానము శ్రద్ధావంతులగు సాధకులకు మాత్రమే యీశ్వరానుగ్రహముచే గలుగు వనియు పై 'శ్రాద్ధవృత్తి ప్రణేతా' యను హరివంశవచనము దెలియజేయును. 'ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైతవాసనా' యనిగదా సంప్రదాయము ఆయుః కీర్తిః,ప్రజాః ధనమ్ — మున్నగు నైహిక ఫలములతో పాటు మోక్షముగూడ సిద్ధించునని యాజ్ఞవల్క్యాది స్మృతుల ననుసరించి పూర్వము చెప్పబడినది. కాన శ్రాద్ధకర్మచే నుద్దిష్టమగు పరమ ప్రయోజనము బ్రహ్మవిద్యాఫలమగు 'అపవర్గ' మని తెలియ నగును. బ్రహ్మయే స్వధ (స్వధా బ్రహ్మరూప చిక్ – తై.ఆ. 10–10-3) యనియు పూర్వము చెప్పబడినది. అట్టి స్వధాప్రాప్తియే పరమలక్ష్య మని 'స్వధాపితృభ్యః-అస్తుస్వధా' యను నీ మంత్రము లుత్తమసాధకుల కడుగడుగున ప్రబోధించుచుండును.

మఱియు 'శ్రద్ధయా సత్య మాప్యతే' యను వాజసనేయ సంహితా వాక్యము వలనను, 'శ్రాద్ధవృత్తి ప్రణేతా' యను హరివంశవచనముచేతను పితృకార్యములగు శ్రాద్ధకర్మలవలనను ఉత్తమసాధకులకు క్రమముగ పరమపురుషార్థము సిద్ధించు ననియు గ్రహింపనగును.

## 6. స్వధా-ప్రాణధారణాశక్తి :-

మఱియు శరీరమునందు వాయుధారణము (ప్రాణాయామము) నకు స్వధ యని పేరు

"త్రిధా ప్రణీతో జ్వలనో మునిభి ర్వేదపారగైః।
అత స్తేతత్త్వ మాపన్నా య దేక స్త్రిధాః కక్భతః॥

ఏక ఏవ మహా నగ్నిర్హవిషా సంప్రవర్తతే।
స్వధాకారేణ మంత్రజ్ఞ మంత్రాణాం కార్యసిద్ధయే॥"

"స్వయం చ దక్ష సంప్రాప్తో భగవాన్ భూతసత్కృతః
బ్రహ్మ బ్రహ్మణనిర్మాతా సర్వభూత పితామహః॥"

హరివంశమ్ 3-23-5;6.7.

జ్వలనుడనగా ప్రాణాగ్ని. ఆ యగ్ని పూరక -కుంభక - రేచకములచే నాడీ మార్గముల ద్వారా త్రివిధముగా సంచారిత (త్రిధాప్రణీత) మగుచున్నది ఇట్టి పూరకాద్యభ్యాసము వలన సుసమాహిత మానసులై వేదపారగులగు మునులు ఆత్మతత్త్వమును దెలియగలరు. ప్రాణాయామాభ్యాసముచే నర్చితుడగు ప్రాణాగ్నికి క్షీర-ఘృత-మిష్టాన్న-మితాహారములు ప్రశస్యములగు హవిస్సులు. ఈ హవిస్సుల చేతను పూరకాద్యభ్యాసముచేతను మొదట సూక్ష్మముగా నుండెడి యా ప్రాణాగ్ని క్రమముగా ప్రజ్వరిల్లి మహాగ్ని యగును శరీరమునందు జేయు వాయుధారణము నకు -ప్రాణధారణమునకు - 'స్వధ' యని పేరు. (నస్మిన్ శరీరే ధానం విధానం దేహే వాయో ర్ధారణేతి యావత్) ఈ స్వధారూప మగు (ప్రాణధారణ రూపమగు) కారణము చేత శాస్త్రోక్త మంత్ర సంబంధి కార్యమైన వృదివ్యాధి భూతజయమునకై యా ప్రాణాగ్ని ప్రవృత్తమగును ప్రాణధారణము చేయుచో ప్రాణముతో పాటు మనస్సుకూడ ఆత్మయందు నిశ్చలమై నిలచును. ఇట్లాత్మయందు ధారణ చేయబడెడి ప్రాణము క్రమముగ మహత్త్వము నొంది 'దక్ష' రూపుడగును: అనగా సూత్రాత్మ (హిరణ్యగిర్భ) రూపుడగును. (దక్షతే సర్వస్మిన్ కార్యే నన్న హ్యతీతి దక్షః సూత్రాత్మా తద్రూపేణ సంప్రాప్తో భవతి), అతడే బ్రహ్మ. సర్వభూత పితామహుడు — (చూ. నీలకంఠ వ్యాఖ్య)

జీవు డనగా ప్రాణాధారము చేయువాడు (జీవ ప్రాణాధారణే). ప్రాణ ధారణము జీవసాధారణ ధర్మము. అయ్యును శాస్త్రవిహితమగు ప్రాణ ధారణము. తద్ద్వారా మనోధారణము - యమాదిగుణయుక్తమగు మనస్సును ఆత్మయందు నిలుపుట - ఇదియే యిట ధారణ.

"యమాది గుణయుక్తస్య మనసః స్థితి రాత్మని।
ధారణే త్యుచ్యతే సద్భిః శాస్త్రతాత్పర్యవేదిభిః॥"

—యోగియాజ్ఞవల్క్యస్మృతి.

ఇట్టి ధారణశక్తియే స్వధ. కాని యిట హవిస్సు వేఱు; స్వధ వేఱుగా జెప్పఁబడినవి. మొదట సూక్ష్మముగ నుండెడి ప్రాణాగ్ని ప్రశస్యములగు క్షీరాది హవిస్సులచేతను, రేచక పూరకాద్యభ్యాసము చేతను క్రమముగ ప్రజ్వరిల్లి మహాగ్ని యగును. ఇది హవిస్సు యొక్క కార్యము. ఇట్లు ప్రవృద్ధమైన మహాగ్ని ప్రాణధారణ రూపమగు స్వధాకారముచేత మంత్రములచే నయ్యెడి కార్యసిద్ధికై (భూతజయమునకై) ప్రవృత్త మగును. ఇది స్వధయొక్క కార్యము కాన మంత్ర కార్యసిద్ధికై ప్రవృత్త మయ్యెడి యగ్నికి సహకారికారణమై తోడ్పడునది స్వధ యని తెలియుచున్నది. ఇట్లు ఈ స్వధ, ప్రాణాగ్ని సూత్రాత్మరూపుడై వెలయునంత వరకు తోడ్పడుచుండును. కాన స్వధా ప్రయోజనము సూత్రాత్మత్వ (హిరణ్య గర్భత్వ- లేక దక్షత్వ) సిద్ధి యని తెలియనగును.

ఇట గమనింపవలసిన యంశము గలదు. ఈ హరివంశవచనములు మంత్రకార్యసిద్ధికి ప్రాణాగ్న్యుపాసనావశ్యకతను బోధించుచున్నవి. కర్మానుష్ఠానము నకు, తత్ఫలప్రాప్తికి ప్రాణాగ్న్యుపాసనము నాంతరీయకము. కాగా కర్మాచరణము లేని ప్రాణాగ్న్యుపాసన గాని ప్రాణాగ్న్యుపాసనము లేని కర్మాచరణము గాని ప్రశస్తము గాదు. కావుననే కర్మాంగముగ 'ప్రాణానాయమ్య' అని-ప్రాణాయామము విధింపఁబడుచున్నది. కొన్నియెడల 'ప్రాణాయామాన్ షడాచరేత్' అని యీ రీతిగ ప్రాణాయామము ప్రాయశ్చిత్తముగ విధింపఁబడుచున్నది. ప్రాణాయామముచే ప్రాణధారణముచేసి స్వధాశక్తి సంపన్నులైన యప్పుడే మంత్రములును, వానిచే నొసగఁబడు హవిస్సులును వీర్యవత్తరములగును. శాస్త్రవిహిత ఫలప్రాప్తియు జేకూరును. కర్మసంన్యాసము నొనర్చిన యోగులకును పూర్వోక్త స్వధాశక్తి భూత జయమును సాధించి శ్రవణ మనన నిదిధ్యాసల నొనర్చుటకు దోహదకారి యగును. ఇట్లు స్వధాశక్తి సంపన్ను లయి స్వధామయు లగువారు తుదకు స్వధారూపు లగుదురు. అనగా చిత్స్వరూపు లగుదురని 'స్వధా పితృభ్యః; అస్తు స్వధా' - యను నీ మంత్రము లక్ష్యార్థమును జ్ఞాపకము జేయుచున్నవి. కావుననే సర్వపితృ

కర్మలయందు స్వధాకారమే (అస్తు స్వధా) మహత్తరమైన యాశీర్వాదముగ బరిగణింపబడును.

"స్వధా స్త్విత్యేవ తం బ్రూయు ర్బ్రాహ్మణా స్తదనంతరమ్।
స్వధాకారః పరా హ్యాసీః సర్వేషు పితృకర్మసు॥" —మను 3-25-2.

## స్వాహా - స్వధా - వషట్ :-

ఈ స్వాహా -స్వధా శబ్దములు స్త్రీలింగము లగుచు పరదేవతా వాచకము లయినట్లు పుంలింగములై పరమేశ్వరవాచకములుగ గూడ గన్పట్టు చున్నవి.

"బ్రహ్మణ్య ఋగ్యజుః సామ్నే స్వాహాయ చ స్వధాయ చ।
వషట్కారాత్మనే చైవ తుభ్యం పరాత్మనే నమః॥
—మత్స్య 417-163.

ఋగ్యజుః సామాత్మకుడు, స్వాహారూపుడు, స్వధరూపుడు, వషట్కారాత్మకుడు, తత్ప్రతిపాద్యార్థస్వరూపుడు - నగు పరమేశ్వరునకు నమస్కారము అని యర్థము.

ఇట వాగర్థస్వరూపుడగు పరమేశ్వరుడు స్వాహాః, స్వధః, వషట్కారాత్మా, - ఋగ్యజుఃసామాత్మా యనియు, తదర్థస్వరూపు డనియు గీర్తింపబడినాడు. కాన ఋగ్యజుఃసామలచేతను, అట్లే స్వాహా- స్వధా- వషట్కార శబ్దములచేతను ప్రతిపాద్య మగు పరమార్థము పరమేశ్వరుడే యని తాత్పర్యము.

ఇంతవరకు స్వాహా, స్వధాస్వరూపముల వర్ణించితిమి. ఇక వషట్ స్వరూపమును జూతము.

# వషట్

జగద్ధితైకలక్షణాం జగత్పతే రనన్యగాం
జగత్కుటుంబసంస్కృతిం జగ ద్వివర్తమోహినీమ్।
వషట్క్రియా విధాన యజ్ఞతత్త్వ బోధ సంభృతాం
వషట్స్వరూపిణీం శివాం నమామి వేదమాతరమ్॥

విశ్వ మేత దఖిలం చ యా వశే
స్వేచ్ఛయా నను కరోతి సా వషట్।
యా షడంగయుత వాక్స్వరూపిణీ
భావయామి హృది తాం హరిప్రియామ్॥

—వేదమాతృస్తవః.

## హవిస్త్యాగప్రకారము - వషట్కార ప్రాశస్త్యము :-

స్వాహా - స్వధా - శబ్దములవలెనే వషట్కారముగూడ పరమేశ్వర వాచక మని దర్శించితిమి. ఇంతియే గాదు. స్వాహాకారము వలెనే వషట్కారము గూడ మహిమాన్వితము, దేవహవిర్దానవాచకము నగు మంత్రము.

"వి పృచ్ఛామి పాక్యా 3 న దేవాన్ వషట్కృతస్యాద్భుతస్య
దస్రా । పాతం చ సహ్యసో యువం చరభ్యసో నః"

—ఋ. 1-120-4.

"వషట్కృతస్య వషట్కారేణాగ్నౌ హుతస్య, అద్భుతస్య ఆశ్చర్యభూతస్య, మహతః, సహ్వానః అతిశయేన బలవతః బలోత్పాదకస్య సోమస్య....' —సా. భా.

వషట్కారముచే నగ్నియందు హోమము చేయబడెడి సోమరూప మగు హవిస్సు అద్భుతమై మహత్త్వసంపన్నము, అతిశయబలసంపన్నమై బలోత్పాదకము నగు నని యీ మంత్రమున జెప్పబడుచున్నది. కాన స్వాహాకృత మగు హవిస్సువలెనే వషట్కృతమగు హవిస్సు గూడ మహిమాన్వితమై దేవతాప్రీతిహేతు వగు ననుట శ్రుతి సంప్రదాయము. యజ్ఞములయందు గొన్నియెడల స్వాహాకారపూర్వకముగను, మఱికొన్నియెడల వషట్కారపూర్వకముగను హవిర్దానము చేయబడుచుండును. ఈ విషయమున శ్రుతిసంప్రదాయమును జూతము.

దేవతల నుద్దేశించి చేయబడు హవిస్త్యాగమునకు యాగ మని పేరు. ఈ యాగశరీరమును నిష్పన్నము చేయు మంత్రము లయిదు. అవి యివి. (1) అశ్రావయ (2) అస్తు శ్రౌషట్ (3) యజ (4) యే యజామహే (5) వషట్. ఇవి యాగశరీరమును రూపొందించు ప్రధానమంత్రములు. వీనికి పూర్వాపరభాగముల యందు గల్పట్టు అంగము లన్నియు శరీరగత వస్త్రాలంకార సదృశ్యములు [1]. ఇందలి 'ఆశ్రావయ' యనెడి మొదటి మంత్రము ముఖ్యప్రారంభరూపము (ప్రాయణమ్). తరువాతి మూడు మంత్రములు ప్రతిష్ఠా మధ్యకాలవర్త్యనుష్ఠానమ్). చివరిదియగు వషట్కారము ఉదయన (సమాప్తి) రూపము. యజమానుడీ ప్రారంభాదిత్రయము నెఱిగి యజ్ఞకర్మాచరణమునకు బూనుకొనవలెను. ఇక హవిస్త్యాగప్రకారమును జూతము.

1 దేవతోద్దేశేన ద్రవ్యత్యాగరూపస్య యాగశరీర స్యైతైరేవ మంత్రై ర్నిష్పన్నత్వా దవశిష్టాని ప్రాచ్యా న్యుదీచ్యాని చాంగాని శరీరగత వస్త్రాలంకార – స్థానీయాని - సా. భా. తై. సం 1-6-11-1; చూ. ఉపోద్ఘాతము. తాం. బ్రా. - చిన్నస్వామిశాస్త్రి.

అధ్వర్యుడు అను ఋత్విక్కు జుహ్వాదిపాత్రలయందు హవిస్సును గ్రహించి, హోత యను ఋత్విజుని జూచి 'అగ్నయే అనుబ్రూహి'-యని యాజ్ఞాపించును. అగ్నికొఱకు 'అనువాక్యా' రూప మగు ఋక్కును పఠింపు మని యర్థము. ఈ యనువాక్యకు 'పురోనువాక్యా' యనియు పేరు. హోత 'అనువాక్యా'ను పఠించిన పిదప ఆగ్నీధ్రు డను ఋత్విజుని జూచి యధ్వర్యుడు 'ఆ శ్రావయ' యని పలుకును. "అగ్నికి హవిస్సు నొసగవలసి యున్నాను; ఆ విషయము నగ్నికి నివేదింపుము"- అని యర్థము. అంతట ఆగ్నీధ్రుడు "అస్తు శ్రౌషట్" అని పలుకును. అస్తు అనగా నట్లే నివేదించెద నని యర్థము. శ్రౌషట్ అనునది నివేదన ప్రకారము. ఆధ్వర్యు డపుడు హోతను జూచి 'యజ' యని పలుకును. ప్రకృతదేవతాకమైన 'యాజ్యా'రూప మగు ఋక్కును బఠింపు మని యర్థము. హోత యపుడు 'యే యజామహే' యని పలుకును. నీచే ప్రేషితుల మగు మేము 'యాజ్య'ను బఠింతు మని యర్థము. హోత యిట్లు పలికి, యాజ్యను బఠించి, యాజ్యాంతమున "వౌషట్" అని వషట్కారము జేయును. అట్లు వషట్కారము జేయబడు సమయమున గాని, వషట్కారాంతమున గాని యధ్వర్యుడు స్వహస్తమునందున్న హవిసు నగ్ని యందుంచును.

యజమానుని కోరికల గురియించునట్టిది యగుటచే వేదవాక్కు కామధేనువు. వేదవాక్కునకే "సూనృతవాక్" అని పేరు. ఆ వేదవాక్కే యజ్ఞక్రియా నిర్వాహకమై యజ్ఞరూపమున ప్రవర్తిల్లుచుండును. అందుచే యజ్ఞమే సూనృతవాగ్రూపమగు కామధేనువుగ శ్రుతియందు వర్ణింపబడినది (యజ్ఞో వై సూనృతా'. తై. సం 1-7-11-3). లోకమున తృణాదిరూపమగు నాహారము నిచ్చుటకై గోవులను వానికి ప్రియములు సాంకేతికములు నగు నామములతో, లేక శబ్దములతో, బిలిచెడి యాచారము గలదు. యజ్ఞరూపమగు నీ వేదవాగ్ధేనువు లోకసిద్ధమగు గోవువంటిది కాదు. అలౌకిక మగు నీ ధేనువు నాహ్వానించి స్వాభిమత ఫలమున బిదుకు టెట్లు? అందుచే నీ ధేనువును లౌకికములగు నామములతో గాక దేవనామములతోనే పిలుచుట యుక్తము. "ఆశ్రావయ" - ఇత్యాది మంత్రము లట్టి యాహ్వానమున కుపయుక్తము లగునని శ్రుతి నిర్దేశించినది.

"యజ్ఞోవై సూనృతాऽऽ(శావయే త్యైవైనా మహ్వాత్,
అస్తు (శౌష డిత్యుపావా(స్రాక్, యజే త్యుదనైషీత్, యే
యజామహ ఇత్యుపాసదత్, వషట్కారేణ దోగ్ధి, ఏష వై
సూనృతాయై దోహో య ఏవం వేద" — తై. సం. 1-6-11-3.

యజమానుడు 'ఆ(శావయ' యను మం(త్రపాఠము చేతనే యజ్ఞరూప సూనృత వాగ్ధేనువు నాహ్వానించుచున్నాడు. 'అస్తు(శౌషట్' అను మం(త్రముచే పాలు చేపు నకు వచ్చుటకై వత్సమును ధేనుసమీపమునకు దోలుచున్నాడు (వత్స ముపావ సృజతి). 'యజ' యను మం(త్రముచే దోహనపా(త్రను సిద్ధపఱుచుచున్నాడు. 'యే యజామహే' యను మం(త్రముచే దోగ్ధ యగు యజమానుడు ధేనువును సమీపించి, 'వౌషట్' అను మం(త్రముచే అభిమత ఫలరూప క్షీరమును పిదుకును— ఇదియే యజ్ఞ రూప సూనృతవాగ్ధేను దోహన (ప్రకారము— అని యర్థము. ఇట్లు రూపకల్పక ద్వారా (శుతి యీ అయిదు మం(త్రముల (ప్రాశస్త్యమును వివరించినది. అందు చివరిది యగు వషట్కారము దోహనసాధనమై యభిమతఫల వర్షణశీల మని తెల్ప బడినది.

ఇంతే కాదు; ఆ(శావయ—ఇత్యాది మం(త్రపంచకమునకు పదునేడక్షర ములు; సప్తదశాక్షర సంమిత మగు నీ మం(త్రపంచకము ఛందఃసారము; కాన ఛందస్యము; (ప్రజాపతిరూపము— అనియు నీ (శుతి యిట్లు వివరించుచున్నది.

"ఏషవై సప్తదశః (ప్రజాపతి ర్యజ్ఞ మన్వాయత్తః....
ఏష వై ఛందస్యః (ప్రజాపతిః" —తై. సం. 1-6-11-1, 4.

మహాభారతము (12-47-43) గూడ నీ మం(త్రపంచకముచే యజ్ఞములందు సర్వదేవ తాత్మకు డగు విష్ణువు హూయమాను డగుచుండునని యీ మం(త్రపంచకము యొక్క (ప్రాశస్త్యమును వివరించుచున్నది.

'చతురి శ్చ చతుర్భి శ్చ ద్వాభ్యాం పంచభి రేవ చ।
హూయతే చ పున ర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు॥,1
దశేంద్రియ-పంచప్రాణ-మనోబుద్ధులతో విలసిల్లెడి2

సూక్ష్మశరీరము (లింగశరీరము) నకును సప్తదశక మనిపేరు. ప్రాణశక్తి సంశ్రిత మైన యీ సూక్ష్మశరీరమే భోగసాధన మగుచు స్థూలశరీర యాత్రానిర్వాహకము; కాన నత్యంతప్రధానము. అట్లే సప్తదశాక్షరోపేతమై, ఛందఃసారమై, ప్రజాపతి రూపమై యొప్పు నీ మంత్రపంచకము యజ్ఞశరీర నిష్పాదకమై యజ్ఞనిర్వాహకము; అందుచే నత్యంత ప్రధానమై యొప్పునని శ్రుతి, స్మృతితాత్పర్యము.

## వషట్కారము ఆదిత్యరూపము, దేవప్రాతము:

ఇట్టి మంత్రపంచకము ఛందస్సారమై మహిమాన్విత మగుటచేత నే యీ మంత్రముల నుచ్చరించుచు వషట్కారమును చేయునపుడుగాని, చేసిగాని, హోమము జేయవలెను. తత్పూర్వము చేయరాదు. శ్రుతియు నీ విషయము నిట్లు చెప్పుచున్నది.

"అసౌ వా అనువాక్యా, ఇయం యాజ్యా- తే ఉభే యోషే।
తయో ర్మిథున మస్తి వషట్కార ఏవ। తద్వా ఏష ఏవ
వషట్కారః- య ఏష తపతి। స ఉద్యన్నేవామూ మధి
ద్రవతి, అస్తం యన్నిమా మధిద్రవతి। తదేతేన వృష్ణేమాం
ప్రజాతిం ప్రజాయతే —యైనయో రియం ప్రజాతిః॥

1. 'తస్మైహోమాత్మనే నమః'— అనియు పాఠాంతరము.

2. పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్।
అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్॥ —ఆత్మబోధ.

సో౽మవాక్య మనూచ్య, యజ్యా, మనుద్రుత్య పశ్చా
ద్వషట్కరోతి.... దేవపాత్రం వా ఏష యద్వషట్కారః।
తద్యథా పాత్ర ఉద్ధృత్య ప్రయచ్ఛేత్- ఏవం తత్। అథ
యత్పురా వషట్కారా జుహుయాత్- యథాధో భూమౌ
నిదిగ్ధం తదాముయా స్యాత్- ఏవం తత్। తస్మా దు సహా
వైవ వషట్కారేణ జుహుయాద్ వషట్కృతే వా॥"

—శ. బ్రా. 1-7-2-11 నుండి 14.

హోతచే పఠింపబడెడి దేవతాహ్వానరూప మగు ఋక్కు అనువాక్య హవిఃప్రదానము నకై పఠింపబడెడి ఋక్కు యాజ్య. మొదట అనువాక్యను తరువాత యాజ్యను పఠించి యాజ్యానంతరము వషట్కారము జేయవలెను. 'యాజ్య-అనువాక్యా' అను శబ్దములు రెండును స్త్రీ లింగము లగుటచే స్త్రీ రూపములు వషట్కారము పులింగ మగుటచే పురుషరూపము. స్త్రీరూపములగు నీ యాజ్యానువాక్యలకు పురుషరూపమగు వషట్కారముతో మిథునభావ (దాంపత్య) మేర్పడుచున్నది మఱియు, దేవతాస్తుతి రూపమై దేవతాసంబద్ధ మగుచు అనువాక్య ద్యులోకరూపము. హవిఃప్రదాన సాధన మగుచు యాజ్య పృథివీరూపము ఇట్లు పురోనువాక్యాయజ్యలు రెండునుద్యావా పృథివీ రూపములు ద్యావాపృథువుల రెండిటిని వెలయింప జేయుచు వెలుగొందెడి యాదిత్యుడే వషట్కారము. ఆదిత్యుడు వర్షణశీలు డగుటచే 'వృషా' యని చెప్ప బడును. అట్టి యాదిత్యునితో సంగతము లయి ద్యావాపృథువులు వివిధ ప్రజోత్పాదన సమర్థము లగుచుండును. అట్లే వషట్కారముతో (ఆదిత్యునితో) సంగతము లయి యాజ్యానువాక్యలును అభిమతఫల ప్రజనన సమర్థము లగును. కాన వౌషట్ అనుచు వషట్కారము జేయు సమయమునగాని, తదన తరముగాని హవిఃప్రదానము జేయ వలెను; అంతకు బూర్వము చేయరాదు.

ఇంతే కాదు. ఈ వషట్కారము దేవపాత్రము(పిబన్త్యనేన దేవా ఇతి దేవపాత్రమ్). దేవతలకు లోకసిద్ధము లయిన పాత్రలు తగవు; వారు హవిరాదుల

గ్రహించుటకు యోగ్యమైన యలౌకిక పాత్రయే వషట్కారము. వషట్కారనంతరము హవిస్సు నొసగుచో దేవపాత్రతో హవిస్సు నుద్ధరించి యొసగినట్లగును(పాత్రోద్ధార పూర్వక ప్రదాన మివ భవతి).అందుచేగూడ వషట్కారమునకు బూర్వమే హవిస్సు నిచ్చుచో నది నేలపాలయిన వస్తువువలె (భూమౌ నిదిగ్ధం యథా) నిరుపయోగ మగును— అని యర్థము. వషట్కార రూపమగు దేవపాత్రతోనే దేవతలు తృప్తి జెందెదరని ఐతరేయబ్రాహ్మణముగూడ నిట్లు చెప్పుచున్నది.

"దేవపాత్రం వా ఏత ద్వషట్కారో వషట్కరోతి దేవపాత్రే
ణైవ తద్దేవతా స్తర్పయతి, ఇతి।" —ఐ బ్రా.౩-౫.

వషట్కారముయొక్క ప్రాశస్త్యమిట్టిది. అది యాదిత్యరూపము. ఆదిత్యుని వలె స్వయంప్రకాశశీలమై నూతన శక్త్యాధాయకము, అభిమతఫలవర్షకమునగునని తెలియ నగును; యజ్ఞములందు హవిస్సుల వహించునదియగుట చేతను వషట్కారము దేవపాత్రమై యొప్పును.

"ఉహ్యతేఽనేన ఇతి వషట్; వహ ప్రాపణే:వౌషట్,
డషట్ చ" — అమరసుధాటీక.

## వాక్ ప్రాణాపానములు-వషట్కారము:-

వషట్కారము చేయు హోత యను ఋత్విజునియొక్క వాక్కు, ప్రాణా పానములను గూడ వషట్కారము లగునని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"ఓజశ్చ హ వై సహశ్చ వషట్కారస్య ప్రియతమే తన్వౌ....
వాక్ చ వై ప్రాణాపానౌ చ వషట్కారః; త ఏతే
వషట్కృతే వషట్కృతే వ్యుత్క్రామంతి, తా ననుమంత్ర
యేత వాగోజః సహ ఓజో మయి ప్రాణాపానా

విత్యాత్మన్యేవ తద్ధోతా వాచం చ ప్రాణాపానౌ చ ప్రతిష్ఠా
పయతి సర్వాయుః సర్వాయుత్వాయ" —ఐ. బ్రా. 3-8.
ఏతే ఏవ వషట్కారస్య ప్రియతమే తనూ య దోజశ్చ
సహశ్చ" —కౌ. 3-5.

హోత యను ఋత్విక్కు వషట్కారము జేయునపు డెల్ల వషట్కార రూపములగు నా హోతయొక్క వాక్-ప్రాణాపానములు శరీరమునుండి యుత్క్రమించుచుండును. అపుడు హోత 'వాగోజః సహ ఓజో మయి ప్రాణాపానౌ'- అనుచు అనుమంత్రణము జేయవలెను. ఓజస్సు సహస్సు అనునవి వషట్కారముయొక్క ప్రియాతమము లైన రెండుశరీరములు. ఇట్టి ప్రియతమ శరీరములతో నొప్పెడి యో వషట్కారమా! నీ యనుగ్రహము వలన నాయందు ఓజస్సహస్సులు సిద్ధించుగాక! వాక్-ప్రాణాపానములనెడి యీ వషట్కారములు నాయందు సుఖముగ నుండుగాక- యని యను మంత్రణమంత్రార్థము ఇట్లనుమంత్రణము జేయుటవలన హోతయొక్క వాక్. ప్రాణాపానము లుత్క్రమింపవు అతనియందే ప్రతిష్ఠితములగును. ఆతడు నాయుష్మంతుడై వర్ధిల్లును- అని పై మంత్రార్థము.

ఇట 'వాగోజః సహ ఓజో మయి ప్రాణాపానౌ' అనుచు హోత వషట్కారమును ప్రార్థించుచున్నాడు. ఇట్లు ప్రార్థింపబడు ఓజస్సహశ్శరీర సంపన్నమగు వషట్కారము ఆదిత్యుడే లేక ప్రజాపతియే యగును. ఓజస్సు అనగా జగద్విధారక మగు పారమేశ్వరశక్తి. ఈ శక్తితోనే పరమేశ్వరుడు జగత్తును ధరించుచున్నట్లు భగవద్గీతయందును గాంచనగును.

"గా మావిశ్య చ భూతాని ధా యామ్యహ మోజసా" —15-13.
ఓజసా బలేన, య ద్బలం కామరాగవివర్జిత మైశ్వరం
జగద్విధారణాయ పృథివ్యాం ప్రవిష్టమ్, యేన గుర్వీ
పృథివీ నాఽధః పతతి న విదీర్యతే చ" —శం. భా.

కాన, కామరాగవివర్జితమై జగత్తును ధరించెడి పారమేశ్వరశక్తియే ఓజస్సు. ఈ శక్తియే అష్టమధాతురూపమున ప్రాణిశరీర ధారణము జేయుచుండును కామరాగ

వివర్జితులై జితేంద్రియులగు మహాత్ములయం దీ యోజశ్శక్తియు, దానితోపాటుసహ:శ్శక్తియు విశేషముగ నభివ్యక్త మగుచుండును. సహస్సు అనగా శత్రువులను, లేక అరిషడ్వర్గమును సహించెడి(తిరస్కరించెడి) శక్తి. బ్రహ్మచర్యాది కఠిననియమముల వలన ఓజస్సుతోపాటు సహశ్శక్తియు వృద్ధిజెందుచుండును. కాన ఓజస్సహశ్శక్తి పరిపూర్ణుడగు పరమేశ్వరుడే యిట వషట్కారశబ్దవాచ్యుడు. అట్టిశక్తుల ననుగ్రహింపుమని హోత యభ్యర్థించుచున్నాడు. పరమేశ్వరానుగ్రహముచే నట్టిశక్తులతో విలసిల్లు జితేంద్రియులగు మహాత్ములయొక్క 'వాక్-ప్రాణాపానములు' గూడ వషట్కారములే యగునని శ్రుతి చెప్పుచున్నది. ఇంతే కాదు; 'వాగోజః సహ ఓజః అను నీ శాంతికరణరూప మగు మంత్రస్వరూపము వాజసనేయసంహితయం దిట్లు గలదు.

"ఋచం వాచం ప్రపద్యే మనో యజుః ప్రపద్యే సామ
ప్రాణం ప్రపద్యే చక్షుః శ్రోత్రం ప్రపద్యే। వాగోజః
సహౌజో మయి ప్రాణాపానౌ" —వా.సం. 36-1.

"వాగాదిగ్రహణం సప్తదశావయవోపలక్షణమ్। సప్తదశావయవం
ప్రజాపతే ర్లింగం ప్రపద్యే ఇత్యర్థః। త్రయీవిద్యాం లింగ
శరీరం చ ప్రపన్నం ప్రవర్గ్యో న నాశయే దితి భావః। తథా
వాగింద్రియం ఓజో మానసం బలం ధార్ష్ట్యమ్। పున రోజో
గ్రహణా చ్ఛరీరం చ బలమ్ ప్రాణాపానౌ చ ఏతే సహ
ఏకీభూతాః సంతో మయి వర్తన్తే। అతోఽపి ప్రవర్గ్యోఽ
స్మాన్ న హన్త్వితి భావః —మహీ.భా (చూ. ౬ పట భా.)

ఇట ఋగ్యజుః సామాత్మక మగు వేదవాక్కు వాఙ్మనః ప్రాణాత్మకముగ జెప్పబడినది. వాగాదులు సప్తదశావయవోపేత మగు సూక్ష్మ శరీరమున కుపలక్షకములు. అందుచే త్రయీవిద్య నాశ్రయించి స్థూలదేహాభిమాన రహితుడై సప్తదశావయవోపేతము, ఛందఃసార సమాహితము ప్రాణశక్త్యభినివిష్టము (ప్రజాపతే ర్లింగం) నగు

లింగశరీరము నాపేశించి యుండువానికి నాశ ముండదు; వాగింద్రియము, ఓజస్సు ప్రాణాపానములు ఏకీకృతములై యుండును; అందువలనను గూడ నాశము సంభవింపదు—అని యర్థము.

ఇట జగద్విధాయకములైన పరమేశ్వరుని ఓజస్సహశ్శక్తులే వషట్కారమునకు ప్రియతమము లగు శరీరము లని చెప్పబడుట గమనార్హము. కాగా వషట్కారము పరమేశ్వరస్వరూపము, తద్వాచకము నని పర్యవసితమగుచున్నది. వషట్కారరూపుడగు పరమేశ్వరునే యిట అనుమంత్రణ మంత్రముచే ప్రార్థించుచున్నాడు. తదనుగ్రహముచేతను, త్రయీవాక్సంపత్తి చేతను, ప్రాణశక్త్యభినివిష్ట మగు లింగ శరీర తాదాత్మ్యముచేతను హోతయొక్క వాక్ప్రాణాపానములు గూడ ఓజస్సహశ్శక్తి సంపన్నములై వషట్కారరూపములై యాతనియందు ప్రతిష్ఠితము లగును. అట్టి ఋత్విజులచే జేయబడెడి వషట్కారము ఆదిత్యునివలె, లేక పరమేశ్వరునివలె ఓజస్సహశ్శక్తి సంపన్నమై యభిమతఫల వర్షణశీలమై (వృషా) యొప్పును. ఇక వషట్ శబ్ద నిర్వచనముల బరిశీలించినను నియ్యది పరమేశ్వరరూపము; తద్వాచకము, వేద వాచకము నగుట గాంచగలము.

## వషట్కారము - పరాదేవత (పరమేశ్వరుడు):-

"యః సూర్యః స ధాతా స ఉ ఏవ వషట్కారః"

— ఐ. బ్రా. 3-48.

"తద్వా ఏష ఏవ వషట్కారః య ఏష తపతి"

— శ. బ్రా. 1-7-24.

అనుచ శ్రుతులచే విధాతయగు నాదిత్యుడు వషట్కారరూపుడుగ జెప్పబడినాడు. సవితృభర్గస్స్వరూపిణీ యగు గాయత్రీపరాదేవతయు త్రిసంధ్యలయందు 'ఓజోఽసి

సహోఽసి' యనుచు ఓజస్సహశ్శక్తిరూపిణిగ ధ్యానింపబడుచున్నది. వషట్కారము గూడ ఓజస్సహశ్శరీరములతో వెలయునని పూర్వము చెప్పబడినది. బ్రహ్మవిద్యా రూపిణీ యగు పరదేవత 'వషట్' రూపిణిగ హరివంశమున (2-3-23) నిట్లుకీర్తింప బడినది.

'విద్యానాం బ్రహ్మవిద్యా త్వ మోంకారోఽథ వషట్ తథా'

కాన వషట్కారము పరదేవతా (పరమేశ్వర) రూపము, తద్వాచకము ననియు గ్రహింప నగును. వషట్కారము పరమేశ్వరనామముగ సహస్ర నామము లందును ప్రసిద్ధము.

"విశ్వం విష్ణు ర్వషట్కారః" —విష్ణుసహస్రనామ.

"యదుద్దేశేన అధ్వరే వషట్క్రియతే స వషట్కారః। యస్మిన్ యజ్ఞే వా వషట్క్రియా, యజ్ఞో వై విష్ణుః ఇతి శ్రుతేః।
వషట్కారాది మంత్రాత్మనా వా దేవాన్ ప్రీణయతి స వషట్కారః। దేవతా వా, ప్రజాపతిశ్చ వషట్కారశ్చ ఇతి శ్రుతేః। చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవ చ।
హూయతే చ పున ర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు॥
ఇత్యాది స్మృతే శ్చ" — శం. భా.

వషట్కారముచే యజ్ఞములం దుద్దిష్టు డగుటచే యజ్ఞస్వరూపియగు విష్ణువునకు వషట్కారః అని పేరు. వషట్కారాది (ఆశ్రావయ ఇత్యాది) మంత్రాత్మకుడై దేవతల ప్రీతుల గావించువాడగుట చేతను విష్ణువు 'వషట్కారః' అని చెప్పబడినాడు. 'ప్రజాపతిశ్చ వషట్కారశ్చ' అను శ్రుతి ననుసరించియు, స్మృతుల ననుసరించియు ఛందస్యుడగు (వేదసారరూపుడగు) ప్రజాపతియు' పరమేశ్వరుడును వషట్కార రూపుల-అని యర్థము.

విశ్వము నంతయు స్వేచ్ఛగా స్వవశమున నుంచుకొను వాడగుటచే పరమేశ్వరునకు 'వషట్కారః' అను నామము సార్థక మని శ్రీపరాశరభట్టాదు లిట్లు వివరించిరి.

"వషట్కారః-సర్వం, వశం స్వేచ్ఛానువర్తి, కరోతీతి;
కరోతేః కర్మణ్యణ్, వశ కాన్తౌ ఇత్యస్మా ద్ధాతోః"

—పరాశరభట్టభాష్యం.

"వషట్కారః-సర్వం, వషట్ వశం స్వేచ్ఛావర్తి కరోతీతి"

—నిర్వచనవ్యాఖ్య.

"స్వేచ్ఛయా యో వశే సర్వం కరోతి స వషట్కారః"

—నిరుక్తివ్యాఖ్య.

## వౌ(ఆదిత్యః), షట్ (ఋతవః) : వౌషట్ :-

"వౌషళితి, వషట్కరోతి అసౌ వావ వా వృతవః ష శేత
మేవ త దృతు ష్వాదధాతి, ఋతుషు ప్రతిష్ఠాపయతి,
యాదృగివ వై దేవేభ్యః కరోతి తాదృగి వాస్మై దేవాః
కుర్వన్తి" —ఐ.బ్రా. 3-6.

"మంత్రే పూర్వభాగో వౌ శబ్దో నిపాతత్వా ద్వాగతి
ప్రజనేత్యాది ధాతుజత్వా ద్వా గమనస్వభావ మాదిత్య
మభిధత్తే। త దేత దభిప్రేత్య అసౌ వావ వా విత్యుక్తమ్।
వసంతాద్యా ఋతవః సంఖ్యావశాత్ షడిత్యభిధీయంతే।
తన్మంత్రపాఠేన ఏత మేవ వౌ శబ్దాభిధేయ మాదిత్యం
షట్ శబ్దాభిధేయేషు ఋతుషు ఆదధాతి। న కేవల మాధాన
మాత్రమ్, కింతు తేషు ఋతుషు ప్రతిష్ఠాపయతి;
స్థైర్యేణావసాపయతి। ఏవం సత్యసౌ హోతా దేవేభ్యో
యాదృశ మేవ ప్రయోజనం కరోతి తాదృశ మేవ ప్రతిష్ఠా
రూపం ప్రయోజనం అస్మై హోత్రే తద్ద్వారేణ
యజమానాయ దేవాః కుర్వంతి" —సా. భా.

వౌషట్ అను మంత్రము వౌ-షట్ అను పదద్వయాత్మకము. వౌ అను పూర్వపదము నిరంతరగమనశీలు డగు ఆదిత్యుని బోధించును. షట్ శబ్దము వసంతాది షడృతు వాచకము. ఇట్టి యీ పదముల రెంటితో రూపొందిన వౌషట్ అను మంత్రమును బఠించుచో నాదిత్యుడు ఋతువులయందాధానము చేయబడును. అంతే గాదు; అందు ప్రతిష్ఠితుడు గావింపబడును. అనగా ఋతుధర్మములయందు వ్యాకులపాటు సంభవింపకుండ ఋతువుల స్వస్వ ప్రయోజన సమర్థము లగునట్లు గావించును. (ఋతూన్ కల్పయతి స్వ స్వ ప్రయోజన సమర్థాన్ కరోతి, తాపతా ఋతవః వ్యాకులతా మంతరేణ ప్రతితిష్ఠంతి — సా. భా. ఐ బ్రా. 3-6) ఈ వషట్కారణముచే హోత దేవతల నెట్లు తృప్తి నొందించునో దేవతలును నట్లే ఋతువ్యవస్థారూపమగు ప్రయోజనమును హోతద్వారా యజమానుని కనుగ్రహింతురు—అని యర్థము.

విధివిహితముగ నా యా ఋతువులయందు - నా యా కాలములయందు యజనము జేయువారు ఋతౌ యజన్తి, కాలే కాలే యజన్తీతి వా ఋత్విజః — చూ. భారతీశబ్దము) ఋత్విజులు. ఇట్లు యజనము జేయువ నాదిత్యు నా యా ఋతువుల యందు ప్రతిష్ఠితుని గావింతురు. ఆదిత్యునకు ఋతుకర్త యని ప్రసిద్ధి. యజనము చేసినను, చేయక పోయినను నాదిత్యుడు స్వభావముగనే ఋతువుల (కాల భాగముల) బ్రవర్తింపజేయును. కాని యజనము జేయుచో యజ్ఞ ప్రభావితుడై ప్రీతుడగును. ఋతువులను సువ్యవస్థితములై పరస్పర సంకీర్ణములు గాక లోకకల్యాణకరము లగు ఋతుధర్మములతో నొప్పి యజమానుల ననుగ్రహించునన్న భావము. కాన వౌషట్ అను మంత్రము శబ్దశక్తిచే ఆదిత్యుడు ఋతువులయందు ఆధానము చేయబడి సుప్రతిష్ఠితు డగుటను దెలియజేయును.

## వాక్, షట్ (ఋతువులు) - వషట్ (ఆహుతా) :-

'వాక్-షట్' అను పదముల చేరికచే గూడ పదమేర్పడుచున్నదని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"స వై వౌగితి కరోతి। వాగ్వై వషట్కారః। వాగ్ రేతః।
రేత ఏవైతత్ సించతి। షడితి। ఋతవో వై షట్। తద్
ఋతుష్వేవ ఏతద్ రేతః సిచ్యతే: తదృతవో రేతః సిక్త
మిమాః ప్రజాః ప్రజనయంతి। తస్మా దేవం వషట్ కరోతి ॥"

— శ. బ్రా. 1-7-2-21.

"వౌగితి ఉచ్చారణం కుర్యాత్। తత్ ప్రశంసతి వాగ్వా ఇతి।
వౌ గిత్యేత దౌకారస్థానే అకారేకృతే వాగితి భవతి।
అతో వషట్కారో వాక్। సా చ వాగ్ రేతః, సేచనసాధన
త్వాత్। ఉచ్చారణ మేవ తత్సేకః। తథా షడితి కరోతీ
త్యనుషజ్యతే। బ్రూయా దిత్యర్థః। సంఖ్యాయా ఋతుష్వపి
సంభవాత్। ఋతవ ఏవ షట్ ఇత్యనేన వివక్షితాః; ప్రాక్
షడిత్యతః వౌగి త్యేతస్య స్థాపనాత్। తేన సిక్తం రేతః
ఇమాః సర్వాః ప్రజా ఉత్పాదయన్తి తస్మా దేవం వౌషడితి
వషట్కుర్యాత్" — సా. భా.

'వౌక్-షట్' అను పదముల జేర్చి వౌషట్ అని యుచ్చరింపవలెను. వాక్ అనగా వాక్కు, ప్రజననశక్తి సాధన మగుటచే నీ వాక్కు రేతోరూపము. ఉచ్చారణమే రేతః సేకము. ఇక షటు శబ్దము షడృతువులకు నుపలక్షకము. వాక్కు నుచ్చరించుచు రేతఃసేచనము చేసి ఋతువులయందు శక్తి నాధానము జేయుచో ఋతువులు వాగ్రేతఃసిక్తములై ప్రభావితము లగును. సువ్యవస్థితములై సుప్రజాప్రజనని సమర్థములగును-అని యర్థము.

వౌక్ అనగా వాక్కు అని యిట జెప్పబడినది. అనగా వేదవాక్కు అని యర్థము. అందుచే వౌషటు అను మంత్రము శబ్దశక్తిచే 'వేదవాక్కు షడృతువులయందు ఆధానము నియబడుట'ను దెలియజేయును. వషట్కార

పూర్వకముగ వేదమంత్ర ప్రభావితము లయిన ఋతువులు దివ్యశక్తి సంపన్నము లగుచు నుత్తమ సంస్కార సంపన్నము, ఓజస్సహశ్శక్తి విలసితము, లోకక్షేమ సంధాయకము నగు ప్రజను (ప్రకర్షేణ జాయత ఇతి ప్రజా) గలుగ జేయునని భావము.

ఇట వాక్కుచే ఋతువులు ప్రభావితము లగునని చెప్పబడినది. ఋతువు లనగా వసంతాది షడృతువులే కాదు. ఋతువులచే నుపజీవితులై ఋతుయాజులై, (విధివిహిత కాలాతిక్రమణముజేయక యజనము చేయువారై) వరలెడి ఋత్విజాదులు నిట ఋతుశబ్దముచే నుపలక్షితు లగు చున్నారు. అట్టి ఋత్విజులను ఋతురూపులుగ దర్శింపవలె నని శ్రుతి సంప్రదాయము ('ఋతవ ఋత్విజః। సయోహ వా ఋతవ ఋత్విజ ఇతి వేద'—శ.బ్రా. 11-2-7-2, కాన నిట ఋతువు లనగా ఋత్విజులు నగుదు రని తెలియ నగును. వేద వాక్కు ఋతురూపు లగు నట్టి ఋత్విజులందు లేక యజమానులందు ప్రతిష్ఠితమై ఓజస్సహశ్శక్తి సమన్వితమై విలసిల్లు ననియు శ్రుతి చెప్పుచున్నది.

"యద్వేవాషాఢా ముపదధాతి ; వాగ్వాఽఆషాఢా । వాచైవ తద్దేవా అసురాన్ సపత్నాన్ భ్రాతృవ్యా నస్మా త్సర్వస్మా దసహంత । తథై వైత ద్యజమానో వాచైవ ద్విషంతం భ్రాతృవ్యమస్మా త్సర్వస్మా త్సహతే....ఋతుషు తద్వాచం ప్రతిష్ఠాపయతి। సేయం వాక్ ఋతుషు ప్రతిష్ఠితావదతి। ... అషాఢాఽసి సహమానా (వా. సం. 13-26) ఇతి । అసహన్త హ్యేతయా దేవా అసురాన్ ।

—శ.బ్రా. 6-5-3-4.

"అథాధ్యాత్మమ్....వా గషాఢా....ఆత్మనో హ్యేవేయం వాక్....త్ర్యాలిఖితా భవతి। త్రేధా విహితా హి వాక్-ఋచో యజూంషి సామాని।" —శ.బ్రా. 6-5-3-4.

చయనమునందు అషాఢేష్టకోపధానమునకు సంబంధించిన వాక్యము లివి. ఋగ్యజుఃసామరూపమైన వేదవాక్కు ఇట 'అషాఢా' యని చెప్పబడు చున్నది. ఈ వాక్కుచేతనే దేవత లసురులను సహించిరి (తిరస్కరించిరి). ఈ వాక్కు అనంతశక్తి సంపన్న మగుటచే "సహస్రవీర్యాఽసి" (వా.సం. 13-26)- అనియు జెప్పబడుచున్నది. అనంతశక్తిమహితమై శత్రుసహన శక్తిసంపన్న మగుటచే నీ వాక్కుకు 'అషాఢా' యని యన్వర్థనామము. ఈ వాక్కుచే దేవతల వలె యజమానుడును శత్రు సహనశక్తి సంపన్నుడగును; ఋతువులయందు, అనగా ఋత్విజులయందు. త్రయీరూపమగు నీ వాక్కు అషాఢమై - పరాభిభవన శీలమై - విలసిల్లును - అని యర్థము.

కాన, వషట్కారము (వాక్ - షటు) చే వాక్కు ఋతువులందు ప్రతిష్ఠితమగుట యనగా-(1) అన్ని ఋతువులందును నా యా కాలములందు జేయదగిన యజ్ఞకర్మలద్వారా వేదవాక్కును ప్రతిష్ఠితము గావించుట; సహస్రవీర్యాత్మకమగు నీ వేదవాక్కుచే వసంతాది ఋతువులు ప్రభావితము లగుట' (2) ఋతువుల యందు అనగా ఋత్విజులయందు ప్రతిష్ఠితమై త్రయీరూపమగు నీ వేదవాక్కు అనంతశక్తి సంపన్నమై, అషాఢమై విలసిల్లుట - యను రెండర్థములు నిట దెలియ దగియున్నవి. కాగా, అనంతశక్తి సంపన్నమగు నీ వాక్కు ఋత్విజులను, యజమానుని, యజ్ఞాదికర్మలను, తద్ద్వారా దేశకాలములను ప్రభావిత మొనర్చి సుప్రజా ప్రజనన సమర్థమై, లోకకల్యాణహేతువై విలసిల్లునని 'వషటు' శబ్దము శబ్దశక్తిచే ప్రబోధించుట తెలియును.

## వాక్కు - షడంగములు : వషట్ :-

స్వాహా, స్వధా శబ్దములవలెనే వషట్కారము గూడ పరదేవతా వాచక మని షడ్వింశ బ్రాహ్మణ మిట్లు వర్ణించుచున్నది.

"చత్వారోఽస్యై వేదాః శరీరమ్। షడంగా న్యంగాని... సా స్వాహా। సా స్వధా। స వషట్కారః। సైషా దేవేషు వషట్కారభూతా ప్రయుజ్యతే" —5-7-2.

పరదేవతకు నాలుగువేదములు శరీరము. శిక్షాదిషడంగము లంగములు. ఆమెయే స్వాహా, స్వధా, వషట్కారము. దేవయజ్ఞములందు జేయబడెడి వషట్కారము పరదేవతారూపము — అని యర్థము. పితృయజ్ఞములందు జేయబడెడి స్వధాకారమే వషట్కారము (స్వధా నమ ఇతి వషట్కారః - శ. బ్రా. 2-3-1-24) అని పూర్వము వివరింపబడినది. అందుచే నిచటి వషట్పదము గూడ, పూర్వోదాహృత శ్రుతి ననుసరించి వాక్-షట్ పదముల చేరికచే సిద్ధించిన దనియే తెలియనగును. వాక్ అనగా వేదవాక్కనియే యర్థము. కాని యిచటి 'షట్' పదము ప్రకరణము ననుసరించి షడంగములకు గూడ నుపలక్షకము. నాలుగువేదములు శరీరము, షడంగములు - అవి పరదేవతావర్ణన మిట గన్పట్టుచున్నది. కాన నిచటి వషట్ పదముచే పరదేవత షడంగ సహిత వేదవాక్స్వరూపిణి - అనగా మంత్ర బ్రాహ్మణాత్మక వేదవాక్స్వరూపిణి - యని తెలియును.

కాన పై ప్రమాణముల ననుసరించి వషట్ అనగా :- 1. షడంగోపేత వేదవాక్కు, 2. తత్ప్రతిపాద్యయు వేదశరీరిణి యగు పరాదేవత, 3. షడృతు ప్రతిష్ఠ డగు ఆదిత్యుడు, 4. ఋతు (ఋత్విజ) ప్రతిష్ఠితమగు వేదవాక్కు, 5. హవిస్సుల వహించెడి దేవపాత్రము, 7. ఓజస్సహశ్శక్తి సంపన్నము లగు వాక్-ప్రాణాపానములు. 7. ఆశ్రావయేత్యాది మంత్రపంచకముచే హూయమాను డగు విష్ణువు. 8. జగత్తును తన వశమున నుంచుకొను పరమేశ్వరుడు 9. ఛందస్యు డగు ప్రజాపతి - ఇత్యాద్యర్థములు శ్రుతిస్మృతుల వలన దెలియుచున్నవి. కాగా వేదాదిశబ్దములవలెనే యీ శబ్దముగూడ వేదమునకును పరమేశ్వరునకు గల ప్రతిపాద్య ప్రతిపాదక భావసంబంధము నభివ్యక్తము చేయుట స్పష్టము.

ఇట్లు స్వాహా - స్వధా - వషట్కార శబ్దములు విలక్షణ మహిమాన్వితములై యభిమతఫల వర్ధకము లగుటచే శ్రుతియందు వాగ్ధేను స్తనములుగ వర్ణింపబడినవి.

## స్వాహా - స్వధా వషట్ - హంతకారములు - వాగ్ధేను స్తనములు:-

"వాచం ధేను ముపాసీత - తస్యాశ్చత్వారః స్తనాః - స్వాహా కారో వషట్కారో హంతకారః స్వధాకారః - తస్యై ద్వౌ స్తనౌ దేవా ఉపజీవంతి స్వాహాకారం చ వషట్కారం చ, హంతకారం మనుష్యాః, స్వధాకారం పితరః - తస్యాః ప్రాణ ఋషభో, మనో వత్సః" —బృ. ఉ. 5-8-1.

వేదవాక్కును ధేనువుగ నుపాసింపుడు. ఆ ధేనువునకు స్వాహాకారము, వషట్కారము, హంతకారము, స్వధాకారము - అనియెడి స్తనములు నాలుగు గలవు. ధేనువు క్షీరము నొసగురీతిని, ఈ వేదవాగ్ధేనువు దేవాదులకుపభోగ్య మగు నన్నము నొసగుచుండును. అందు దేవతలు స్వాహాకార వషట్కారముల వలనను మనుష్యులు హంతకారము వలనను, పితరులు స్వధాకారము వలనను నుపజీవితు లగుచున్నారు. ఆ వాగ్ధేవునకు పతియగు వృషభము ప్రాణము. మనస్సు వత్సము- అని యర్థము.

ఇట స్వాహాకారాదులు స్తనము లనుటచే నట్టి లక్షణములు గల వాక్కు వేద వాక్కే. అందుచే నిట వేదవాక్కును ధేనువుగా నుపాసింపవలె ననియే యర్థము. ధేనువు ఆత్మసారమగు క్షీరమును వత్సమునకును, తనను పాలించువారలకును నందజేయును. అట్లే వేదవాగ్ధేనువు అభిలషణీయ స్వర్గాదిఫలములను తన నుపాసించి పాలించు ప్రజకు పంచిపెట్టుచుండును. ఆకలిగొని వచ్చినంతనే పాలు చేపునకు వచ్చి ధేనువు క్షీరధారల గురియు చుండును. అట్లే ఫలజిజ్ఞాసా పరవశమై మనో

రూపవత్సము వేదవాగ్ధేనువును సమీపింపగనే -అర్థావ్యనుసంధానపూర్వకముగా వేదవాక్కు సుపాసింపగనే - యా ధేనువు స్వాహాకారాది స్తనముల ద్వారా యభిమత ఫలములనెడి క్షీరముల గురియించును.

'పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్'

అకలిగొని గీతాధేనువును జేరిన వత్సము పార్థుడు. గీతాధేనువు గురియించిన క్షీరధారల ననుభవించినది పార్థుడే కాదు పార్థునితోపాటు ఆ ధేనువును పాలించెడి ధీమంతులగు విద్వాంసు లెల్లరు నాస్వాదించుచున్నారు. అట్లే అర్థావ్యను సంధాన పూర్వకముగ భక్తి ప్రవణమగు మనస్సుతో త్రయీలక్షణ మగు వేవాక్కు నుపాసించుచో దిత్ఫలము నాతడే గాదు, ఆ ధేనువును బాలించు ధీమంతులెల్లరు తత్ఫలభాజను లగుచుందురు.

స్వాహాకారాదు లిట వాగ్ధేనుస్తనములుగ రూపణము జేసి చెప్పబడుటచే నవి వాగ్రూపములు, ఛందఃసారము గురియించు మహిమాన్విత మంత్రములు నగుట స్పష్ట మగుచునే యున్నది అందు స్వాహాకారవషట్కారములు దేవతల హవిర్దానముల యందును, - అనగా దేవయజ్ఞాదులందును, స్వధాకారము పితరుల హవిర్దానములందును, -అనగా పితృయజ్ఞములయందును, హంతకారము మనుష్యుల (అతిథుల) కన్నాదుల నొసగు నపుడును - అనగా మనుష్యయజ్ఞము లందును నుప యుక్తము లగుచుండును.

'అతిథిదేవో భవ; అభ్యాగతః స్వయం విష్ణుః' -ఇత్యాది వచనముల ననుసరించి భక్తితో నతిథుల కాతిథ్య మిచ్చి సత్కరించు సమయమున వినయపూర్వకముగ జెప్పెడి వచనమునకు -అనగా 'నా స్త్యుష్ణతా నా స్త్యపూపో నాస్త్యోదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్యమ్' (ఆముక్తమాల్యద) -ఇత్యాది వచనమునకు హంతకార మని పేరు.

"అపేక్షితం యాచితవ్యం త్యాజ్యం చైవానపేక్షితమ్।
ఉపవిశ్య సుఖేనైవ భోక్తవ్యం స్వస్థమానసైః॥" -

అని యుపచార వచనముల బలికెడి యాచారము నేటికిని గలదు. ('హంతకారః, యద్యదపేక్షిత మిత్యర్థః'- అన దగిరి)

ఇట్లు ఈ స్వాహాకారాదులు నాల్గును వివిధయజ్ఞములందు హవిర్దానవాచకములై, యభిమతఫలసాధనము లగుటచే వాగ్ధేనుస్తనములుగ శ్రుతిచే నిట గీర్తింపబడినవి. ఉత్తమఫలసాధనము లగు నిట్టి స్తనములతో నొప్పెడి వేదవాగ్ధేనువు నుపాసింపుడు (వాచం ధేను ముపాసీత); ఉపాసించి వా గుపాధిక బ్రహ్మభావము నొందుడు - అని శ్రుతి యాదేశము.

"ఏవం వాగ్ధేనూపాసక స్తాద్భావ్య మేవ ప్రతిపాద్యతే" —శం.భా
'తాద్భావ్యం, యథోక్త వాగుపాధికబ్రహ్మరూపత్వ మిత్యర్థః'
—ఆనందగిరి.

కాన స్వాహా-స్వధాదులు కేవల హవిర్దానవాచకములే కాదు. అభిమత ఫలముల నొసగి ప్రోది సేయు మహిమాన్విత మంత్రములు. ఇవి యజ్ఞాదులందు వినియుక్తము లగుచు కర్మతత్త్వబోధకములగుచునే తమను వాగ్ధేనుస్తనములుగ దర్శించి వాగ్ధేనూపాసనము నెవరు జేయుదురో వారికి బ్రహ్మతత్త్వావబోధకములు గూడ నగుచుండు నని శ్రుతితాత్పర్యము. కాన వేదవాక్కు కామధేనువు; స్వాహా స్వధా వషట్కార రూపిణి; తత్ప్రతిపాద్య పరాదేవత లేక పరమేశ్వరుడు స్వాహా స్వధా వషట్కార రూపులు -అని స్పష్టమైనది, కావుననే నివి బ్రహ్మ (పరదేవతా) వాచకములుగ బ్రసిద్ధము లైనవి.

"ఓం స్వాహా స్వధా వషట్ నమ ఇతి పంచ బ్రహ్మణో
నామాని" —భట్టభాస్కరః,రుద్రాధ్యాయభాష్యే.

ఓం, స్వాహా, స్వధా, వషట్,-అనెడి యీ యైదును బ్రహ్మకు నామము లని యర్థము.

"హిరణ్యగర్భం త్వా మాహుః స్వధా స్వాహా చ కేశవ" అనుచు భారతము (12-44-16)కూడ పరమేశ్వరుని స్వధా స్వాహాదిశబ్దములతో గీర్తించినది.

కావుననే 'నమః స్వధాయై స్వాహాయైనిత్య మేవ నమోనమః'-అనుచు కర్మాచరణ సమయమున నా పరదేవతను స్మరించి యారాధించెడి యాచారము పరంపరాగత మైనది.

## స్వాహా, స్వధా, వషట్ శబ్దములు-చరిత్రకారులు :-

స్వాహా స్వధా వషట్ శబ్దములు మహిమాన్వితములు, వివిధార్థ బోధకములు, వేదవాచకములు నగుచు, పరతత్త్వబోధకములు నగుట శ్రుతి స్మృతి పురాణానుసారముగ దర్శించితిమి. కాని చరిత్రకారులచే జేయబడిన భాషాంతరీకరణములలో నీ పదములు కేవలము హోమసంకేత వాచకములుగను, జయజయధ్వని వాచకముల వంటివిగను గ్రహింపబడినవి All bliss to you, All hail to thee — అని యీరీతిగ అనువదింపబడినవి ఇట్టి యీ యనువాదములవలన నీ పదముల యర్థగాంభీర్యమే మాత్రము చెప్పబడుటలేదు వారు కూర్చిన వైదశబ్దకోశము (Vedic Index — A. A. Macdonel and A. B. Keith) లో ఈ పదములకు స్థానమే కల్పింపబడలేదు. ఈ పదముల సార్థకతను శ్రుతియే పెక్కుతీరుల వివరించినది. శ్రీ సాయణాదిభాష్య కర్తలును స్వాహాదిపదములకు గల యాస్కప్రోక్తము శ్రుత్యనుగుణము నగు అక్షరార్థమునుగూడ నెడ నెడవివరించుచు వచ్చిరి. అక్షరార్థమును వివరించినపుడే యా పదముల యర్థగాంభీర్యము దర్శింప నగును.

వేదములు మానవరచితము లని చెప్పుచో స్వాహా స్వధా వషట్ శబ్దములకు శ్రుతి ప్రదర్శించిన యర్థము లెట్లు పొసగును? షడంగోపేతము లయిన నాల్గువేదములను పరాదేవతకు శరీర మగుట యెట్లు? ఆ వేదవాక్కు ప్రజాపతికి స్వభూత మగుట యెట్లు?

అదియునుగాక, వేదములు ఆర్య్య లనెడి పలుతెగలవారి రచనలని యొకవేళ నంగీకరింతము. అట్టియెడ వారును ఇతర రచయితల వలెనే దేవతా ప్రీతికరము లయిన స్తోత్రముల గూర్చియుండ వచ్చును. వానిచే దేవతల తృప్తి నొందింప నగును. దేవతల ప్రీతి నొందింపగల్గిన యా రచనలు నిజముగ మహిమోపేతములే గావలెను. కాని యా రచయితలే స్వాహా పదముయొక్క యావశ్యకతను గూర్చి వారి తొలి రచన యని చెప్పబడెడి ఋగ్వేదమునందే-

"స్వాహాయజ్ఞం కృణోతన; స్వాహాకృతం హవి రదంతు
దెవాః; స్వాహా గాయత్రవేపసే హవ్య మింద్రాయ కర్తన;
స్వాహా స్తోమస్య వర్ధనా"-

అని పెక్కురీతుల నుగ్గడించుచు (1) స్వాహాకారపూర్వకముగనే యజ్ఞము జేయుడు (2) స్వాహాకార పూర్వక మగు హవిస్సునే దేవతలు గ్రహింతురుగాక (3) సోమ శరీరుడగు ఇంద్రునకు స్వాహాకారపూర్వకముగ హవిస్సు నిండు ( ) స్వాహాకారముచే ప్రీతులైన దేవతలు మంత్రములందు (తమరచనల యందు) దివ్యత్వము నాపాదింతురు-కాన నిట్లు స్వాహాంతమగు హోమమంత్రమే మహిమాన్వితమగును-అని చెప్పిరి. ఇట్లే స్వధా, వషట్ శబ్దముల విషయమై కూడ జెప్పిరి ఇదియెట్లు పొసగును. స్వాహాకారాదులు లేనిచో వానిచే రచింపబడిన మంత్రములును, చేయబడెడి యజ్ఞములును ఈయబడెడి ఆహుతులును వీర్యవత్తరములు కాజాలవనియనుటలోని తాత్పర్య మేమి? ఈ స్వాహా, స్వధా వషట్ శబ్దముల మొదట గూర్చిన రచయిత యెవరు? ఆ రచయితయొక్క యీ కూర్పు నితర రచయితలును కర్మప్రవర్తకులును, నామోదించి యుండవలెను. ఆమోదించి యీ పదములకిట్లు పట్టము గట్టుటకు కారణ మేమి?

ఏ రచయితయు తన రచన నిరర్థక మనిభావించుచో రచింపడు. వేదములు అంతరదృష్టిలేం కేవల బాహ్యదృష్టిగల్గిన నిరర్థకరచనలే యగుచో నెపుడో రూపటి యుండెడివి. అట్లుగాక ఇది గురుశిష్యపరంపరా ప్రాప్తము

లయినవి. కాన నవి సార్థకములు భూతార్థకథనములు గావలెను. అగుచో స్వాహా, స్వధా: వషట్ స్వాహాయజ్ఞః, స్వాహావరః, స్వధావాన్, స్వధాపతిః ఇత్యాది పదము లన్నియు సార్థకములే కావలెను. సార్థకములే యగుచో స్వాహా, స్వధా వషట్ శబ్దములకు శ్రుతిప్రదర్శించిన యావదర్థమును గ్రహించుట సమంజసము. అట్లు గాక కేవలసాంకేతికపదము లనియో రూఢిపదము లనియో గ్రహించుచో శ్రుతిసమ్మతములు గాని యర్థములతో శ్రుతుల కర్థము జేప్పుట యగును. శ్రుతిసమ్మతమైన యర్థమునే గ్రహించుచో 'ఈ వేదమంత్రములు కేవలం దేవతాస్తుతులు మాత్రమే, ఇందు ఆంతర దృష్టి లేదు - ఇత్యాది చారిత్రికుల యూహ లుపపన్నములు గానేరవు.

ఇట నొక విషయము పరిశీలింప నగును. షడ్వింశబ్రాహ్మణమున స్వాహారూపిణి యగు పరాదేవత చతుర్వేద శరీరిణిగా పేర్కొనబడి మరల 'ఋగ్యజుః సామగతిః'—అనగా ఋగ్యజుః సామరూప పాదత్రయాత్మికగా నిర్దేశింపబడినది. చతుర్వేదాత్మిక యగు నా దేవి 'త్రిపద' యగు టెట్లు? ఈ విషయము త్రయీస్వరూపమును బరిశీలించినగాని తేటపడదు. కాన త్రయీ స్వరూపమును జూతము.

# త్రయీ

కర్మ భక్తి సాంఖ్యయోగ తత్త్వబోధ సంభృతాం
ఋగ్-యజుశ్చ సామచేతి మంత్ర బృందభాసురామ్ ।
త్రాయతే జగచ్చ యా త్రయీతి లోకవిశ్రుతా
తాం త్రయీం హరిప్రియాం నమామి వేదమాతరమ్ ॥

విద్యాతపః కర్మపరా బుధా, యాం
కాంక్షంతి దేవీం యువతిం సువేశామ్ ।
సాలంకృతా నః పరిరక్షితు స్వాన్
చతుష్కపర్దా త్రిపదా త్రయీ శ్రీః ॥

— వేదమాతృస్తవ.

వేదమునకు త్రయీ యనియు, త్రయీవిద్య యనియు నామములు ములు కాని యిట నొక యాక్షేపము చెప్పబడుచున్నది.

## 'అథర్వవేదము అర్వాచీనము' - ఆక్షేపము :

'ఋగ్యజుః' సామ వేదముల మూడింటికిని గలిపి మాత్రమే త్రయీ రము; నాల్గవది యగు అథర్వ వేదము ఆర్య లనెడి వారియొక్క అనంతర రచన; అయ్యది ఋగ్యజుః సామ వేదములకు 'త్రయీ' యను వ్యవహార కిన తరువాత రచింపబడినది; లేదా అనంతర కాలీన రచన యగు అథర్వ నకు వేదత్వము లేదనుటకే యీ మూడింటికిని గలిపి 'త్రయీ' యను

నామము ప్రచారము లోనికి వచ్చియుండవచ్చును' — అని చారిత్రికులచే నూహింప బడుచున్నది. ఇందుకు చూపబడుచున్న ప్రమాణము లివి

(1) వేదత్రయోత్పత్తి :—

"ఋచః సామాని జజ్ఞిరే .... యజు స్తస్మా దజాయత"

ఋ. 10-90-7.

"త్రయో వేదా అజాయన్త, ఋగ్వేద ఏ వాగ్నే రజాయత,
యజుర్వేదో వాయోః, సామవేద ఆదిత్యాత్" —ఐ. బ్రా. 5-32.

"వేదై రశూన్య స్త్రిభి రేతి సూర్యః" —తై. బ్రా. 3-12-9-1.

"య మృషయ స్త్రైవిదా విదుః ఋచః సామాని యజూంషి"
—తై. బ్రా. 1-2-1-66.

"సైషా త్రయ్యేవ విద్యా తపతి" —తై. ఆ. 14-1.

పై శ్రుతి వచనముల వలన వేదత్రయోత్పత్తియే చెప్పబడుచున్నది. పరమేశ్వరుడు వేదత్రయాత్మకుడుగను, వేదవిదులు ఋగ్యజుః సామరూప త్రయీవిదులుగను చెప్పబడుచున్నారు.

(2) ఋగ్యజుఃసామలకే యజ్ఞాంగత్వము:—

"యద్వై యజ్ఞస్య సామ్నా యజుషా క్రియతే శిథిలం
(తత్) య దృచా త ద్దృఢమ్" —తై. సం. 6-5-10-3.

"సైషా త్రయీ విద్యా యజ్ఞః శ. బ్రా. 1-1-4-3.

"ఉచ్చైర్ ఋచా క్రియతే, ఉపాంశు యజుషా ఉచ్చైః సామ్నా"
—సత్యా. శ్రౌ. సూ. 1-1-10.

"యజ్ఞం వ్యాఖ్యాస్యామః। సత్రిభి ర్వేదై ర్విధీయతే।"

—ఆప. పరి. సూ. 3; సత్యా. శ్రౌ. సూ. 1-1-1.

"ఋగ్వేదేన హోతా కరోతి, సామవేదే నోద్గాతా, యజుర్వేదే నాధ్వర్యుః, సర్వై ర్బ్రహ్మ" —ఆప. పరి. సూ. 18, 19,20,21.

"యదృచైవ హౌత్రం క్రియతే, యజుషాఽఽధ్వర్యవం, సామ్నోద్గీథం వ్యారబ్ధా త్రయీ విద్యా భవతి। అథ కేన బ్రహ్మత్వం క్రియత ఇతి త్రయ్యా విద్యయేతి బ్రూయాత్"

—ఐ. బ్రా. 5-33.

పై వచనములు ఋగ్యజుఃసామలకే యజ్ఞాంగత్వమును దెల్పుచున్నవి. యజ్ఞమున ప్రధాన ఋత్విజులు నలుగురు. అందు హోతయను ఋత్విక్కు ఋగ్వేదముచే హౌత్రమును, అధ్వర్యుడు యజుర్వేదముచే అధ్వర్యవమును, ఉద్గాత సామవేదముచే ఔద్గాత్రమును నిర్వర్తింతురు. ఇక బ్రహ్మయను నాల్గవ ఋత్విక్కు త్రయీవిద్య చేతనే, అనగా ఋగ్యజుఃసామల చేతనే బ్రహ్మత్వమును నిర్వహించును -అని చెప్పబడుచున్నది.

(౮) స్మృతులు కోశములు త్రయీ వ్యవహారము.

షట్త్రింశ దాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్"

--మను స్మృతి. 3-1.

"ఇతి వేదా స్త్రయ స్త్రయీ" --అమరకోశః.

పై మనుస్మృతి, అమరకోశాదుల వచనముల ననుసరించియు ఋగ్యజుః సామ వేదములు మూడింటికి మాత్రమే త్రయీవ్యవహారము, వేదత్రయాఖ్యయున ప్రసక్తియు గలదు.

ఇట్లు శ్రుతి, శ్రౌతసూత్ర, స్మృతి కోశాది ప్రమాణముల ననుసరించి వేదత్రయోత్పత్తి మాత్రమే చెప్పబడి యా వేదత్రయము చేతనే యజ్ఞనిర్వాహణము సిద్ధించుటచే నీ వేదత్రయమునకు మాత్రమే త్రయీ, త్రయీవిద్య యనెడి నామములు శ్రుతుల యందు ప్రసిద్ధమై, తరువాత స్మృతి కోశాదుల యందును నట్లే గ్రహింపబడి నటుల గన్పట్టుచున్నది. కాన నాథర్వవేదము యొక్క యావశ్యకత లేదనియు, నందుచేతనే చాల కాలము వఱకు అథర్వణమునకు వేదత్వ మంగీకరింప బడ లేదనియు, నందుచే నది యాయుర్వ లనెడి వారి తరువాతి రచన కావచ్చు ననియు చారిత్రికులు [1] చెప్పుచున్నారు.

కాన నీ విషయముల బరిశీలించి త్రయీ స్వరూపమును దర్శింపవలసి యున్నది. అందుకై మొదట నథర్వవేదము యొక్క యావశ్యకతను, ప్రాశస్త్యమును, శ్రుతిస్మృత్యాదు లందు గల యథర్వవేద ప్రస్తావమును బరిశీలించి, తరువాత త్రయీపదము యొక్క సంప్రదాయానుగతమైన యర్థమును బరిశీలింతము.

## 2. అథర్వవేదము ( బ్రహ్మవేదము ) ఆవశ్యకత :-

బ్రహ్మకర్తవ్యోపదేశ తత్పరమగుటచేసి యజ్ఞవిషయమున నథర్వవేద మావశ్యకమే యగుచున్నది. హోత్రము ఆధ్వర్యవము, ఔద్గాత్రము -లనెడి క్రియలను ప్రతిపాదించుట యందు మాత్రమే ఋక్ యజుః సామ వేదములకు తాత్పర్యము. అందుచే వీనికి బ్రహ్మకర్తవ్యమును ప్రతిపాదించుటయందు

1. మారిస్ బ్లూమ్‌ఫీల్డు - The Atharva veda and the Gopath Brahmana యస్. రాధాకృష్ణన్ - Indian Philosophy chap 3-1, 2. ఈయనయు బ్లూమ్‌ఫీల్డు విట్నే యను పాశ్చాత్యపండితుల యభిప్రాయములనే యువహరించి వారితో నేకీభవించెను.

దాత్పర్యము లేదు. ఏల యన హౌత్రమును బ్రతిపాదించు ఋగ్వేదమునకు ఆధ్వర్యవమును గాని ఔద్గాత్రమును గాని ప్రతిపాదించుట యందు దాత్పర్యము లేదు కదా। యజుఃసామ వేదముల విషయమున గూడ నిట్లే. కనుక బ్రహ్మకర్తవ్యమును బ్రతిపాదించుటకు నాల్గవవేద మావశ్యకమే యగును. అది యథర్వవేదము.

కాని బ్రహ్మత్వము ఋగ్యజుః సామ వేదము లందు నచటచట సూక్ష్మముగ జెప్పబడి యున్నను నది యసంపూర్ణము, సమగ్రముగ బ్రహ్మకర్తవ్యమును బ్రతిపాదించునది యథర్వవేదమే.

మఱియు వాఙ్మనస్సులు రెండింటితో నిర్వర్తింపదగినది యజ్ఞ శరీరము అందు వాగ్రూప మగు శరీరార్ధభాగము ఋగ్యజుః సామల చేతను, మిగిలిన సగభాగము అథర్వవేదము చేతను నిష్పన్న మగుచున్న దని శ్రుతులు చెప్పుచున్నవి. (అతఏవ వాఙ్మనస నిర్వర్తస్య యజ్ఞ శరీరస్య అర్ధ మేవ త్రిభి ర్వేదై ర్నిష్పాద్యతే। అర్థాంతరం తు అథర్వ వేదేనైవేతి శ్రూయతే — సాయణః)

"స వా ఏష త్రిభి ర్వేదై ర్యజ్ఞస్యాన్యతరః పక్షః
సంస్క్రియతే। మనసైవ బ్రహ్మా యజ్ఞస్యాన్యతరం
పక్షం సంస్కరోతి" —గో. బ్రా. 3-2.

"అయం వై యజ్ఞో యోఽయం పవతే। తస్య వాక్ చ
మన శ్చ వర్తన్యౌ। వాచా చ హి మనసా చ యజ్ఞో
ఽవర్తత। ఇయం వై వాక్। అదో మనః। త ద్వాచా
త్రయ్యా విద్యయైకం పక్షం సంస్కుర్వంతి। మనసైవ
బ్రహ్మా సంస్కరోతి।" ఐ. బ్రా. 5—33.

ఇట్లు అథర్వవేదీయ మగు గోపథబ్రాహ్మణము, ఋగ్వేదీయ మగు ఐతరేయబ్రాహ్మణము -రెండును వాఙ్మనసరూపమగు యజ్ఞ శరీరమును నిష్పన్నము జేయుటకు నాల్గువేదములు యావశ్యకత జెప్పుచున్నవి. కాన బ్రహ్మకర్తృత్వ ప్రతిపాదనమునకై యథర్వవేద మావశ్యక మగుట స్పష్టము. (చూ. శ్రీసాయణ విరచిత అథర్వవేద భాష్యభూమికా). అందుకనియే దానికి బ్రహ్మవేద మని పేరు.

"త మృచశ్చ సామాని చ యజూంషి చ బ్రహ్మ
చానువ్యచలన్" —అ. వే. 15-6-8.

"ఋచాం చ వై స సామ్నాంచ యజుషాం చ బ్రహ్మణశ్చ
ప్రియం ధామ భవతి య ఏవం వేద —అ. వే. 15-6-9.

"చత్వారో వా ఇమే వేదా ఋగ్వేదో యజుర్వేదః సామ
వేదో బ్రహ్మవేదః" — గో. బ్రా. 2-16.

పై శ్రుతి వాక్యములందు బ్రహ్మపదముచే నథర్వవేదము చెప్పబడుచున్నది.

## 3. అథర్వవేదమునకు గల నామములు:-

అథర్వవేదమునకు ఇట్లు బ్రహ్మవేదమనియే గాక అంగిరోవేదము, అథర్వాంగిరోవేదము, భృగ్వంగిరోవేదము, క్షత్రవేదము, భైషజ్యవేదమనియు నామములు శ్రుతి ప్రసిద్ధములు.

"తా ఉపదిశతి। అంగిరసో వేదః సో య మితి।"
—శ. బ్రా. 13-4-3-5,

"తా న పదిశతి అథర్వాణో వేదః సో ఽ మితి,"
—శ. బ్రా. 13-4-3-7.

"యస్మా దృచో అపాతక్షన్ యజు ర్యస్మా దపాకషన్।
సామాని యస్య లోమాని అథర్వాంగిరసో ముఖమ్।"
—అ. వే. 10-7-20

"ఏత ద్వై భూయిష్ఠం బ్రహ్మ యద్భృగ్వంగిరసః'
—గో. బ్రా. 3-4.

"ఉక్థం....యజుః....సామ....క్షత్రం....వేద"

--శ. బ్రా. 14-8-14-2.

"ఋచః సామాని భేషజా యజూంషి హోత్రా బ్రూమ"

--అ. వే. 11-6-14

# 4. అథర్వవేదప్రాశస్త్యము (బ్రహ్మత్వసంప్రదాయము)

శ్రీమద్రామాయణమున వసిష్ఠుడు 'క్షత్రవేదవిదాం శ్రేష్ఠో బ్రహ్మ వేద విదా మపి' --(1-65-23) అని కీర్తింపబడినాడు. ఇట బ్రహ్మవేద మనగా ఋగ్యజుఃసామ వేదములనియు, క్షత్రవేద మనగా అథర్వవేద మనియు వ్యాఖ్యాతలు వివరించినారు. కాళిదాసు గూడ వసిష్ఠుని 'అథర్వనిధి' యని కీర్తించెను.

"అథాథర్వనిధే స్తస్య విజితారిపురః పురః ।
అర్థ్యా మర్థపతి ర్వాచ మాదదే వదతాం వరః॥" --రఘు. 1-59.

"స బభూవ దురాసదః పరై ర్గురుణా ఽథర్వవిదా
కృతక్రియః। పవనాగ్నిసమాగమో హ్యయం సహితం
బ్రహ్మ య దస్త్రతేజసా॥" --రఘు, 8-4.

ఇట్లు వసిష్ఠుడు అథర్వనిధి యని కీర్తింపబడుటచే 'ఋగ్యజుః సామ విదుడే గాక యథర్వవేదాభిజ్ఞుడు గూడ నగువాడే పురోహిత కృత్యకుశలుడు, శాంతిక పౌష్టిక కర్మనిర్వహణ సమర్థుడు, రాజగురుపదమున కర్హుడు' --అను సంప్రదాయము తెలియుచున్నవి. ఈ విషయమును స్మృతులు పురాణాదులు నిట్లు వివరించుచున్నవి

"త్రయ్యాం చ దండనీత్యాం చ కుశలః స్యాత్ పురోహితః ।
అథర్వవిహితం కర్మ కుర్యా చ్ఛాన్తిక పౌష్టికమ్ ॥"

--కామందకః.

"పురోహితం ప్రకుర్వీత దైవజ్ఞ ముదితోదితమ్।
దండనీత్యాం చ కుశలం అథర్వాంగిరసే తథా ॥"

యాజ్ఞ. స్మృ. 1-313.

"పౌరోహిత్యం శాంతిక పౌష్టికాది రాజ్ఞా మథర్వ వేదేన
కారయేత్, బ్రహ్మత్వంచ" —విష్ణు. పు. 1-10.

"పురోహితం తథాథర్వమంత్ర బ్రాహ్మణ పారగమ్"

-మత్స్య. పు.

"అభిషిక్తో ఽథర్వమంత్రై ర్మహీం భుఙ్క్తే ససాగరామ్"

--మార్క. పు.

"యస్య రాజ్ఞో జనపదే అథర్వా శాంతిపారగః।
నివస త్యపి త ద్రాష్ట్రం వర్ధతే నిరుపద్రవమ్॥
తస్మాత్ రాజా విశేషేణ అథర్వాణాం జితేంద్రియమ్।
దానసమ్మాన సత్కారై ర్నిత్యం సమభిపూజయేత్ ॥"

అథర్వపరిశిష్ట. 4-6.

శాంతి పుష్ట్యభిచారార్థా ఏకబ్రహ్మత్విగాశ్రయాః।
క్రియంతేఽథర్వవేదేన త్రయ్యో వాక్యియ గోచరా॥"

తంత్రవార్తిక. 1-3,4.

ఇంతే కాదు. అథర్వమంత్రములకు సిద్ధమంత్రము లనియు ప్రసిద్ధి గలదు.

"న తిథి ర్నచ నక్షత్రం న గ్రహో న చ చంద్రమాః।
అథర్వమంత్ర సంప్రాప్త్యా సర్వసిద్ధి ర్భవిష్యతి।"

—పద్మ. పు.

"య స్తత్రాథర్వణాన్ మంత్రాన్ జపే చ్ఛ్రద్ధాసమన్వితః।
తేషా మర్థోద్భవం కృత్స్నం ఫలం ప్రాప్నోతి స ధ్రువమ్"

—స్కాంద. పు. (కమాలాలయఖండ)

"అథాతః సంప్రవక్ష్యామి సామర్గ్యజు రథర్వాణామ్।
కర్మభి ర్యై రవాప్నోతి క్షిప్రం కామాన్ మనోగతాన్॥"

—బో. ధ. సూ. 4-5-1.

"ఇమం మంత్రం గృహాణత్వం ఆహ్వానాయ దివౌకసామ్।
యం యం దేవం త్వ మేతేన మంత్రేణావాహయిష్యసి॥
తేన తేన వశే భద్రే స్థాతవ్యం తే భవిష్యతి।
అకామో వా సకామో వా సమేష్యతి తే వశే॥
విబుధో మంత్ర సంశాంతో భవే ద్భృత్య ఇవానతః॥
తత స్తా మనవద్యాంగీం గ్రాహయామాస స ద్విజః।
మంత్రగ్రామం తదా రాజన్ న్నథర్వశిరసి శ్రుతమ్॥"

—భార. 3-305-16-16 నుండి 20.

ఇట్లు పై వచనములు అథర్వవేదము యొక్క ప్రాశస్త్యమును, అవశ్యకతను చెప్పుచున్నవి. ఇంతే గాక పురోహితుడు, లేక వసిష్ఠుడు, లేక బ్రహ్మ, లేక బృహస్పతి, లేక రాజగురువు అనువాడు ఋగ్యజుః సామ వేదములందే గాక యథర్వవేదమునందు గూడ బరినిష్ఠితుడై యుండవలె ననెడి సంప్రదాయమును జెప్పుచున్నవి. శ్రుతియు యథర్వవిదునే బ్రహ్మగా వరింపవలెనని యిట్లాదేశించుచున్నది.

"అథ ప్రజాపతిః సోమేన యక్ష్యమాణో వేదాన్ ఉవాచ।
కం వో హోతారం వృణీయామ్। కం అధ్వర్యుమ్। కం
ఉద్గాతారమ్। కం బ్రహ్మాణమ్। ఇతి తే ఊచుః। ఋగ్విద
మేవ హోతారం వృణీష్వ। యజుర్విదం అధ్వర్యుమ్।
సామవిదం ఉద్గాతారమ్। అథర్వాంగిరోవిదం బ్రహ్మాణం।
తథాహాస్య యజ్ఞః చతుష్పాత్ ప్రతితిష్ఠతి"—గో. బ్రా. 2-24.

అథర్వవిదుని బ్రహ్మగా వరింపనిచో ప్రత్యవాయము గూడ నిట్లు చెప్పినది.

"అథ చేత్ నైవం విదం బ్రహ్మాణం వృణుతే దక్షిణత
ఏషైషాం యజ్ఞో రిచ్యతే" - గో. బ్రా. 2-24.

"యథైకపాత్ పురుషో యన్ అనుభయచక్రో వా రథో
వర్తమానో భ్రేషం న్యేతి ఏవ మేవాస్య యజ్ఞో భ్రేషం న్యేతి"
--గో. బ్రా. 3-2.

తైత్తిరీయశ్రుతియు మనోమయాత్మ స్వరూపమును చతుర్వేదాత్మకముగ నిట్లు వివరించినది.

"తస్య యాజు రేవ శిరః। ఋక్ దక్షిణః పక్షః। సామోత్తరః
పక్షః। ఆదేశ ఆత్మా। అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా"
-- తై. ఉ. 2-3-1.

శ్రుతి యిచట అథర్వవేదమును మనోమయాత్మ స్వరూపమున పుచ్ఛముగా – ఆధారముగా – నిర్దేశించుచు, అథర్వవేద వైశిష్ట్యమును దెలియ జేయుచున్నది. సూతసంహిత గాయత్రీపరాదేవత యొక్క స్వరూపమును వివరించుచు అథర్వవేదము యొక్క ప్రాధాన్యము నిట్లు వర్ణించినది.

"ఋగ్యజుః సామ రూపా శ్చ పాదా అస్యాః ప్రకీర్తితాః
— 4-6-11.

........ ........ ........ ........ ........ ........

శిక్షా ద్యంగాని శీర్షాణి వక్త్ర మగ్ని ర్మహాద్యుతిః।
మీమాంసా లక్షణం తస్యా శ్చేష్టా చా ఽఽ థర్వణీ శ్రుతిః॥— 15

'అథాతో ధర్మజిజ్ఞాసా—ఇత్యాదికం మీమాంసాశాస్త్ర
మస్యాః తటస్థలక్షణమ్। ఆథర్వణా దృష్టా శ్రుతి ర్వేదో
అస్యా శ్చేష్టాత్మకః। ఉక్తం హి—లక్షణం మీమాంసా,
అథర్వవేదో విచేష్టితమ్-ఇతి। — మాధవీయ తాత్పర్యదీపికా.

శ్రీగాయత్రీ పరాదేవతకు ఋగ్యజుఃసామలు పాదములు; మీమాంసాశాస్త్రము తటస్థలక్షణము; అథర్వవేదము చేష్ట-అని యర్థము. సూతసంహితయందే మఱియొకచోట గూడ అథర్వవేదముయొక్క ప్రాశస్త్యమిట్లు చెప్పబడినది.

"శిఖా౽ప్యాథర్వణీ సాధ్వీ సర్వవేదోత్తమోత్తమా।
అస్మి న్నర్థేసమాప్తా సా శ్రుతయ శ్చాపరా అపి॥ 31

యథా సాక్షా త్పరం బ్రహ్మ ప్రతిష్ఠా సకలస్య చ।
తథై వాథర్వణో వేదః ప్రతిష్ఠైవాఖిలశ్రుతేః॥ 32

కంద స్తార స్తథా బిందుః శ క్తి స్తారో మహాద్రుమః।
స్కందశాఖా అకారాద్యా వర్ణా యద్వ త్తథైవ తు॥ 33
తారః కందః శ్రుతే ర్జాతిః శక్తి రాథర్వణో ద్రుమః।
స్కంధశాఖా స్త్రయో వేదాః పర్ణాః స్మృతిపురాణకాః॥" 34

— సూ. సం. యజ్ఞవైభవఖండ, సూత. గీత.

తన యందధ్యస్తమయిన నిఖిల ప్రపంచమునకు బ్రహ్మ ఆశ్రయభూతుడయినట్లు, అథర్వణశ్రుతియు రహస్యార్థ ప్రతిపాదక మగుటచే నిఖిల శ్రుతులకు నాశ్రయభూతము. మఱియు అథర్వవేదమొక మహావృక్షము. ఋగ్యజుః సామ వేదములు దానికి స్కంధశాఖలు, స్మృతిపురాణములు పర్ణములు-అని యిట జెప్పబడినది.

ఏది యనావశ్యకమని ప్రతిపక్షవాదులచే నూహింపబడుచున్నదో యట్టి యథర్వవేదము బ్రహ్మకర్తవ్య ప్రతిపాదకము, సిద్ధమంత్రాత్మకము; నిఖిల శ్రుతుల కాశ్రయభూతము; అందుచే నుత్తమోత్తమము నగుట దర్శించితిమి.

ఇట్టి యథర్వవేద మర్వాచీన మనుట యుక్తము కాదు ఈ శ్రుతి యొక్క ప్రస్తావము సంహితలయందును, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషద్భాగము లందును, గృహ్య-ధర్మ సూత్రముల యందును, నిరుక్త వ్యాకరణాది వచనముల యందును బహుళముగ గలదు.

## బ్రాహ్మణారణ్యకములు_ చతుర్వేదప్రస్తావన:-

"ఋచో యజూగ్ంషి సామాని అథర్వాంగిరస శ్చ యే"

— తై. బ్రా, 3-12-8-2.

"య దృచో ఽధ్యగీషత తాః పయ ఆహుతయో దేవానా
మభవన్ య ద్యజూగ్ంషి ఘృతాహుతయో। యత్సామాని
సోమ హుతయో। య దథర్వాంగిరసో మధ్వాహుతయో ॥"

— తై. ఆ 2-9-2.

"యజుః — ఇతి ఏష హీదం సర్వం యునక్తి। సామ -
ఇతి ఛందోగాః, ఏతస్మిన్ హీదం సర్వం సమానమ్।
ఉక్థమితి బహ్వృచాః, ఏష హీదం సర్వ ముత్థాపయతి।
యాతుః ఇతి యాతువిదః_ ఏతేన హీదం సర్వం యతమ్ -

(యాతుః అథర్వవేదః_హరిస్వామి భాష్య) - శ. బ్రా. 10_5-2-20.

ఇచట నొకే యాదిత్యుడు (పరమేశ్వరుడు) యజుర్వేదీయులచే 'యజుః' అనియు, సామవేదీయులచే 'సామ' యనియు, ఋగ్వేదీయులచే 'ఉక్థ' మనియు (ఋక్ అర్చనీయః ఆదిత్యః), అథర్వవేదీయులచే 'యాతుః' అనియు నుపాసింప బడుచున్నట్లు చెప్పబడుచున్నది.

"పయ ఆహుతయో వావ ఏతా దేవానాం య దృచః । స య
ఏవం విద్వాన్ ఋచో ఽహరహః స్వాధ్యాయ మధీతే ....
య దథర్వాఙ్గిరసః స య ఏవం విద్వాన్ అథర్వాంగిరసో
ఽహరహః స్వాధ్యాయ మధీతే" — శ. బ్రా. 11-5-6-4 నుండి 8.

ఇట బ్రహ్మయజ్ఞ సమయమున నాల్గు వేదములు నధ్యయనము జేయ వలెనని చెప్పబడినది

## ఉపనిషత్తులు - చతుర్వేదప్రశంస :-

"అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతద్ యద్
ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వాంగిరసః"
— బృ ఉ. 4-4-10.

"ఏతస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతద్ యద్
ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వాంగిరసః"
— మైత్రా. ఉ. 6-32.

ఈ శ్రుతులయందు నాల్గు వేదములు పరమేశ్వరుని నిఃశ్వాసరూపములుగ జెప్పబడినవి.

"వాచా వై సమ్రాడ్ బంధుః ప్రజ్ఞాయత ఋగ్వేదో
యజుర్వేదః సామవేదో ఽథర్వాంగిరసః" బృ. ఉ. 4-1-2.
"సైషో ఽగ్నిస్త్ర స్యేమా ఇష్టకా య దృగ్యజుఃసామా
థర్వాంగిరసః" — మైత్రా. ఉ. 6-33.
"ఋగ్యజుఃసామాథర్వాణ శ్చత్వారో వేదాః సాంగాః
సశాఖాః చత్వారః పాదా భవన్తి" — నృ. పు తా. ఉ. 1-2.

"ప్రథమం పాదం జానీయాద్ ఋగ్యజుః సామాథర్వరూప ....

— నృ. పు. తా. ఉ. 1-4.

"ఋ గహం యజు రహం సామాహం అథర్వాంగిరసో ఽహమ్ ।" — అథర్వశిరస్. ఉ. 1-1.

"ఋగ్వేదాది విభాగేన వేదా శ్చత్వార ఈరితాః"

— ముక్తి. ఉ. 1-11-14.

"సోఽ ధ్యాయత పూర్వాభిముఖో భూత్వా భూ రితి వ్యాహృతి ర్గాయత్రం ఛంద ఋగ్వేదః అగ్ని ర్దేవతా । పశ్చిమాభిముఖో భూత్వా భువ ఇతి వ్యాహృతి స్త్రైష్టుభం ఛందో యజుర్వేదో వాయు ర్దేవతా । ఉత్తరాభిముఖో భూత్వా స్వ రితి వ్యాహృతి ర్జాగతం ఛంద స్సామవేద స్సూర్యో దేవతా । దక్షిణాభి ముఖో భూత్వా మహ ఇతి వ్యాహృతి రానుష్టుభం ఛందో ఽథర్వవేద స్సోమో దేవతా" .... మహా. ఉ. 1.

"తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వవేదః"

.... ముండక. ఉ. 1-1-5.

తద్వా ఏత త్సుదర్శనం మహాచక్రం సర్వకామికం మోక్ష ద్వారం ఋఙ్మయం యజుర్మయం సామమయం బ్రహ్మ మయ మమృతమయం భవతి" —నృ. పూ. తా. ఉ. 5-2.

'ఋగ్వేదం భగవో ఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథ ర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమమ్' ఛాం. ఉ. 7-12.

"నామ వా ఋగ్వేదో యజుర్వేదః సామవేద అథర్వణ శ్చతుర్థః" — ఛాందో. 7-1-4.

"వా గ్వావ నామ్నో భూయసీ వాగ్ వా ఋగ్వేదం విజ్ఞాప
యతి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ
మితిహాస పురాణం పంచమమ్" —ఛాందో. 7-2-1.

విజ్ఞానం వావ ధ్యానా ద్భూయో విజ్ఞానేన వా ఋగ్వేదం
విజ్ఞానాతి యజుర్వేదగ్ం సామవేద మాథర్వణం చతుర్థ
మితిహాస పురాణం పంచమమ్" —ఛాందో 7-7-1.

ఇట్లుపనిషత్తులే గాక గృహ్యసూత్ర[1], నిరుక్త[2], వ్యాకరణాదులన్నియును వేదములు నాలుగు అని కంఠోక్తిగ జెప్పుచున్నవి.

## ఋగ్వేదాది శ్రుతులు : వేదత్రయ - వేదచతుష్టయ ప్రస్తావము :-

పై ప్రమాణముల ననుసరించి నాల్గు వేదములును పరమేశ్వర నిఃశ్వాస రూపములు; అనాదులు; యజ్ఞనిర్వహణము నందు ఈ నాల్గును అపేక్షితములు - అని యిట్లు చెప్పుచో 'సైషా త్రయీ విద్యా యజ్ఞః; సైషా త్రయ్యేవ విద్యా తపతి' ఇత్యాది పూర్వోదాహృత శ్రుతివాక్యములతో విరోధము సంభవించుట లేదా ? -యన నట్లు గాదు. శ్రుతులలో నచటచట గన్పట్టు త్రయీ, త్రయీవిద్యా - అను పదములకు వేదములు మూడే; నాలుగు కాదు - అని నాల్గవవేదమును నిషేధించుట యందు తాత్పర్యము లేదు. అట్లున్న దనుట శ్రుతిసమ్మతము కాదు. ఏలయన:-

---

1. ఆప. గృ. సూ. 3-2-6; శాం. గృ. సూ. 1-1-4-8; హిరణ్యకేశి గృ. సూ. 2-19-6, పారస్కర గృ. సూ. 2-10-7, 21; ఆశ్వ. గృః సూ. 3-3-1 (స్వాధ్యాయనిధి).
2. పాణిని. 4-3-133; 6-4-174; 4-2-63.

1) నాలుగు వేదములను పరమేశ్వర నిఃశ్వాసరూపము లని చెప్పిన బృహదారణ్యకోపనిషత్తు మరల నొకచోట 'త్రయో వేదా ఏవ, వా గేవ ఋగ్వేదః మనో యజుర్వేదః ప్రాణ ఏవ సామవేదః' -అని వేదత్రయమునే పేర్కొను చున్నది.

2) ఛాందోగ్యోపనిషత్తు కూడ చతుర్వేదముల గూర్చి పెక్కుచోట్ల ప్రశంసించుట పైన వివరింపబడినది. ఆ యుపనిషత్తే మరల నొకచోట వేద త్రయమునే యిట్లు చెప్పుచున్నది.

> 'తాను తత్ర మృత్యు ర్యథా మత్స్య ముదకే పరిపశ్యే దేవం
> పర్యపశ్య దృచి సామ్ని యజుషి। తే ను విదిత్వోర్ధ్వా
> ఋచః సామ్నో యజుషః స్వర మేవ ప్రావిశన్'
>
> —ఛాం 1-4-3.

3) షడ్వింశబ్రాహ్మణము (5.¯) నందు పరాదేవత యగు స్వాహా స్వరూప వర్ణనము నందు 'చత్వారోఽస్యై వేదాః శరీరమ్' అని చెప్పబడి మరల నచటనే వేఱొక వాక్యమున 'ఋగ్యజుః సామగతిః' అని చెప్పబడుట స్వాహాశబ్ద మున వివరింపబడినది.

4) శతపథబ్రాహ్మణము ఒకచోట - త్రయీ వై విద్యా ఋచో యజూంషి సామాని (4-6-7-1); సైషా త్రయీవిద్యా యజ్ఞః(1-1-4-3);స (ప్రజా పతిః) శ్రాంత స్తేపానో బ్రహ్మైవ ప్రథమ మసృజత త్రయీ మేవ విద్యామ్ (6-1-1-8) -అని యీ రీతిగ త్రయీవిద్యను గూర్చి ప్రస్తావించినది మరలనీ శ్రుతియే స్వాధ్యాయబ్రాహ్మణమున నాల్గువేదములనుకంఠోక్తిగ నిట్లు పేర్కొనినది.

> "పయ ఆహుతయో హ వా ఏతా దేవానాం య దృచః....
> యదథర్వాంగిరసః .... స్వాధ్యాయ మధీతే"
>
> —11-5-6-4 నుండి 8.

ఈ శ్రుతి యింకను 10-5-2-2-20; 13-4-3 నుండి 8 మున్నగు చోట్ల నాల్గు వేదములను నామనిర్దేశ పూర్వకముగ బేర్కొనినది.

5) తైత్తిరీయారణ్యకము గూడ నొకచోట 'సైషా త్రయ్యేవ విద్యా తపతి' - యని ఆదిత్యమండలమును త్రయీవిద్యాత్మకముగ వర్ణించినది. మరల నీ శ్రుతియే స్వాధ్యాయబ్రాహ్మణమున నాల్గువేదముల నిట్లు బేర్కొనినది.

"యదృచో ఽ ధ్యగీషత తాః పయ ఆహుతయో దేవానా
మభవన్ య ద్యజూగ్ంషి - య దథర్వాంగిరసో
మధ్వాహుతయో." —తై అ. 2-9-2

ఇట్లే తైత్తిరీయబ్రాహ్మణము గూడ నొకచోట 'వేదైరశూన్య స్త్రిభి రేతి సూర్యః' - అని యాదిత్యుని వేదత్రయాత్మకు డని వర్ణించి, మరల నొకచోట నాల్గు వేదముల నిట్లు పేర్కొనుచున్నది.

"ఋచో యజూగ్ంషి సామాని అథర్వాంగిరస శ్చ యే"
తై. బ్రా. --3-12-8-2.

7) తైత్తిరీయసంహితయు నొకచోట యద్వై యజ్ఞస్య సామ్నా యజుషా క్రియతే శిథిలమ్ (తద్) యద్ ఋచా తద్దృఢమ్' - అని ఋగ్ యజుః సామముల మూడింటిని మాత్రమే పేర్కొని, వేఱొకచోట అశ్వమేధాంగ మంత్రములలో నాల్గువేదముల నిట్లు పేర్కొనినది.

"ఋగ్భ్యః స్వాహా యజుర్భ్యః స్వాహా సామభ్యః
స్వాహా ఽంగిరోభ్యః స్వాహా వేదేభ్యః స్వాహా"
—తై. సం 7-5-11-2.

8) ఋగ్వేదీయమైన ఐతరేయ బ్రాహ్మణము నొకచోట 'త్రయో వై

వేదా అజాయన్త' అని వేదత్రయోత్పత్తిని జెప్పి మఱియొకచోట నాలుగువేదముల నిట్లు పేర్కొనినది.

"ఋఙ్మయో యజుర్మయః సామమయో వేదమయో
బ్రహ్మమయో ఽమృతమయః సంభూయ దేవతా అప్యేతి"

—ఐ. బ్రా. 4-6-22.

9) ఇక ఋక్సంహితయు నొకచోట 'ఋచః సామాని జజ్ఞిరే.... యజు స్తస్మా దజాయత' -అని ఋగ్యజుః సామోత్పత్తిని జెప్పి మఱి కొన్నిచోట్ల 'చత్వారి శృంగాః' ఇత్యాది మంత్రములచే యజ్ఞము, లేక యజ్ఞేశ్వరుడు, చతుర్వేదాత్మకులై యొప్పుటను కాంతాసమ్మితముగ ప్రతిపాదించినది.

ఋక్సంహితయే యింకొకచోట ఋత్విక్కర్మ వినియోగ వ్యాజమున నాల్గు వేదముల ప్రసక్తి నిట్లు సూచించినది.

'ఋచాం త్వం పోష మాస్తే పుపుష్వాన్
గాయత్రం త్వో గాయతి శక్వరీషు ।
బ్రహ్మ త్వో వదతి జాతవిద్యాం
యజ్ఞస్య మాత్రాం విమిమీత ఉ త్వః". —10-17-11.

యజ్ఞసమయమున 1. హోత యను ఋత్విక్కు స్వకీయవేద (ఋగ్వేద) గతము లయిన ఋక్కులకు పుష్టి గల్పించుచున్నాడు. పుష్టి యనగా భిన్నభిన్న ప్రదేశములలో నున్న ఋక్సముదాయమును శస్త్ర మనెడి పేరుతో నొకచోట సమ కూర్చుట (త్వః పుపుష్వాన్ ఋచాం పోషం ఆస్తే). 2. ఉద్గాత యను ఋత్విక్కు గాయత్ర మను గల స్తోత్రమును శక్వరీ నామకము లగు ఋక్కులందు గానము చేయుచున్నాడు. (త్వః గాయత్రం శక్వరీషు గాయతి). 3. బ్రహ్మ యను నొక ఋత్విక్కు ప్రణయనాది క్రియలు జేయవలసి వచ్చినపు డెల్ల అనుజ్ఞ నొసగు

చున్నాడు. ఋత్విక్కులు 'బ్రహ్మన్ అపః ప్రణేష్యామి' అని యీ రీతిగ సంబోధించి యనుజ్ఞ కోరినపు డెల్ల 'ఓం ప్రణయ' అని యీరీతిగ బ్రహ్మయనుజ్ఞ నొసగుచున్నాడు. (బ్రహ్మ త్వో వదతి జాతవిద్యాం). 4), అధ్వర్యు డను మఱియొక ఋత్విక్కు విశేషించి యజ్ఞస్వరూప నిష్పాదనము గావించుచున్నాడు. యజ్ఞస్వరూపమును నిరూపించునది యధ్వర్యునకు సంబంధించిన యజుర్వేదము. ఋక్సామలు యజ్ఞాంగము లయిన స్తోత్రశస్త్రములను బూరించును. కాన అధ్వర్యుడు యజ్ఞశరీర నిష్పాదకు డగును. (యజ్ఞస్య మాత్రాం విమిమీత ఉ త్వః)- అని యర్థము.

ఈ ఋక్కు యజ్ఞము నందలి నలుగురు ప్రధానఋత్విజుల కర్తవ్యములను నిర్దేశించుచున్నది. ఈ నలువురిలో హోతకు ఋగ్వేదము, అధ్వర్యునకు యజుర్వేదము, ఉద్గాతకు సామవేదము నియతములై యున్నవి. వారు స్వవేదోక్త మంత్రములచే హౌత్రాదుల నెఱపుచుందురు. ఇక బ్రహ్మ, వేదత్రయోక్త కర్మాభిజ్ఞుడై యోగ్యత ననుసరించి యా కర్మలకనుజ్ఞ నొసగుట, ఏదేని ప్రత్యవాయము సంభవించినపుడు సవరించు కౌశలము గల్గి యజ్ఞకర్మను యథావిధిగ బ్రవర్తింపజేయుట బ్రహ్మయొక్క కర్తవ్యము. అందుచే బ్రహ్మ యగు ఋత్విజుడు ఋగ్యజుఃసామ వేదముల యందే గాక యథర్వవేదము నందు గూడ బరినిష్ఠితుడై యుండినపుడు యజ్ఞమును నిర్విఘ్నముగ యథావిధిగ నిర్వహించెడి కౌశలము గల్గి యుండును కావుననే 'అథర్వాంగిరోవిదం బ్రహ్మాణం' అనుచు గోపథ బ్రాహ్మణ శ్రుతి బ్రహ్మ యథర్వవిదుడై యుండవలె నని యాదేశించినది.

యజ్ఞముయొక్క వాగ్రూపశరీరార్థము ఋగ్యజుఃసామలచే (అధ్వర్యు, హోత, ఉద్గాత లనెడి ఋత్విజులచే) సంస్కరింపబడు ననియు, మనోరూపమగు యజ్ఞశరీరార్థభాగము అధర్వవేదముచేతనే (బ్రహ్మచే) సంస్కరింపబడు ననియు గోపథ-ఐతరేయబ్రాహ్మణములు వివరించుచున్నట్లు పూర్వము జెప్పబడినది. ('తద్వాచా త్రయ్యావిద్యయైకం పక్షం సంస్కుర్వంతి, మనసైవ బ్రహ్మ సంస్కరోతి')

ఐ బ్రా. 5-33-'అతఏవ వాఙ్మనస నిర్వర్తస్య యజ్ఞశరీరస్య అర్ధ మేవ త్రిభి ర్వేదైః నిష్పాద్యతే। అర్థాంతరం తు అథర్వవేదే నైవేతి శ్రూయతే - సాయణః, అథర్వవేద భాష్యభూమికా).

ఇట్లు శ్రుతులే కాదు. పురాణములు కూడ యజ్ఞమున బ్రహ్మయగు ఋత్విక్కు అథర్వవిదుడై యుండవలె ననెడి సంప్రదాయమును స్పష్టముగా జెప్పు చున్నవి.

"అధ్వర్యవం యజుర్భి స్తు ఋగ్భి ర్హౌత్రం తథా మునిః।
ఔద్గాత్రం సామభి శ్చక్రే బ్రహ్మత్వం చా ప్యథర్వభిః॥"
"రాజ్ఞాం త్వథర్వవేదేన సర్వకర్మాణి స ప్రభుః।
కారయా మాస మైత్రేయ బ్రహ్మత్వం చ యథావిధి॥"

—— విష్ణు. పు. 3-3.

"ఏక ఆసీ ద్యజుర్వేదః తం చతుర్ధా వ్యకల్పయన్ ।
చాతుర్హోత్ర మభూ దస్మిన్ తేన యజ్ఞ మథాకరోత్ ॥
అధ్వర్యవం యజుర్భిః స్యాత్ ఋగ్భి ర్హౌత్రంద్విజోత్తమాః ।
ఔద్గాత్రం సామభి శ్చక్రే బ్రహ్మత్వం చా ప్యథర్వభిః ॥"

.... కూర్మ. పు. 49-6.

కనుక బ్రహ్మ అథర్వవిదుడై యుండవలె ననునది సంప్రదాయము-అని తెలియుచున్నది. కాని యిట్లు చెప్పుచో 'యజ్ఞం వ్యాఖ్యాస్యామః స త్రిభిర్వేదైః విధీయతే'-అనెడి పూర్వోక్త-'ఆప స్తంబాది శ్రౌత సూత్రములతో విరోధము సంభవించుట లేదా ? యన నట్లు కాదు. సూత్రకారుల యీ వచనముల కథర్వ వేదమును నిషేధించుటయందు తాత్పర్యము లేదని యా యా వ్యాఖ్యాత లందఱును స్పష్టముగ వివరించిరి. (చూ. హరదత్త వ్యాఖ్య. ఆప. పరి. భా సూ; మహాదేవకృత వైజయన్తీ వ్యాఖ్య. సత్యా. శ్రౌ. సూ.) శ్రీ సాయణాచార్యులును

---

'ఋగ్యజుఃసామల యందే గాక యథర్వవేదము నందు గూడ బరినిష్ఠితుడైన వాడే బ్రహ్మత్వమునకు ముఖ్యాధికారి; అట్టివాడు లభింపని యపుడు మాత్రమే వేదత్రయ పరినిష్ఠితుని బ్రహ్మగా వరించుట శ్రుతి తాత్పర్యమ'ని యథర్వవేద భాష్యభూమిక యందిట్లు వివరించిరి. "స త్రిభి ర్వేదై ర్విధీయత ఇతి స్మృతి స్తు ఉదాహృత శ్రుత్యనుసారేణ ముఖ్యస్య అథర్వవిదో ఽసంభవే త త్తచ్ఛాఖాసు యావదుక్త బ్రహ్మత్వ మాత్రేణాపి క్రతుశరీరనిష్పత్తి ర్భవతీ త్యేవ మభిప్రాయా"....

.... అథర్వవేద భాష్యభూమిక.

## చారిత్రికుల వాదము - అసామంజస్యము :-

ఇంతవరకును వివిధ బ్రాహ్మణారణ్యకోపనిషత్తుల యందును, తైత్తిరీయ సంహితయందును, ఋగ్వేదమునందును గూడ, నొకచోట వేదత్రయ ప్రస్తావము మఱియొకచోట నాలుగు వేదముల ప్రస్తావము నుండుట దర్శించితిమి. ఇట్లుండుటేల? — అను విషయమును తరువాత చూతము. ఈ విషయమున చారిత్రికుల వాద మిట్లున్నది.

'ఋగ్వేదము ఆర్యులను వారి తొలిరచన; అందును పదియవ మండలం మిగిలిన వానికంటె నర్వాచీనము; అథర్వవేదము మిగిలిన మూడు వేదములకంటె మిక్కిలి యర్వాచీనము; నాల్గు వేదముల ప్రశంస ఋగ్వేదమున నెచ్చటను గాన వచ్చుట లేదు; 'ఋచాం త్వః పోష మాస్తే' అను ఋక్కు పదియవ మండలము లోనిది; ఆ ఋక్కునందును మిగిలిన ఋత్విజుల విషయమున నే యే వేదములు నియతములై యుండునో స్పష్టముగ దెలియుచున్నది; బ్రహ్మ యను ఋత్విక్కు అథర్వవిదుడై యుండవలె నను నియమము స్పష్టముగ నట గానవచ్చుట లేదు: ఇక 'చత్వారి శృంగాః' — ఇత్యాది ఋక్కుల బురస్కరించుకొని యజ్ఞము, లేక

యజ్ఞపురుషుడు చతుర్వేదాత్మకు డని చెప్పుట యాలంకారిక కల్పనమే యగును; నాలుగు వేదములు నా కాలమున నున్న వనుటకు స్పష్టమైన ప్రమాణములు కాజాలవు.

ఇక పదియవ మండలమున 'ఋచః సామాని జజ్ఞిరే - యజుః తస్మాదజాయత ' యని యజుఃసామల ప్రస్తావన యుండుటచే నా మండలము యజుః సామ వేదముల రచన యనంతరము రచింపబడి యుండవలెను; అందును గూడ ఋగ్యజుఃసామ వేదములు మూడే యజ్ఞేశ్వరునినుండి ప్రాదుర్భవించినటుల గలదు; అధర్వవేదావిర్భావ మప్పటికి కాలేదని తెలియనగును; ఆ మూడింటికిని క్రమముగ త్రయీ యను వ్యవహార మేర్పడినది. తరువాత కాలమున నధర్వవేద మావిర్భవించినను ఆ మంత్రములకు యజ్ఞమున వినియోగము లేదు; గాన నది వేదముగ గుర్తింపబడి యాదరింపబడుటకు చాల కాలము పట్టెను; అది వేదముగ గుర్తింపబడి' 'యజ్ఞమునందు బ్రహ్మగా నుండవలసినవాడు అధర్వవేదజ్ఞుడై యుండవలె' నను నియమము పుట్టిన తర్వాత అధర్వ వేదమునకు 'బ్రహ్మవేదము' అను నామ మేర్పడినది. ఈ యధర్వ వేదమునకు వేదత్వమును సిద్ధింపజేయుట కయియే గోపథబ్రాహ్మణ మవతరించినది." 1

చరిత్రకారుల యీ వాదమునం దెంత సామంజస్య మున్నదో చూతము

1) వీరి ననుసరించి 'ఋచః సామాని జజ్ఞిరే .... యజుస్తస్మాదజాయత' - యనెడి ఋక్కు యజ్ఞేశ్వరుని నుండి వేదత్రయోత్పత్తిని గదా చెప్పుచున్నది. నాల్గవ వేదము లేదనుటకును, ఒకవేళ అధర్వవేద మర్వాచీనముగ వెలసినను, దానికి యజ్ఞము నందు తావు లేదనుటకు నీ ఋక్కే గదా ప్రమాణముగ జూపబడుచున్నది. ఈ ఋక్కున కట్టి యర్థమే యుండుచో, చతుర్వేద

1. a) Bloom Field - The Atharva Veda and the Goptha Brahmana.

b) సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము - అధర్వవేదము.

నిషేధపర మగు నీ మంత్రము చతుర్థ వేదమన బరగెడి యథర్వవేదము నందు (19-6-13) గూడ నుండుట లోని సామంజస్యమేమి ? నాల్గవవేదముగా పరిగణింపబడుటకై బహుకాలము యత్నించిన దని చెప్పబడెడి యథర్వవేదము ఆత్మనిషేధపరము లయిన యిట్టి మంత్రములను తనలో నెట్లిమిడ్చుకొని యుండును ?

2) ఇంతే కాదు. అథర్వవేదము నందలి యీ క్రింది మంత్రముల, జూతము.

"ఋచం సామ యజామహే యాభ్యాం కర్మాణి కుర్వతే।
ఏతే సదసి రాజతో యజ్ఞం దేవేషు యచ్ఛతః॥
ఋచం సామ య దప్రాక్షం హవి రోజో యజు ర్బలమ్।
ఏష మా తస్మా న్మా హింసీద్ వేదః పృష్టః శచీపతే॥

.... 7-54-1-2.

ఇందు మొదటి మంత్రమున ఋక్సామవేదములు స్తుతిశస్త్రముల ద్వారా యజ్ఞనిర్వాహకములై యజ్ఞమంటపమున (సదసి రాజతః) విరాజిల్లు చున్నట్లు కీర్తింపబడినవి. ఋక్సామ వేదములు యజ్ఞనిర్వాహకము లని యిట కీర్తింపబడినంత మాత్రమున యజుర్వేదము లేదని కాని, అది యజ్ఞనిర్వాహకము కాదనిగాని యభిప్రాయ మగునా ? యజుస్సులేనిచో యజ్ఞమే లేదు కదా! యజుస్సు యజ్ఞశరీర నిష్పాదక మగుటచే నది భిత్తి (కుడ్య) స్థానీయము (Back ground) ఋక్సామలు కుడ్యగత చిత్రస్థానీయములు. కుడ్యము నందలి చిత్తరువుల (వర్ణ-ఆకృతుల) గూర్చి ప్రశంసించు నపుడు కుడ్యముయొక్క యునికిని గూర్చిన విచారణతో బనియే యుండదు. ఎవరేని 'కుడ్య మిచట ప్రస్తావింపబడలేదు గాన కుడ్యము లేదు' -అని చెప్పుచో నది హాస్యాస్పదమే యగును.

"కర్మకాండవిషయే యజుర్వేదస్యైవ ప్రాధాన్యాత్ ....
భిత్తిస్థానీయో యజుర్వేద శ్చిత్రస్థానీయా వితరౌ"

—సాయణః-కాణ్వసం భాష్యభూమికా.

కాన నీ యథర్వమంత్రము నందలి 'యజామహే-యజ్ఞమ్ – అను రెండు పదములును భిత్తిస్థానీయమైన యజుస్సు నుపలక్షింప జేయుచునే యున్నవి

ఇట పై రెండవ మంత్రమున హవిస్సును ఓజస్సును ఉద్దేశించి ఋక్సామలును, బలము నుద్దేశించి యజుస్సును కోరబడినవి. (అనగా అధ్యయనము, అధ్యాపనము జేయబడినవి). అట్టి ఋగ్యజుః సామాత్మక మైన యీ వేదము (ఏష వేదః) నన్ను హింసింపకుండుగాక-అని యధ్యాపకుడు వాగనుశాసనకర్త (శచీపతి) యగు ఇంద్రుని ప్రార్థించుచున్నాడు.

ఇది యేమి! ఇచట ఋగ్యజుః సామలను మూడింటిని పేర్కొని యీ మంత్రము – 'ఏషః వేదః' -అని చెప్పుచున్నది. నాలుగవ వేదమిచట స్మరింప బడలేదు. కాన అథర్వవేదము అనెడి వేదము లేదని గాని, వేదమే యది వేదమే కాదని గానిచెప్పుట యీయాథర్వణిక మంత్ర తాత్పర్య మగునా? అట్టిచో వేదత్వ పరిగణనకై తాపత్రయపడుచుండినట్లు చెప్పబడెడి యథర్వవేదము ఆత్మ నిషేధపరము లైన యిట్టి మంత్రములను తనలో నెట్లిముడ్చుకొనగల్గి యుండును, అథర్వవేదమే కంఠోక్తిగా(15-6-8, 9) నాలుగువేదములపేర్కొనినట్లు పూర్వము వివరింపబడినదిగదా !

3) ఇకనథర్వవేదమునకు వేదత్వమును సుసంఘటితము గావించుటకై యవతరించినట్లు చెప్పబడెడి యథర్వవేదీయ గోపథ బ్రాహ్మణము గూడ నాలుగు వేదములను కంఠోక్తిగా-చత్వారో వా ఇమే వేదా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో బ్రహ్మవేదః (2-16)'-అని పేర్కొనిపరల ఓంకారమును ఋగ్యజుః సామాత్మకముగ మాత్రమే యిట్లు కీర్తించినది.

"తస్మా దోంకార ఋచ్యృక్ భవతి యజుషి యజుః సామ్ని
సామ సూత్రే సూత్రం బ్రాహ్మణే బ్రాహ్మణమ్...."

—గో.బ్రా. 1-1-23.

"....బ్రాహ్మణ మృగ్యజుఃసామ తస్మా ద్బ్రహ్మవాదిన
ఓంకార మాదితః కుర్వంతి...." —గో. బ్రా. 1-1-24.

ఇట పై రెండు వాక్యము లందును నాల్గవ (అధర్వ) వేదముయొక్క ప్రసక్తి లేదు.

4) ఇంతే కాదు. అధర్వ వేదీయ - ఉపనిషత్తులలో గూడ నిట్లే యొకచో చతుర్వేదప్రశంసయు; మఱియొకచో ఋగ్యజుఃసామరూపత్రయీ ప్రస్తావము బహుళముగ గన్పట్టుచున్నది.

(1) ముండకోపనిషత్తులో - "తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఉధర్వవేదః-" అని నాలుగువేదముల నపరావిద్యగా బేర్కొనెను. మరల ద్వితీయముండకమున (2-1-6) "తస్మా దృచః సామ యజూంషి దీక్షా విజ్ఞా శ్చ సర్వేక్రతవో" - అని ఋగ్యజుఃసామములే యక్షరాత్మక పురుషుని నుండి యావిర్భవించినట్లు పేర్కొనబడినది

(2) ప్రశ్నోపనిషత్తు నందు వేదత్రయ ప్రశంస యిట్లు గలదు.

"అరా ఇవ రధనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్। ఋచో
యజూంషి సామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మ చ। 2-6.
ఋగ్భి రేతం యజుర్భి రంతరిక్షం స సామభి ర్య త్త
త్కవయో వేదయంతే• 5-7ద

(3) శాండిల్యోపనిషత్తు నందొకచో శాండిల్యుడు నాల్గు వేదముల నధ్యయనము జేసినట్లును, మఱియొకచో మూడు వేదములే యావిర్భ వించినట్లును నిట్లుగలదు.

"అధాహ శాండిల్యో హ వై బ్రహ్మర్షిశ్చర్వేతుదేషు...."అ 1-2.
"అధైత త్తస్మా త్తప్యమానాతె సత్యకామాత్ త్రీణ్యక్షరా

ణ్యజాయన్త। తిస్రో వ్యాహృతయః। త్రిపదా గాయత్రీ।
త్రయో వేదా స్త్రయోదేవాః....।" —అ. 3.

ఇట్లెన్నియేని యుదాహరణల జూపనగును. అథర్వవేదేతరము లగు సంహితా-బ్రాహ్మణ-ఆరణ్యక - ఉపనిషద్భాగముల యందలి యుదాహరణలు గొన్ని పూర్వమే చూపబడినవి.

ఋగ్వేదమున గూడ నిట్లే యొకచోట (ఋ 5-62-5)- 'బర్హిరివ యజుషా రక్షమాణా' -యనుచు యజుస్సు మాత్రమే యజ్ఞరక్షక మగుచున్నట్లు చెప్పబడినది. ఇంకొకచోట (1-164-39) -'ఋచో అక్షరే పరమే వ్యోమన్) అనుచు ఋక్కులు మాత్రమే నిర్దేశింపబడినవి. మఱియొకచోట (2-23-6,-17' త్వష్ట (ప్రజాపతి) సామలకు కర్తగా నిర్దేశింపబడినాడు. వేఱొకటచో (8-96-7;10-114-6 ఇత్యాది) ఋక్సామలు రెండు మాత్రమే నిర్దేశింపబడినవి. మఱికొన్నిచోటుల (ఋ.9-97-34 ఇత్యాది) 'తిస్రో వాచ ఈరయతి' యనుచు ఋగ్యజుః సామలు మూడును బరమేశ్వరునిచే ప్రేరేపింపబడినట్లు చెప్పబడినవి. అట్లే యింకను గొన్ని చోటుల 'చత్వారి శృంగా' ఇత్యాది మంత్రములచే నాలుగు వేదములు చెప్పబడినవి.

మఱియు ఋగ్వేదమున నలుగురు ఋత్విజులతో యజ్ఞము నిర్వహింపబడుట - యను విషయము పైన పేర్కొనబడిన 'ఋచాం త్వః పోష మాస్తే' (10-17-11) అను ఋక్కున మాత్రమే గాదు. వసిష్ఠుడు బ్రహ్మ స్థానము నధిష్ఠించి మిగిలిన ఋత్విజులతో యజ్ఞమును నిర్వహించినట్లు ఋ 7-33-14 ఇత్యాది ఋక్కులవలన దెలియును. కాన ఋగ్వేదమున చతుర్వేద ప్రసక్తియు, నలువురు ఋత్విజుల ప్రసక్తియు లేదనెడి చరిత్రకారుల వాదము సరికాదు. ఇట్లు శ్రుతులయం దొకచో ఏకవేద ప్రసక్తి, మఱొకచో రెండు, వేఱొకచో మూడు, ఇట్లే చతుర్వేద ప్రసక్తియు నుండుటలో నా యా ప్రకరణముల ననుసరించి తాత్పర్యమును గ్రహించుటయే యుక్తము.

ఇట్లు అథర్వేతర వేదభాగము లందు వలెనే అథర్వవేదము నందును, దానికి సంబంధించిన బ్రాహ్మణ-ఉపనిషద్భాగము లందునుగూడ వేద చతుష్టయ ప్రస్తావము. దానితోపాటు ఋగ్యజుఃసామాత్మక త్రయీ నిర్దేశము నుండుట గమనార్హము. కాన శ్రుతులయం దెడనెడ గన్పట్టు త్రయీ నిర్దేశమునకు చతుర్థ వేద నిషేధమునందు తాత్పర్యము లేదనుట శ్రుతి సమ్మతమైన యభిప్రాయము.

కాని, శ్రుతి సంప్రదాయము నిట్లు గ్రహింపక — "అథర్వవేదమునకు వేదత్వమును స్థాపించుటకై యవతరించిన గోపథబ్రాహ్మణమే పొరబడి, యచ టచట నాల్గవ వేదముయొక్క యునికిని మఱచి మూడు వేదములనే ప్రస్తావించ నది" - యనెడి చారిత్రికుల వాదమునందెంత సామంజస్య మున్నదో విచారింప నగును. అట్టిది పొరపాటే యగుచో నది యొక గోపథబ్రాహ్మణము నందే గాదు; శ్రుతులయం దెల్ల యెడల ఎట్టి సంప్రదాయము బహుళముగా గాన నగుట పై యుదాహరణముల వలన స్పష్టము.

శ్రుతులయందే కాదు; స్మృతి పురాణేతిహాస కావ్యము లందును నిట్లే గలదు. ఇట్లుండుటలోని తాత్పర్యమును గ్రహించుటకు మారుగా - ఇది యనాది సిద్ధ సంప్రదాయమని గ్రహించుటకు మారుగా - దీనిని పొరపాటు అని యనుట పొరపాటు గదా!

## 'చత్వారి శృంగా' - ఇత్యాది ఋక్కులు - అర్థమీమాంస :-

ఇట్లు అథర్వణశ్రుతుల యందును, తదితర శ్రుతుల యందును, ఒక చోట వేద చతుష్టయ ప్రస్తావము, మఱియొక చోట వేదత్రయ ప్రస్తావము గన్పట్టు

చుండుటచే త్రయీ పదమునకు గాని, వేదత్రయ ప్రస్తావమునకు గాని, చతుర్థవేద నిషేధము నందు తాత్పర్యము లేదని స్పష్టమైనది.

ఇక 'చత్వారిశృంగా' ఇత్యాది మంత్రములచే జెప్పబడెడి' చతుః శృంగత్వము - త్రిపదత్వము' శ్రుత్యనుగుణముగ దర్శించినగాని శ్రుతికిగల త్రయీత్వము తేటపడదు. కనుక నీ మంత్రములకు శ్రుత్యంతర సంవాదము ననుసరించి సంప్రదాయానుగతమైన యర్థమును జూతము.

సామవేదీయ మగు షడ్వింశబ్రాహ్మణము—

"చత్వారో ఽస్యై వేదాః శరీరమ్ —ఋగ్యజుః సామ గతిః"

అని పరాదేవతయు యజ్ఞస్వరూపిణియు నగు స్వాహాదేవీ స్వరూపమును వివరించి యున్నది. దీనివలన స్వాహాదేవికి నాలుగు వేదములు శరీరము; ఋగ్యజుః సామలు మూడును పాదములు (గతిః-చేష్ట) - అని స్పష్టమగుచున్నది. 'ఛందసాం మాతా; వేదమాతా' -యని శ్రుతి ప్రసిద్ధమైన గాయత్రీ పరాదేవతకు ఋగ్యజుః సామలు పాదములని శ్రుతి స్మృతి పురాణేతిహాసాదుల యందు ప్రసిద్ధి గలదు.

"ఋగ్యజుః సామరూపా శ్చ పాదా అస్యాః ప్రకీర్తితాః"

—సూత. సం. 4-8-11.

ఋగ్వేదము కూడ యజ్ఞేశ్వరు డగు అగ్ని నిట్లే వర్ణించినది.

"వయం నామ ప్ర బ్రవామా ఘృతస్య - అస్మిన్ యజ్ఞే
ధారయామా నమోభిః । ఉప బ్రహ్మా శృణవ చ్ఛస్య
మానం । చతుఃశృంగో ఽవమీ ద్గౌర ఏతత్ ॥"

—ఋ. 4-58-2; వా. సం. 17-90; తై. ఆ. 10-10-2.

"చత్వారి శృంగా త్రయో అస్య పాదా । ద్వే శీర్షే సప్త
హస్తాసో అస్య । త్రిధా బద్ధో వృషభో రోరవీతి ।
మహో దేవో మర్త్యా ఆ వివేశ ॥"

-ఋ. 4-58-3; వా. సం. 17-91); తై. ఆ. 10-10-2; నిరు. 13-7.

ఇచట బ్రహ్మకు, లేక యజ్ఞేశ్వరునకు నాల్గు శృంగములు, మూడు పాదములు ఉన్నట్లు చెప్పబడినవి.

యాస్కుడు యజ్ఞపక్షమున యజ్ఞాత్మకు డగు నగ్నికి నాల్గు శృంగములు నాల్గు వేదములే యని చెప్పినాడు.

'చత్వారి శృంగేతి వేదా వా ఏత ఉక్తాః' -నిరుక్తమ్.

శ్రీసాయణాచార్యులును చతుఃశృంగము లనగా నాలుగువేదము లనియే గ్రహించిరి. వాజసనేయసంహిత యందు గల యీ మంత్రమును వ్యాఖ్యానించుచు ఉవట మహీధరులు బ్రహ్మ - ఉద్గాత - హోత- అధ్వర్యులనెడి నలుగురు ఋత్విజులే నాలుగు శృంగములు; ఋగ్యజుఃసామలు మూడును పాదములు- అని వివరించిరి. ఇట యజ్ఞేశ్వర (అగ్ని) పరముగ జెప్పు నపుడు నాలుగువేదము లనియు, యజ్ఞక్రియాపరముగ జెప్పు నపుడు చతుర్వేదములకు బ్రతినిధు లగు నలువురు ఋత్విక్కు లనియు గ్రహించుట సమంజసమే. ఋగ్వేదముచే హౌత్రము నెఱపెడి హోత ఋగ్వేదమునకును, అట్లే యధ్వర్యుడు యజుర్వేదమునకును, ఉద్గాత సామవేదమునకును బ్రతినిధులు ఇక బ్రహ్మ వేదత్రయోక్తకర్మాభిజ్ఞుడును: అధర్వవిదుడును నగుచు బ్రహ్మత్వమును నిర్వహించును గాన బ్రహ్మ చతుర్వేదప్రతినిధి యననొప్పును.

ఇట్లు చతుఃశృంగ పదముచే నాల్గువేదముల గ్రహించుచో స్వాహాదేవికి లేక గాయత్రీదేవికి వలెనే స్వాహాపతి యగు యజ్ఞేశ్వరునకు (లేక బ్రహ్మకు) చతు

ర్వేదమయత్వము (చతుశ్శృంగత్వము) ఋగ్యజుఃసామ సంచారిత్వము నుపపన్న మగును.

'చత్వారిశృంగా' యను నీ మంత్రమున కిట్లు యజ్ఞ, యజ్ఞేశ్వర పరము గనే గాక యొకచో 'ఓంకార' పరముగను, వేఱొకచో 'సూర్య' పరముగనే గాక యొకచో వైయాకరణులచే 'శబ్దబ్రహ్మ' పరముగను, మంత్రశాస్త్రవేత్తలచే 'పరా వాక్' పరముగను – బెక్కురీతుల వినియోగము, సమన్వయమును గన్పట్టుచున్నది. ఇట్టి మంత్రముననే గాదు. ఈ క్రింది మంత్రమున గూడ ఇట్లే చెప్పబడుచున్నది.

"చత్వారివాక్పరిమితా పదాని। తాని విదు ర్బ్రాహ్మణా
యే మనీషిణః గుహా త్రీణీ నిహితా నేంగయంతి।
తురీయం వాచో మనుష్యా వదన్తి॥"

—ఋ. 1-164-45; అథర్వ 9–10-27; తై. బ్రా 2-8-8–5; శ.బ్రా. 4-1-3–17; జై. ఉ. బ్రా. 1-7-3, 40–1; నిరు. 13–9.

ఇచట వాక్కుచే పరిమితము లగు నాలుగు పదము లేవి ?

"కతమాని తాని చత్వారి పదాని ?"

1. ఓంకారో మహావ్యాహృతయ శ్చే త్యార్షమ్ (వేదవాదినాం ఋషీణాం మతమ్)
2. నామాఖ్యాతే చోపసర్గ నిపాతా శ్చేతి వైయాకరణాః,
3. మంత్రః కల్పో బ్రాహ్మణం చతుర్థీ లౌకికీతి యాజ్ఞికాః.
4. ఋచో యజూంషి సామాని చతుర్థీ వ్యాహారికీతి నైరుక్తాః.
5. సర్పాణాం వాగ్వయసాం క్షుద్రస్య సరీసృపస్య చతుర్థీ వ్యావహారికీ తేకే.
6. పశుషు తూణవేషు మృగే ష్వాత్మని చే త్యాత్మప్రవాదాః.

—నిరు. 13–9.

ఇట్లు ఒకే మంత్రమునకు బెక్కు తీరుల సమన్వయములు జెప్పబడు చున్నపు డిం దేది ప్రామాణికము ? 'చత్వారి శృంగా-చత్వారి వాక్పరిమితా పదాని' ఇత్యాది ఋక్కులు వివిధార్థములు ధ్వనింప జేయుచున్న యాలంకారిక రూపణములే యగును. స్పష్టార్థప్రతీతి లేని యిట్టి మంత్రమున నాధారముగ గైకొని ఋగ్వేద మున నాల్గువేదముల ప్రస్తావన గలదని చెప్పబూనుట యుక్తమా ? యన నట్లు కాదు.

వివిధ దర్శనకారులు మంత్రముల యందు వివిదార్థముల దర్శించుట యుక్తమే. మంత్రములు వివిధగతులు, లేక వివిధ వినియోగములు గలిగి శత పథములై బహ్వర్థబోధకములు (శతప్రజాః) అగుచు యజ్ఞేశ్వరుని, వాగధిష్ఠాన దేవత యగు నగ్నిని, లేక బ్రహ్మను పొందుచుండుట మంత్రస్వభావ మని శ్రుతియే (ఋ. 4-58-5; వా. సం. 17-93) స్వయముగ వివరించినది (చూ. ఋషి శబ్దము). కాన పరమేశ్వరుడు వేలు వేలు రూపములతో దన నారాధించెడి భక్తులకు అధికారి భేదము ననుసరించి సాక్షాత్కరించుచు నట్లు, మంత్రముకూడ అధికారి భేదము ననుసరించియు, వినియోగభేదము ననుసరించియు వివిధార్థములతో నాత్మస్వరూప మును సాక్షాత్కరింప జేయుచుండును. ఉదా :- 'చత్వారి శృంగా' - ఇత్యాది మంత్రములు తైత్తిరీయారణ్యకమున తత్త్వోపదేశ ప్రకరణమున బఠింపబడినవి.

"యథోక్త ప్రశంసోపేత పుణ్యానుష్ఠానేన నిషిద్ధాచరణ
వర్జితేన శుద్ధాంతఃకరణస్య పురుషస్య తత్త్వ ముపదేష్టుం
అయ మనువాక ఆరభ్యతే" —సా. భా. తై. ఆ. 10-10-2.

కాన 'చత్వారి శృంగా'-ఇత్యాది మంత్రములకు యజ్ఞమునందు మాత్రమే వినియోగము-అని చెప్పదగదు, ఇవి తత్త్వమును కూడ దర్శింపజేయ సమర్థములు. అందుచేతనే శ్రుతియందు తత్త్వోపదేశ ప్రకరణమున గూడ బఠింపబడినవి. ఇట్లు తత్త్వోపదేశ ప్రకరణ మధ్య పఠిత మగుటజేసి యీ మంత్రమున కచట యజ్ఞపర ముగ నర్థమును వివరించుట పొనగదు. అందుచే నిచట 'అ' కారాది ప్రణవమాత్ర

లనెడి చతుశ్శృంగములును, విశ్వ-తైజస-ప్రాజ్ఞులు లేక విరాట్ - హిరణ్యగర్భ-అవ్యాకృతములు - అను మూడు పాదములునుంగల్గి యొప్పెడి ప్రణవాఖ్య బ్రహ్మతత్త్వమును ప్రతిపాదించు నట్టి మంత్రార్థము వివరింపబడినది. (చూ. సా. భా) ఆకారాది ప్రణవమాత్రలు ఋగాది వేదరూపము లగుటయు, అందుచే ప్రణవము వేదమయ మగుటయు శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాదులయందు స్పష్టము.

ఇట్లే సూర్యపక్షమున నాలుగు దిక్కులు నాలుగు శృంగములుగ జెప్పబడినవి. ఇందుల కుపపత్తి యిట్లు గాంచ వగును.

"ఋచాం ప్రాచీ మహతీ ది గుచ్యతే దక్షిణా మాహు
ర్యజుషా మపారామ్। అథర్వణా మంగిరసాం ప్రతీచీ
సామ్నా ముదీచీ మహతీ ది గుచ్యతే ॥"

"ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే
యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః ।
సామవేదే నాస్తమయే మహీయతే
వేదై రశూన్య స్త్రిభి రేతి సూర్యః ॥" —తై. బ్రా. 3-12-9,1.

"ఏతా శ్చతుర్వేదాభిమానిదేవతా ఆదిత్యస్య ప్రాచ్యాదిదిక్షు అవస్థాయ సేవన్తే .... ఏతచ్ఛందోగాః - 'అసౌ వా ఆదిత్యో దేవో మధు' - ఇత్యస్యాం మధువిద్యాయాం మహాప్రపంచేనా ఽమనంతి ।" —సా. భా.

పై శ్రుతివాక్యముల బరిశీలించుచో వేదమయము లయిన ప్రాచ్యాది దిక్కులను నాల్గింటిని సూర్యునకు చతుశ్శృంగములుగ జెప్పుట యుపపన్నమే యగును. మఱియు నిట్టు చతుర్వేదమయు డగు సూర్యుడు. ఇచట 'వేదై రశూన్య స్త్రిభి రేతి'-యని గూడ చెప్పబడుటచే స్వాహాదేవికిని, గాయత్రికిని, అగ్నికిని వలెనే సూర్యునకును చతుర్వేదమయత్వము, ఋగ్యజుఃసామ సంచారిత్వము నొప్పును.

ఇక మంత్రజ్ఞులు 'చత్వారి శృంగా' మంత్రమును పరావాక్ దేవతా పరముగను, వైయాకరణులు స్ఫోటాఖ్య శబ్దబ్రహ్మ పరముగను, నైరుక్తులు చతుర్వేద శృంగాత్మక దేవతాపరముగను నీ మంత్రార్థమును దర్శించిరి. సూక్ష్మముగ బరిశీలించినచో నొకే పరతత్త్వమును భిన్న భిన్న ప్రకరణము లందు భిన్న భిన్న రూపములతో నుపాసనాభేదము ననుసరించి దర్శించి రనుట స్పష్టము. కాన నివి యన్యోన్యవిరుద్ధము లని యనుకొనరాదు. ఇవి యధికారిభేదముచే సాధకులు దర్శించు సత్యదర్శనములే యగును.

ఇంకొక విషయము. ఈ మంత్రములకు త్రేతాగ్నిసాధ్యము లగు యజ్ఞాదిక్రియల యందుమాత్రమే గాక, ఏకాగ్ని, సాధ్యము లగు వివాహోపనయనాది సంస్కారముల యందును గూడ వినియోగము గలదు ఉదా:- ఈ 'చత్వారి శృంగా యను మంత్రముచే నిత్యనైమిత్తికము లయిన కర్మలయం దన్నిటి యందును అగ్ని దేవతా ధ్యానము చేయు సంప్రదాయము కలదు. అట్టియెడ ఏకాగ్నిసాధ్య కర్మ ప్రకరణ మగుటచే నీ మంత్రముచే నిట ఋత్విక్చతుష్టయసాధ్య యజ్ఞేశ్వరరూపమున అగ్నిని దర్శించుట పొసగదు - అనగా చతుఃశృంగములచే నిట నలుగురు ఋత్విజులను గ్రహించుటకు వలనుపడదు. తత్త్వోపదేశప్రకరణము గాదు. గాన నిట ప్రణవాఖ్యబ్రహ్మపరముగ సమన్వయము జెప్పను వీలు లేదు. అట్లే శబ్దబ్రహ్మ పరముగ గాని, పరావాగ్దేవి పరముగ గాని యర్థముల జెప్ప సమయము గాదు. కాగా చతుర్వేదాత్మక దేవతా (పరమేశ్వర) స్వరూపునిగ మాత్రమే యగ్ని నిట దర్శింపవలసి యున్నది. అందుచే నిట నగ్నికిగల చతుఃశృంగములు చతుర్వేదోపలక్షకము లగుట శ్రుతి సమ్మతము; సంప్రదాయవిరుద్ధము. శ్రీమద్భాగవతము గూడ 'చత్వారిశృంగా' యను నీ మంత్రమును శ్లోకరూపమున ప్రవర్తింపజేసి పరమేశ్వరుడు చతుర్వేదశరీరు డనియు, త్రయీవిద్యారూపు డనియు వర్ణించినది (చూ. ?- 6-11). (ఈ విషయము ముందు వివరింపబడును.).

## మఱియొక యాక్షేపము :-

'యజ్ఞం వ్యాఖ్యాస్యామః, స త్రిభి ర్వేదైః విధీయతే' — అనుచు యజ్ఞికులు ఋగ్యజుః సామవేదముల మూడింటికే యజ్ఞమునవినియోగము జెప్పిరి; కావున నాథర్వణిక మంత్రములకు యజ్ఞమున వినియోగము లేదు; యజ్ఞమున వినియోగము లేనందున నా మంత్రములకు వేదత్వ మెట్లుపపన్న మగునః వేదత్వమే యుపపన్నము గానిచో యజ్ఞేశ్వరు డగు నగ్ని చతుర్వేద శృంగాత్మకు డగుట యెట్లు ? కాన 'చత్వారి శృంగా' —ఇత్యాది మంత్రముల నాధారము జేసికొని ఋగ్వేదమున చతుర్వేదముల ప్రస్తావన గల దని చెప్పుట యుక్తమా? -యన నట్లు గాదు.

## వేదత్వము - యజ్ఞసంబంధము :-

అథర్వణిక మంత్రములు కృత్స్న బ్రహ్మత్వ ప్రతిపాదకము లగుచు యజ్ఞ సంబంధము గల్గియున్న వని పూర్వము వివరింపబడినది. కాన వానికి యజ్ఞ సంబంధము లే దనుట యుక్తము కాదు. ఒకవేళ నా మంత్రములకు యజ్ఞము నందు సాక్షాత్తు వినియోగము లేక పోవచ్చును. అంత మాత్రముచే వీనికి వేదత్వ ముపపన్నము గా దనుట యుక్తము గాదు. యజ్ఞవినియోగ రూప సంబంధము చేతనే వేదత్వము సిద్ధించు నని చెప్పుచో యజ్ఞముల యందు వినియోగములేని యుపనిషత్తులకును వేదత్వముపపన్నము కాకపోవును. ప్రత్యక్షాది ప్రమాణములచే దెలియజాలని పురుషార్థోపాయముల దెలియ జేయుటయే (వేద యతీతి వేదః) వేదము యొక్క వేదత్వ మని పూర్వము వివరింపబడినది. (చూ:— వేదశబ్దము).

అనగా కర్మార్థము లగుచు నతీంద్రియ మగు ధర్మమును, మోక్షార్థము లగుచు నుపనిషత్తులచే నతీంద్రియ మగు బ్రహ్మను బోధించుట వేద సామాన్య లక్షణము. ఇతర వేదములవలెనే యథర్వవేదము గూడ బ్రాహ్మణాదులతో విలసిల్లుచు ధర్మ బ్రహ్మ బోధక మగుచున్నది.

ఇతరవేదములకు వలెనే అథర్వవేదమునకును శాఖలు గలవు. ఈ విషయమును సంప్రదాయవిదు లిట్లు చెప్పుచున్నారు.

"మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః। సప్తద్వీపా వసుమతీ।
త్రయోలోకా శ్చత్వారో వేదాః సాంగాః సరహస్యా బహుధా
భిన్నా ఏకశత మధ్వర్యు శాఖాః సహస్రవర్త్మా సామవేదః
ఏకవింశతిధా బాహ్వృచ్యం నవధా ఽఽథర్వణో వేదో
వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యక మిత్యేతావాన్ సశబ్ద్య
ప్రయోగవిషయః" —మహాభాష్యమ్ - పస్పశాహ్నికమ్.

మఱియు పతంజలి మహర్షి శబ్దానుశాసనమును ప్రారంభించుచు -

"వైదికాః ఖల్వపి - శంనో దేవీ రభిష్టయే - ఇషే త్వోర్జే త్వా -
అగ్నిమీళే పురోహితం - అగ్న ఆయాహి, వీతయ - ఇతి"

అనుచు నాలుగు వేదముల యందలి వాక్యములను (ఆద్య మంత్ర ప్రతీకములను) వైదిక వాక్యములుగా నుదహరించినాడు. ఇందు మొదట నుదహరింపబడిన 'శం నో దేవీ రభిష్టయే' అనునది అథర్వణ వేదవాక్యము. సామాన్యముగ బ్రసిద్ధమైన ఋగ్-యజుః-సామ-అథర్వణము లనెడి క్రమమును విడిచి యిట ముందు అథర్వణ వేదవాక్యమే యుదహరింపబడినది.

ఇట్లే మహాభాష్యమున మఱియొకచోట గూడ -

"కిం పున రిదం వ్యాకరణ మే వాధిజిగాంసమానేభ్యః
ప్రయోజన మన్వాఖ్యాయతే న పున రన్య దపి కించిత్,
ఓ మిత్యుక్త్వా వృత్తాంతశః శ మిత్యేవ మాదీన్ శబ్దాన్
పఠన్తి."

యనుచు నథర్వ వేదమునకు గల ప్రాథమ్యము కంఠోక్తిగ దెలియజేయ బడినది. వ్యాఖ్యాతలు నితరవేదములకంటె దీనికి గల ప్రాథమ్యము లేక వైలక్ష ణ్యము దీనిచే సూచిత మగుచున్నట్లు తెలియ నగునని వివరించిరి.

మఱియు పతంజలి యథర్వవేదీయు డనియు, నందుచే నా వేద వాక్యమును మొదట నుదహరించె ననియు కొందఱి యభిప్రాయము. (చూ. మహా భాష్యటిప్పణి). అథర్వవేదమునకు వేదత్వమే లేనిచో లేక వేదత్వము తరువాత గల్పింపబడినచో, కల్పిత వేదత్వ ప్రతీతి గల యా వేదము నాదరించి పతంజలి మహర్షి దాని నిట శబ్దానుశాసనారంభమున మొదట నుదహరించుట యుపపన్నము గానేరదు 'రక్షార్థం వేదానా మధ్యేయం వ్యాకరణమ్' - అని వేదరక్షార్థమై కదా వ్యాకరణము ప్రవృత్తమయినది. అట్లు ప్రవృత్తమయిన శబ్దానుశాసనారంభమున నిట్లు కల్పిత వేదత్వ ప్రతీతి గలదని చెప్పబడెడి యీ యథర్వణ వేదవాక్యమును మొదట నుదహరించుట సంప్రదాయవిదుత్తముడు, ప్రామాణికుడు నగు పతంజలి మహర్షికి జెల్లదు. అందుచే నట్లు మొదట నుదహరించుట లోని తాత్పర్యమేదియో కనుగొనవలసి యున్నది. ఆ విషయమును క్రమముగ జూతము. ముందు అథర్వవేదముయొక్క వేదత్వమును జూతము.

"స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారే ఽధికారాచ్చ
సవవ చ్చ త న్నియమః" — బ్ర సూ. 3-3-6.

శ్రీ బాదరాయణ మహర్షి ఈ సూత్రముచే నితర వేదాధ్యయన మెట్లు స్వాధ్యాయ మగునో యథర్వ వేదాధ్యయనము గూడ నట్లే స్వాధ్యాయమగుట

స్పష్టము చేసినాడు మఱియు 'సవవచ్ఛ త న్నియమః' అను పదములచే నాథర్వణ మంత్రములకు ఏకాగ్నిసాధ్య కర్మపరత్వమును వివరించినాడు.

'యజ్ఞం వ్యాఖ్యాస్యామః స త్రిభి ర్వేదై ర్విధీయతే' — అని చెప్పిన శ్రౌతసూత్రకారులును తమ గృహ్య, ధర్మసూత్రములలో స్వాధ్యాయాధ్యయన విధుల యందు నాల్గు వేదముల విధించినారు. కనుకనే 'త్రిభి ర్వేదై ర్విధీయతే' అను వాక్యము చతుర్థవేద నిషేధపరము కాదని స్పష్టమగుచున్నది.

కాన అథర్వవేదమునకు వేదత్వ మనాదిసిద్ధమే కాని యాగంతుకము కాదు. వేదములు గాని, వేదాంగములుగాని, స్మృతి పురాణేతిహాస కావ్యాదులు గాని, యథర్వవేదమునకు వేదత్వ మెట్లుపపన్న మగును?' — అని శంకించుట యెచటను గానము. అట్లు శంకింపక పోగా పురాణేతిహాసాదు లాథర్వణిక మంత్రములను సిద్ధమంత్రము లని వేనోళ్ళ బొగడినవి. ఆ యుదాహరణములు గొన్ని పూర్వము చూపబడినవి. అంతేగాక యథర్వ వేదమునకు యజ్ఞమునందలి విశిష్టస్థానమును గూడ వివరించి చెప్పినవి. వేదవేత్తయు మహాతపస్వియు నగు ఋశ్యశృంగుడు ఆథర్వణికమంత్ర ప్రకాశితమైన పుత్రకామేష్టిని యథావిధిగ దశరథునిచే జేయించినట్లు శ్రీమద్రామాయణము చెప్పుచున్నది.

"మేధావీ తు తతో ధ్యాత్వా స కించి దిద ముత్తమమ్।
లబ్ధసంజ్ఞ స్తత స్తం తు వేదజ్ఞో నృప మబ్రవీత్॥

ఇష్టిం తేఽహం కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్।
అథర్వశిరసి ప్రోక్తై ర్మంత్రైః స్సిద్ధాం విధానతః॥"

— రామా. బాల. 15 సర్గ.

హరివంశము యజ్ఞము చతుర్వేదాత్మక మని చెప్పుచు, అథర్వవేదము యజ్ఞమునకు శీర్షస్థానీయమని యిట్లు కీర్తించినది.

"నేత్రాభ్యాం జనయ ద్దేవో ఋగ్వేదం యజుషా సహ ।
సామవేదం చ జిహ్వాగ్రా దథర్వాణం చ మూర్ధతః ॥
జాతమాత్రా స్తు తే వేదాః క్షేత్రం విందంతి తత్త్వతః ।
తేన వేదత్వ మాపన్నా యస్మా ద్విందంతి త త్పదమ్ ॥
తే సృజంతి తదా వేదా బ్రహ్మ పూర్వం సనాతనమ్ ।
పురుషం దివ్య రూపాభం స్వైః స్వై ర్భావై ర్మనోభవైః ।
ఆథర్వణ స్తయో యోగః శీర్షం యజ్ఞస్య త త్స్మృతమ్ ।
గ్రీవా బాహ్వంతరం చైవ ఋగ్భాగః స భవే త్తతః ॥
హృదయం చైవ పార్శ్వం చ సామభాగ స్తు నిర్మితః ।
బస్తి శీర్షం కటీ దేశం జంఘోరు చరణైః సహ ।
ఏవ మేష యజుర్భాగః సంభూతో యజ్ఞ కల్పితః ॥
పురుషో దివ్యరూపాభః సంభూతో హ్యమరా త్పదాత్ ।
స హి వేదమయో యజ్ఞః సర్వభూతసుఖావహః ॥

— హరివంశ 3-17-47 నుండి 53.

మహాభారత మీ యథర్వవేదము నుత్తమోత్తమశ్రుతి యని యిట్లు కీర్తించినది.

"అథర్వాంగిరసౌ హ్యేషా శ్రుతీనా ముత్తమా శ్రుతిః ।
అవిచార్యైవ కార్యైషా శ్రేయస్కామై ర్నరైః సదా ॥"

— భార. 8–70–46.

ఇట్లు పురాణేతిహాసములయం దుత్తమశ్రుతిగా గీర్తింపబడుట వలనను 'ఆథర్వాంగిరసః పృచ్ఛం ప్రతిష్ఠా' – అని ఈ రీతిగా శ్రుతులును అథర్వవేదము యొక్క మహత్వమును గీర్తించుట జేసి పతంజలి మహర్షియు శబ్దానుశాస నారంభమున దాని మహత్త్వమునను దెలియజేయుటకై యా వేద వాక్యమును మొదట నుదహరించె నని చెప్పుట యుక్తము.

శ్రీ సాయణాచార్యులును 'చత్వారి శృంగా' యను ఋక్కునకర్థమును వివరించుచు అథర్వవేదమును గూర్చి యిట్లు వివరించిరి.

"యద్య ప్యాప స్తంబేన యజ్ఞం వ్యాఖ్యాస్యామః స త్రిభి ర్వేదై ర్విధీయత ఇత్యుక్తమ్; తథాఽపి ఆథర్వణస్య ఇతరానపేక్షయైవ ఏకాగ్ని సాధ్యానాం కృత్స్నకర్మణాం అభిధాయకత్వాత్ తదపేక్షయా చత్వారి శృంగే త్యుక్తమ్'

— సా. భా. ఋ. 1-164-45.

కాన 'చత్వారి శృంగా' యను మంత్రమున యజ్ఞేశ్వరుడగు అగ్ని చతుర్వేద శృంగాత్మకుడగుట యుక్తమే. ఇట్లు ఋగ్వేదమున నీ మంత్రముననే కాదు చతుర్వేద ప్రస్తావము గల ఋక్కు లింకను గలవు.

ఉదా:

"పాహి నో అగ్న ఏకయా పా హ్యుత ద్వితీయయా। పాహి గీర్భి శ్చతసృభి రూర్జాం పతే పాహి చతసృభి ర్వసో।"

— ఋ. 8-60-9; వా. సం. 27-43; తై. ఆ. 10-5-1.

తైత్తిరీయారణ్యకమునం దీ మంత్రము కొలది మార్పులతో గలదు. ఋగ్యజుః సామాథర్వణ రూపము లగు నాల్గు వాక్కులతో (చతసృభిః గీర్భిః) అభిష్టుతుడవై జగన్నివాసహేతుభూతుడవైన యగ్ని (వసో) రక్షింపుము - అని యర్థము.

"హే అగ్నే, హే వసో, జగన్నివాసహేతో। ఋగ్యజుః సా మాథర్వణ రూపాభి శ్చతసృభి ర్గీర్భిరభిష్టుతః సన్ నః పాహి।" సా. భా.

కావున స్వాహాదేవికిని, గాయత్రికిని, సూర్యునకును, ప్రణవాఖ్య బ్రహ్మకును వలెనే యజ్ఞేశ్వరుడగు అగ్నికి గూడ చతుర్వేదమయత్వము. ఋగ్యజుః సామసంచారిత్వము ఉపపన్నమే యగును.

## చతుర్వేదములు త్రయీ విద్యారూపములు :-

కాని, 'చత్వారో ఽస్యై వేదాః శరీరమ్—ఋగ్యజుఃసామగతిః; అప్లే-చత్వారిశృంగాః త్రయో అస్య పాదాః'— అని యీరీతిగ జెప్పుచో చతుర్వేదములు శరీరము లేక శృంగము లగు టేమి ? ఋగ్యజుస్సామలు మూడును పాదము లగు టేమి ? ఇవి పరస్పర విరుద్ధములుగ గన్పట్టుట లేదా ? యన నట్లు గాదు.

## మంత్రత్రైవిధ్యము :-

ఇచట చతుర్వేదములను శృంగములుగను, లేక శరీరముగను మొదట బేర్కొని, తర్వాత ఋగ్యజుఃసామలను పాదములుగా బేర్కొనుటచే, నిచట ఋక్—యజుః—సామ పదములు వేదపరములు గావనుట స్పష్టము. ఇవి మంత్రపరములు అనగా పై నాలుగువేదముల యందలిమంత్రములు ఋక్కులుగనో, లేక యజుస్సులు గనో, సామలుగనో యుండు నని మంత్ర త్రైవిధ్యమును దెల్పునవి. దీనివలన సామాన్యముగ ఋగ్వేదము, యజుర్వేదము—అని యీ రీతిగ వేదపద సాహచర్య మున్నపుడు ఋగ్యజుస్సామలు వేదపరములు. అట్లు వేదపద సాహచర్యము లేనియపుడు ప్రకరణము ననుసరించి వానిని మంత్రపరములుగనే గ్రహించుట సంప్రదాయము. కాన పూర్వోదాహృతము లయిన—'ఋచః సామాని జజ్ఞిరే.... యజుః తస్మా దజాయత'.-ఇత్యాది స్థలములయం దు ఋగ్రూపములు, సామరూపములు నయిన మంత్రములే యావిర్భవించిన వని యర్థము. అనగా చతుర్వేదములు

ఋగాది త్రివిధమంత్రాత్మకములై యావిర్భవించిన వని యర్థము, ఎడనెడ నీ పదములు ప్రకరణము ననుసరించి వేదపరములుగ గన్పట్టినను గన్పట్టవచ్చును.

కాని 'తస్మా ద్యజ్ఞాత్ సర్వహుతః ఋచఃసామాని జజ్ఞిరేఛందాంసి జజ్ఞిరే తస్మాత్ యజు స్తస్మాదజాయత'—అను నీ మంత్రము నందలి ఋగ్-యజుః-సామ పదములు మంత్రపరములు గావు; అవి వేదపరములే యని కొందఱు విమర్శకు 1 లిటు చెప్పుచున్నారు.

"పైమంత్రమున 'ఛందాంసి' యను పదమునకు అథర్వవేద మని యర్థము. కాన పై మంత్రముచే చతుర్వేదోత్పత్తి తెలియుచున్నది; ఏలయన ఋగ్-యజుః-సామ వేదములు గాయత్ర్యాదిఛందోబద్ధములేకదా? ఋగాది వేదము లావిర్భవించిన వనియే యర్థము. మరల'ఛందాంసి జజ్ఞిరేతస్మాత్' అని చెప్పుట యేల? 'ఛందాంసి' యను పద మథర్వవేదోత్పత్తిని దెలియజేయును. ఇట్లు చెప్పుటకు ప్రమాణమును గలదు.

"ఋచాం....గాయత్రం ఛందః। యజుషాం....త్రైష్టుభం ఛందః।
సామ్నాం....జాగతం ఛందః। అథర్వణాం....సర్వాణి ఛందాంసి॥"

—గో. బ్రా. 1–1–29.

పై శ్రుతివాక్యము ఋగ్వేదాదుల కొక్కొక్క ఛందస్సుతోనే విశిష్ట సంబధము. అథర్వవేదమున కట్లుగాక యన్ని ఛందస్సులతోను విశిష్ట సంబధము గలదని తెలియును; ఇట్లు సర్వచ్ఛందో విశిష్ట మగుట చేతనే యథర్వవేదము 'ఛందాసి' యను పదముచే జెప్పబడుచున్నది. అదియును గాక 'ఛందో హ జజ్ఞిరే తస్మాత్' అని యేకవచనాంత ఛందఃపద ఘటితపాఠ

1 భగవద్దత్త—జైమినీయ-ఉపనిష ద్బ్రాహ్మణ భూమిక (దయానంద మహావిద్యాలయ - సంస్కృత గ్రంథమాల).

దయానందసరస్వతి - ఋగ్వేదాది భాష్యభూమిక.

మథర్వవేదమున తనను సూచించుచున్నది; మఱియు నిట 'ఋచః సామాని' యను నీ రెండు పదములు బహువచనాంతములు, 'ఛందః — యజుః' అను నీ రెండు నేకవచనాంతములు; ఏకవచనాంత మయ్యు యజుఃపదము వేదబోధక మగుట శ్రుతులయందు గాన నగును;

> "యస్మా దృచో అపాతక్షన్ యజు ర్యస్మా దపాతక్షన్
> సామాని యస్య లోమా న్యథర్వాంగిరసే ముఖమ్....'
>
> —అ.వే. 10-7-20.

ఈ మంత్రమున 'అథర్వాంగిరసః' అను పదము అథర్వవేదవాచకమును కాన నిచటి యేకవచనాంత మగు యజుఃపదము కూడ యజుర్వేదపరము; ఋక్సామ పదములు ఋక్సామ వేదపరములు; కాన 'తస్మా ద్యజ్ఞాత్సర్వహుతః' అను అథర్వ వేదీయ మగు ప్రకృతమంత్ర మందలి 'ఛందః- యజుః' అనెడి ఏకవచనాంత పదములు గూడ వేదబోధకములే; కాన చతుర్వేదావిర్భావమే పై మంత్రముయొక్క ఆశయము. ఇంతియే కాదు; 'ఛద' అను పదమే పారసీకభాషలో 'జెండ్' అయినది. జెండ్ అనునది పారసీకుల ధర్మగ్రంథము (జెందవస్తా Zend Avesta) ఇందు ఆథర్వణు లగు పురోహితులయొక్క నామములు పలుచోట్ల గానవచ్చును. హాగ్ మతానుసారముగ దీనియందలి మంత్ర మొకటి యథర్వవేదముయొక్క మొదటిమంత్రము: కాన జెందవెస్తా'- అథర్వ వేదములకు విశేషసంబంధము గలదని తెలియుచున్నది. కాన నీ మంత్రమున 'ఛందః' పదమునే అథర్వవేదమును గ్రహించుట యుక్తము."

ఇది కేవల మూహాకల్పిత మైన సమన్వయమే యగును. 'ఛందః' పదమునకు అథర్వవేద మను నర్థము వేదములందు గాని, పురాణేతిహాసాదుల యందుగాని, కోశములందు గాని యెచటను గన్పట్టదు. కాని యిట 'ఛందాంసి జజ్ఞిరే' యని వేఱుగ జెప్పుట యేల ? - యని యడుగవచ్చును. వేదములు ఛందోమయము లయి యవతరించిన వని చెప్పుటయే శ్రుతి తాత్పర్యము. అంతియే కాదు. 'ఋచః

సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరే తస్మాత్' —అని చెప్పి, చివరకు 'యజు స్తస్మా దజాయత' అని చెప్పబడినది. 'ఋక్ సామలు ఛందోబద్ధము లయిన మంత్రములు; నియత పాదాక్షరావసానములు గలవి, యజుస్సు లట్టివి కావు' — అని తెలియజేయుటకే 'ఋచః సామాని జజ్ఞిరే' యను వాక్యము తరువాత ఛందాంసి జజ్ఞిరే' యని చెప్పబడినది. యజుస్సులు ఛందోబద్ధములు కావనెడి విషయము 'ఛందః' శబ్దమున వివరింపబడును.

శ్రీ జైమిని మహర్షియు 'ఋక్-యజుః-సామ పదములను మంత్రపరము లుగనే గ్రహించి వాని లక్షణముల నిట్లు ప్రత్యేకించి పేర్కొనినాడు.

"తచ్చోదకేషు మంత్రాఖ్యా' —2-1-32.
'శేషే బ్రాహ్మణ శబ్దః' —2-1-33.
'తేషాం ఋక్ యత్రార్థవశేన పాదవ్యవస్థా' —2-1-35.
'గీతిషు సామాఖ్యా' —2-1-37.
'శేషే యజుః శబ్దః' —2-1-36.

పాదబద్ధమైన మంత్రములు ఋక్కులు. గానయుక్తములు సామలు. ఇంగిలిని అనగా ప్రశ్లిష్టపాఠము గల్గినవి యజుస్సులు. కాన ఋగ్యజుః సామ పదముల మంత్రపరములుగ గ్రహించుటయే సంప్రదాయము;

ఛందఃపదము పారశీకభాషయందు జెంద్ అని వికృతరూపము దాల్చిన దాల్పవచ్చును. ఛందః పదమునకు గాయత్ర్యాదిఛందస్సు లనియే గాక 'వేదములు' అనియు శ్రుతిసంప్రదాయానుగుణమైన యర్థము. జెందవెస్తా యందు అథర్వణిక మంత్రములే గాక ఋగ్వేదీయమంత్రములు నధికముగ గలవు. అనగా ఛందోబద్ధమైన మంత్రములయొక్క వికృతిరూపములు గలవు కనుక ఛందోబద్ధ మంత్ర ప్రకృతి రూప మగుట జేసి జెంద్ అను వ్యవహార మేర్పడి యుండ వచ్చును. కాన ఛందః పదము అథర్వణ వేద వాచక మనుటలో ప్రమాణము గన్పట్టదు.

58)

అందుచే 'తస్మా ద్యజ్ఞాత్ సర్వహుతః' అను పై మంత్రమున ఋగ్రూప ములు యజూరూపములు, సామరూపములు, నగు త్రివిధము లైన మంత్రము లావిర్భవించినవని గ్రహించుటయే యుక్తతరము. శ్రీసాయణులను వీనిని వేదపరము లుగ గాక, మంత్రపరములుగనే యిట్లు వ్యాఖ్యానించిరి.

"య మృషయ స్త్రయివిదా విదుః। ఋచః సామాని యజూ గ్ంషి (తై. బ్రా. 1-2-1-26) ఇతి। త్రైవిధ్యం తు వేద గత మన్త్రాభిప్రాయమ్। తదు క్తం జైమినినా — తచ్చోదకేషు మన్త్రాఖ్యా.... శేషే యజుః శబ్ద ఇతి। త దస్మిన్నపి వేదే విద్యత ఇతి న చతుష్ట్వ వ్యాకోపః'

—అథర్వవేద. భాష్యభూమిక.

త్రయీవిదు లనగా ఋగ్యజుఃసామ వేదవేత్త లని యర్థము కాదు. ఋగ్యజుఃసామ రూపము లగు త్రివిధ మంత్రజాతమునకు 'త్రయీ' యని పేరు; అట్టి త్రయిని తెలిసినవారు త్రయీవిదు లగుదురు — అని యర్థము. పై శ్రుతియందలి త్రైవిధ్యము వేదగతమైన మంత్రత్రైవిధ్యమును బోధించినది. శ్రీజైమిని మహర్షియు ఋగ్యజుః సామలను మంత్రపరములుగనే గ్రహించినాడు. అట్టి మంత్రత్రైవిధ్యము అథర్వ వేదమునందును గలదు కాన నీ వేదమునకును 'త్రయీ' యను వ్యవహారముప పన్న మగును — అని యర్థము.

పై ప్రమాణముల ననుసరించి యీ నాల్గువేదములలో ప్రతివేదము (శాఖయు) ఋగ్యజుఃసామ లనెడి యవయవ త్రయముతో నొప్పుటచే త్రయీ యగుచున్నది. ఇట్లు త్రయీ యను పదము వేదసామాన్యమునకు నామ మగుటచే త్రయీవిద్య యనగా వేదవిద్య యను నర్థము ప్రసిద్ధమయి యున్నది. ఈ సంప్రదాయమును మహాభారత మిట్లు చెప్పుచున్నది.

"త్రయీవిద్యా మవేక్షేత వేదేషూక్తా మథాంగతః
ఋక్సామవర్ణాక్షరతః యజుషో ఽథర్వణ స్తథా ॥"
—భార. 12-235-1.

ఋగ్యజుఃసామాథర్వణము లనెడి నాల్గు వేదము లందును త్రయీవిద్య ప్రతిష్ఠితమై యున్నట్లు ఈ భారతవచనము స్పష్టము జేయుచున్నది. నాల్గువేదములును ఋగ్యజుఃసామ మంత్రాత్మకములగుటచే నాల్గు వేదములందును త్రయీవిద్య ప్రతిష్ఠితమై యున్నది. కాన త్రయీపదముచే నాల్గవేదముల గ్రహించుట సంప్రదాయము.

శ్రీమద్భాగవతము గూడ 'చత్వారి శృంగా' యను శ్రుతి ప్రతిపాదితార్థముతో బరమేశ్వరుని యజ్ఞస్వరూపునిగ గీర్తించుచు నీ విషయము నిట్లు తెలియజేయుచున్నది.

"నమో ద్విశీర్ష్ణే త్రిపదే చతుఃశృంగాయ తంతవే।
సప్తహస్తాయ యజ్ఞాయ త్రయీవిద్యాత్మనే నమః॥" —8-16-31.

ఇట యజ్ఞరూపు డగు పరమేశ్వరుడు త్రయీవిద్యాత్మకము లగు నాలుగు శృంగములు- నాలుగు వేదములు-గలవాడుగా కీర్తింపబడినాడు. వ్యాఖ్యాతలు నిట్లే వివరించినారు ('చత్వారి శృంగేతి వేదా ఏవ ఉక్తాః' -శ్రీధరః). కాన నాలుగు వేదములకు త్రయీవిద్య యను వ్యవహారము సంప్రదాయాభిమతము. వ్యాసభగవానుడు వేదవిభాగము జేయుటకు బూర్వ మేకరాశిగా నున్న వేదమునకు గూడ ఋగ్యజుఃసామ రూప మంత్ర త్రైవిధ్యముచే త్రయీత్వ ముపపన్న మగును. ఇక మొదట నాక్షేపమున జూపబడిన శ్రుతివాక్యముల జూతము.

'వేదై రశూన్య స్త్రిభి రేతి సూర్యః' — తై. బ్రా. 3-12-9-1.
'సైషా త్రయ్యేవ విద్యా తపతి' — తై. ఆ. 14-1.
'సైషా త్రయీ విద్యా యజ్ఞః' శ. బ్రా. 1-1-4-3.

ఇత్యాది పూర్వోదాహృత శ్రుతివాక్యములు సూర్యునకును, యజ్ఞమునకును త్రయీత్వమును జెప్పుచున్నవి. ఇట ఋగ్యజుఃసామ రూపమగు

త్రివిధ మంత్రజాతమే త్రయీ విద్య. అంతియే కాని మూడు వేదము లని యర్థము గాదు. శ్రీ సాయణులు నిట్లే వ్యాఖ్యానించిరి. ఇక –

> "త్రయో వేదా అజాయన్త, ఋగ్వేద ఏ వాగ్నే రజాయత,
> యజుర్వేదో వాయోః, సామవేద ఆదిత్యాత్" — ఐ. బ్రా. 5-32.

అను నీ శ్రుతివాక్యము కూడ అగ్నివాయ్వాదిత్యుల వలన క్రమముగ ఋగ్యజుస్సామ రూప మంత్రత్రైవిధ్యము గల వేద శబ్దరాశి యావిర్భవించినట్లు చెప్పుచున్నదని గ్రహింపనగును. అగ్నివాయ్వాదిత్యాత్మకుడగు ప్రజాపతి నుండి త్రయీ విద్యారూప వేదశబ్దరాశి యావిర్భవించిన దని భావము. (చూ. భారతీ శబ్దము).

## త్రయీవిద్య - యోగత్రయము :-

పరము పురుషార్థమును లభ్యింపజేయుటకు కర్మ - ఉపాసనా - జ్ఞాన యోగముల నుపదేశించుట వేదముల యందలి వైలక్షణ్యము. అట్లు కర్మ - ఉపాసనా - జ్ఞాన యోగత్రయ విశిష్ట మగుటచే గూడ వేదములకు త్రయీత్వము వచ్చు ననియు చెప్పనగును. పరమేశ్వరునకు త్రయీ వేద్యుడని పేరు ప్రసిద్ధము. అనగా వేదప్రతిపాద్య కర్మ - ఉపాసనా - జ్ఞానైక వేద్యుడని యర్థము. పరమేశ్వరుడు త్రయీవేద్యు డయినట్లు కర్మ - ఉపాసనా - జ్ఞానయోగయుక్తుడగు సాధకుడును 'త్రయయాయ్యః' అగునని శ్రుతులు కీర్తించినవి.

> "అథా హి విశ్వీడ్యో౽సి ప్రియో నో అతిథిః । రణ్వః
> పురీవ జూర్యః సూను ర్న త్రయయాయ్యః ॥"

— ఋ. 6-2-7.

"త్రయీ విద్యా తపః కర్మ లక్షణం త్రయం యాతీతి
త్రయయాయ్యః" — శా. భా.

విద్యా-తపః-కర్మ త్రయముచే సుసంస్కృతుడై రమణీయుడైన (రణ్వః) పుత్రుని వలెను (పూషా రణ్వ), వృద్ధుడు, హితోపదేశకుడు నగు రాజువలెను, మనల కతితియు, ప్రీయమాణుడు నగు అగ్ని రమణీయుడై ప్రాప్తవ్యు డగుచున్నాడు- అని యర్థము.

ఇట విద్యాతపఃకర్మ త్రయముచే సుసంస్కృతు డయిన పుత్రునివలె నగ్నియు రమణీయుడై ప్రాప్తవ్యు డగుట చెప్పబడినది. - కాని యగ్ని యందు రమణీయత్వమును దర్శించు టెట్లు? విద్యా తపః కర్మ త్రయముచే - అనగా కర్మ - ఉపాసనా - జ్ఞాన యోగత్రయముచే చిత్తము సుసంస్కృతమై రమణీయ మగు కొలది యగ్నియందు దివ్యత్వమును లేక అలౌకిక రామణీయకమును దర్శింప నగునని శ్రుతి తాత్పర్యము.

ఇట్టి త్రయమును ప్రతిపాదించునది గాన వేదము త్రయీ యని ప్రసిద్ధమైన దనవచ్చును. "య ఋషయ స్త్రైవిదా విదుః .... ఋచః సామాని యజూగ్ంషి, సా హి శ్రీ రమృతా సతామ్" - అను శ్రుతి ఋగ్యజుః సామాత్మక మంత్రరాశిని 'శ్రీః' అని వ్యవహరించినది. శ్రీ రూపుడై, కర్మ - ఉపాసనా - జ్ఞానాత్మక విద్యాత్రయమును వర్ధిల్ల జేయువాడగుటచే — తదుక్తార్థానుష్ఠానపరులగు సాధకులను వర్ధిల్ల జేయువాడగుచే - పరమేశ్వరునకు 'శ్రీవర్ధనః' అను పేరు ప్రసిద్ధము.

'ఋచః సామాని యజూగ్ంషి సా హి శ్రీ రమృతా
సతామ్ - ఇతి శ్రుతే ర్వేదత్రయరూపాం శ్రియం కర్మో
పాస్తి జ్ఞాన కాండాత్మికాం వర్ధయతి తత్తదుక్తార్థానుష్ఠానేన
సమ్యక్ పరిపోషయతి స శ్రీవర్ధనః'

— నీలకంఠవ్యాఖ్యా. భార. 13-17-53.

కనుక త్రయీ విద్యయనగా త్రివిద్య, లేక వేదవిద్య యనియు, నయ్యది విద్యా తవః కర్మ - (లేక కర్మోపాసనాజ్ఞాన) కాండాత్మక మనియు సంప్ర దాయార్థము. శ్రీ శంకర భగవత్పాదులు నీ విషయమిట్లు వివరించిరి.

'కర్మోపాసనా జ్ఞానకాండ భేదేన చత్వారోఽపి వేదాః
త్రిప్రకారాః' లలితా త్రిశతీభాష్యమ్. 5వ శ్లో.

ఇక త్రయీశబ్దము నిట్లుగాక, స్మృతులలోని కొన్ని కొన్ని వాక్యముల బురస్కరించుకొని చరిత్రకారులు విపరీతార్థకల్పనలతో జరిత్రాంశముల సృజించుటయు జాతము.

## స్మృతి వచనములు - చారిత్రికుల కల్పన :-

"షట్త్రింశ దాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్"

అను మనుస్మృతి వచనము ననుసరించి 'మూడువేదములకే త్రయీ వ్యవహారము గల దనెడి యాక్షేపమును జాతము. పై శ్లోకమున గల 'త్రైవేదికం' అను పదము మూడు వేదముల బోధించు మాట సత్యమే. కాని యది చతుర్థవేద నిషేధపరము కాదు. ఏలయన మనుస్మృతియే మఱియొకచోట—

'శ్రుతీ రథర్వాంగిరసీః కుర్యాది త్యవిచారయన్' — 11-33.

అనుచు 'అథర్వాంగిరసీః శ్రుతీః' అను పదములచే నథర్వ వేదము యొక్క శ్రుతిత్వమును ఆవశ్యకతను ఖ్యాపనము చేయుచున్నది. కాన పై త్రైవేదికమ్ అను పదము చతుర్థవేద నిషేధపరము కాదు.

అయం చ మానవః త్రైవేదిక వ్రతచర్యా విధి రాథర్వవేద
వ్రతచర్యాం నిషేధతి। తత్పరత్వే వాక్యభేదప్రసంగాత్।
శ్రుత్యంతరే వేదమాత్రే వ్రతశ్రవణాచ్చ' —కుల్లూకభట్టవ్యాఖ్య.

అనుచు వ్యాఖ్యాతలును త్రైవేదికపదము చతుర్థవేద నిషేధపరము గాదని యే గ్రహించిరి.

ఇంతే కాదు. బ్రాహ్మణములు నందు (స్వాధ్యాయము)నందు నాల్గు వేదముల నధ్యయనము చేయుట వల్లన నాల్గు ఫలములు కలుగు నని శ్రుతులు (తై. ఆ. 2-9-2; శ. బ్రా. 11-5-6-4) నిర్దేశించుచున్నవి. మనుస్మృతియు శ్రుత్యనుగుణముగ నాలుగుఫలముల నిట్లు నిర్దేశించినది.

"యః స్వాధ్యాయ మధీతేఽబ్దం విధినా నియతః శుచిః।
తస్య నిత్యం క్షర త్యేష పయో దధి ఘృతం మధు॥" —2-107.

కాన శ్రుత్యనుగుణమైన స్వాధ్యాయాధ్యయనమే, అనగా చతుర్వేదాధ్యయనమే మనుస్మృతి తాత్పర్యము. స్వాధ్యాయాధ్యయన ఫలముల నిట్లే యాజ్ఞవల్క్యాది స్మృతులును వివరించినవి

కాని యిట్లు అథర్వవేదమును వేరుగా వేరిగణించినను, స్మృతులు కొన్ని యచటచట ఆథర్వణ మంత్రముల నధ్యయనము జేసినవారి యెడ ననాదర భావము జూపిన వనియు, నందుచే అథర్వవేదమునకు ఇతర వేదములతోపాటు సమానస్థానము గొన్ని స్మృతుల నంగీకరించుటలేదు - అనియు చరిత్రకారుల[1] యాక్షేప మొకటి గలదు. ఇది సరి కాదు.

ఈ చరిత్రకారులు చూపిన మనుస్మృతి, విష్ణుస్మృతి మొదలగు వాక్యములు కేవలము అభిచారిక కర్మతత్పరుడై ఇతరుల హింసించుటకై ప్రవృత్త

దగువాని నుద్దేశించినవి. వేదోక్తము లయిన యితర ధర్మములను, సత్యాహింసాది గుణములను విడిచి హింసామార్గమున జరించుచు నీ మంత్రములద్వారా లోకకంటకులయి పతితులయ్యెడి వారిని హెచ్చరించి ధర్మమార్గమున ప్రవర్తింప జేయుటకై యీ స్మృతివచనములు ప్రవృత్తము లయినవి. ఉదా:-

"ఉద్యతాసివిషాగ్నిం చ శాపోద్యతకరం తథా ।
ఆథర్వణేన హంతారం పిశునం చైవ రాజసు ॥"

— విష్ణు. స్మృ. ౬-191.

"అభిచారేషు సర్వేషు కర్తవ్యో ద్విశతో దమః ।
మూలకర్మణి చానాప్తైః కృత్యాసు వివిధాసు చ"

— మను. స్మృ. 9-290.

ఇట్టి స్మృతి వచనములు చాల గలవు. ఇవి యభిచారకర్మల నాచరించి, యితరుల మారణమునకై ప్రవృత్తు లగు వారిని క్షమింపక కఠినముగ దండింప వలయునని శాసించుచున్నవి ఇట్టి వాక్యము లథర్వవేదమునకు న్యూనత నాపాదించుటకై ప్రవృత్తము లని చెప్పుట యుక్తమా? కాదు. పైగా నీ స్మృతులే యాపద వచ్చినపుడు ముందు వెనుకలు జూడక ధర్మ రక్షణమునకై యాథర్వణ మంత్రములతో గార్యసిద్ధిని సాధింపవలెనని 'శ్రుతీ రథర్వాంగిరసీః కుర్యాది త్యవిచారయన్' (మను. 11-33) - అని ఈ రీతిగా ప్రబోధించుచున్నవి.

1. Bloom Field - The Atharvaveda and Gopatha Brahman.

వసిష్ఠుడు అథర్వనిధి యగుట, ఋష్యశృంగు డథర్వప్రోక్త మంత్రములతో దశరథునకు పుత్రకామేష్టి చేయించుట, దూర్వాసమహర్షి యుపదేశించిన యాథర్వణికసిద్ధ మంత్రములతో కుంతీదేవి సూర్యు నారాధించుటయు బూర్వము వివరింపబడినవి. అథర్వవిదులు గూడ నగుటచే నిట్టి మహర్షులు విశేషించి కీర్తింపబడి, పూజ్యస్థానము నలంకరించిరి గాని యనాదరము జేయబడినట్లు గన్పట్టదు. అందుచే చరిత్రకారుల కల్పన శ్రుతి స్మృతి సమ్మతము కాదు.

## 'ఇతి వేదా స్త్రయ స్త్రయీ' :-

పై ప్రమాణముల ననుసరించి త్రయీపదము ఋగాది మంత్ర త్రైవిధ్య ప్రతిపాదకమే గాని వేదత్రయ సంఖ్యా బోధకము గాదు; అనగా చతుర్థవేద నిషేధ పరము కాదు - అని దర్శించితిమి.

ఇట నొక యాక్షేపము. 1. ఇతి వేదా స్త్రయ స్త్రయీ - యను నమర సింహుని వాక్యము ననుసరించి త్రయీ పదము వేదత్రయరూప సంఖ్యా బోధకమై కన్పట్టుచున్నది. అట్టిచో త్రయీ పదము మంత్రత్రైవిధ్య ప్రతిపాదకముగా జెప్పుట యెట్లు? మఱియు అమరకోశమున అథర్వవేద ప్రసక్తి లేదు - అనెడి యాక్షేపము గూడ గలదు. వీనిని జూతము.

అమరసింహుడు మొదట-

'శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయ స్త్రయీ, ధర్మ స్తు తద్విధిః'

అని యనుచు శ్రుతి, వేద, ఆమ్నాయ, త్రయీ శబ్దములు నాలుగింటిని వేదసామాన్య వాచకములుగా బేర్కొనినాడు. పిదప—

'స్త్రియా మృక్సామ యజుషీ ఇతి వేదా స్త్రయ స్త్రయీ'

యని త్రయీశబ్దమును ఋగ్-యజుః-సామ రూప వేదత్రయ పరముగా జెప్పినాడు. కాన త్రయీపదము వేదసామాన్యమునకును, వేదత్రయమునకును గూడ వాచక మగుట యమరసింహాని యభిమతము. గురుబాల ప్రబోధిక యందును అమరసుధ1 యందును నమరసింహాని యభిప్రాయమిట్లే సోపపత్తికముగ వివరింప బడినది.

త్రయీశబ్దము ఋగ్యజుఃసామ వేదత్రయ వాచకమయినను, త్రయ్యను వాదరూప మగుటజేసి యథర్వవేదము గూడ గ్రహింపబడు నని మఱియొక వ్యాఖ్యాత వివరించినాడు.

'ఆథర్వణ స్తు త్రయ్యనువాద ఏవేతి స్వామీ' -అమరసుధాటిప్పణీ; హేమచంద్రాచార్యుడు ఆథర్వణము వేదత్రయోద్ధృత మనినాడు.

స్వాధ్యాయః శ్రుతిరామ్నాయః, అథర్వా తు త దుద్ధృతిః'

—అభిధానచింతామణి.

1. 'అత స్త్రయ్యంతాని చత్వారి వేదస్య నామాని। న చ 'వేదా స్త్రయ స్త్రయీ' ఇత్యనేన పౌనరుక్త్యమ్ శంక్యమ్। సామాన్య విశేష రూపేణోభయ సంభవాత్। బ్రాహ్మణ క్షత్రియ వైశ్యా ద్విజాః, విప్రోఽపి ద్విజ ఇతి యథా, న చ ధర్మ మస్త్రియా మిత్యనేన పౌనరుక్త్యమ్। తత్ర ధర్మ పర్యాయాణా మభిధానాత్। ఇహ తు ధర్మస్వరూపస్య ధర్మప్రమాణస్య చాభిధానాత్। య దపి - సమాసే గుణీభూతస్యాపి త్రయీశబ్దస్య బహు వివక్షావశా త్తచ్ఛబ్దేన పరామర్శః - ఇత్యుక్తమ్। తదపి న। తన్మతే త్రయీధర్మశబ్దస్య విధేయత్వా త్తదేకదేశస్య త్రయీశబ్దస్యానువాద్యత్వా సంభవాత్। వేదస్యైవ తచ్ఛబ్దేన పరామర్శసంభవాచ్చ। య దపి - యథా శబ్దానుశాసనం - ఇతి దృష్టాన్తదర్శనమ్। తద ప్యేతేన ప్రత్యుక్తమ్। వేదస్యైవ పరామర్శ సంభవాత్।'

—అమరసుధా.

కాని యాథర్వణము ఋగ్వేదుల కంటె విలక్షణమై యితరానపేక్షముగ నేకాగ్నిసాధ్య కృత్స్నకర్మలను ప్రతిపాదించు నని పైన వివరింపబడినది. ఇంతియే కాదు. ఇయ్యది శాంత - ఘోరరూపము.

"అనుపమ శమ దీప్తతా గరీయాన్ కృతపదపంక్తి
రథర్వణేవ వేదః"

అనుచు భారవి మున్నగు కవులు నాథర్వణ వేదమునం దితరవేదవిలక్షణము లైన శమ-దీప్తతాది పరస్పర విరుద్ధలక్షణము లున్నటుల వివరించిరి. (ఈ విషయము ముందు వివరింపబడును) అట్టిచో నీ యాథర్వణము త్రయ్యనువాదరూప మని చెప్పుట యెట్లు పొసగును? అందుచేతనే యాథర్వణము వేదత్రయోద్ధృత మనుటయు నెట్లు చెల్లును? కాన శ్రీసాయణాచార్యులు చెప్పినట్లు త్రయీపదము త్రయవయవ వాచక మగుచు మంత్రత్రైవిధ్య ప్రతిపాదక మనుటయే శాస్త్రసమ్మతము, యుక్తి సహము.

శ్రీ సాయణాచార్యులే కాదు శ్రీ శంకర భగవత్పాదులును ఋగాది పదములను మంత్రపరములుగ వ్యాఖ్యానించిరి.

(1) "అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్। ఋచో
యజూంషి సామాని" — ప్రశ్న ఉ. 2-6.

'ఋచో యజూంషి సామానీతి త్రివిధా మంత్రాః' -శం. భా.

(2) "తస్మాద్ ఋచః సామ యజూంషి" -ముండక. ఉ. 2-1-6.
'ఋచః....యజూంషి....సామాని....ఏవం త్రివిధా మంత్రాః'

కాన ఋగ్యజుఃసామ పదములు ప్రకరణము ననుసరించి మంత్రపరములుగ గ్రహించుట సంప్రదాయసిద్ధము.

కాని యమరకోశమున "స్త్రియా మృక్సామయజుషీ ఇతి వేదా స్త్రయ స్త్రయీ - అను వాక్యముచే త్రయీ యన మూడువేదము లని కంఠోక్తిగ జెప్ప బడి

నది, అందు నాల్గవ వేదప్రసక్తి కానరాదు: కాన నిట త్రయీ పదము చతుర్థవేద నిషేధపరము కాదా? —యన నట్లు కాదు. అమరకోశమునందే సంకీర్ణార్థవర్గ యందు-

"అపి సాహస్ర కారీష చార్మణాఽథర్వణాదికమ్"

అనుచు సమూహవాచక పదములలో "ఆథర్వ"పదము నుదహరించినాడు.

"అథర్వణాం మంత్రాణాం సమూహః ఆథర్వణమ్"- అథర్వ మంత్రముల సమూహము - అని యర్థము. వ్యాఖ్యాతలు నట్లే వివరించిరి. కాన అమర కోశమున అథర్వవేద ప్రసక్తి లేదనుట తగదు. అథర్వణవేద ప్రసక్తి యుండుటచే నిందలి త్రయీపదము చతుర్థవేద నిషేధవేరము కాదు. మఱియు "ఆథర్వణం' అని ప్రత్యేకముగా జెప్పుటచే అథర్వణ వేదమునకు గల యితరవేద వైలక్షణ్యమును సూచిత మగుచున్నది. కాన త్రయీశబ్దము వేదసామాన్యవాచకము, వేద త్రయవాచకము గూడ నగుట యమరసింహుని యభిమతముగా గ్రహింపనగును.

మఱియు త్రయీశబ్దము కేవలసంఖ్యావాచకము గాదు. మూడు అవయవములు గలది' యను నర్థమును బోధించునది. త్రయీశబ్దము యొక్క వ్యుత్పత్తిని బరిశీలించిన నీ విషయము స్పష్టము గాగలదు.

"త్రయో ఽవయనా యస్యాః సా సంహతిః త్రయీ-
త్రిశబ్దాత్ సంఖ్యాయా అవయవే తయప్ (5-?-42.

పా. సూ.) ద్విత్రిభ్యాం తయస్య (5-2-43) ఇత్యయచ్।
డిడ్ఢాణఞ్ (5-?-15) ఇతి ఙీప్।" -అమరసుధ.

ఇట త్రిశబ్దముకంటె అవయవార్థమున ప్రత్యయము వచ్చుటజేసి త్రయీ పదము కేవలసంఖ్యావాచకము కాదు.

# అథర్వవేదము - రెండు సంప్రదాయములు :-

"అముష్య విద్యా రసనాగ్ర నర్తకీ। త్రయీవ నీతాంగగుణేన
విస్తరమ్॥"

అను నైషధీయశ్లోకమును వ్యాఖ్యానించుచు మల్లినాథసూరి గూడ ఆథర్వణము పృథగ్వేద మను పక్ష మొకటియు; అది త్రయ్యంతర్భూత మను పక్ష మొకటియు నున్నట్లు జెప్పినాడు. ఋగ్యజుఃసామరూప మంత్రత్రైవిధ్యముచే నాథర్వణము త్రయీరూప మగుచున్నది. త్రయీరూపమయ్యును ఇతరవేద విలక్షణమై పృథగ్వేద మగు ననియు సూరి యభిప్రాయముగ గ్రహింపనగును.

హరదత్తాచార్యుడును, త్రయ్యా మాన్వీక్షక్యాం వా వా అభి వినీతః" అను గౌతమధర్మసూత్రము (2-2-3) నందలి త్రయీపదమును వివరించుచు, త్రిత్వ వివక్షజేసినపుడు ఋగ్యజుఃసామరూప మంత్రత్రయాత్మక మగుటచే నాథర్వణవేదము త్రయి యం దంతర్భూత మగు ననియు, అట్లు చేయని యపుడు ప్రవచనము ననుసరించియు, వైలక్షణ్యము ననుసరించియు నది పృథగ్వేదముగ గ్రహింపబడుచుండు ననియు రెండు సంప్రదాయములను జెప్పినది.

'ఋగ్యజుఃసామాత్మకా స్త్రయో వేదా స్త్రయీ। ఆథర్వణ శ్చ
వేద స్తే ష్వంతర్భవతి। తత్రాపి హి మంత్రా ఋచో
యజూంషి సామాని వా। భేదవ్యవహారస్తు ప్రవచన
నిమిత్తః। శాంతిక పౌష్టికాది ప్రమేయ నిబంధనో వా'-ఇతి.

రాజశేఖరుడు అథర్వణమును పృథగ్వేదముగ నిట్లు పరిగణనము చేసినాడు.

"ఋగ్యజుఃసామ వేదా స్త్రయీ। అథర్వ తురీయమ్ ।....
ఋచో యజూంషి సామాని చాథర్వాణి త ఇమే చత్వారో
వేదాః ॥" —కావ్యమీమాంసా. 2 అధ్యా.

కాని వ్యాఖ్యాతలు (మధుసూదనమిశ్రులు) ఋగ్యజుఃసామరూప మంత్ర త్రైవిధ్యము గల వేదము త్రయీ శబ్దముచే గ్రహింపబడు నని యిట్లు చెప్పిరి.

"త్రయీ గద్య పద్య గీత్యాత్మక రచనాశాలీ వేద త్రయీ
శబ్దేన వ్యవహ్రియత ఇతి భావః ....తథాచోక్తమ్-
"వినియోక్తవ్యరూప శ్చ త్రివిధః సంప్రదర్శ్యతే ।
ఋగ్యజుఃసామరూపేణ మంత్రో వేదచతుష్టయే॥" -ఇతి.

కనుక నీ వచనముల ననుసరించి నాలుగు వేదములను గూడ ఋగ్యజుః సామ (గద్య-పద్య-గీతి) రూపత్రైవిధ్యము గలవి యగుటజేసి త్రయీ యను వ్యవహారము వివక్ష ననుసరించి వేదచతుష్టయమునకును, ప్రతియొక వేదమునకును, తుదకు ప్రతియొక వేదశాఖకును గల దను సంప్రదాయము వ్యవస్థిత మగుచున్నది.

## త్రయీ - శ్రుతిసంప్రదాయము :-

అదియునుగాక యీ విషయమున శ్రుతిస్వభావము గూడ బరిశీలింపదగి యున్నది. ఋతువిభాగముల బేర్కొనుచు శతపథబ్రాహ్మణ మొకచోట ఆఱు ఇంకొకచోట అయిదు, మఱియొకచోట మూడు, వేఱొకచోట ఏడు-ఋతువుల నిట్లు పేర్కొనినది.

"షడ్వా ఋతవః సంవత్సరస్య" శ. బ్రా. 1-2-5-12.

"పంచ వా ఋతవః" —శ. బ్రా. 2-2-3-14.

"త్రయో వా ఋతవః సంవత్సరస్య"
—శ. బ్రా. 3-4-4-17; 11-5-4-11.

"సప్త హి ఋతవః" -శ బ్రా. 9-3-1-19; 9-5-2-8.

తాండ్యబ్రాహ్మణమునం దొకచోట ఆఱు, మఱియొకచోట అయిదు ఋతువు లిట్లు పేర్కొనబడినవి.

"ద్వౌ ద్వౌ హి మాసా స్మృతుః" -తా.బ్రా. 10-12-8.

ఋతువునకు రెండు మాసము లని యట చెప్పబడి ఆఱు ఋతువులు గ్రహింపబడినవి.

'పంచ హ్యృ తవః' -తాం. బ్రా. 12-4-8 : 13-2-6.

ఐతరేయబ్రాహ్మణము హేమంతశిశిరముల నొకటిగా గ్రహించి అయిదు ఋతువుల బేర్కొనినది.

"పంచర్తవో హేమశిశిరయోః సమాసేన' ఐ. బ్రా. 1-1.

కౌషీతకీబ్రాహ్మణము ఋతువునకు నూటయిరువది దినములు (నాలుగు మాసములు) జెప్పినది. అనగా మూడు ఋతువులనే గ్రహించినది.

"వింశతి శతం వా ఋతో రహాని' --కౌ. బ్రా 11-7.

తైత్తిరీయారణ్యకమున ఆఱు ఋతువులు చెప్పబడినవి.

"షట్పం పద్యంతే; షడ్వా ఋతవః। ఋతుభ్య ఏవ
యజ్ఞస్యశిరోఽవరుంధే" --తై. ఆ. 5-6.

ఇట నొకే శతపథశ్రుతియందును, తాండ్యబ్రాహ్మణమునను భిన్నభిన్నస్థలములలో ఋతుసంఖ్య భిన్నముగా నున్నది. ఇంకొక శ్రుతియందు మూడే చెప్పబడినవి, ఇంకొకదాని యందుఅయిదు గ్రహింపబడినవి. దీనినిబట్టి ఆ యా శ్రుతులు గాని శ్రుతులలో నా యాభాగములు గాని రచింపబడుసమయమున నట బేర్కొనబడిన సంఖ్య ననుసరించియే ఋతువులుండెడి వని గాని, ఆ యాభిన్నభిన్న ఋతుసంఖ్యలను బట్టి యానాటి రచయితలకుగల కాలవిజ్ఞాన విశేషమిది యని గాని చెప్పవలనుపడునా? ఇంకొకవిషయము.

ఛాందోగ్యశ్రుతియందు పంచభూతముల సృష్టి చెప్పబడలేదు. ఆ శ్రుతి పంచభూతములలో మూడవది యగు తేజస్సుతో సృష్టివర్ణనము నారంభించి 'తేజోఽబన్నముల (తేజః-అప్-అన్న) సృష్టి క్రమమునే వివరించినది.

"తత్తేజోఽసృజత .... తదపోఽసృజత .... తా అన్న మసృజంత"

— ఛాం. 6-2-3, 4.

తైత్తిరీయశ్రుతి సృష్టి వర్ణన మాకాశముతో నారంభించి పంచభూతాది సృష్టి క్రమమును వివరించినది.

"తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ"

తై. ఉ. 2.

కాని ఛాందోగ్యశ్రుతిరచనాకాలమున భూతత్రయోత్పత్తియే జరిగినది గాని ఆకాశవాయువులసృష్టి జరుగలేదనిగాని, లేక యానాటి రచయితలకు వానిని గూర్చిన పరిజ్ఞానము లేదని గాని చెప్ప నగునా ? ఇట్టియెడ పరస్పర విరుద్ధములుగ గన్పట్టు శ్రుతివాక్యముల ననున్వయపరచు సంప్రదాయము శ్రీ బాదరాయణుడు బ్రహ్మ సూత్రములందు వివరించియే యుండిరి. (చూ - అవిరోధాధ్యాయము వియదధికరణము మొ॥).

అట్లే త్రయీశబ్దమున గూడ సంప్రదాయమును గమనించుట యుక్తము వేదములు నాలుగైనను శ్రుతి కొన్నిచోట్ల ఏకత్వవివక్ష చేసి 'వాక్' అనియే వేద సామాన్యమును వ్యవహరించినది.

'వాచా విరూప నిత్యయా' — ఋ 8-75-6.

'దేవీం వాచ మజనయన్త దేవాః' — ఋ. 8-100-11.

'యద్ వాగ్వద న్త్యవిచేతనాని' ఋ. 8-100-12.

'వాచం ధేను ముపాసీత' — బృ. ఉ. 5-8-1.

'వా గితి త ద్రూపహ్మ'

—ఐ. బ్రా. 6-3; 2-15; శ. బ్రా. 2-1-4-10; జై. ఉ. 2-9-6;
గో. పూ-2-10, 11.

'వాగ్ దీక్షా' కౌషీ.బ్రా. 30-1.

శ్రుతులు కొన్నిచోట్ల వేదములను తిస్రో వాచః అనిపేర్కొనినవి.

"తిస్రో వాచ ఈరయతి" — ఋ. 9-97-34.

"తిస్రో వాచ ఉదీరత" — " 9-33-4.

తిస్రో వాచః ప్రవద — " 7-101-1.

'త్రేధా విహితా హి వాక్ ఋచో యజూంషి సామాని'

—శ. బ్రా. 6-5-34; 10-4-5-2.

కొన్ని యెడల నీవేదములు నాల్గు వాక్కులుగా జెప్పబడినవి.

'చత్వారి వాక్ పరిమితా పదాని' — ఋ. 1-164-45.
'చత్వారి శృంగా' — " 4-58-3.
'సాహి చ తసృభిః (గీర్భిః)వసో' — " 8- 0-6.
'చతస్ర ఈమ్ ఘృతదృహః — " 9-89-5.
'చతుష్కపర్దా యువతిః సుపేశా' — "10- 14-3.

చతుర్వేద ప్రసక్తి గల్గిన పై ఋక్కులలో మొదటి మూడును పూర్వము వివరింపబడినవి. నాల్గవ మంత్రమున నాల్గు వేదములు సోముని పేమిం

'వాచం ధేను ముపాసీత' — బృ. ఉ. 5-8-1.

'వా గితి త ద్రృహ్మ'

—ఐ. బ్రా. 6-3; 2-15; శ. బ్రా. 2-1-4-10; జై. ఉ. 2-9-6;
గో. పూ-2-10, 11.

'వాగ్ దీక్ష' కౌషీ.బ్రా. 30-1.

శ్రుతులు కొన్నిచోట్ల వేదములను తిస్రో వాచః అనిపేర్కొనినవి.

"తిస్రో వాచ ఈరయతి" — ఋ. 9-97-34.

"తిస్రో వాచ ఉదీరత" — " 9-33-4.

తిస్రో వాచః ప్రవద — " 7-101-1.

'త్రేధా విహితా హి వాక్ ఋచో యజూంషి సామాని'

—శ. బ్రా. 6-5-34; 10-4-5-2,

కొన్ని యెడల నీవేదములు నాల్గు వాక్కులుగా జెప్పబడినవి.

'చత్వారి వాక్ పరిమితా పదాని' — ఋ. 1-164-45.
'చత్వారి శృంగా' — " 4-58-3.
'పాహి చ తసృభిః (గీర్భిః)వసో' — " 8- 0-6.
'చతస్ర ఊమ్ ఘృతదృహః — " 9-89-5.
'చతుష్కపర్దా యువతిః సుపేశా' — "10- 14-3.

చతుర్వేద ప్రసక్తి గల్గిన పై ఋక్కులలో మొదటి మూడును పూర్వము వివరింపబడినవి. నాల్గవ మంత్రమున నాల్గు వేదములు సోముని సేవిం

"సంసారరోగస్య ఔషధం భేషజం। సంసారరోగ నిర్మోక్ష
కారిణీం పరాం విద్యా ముపదిదేశ గీతా స్వితి భిషక్" -- శం. భా.

పరమేశ్వరుడు సంసారరోగములను నివర్తింప జేయు దివ్యౌషధము. సంసారరోగము నుండి విముక్తిని ప్రసాదించు పరావిద్యను గీతల యందుపదేశించుటచే భిషక్ - అని యర్థము. నిఖిల విద్యావేత్త యగుటచే బరమేశ్వరుడు 'వైద్యః' అనియు సహస్రనామముల యందు గీర్తింపబడినాడు.

'భీషయతీతి భిషక్ - అథవా - బిభేత్యస్మా ద్రోగ ఇతి భిషక్'

.... వాచస్పత్యమ్.

'భీషాఽస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః' .... తై. ఉ.

పరమేశ్వరుని వలన భీతులై సూర్యాది దేవతలు స్వ స్వ కార్యముల యందు ప్రవర్తిల్లుచున్నారు - అనెడి శ్రుతుల ననుసరించి సూర్యాది దేవతా భయ కారణమగుటచే బరమేశ్వరునకు 'భిషక్' అని సార్థకనామము; లేక యెవని వలన భయపడి యాధివ్యాధులు తొలగిపోవునో లేక సంసార రోగము నివర్తించునో యట్టి పరమేశ్వరుడు భిషక్.

"యజ్ఞస్య హైవ భిషక్ య ద్బ్రహ్మా యజ్ఞాయైవ
త ద్భేషజం కృత్వా హరతి" ——ఐ. బ్రా. 5-9-34.

'యో బ్రహ్మాఽ స్తి ఏషయజ్ఞస్య భిషక్ చికిత్సకః। తస్మా
త్కారణాత్ యజ్ఞాయైవ భేషజం కృత్వా యజ్ఞస్యాంగ
వైకల్యరోగం శమయిత్వా దక్షిణాం హరతి' ——సా భా.

ఋత్విక్కులలో బ్రహ్మ యను ఋత్విక్కుకు భిషక్ అని పేరు. ఇతడు యజ్ఞమునకు సంభవించెడి యంగవైకల్య మనెడి వ్యాధిని చికిత్స చేసి

'వార్తా జీవికా తన్మూలః, త్రయ్యా చ వృష్ట్యాది హేతుతయా
త్రాయతే రక్షతే సర్వం త్రయీ వార్తాదిః' —నీలకంఠః.

వార్త యన జీవికకొఱకైన వృత్తి. లోకము దీనిపై నాధారపడి యుండును వార్తాదులు వృష్ట్యాదిహేతువులై లోకమును సర్వదా రక్షించుచుండును. కాన వానికి త్రయీయని పేరు. భూపాలకుడు వీనిని జక్కగా రక్షించుచో నివియు జక్కగా నుండి ప్రజల గాపాడును: లేనిచో లేదు-అని యర్థము.

కనుక (ఈ నిర్వచనము ననుసరించియు) రక్షకత్వధర్మము వేద సామాన్యము నందుండుటచే త్రయీశబ్దము వేదసామాన్యవాచకముగా నిట గ్రహింపబడినది.

## త్రయీ - పరాదేవత :-

వేదాదిశబ్దములు వేదవాచకము లగుచు పరమేశ్వర వాచకములు నయినట్లు త్రయీశబ్దము గూడ వేదవాచక మగుచు పరదేవతా వాచకముగ ప్రసిద్ధము.

'ఋగ్యజుః సామ భాగేన సాంగవేదగతాపి యా।(యతః)
త్రయీతి పఠ్యతే లోకే దృష్టా దృష్టార్థ సాధినీ'॥

—దేవీపురాణమ్(వాచస్పత్యమ్).

ఋగ్యజుః సామ మంత్రరూపమున సాంగవేదములను వ్యాపించి యధ్యయనము జేయబడుటచే పరాదేవియే త్రయీ యని చెప్పబడుచున్నది- అని యర్థము. మరియు 'సాంగవేదగతాఽపి' యను విశేషణమును బరిశీలించుచో

'త్రయీ' శబ్దము కేవలము వేదత్రయ వాచకమై చతుర్థవేదనిషేధ పరము కాదు; వేదములు నాలుగయ్యును, ఋగ్యజుః సామ మంత్రాత్మకము

అగుటచే 'త్రయీ రూపము' – అను నర్థ మిట సూచితము. ఇంతియే గాదు పరాదేవతగ వేదప్రతిపాద్యగా ప్రసిద్ధము; ఇట, త్రయీ రూపిణిగ వర్ణింప బడుట గూడ ('త్రయీతి పఠ్యతే లోకే') గమనార్హము. 'శివా శబ్దమయీ ప్రోక్తా'-ఇత్యాది పురాణవచనములు నీ విషయము నభివ్యక్తము చేయుచున్నవి. కనుకనే పరాదేవత యిట్లే యితరపురాణము లందును గీర్తింపబడినది.

"మహేశ్వరా వాన్యా పరాశక్తి ర్వేదసంజ్ఞా పురాతనీ।
ఋగ్యజుః సామ రూపేణ సర్గాదౌ సంప్రవర్తతే॥" —కూర్మ.పు.
"ఆన్వీక్షికీ త్రయీ దేవి దండనీతి శ్చ కథ్యసే" - పద్మ. పు.

"త్రయీ త్రివర్గనిలయా"- లలితాసహస్రనామ.

'ఓంకారము త్రయీవిద్యా ప్రతినిధిరూప' మని శ్రుతి నిర్దేశించుచున్నది.

"ఓ మితి ప్రతిపద్యత ఏతద్వై యజు స్త్రయీం విద్యాం
ప్రత్యేషా వా గేత త్పరమ మక్షరమ్" -తై ఆ. 2-11

పై ప్రమాణముల వలన త్రయీశబ్దము పరమేశ్వరునకును, లేక పరాదేవతకును, ఋగ్యజుస్సామ మంత్రాత్మక మగు వేదరాశికిని నామ మగుట తెలియవచ్చుచున్నది. కాన వేద, ఋషి, బ్రహ్మాది పూర్వోక్త వేదనామము లన్నిటి యట్లే యీ త్రయీ పదముగూడ పరమేశ్వరునకు వాచక మగుచు, వేద సామాన్యమునకును వాచక మగుచున్న దని గ్రహించుట యుక్తము.

## అథర్వవేదము - భిన్ననామములు - ఔచిత్యము :-

పైన జెప్పినట్లు అన్నివేదములు మంత్రత్రైవిధ్యము గలవి యగుచో వానికి భిన్నభిన్ననామము లుండుటకు గారణ మేమి ? యన వచ్చును. ఋగాది

చెడి నాలుగు గోవులు (వాక్కులు) గను, ఐదవ మంత్రము నందు వాగ్దేవికి చతుష్కపర్దములుగను వర్ణింపబడినవి. ఇట నొకే శ్రుతి (ఋగ్వేదము) భిన్న భిన్న స్థలముల యందు ప్రకరణానుసారముగ నేకత్వ వివక్ష చేసి వేదములను వాక్ అనియు, త్రిత్వవివక్ష చేసి 'తిస్రో వాచః' అనియు, చతుష్ట్వ వివక్ష చేసి 'చత్వారి వాక్ పరిమితా పదాని' ఇత్యాదిగా వ్యవహరించుట కాన నగును. అట్లే యమరసింహుడును త్రయీ పదమును మొదట ఏకత్వ వివక్షచేసి వేదసామాన్య పరముగను, పిమ్మట త్రిత్వ వివక్ష చేసి వేదత్రయ సమూహపరముగను జెప్పి నాడనుట స్పష్టము.

## త్రయీ శబ్దము - ముఖ్యార్థము :-

త్రయీ శబ్దము 1) త్రిత్వ సంఖ్యా వాచకముగను, అనగా 'మూడు వేదముల సమూహము' - అను నర్థము నందును 2) అవయవత్రయ సమూహ వాచకముగను, అనగా 'ఋగ్ - యజుః సామరూప మంత్రములు అవయవములుగా గల వేదము' - అను నర్థ మందును — ఇట్లు రెండర్థము లందును గూడ ప్రసిద్ధ మగుచో నిం దేది ముఖ్యార్థము ? ఇందొకటి ముఖ్యమగుచో రెండవది లక్ష్యార్థము గావలెను. కాన నీ విషయమున గూడ శ్రుతి సంప్రదాయమును జూతము. శ్రుతి యందు -

'త్రయీ వై విద్యా కావ్యం ఛందః' .... శ. బ్రా. 8-5-2-4.

'త్రయీ విద్యా యజ్ఞః' .... శ. బ్రా. 1-1-4-3.

ఇత్యాది ప్రయోగములు గలవు. ఇంతియే కాదు.

"తా హైతా స్త్రయ్య ఆపః - య న్మండూకః, అవకా వేతస
శాఖా, ఏతాభి రేవైన మేత త్రిసృభి రద్భిః శమయతి"

.... శ. బ్రా. 9-1-2-22.

"తా ఏతా త్రివిధా ఆపః ఖలు । తస్మాత్తై రవకర్షణే ఏతాభిః
త్రివిధాభి రపి అద్భిః ఏనం అగ్నిం శమితవాన్ భవతి" - సా. భా.

ఇచట 'త్రయాభిః అద్భిః' అని బహువచన ప్రయోగము గలదు. ఇట త్రయీ శబ్దమును సంఖ్యావాచకముగ గ్రహించి 'మూడు జలములు' అను నర్థము గ్రహించుట కవకాశము లేదు. త్రివిధములగు జలము లనియే యర్థము పొసగును. శ్రీ సాయణులును 'త్రివిధాః ఆపః' అనియే వ్యాఖ్యానించిరి. ఈ శ్రుతియే వేఱొకచోట 'త్రేధా విహితా హి వాక్ ఋచో యజూంషి సామాని' యని వాక్త్రైవిధ్యమును బ్రతిపాదించుట పైన బేర్కొనబడినది త్రిశబ్దముకంటె అవ యవార్థమున ప్రత్యయము వచ్చి త్రయీ శబ్దము నిష్పన్న మగుటయు బూర్వము వివరింపబడినది. కాన త్రయీ శబ్దమునకు 'మంత్ర త్రైవిధ్యము గలది' యను నదియే ముఖ్యార్థమని గ్రహింపనగును.

ఋగ్వేదము గూడ వేదరూపమగు వాక్కు త్రైవిధ్యముతో నొప్పుచు ప్రవృత్తమయినట్లు చెప్పుచున్నది.

'అసర్జి వాం స్థవిరా వేదసా గీ ర్బాళ్హే అశ్వినా త్రేధా క్షర న్తీ'

— ఋ 1-181-7.

'గీః స్తుతిరూపా వాక్ .... కీదృశీ । స్థవిరా అత్యంతం స్థిరా
నిత్యా వేదమయీ, త్రేధా మంత్రాదిభేదేన త్రిప్రకారా' ....సా. భా.

త్రయీ శబ్దమునకు ఋగ్యజుఃసామ మంత్రత్రైవిధ్యము గలది యను నర్థమే గాక 'రక్షించునది' (త్రాయతే రక్షతే ఇతి త్రయీ) యను నర్థము.కూడ సంప్రదాయానుగతమై కన్పట్టుచున్నది

"వార్తామూలో హ్యయం లోకః త్రయ్యా వై ధార్యతే సదా।
తాత్పర్యం వర్తతే సమ్యగ్యదా రక్షతి భూమిపః॥"

—భార. 12-68-53.

శమింప జేయును. కాన హోత, ఉద్గాత మున్నగు ఋత్విక్కులతోపాటు దక్షిణను గ్రహించును - అని యర్థము.

'అతఏవ సంప్రదాయనిద ఆహుః—

'అథర్వక్షేత్రవాన్ బ్రహ్మా వేదే ష్వన్యేషు భాగవాన్।
తస్మా ద్బ్రహ్మాణం బ్రహ్మిష్ఠ మితి హ్యైరణ్యకే శ్రుతమ్'

-సా. భా. -ఐ. బ్రా. 5-8-33.

కాన యజ్ఞమునందు బ్రహ్మ యను ఋత్విక్కు ఋగ్యజుఃసామ వేద విదుడే గాక ప్రధానముగ నథర్వవేదవిదుడు నయి యుండవలె నని తెలియుచున్నది. అట్టి బ్రహ్మయే భిషక్ కాగలడు. అట్టి యతడే యజ్ఞసమయమున నాధ్యాత్మికముగను, నాధిదైవికముగను, నాధిభౌతికముగను సంభవించెడి యుపద్రవముల నాథర్వణిక సిద్ధమంత్రములచే శమింపజేయగలడు. ఇట్లాతనికి దోడ్పడు వేద మగుటచే భైషజ్యవేద మని సార్థకనామము.

మఱియు 'అంగానాం హి రసోఽంగిరసః' — అంగరసము లగు సప్త ధాతువులకు సంబంధించిన చికిత్సను విశేషముగ బ్రతిపాదించునట్టి దగుటచేత నీ భైషజ్యవేదమే యంగిరోవేద మను సార్థకనామము నొంది నట్లును సంప్రదాయ విదులు జెప్పుదురు. అంగిరసు లనెడి మహర్షులచే దర్శింపబడుటచే 'అంగిరోవేదము' అని ప్రసిద్ధి వచ్చిన దనెడి విషయము ముందు వివరింపబడును.

## బ్రహ్మవేదము - క్షత్రవేదము :-

'క్షతాత్ త్రాయతే - ఇతి క్షత్రమ్' - ఆపదనుండి కాపాడునది యని యర్థము. రక్షః పిశాచ శత్రు సర్ప విష రోగా ద్యుపద్రవముల నుండి కాపాడుచు కార్యసిద్ధి గూర్చుసిద్ధమంత్రములచే నొప్పునది యని భావము. యజ్ఞాదికర్మలయం

రెట్టి యుపద్రవములు గల్గినను వారించు సామర్థ్య మాథర్వణిక మంత్రములకు గలదు. శ్రీమద్రామాయణమున వసిష్ఠుడు 'బ్రహ్మవేదవిదాం శ్రేష్ఠః క్షత్ర వేదవిదాం వరః' అని కీర్తింపబడినట్లు పూర్వము వివరింపబడినది. కనుక బ్రహ్మ లేక పురోహితుడు, లేక గురువు లేక వసిష్ఠుడునగువాడు బ్రాహ్మక్షాత్ర తేజములు రెండింటితో విలసిల్లుచుండ నగు నని శ్రుతి తాత్పర్యమై యున్నది కాని యిట నథర్వ వేదమునకు క్షత్రవేద మనియు, మిగిలిన మూడింటికిని. బ్రహ్మవేదము లనియు వ్యవహార మున్నట్లు పై రామాయణశ్లోకము ననుసరించి తెలియుచున్నది. బ్రహ్మకర్తవ్య ప్రతిపాదకమగుటచే నాథర్వణమునకు బ్రహ్మ వేదమను వ్యవహార ముపపన్న మైనట్లు పైన వివరింపబడినది. కాన ప్రకరణము ననుసరించి యీ వేదముల కిట్టి భిన్నభిన్న నామములతో వ్యవహార మేర్పడినట్లు గానననగును. ఇవి యన్నియు వ్యవహారనామములు లేకకర్మనామ ధేయములు; కాగా రూఢినామములు గావని తెలియుచున్నది. యజుర్వేదము ప్రధానముగ నధ్వర్యుకర్మ ప్రతిపాదక మగుటచే ఆధ్వర్యవకాండ, ఆట్లే ఋగ్వేదము హౌత్రకాండ, సామవేదము ఔద్గాత్రకాండ, యయినట్లు, ఆథర్వణము కూడ ప్రధానముగ బ్రహ్మకర్తవ్య ప్రతిపాదక మగుచు బ్రహ్మవేదము; క్షత త్రాణ ధర్మముచే క్షత్రవేదము నగుచు, బ్రహ్మతత్త్వ ప్రతిపాదక మగు నెడ మిగిలిన వేదములతోపాటు నిదియు బ్రహ్మవేద మగుచుండును.

## వసిష్ఠః - బ్రహ్మ :-

ఇట నొక విషయము గమనింప దగును. త్రేతాగ్నిసాధ్య యజ్ఞకర్మ నిర్వాహకుడగు ఋత్విజునకు బ్రహ్మ యను నామము ప్రసిద్ధ మయినట్లే ఏకాగ్ని సాధ్య వివాహోపనయనాది సంస్కారముల నిర్వహించు పురోహితునకు గూడ

బ్రహ్మ, వసిష్ఠ – ఇత్యాది నామములు అనాది సిద్ధములు. వసిష్ఠుడు పురోహితుడయి పెక్కురాజుల యజ్ఞాదికార్యముల నిర్వహించినట్లు శ్రుతులయందు గలదు.

"ఉక్థభృతం సామభృతం బిభర్తి గ్రావాణం బిభ్ర
త్ప్రవదా త్యగ్రే। ఉపైన మాధ్వం సుమనస్యమానా
ఆ వో గచ్ఛాతి ప్రతృదో వసిష్ఠః ॥" —ఋ. 7-33-14.

ఇట వసిష్ఠుడు బ్రహ్మస్థానీయు డగుచు (1) హోతను (ఉక్థభృతం శస్త్రాణాం సంభర్తారం), (2) ఉద్గాతను (సామభృతం), (3) అధ్వర్యుని (గ్రావాణం బిభ్రత్ అభిషవణం బిభ్రతం అధ్వర్యుం), – ఇట్లీ మువ్వురిని భరించుచు యజ్ఞమున భ్రేషాది (ప్రాయశ్చిత్తాది) నిమిత్తమైన కర్తవ్యము నుపదేశింపగలవాడు. అట్టి బ్రహ్మలేక పురోహితుడైన వసిష్ఠుని ఆరాధింపుడు (ఏనం ఉప ఆధ్వం) – అని యింద్రుడు తృత్సులను (రాజులను) ప్రబోధించుట మంత్రార్థము.

ఇట మువ్వురు ఋత్విజులను – యజ్ఞమును వసిష్ఠుడు భరించుచున్నట్లు బ్రహ్మ కర్తవ్యమును శ్రుతి తెల్పుచున్నది. భరించువాడగుటచే వసిష్ఠుడు ఇట బ్రహ్మ యగుట 'బిభర్తి' అను నిర్వచనము ద్వారా వివరించుచున్నది. ఇంకొక మంత్రమును జూతము.

"దండా ఇవేద్గో అజనాస ఆసన్ పరిచ్ఛిన్నా భరతా అర్భకాసః।
అభవచ్చ పుర ఏతా వసిష్ఠ ఆదిత్తృత్సూనాం విశో అప్రథన్త॥"
—— ఋ. 7-33-6.

ఈ మంత్రమున గూడ భరతులకు వసిష్ఠుడు పురోహితుడు (పుర ఏతా) అయినట్లును, వారు తమ శత్రువులచే బరాభూతు లయి యెంత దుఃస్థలు లయినను ఆ వసిష్ఠమహర్షియొక్క పౌరోహిత్యసామర్థ్యము వలన ప్రజల వర్ధిల్ల జేసిరి –అని చెప్పబడినది.

మఱియు జలోదరవ్యాధిపీడితు డయి హరిశ్చంద్రు డను రాజు సంకల్పించిన యజ్ఞమునందు విశ్వామిత్రాది మహర్షులు నలుగురు ఋత్విజులు; అందు వసిష్ఠుడు బ్రహ్మస్థాన మలంకరించినట్లు ఐతరేయబ్రాహ్మణ[1] మున గలదు. ఇంతే కాదు.

"తతో వసిష్ఠపురోహితాః ప్రజాః ప్రాజాయన్త
తస్మా ద్వాసిష్ఠో బ్రహ్మా కార్యః ప్రైవ జాయతే"

—తై. సం. 3-5-2-1.

ఇంద్రుడు వసిష్ఠునకు 'స్తోమభాగాః' అనెడి బ్రహ్మత్వోపయుక్త మంత్రజాతము నుపదేశించెను. అట్లు ఇంద్రుడు మంత్రజాతమును వసిష్ఠున కనుగ్రహించుటచే ప్రజ లందఱు వసిష్ఠుడే పురోహితుడుగా గల్గి యుద్భవించుచుందురు. ఆ కారణముచేతనే సోమయాగమును సంకల్పించువారు వసిష్ఠుని (లేక ఆ సంప్రదాయము నెఱిగిన వానిని గాని) బ్రహ్మగా వరింపవలెను. అట్లు చేసినచో యజమానుడట్టి సత్సంతానమును గాంచ గలడు - అని యర్థము. కొలది మార్పులతో నీ శ్రుతివాక్యము తాండ్యబ్రాహ్మణము నందును గలదు.

"తతో వై వసిష్ఠపురోహితాః భరతాః ప్రాజాయన్త"
—తాం బ్రా. 15-5-24.

జైమినిమహర్షియు - 'వాసిష్ఠానాం వా బ్రహ్మత్వస్య నియమాత్; సర్వేషాం వా ప్రతిప్రసవాత్ (6-6-24, 25)' -అను సూత్రముల ద్వారా వాసిష్ఠులు గాని 'స్తోమభాగల నధ్యయనము జేసి తత్సంప్రదాయము నెఱిగినవారు గాని బ్రహ్మత్వమునకర్హు లని వివరించినాడు. బృహద్దేవతయు నీ విషయము నిట్లు చెప్పుచున్నది.

1. "తస్య హ విశ్వామిత్రో హోతాసీ జ్జమదగ్ని రధ్వర్యు ర్వసిష్ఠో బ్రహ్మా ఉయాస్య ఉద్గాతా...." —ఐ.బ్రా. 7-4-16.

"వశిష్ఠాశ్చ వశిష్ఠా శ్చ బ్రాహ్మణా బ్రహ్మకర్మణి।
సర్వకర్మసు యజ్ఞేషు దక్షిణీయతమా స్తథా॥"

తస్మా ద్వే ఒద్యాపి వాసిష్ఠాః సదస్యాః స్యు స్తు కర్హిచిత్।
అర్హయే ద్దక్షిణాభి స్తాన్ భాల్లవేయాశ్రుతి స్త్వియమ్॥
-బృ. దే. 5-158, 159.

## వసిష్ఠుడు అథర్వుడు :-

వసిష్ఠుడే అథర్వు డని కిరాతార్జునీయకావ్యమున మల్లినాథవ్యాఖ్య వలన దెలియుచున్నది.

"యమ నియమ కృశీకృత స్థిరాంగః
పరిదదృశే విధృతాయుధః స తాభిః।
అనుపమ శమ దీ ప్తతా గరీయాన్
కృతపదపం క్తి రథర్వణేవ వేదః॥" -10-10.

అభ్యుదయకాండచే శాంతరూపము, అభిచారకాండచే నుగ్రరూపము నయి నియతానుపూర్వి గల్గిన వేదమును అథర్వణుడు దర్శించినట్లు, యమనియమాదులచే కృశించియు స్థిరాంగుడై (నిశ్చలుడై) బ్రాహ్మతేజముతోను, శస్త్రధారియై క్షాత్ర తేజముతోను వెలుగొందుచున్న యర్జునుని స్త్రీలు గాంచిరి- యని యర్థము.

ఇట మల్లినాథుడు - 'అథర్వణా వసిష్ఠేన, కృతా రచితా పదానాం పం క్తి రానుపూర్వీ యస్య స వేదః। చతుర్థ వేద ఇత్యర్థః। ఆథర్వణ స్తు మంత్రో వసిష్ఠకృత ఇత్యాగమః' - అని వ్యాఖ్యానించినాడు.

అథర్వమంత్రములు వసిష్ఠకృతములని యీ వ్యాఖ్య వలన దెలియు చున్నది. ఈ విషయ మింకను బరిశీలింప వలసి యున్నది. కాని యథర్వాంగి

రసులచే దర్శింపబడుటచే దీనికి అథర్వవేదము, అథర్వాంగిరో వేదము - ఇత్యాది నామములు ప్రసిద్ధము లయినట్లు శ్రుతి, స్మృతి, పురాణాదుల వలన దెలియుచున్నది.

వసిష్ఠుడే అథర్వణుడగుచో 'వసిష్ఠకృతము' అను మల్లినాథవాక్యమునకు వసిష్ఠునిచే దర్శింపబడిన దని యర్థమును గ్రహింపనగును. మంత్రకృత్ ఇత్యాది పదముల కట్టే యర్థము గ్రహింపదగునని పూర్వము వివరింపబడినది (చూ. ఋషి శబ్దము). ఇట్లు గ్రహించిననే శ్రుత్యాదులతో నవిరోధము సిద్ధించును. ఏలయన నథర్వవేదమే కాదు, వసిష్ఠుడు నిఖిలవేదరాశితోపాటు మిత్రావరుణులకు మానస పుత్రుడుగ నావిర్భవించినట్లు ఋగ్వేద మిట్లు చెప్పుచున్నది.

"ఉతాసి మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్ మనసో
ఽధిజాతః। ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన విశ్వే
దేవాః పుష్కరే త్వాదదన్త ॥" —ఋ. 7-33-11.

"హే బ్రహ్మన్ । వసిష్ఠ ఏవం జాతం త్వా త్వాం, దైవ్యేన
దేవసంబంధినా: బ్రహ్మణా వేదరాశినా అహంభువా,
యుక్తం, పుష్కరే విశ్వేదేవాః అదదన్త అధారయన్త -సా. భా.

దివ్యము, స్వాయంభువము నగు వేదరాశితోపాటు వసిష్ఠు డవతరించుట యీ ఋక్కు చెప్పుచున్నది. మఱియు నిట వసిష్ఠుడు బ్రహ్మన్। అని సంబోధింప బడుట గమనార్హము. బ్రహ్మజ్ఞాన సంపన్నుడై లేక సర్వవేదమయుడై యవత రించుట జేసి వసిష్ఠుడు బ్రహ్మయని సంబోధింప బడినాడు. వేదమయు డయిన యీ మహర్షి ప్రాణాత్మ స్వరూపు డగుటచే వసిష్ఠు డని సార్థకనామ మొందినట్లు ఐతరేయారణ్యక మిట్లు చెప్పుచున్నది.

"ఏత ద్ద స్మ వై త ద్విద్వాన్ వసిష్ఠో బభూవ।
అత ఏత న్నామధేయం లేభే" —ఐ. ఆ. 2-12.

"అతిశయేన నివాసహేతుత్వం ఆచ్ఛాదయితృత్వం వా వసిష్ఠత్వమ్। ప్రాణో హి స్వప్రవేశేన నివాసహేతు ర్భవతి। స్వవ్యాప్త్యా సర్వ మాచ్ఛాదయతి। తాదృశ ప్రాణాత్మత్వం ధ్యానేన ప్రాప్తవా న్మని రపి అర్థద్వయవత్త్వేన వసిష్ట నామకత్వం లబ్ధవాన్" —సా. భా.

శరీరమున బ్రవేశించి నివాసహేతు వగుటయు అంతట వ్యాపించి యాచ్ఛాదించుటయు ప్రాణధర్మము. దానికే వసిషత్వ మని పేరు. ప్రాణాత్మ ధ్యానముచే నీ మహర్షియు నా రెండు ధర్మములు గల్గి, వసిష్ఠుడని సార్థకనాము డయ్యెను - అనగా నిరంతర ప్రాణాత్మ ధ్యానపరవశుడై తదభేద భావనతో నొప్పి ప్రాణాత్మగత వసిష్ఠత్వ ధర్మముతో విలసిల్లి యా మహర్షి వసిష్టశబ్దవాచ్యు డయ్యె నని యర్థము.

కాగా వసిష్ఠడను నామము మొదట ప్రజాపతి యగు హిరణ్యగర్భునకు (ప్రాణాత్మ లేక సూత్రాత్మకు), తరువాత తదనుగ్రహపాత్రుడై తద్ధర్మములతో నొప్పెడి మహర్షికిని బ్రసిద్ధమైనదని తెలియును. ప్రాణాత్మ లేక ప్రజాపతి వసిష్ఠడగుట శ్రుతి ప్రసిద్ధమే.

1. 'ప్రజాపతి ర్వై వసిష్ఠః' కౌషీ. బ్రా. 25-2; 26-15.
2. (వా. సం. 13-54) 'ప్రాణో వై వసిష్ఠ ఋషిః' .... శ. బ్రా. 8-1-1-6.
3. ఏష (ప్రజాపతిః) వై వసిష్ఠః (సర్వ శ్రేష్ఠః - సా భా.) .... శ. బ్రా. 2-1-4-2.
4. య ద్వై ను శ్రేష్ఠ స్తేన వసిష్ఠో ఽథో య ద్వ స్తృతమో వసతి తేనో ఽఏవ వసిష్ఠః .... శ. బ్రా. 8-1-1-6.
5. సా హ వా గువాచ — (హే ప్రాణ) యద్వా ఽఅహం వసిష్ఠాస్మి త్వం తద్వసిష్ఠోఽసీతి' .... శ. బ్రా. 14-9-2-14.

పై నిర్వచనముల జూచుచో శ్రుతుల యందు ప్రాణాత్మ యగు ప్రజాపతికి గల వసిష్ఠుడనెడి ప్రసిద్ధి దెలియును- మఱియు ప్రజాపతియే వసిష్ఠుడనియు తద్గతమైన వాక్కు వసిష్ఠా యనియు పై శ్రుతుల వలన దెలియుచున్నది. వేదరాశితో పాటు వసిష్ఠు డుద్భవించుట (ఋ. 7-33-11) పూర్వము దెల్ప బడినది. ప్రజాపతికి స్వభూతమైన వాక్కు (వేదవాక్కు)నకు స్వాహా, యని ప్రసిద్ధి యున్నట్లును పూర్వము వివరింపబడినది. అట్టి స్వాహాపతి లేక వాక్పతి యగు నగ్నియు వసిష్ఠు డని ఋగ్వేదము చెప్పుచున్నది.

"అదబ్ధ వ్రత ప్రమతి ర్వసిష్ఠః సహస్రంభరః శుచిజిహ్వో అగ్నిః।" —ఋ. 2-9-1,ఐ. బ్రా. 1_28.

ఈ మంత్రమును ఐతరేయబ్రాహ్మణ మిట్లు వివరించినది.

"అదబ్ధవ్రత ప్రమతి ర్వసిష్ఠ ఇ త్యగ్నిర్వై దేవానాం వసిష్ఠః"

సర్వవిధాయకుడు, సర్వనివాసహేతుభూతుడు (సర్వస్యవాసయితృతమః) నగుటచే అగ్ని యిట వసిష్ఠుడుగ స్తుతింపబడుచున్నాడు. యజ్ఞము నందు స్తుతింపబడెడి యిట్టి లక్షణములు గల యగ్ని సర్వదేవాత్మకుడగు ప్రజాపతియే యగును. అగ్ని వసిష్ఠు డని ఋగ్వేదమున నింకను పెక్కు మంత్రములందు (7-1-8; 7-9-1; 7-9-6 మొ॥) కీర్తింపబడినాడు. ఈ యగ్నియే యజ్ఞదేవుడు, పురోహితుడు, ఋత్విజుడు, ఫలప్రదాతయు నని ఋగ్వేదము మొదటి మంత్రమున (అగ్ని మీడే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్) స్తుతింపబడినాడు. ఈ మంత్రము నందలి పురోహితపదముచే నగ్నికి గల వసిష్ఠత్వము సూచితమగుచున్నది. కాన వసిష్ఠు డను నామము మొదట ప్రజాపతి (ప్రాణాత్మ) యందును, పిదప తద్గత భూయోధర్మములతో నొప్పు మహర్షి యందును రూఢమయినట్లు దెలియుచున్నది.

ఈ వసిష్ఠుడు కారణాత్మ యగు పరమేశ్వరునిచే ప్రవర్తితమగు సంసార పరిధిని (వస్త్రమును) విస్తరింపజేయుటకు (ప్రవర్తింప జేయుటకు) మహామహిమ సంపన్నుడై లౌకికాలౌకిక ప్రజ్ఞానముతో నొప్పి యావిర్భూతుడయినట్లు ఋగ్వేదము చెప్పుచున్నది.

"స ప్రకేత ఉభయస్య ప్ర విద్వాన్ సహస్రదాన ఉత వా
సదా నః । యమేన తతం పరిధిం వయిష్యన్ అప్సరసః
పరిజజ్ఞే వసిష్ఠః ॥ — ఋ. 7-33-12.

"ప్రకేతః ప్రకృష్టజ్ఞానః, ఉభయస్య ఉభయం దివం చ
పృధివీం చ ప్రవిద్వాన్ ప్రకర్షేణ జానన్ .... యమేన
కారణాత్మనా సర్వనియంత్రా తతం విస్తృతం పరిధిం
వస్త్రం, పరిధి రిత్యనేన సంసారప్రవాహో వివక్షితః. తం
వయిష్యన్ .... జాతః —సా. భా.

మహాభారతము గూడ శ్రుత్యనుగుణముగ వశిష్ఠశబ్దము నిట్లు నిర్వచించినది.

1 "వసిష్ఠో ఽస్మి వరిష్ఠోఽస్మి వసే వాసగృహే ష్వపి।
వసిష్ఠత్వా చ్చ వాసా చ్చ వసిష్ఠ ఇతి విద్ధి మామ్॥"
—భార. 13-93-68.

---

1. సిష్ఠః -వాయు శ్చ పృథివీ చ వాయు శ్చాంతరిక్షం చ ద్యౌశ్చాదిత్య శ్చంద్రమా శ్చ నక్షత్రాణి చేతి వసవ, ఏతేషు హీదం సర్వం వసు హిత మేతే హీదం సర్వం వాసయంత ఇతి శ్రుతి ప్రసిద్ధా వసవ స్తే యస్య స్వాధీనా భవంతి స వసుమాన్, ప్రాప్తాణిమా ద్యైశ్వర్యో మహాయోగీ, అతిశయేన

శ్రుతిప్రసిద్ధము లగు పృథివ్యంతరిక్షాదులకు వసువులు (వసవః) అనిపేరు. ఇవి యెవని యధీనమున నుండునో యతడు వసుమంతుడు (వసుమాన్). అట్టివారిని అతిశయించినవాడు (అతిశయేన వసుమాన్) అగుటచే వసిష్ఠుడు. మఱియు నతిశయించి సర్వమును వ్యాపించినవాడు (అతియేన ఉరుః) గాన వసిష్ఠుడు. సర్వము నెవని యధీనమున నుండునో, అన్యాధీనమున నెవ డుండడో యతడు వసిష్ఠ డని పై రెండు నిర్వచనముల భావము వాసగృహము లనగా వాసయోగ్యములు.

నితరాశ్రమముల కాధారభూతములగు గృహస్థాశ్రమము. అని యర్థము. అందు వసించుటచేతను, అట్లు వసించువారిలో నతిశ్రేష్ఠ డగుటచేతను గూడ వసిష్ఠుడు_ అని యర్థము.

పై నిర్వచనముల బరిశీలించుచో వసిష్ఠుడు శ్రుతిప్రతిపాదిత మహా మహిమసంపన్నుడై, ప్రజాపతి యగు బ్రహ్మకు గల వసిష్ఠత్వాది ధర్మములతో నొప్పి యుండుట దెలియును. ఇట్టి వసిష్ఠత్వధర్మముతో నొప్పెడి ఋత్విజుడే బ్రహ్మయై యజ్ఞకర్మనిర్వహణము జేయ నగు నని శ్రుతి స్మృతి తాత్పర్యము. బ్రహ్మ యగు ఋత్విక్కు_ లక్షణము ను ఐతరేయారణ్యకశ్రుతి యిట్లు వివరించుచున్నది.

వసుమా నితి వసిష్ఠః....అతిశయేన ఉరు రస్మి....సర్వం మ ద్వశే ఽస్తి, అహం తు న కస్యాపి వశే ఽస్మీతి నామద్వయార్థః। వాసగృహేషువాస యోగ్యేషుగృహస్థాశ్రమేషు సర్వేషా ముపజీవ్యేషు వసే వసామి। అతో ఽహం వస్తౄణాం మధ్యే అతిశ్రేష్ఠఇతి వసిష్ఠో ఽస్మి।.... సర్వేషా మాశ్రియ భూతత్వా న్మమ మాం దేవా ఏకం తీతిభావః। ....నీలకంఠః.

"వేదపురుష ఇతి య మవోచామ। యేన వేదాన్ వేద
ఋగ్వేదం యజుర్వేదం సామవేదం తస్యైతస్య బ్రహ్మ
రస ఇతి। తస్మాద్ బ్రహ్మిష్టం కుర్వీత యో
యజ్ఞ స్యోల్బణం పశ్యేత్ ఇతి —ఐ. ఆ. 3-2-3-9.

'యస్మా ద్వేదత్రయాభిజ్ఞానరూపస్య వేదపురుషస్య హిరణ్య
గర్భోపాసకో బ్రహ్మా రసః, తస్మా, ద్బ్రహ్మా నామ
సామ్యాత్ యాగేఽపి బ్రహ్మాణం ఋత్విజం బ్రహ్మిష్ఠం
అతిశయేన వేదత్రయగతం కుర్వీత। బ్రహ్మా యజ్ఞసంబం
ధినం, ఉల్బణం తీవ్రగుణం దోషం వా ద్రష్టుం సమర్థ
స్తాదృశం కుర్వీత' —సా. భా.

ఋగాది వేదములచే జేయబడెడి హౌత్ర, ఆధ్వర్యవ, ఔద్గాత్రములను మనస్సుతో ననుసంధానించి సంస్కరించు వేదపురుషుడు హిరణ్యగర్భుడు. అట్టి వేదపురుషుని లేక హిరణ్యగర్భుని ఉపాసించుచు తత్తాదాత్మ్యాభిమానముతో జరించు బ్రహ్మ యను ఋత్విక్కు వేదపురుషునకు సారభూతుడు (రసః): అనగా తత్తేజో విలసితుడు. 'బ్రహ్మ' యను నామసామ్యముచే వేదత్రయాభిజ్ఞుడై యజ్ఞము నందలి గుణదోషములను దర్శింపజాలిన బ్రహ్మిష్ఠునే యజ్ఞమున బ్రహ్మపదము నధిష్ఠింపజేయవలెను - అని యర్థము. అనగా హిరణ్యగర్భోపాసకుడై తద్దేవ తానుగ్రహము నొందిన వేదపురుషుడే బ్రహ్మ కావగు నని భావము. ఇతడు యజ్ఞము నందు సంభవించెడి దోషములను, లేక యుపద్రవములను గమనించి శమింప జేయగలవాడై యుండవలె ననియు శ్రుతి తెల్పుచున్నది. అందుచే బ్రహ్మ యథర్వ వేదవిదుడయి యుండవలె ననియు సూచితమగుచున్నది. ఈ శ్రుతి తాత్పర్యమును సంప్రదాయవిదులు ఇట్లు వివరించిరి.

'అతఏవ సంప్రదాయవిద ఆహుః -
అథర్వక్షేత్రవాన్ బ్రహ్మ వేదే ష్వన్యేషు భాగవాన్। తస్మా
ద్బ్రాహ్మణం బ్రహ్మత్వ మితి హ్యైరణ్యకే శ్రుతమ్॥' .... ఇతి.

.... సా. భా. – ఐ. బ్రా. 5-8- 5.

వసిష్ఠు డట్టి వాడగుట శ్రుతిస్మృత్యనుగుణముగ పూర్వము వివరింప బడినది. ఇంతియే కాదు. యజ్ఞము నందలి బ్రహ్మను (ఋత్విజుని) గూర్చి తైత్తిరీయ బ్రాహ్మణమిట్లు చెప్పుచున్నది.

"యో వై బ్రహ్మణే దేవేభ్యః ప్రజాపతయేఽప్రతి
ప్రోచ్యాశ్వం మేధ్యం బధ్నాతి ఆదేవతాభ్యో వృశ్చ్యతే।
పాపీయాన్ భవతి। యః ప్రతిప్రోచ్య న దేవతాభ్య
ఆవృశ్చ్యతే। వసీయాన్ భవతి। ఇతి

య దాహ। బ్రహ్మ న్నశ్వం మేధ్యం భన్త్స్యామి దేవేభ్యః
ప్రజాపతయే తేన రాధ్యాస మితి। బ్రహ్మ వై బ్రహ్మ।
బ్రహ్మణ ఏవ దేవేభ్యః ప్రజాపతియే ప్రతిప్రోచ్యాశ్వం
మేధ్యం బధ్నాతి, న దేవతాభ్య ఆవృశ్చ్యతే। వసీయాన్
భవతి, ఇతి. -తై బ్రా. 3-8-3-1.

బ్రహ్మ యగు ఋత్విజునకు నివేదింపక దేవతా - ప్రజాపతి భాగరూపము, యాగయోగ్యము నయిన యశ్వమును బంధించువాడు దేవతానుగ్రహదూరుడై మిక్కిలి పాపియగును; అట్లుగాక బ్రహ్మయొక్క యనుజ్ఞ గొని యశ్వబంధనము సేయువాడు దేవతానుగ్రహపాత్రుడై యైశ్వర్యవంతుడగును; ఏలయన బ్రహ్మపదము నధిష్ఠించెడి బ్రహ్మయను ఋత్వికు్క సాక్షాత్పరబ్రహ్మయే పరబ్రహ్మకు నివేదించుట యనగా పరబ్రహ్మకు నివేదించుటయేయగును; బ్రహ్మ

స్వరూపుడగు నట్టి బ్రహ్మ(ఋత్విక్కు)యొక్క యనుమతియు, ననుగ్రహమును బొందిన యాగమే సఫలమై యైశ్వర్యప్రద మగును-అని యర్థము.

ఈ తైత్తిరీయశ్రుతి బ్రహ్మస్థానము నధిష్ఠించిన వేదమూర్తియగు ఋత్విజుని పరబ్రహ్మస్వరూపునిగ దర్శింపవలెనని యుపదేశించుచున్నది. 'బ్రహ్మాఽయం వాచః పరమం వ్యోమ' (ఋ. 1-164-35; వా.సం 23-62) అను శ్రుతియు వేదాత్మకయగు వాక్కునకు పరమస్థానము బ్రహ్మ యని కీర్తించుచున్నది బ్రహ్మయగు ఋత్విక్కు కూడ పరబ్రహ్మస్వరూపు డగుటచే వేదవాక్కునకు స్థానము లేక యాశ్రయ మగు నవియు నర్థము. (చూ. ఉవట మహీధరభాష్య).

వసిష్ఠు డట్టివాడు. ఆ మహర్షి త్రయీవిదుడు, నథర్వవిదుడు గూడ నగుచు సకల వేదరాశితో జన్మించి బ్రహ్మయై యజ్ఞకర్మల ప్రవర్తింపజేసియు, తన పౌరోహిత్య సామర్థ్యముచే రాజులకును, సర్వప్రజలకును ఐహికాముష్మిక ఫలముల నందజేయుచు, సర్వసుఖ నివాస హేతుభూతుడై (వాసయితృతమః, పుర ఏతా) తన వసిష్ఠ నామమును సార్థకము గావించుకొనిన బ్రహ్మిష్ఠుడు. శ్రుతి సిద్ధమైన యిట్టి సంప్రదాయమున జరించునట్టివారును నేడు కూడ బ్రహ్మ, వసిష్ఠః, పురోహితః గురుః బృహస్పతిః - ఇత్యాద్యన్వర్థ నామములతో బరగుచు వైదికకర్మ (బ్రహ్మకర్మ) నిర్వాహకులగుచున్నారు.

ఇట్టి బ్రహ్మ కర్తవ్య ప్రతిపాదక మగుటచే నథర్వవేదమునకు బ్రహ్మ వేద మని యన్వర్థనామము ప్రసిద్ధ మైనట్లు తెలియగలము.

## అథర్వవేదము - అథర్వాంగిరసః - భృగ్వంగిరసః :-

అథర్వపదమును యాస్కమహర్షి యిట్లు నిర్వచించినాడు.

"అథర్వాణో ఽథనవన్త స్థర్వతి శ్చరతి కర్మా తత్ప్రతిషేధః"

—నిరు. 11-18.

"న థర్వ స్తీ త్యథర్వాణః స్థిరప్రకృతయో హి తే"—దుర్గా-భాష్య.

పై నిర్వచనము ననుసరించి అథర్వుడన నిశ్చలుడు, లేక స్థిరప్రకృతి గలవాడని యర్థము. యథర్వపదమునకు ప్రాణాత్మ, లేక ప్రజాపతి (బ్రహ్మ) యను నర్థములు వేదమున బ్రసిద్ధము.

"(వా. సం.[1] 11–32) ప్రాణోవా ఽథర్వా" శ. బ్రా. 6-4-2-1.

"ప్రాణో ఽథర్వా" —శ. బ్రా. 6-4-2-2.

ఇట ప్రాణాత్మ యగు ప్రజాపతి యథర్వు డని కీర్తింపబడినాడు. ఈ ప్రజాపతియే మొదట నగ్నిని మథించిన ట్లీ శ్రుతి చెప్పుచున్నది. కనుక వసిష్ఠ శబ్దము వలెనే అథర్వశబ్దము కూడ ప్రజాపతికి వాచకము. ఇట్లు వసిష్ఠ – అథర్వ శబ్దములు రెండును వేఱ్వేఱు ప్రవృత్తి నిమిత్తముల ననుసరించి ప్రజాపతికి వాచకము లగుచున్నవి. కాన వసిష్ఠు డథర్వుడే యగుచున్నాడు.

బ్రహ్మ యను ఋత్విక్కు పరబ్రహ్మస్వరూపు డగుట పైన వివరింపబడినది. నిశ్చలు డయియే బ్రహ్మ, అగ్ని వాయ్వాదిత్యులద్వారా సర్వజగత్ప్రవర్తకు డగునట్లు (సృష్టి యజ్ఞమును నిర్వర్తించునట్లు) బ్రహ్మ యను ఋత్విక్కు కూడ బ్రహ్మిష్ఠుడై యజ్ఞమున కదలక స్థిర ప్రకృతియై యుండి హోత్రాది ఋత్విజుల ద్వారా యజ్ఞప్రవర్తకు డగుట యథర్వపద నిర్వచనము సూచించుచున్నది.

ప్రజాపతియే అంగరసభూతు డగుటచే అంగిరసు డనియు, ఋగ్ రూపమగు బృహతికి (వాక్కు కు) పతి యగుటచే బృహస్పతి యనియు, యజూరూప

1. పురీష్యోఽసి విశ్వభరా అథర్వా త్వా ప్రథమో నిరమంథ దగ్నే।
త్వా మగ్నే పుష్కరా దధ్యథర్వా నిరమంథత ।
మూర్ధ్నో విశ్వస్య వాఘతః ॥"
—వా సం. 11-32; తై. సం. 4-1-3-2; ఋ. 16-3-13.

మగు బ్రహ్మకు పతి యగుటచే బ్రహ్మణస్పతి యనియు, సామకు ప్రవృత్తిహేతు వగుటచే సామ యనియు - ఇట్లు నామ రూప ప్రపంచాత్మకుడనియు బూర్వము జెప్పబడినది (చూ. బ్రహ్మశబ్దము). ఇట్లు అంగిరసపదము కూడ వసిష్ఠ, అధర్వ పదముల వలెనే మొదట ప్రజాపతికి వాచక మగుచున్నది. ఇట్టి పదము లన్నియు మొదట ప్రజాపతికి వాచకములై పిదప మహర్షులకును వాచకము లయినట్లు గ్రహింపవలసి యున్నది.

అథర్వమహర్షియు, భృగుమహర్షియు నభిన్ను లని గోపథబ్రాహ్మణము చెప్పుచున్నది. అథర్వవేదము అనెడి పేరు వచ్చుటకు గారణమునందిట్లు చెప్పబడు చున్నది.

"పూర్వము ప్రజాపతి సృష్టికొఱకు తపము చేయుచుండగా నాతని రోమ కూపములనుండి స్వేదజలము పుట్టెను. అందు తన ప్రతిబింబమును జూచుచున్న ప్రజాపతికి రేతస్సు చలించినది. అట్టి రేతస్సుతో గూడిన యా జలములు రెండు భాగము లయ్యెను. ఒక భాగమునుండి భృగుమహర్షి పుట్టెను. భృగువు తన కుత్పాదకు డగు ప్రజాపతిని దర్శింపగోరుచుండగా నశరీరవాణి—

"అథార్వా గేనం ఏతా స్వేవా ప్స్వన్విచ్ఛ" —గో.బ్రా. 1-4.

నీకు ఉత్పాదకు డగు (కారణభూతుడగు) ప్రజాపతిని ఈ జలములందే యభిముఖముగ నన్వేషింపుము - అని పలికెను. ఆ యశరీరవాణి వాక్యమందు మొదట 'అథార్వాక్' అని యుండుటచే నీ భృగుమహర్షికి 'అథర్వా' అనియు రెండవనామము లభించెను.

ఇక రేతస్సుతో గూడిన రెండవభాగ మగు జలముచే నావృతుడగుటచే ప్రజాపతి వరుణశబ్దవాచ్య డయ్యెను. (ఆవృతత్వాత్ వరుణః). తపస్సు జేయ దొడగిన యా ప్రజాపతి యొక్క సర్వాంగముల నుండియు రసము స్రవించెను. సర్వాంగ రసభూత మగు నా రసము నుండి (అంగిరాః) అను మహర్షిపుట్టెను.

అనంతర మా బ్రహ్మ యథర్వణుని, యంగిరసుని తపస్తప్తుల గావింపగా నా యిరువురినుండి ఏకర్చ, ద్వ్యృచాది మంత్రములకు ద్రష్ట లయిన అథర్వాణులును అంగిరసులును నిరువదిమంది మహర్షుల బుట్టిరి. అట్లు సృజింపబడిన అథర్వాంగిరస మహర్షులు తపము జేయుచుండగా వారినుండి నిఃసృతములై ప్రజాపతిచే దర్శింపబడిన మంత్రములే అథర్వాంగిరోమంత్రములు: వానికే అంగిరో వేద మనియు, భృంగ్వంగిరో వేద మనియు, అథర్వాంగిరో వేదమనియు వ్యవహార మేర్పడినది." —(చూ. సాయణః - అథర్వవేద భాష్యభూమికా).

ఈ కథను బరిశీలించుచో (1) అథర్వుడే భృగుమహర్షి (2) భృగ్వంగిరసులనుండి యుద్భవించిన బ్రహ్మతేజఃసంభూతులు, మహా తపఃసంపన్నులు నగు అథర్వాంగిరో మహర్షుల తపఃఫలమే యథర్వవేదము (3) అథర్వు డగు ప్రజాపతిచే దృష్ట మగుటచే నిది యథర్వవేదమైనది - (అథర్వాఖ్యేన బ్రహ్మణా దృష్టత్వాత్ తన్నామ్నా అయం వేదో వ్యపదిశ్యతే - సాయణః) యనియు, అందుచే మానవబుద్ధికల్పితము కాదనియు దెలియును.

మంత్రద్రష్ట లయిన యీ యథర్వాంగిరసులే అథర్వాణులు, భృగువులు, అంగిరసులు వసిష్ఠులు — ఇత్యాది నామములతో బ్రసిద్ధులయి లోకమున యజ్ఞప్రవర్తకు లయినట్లు ఋగ్వేదాది శ్రుతు లిట్లు తెల్పుచున్నవి.

"అంగిరసో నః పితరో నవగ్వా అథర్వాణో భృగవః
సోమ్యాసః। తేషాం వయం సుమతౌ యజ్ఞియానా మపి
భద్రే సౌమనసే స్యామ॥ —ఋ. 10-14-6; వా.సం; 19-50;

అ.సం. 18-1-58; తై. సం. 2-6-12-6; నిరు, 11-19.

"యే నః పూర్వే పితరః సోమ్యాసో ఽనూహిరే సోమపీథం
వసిష్ఠాః।" —వా. సం. 19-51.

ఈ యంగిరసాది ఋషులందఱును ప్రజాపతి సంభూతు లగుటచే దివ్యత్వముతో నొప్పు దేవర్షులు; గోత్రప్రవర్తకులై పూర్వపితరులును (నః పితరః) అయిరి. (ఏషాం అంగిరః ప్రభృతీనాం ఋషిగణమధ్యే ప్రాధాన్యాత్ ఇదానీంతనానా మపి ప్రాచుర్యేణ తద్గోత్రత్వాత్ పితృత్వమ్- సా. భా; అ.సం. 18-1-58). ఇట్లు దేవర్షులు, పితరులు, మహాతేజః సంపన్నులు, యజ్ఞప్రవర్తకులు నగుటచేతనే వారి నామములు నేటికిని యజ్ఞాదికర్మల యం దిట్లు స్మరింపబడుచున్నవి.

"భృగూణా మంగిరసాం తపసా తప్యధ్వమ్"

—కాణ్వ. సం, 1-7; 31-6; తై. సం. 1-1-7-2; వా. సం. 1-18; తై. బ్రా. 1-1-4-8; 3-2-7-1,

ఈ శ్రుతివాక్యమును శతపథశ్రుతి యిట్లు వివరించినది.

"భృగూణా మంగిరసాం తపసా తప్యధ్వ మితి। ఏత ద్వై తేజిష్ఠం తేజో య ద్భృంగ్వంగిరసామ్। సుతప్తా న్యస న్నితి-తస్మా దేవ మభ్యాహతి" —శ.బ్రా 1-2-1-13.

అంగారములచే కపాలముల నాచ్ఛాదించుచు జెప్పెడి మంత్రమిది. 'భృగ్వంగిరసుల తపోవిశేషజనితమైన తేజస్సు అగ్న్యాదుల తేజస్సుకంటె మిగుల తేజోవంతమైనది, కాన నీ కపాలములును దేవర్షు లగు భృగ్వంగిరసుల తపోరూప మగు నగ్నిచే తప్తము లగుగాక - ఈ యగ్నిని భృగ్వంగిరసుల తేజోరూపముగ భావన జేయవలె నని భావము. (అస్య అగ్నేః తదీయరూపత్వం భావయే దిత్యర్థః -మహీధరః). 'భృగూణా మంగిరసాం తపసా తప్యధ్వ మిత్యాహ। దేవతానా మేవైనాని తపసా తపతి'- అనుచు తైత్తిరీయబ్రాహ్మణము గూడ నీ యర్థమునే వివరించినది.

కపాలములను అగ్నియం దుంచినచో నవియే తప్తము లగును. ఈ మంత్రసంస్కారముతో బని యేమి ? ఇట నగ్నిని భృగ్వంగిరసుల యొక్క తపోఽగ్ని విశేషరూపమున భావన జేయవలె ననెడి నియమమును విధించుటలో శ్రుతి తాత్పర్య మేమి?

ఈ దేవర్షులు మహాతపస్సంపన్నులు, మంత్రద్రష్టలు, గోత్రప్రవర్తకులగు పితరులు, తొలుదొలుత యజ్ఞమును ప్రవర్తింపజేసిన బ్రహ్మిష్ఠులగు మార్గదర్శులు[1]. అందుచేతనే ఋగ్వేదము గూడ పెక్కుచోట్ల అథర్వవత్; భృగువత్;

1. యజ్ఞై రథర్వా ప్రథమః పథస్తతే' —ఋ. 1–83–5.

"యా మథర్వా మనుష్పితా దధ్యఙ్ ధియ మత్నత' —ఋ. 1-80-16.
"యజ్ఞై రథర్వాప్రథమో విధారయ ద్దేవా దక్షై ర్భృగవః సం చిక్రిరే'
ఋ. 10–92–10.

"ఇమ ము త్య మథర్వవ దగ్నిం మంథంతి వేధసః"
—ఋ. 6–16–17 (చూ. 10–87–12).

"యేనా నః పూర్వే పితరః పదజ్ఞా అర్చంతో అంగిరసో గా అవిందన్'
—ఋ. 1–62–2.

వీళు చిద్దృళ్హా పితరో న ఉక్థై రద్రిం రుజ న్నంగిరసో రవేణ'
—ఋ. 1–71–2.

'ఆదంగిరాః ప్రథమం దధిరే వయ ఇద్ధాగ్నయః శమ్యా యే సుకృత్యయా'
ఋ. 1–83–4.

'అంగిరస్వత్' —ఋ. 1–31–17; 45–3; 62–1; 78–3; 8–17–1మొ॥
'దధు ష్ట్వా భృగవో మానుషే ష్వారయిం న చారుం సుహవం జనేభ్యః'
—ఋ. 1–58–6.

'అదోం రాజ్ఞే న సహీయసే సచా సన్నా దూత్యం భృగవాణో వివాయ'
—ఋ. 1–71–4.

అంగిరస్వత్: మనుష్వత్' -అని యీ రీతిగ నీ మహర్షులను సమానస్థానీయుం జేసి, వారు ప్రవర్తింప జేసిన సంప్రదాయముననే ప్రవర్తిల్లు దని హెచ్చరించుచున్నది. లక్ష్యభూతు లయి యజ్ఞాది సంప్రదాయ ప్రవర్తకులైన యీ దేవర్షులచే నే యగ్ని సమిద్ధుడై విలసిల్లెనో, యీ సంప్రదాయమున ప్రవర్తిల్లెడి యీ యజ్ఞకర్మ యందలి యగ్నియు నా యగ్నియే - తత్తేజోరూపుడే - యని భావన జేయుటకే 'భృగూణా మంగిరసాం తపసా తప్యధ్వమ్' అను నియమమును శ్రుతులు విధించినవే. అట్లు భావన చేసినపుడే తదనుగ్రహముచే నా యజ్ఞము అభ్యుదయకారి యగు నవియు మహాభాష్య మిట్లు చెప్పుచున్నది.

"అగ్నౌ కపాలా న్యధిశ్రిత్యా ఽభిమంత్రయతే-'భృగూణా
మంగిరసాం ఘర్మస్య తపసా తప్యధ్వ' -మితి। అంత
రేణాపి మంత్ర మగ్నిర్దహనకర్మా కపాలాని సంతాపయతి।
తత్ర చ నియమః క్రియతే-ఏవం క్రియమాణ మభ్యుదయ
కారి భవతీ"తి। —పస్పశాహ్నికమ్.

## వసిష్ఠాది ఋషులు- అథర్వనామధేయులు :-

వశిష్ఠ - గౌతమ - భృగు - అంగిరో మన్వాదులు బ్రహ్మర్షులు; లోక యాత్రా విధాయకు లగు ప్రజాపతులు; గోత్రప్రవర్తకులు; అథర్వభూతులు - అని హరివంశ మిట్లు చెప్పుచున్నది.

'ఇమం విధన్తో అపాం సధసే ద్వితాదధుర్భృగవో విక్ష్వా౩యోః'
—ఋ 2-4-2.

భృగువత్ - అంగిరస్వత్ ....ఋ. 8-43-13.
మనుష్వత్ — 1-31-17; 44-11 మొ॥

"తతోఽసృజ ద్వై త్రిపదాం గాయత్రీం వేదమాతరమ్।
అకరో చ్చైవ చత్వారో వేదాన్ గాయత్రిసంభవాన్॥
ఆత్మార్థే చాసృజత్ పుత్రాన్ లోకకర్తౄన్ పితామహః।
విశ్వే ప్రజానాం పతయో యేభ్యో లోకా వినిఃసృతాః॥
విశ్వేశం ప్రథమం నామ మహాతాపస మాత్మజమ్।
సర్వాశ్రమతమం పుణ్యం నామ్నా ధర్మం స సృష్టవాన్।
దక్షం మరీచి మత్రిం చ పులస్త్యం పులహం క్రతుం।
వశిష్ఠం గౌతమం చైవ భృగు మంగిరసం మనుం॥
అథర్వభూతా ఇత్యేతే ఖ్యాతా బ్రహ్మమహర్షయః॥"

—హరివంశ. 3-14—25 నుండి 29.

అథర్వభూతు లగు నీ బ్రహ్మర్షులు మథితాగ్నితో లోకమున తొలుదొలుత యజ్ఞమును బ్రవర్తింప జేసి రని ఋగ్వేదమే పలుచోట్ల చెప్పుచుండుటచే యజ్ఞముతోపాటు త్రయీవిద్యాత్మకము లగు నాలుగు వేదములు ప్రవర్తిల్లిన వని గ్రహించుట యుచితము: సంప్రదాయాభిమతము.

## అథర్వవేదము - ప్రాధాన్యము :-

కనుక అథర్వవేద మనునది (1) అథర్వు డగు ప్రజాపతిచేతను, పిదప తదనుగ్రహముచే నథర్వభూతు లగు నీ మహర్షులచే దర్శింపబడినది; (2) ప్రజాపనాతి మనుతో నథర్వవేద మనియు, ఆ మహర్షుల నామముతో నథర్వాంగిరోవేదము లేక భృగ్వంగిరోవేదము - అని యీ రీతిగా బ్రసిద్ధ మైనది; (3) అథర్వాదిఋషులే తొలుదొలుత యజ్ఞమును బ్రవర్తింపజేసినవారు; అథర్వవిదు లైన వాసిష్ఠులు యజ్ఞమున బ్రహ్మ స్థానీయు లగుచు బ్రహ్మవేద మను నామమును సార్థక పఱచిరి; (4) తత్సంప్రదాయవిదులే బ్రహ్మ - వశిష్ఠ-గురు-బృహ

స్మృతి- పురోహితాది నామములతో యజ్ఞాది కర్మనిర్వాహకులుగ బ్రసిద్ధులు - మున్నగు నిట్టి కారణములచే నథర్వవేదము - 'జ్యేష్ఠము; శ్రేష్ఠము; భేషజము; అమృతము, బ్రహ్మ' అని యీ రీతిగ శ్రుతియందును, పిదప పురాణేతిహాసాదుల యందును బ్రశంసింపబడినది. అందుచే మిగిలిన వేదములకంటె దీనికి గొన్ని యెడల బ్రాథమ్యము గలదు.

న్యాయమంజరీకారు డగు జయంతభట్టు గూడ అథర్వవేదము యొక్క ప్రాశస్త్యమును జెప్పుచు ఋగ్యజుఃసామ మంత్రత్రైవిధ్యము గలిగి యుండుటచే 'త్రయీ' యను వ్యవహారము అథర్వవేదమునకే ప్రధానముగ జెల్లు నని చక్కగ వివరించి, తుదకు దానికి గల ప్రాథమ్యము నిట్లు చెప్పినాడు.

"త తథర్వ ఏవ ప్రథమః, తతః పర మస్య మంత్రస్య బ్రహ్మణః ప్రణవస్యాభివ్యక్తేః, తథాచ శ్రుతిః....తస్మా చ్ఛాంతా త్సంతప్తా దో మితి మన ఏవోర్ధ్వ మక్షర మదక్రామ దిత్యాది; తథా మహావ్యాహృతీనాం శాఖాంతర ప్రసిద్ధానా మప్రసిద్ధానాం చ బృహ దిత్యాదీనాం తత ఏవో త్థానమ్; అథర్వవేద కృతోపనయన సంస్కారస్య వేదాంతరాధ్యయన మవిరుద్ధమ్; అన్యవేదోపనీయమానస్య తు నాథర్వణోపనయన సంస్కార మప్రాపిత స్యాథర్వ వేదాధ్యయనే ఽధికారః; తదుక్తమ్....

—న్యాయమంజరీ ప్రమాణప్రకరణమ్.

సర్వవేదమంత్రములకు ఆదియందును, అంతమందును ఉచ్చరింపబడెడి ప్రణవము నభివ్యక్తము జేసినది యథర్వవేద మని శ్రుతివలన దెలియుచున్నది. శాఖాంతరప్రసిద్ధములు, నప్రసిద్ధములు నగు బృహ దిత్యాది మహావ్యాహృతులు అథర్వవేదమునుండియే యుద్భవించినవి. అథర్వవేదముచే నుపనీతు డగు వానికి ఇతరవేదాధ్యయనము చేయుట కధికారము సిద్ధించును; ఇతరవేదములచే నుపనీతు

దగువానికి నథర్వవేదము నధ్యయనము జేయుటకు అధికారము సిద్ధింపదు. అట్టివా డథర్వ వేదము నధ్యయనము జేయవలె నన్నచో మరల నథర్వవేదముచే నుపనీతుడు గావలె నని ధర్మశాస్త్రములు జెప్పుచున్నవి. కాన అథర్వ వేదమున కితర వేదముల కంటె ప్రాధమ్య మొప్పును - అని యర్థము.

ఇట్టి యీ ప్రాధమ్యమును దెలియజేయుటకే మహాభాష్యకారుడును శబ్దాను శాసనారంభమున అథర్వ వేదవాక్యమును మొదట నుదహరించినట్లు గ్రహింపనగును.

## అథర్వాంగిరసులు - నామసాహచర్యము - చారిత్రికుల యూహ :-

'అథర్వులు - ఆంగిరసులు (లేక భృగువులు - ఆంగిరసులు) అనెడి రెండు తెగలు, లేక వంశములవారి రచన అగుటచే నీ వేదమునకు అథర్వాంగిరో వేద మని నామము ప్రసిద్ధమై యుండవచ్చును. ఈ రెండు వంశములకును పర స్పరసాహచర్య మున్నటు ఈ నామముల వలనను, 'భృగూణా మంగిరసాం తపసా తప్యధ్వమ్' ఇత్యాది శ్రుతివాక్యముల వలనను దెలియవచ్చుచున్నది - అని చరిత్ర కారులలో గొందఱి యూహ.

ఇట్లు రెండు వంశములుండి యుండవలె ననియు, నీ రెండు వంశములకు సాహ చర్య ముండి యుండవచ్చు ననియు నూహించుచున్నారే గాని యా సాహచర్యమునకు గారణ మేమో చెప్పబడలేదు. అందుచే నీ యూహలు నిరాధారములు. కాన అథర్వ-అంగిరః పదముల సాహచర్యమునకు గల గారణమును జూడవలసి యున్నది.

"యా తే రుద్ర శివా తనూ రఘోరా పాపకాశినీ"

—తై. సం. 4-5- -1; వా. సం. 16-2, 49, మై. సం. 2-9-2; కా. సం 17-11.

ఇత్యాదిశ్రుతులు పరమేశ్వరునకు శాంతము, ఘోరమునగు రెండు రూపములున్నట్లు చెప్పుచున్నవి. స్తంభము వెడలి ప్రత్యక్షమైన శ్రీ నరసింహాంవి రూపము భక్తాగ్రేసరు డగు ప్రహ్లాదునకు శాంత (అఘోర) రూపమున సాక్షాత్కరించి నట్లును ప్రబలద్వేషి యగు హిరణ్యకశిపునకు ఘోర రూపమున గన్పట్టి నట్లును సిద్ధము.

పారమేశ్వరశక్తిరూప మగు ప్రకృతియు శాంతఘోరరూపము. జీవులకుపభోగ్య మైన వస్తుజాతము జీవన హేతువగునపుడు భేషజము, లేక శాంతరూతము నగును. అదియే మృత్యుహేతు వగునపుడు ఘోరరూప మగును. ఉదా:- సర్వప్రాణులకు జీవనహేతువు అన్నము. శాస్త్ర ముపదేశించినటుల సాత్త్విక రాజస తామసా ద్యాహార భేధముల గుఱితించి వివక్షతో పరిమితాహారము సేవించుచో నది జీవనహేతువు, సుఖప్రదము నగు భేషజ మగును. అట్లు గానియపుడు వ్యాధిహేతువై యది దుఃఖప్రద మగుచు ఘోరరూప మగును. ఈ విషయమునే అన్నశబ్ద నిర్వచనము ద్వారా శ్రుతి యిట్లు వివరి చినది.

"అద్యతేఽత్తి చ భూతాని తస్మా దన్నంత దుచ్యత ఇతి"

—తై. ఆ. 9-2-1; మై. ఉ. 6-12.

"అద్" (తినుట) అను ధాతువు నుండి 'అన్నశబ్దము నిష్పన్న మైనది. (1) తినబడునది (అద్యతే) కావున అన్నము; (2) తినునది (అత్తి) కావున అన్నము - అని యర్థము; ఇట్టి నిర్వచనములు రెండును అన్నమునకు గల శాంత ఘోరరూపముల నుపలక్షింప జేయుచున్నవి.

ఋగ్వేదము వేదాత్మిక యగు సరస్వతీదేవి నాకే సూక్తమున - ఘోరప్రియరూపిణిగ వర్ణించినది.

1. Vedic Index.

"ఉత స్యా నః సరస్వతీ ఘోరా హిరణ్యవర్తనిః ।
వృత్రఘ్నీ వష్టి సుష్టుతిమ్॥"

"ఉత నః ప్రియా ప్రియాసు సప్తస్వసా సజుష్టా ।
సరస్వతీ స్తోభ్యాభూత్ ॥" —ఋ. 6, 61-7, 10.

"ఘోరా శత్రూణాం భయకారిణీ.... హిరణ్యమయో వర్తనిః (రథః) యస్యాః సా; ప్రియాసు ప్రియాణాం మధ్యే ప్రియతమా, సప్తస్వసా గాయత్ర్యాదీని సప్తచ్ఛందాంసి స్వసారో యస్యాః సాదృశీ...." —సా. భా.

ఇట మొదటి మంత్రమున సరస్వతి శత్రుభయకారిణి, వృత్రహంత్రి యగు ఘోరరూపిణిగ జెప్పబడినది. రెండవమంత్రమున ప్రియతమ (ప్రియాసు ప్రియా)గా గీర్తింపబడినది. వేదశరీరు డగు పరమేశ్వరునకు వలెనే వేదాత్మిక యగు సరస్వతికిని ఘోర-ప్రియరూపములు రెండు నున్నట్లు ఋగ్వేదము స్పష్టము చేయుచున్నది. ఇట్లు వేదసామాన్యము శాంతఘోరరూప మైనను, ఈ రూపముల విశేషించి యభివ్యక్తము జేయునవి భృగ్వంగిరో (అథర్వాంగిరో) మంత్రములు.

అందుచే నథర్వుని (ప్రజాపతి)యొక్క శాంతఘోరరూపములు అథర్వాంగిరో రూపమున ప్రకటితము లయినవి. పరమేశ్వరుని యందలి యా శాంతఘోరరూపముల నభివ్యక్తము చేయునవియే యథర్వాంగిరో మంత్రములు.

అథర్వు డనగా నిశ్చలప్రకృతి గలవాడని పూర్వము తత్పద నిర్వచనము ద్వారా వివరింపబడినది. శాంతరూపు డని యర్థము. "యేం ఉగారా స్తేఽంగిరసః అను నిర్వచనము ఘోరరూపము నుపలక్షింప జేయుచున్నది. ఈ వేదము బ్రహ్మవేదము; క్షత్త్రవేదముకూడ. బ్రహ్మయగు ఋత్విక్కు శాంత ఘోర రూప మంత్రాత్మకుడై బ్రాహ్మ క్షాత్త్ర తేజములతో విలసిల్లి యజ్ఞప్రవర్తకుడు, సంరక్ష

తుడును గావలయు నని శ్రుతి తాత్పర్యము. వసిష్ఠు డట్టి వాడగుటయు నథర్వవేదము శమ, దీప్తతాది గుణములతో నొప్పి యుండుటయు బూర్వము తెల్పబడినది.

"అధర్వవేదో వేదః సో౽య మితి భేషజం నిగదేత్"

—శాం. శ్రౌ. సూ. 16-9.

"భేషజం వా అథర్వణాని భేషజ మేవ తత్కరోతి"

—తాం. బ్రా. 12-6-10.

"భేషజం వై దేవానా మథర్వాణో భేషజ్యాయై వారిష్ట్యై"

—తాం బ్రా. 16-10-10

"తా నుపదిశ త్యథర్వాణో వేదః సో౽య మితి య ద్భేషజం నిశాంతం స్యాత్త న్నిగదేత్.... తా ఉపదిశ త్యాంగిరసో వేదః సో౽య మితి యద్ఘోరం నిశాంతం స్యాత్తన్నిగదేత్"

—ఆప. శ్రౌ. సూ. 10-7-1.

అధర్వ - భేషజ నామములు ఈ వేదమునకు గల శాంతరూపమును, అంగిరస-క్షత్ర నామములు ఘోరరూపము నుపలక్షింప జేయునని యని పై ప్రమాణముల వలన స్పష్టము ఈ పదములకు గల సాహచర్య మట్టిది.

కాన శాంతర ఘోరరూపములగు అథర్వాంగిరో మంత్రముల దర్శించిన ఋషులే అథర్వాంగిరసులు. దృష్టిభేధము, లేక అధికారిభేదము ననుసరించి శాంత ఘోరరూపములు భిన్నములై కన్పట్టినను, మొత్తము మీద పరమార్థమున నీ మంత్రము లన్నియు గూడ ఆత్మ చికిత్సకొఱకై, లోకకల్యాణమునకై ప్రవృత్తము లయిన భేషజములు. అందుచేతనే భేదదృష్టిని స్ఫురింపజేయు 'అథర్వాంగిరోవేదము' (భృగ్వంగిరో వేదము) అను నామముతోనే గాక అభేదదృష్టిని ప్రబోధించెడి యథర్వవేదము, భైషజ్యవేదము అను నామములతో గూడ శ్రుతి తనను గీర్తించుకొనినది. ఈ మంత్రద్రష్ట లగు బ్రహ్మర్షులను అథర్వభూతు లని మహాభారతము కీర్తించుటలోని తాత్పర్యము నిదియే.

# త్రయీశబ్దము - సంప్రదాయము - ఉపసంహారము:-

ఇంతవరకు నథర్వ వేదమునకు గల నామముల యౌచిత్యమును దర్శించితిమి. ఆథర్వవేదము ప్రధానముగ ఋగ్రూపమైనను, ఋగ్వేదమని గాక పృథక్కరించి వేఱ్వేఱు నామములతో శ్రుతి తనను వ్యవహరించుకొనుటకు గల కారణములను దెలిసికొంటిమి. దీనివలన 'చత్వారి శృంగా' ఇత్యాది ఋక్కుల ననుసరించి నాలుగు వేదములను ఋగ్యజుః సామ మంత్రాత్మక త్రయీవిద్యా రూపములు అను విషయము స్పష్టమైనది.

కాన త్రయీపదము 1) పరమేశ్వర - పరాశక్తి వాచకము, 2) వేద సామాన్యవాచకము, 3) కొన్నియెడల వేదత్రయవాచక మయ్యును నాలుగు వేదముల నుపలక్షింపజేయునది, 4) కర్మోపాస్తి జ్ఞాన రూప కాండత్రయాత్మక మగు వేదరాశి అని యీ రీతిగ సంప్రదాయానుగతము లయిన యర్థముల బోధించునట్టిది.

ట్లు కర్మోపాస్తిజ్ఞానరూప కాండత్రయాత్మక మగుచు అధికారి భేదము ననుసరించి వివిధార్థముల బోధించు ఈ త్రయీవిద్య 'కావ్యము' అనియు జెప్పబడుచున్నది

"త్రయీ వై విద్యా కావ్యం ఛందః"

వా. సం; 15-4, శ.బ్రా. 8-5-2-4.

వేదమునకు, లేక త్రయీవిద్యకు గల కావ్యత్వమును దర్శించుట వలనను త్రయీస్వరూప మింకను తేటపడగలదు. అందుచే వేదమునకు గల కావ్యత్వమును బరిశీలింతము.

# కవిః - కావ్యమ్

ఇమే వేదాః శశ్వత్ ప్రభు రివ జగ చ్ఛాసతి; తథా
పురాణం సస్నేహం సుహృ దివ పరం బోధయతి చ,
జగుః కావ్యం కాన్తేవ దమలవచోభి ర్మహాయతీ
త్వమేకో, శక్తి స్త్రేధా త్వయి హి పరమార్థా భగవతి,

త్రయీవిద్యా కావ్యం సకల కవితాధార మతులం,
కవిం చాద్యం శశ్వ ద్వినుతశతసూక్తై ర్విలసితమ్,
కలా మాత్మాఽనన్యాం కవిజనసుగమ్యాం రసఘనాం
కవిం కావ్యం వందే హరిహృదయసౌందర్యలహరీమ్ ॥

—వేదమాతృస్తవః.

## త్రయీవిద్య : ప్రభు. సుహృత్ - కాంతాసంమితము :-

'త్రయీ వై విద్యా కావ్యం ఛందః' (శ. బ్రా. 8-5-2-4) ఋగ్యజుః సామ మంత్రాత్మక మగు త్రయియే విద్య; ఈ విద్యయే కావ్యము; అట్టి కావ్యమే ఛందస్సు, అనగా వేదము - అని యీ శ్రుతివలన దెలియుచున్నది. వేదము కావ్యము - అనినంతనే యది యాలంకారిక సమయ విరుద్ధ మని తోచక మానదు. వేదములు ప్రభుసంమితములు; పురాణములు సుహృత్సంమితములు; కావ్యములు కాంతాసంమితములు - అని యాలంకారిక సమయము. ప్రభుసంమిత మగు వేదము కాంతాసంమితమై కావ్య మగుట యెట్లు ? ఈ ప్రశ్న యుదయించుట సహజము. పై శ్రుతి వాక్యము వేదము కావ్య మని చెప్పుచున్నది. కాన వేదము కావ్యమే

యగును. కాని యది లౌకికకావ్యముకంటె విలక్షణమైన కావ్యము. అది యధికారి భేదము ననుసరించి కొన్నియెడల ప్రభువై శాసించును; మఱికొన్ని యెడల సుహృత్తువలె నుపదేశించును. ఇంకొకయెడ కాంతవలె సరసవచోరీతుల నాత్మస్వరూపమును తేటపరచును. ఇట్టి మూడు శక్తులు పరమార్థమున వేదభారతియందు గలవు. ఈ విషయము వేదకావ్యస్వరూప పరిశీలనమువలన స్పష్టము కాగలదు.

వేదము ప్రభుసంమిత మగుట ప్రసిద్ధమే. ఆ విషయము నిట వివరింపబనిలేదు. ఇక సుహృత్ సంమితత్వమును జూతము.

## వేదః సచివిత్ ( సఖివిత్ ) - పురాణమ్ :-

సుహృత్ సంమితముగ నుపదేశించుట శ్రుతియే యొక సూక్తముః మున ఋ. 10-7) స్పష్టముగ జెప్పినిదది. అందలి యొక మంత్రమును జూతము.

"య స్తిత్యాజ సచివిదం సఖాయం న తస్య వాచ్యపి భాగో అస్తి ।
య ఈమ్ శృణో త్యలకం శృణోతి న హి ప్రవేద సుకృతస్య

పన్థామ్॥" —ఋ. 10-71-6; ఐ. ఆ. 3-?-4-3; తై. ఆ. 1-3-1; 2-15-1.

సంప్రదాయము విచ్ఛిన్నము గాకుండా వేదాధ్యయనము జేయువారు వేదమునకు సఖులు. అట్లు తనను (వేదమును) అధ్యయనము జేయు సఖుని గుర్తించునది యగుట జేసి వేదము సచివిత్ (సఖివిత్) అగుచున్నది. (యో ఒధ్యేతా స వేదస్య సఖా; సంప్రదాయోచ్ఛేద నివారకత్వేన వేదం ప్రత్యుపకారిత్వాత్। తాదృశ ముపకారిణ మధ్యేతారం వేత్తీతి సచివిత్ — సా. భా.) అట్లు తనతో చెలిమి యొనర్చు సఖునియెడ సుహృద్భావముతో బ్రవర్తించి సఖియైన వేదము స్వార్థబోధనము ద్వారా వారి కుపకార మొనర్చుచుండును. అట్టి వేద

రూప సఖుని విడనాడిన వాని వాక్కు లక్ష్మీవిలసితము కాదు; అనగా నట్టి వారి వాక్కు పురుషార్థప్రదము కాదు. మఱియు నట్టివాడు - వేద వ్యతిరిక్తమగు లౌకిక వాఙ్మయమును గూర్చి యెంత వినినను నది వ్యర్థ ప్రయాసమే యగును. (అలకం అలీకం వ్యర్థ మేవ శృణోతి). ఏలయన లౌకిక వాక్కు పురుషార్థ మార్గ దర్శకము కాదు (న హి ప్రవేద సుకృతస్య పన్థామ్) — అని యర్థము. 'న తస్యానూక్తే భాగోఽస్తి' - అనుచు ఐతరేయారణ్యకమును, 'తం యో ఽనూత్సృజ త్యభాగో వాచి భవ త్యభాగో నాకే' - యనుచు తైత్తిరీయారణ్యక మును పై యర్థమునే వివరించినవి.

పై మంత్రార్థము బరిశీలించినచో తాను (వేదము) సుహృత్ సంమి తముగ బరమార్థము నుపదేశించుటకై యవతరించినట్లు భంగ్యంతరముగ జెప్పి కొనుట కాననగును. (దాదాపు ఈ సూక్తమున గల మంత్రము లన్నియు వేద వాణికి గల సుహృత్సంమితత్వమును నిరూపించునవియే.) సుహృత్ సంమితము గావుననే పురాణ మనియు వేదమునకు నామము ప్రసిద్ధము.

'ఏత చ్ఛ్రుత్వా బ్రహ్మదత్త స్తా నువాచ మహాసురాన్ ।
యజ్ఞభాగో న విహితః పురాణే ఽసురసత్తమాః ॥'

— హరివంశ. 2-83-13.

'పురాణశబ్దే నాత్ర వేదో ఽభిధీయతే' — నీలకంఠః.

## వేదము-కాంతా సంమితత్వము:-

ఇక శ్రుతియందు గల కాంతా సంమితత్వమును జూతకొంము. తాసం మితముగ నుపదేశించుట వేదమునకు వెన్నతో బెట్టిన విద్య.

"ఏవా హ్యస్య సూనృతా విరప్శీ గోమతీ మహీ ।
పక్వా శాఖా న దాశుషే॥" — ఋ. 1-8-8; అ. సం. 20-70-4

వేదములకు 'సూనృతవాక్' అని పేరు. అట్టి సూనృతవాక్కు పరమేశ్వరుని వాక్కు (అస్య సూనృతా) గా నిట జెప్పబడినది. 'అది నియమపూర్వక యజ్ఞాది కర్మానుష్ఠానశీలురకు వివిధార్థ ప్రతిపాదక వాక్యరూపము (విరప్శీ-వివిధ రచనోపేత వాక్యయుక్తా, బహువిధోపచార వాదినీత్యర్థః - సా.భా. వివిధ గుణోపేత వాక్యయుక్తా, బహువిధోపచార వాదినీత్యర్థః - ముద్గల. భా.) పురుషార్థ రూపమగు నమృతము నొసగి ప్రోదిసేయు గోమతి (గోవులతో - వాక్కులతో నొప్పునది) పై కారణములచే పూజనీయ (మహీ) యు నగుచు పక్వఫలయుక్త శాఖవోలె నొప్పారునది' - అని యర్థము.

ఇట (1) వేదవాక్స్వరూపము; (2) వేదవాక్కు అభిమతార్థముల నిచ్చెడి కామధేనువు - అను విషయములు శ్రుతిచే కాంతాసంమితముగ జెప్పబడినవి. అయితే కాంతాసంమితత్వ మన నేమి ?

కాంత తన హావభావ విలాసాదులచే నాయకుని తన కభిముఖుని గావించుకొని తన యభిమతార్థములయందు బ్రవర్తింపజేయుచుండును. అట్లే కావ్యముగూడ గుణాలంకార రసాదులచే సరసత నాపాదించి సహృదయుల తన కభిముఖుల గావించుకొని కర్తవ్యార్థముల జెప్పి ప్రవర్తింప జేయుచుండును; పై మంత్రమునందలి సూనృతా- విరప్శీ - గోమతీ - మహీత్యాది విశేషణములు వేదవాక్కులు గాంతాసంమితము లగుట దెలియజేయును.

## సూనృతా :-

సూనృత యనగా సత్యము, ప్రియమును నగు వాక్కు. వేదవాక్కులు శాస్త్రమునందువలె సత్యములు మాత్రమే (సత్యార్థ స్వరూప ప్రకాశకములు మాత్రమే)

గావు; సత్యములు ప్రియములు గూడ. అందుచే సహృదయులకు ప్రీతి నుత్పాదింప జేసి భావన జేయకొలది సత్య స్వరూపము నుద్బోధించునవి యని యర్థము.

## విరప్శి :-

వివిధ రచనోపేత వాక్యయుక్తా-వివిధార్థబోధకధ్వనులతో గూడిన వాక్యములతో నొప్పునది. గంటను మ్రోగించినంతనే వివిధశబ్దతరంగములు నొకదానివెంట నొకటి ప్రాదుర్భవించునట్లు, వేదవాక్కును గదిలించినంతనే(పరిశీలించినంతనే) వివిధార్థములు క్రమముగ నభివ్యక్తము లగుచుండును. కావుననే యీ వేదవాక్కులు 'శతవ్రజాః' అని కీర్తింపబడుట పూర్వము వివరింపబడినది. (చూ. ఋషి శబ్దము). ఋగ్వేద మొక ఋక్కునందు(6-23-6) వేదవాక్కులను 'వర్ధనాని; శంతమాని; రారణ్యా; వక్షణాని' అని కీర్తించినది ఈ మంత్రములు స్వయముగనే పురుషార్థసాధకములు (వర్ధనాని స్వయమేవ వృద్ధిః రాణి); అందుచే నిరతిశయానంద దాయకములు (శంతమాని శుభ తృప్తమాని); కావున రమణీయము (రారణ్యా రారణ్యాణీ రమణీయానిః) హవిర్యుక్తములై వాహకములు (యజ్ఞైర్వావిర్భి ర్యుక్తాని వక్షణాని వాహకాని-సా.భా). అని చెప్పబడినవి. కావున 'విరప్శి' యనగా వివిధరమణీయార్థ ప్రతిపాదక వాక్యయుక్తము-అను నర్థ మిట సూచిత మగుచున్నది.

## గోమతీ:-

"అగ్నిమధ్యే గవాం మధ్యే బ్రాహ్మణానాం చ సంసది ।
విద్యా వేద వ్రతస్నాతాః బ్రాహ్మణాః పుణ్యకర్మిణః ॥
అధ్యాపయేరన్ శిష్యాన్ వై గోమతీం యజ్ఞ సమ్మితామ్ ।"

.... భార. 13-82-42, 43.

ఇట భారతమున గూడ వేదము 'గోమతి' యని కీర్తింపబడినది. వేద వాక్కులు గోవులు; కాన వేదము గోమతి. గోవులు క్షీరాదులవలె వేదవాక్కులు తమ్మాశ్రయించి పాలించువారలకు అభిమతార్థముల నొసగి ప్రోదిసేయు కామధేనువు లగుట సూచితము వేదవాక్కులు గోవు లగుటచేతనే తత్ప్రతిపాద్యు డగు పరమేశ్వరుడును గోమన్ (వా. సం. 26-4), గోపాల, గోవింద - ఇత్యాది పదములచే గీర్తింపబడుట ప్రసిద్ధము.

## పక్వా శాఖా న దాశుషే :-

ఇట వేదవాక్కు పక్వఫలయుక్త శాఖతో బోల్చబడినది. శాఖను గదిలించినంతనే పక్వఫలములు రాలు నటుల ఈ వేదవాక్కును గదిలించినచో (సేవించినచో) నా యా యభీష్టఫలములు సిద్ధించును. ఈ యుపమానముచే వేదవాక్కు అభిమతఫలముల నొసగెడి కల్పవృక్షమను విషయ మిట కాంతాసంమితముగ జెప్పబడినది.

కావున అనుష్ఠానశీ లడగు యజమానునకు (దాశుషే) వివిధ రమణీ అర్థముల దర్శింప జేయుటయే (విరప్శీ) గాక, గోమతియై, పురుషార్థప్రదయు, నందుచే పూజనీయ (మహీ) యు నగుచుండును. అని యీ విధముగ సూనృతాది విశేషణములు వేదవాక్కుయొక్క స్వరూపమును బ్రకటీకరించుచున్నవి. కాన సరసత నాపాదించి (ప్రీతిని గల్గించి) కర్తవ్యమున బ్రవర్తింప జేయుటయే వేద వాక్కుల స్వభావ మగుట స్పష్టము.

## శ్రుతిస్మృతులు. వేదవాక్స్వరూపము:-

తన స్వరూపమును వేదమే కొన్ని మంత్రములద్వారా తెలియ జెప్పనది. అందు గొన్నిటిని జూతము.

"అమన్యమానాగ్ం అభిమన్యమానై ర్నిర్బ్రహ్మభి రధమో దస్యు మింద్ర" — ఋ. 1-33-9.

'తదానీం త్వం, అమన్యమానాన్ మంత్రార్థ మనుధ్యాతు మశక్తానపి కేవలపాఠకాన్ యజమానాన్, అభిమన్యమానైః అస్మదీయా ఏతే యజమానా రక్షణీయా ఇతి అభిమానం కుర్వద్భిః, బ్రహ్మభిః మంత్రైః, దస్యుం చోరం వృత్రాది రూప మసురం, నిః అధమః నిఃసారితవా నసి' —సా.భా.

అర్థభావన జేయజాలని కేవల మంత్రపాఠకు లయిన యజమానులను గూడ — 'వీరు నావారు, రక్షణీయులు; - అని మంత్రము లభి మానించుచుండును. అట్టి బ్రహ్మల (మంత్రముల) చే నింద్రుడు వృత్రాద్యసురుల బారద్రోలెను - అని యర్థము.

ఇట వేదము—'నే నిట్టిదానను; నా స్వరూప మిది'-యని వాచ్యముగ జెప్పుకొన లేదు. ఇంద్రుడు మహిమాన్వితము లయిన మంత్రముల సాయముతో నసురుల సంహరించినట్లు చెప్పి, తన మహత్త్వమును భంగ్యంతరముగ తెలియ జేయుచున్నది. మఱియు నర్థభావన జేయజాలకపోయినను శ్రద్ధాభక్తి సమన్వితులై నియమపూర్వకముగ వేదమంత్రోచ్చారణ సేయు కర్మానుష్ఠానపరులను దనవారినిగా మంత్రము లభిమానించి రక్షించు నని మంత్రస్వభావమును నిపుణముగ వర్ణించినది. అందుచేతనే మంత్రార్థము నెఱుగకపోయినను నియమపూర్వక వేదమంత్రోచ్చారణముచే ఉపనయనాది సంస్కారములు జరుపుటయు, జరిపించుటయు, కేవల వేదమంత్రపారాయణము జేయుట యనెడి సంప్రదాయము నేటికిని శిష్టజనసంమతమై వరలుచున్నది. అంతేగాదు. వేదమంత్ర సంమితములగు గీతా రామాయణాది గ్రంథపారాయణము జేయుటయు నిందుకు తార్కాణము కాని యంతమాత్రముచే నర్థభావనతో నిమిత్తము లేదని శ్రుతితాత్పర్యముగాదు. అర్థభావన జేయు కొలది ప్రీతిని గలుగజేయుచు మహిమాన్వితములై యింద్రునకు సాయపడినట్లు సాయపడ

గలవు; తుదకు లోకోత్తరాహ్లాద జనకములు గాగల వనియు నీమంత్రము భంగ్యంతరముగ నుపదేశించు చున్నది.

అర్థభావనలో పునఃపున రనుసంధానము (మననము) సేయువారికి మంత్రములు ప్రీతిని గూర్చు వను విషయము నీ క్రిందిమంత్రము గూడ జమత్కారముగ బ్రదర్శించుచున్నది.

"ఉత త్వః పశ్య న్న దదర్శ వాచ ముత త్వః శృణ్వ న్న
శృణో త్యేనామ్। ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ
పత్య ఉశతీ సువాసాః॥"

—ఋ 10-71-4; నిరు. 1-19.

'అప్యేకః పశ్యన్ న పశ్యతి, వాచ మపి చ శృణ్వన్
న శృణోతి, ఏనా మితి అవిద్వాంస మాహ అర్థమ్.'-నిరు.

అర్థభావన జేయజాలని వాడు వేదవాక్కును దర్శించియు నాదరముతో జూడలేడు. అనగా వ్యాకరణాది జ్ఞానరహితు డగుటజేసి యవ్యుత్పన్ను డగుట వలన నధ్యయనము జేసియు దానియం దెక్కుడు నాదరభావము గల్గి యుండ లేడు. మఱియొకడు వ్యాకరణాది పరిజ్ఞానము గలిగి పాఠశుద్ధి గలవాడైనను మీమాంసాదృష్టి లేని కారణమున నా వేద వాక్కును వినియు విననివాడే యగును. అనగా న్యాయపూర్వక వేదవాక్యశ్రవణము చేయజాలడు.

'అ ప్యేకస్మై తన్వం విసస్రే ఇతి - స్వం ఆత్మానం

వివృణుతే, జ్ఞానం ప్రకాశన మర్థ స్యాహానయా వాచా' — నిరు.

వ్యాకరణాద్యంగములచే శబ్దార్థములను, మీమాంసచేసి తాత్పర్యమును బరిశీలించుటకు నెవడు పూనుకొనునో వానికి వేదవాక్కు వేదార్థ ప్రకాశనక్షమమైన సమ్యజ్ఞానమును (ఆత్మస్వరూపమును) ప్రదర్శించును.

'జాయేవ పత్యే కామయమానా సువాసాః। కామయమానా
ఋతుకాలేషు। యథా స ఏనాం పశ్యతి స శృణోతీ
త్యర్థజ్ఞ ప్రశంసా' — నిరు.

అన్య సమయములందు గృహకృత్యపరాయణయై సామాన్య (మలిన) వస్త్రధారిణియై గన్పట్టు కాంతను ఆదరముతో జూడక, యామె జెప్పు హిత వాక్యముల వినకపోయినను, ఋతుకాలములందు శోభన వస్త్రాలంకృతయై ప్రేమ మీఱదనను జేరవచ్చు. కాంత నాదరాతిశయముతో జూచి యామె జెప్పు నర్థములను (విషయములను) పతిహితబుద్ధితో నాలకించును. అట్లే చతుర్దశ విద్యాస్థాన పరిశీలన కుశలుడగు పురుషుడు రమణీయార్థ ప్రతిపాదక శబ్దరూప కల్యాణవస్త్ర శోభితయై తమిమీఱ దనను జేరవచ్చు వేదకావ్య మనెడి కాంత నాదరాతిశయముతో సాకల్యముగా జూచి తద్వాక్యములను హిత బుద్ధితో శ్రవణము చేయును — వేదోక్త ధర్మ, బ్రహ్మ రూపార్థములను హితబుద్ధితో స్వీకరించును.
— చూ.సాయణః, ఋగ్వేద భాష్య భూమికా )

కొందఱు విమర్శకు లీ సూక్తము (ఋ. 10-71) నందలి 'ఉతత్వః సక్తు మివ' — ఇత్యాది మంత్రములు సామాన్య వ్యవహారభాషకును కవితకును (Ordinary language and poetry) గల తారతమ్యమును, అందు 'కవిత' యొక్క ప్రాశస్త్యమును వివరించుటకై ప్రవృత్తము లయి నట్లు చెప్పుచున్నారు. (చూ. The theories of Rasa and Dhwani - Dr. A. Sankaran.)

అది సరికాదు. ఋగ్యజుఃసామల స్వభావమును బరిశీలించిన నీ విషయము స్పష్టము కాగలదు. వాని స్వభావమును గూర్చి శ్రుతియే యిట్లు చెప్పుచున్నది.

"అగ్ని ర్జాగారత మృచః కామయన్తే౽గ్ని ర్జాగార
త ము సామాని యన్తి। అగ్ని ర్జాగార త మయం సోమ
ఆహ తవాహ మస్మి సఖ్యే న్యోకాః॥"

— ఋ. 5-46-15; సా. సం. 2-1177.

వినిద్రుడై - సర్వదా జాగరూకుడై - యెవడు వెలుగొందుచుండునో యా యగ్నిని ఋక్కులు కాంక్షించుచున్నవి. సామములు నా యగ్నినే పొందు చున్నవి. యజుస్సులచే త్యాగ మొనర్పబడు సోమము 'నేను నీ దానను; స్వీక రింపు మని' యా యగ్నితో జెప్పికొనుచున్నది. ఓ యగ్నీ: అట్టి నీ సఖ్యము నందే నియతుడనై యున్నాను - అని యర్థము.

ఈ మంత్రమున యజమానున కగ్నితో నుండెడి నిరంతర సఖ్యము, ఋగ్యజుఃసామములకును నగ్నితో గల నిరంతర సఖ్యము జెప్పబడినది. అగ్నితో లేక పరమేశ్వరునితో నిరంతర సఖ్యమునకై ఋగ్యజుఃసామములు ప్రవృత్తము లైనవి. వాని ప్రధాన లక్ష్యము పరమేశ్వరుడే యగుట స్పష్టమైనది. ఇట్లు వేదవాక్స్వభావము స్పష్టమగుచుండ 'నీ మంత్రములు సాధారణభాషకును కవిత కును గల తారతమ్యమును సామాన్యముగ కవితాప్రాశస్త్యమును జెప్పుటకు మాత్రమే ప్రవృత్తములైనవి' - యని చెప్పుట శ్రుతి తాత్పర్య విరుద్ధము; సాయణాది భాష్యకర్తలకును సంమతముగాదు. వేదవాక్స్వరూపనిరూపణపరములైన యీ మంత్రముల వలన సామాన్యముగ కవితయొక్క ప్రాశస్త్యముకూడ నర్థసిద్ధ మగుచున్నదని చెప్పుట సహృదయ హృదయాభిమత మగును. 'అవిద్వాంసుడు వేదవాక్కును వినియు విననివాడే, విద్యావ్రత స్నాతు డగు వేదవిదునకు మాత్రమే కాంతవలె శ్రుతి ఆత్మ (లేక తన) స్వరూపమును దర్శింపజేయు' నను విషయమును బ్రతిపాదించుటయే పై శ్రుతితాత్పర్యము. వాల్మీకి మహాకవియు నుపమానవ్యాజమున జక్కగ జమత్కరించుచు నీ విషయము నిట్లు వ్యక్తము జేసినాడు.

'అహ మౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః।
వ్రతస్నాతస్య ధీరస్యవిద్యేవ విదితాత్మనః॥' —రామా.5-21-17.

కామమోహితుడై తననుగూర్చి పలికిన రావణుని వాక్యములకు ధీరయై సీత యొసగిన సమాధాన మిది విద్యావ్రతస్నాతుడు, ధీరుడు, నాత్మజ్ఞాన సంపన్నుడు నగు వేదవిదునకు వేదవిద్యవలె వ్రతస్నాతుడు, ధీరుడు, నాత్మవిదుడు వసుధాపతియు నగు శ్రీరామచంద్రునకే నేను లభ్య మగు-న్యాయ్య మగు-భార్యను (యుక్త మౌపయికం లభ్యం భజమానాభి నీతవత్ న్యాయ్యం చ త్రిషు షట్-అమరః) - అని యర్థము.

శ్రీరామచంద్రునకే నేను లభ్యను; న్యాయమగు భార్యను — అను రెండర్థములను నిట 'ఔపయిక' పదముచే స్ఫురించుచున్నవి, అట్లే విద్యావ్రత స్నాతుడు, ధీరుడు, ఆత్మతత్త్వవిదుడు నగు వేదవిదునకు మాత్రమే యీ వేద విద్య లభ్యమై, న్యాయయుక్తమై కాంతవలె వశవర్తిని యగునని తాత్పర్యము.

కాన 'జాయేవ పత్య ఉశతీ సువాసాః' - అను పై మంత్రము చతుర్దశ విద్యాస్థాన కుశలుడగు విద్వాంసునకు మాత్రమే వేదవాక్కు కాంతాసంమితముగ నర్థముల నుద్బోధించు నను నీ విషయము నుపమా వ్యాజమున నిపుణముగ వివరించు చున్నదని చెప్పుటయే యుక్తము. ఇంతేకాదు.

'తస్యోత్తరా భూయసే నిర్వచనాయ' — నిరు.

పూర్వోదాహృతము లయిన 'ఉత త్వః పశ్యన్' ఇత్యాది ఋక్కులచే జెప్పబడిన యర్థమును దాని తరువాత పఠించెడి ఋక్కు ఇంకను నెక్కువ మిన్నగ నిర్వహించుచున్నది — యని యర్థము. ఆ మంత్ర మిది.

"ఉత త్వం సఖ్యే స్థిరపీత మాహు ర్నైనం హిన్వన్త్యపి వాజినేషు। అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువా అఫలా మపుష్పామ్" —ఋ. 10-71-5; నిరు. 1-20.

పూర్వము 'య స్తిత్యాజ సచివిదం సఖాయం' అను మంత్రమున వేదము నకు గల సఖిత్వము చెప్పబడినది. ఇట్టి వేదరూపసఖునితో సఖ్యము నెఱుపు వానిని గూర్చి యిట జెప్పబడుచున్నది. చతుర్దశ విద్యాస్థాన కుశలు డగు విద్వాంసుడే యట్టి వేదముతోడి సఖ్యముననుండి వేదోక్తార్థామృతపానమును జేసిన వాడు (స్థిరపీతః) అని యభిజ్ఞులు చెప్పుదురు. అట్టి విద్వాంసుడు సభయం దున్నచో నెంతటి వాక్ప్రాగల్భ్యము గల వారైనను ఆయన తోడి వాదమునకు వెఱచి సమీపింప లేరు. అట్లు విద్యాకౌశలము లేక మంత్ర పరిశీలనము చేయు వాడు ఐంద్రజాల నిర్మిత మాయాధేనువుతో జరించిన వానితో సమానుడగును. (అధేన్వా చరతి మాయయైషః) పూర్వకాండోక్త ధర్మజ్ఞానము పుష్పము; ఉత్తరకాండోక్త బ్రహ్మ జ్ఞానము ఫలము: మాయాధేనువు క్షీరాదుల నొసగి ప్రోది సేయని యట్లు, వేదవాక్కుగూడ నవిద్వాంసులకు పుష్పఫలరహితయై గన్పట్టి పురుషార్థముల నొసగి ప్రోదిసేయ జాలదు - అని యర్థము (చూ సా. భా)

ఇట 'వేదవాక్కు అజ్ఞుల పాలిటి మాయాధేనువు' అని చెప్పబడుటచే విజ్ఞులపాలిటి కామధేనువు అను విషయము భంగ్యంతరముగ దెలియజేయబడు చున్నది. అంతియే కాదు. 'అఫలాం అపుష్పాం' అనుటచే వేదమొక మహా వృక్ష మగుటయు సూచిత మగుచున్నది. అందును నొక విశేషము. వృక్షమును జక్కగా బోషించుచో నది మొదట పుష్పించును. ఎట్టి యుపద్రవము లేకుండ గాపాడుచో నా పుష్పములు ఫలముల నొసగును. అట్లే వేదవృక్షమును బోషించుచో నది మొదట ధర్మ మనెడి పుష్పముతో వికసించును. భద్రముగా రక్షించు కొనుచో నా ధర్మ పుష్పము క్రమముగ బ్రహ్మజ్ఞాన ఫలము నొసగి ప్రోదిసేయ గలదు - అనగా వేదము మొదట ధర్మము నుపదేశించి తదనుష్ఠానముచే చిత్తశుద్ధి నొందిన యధికారులకు బ్రహ్మామృతానందరసము ననుగ్రహించును - అను విషయముగూడ కాంతా సంమితముగ నిట నుపదేశింపబడుచున్నది. ఇట్లెన్నెని మంత్రముల నుదహరింప వచ్చును.

శ్రుతి తనకు గల కాంతాసంమితత్త్వమును కాంతాసంమితముగ వివరించు కొనుట యిట గమనార్హము. కాన కాంతాసంమితముగ నుపదేశించుట వేదమునకు వెన్నతో బెట్టిన విద్య యనుట శ్రుతిసంమతము; నిర్వివాదము.

## మంత్రములన్నియు కాంతాసంమితములా?

వేదమున నటనట కాంతాసంమితము లగు వాక్యములు గూడ నుండినను మండవచ్చును; అన్నియు నట్టివి కావు గదా! అందుచే వేదము కాంతాసంమితమై కావ్య మగు టెట్లు? అన నట్లు గాదు.

లౌకికకావ్యమునందు కేవల కథాభాగ ప్రతిపాదక నీరసవాక్యము లన్నియు గాంతాసంమితములై చమత్కారాధాయకములు గావనుట యనుభవసిద్ధమే. విశ్వనాథకవిరాజుగూడ సాహిత్యదర్పణమున 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అని కావ్యలక్షణమును జెప్పి కావ్యగత నీరస పద్యములకు కావ్యత్వ మెట్లు సిద్ధించు నని ప్రశ్నించుకొని యిట్లు సమాధాన పడినాడు.

> 'రసవత్పద్యాంతర్గత నీరసపదానామివ పద్యరసేన, ప్రబంధ
> రసేనైవ తేషాం రసవత్తాంగీకారాత్' —సాహిత్యదర్పణ.

రసవత్తరమగు పద్యమునందలి నీరసపదములకు పద్యరసముచేతనే రసవత్త్వము నంగీకరింపవలెను. అట్లే ప్రబంధరసము చేతనే నీరస పద్యములకును, రసాత్మకత్వము, సిద్ధించు నని భావము. కనుక వేద-శాస్త్ర విలక్షణములై యవతరించినట్లు చెప్పబడెడి కావ్యములందునలెనే వేదమునందును కావ్యత్వపమన్వయమువిరుద్ధము — ఈ విషయము మున్ముందింకను జూతము.

## భారతము - వేదమువలెనే ప్రభు - సుహృత్ - కాంతా సంమితము :-

వేదముల తరువాత పంచమవేదమై బరగిన మహాభారతముగూడ వేదము వోలె ప్రభు-సుహృత్-కాంతా సంమితమునై వరలినది. ఈ విషయము భారతమే స్వయముగా జెప్పుకొనినది.

"తపసా బ్రహ్మచర్యేణ వ్యస్య వేదం సనాతనమ్।
ఇతిహాస మిమం చక్రే పుణ్యం సత్యవతీసుతః॥
ఆత్మేవ వేదితవ్యేషు, ప్రియేష్వేవ హి జీవితమ్।
ఇతిహాసః ప్రధానార్థః శ్రేష్ఠః సర్వాగమే ష్వయమ్॥
హ్రదానా ముదధిః శ్రేష్ఠో గౌ ర్వరిష్ఠా చతుష్పదాం।
యథై తాసీతిహాసానాం తథా భారత ముచ్యతే॥"

పై వాక్యము లవలన భారత మితిహాస మగుట తెలియగలదు. ఇతిహాస మనుటచే నిది సుహృత్స మిత మని చెప్పినట్లే యగును. ఇక ప్రభుసంమితత్వము.

"యో విద్యా చ్చతురో వేదాన్ సాంగోపనిషదో ద్విజః।
న చాఖ్యాన మిదం విద్యా న్నైవ సస్యా ద్విచక్షణః॥

అర్థశాస్త్ర మిదం ప్రోక్తం ధర్మశాస్త్ర మిదం మహత్।
కామశాస్త్ర మిదం ప్రోక్తం వ్యాసేనామితబుద్ధినా॥"

ఇట భారతము ధర్మ-అర్థ-కామ-మోక్షము లనెడి పురుషార్థములను దర్శింపజేయు శాస్త్రముగా బేర్కొనబడినది. శాస్త్రము గాన ప్రభుసంమిత మగుట జెప్పినట్లే యగును. ఇక కావ్యత్వము.

"కృతం మయేదం భగవన్ కావ్యం పరమపూజితమ్।
బ్రహ్మన్ వేదరహస్యం చ యచ్చాప్యభిహితం మయా॥....

జన్మప్రభృతి సత్యాం తే వేద్మి గాం బ్రహ్మవాదినీమ్ ।
త్వయా చ కావ్య మిత్యుక్తం తస్మా త్కావ్యం భవిష్యతి ॥

అస్య కావ్యస్య కవయో న సమర్థా విశేషణే ।
విశేషణే గృహస్థస్య శేషా స్త్రయ ఇవాశ్రమాః ॥"

వ్యాసమహర్షి తన యెదుట సాక్షాత్కరించిన బ్రహ్మతో తాను భారత మను కావ్యమును రచించి నట్లు చెప్పెను. అంతట బ్రహ్మ 'పుట్టినది మొదలు నీ వాక్కు బ్రహ్మవాదిని (బ్రహ్మవాక్కు) అని యెఱుగుదును. నీవు కావ్యమంటివి. కాన నిది కావ్యమే యగును. మిగిలిన యాశ్రమములు మూడును గృహస్థాశ్రమము నతిశయింపనియట్లు మిగిలిన కవు లెవరును నీ కావ్యము నతిశయింపలేరు.' – అని చెప్పెను.

పై బ్రహ్మ – వ్యాస సంవాదమువలన భారతము కావ్య మగుటయు; మిగిలిన యాశ్రమములకు గృహస్థాశ్రమము వలె లౌకికకవుల కీ భారతము జీవనా ధార మనియు స్పష్ట మగుచున్నది. వేదమువోలె భారతముగూడ నిట్లు ప్రభు - సుహృత్ - కాంతాసంమిత రచనావైదగ్ధ్యములతో వేదచోదితార్థ వ్యాఖ్యానమునకు దొరకని పంచమవేదమై ప్రవర్తిల్లినది.

భారతమువలెనే స్మృతులు, పురాణములు, లౌకికకావ్యములును, శ్రుత్యర్థానుగాములే. కాని యొక విశేషము. వేదమునగల త్రివిధ రచనా వైచిత్ర్యములలో నొక ప్రభుసంమితత్త్వమార్గముననే ప్రధానముగ బ్రవర్తిల్లి స్మృతులు శాసకము లగుచు ధర్మశాస్త్రము లయినవి: సుహృత్సంమితత్వము మాత్రము నాదర్శముగా గొని పురాణములు శ్రుత్యర్థ ప్రఖ్యాపకము లయినవి;

కేవల కాంతాసంమిత రచనావైచిత్ర్యమును గొని లౌకికకావ్యములు ప్రత్యర్థమునకు బుష్టిని జేకూర్ప నోరకొనినవి. భారతము మాత్ర మీ మూడింటికిని స్థానభూతము.

కాని, మహాభారతాదులు వేదార్థోపబృంహకములు గాన వానికిగల ప్రభు సంమితత్వము వేదానుగతము. నిరపేక్షమైన ప్రభుసంమితత్వము వేదమునకే. కాని యిట నొక విషయము బరిశీలింప నగును.

## వేదమునకుగల కావ్యత్వ మౌపచారికమా ?

వేదమునందును, మహాభారతమునందును కాంతాసంమిత్వముతో పాటు ప్రభు - సుహృత్సంమితత్వములుగూడ నున్నవని చెప్పుచో వానికి ఏకాంశమున మాత్రమే కావ్యత్వము సిద్ధించును; లేక, ప్రబంధరసముచేత నే నీరసపద్యములకు రసవత్త్వము సిద్ధించు ననెడి సాహిత్యదర్పణకారుని వాదము నాశ్రయించి యౌప చారికకావ్యత్వమునైన గల్పింపవలయును. కాని 'కావ్యంఛందః' - (వా.సం 15-4) అని వాజసనేయశ్రుతియు, తద్వివరణ రూపమగు 'త్రయీ వై విద్యా కావ్యం ఛందః' -(శ. బ్రా. 8-5-2-4) అని శతపథశ్రుతియు కృత్స్నవేదరాశికి కావ్యవ్యవ హార మున్నటుల జెప్పుచున్నది. అట్లే బ్రహ్మ - వ్యాస సంవాదము మహాభారత మున కంతటికిని కావ్యత్వవ్యవహారము గలదని తెలియజేయుచున్నది ఇట్లు వేద రాశికిని భారతమునకును కావ్యవ్యవహార ముండుటలో గల తాత్పర్యమేమి ? పోనీః వేదమునకుగల కావ్యత్వ మౌపచారిక మని చెప్పుదమా ? పై శ్రుతివాక్యప్రామాణ్య ముచే నట్లు ఔపచారిక మని చెప్పుట యుక్తము గాదు. అట్లే 'మహాభారతవిషయ మున గూడ—

"జన్మప్రభృతి సత్యాం తే వేద్మి గాం బ్రహ్మవాదినీమ్।
త్వయా చ కావ్య మిత్యుక్తం తస్మా త్కావ్యం భవిష్యతి॥"

యను పై బ్రహ్మ వచనము 'భారతమునకుగల కావ్యత్వము గౌణము గాదు; యథార్థము' - అను విషయమును స్పష్టము చేయుచున్నది. కాన 'వేద - భారత' గ్రంథములకు గల కావ్యత్వ మౌపచారికము గాదు. (ఈ విషయము మున్ముందింకను వివరింపబడును) వీనికిగల కావ్యలక్షణము వీనియందు సంగత మగునా ? కాదా ? యను విషయము జూడవలసియున్నది.

## అలంకారికులు - కావ్యలక్షణము :-

మొట్టమొదట కావ్యలక్షణమును బరిష్కరించినది యగ్నిపురాణము.

"సంక్షేపా ద్వాక్య మిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ।
కావ్యం స్ఫుటదలంకారం గుణవ ద్దోషవర్జితమ్॥ —అ.పు. 337-6.

గుణాలంకారయుక్తమై, దోషవర్జితమైన ఇష్టార్థప్రతిపాదక పదావళి (వాక్యము) కావ్యము - అని యర్థము. దండిమహాకవియు కావ్యాదర్శమున ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యమ్' - అనుచు, అగ్నిపురాణమునే యనుసరించి నాడు. తర్వాత భామహునితో శబ్దార్థములు కావ్య మను వాదము బయలుదేరినది. ఆ వాదము ననుసరించి రుద్రటుడు, వామనుడు, ఆనందవర్ధనుడు, మమ్మటుడును శబ్దార్థముల రెంటిని కావ్యశరీరముగ గ్రహించిరి.

'శబ్దార్థౌ సహితౌ కావ్యమ్' —భామహః.

'నను శబ్దార్థౌ కావ్యమ్' —రుద్రటః.

'కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః
శబ్దార్థయో ర్వర్తతే' —వామనః

'శబ్దార్థశరీరం తావ త్కావ్యమ్' — ఆనందవర్ధనః

'తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి' —మమ్మటః

వాగ్భటుడు పై లక్షణమును కొలదిగ నిట్లు సవరించినాడు.

'గుణాలంకార రీతి రసోపేతః సాధుశబ్దార్థ సందర్భః కావ్యమ్'

—వాగ్భటః.

తరువాత పీయూషవర్షుడు (జయదేవుడు) అట్లుగాక గుణాలంకారాదివిశిష్ట నిర్దోషవాక్యము కావ్య మని చెప్పినాడు.

'నిర్దోషం గుణాలంకారలక్షణ రీతి వృత్తిమద్వాక్యం కావ్యమ్'

పిమ్మట సాహిత్యదర్పణకారుడు (విశ్వనాథకవిరాజు) ను శబ్దార్థములు కాదనినాడు.

'వాక్యం రసాత్మకం కావ్యమ్'

అని రసాత్మకవాక్యమునే కావ్యముగ జెప్పుచు తన ప్రాచీనులకంటె విలక్షణమైన కావ్యలక్షణము జెప్పి క్రొత్తమార్గము త్రొక్కినాడు. కావ్యప్రకాశ వ్యాఖ్యాతయగు గోవిందఠక్కురు పై లక్షణమును 'రసాదిమ ద్వాక్యం కావ్యమ్" —అని సంస్కరించినాడు. తరువాత పండితరాజ జగన్నాథుడును శబ్దార్థములు కావ్య మనెడి వాదమును ఖండించి—

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్'

అని కావ్యలక్షణమును బరిష్కరించినాడు. నేటికిని పండితామోదమును బడసి నిలిచి కావ్యలక్షణ మిదియే - యని చెప్పవచ్చును.

కాని 'త దధీతే త ద్వేద' యను పాణినిసూత్రస్థ భాష్యమును ప్రమాణ ముగా గ్రహించి 'శబ్దార్థములు కావ్యము' అను వాదమును నాగేశభట్టు మన్నగు

వారు కొందరు సమర్థించిరి. కాని జగన్నాథుని కావ్య లక్షణమే బహుళప్రచారము గాంచియున్నది.

ఇట నొక విషయము గమనింప నగును. అగ్నిపురాణము నందలి 'ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ కావ్యమ్' అను ఆర్షలక్షణమే తుదకు 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అను జగన్నాథుని కావ్యలక్షణముగ రూపొందిన దని యనవచ్చును. ఆర్షలక్షణము నందలి 'ఇష్టార్థము' ఇచట 'రమణీయార్థ' మైనది. రెండిటి లక్ష్య మొకటియే. తన కావ్యలక్షణమును జగన్నాథు డిట్లు పరిష్కరించు కొనినాడు.

'చమత్కారజనక భావనావిషయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' ఇందలి 'భావనా' పదమును పునఃపున రనుసంధానము జేయుట-యని యర్థము. ఏ యర్థమును పునఃపున రనుసంధానము జేయుటచే లోకోత్తరాహ్లాదము (చమత్కారము) కలుగునో యట్టి భావనా గోచర మగు నర్థమే రమణీయార్థము. అట్టి రమణీయార్థమును బ్రతిపాదించు శబ్దమే కావ్యము-అని యర్థము.

వేదవాక్యములకు మంత్రము లని యసాధారణ నామము. మంత్రము లనగా పునఃపున రనుసంధానము (మననము) చేయదగినవి యని యర్థము. (మననా న్మంత్రః). ఈ మననమునే జగన్నాథుడు 'భావన' యనినాడు. అట్లు మననము జేయుచో ప్రీతిని (లోకోత్తరాహ్లాదమును) అనుగ్రహించు నట్టి సూనృత వాక్కులు మంత్రములు. ఈ రీతిగ బరిశీలనము చేయుచో జగన్నాథుని కావ్య లక్షణమునకు ప్రధానలక్ష్యము వేదకావ్యమే యని చెప్పనగును. అపుడు ఆలంకారిక కావ్యలక్షణము వేదకావ్యము నందును సంగతమే యగును. కనుక 'కావ్యం ఛందః' అను శ్రుతి ప్రమాణము ననుసరించియు, ఆలంకారికుల కావ్యలక్షణము ననుసరించియు కృత్స్న వేదము కావ్యమని చెప్ప నొప్పును.

## ఆక్షేపము _ సమాధానము :_

అయినను వేదముగాని, భారతముగాని కావ్య మనుట యుక్తము కాదు. ఏలయన నగ్ని పురాణము శాస్త్రేతిహాసములకంటె కావ్యము విలక్షణమైనదని స్పష్టముగా నిట్లు పేర్కొనుచున్నది.

"శాస్త్రే శబ్దప్రధానత్వం ఇతిహాసేషు నిష్ఠతా।
అభిధాయాః ప్రధానత్వాత్ కావ్యం తాభ్యాం విభిద్యతే॥"
విష్ణుధర్మోత్తర పురాణముగూడ నిట్లే చెప్పుచున్నది.
"తదేవ కావ్య మిత్యుక్తం ఉపదేశై ర్వినా కృతమ్" 15. అధ్యా.

పై ఆప్తవచనములబట్టి శాస్త్రేతిహాసములయం దేకాంశమున గూడ కావ్యత్వము లేదని చెప్పవలసియుండును గదా।

కాని యిట్లే పురాణవచనములందు ఇతిహాసము కావ్యముకంటె విలక్షణమైనదని చెప్పిన వ్యాసుడే యితిహాసమైన భారతమునే కావ్యమని ముక్తకంఠముగ జెప్పినాడు. అట్లు చెప్పుటలోని యాంతర్యమును గమనింపవలసి యున్నది. భారతమునే కాక శాస్త్రముగు వేదమునుగూడ కావ్యమని వ్యాసు డిట్లు కీర్తించినాడు.

"నాసూయామి ద్విజాన్ విప్ర రాజాఽస్మీతి కదాచన।
కావ్యాని వదతాం తేషాం సంయచ్ఛామి వహామి చ॥

తే విస్రబ్ధాః ప్రభాషన్తే సంయచ్ఛన్తి చ మాం సదా।
తే మాం కావ్యపదే యుక్తం శుశ్రూషు మనసూయకమ్॥

ధర్మాత్మానం జితక్రోధం నియతం సంయతేంద్రియమ్।
సమాసించంతి శాస్తారః క్షౌద్రం మధ్వివ మక్షికాః॥

సోఽహం వాగగ్రవిద్యానాం రసానా మవలేపితా ।
స్వజాత్యా నధితిష్ఠామి నక్షత్రాణీవ చంద్రమాః ॥

ఏతత్ పృథివ్యా మమృత మేత చ్చక్షు రను త్తమమ్ ।
య ద్బ్రాహ్మణముఖే కావ్య మేత చ్ఛ్రుత్వా ప్రవర్తతే ॥

ఏతావ చ్ఛ్రేయ ఇత్యాహ ప్రహ్లాదో బ్రహ్మవాదినమ్ ॥

భార. శాన్తి. 1:4-34 నుండి 39.

ప్రహ్లాదుడు తన సౌశీల్యముచే త్రైలోక్యరాజ్యము నాక్రమించెను. ఇంద్రుడు క్రమముగా బృహస్పతి-శుక్రులయొద్ద శ్రేయస్సుయొక్క స్వరూపమును దెలిసికొనియు, దృప్తి నొందక వారలచే ననుజ్ఞాతుడై, శ్రేయఃస్వరూపము నెఱుగుటకై బ్రాహ్మణరూపమున బ్రహ్లాదుని జేరి సేవించి మెప్పు వడసెను. అపుడు ప్రహ్లాదు డింద్రునితో తన సౌశీల్యాతిశయమునకు గారణ మిట్లు చెప్పుచున్నాడు.

"ద్విజవర్యా! నేను రాజును గదా యని ద్విజులయెడ నెన్నడు నసూయ వహింపను; కావ్యముల (వేదముల) నుచ్చరించు వారి నాదరించి పోషింతును; వారును నా యెడ నాదరముతో నుండి విశ్రబ్ధముగ మాటలాడుచు నన్ను కావ్యపథమున (వేదచోదిత మార్గమున) నియమించుచుందురు; ఆ మార్గమున నిరతుడనై, శుశ్రూషాపరాయణుడనై, జితేంద్రియుడనై, వర్తిల్లునాయందు మధుకరములు తేనెపట్టునందు తేనెనువలె నా ద్విజులు విద్యాసారమును నింపుదురు; వారివలన వాగగ్రవిద్యల రసమును (వేదవిద్యా సారమును) గ్రోలి చుక్కలలో చంద్రునివలె నా జాతివారలలో విరాజిల్లుచున్నాను; బ్రాహ్మణముఖమున ప్రవర్తిల్లెడు కావ్యమే (వేదమే) లోకమున నమృతము; అదియే నేత్రము (జ్ఞాననేత్రము) దీనిని శ్రవణము జేసి (ఏతద్ శ్రుత్వా) ప్రవర్తించుటయే శ్రేయస్సు" — అని యర్థము.

## కావ్యపథము :-

ఇట కావ్యమనగా లౌకిక కావ్యముల గ్రహించుట కవకాశము లేదు? ఏలయన - పై సంవాదమున ప్రహ్లాదుడు తాను కావ్యపథమున వర్తిల్లుచున్నటుల (కావ్యపథే యుక్తం) పేర్కొనెను. ఇట కావ్యపథ మనఁబడి కావ్యమనగా వేదము కాన కావ్యపథ మనగా అది వేదచోదితమార్గమే యగును. అట్లు గాక లౌకిక కావ్యముల నిట గ్రహించుచో నవియు వేదచోదిత మార్గమున బ్రవర్తిల్లు నవియే యగును అందుచే వేదమార్గము గాక యా లౌకిక కావ్యములచే బ్రవర్తింపజేయబడు మార్గము వేఱొకటి గలదని చెప్ప వలను పడదు. కాన నిజ కావ్య పథము వేదచోదిత మార్గమనియే గ్రహింపనగును.

## వాగగ్రవిద్యా తతవతీ శ్రీః :-

మఱియు ప్రహ్లాదుడు ద్విజముఖమున శ్రవణము జేసి, వాగగ్రవిద్యా రసావలిప్తుడై (వాగగ్ర విద్యానాం రసానా మవలేపితా) తన జాతివారల నతిశయించి నట్లు చెప్పబడినది. ఈ వాగగ్రవిద్య లెవ్వి ? వాగగ్రవిద్య లనగా లౌకిక వాక్కుల (విద్యల) కంటె బూర్వమే సిద్ధమై యున్న విద్యలు. అవి వేదవిద్యలే యగును. వాగగ్ర శబ్దమునకు - లౌకిక వాక్కులు ప్రవర్తిల్లుటకు బూర్వము సిద్ధమై యున్న - అను నర్థము వైదిక సంప్రదాయ సిద్ధము.

"బృహస్పతే ప్రథమం వాచో అగ్రం యత్ప్రైరత
నామధేయం దధానాః । యదేషాంశ్రేష్ఠం యదరిప్రమాసీ
త్ప్రేణా త దేషాం నిహితం గుహావిః ॥

—ఋ. 10-71-1; ఐ. ఆ, 1-3-3-4.

ఇది పరమపురుషార్థ సాధనము, పరబ్రహ్మజ్ఞానస్తుతిపరము నగు సూక్తము. బృహస్పతి వేదార్థాభిజ్ఞు లయిన బాలకులను జూచి విస్మయపడి 'బృహస్పతే' యని స్వాత్మను సంబోధించుచు నిట్లు చెప్పుచున్నాడు.

"ఓ బృహస్పతీ ! ప్రథమమున - పుట్టిన తర్వాత ఇతరపదముల నుచ్చరించుటకు బూర్వము - పదార్థముల కా యా నామధేయములు బెట్టుటకు బూర్వము బాలురు 'తత', 'తాత', యని యేది యుచ్చరింతురో యది వాచో ఽగ్రము - వాగగ్రము అగును. అట్లుచ్చరించెడి దశయందున్న యీ బాలుర గాంచుము శ్రేష్ఠము, పాపరహితము (అరిప్రం)నై, నిగూఢముగ (గుహానిహితం) వీరియందున్న వేదార్థజ్ఞానము వేదాభ్యాస కాలమున ప్రేమచే (ప్రేణా) నావిర్భూతమగును. వేదాభ్యాసకాలమున సరస్వతి (వేదవాణి) స్వార్థమును వీరికి బ్రకాశింప జేయును (వేదాభ్యాసకాలే సరస్వతీ స్వార్థ మేభ్యః ప్రకాశయతీత్యర్థః - సా. భా.) - అని యర్థము.

పసితనమున మాటలు రాకపూర్వము బాలు రుచ్చరించు తత, తాతేత్యాది శబ్దములు 'తత్' శబ్దమున కుపలక్షకములై తచ్ఛబ్దవాచ్య పరమేశ్వర ప్రతిపాదకములు. కాన నా శబ్దములు 'వాగగ్రములు' అని శ్రుతితాత్పర్యము. ఐతరేయారణ్యకము నీ మంత్రమును వివరించుచు నీ పదముల నిట్లే వాగగ్రము లని పేర్కొనినది.

"ఏతాం వావ ప్రజాపతిః ప్రథమాం వాచం వ్యాహార దేకాక్షర
ద్వ్యక్షరాం తతేతి తాతేతి తథై వైత త్కుమారః
ప్రథమవాదీ వాచం వ్యాహర త్యేకాక్షర ద్వ్యక్షరాం తతేతి,
తస్యైవ త త్తతవత్యా వాచా ప్రతిపద్యతే। తదుక్త మృషిణా,
'బృహస్పతే ప్రథమం వాచో అగ్ర మితి।"

కాన 'తత - తాతే' త్యాది వాక్కులు వాగగ్రము లగుట శ్రుతిసంప్రదాయము. మరియు నీ వాక్కులను 'తతవతీ వాక్' అని ఐతరేయారణ్యకము నిర్దేశించుచున్నది. తత-తాత శబ్దములు 'తత్' శబ్దమున కుపలక్షకములు. కాన 'తత్'

శబ్దముతో నారంభ మయ్యెడి "త ది దాస భువనేషు జ్యేష్ఠమ్" (ఋ. 10-120-1; అ. సం. 5-2-1; సా. సం; 2-833; వా. సం. 33-80) ఇత్యాది వాక్కులు (మంత్రములు) తతవతీవాక్కులు.

వేదాభ్యాసమునకు మూల మగు గాయత్రియు 'తత్' శబ్దముతో నారంభ మగుచు తతవతీ వాక్కై యగుట గమనార్హము. ఇట్టి తతవతి యగు వేదవిద్యయే వాగగ్రవిద్య. ఇంతే కాదు.

తాండ్యబ్రాహ్మణము 'శ్రీ'కారమును వాగగ్రవిద్య యని యిట్లు చెప్పు చున్నది.

"శ్రీర్వై వాచోఽగ్రగ్ం శ్రియ మేవాస్మిన్ దధాతి"—6-9-12.
'వాచః అభివదనస్య య దగ్రం పురోభాగః స శ్రీ ర్వై
శ్రీ రేవ ఖలు, బహూనాం మధ్యే యస్య వాక్ ప్రథమం
ప్రవృత్తా స శోభతే। తథా సతి ఏతత్ పాఠేనాస్మిన్
యజమానే శ్రియ మేవ దధాతి' —సా. భా.

పలువురిమధ్య నెవడు మొదట మాటలాడునో యాతని వాక్కు వాచోఽగ్రము; అదియే మిగుల శోభించును. అట్టివాక్కుకు 'శ్రీః' అని పేరు.

లోకమున అందఱికంటె ముందుగా నెవ డేపని నైన నారంభించునో నట్టి వానిని జూచి 'దీనికి శ్రీకారము జుట్టిన దితడు' అని యనుట సంప్రదాయము. కాన 'శ్రీ'ని వాగగ్రముగ శ్రుతి పేర్కొనినది. 'సా హి శ్రీ రమృతా సతాం" అనుచు శ్రుతి ఋగ్యజుస్సామాత్మక మంత్రరాశిని, లేక త్రయీవిద్యను శ్రీః అని వ్యవహరించుట పూర్వము వివరింపబడినది. (చూ. త్రయీశబ్దము). లౌకిక విద్యలకు మూలమై, విజ్ఞానమునకు మొదట శ్రీకారము జుట్టిన వాగగ్రవిద్య శ్రీవిద్య లేక వేదవిద్యయే యగును.

అగ్రశబ్దమునకు 'పూర్వము' అనియే గాక 'చివర' యనియు నర్థము గలదు. 'వాక్ అనగా వేదము; వాగగ్రవిద్యలు ఉపనిషత్తులు' -అనియు జెప్ప నగును. అట్టి వేదములు కావ్యము లగు నని స్ఫురింప జేయుటకే పై ప్రహ్లాద. వచనములందు 'రస' పదముకూడ నుపయోగింప బడినది. (వాగగ్రవిద్యానాం రసానా మవలేపితా) కాన వేదకావ్య రసాస్వాదపరుడు - అని యర్థము. అట్టి ప్రహ్లాదుని దృష్టిలో కావ్యములు వేదములే యగును.

## బ్రాహ్మణముఖే కావ్యమ్[1] :-

ప్రహ్లాదు డా కావ్యమును బ్రస్తుతించిన విధము గనునర్థ. ము,

"ఏత త్పృథివ్యా మమృత మేత చ్చక్షు రను త్తమమ్।
యద్బ్రాహ్మణముఖే కావ్యమేత చ్ఛ్రుత్వా ప్రవ ర్తతే॥
ఏతావ చ్ఛ్రేయః"

'బ్రాహ్మణముఖే కావ్యమ్' అను పదములు - గురుశిష్య పరంపరా గతమై ఉచ్చారణానుచ్చారణ రూపమున బ్రాహ్మణముఖమున నిలిచియున్న కావ్యము అను నర్థమును స్ఫురింప జేయుచున్నవి. అట్లు బ్రాహ్మణ ముఖస్థమైన కావ్యము వేదమే యగును. వేదమునకు ముఖస్థత్వ నియమ మున్నట్లితర లౌకిక కావ్యము లకు ముఖస్థత్వ నియమము లేదు.

---

1. పై యింద్రప్రహ్లాద సంవాదము నందలి బ్రాహ్మణముఖే కావ్యమ్; కావ్యాని వదతాం తేషాం - ఇత్యాది స్థలములలో - 'కావ్యాని శుక్రప్రోక్తాని నీతి శాస్త్రాణి' అని మహాభారత వ్యాఖ్యాత నీలకంఠ పండితుని వివరణము గన్పట్టు చున్నది. ప్రహ్లాదుడు దైత్యరాజు. శుక్రుడు దైత్యగురువు. శుక్రునకు 'కవిః' అనియు, 'కావ్యః' అనియు నామములు గలవు. శుక్రుడు కవి గాన తత్ప్రోక్తము

మఱియు 'బ్రాహ్మణముఖే కావ్యమ్' అనగా బ్రాహ్మణప్రోక్తమైన కావ్య మని యర్థము. బ్రాహ్మణ ప్రోక్త మనగా వారిచే ప్రోక్త మగు చుండు నది మాత్రమే కాని వారిచే రచింపబడినది కాదని యర్థము. 'తేన ప్రోక్తమ్' (4-3-101) అను పాణిని సూత్రమును వివరించుచు పతంజలి మహర్షి యిట్లు 'ప్రోక్త' శబ్దార్థమును సోదాహరణముగ జెప్పినాడు.

"యత్ తేన ప్రోక్తం న చ తేన కృతం - మాధురీ వృత్తిః"

ఈ వృత్తి మాధురునిచే ప్రకాశింప జేయబడినది గాని రచింప బడలేదు కనుక 'మాధురీ వృత్తిః' అను రూపము సిద్ధించినది.

"యత్ తేన కృతం న చ తేన ప్రోక్తం వారరుచం కావ్యమ్"

ఈ కావ్యము వరరుచిచే రచింపబడినది. కాని ప్రకాశింప జేయబడలేదు అని యర్థము.

కాన బ్రాహ్మణముఖకావ్య మనగా బ్రాహ్మణులచే రచితము గాక, ప్రోక్తమగు కావ్యము-అనియే యర్థము. అట్టిది వేదమే యగుట సంప్రదాయము. ఇట్టి సంప్రదాయము లౌకికకావ్యమునకు లేదు.

లగు నీతిశాస్త్రములు కావ్యము లగు నని నీలకంఠపండితుని యభిప్రాయము గాన్న చ్చును. ఇంకను పై సంవాదము నందలి 'వాగగ్ర విద్యానాం' అను పద మిట్లు వివరింపబడినది. 'వాగగ్ర ఏవ న తు పుస్తకే విద్యా యేషాం తేషాం' - ముఖ స్థము లైన విద్యలు గలవారు అని యర్థము. ఈ యర్థము ననుసరించి 'వాగగ్ర విద్యానాం రసానా మవలేపితా' యను వాక్యమునకు వాగగ్రవిద్యలు గల ద్విజుల యొక్క రసముచే అవలిప్తుడు - అని యర్థము జెప్పవలసి యుండును. ద్విజుల రసముతో నవలిప్త డగుట యన నర్థమేమి - కాన ఈ నీలకంఠపండిత వాఖ్యాన మును సూక్ష్మదృష్టితో బరిశీలింపవలసి యుండును. వాగగ్ర విద్య యనగా వేద

ఇక పై శ్లోకమున కావ్యమునకు గల 'అమృతమ్; చక్షుః; అనుత్తమమ్' (న విద్యతే ఉత్తమం యస్మాత్ - సాటిలేనిది) - ఇత్యాది విశేషణములు వేదకావ్యమునకే చెల్లును గాని, తత్త్వతః లౌకికకావ్యమునకు జెల్లవు. ఇంకను, దీని శ్రవణము జేసి ప్రవర్తించుటయే శ్రేయస్సు. (ఏతచ్ఛ్రుత్వా ప్రవర్తతే ఏతావచ్ఛ్రేయః) అనియు జెప్పబడినది. శ్రవణ మనగా వేద వాక్యార్థ విచారము ద్వారా

విద్య లను నర్థము వైదిక సంప్రదాయానుగుణ మని పైన వివరింపబడినది. కావున వాగగ్రవిద్యనే వేదవిద్యచే గ్రహించుట యుచితము. అట్లు గ్రహించిననే - అమృతమ్; చక్షు రనుత్తమమ్; బ్రాహ్మణముఖే కావ్యమ్; ఏతచ్ఛ్రుత్వా ప్రవర్తతే; ఏతావచ్ఛ్రేయః — అని యీ రీతిగా ప్రహ్లాదునిచే జేయబడిన బ్రాహ్మణముఖ కావ్యప్రశంస తత్త్వతః ఉపపన్న మగును, 'పితృ దేవ మనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనమ్' పితృ దేవ మనుష్యులకు వేదము సనాతన మగు జ్ఞాననేత్రము. అని మనుస్మృతి కీర్తించినది నీతిశాస్త్రమునకు "చక్షుః" అని వ్యవహార మున్నది. కాని యది స్వతంత్రమై మార్గదర్శకము గాదు. వేదమార్గానుగతమై యదియు ప్రమాణ మగును. కాన వేదమే స్వతంత్రమై మార్గదర్శక మైన నేత్రము. నీలకంఠపండితుడు 'శుక్రప్రోక్తాని నీతిశాస్త్రాణి' యని వివరించినాడు. ఆ నీతిశాస్త్రములు పరంపరాగతములై శుక్ర ప్రోక్తములు - శుక్రునిచే ప్రకాశితములు గాని శుక్రరచితములు గావు - అని యర్థము. కాన నీలకంఠపండితుని 'నీతిశాస్త్రాణి' యను పదము పరంపరాగతము లైన వేదముల కుపలక్షములుగా గ్రహింపవలెను. అట్లు గాక కావ్యపదముచే శుక్రనీతి శాస్త్రమునే గ్రహించుచో 'స్వజాత్యా నధితిష్ఠామి నక్షత్రాణీవ చంద్రమాః' అను ప్రహ్లాదవచనము సుసంగతము కాదు. ప్రాయికముగా రాక్షసులందఱును శుక్రనీతిశాస్త్ర పరాయణులే. వారివలెనే ప్రహ్లాదుడును శుక్రనీతి శాస్త్రపరాయణుడు మాత్రమే యగుచో నితరులకంటె ప్రహ్లాదునియందు విశిష్టత యేమి? 'చుక్కలలో చంద్రునివలె నా జాతివారల నతిశయించుచున్నాను' అని చెప్పుట యెట్లు పొసగును? ఇతడు తన జాతివారలవలె గాక త్రయీవిద్యారసావలిప్తు డగుటయే ప్రహ్లాదుని యందలి విశిష్టత 'ప్రకావ్య ముశనేవ బ్రువాణః (ఋ. 9-97-7)' అనుచు ఋగ్వేదము 'శుక్రునిచే

వేదతాత్పర్యావధారణము. "శ్రోతవ్యో మంతవ్య" —ఇత్యాది స్థలము లందు శ్రవణ మన నీయర్థమే గ్రహింపబడినది. అట్టి శ్రవణముచే శ్రేయస్సు సిద్ధించుట వేదకావ్య శ్రవణ సంప్రదాయమునే తెలియజేయును. ఇట్టి సంప్రదాయము లౌకికకావ్య విషయమున లేదు.

ఇట్లు ఇంద్ర - ప్రహ్లాద సంవాదమున సాక్షాత్తు వేదపదము నుచ్చరింపక వేదస్వరూప స్వభావాదుల దెలియజేయు విశేషణాదులద్వారా వేదము యొక్క కావ్యత్వమును భంగ్యంతరముగ ప్రతిపాదించుట భారతము నందలి కాంతాసంమితత్వమునకు దార్కాణము.

కనుక వ్యాసమహర్షి భారతమునే గాక, వేదమును గూడ కావ్యమని వివరించుట స్పష్టము

అట్లు చెప్పుచో శాస్త్రేతిహాసముల కంటె కావ్యము విలక్షణమైనది యనెడి పూర్వోదాహృత పురాణవచనముల ననుసరించి వేదముగాని, భారతముగాని కావ్య మగుట యెట్లు? అను నాక్షేపము నిక పరిశీలింతము.

ప్రోక్త మగు కావ్యము వేదము' - అని తెల్పుచున్నది. కాన శుక్రుడు కేవలము నీతిశాస్త్ర కోవిదుడు మాత్రమేకాదు; నిఖిలామ్నాయ విధానకోవిదుడు. ప్రహ్లాదుని పౌత్రుడైన బలిచక్రవర్తియు శుక్రుని 'ఆమ్నాయ విధానకోవిదుడని కీర్తించినాడు. "జయన్తి యజ్ఞైః క్రతుభిర్యమాదృతాభవంత ఆమ్నాయ విధానకోవిదాః"

—భాగ. 8-20.

కావుననే దైత్య స్వభావసిద్ధ మైన బ్రాహ్మణద్వేషము ప్రహ్లాదునకు లేదు; అట్టి విశిష్టతయే త్రైలోక్యరాజ్యధురంధరత్వమునకు మూలకందమైన ప్రహ్లాదుని శీలమునకు ప్రధానకారణ మైనది. అందుచేతనే 'నాసూయామి ద్విజాన్ విప్ర రాజాఽ స్మీతి కదాచన' అని తొలుదొలుత ప్రహ్లాదుడు త్రయీవిద్యా రసాస్వాద కుశలుడు-అని నీలకంఠపండితుని తాత్పర్యము గ్రహించుట యుక్తము.

## వేదగత విలక్షణ కావ్యత్వము:-

శాస్త్రేతిహాసములకంటె కావ్యము విలక్షణ మైనదని యగ్నిపురా ణము చెప్పుటచే నాలంకారికులలో గొందఱు వేదశాస్త్రేతిహాసాదుల కంటె విలక్షణ కావ్యలక్షణమును బరిష్కరించు కొనిరి. అట్టి యాలంకారికుల దృష్టిలో వేదము పురాణేతిహాసములును కావ్యములు గాక పోవచ్చును. కాని వ్యాసమహర్షియే వేదములను కావ్యము లని కీర్తించుట వలన నవి లౌకికకావ్య విలక్షణము లగు కావ్యము లగుట వ్యాసాభిమత మని గుర్తింప నగును.

ఆలంకారికులలో గూడ నుద్భట మమ్మటాదులు వేదగత విలక్షణ కావ్యత్వమును గుర్తించియే యలంకారశాస్త్రమును బ్రవర్తింపజేసినట్లు గన్పట్టును. ఉద్భటుడు పూర్వకవి నమస్కార వ్యాజమున నీ విషయమునిట్లు వివరించుచున్నాడు.

"ఏకోఽభూ న్నలినా త్తత స్తు పులినా ద్వల్మీకత శ్చాపరః ।
తే ఏవ ప్రథితాః కవీంద్రగురవః తేభ్యో నమస్కుర్మహే ॥"

ఇట నుద్భటుడు బ్రహ్మ-వ్యాస-వాల్మీకులను కవీంద్రులకు గురువులనుగా గీర్తించి నమస్కరించినాడు. వీరు ముగ్గురు వరుసగా పద్మము, పులినము, పుట్టల నుండి యుద్భవించిరి. ఈ వర్ణనము ననుసరించి యాదికవి బ్రహ్మ, తన్ముఖము నుండి యుద్భవించిన యాదికావ్యము వేదము. తరువాత కవి వాల్మీకి ఆయననుండి వెలువడిన యాదికావ్యము రామాయణము. పిదప వెలసిన మహా కవి వ్యాసుడు. తన్ముఖ నిఃసృతమైన యాదికావ్యము పంచమవేద మన మగు మహాభారతము. ఇట్లు ఇవి పరస్పర విలక్షణములైన ఆదికావ్యములు. ఈ కావ్య ములేతర్వాత వెలసిన కావ్యములకు మార్గదర్శకము లయినవి. కనుక నివి లౌకిక కావ్య విలక్షణములు. అందును భారత-రామాయణములకు వేదము మార్గదర్శకము

కాన నీ రెండిటికంటె వేదము సర్వతో విలక్షణము. వేదము లపార పారావారములు. తత్పార్శ్వోద్భూతములై, తద్విలక్షణ మధురజలధారలతో బ్రవహించిన మహాస్రోతస్సులు రామాయణ-భారతములు. ఆ మహాస్రోతస్సులనుండి యేర్పడిన కుల్యలు రఘువంశాది కావ్యములు - అని చెప్ప నొప్పును. దీనినిబట్టి యీ కావ్యములకంటె భారతాదులు, వానికంటె వేదములు పరస్పర విలక్షణము లగుచు మత్తరోత్తరములకు బూర్వ పూర్వములు జీవనాధారము లగుట దెలియును.

వేదగత విలక్షణ కావ్యత్వ మింకొక తీరుగగూడ దర్శింపవలసి యున్నది. దానిని జూతము.

## వేదములు - కవులు :-

"సుపర్ణం విప్రాః కవయో వచోభి రేకం సంతం బహుధా కల్పయన్తి" — ఋ. 19-114-5.

మేధావులగు (విప్రాః) కవులు వివిధ స్తుతి లక్షణము లగు వాక్కులతో (వచోభిః) నొకే పరమాత్మను బహు ప్రకారముల గల్పించుచున్నారు — అని యర్థము. ఒకే పరమాత్మను ఇంద్ర మిత్ర వరుణాది బహు ప్రకారముల గల్పించెడి యీ కవులెవరు? ఒకవేళ మంత్రద్రష్ట లన్నచో, వారు పరమాత్మ నెట్లు దర్శించి వివరించిరి? వారిచే గూడ నట్లు తొలుదొలుత బహుప్రకారముల దర్శింప జేసినవి వేద మంత్రములే గదా! ఇవి యపౌరుషేయము లగుటచే నిట బేర్కొనబడిన కవులు వేదమంత్రములే యగును. వేదములే పరమాత్మ స్వరూపమును వివరించుటకై బహు కల్పనలతో భాసిల్లిన వని తాత్పర్యము. వేదములకు 'కవులు' అను ప్రసిద్ధి మహాభారతమున నిట్లు గలదు.

'వాచో వికారం కవయో వదన్తి' — భార. 5-44-31.

'కవయః వికారం వాచై వాస్తీతి వదన్తి; న స్వరూపేణా
స్తీత్యర్థః । తథాచ శ్రుతిః' – 'వాచారంభణ మితి' — నీలకంఠః.

'స్వభావతః (వాస్తవముగ) వికారము లేకపోయినను, వాక్కుచే వికార మున్నట్లు చెప్పుచున్నవి – యని కవులు చెప్పుచున్నారు. ఈ విషయమును 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికే త్యేవ సత్యమ్' అని శ్రుతి వివరించినది – అని పై వాక్యముల యర్థము. కాగా'వాచారంభణము వికారము' అని ప్రతిపాదించిన కవులు వేదములగుట జేసి యీ భారతవచనము నందలి కవులు వేదము లగుట స్పష్టము. 'వేదములు ఆద్యా ఋషయః' అని పూర్వము (ఋషి శబ్దమున) నిరూపింపబడినది. అందుచే ఆద్యఋషులే ఆద్య కవులు.

'ఏతే వై కవయః యద్ ఋషయః' — శ. బ్రా. 1-4-2-8

అనుచు ఋషి – కవి శబ్దములను సమానాధికరణములుగ శ్రుతి నిర్దేశించినది. కనుక వేదములు ఆద్యఋషు లగునట్లు ఆద్యకవులు నగును. లోకమున కవులు వేఱు; తద్రచిత కావ్యములు వేఱు. ఇట వేదములే కవులు; కావ్యము గూడ వేదమే. ఇదియు వేదకావ్యమున గల వైలక్షణ్యము.

## వేదకావ్యము - శ్రుతి ప్రసిద్ధిః-

శ్రుతియే తనను కావ్య మని పెక్కుచోటుల నిట్లు వ్యవహరించుకొనినది.

"అయం కృత్ను రగృభీతో విశ్వజి దుద్భి దిత్సోమః।
ఋషి ర్విప్రః కావ్యేన"—ఋ. 8–79-1; తై. బ్రా. 2-4-7-6.

ఋషియు మేధావియు నగు సోముడు (పరమేశ్వరుడు) కావ్యము (వేద మంత్రము) చే స్తుత్యు డగుచున్నాడు.

"అస్మా ఇత్ కావ్యం వచ ఉక్థ మింద్రాయ శస్యమ్"

— ఋ. 5-39-5.

వాగ్రూపము, కావ్యరూపము నగు నీ స్తోత్రము (మంత్రజాతము) ను ఇంద్రుని (పరమేశ్వరుని) కొఱకు శంసనము జేయవలెను.

"ఆత్మా యజ్ఞస్య రంహ్యా సుష్వాణః పవతే సుతః।
ప్రత్నం నిపాతి కావ్యమ్ ॥" — ఋ. 9-6-8; కాఠ. సం. 35-8.

ఈ మంత్రమున వేదకావ్య మతి పురాతనము (ప్రత్నం) కావ్యమ్ అనియుం, యజ్ఞమునకు ఆత్మభూతు (ఆత్మా యజ్ఞస్య) డగు సోముడు (సుతః=రసః ఈ పురాతన కావ్యమును రక్షించుచున్నట్లును కీర్తింపబడినది.

"ప్ర కావ్య ముశనేవ బ్రువాణో దేవో దేవానాం జనిమా
వివక్తి।" — ఋ. 9-77-7; సా. సం. 1-524; తా. బ్రా. 14-13.

దివ్యశక్తి సంపన్నుడగు స్తోత ఉశన (శుక్ర) ఋషివలె నీ కావ్యము (మంత్రము) నుచ్చరించుచు దివ్యమైన సోమరసము ఆ యా పాత్రల బ్రవేశించు నపుడు తత్తద్దేవతావిర్భావమును వివరించుచున్నాడు.

"శ్చోతంతి ధారా మధునో ఘృతస్య। వృషా యత్ర
వావృధే కావ్యేన" — ఋ. 3-1-8.

యజమానునిచే జేయబడెడి కావ్యముచే (మంత్రరూప స్తోత్రముచే) సంతుష్టు డగుచో నపు డగ్ని మధూదక ధారలు (వృష్టిధారలు) గురియును.

"యథా యజమాన స్తోత్రేణాగ్నిస్తుష్టో భవతి తదానీం వృష్టి ర్భవతీత్యర్థః సా. భా.

## వేదకావ్యము - శాశ్వత కవిసంబంధిత్వము :-

ని కావ్యా వేధసః శశ్వత స్కర్హస్తేదధానో నర్యా పురూణి।
అగ్ని ర్భువ ద్రయిపతీరయీణాం సత్రా చక్రాణో అమృతాని విశ్వా॥"
—ఋ. 1-72-1; తై.సం. 2-2-12-1.

ఈ మంత్రమున శాశ్వతు డగు బ్రహ్మకు సంబంధించిన కావ్యములను (మంత్రములను) అగ్ని నియమముగ స్వాభిముఖములను జేసికొను చున్నాడు- (శశ్వతః శాశ్వతస్య నిత్యస్య, వేధసః విధాతు ర్బ్రహ్మణః, సంబంధీని, కావ్యా కావ్యాని మంత్రరూపాణి స్తోత్రాణి, అయ మగ్నిః, నికః నియమేన స్వాత్మాభిముఖం కరోతి)- అని చెప్పబడినది.

ఇట గమనింప వలసిన విశేషము గలదు. కావ్యములు (వేద మంత్రములు) శాశ్వతు డగు బ్రహ్మకు సంబంధించినవి యని యిట నిర్దేశింపబడినవి. కాన శాశ్వత బ్రహ్మసంబంధిత్వము వేదకావ్యముయొక్క అసాధారణ లక్షణముగా గ్రహింప నగును. ఇంతే కాదు.

'సుపర్ణం విప్రాః కవయో వచోభి రేకం సంతం బహుధా కల్పయన్తి'

'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే'
'ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్యః స
సుపర్ణో గరుత్మాన్ । ఏకం స ద్విప్రా బహుధా వద
న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః'
'ఏష ఉ హ్యేవ సర్వే దేవాః'

ఇత్యాది శ్రుతివాక్య ప్రామాణ్యము ననుసరించియు, వి కాన్యా వేధసః- అను పై ఋక్కు ననుసరించియు, నా యా మంత్రములు స్థూలముగ అగ్ని ఇంద్ర, సోమ, వరుణాది వివిధ దేవతాప ములుగా గన్పట్టినను, ఆ మంత్రములను, తత్త ద్దేవతోపలక్షిత శాశ్వత బ్రహ్మ బోధకములుగ గ్రహించుట శ్రుతి తాత్పర్యము. 'మంత్రముల నన్నిటిని అగ్ని స్వాభి ముఖములుగ జేసికొనును' అని చెప్పబడుటచే యే దేవత నుద్దేశించి యే మంత్రము నుచ్చరించినను దానిని అగ్ని (పరమే శ్వరుడు) స్వాభిముఖముగ జేసికొనును - అను విషయము స్పష్ట మగుచున్నది. ఇట్లు అన్ని మంత్రములను, అందరి పదములను పరమేశ్వరు నుపలక్షింపజేయు ననుట సంప్రదాయము.

ఈ విషయము దేవీభాగవత- తద్వ్యాఖ్యానము లిట్లు వివరించుచున్నవి.

"స చాత్మా న పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే।
కృషి స్త ద్భక్తివచనో న శ్చ త ద్దాస్యవాచకః ॥
భక్తి ర్దాస్య ప్రదాతా యః స చ కృష్ణకీర్తితః ప్రః।
కృషిశ్చ సర్వవచనో నకారో బీజ మేవ చ॥
సకృష్ణః సర్వస్రష్టాఽఽదౌ సిసృక్షన్నేక ఏవ చ॥"

—దేవీ. భాగ. 9-2. 26

"కృష్ణ శబ్దో హి యోగరూఢ్యా గోలోకవాసి దేవతాయాం
రూఢః। కేవల యోగార్థ మాదాయ తు పరమాత్మని

ప్రయుక్తః । ఏవ మేవ సర్వేఽపి శబ్దా యోగరూఢ్యా త
త్తద్విశేష పదార్థ వాచకా అపి యోగార్థ మాదాయ సర్వే
బ్రహ్మవాచకా అపి భవ న్తీతి న దోషః" — నీలకంఠః

కృష్ణశబ్దము యోగరూఢి ననుసరించి గోలోకవాసి దేవతావాచకముగ రూఢమై యున్నది; కాని యీ పదమే యోగార్థముచే పరమాత్మ వాచకముగూడ నగుచుండును. ఇట్లే శబ్దము లన్నియు యోగరూఢిచేత నా యా విశేషపదార్థము లను బోధించుచునే యోగార్థముచే నన్నియు బ్రహ్మ వాచకములు గూడ నగు చుండును – అని యర్థము.

లౌకిక సంస్కృతమున 'యౌగికము – రూఢము – యోగరూఢము – యౌగిక రూఢము' – నవి యీ రీతిగ పదస్వరూపము ప్రసిద్ధము. ఇంచుమించుగ నిట్టి విభాగము శాస్త్రకర్త లందఱిచే నాదరింపబడినది. యౌగికార్థముతో నిమిత్తము లేకయే యా యా పదార్థముల బోధించెడి గో-మండలాది పదములు రూఢములు. లౌకిక వ్యవహారమున నింతియే. వైదికశబ్దము లట్టివి కావు; అవి యౌగికములు – యోగరూఢములు మాత్రమే – యని పై నీలకంఠ వైదిక సంప్రదాయ మును గుర్తింప జేయుచున్నది. (సర్వేఽపి శబ్దా యోగరూఢ్యా త త్తద్విశేష పదార్థవాచకా అపి యోగార్థ మాదాయ సర్వే బ్రహ్మవాచకా అపి భవంతి). పై శ్రుతి, స్మృతి తాత్పర్యమును ఉపమాన వ్యాజమున మహాకవియగు భారవియు తన కావ్యమున నిట్లు వివరించుచున్నాడు.

"సంస్కారవత్త్వా ద్రమయత్సు చేతః ప్రయోగ శిక్షా గుణభూషణేషు ।
ఆయం యథార్థేషు శరేషు పార్థః శబ్దేషు భావార్థ మివాశశంసే ॥"

— కిరాత. 17–6.

ఇట అర్జునుడు మాయాకిరాతునిపై (శివునిపై) ప్రయోగించెడి శరములు వేదశబ్దములతో పోల్చబడినవి. కావుననే, సంస్కృత వాక్కులకు గీర్వాణము

లనియు ప్రసిద్ధి. ఇట రెంటికి లక్ష్యము శివుడే. ప్రయోగ-శిక్షా-గుణ భూషితములు గానిచో శరములు లక్ష్యమును వేధింప నేరవు. అవి నామ పార్థశతను (శృణంతి హింసంతీతి శరాః) గోల్పోవును. వైదికశబ్దములు నట్టివే. అవి సామాన్యముగ నియతార్థమును (యథార్థాః-నియతార్థాః) గలిగియుండును. గో-అశ్వ--అగ్ని-ఇంద్రాది శబ్దములు ఆ యా విశేషార్థములనే బోధించుచుండును. అవియే ప్రయోగ శిక్షా గుణ భూషితములగు కాలది లోకోత్తరాహ్లాదజనక మగు భావార్థము (పరమార్థము)నుద్దీపింప జేయును.

వేదవిదుడు వేదశబ్దముల యందు పరమార్థ దర్శనరూప జయమును కాంక్షించునట్లు పార్థుడును తన శరములయందు కిరాతజయమును కాంక్షించెనని తాత్పర్యము.

కాగా వైదికశబ్దములు యోగరూఢములై నియతార్థముల బోధించునవి, యోగశక్తిచే భావార్థమును (పరమార్థమును) బోధించునవి యనెడి పై శ్రుతి స్మృతి సంప్రదాయమే యిట వివరింపబడె ననుట స్పష్టము. (చూ. భారతీశబ్దము).

ఇట్టి యీ సంప్రదాయము ననుసరించి వేద కావ్యమునందలి అగ్ని ఇంద్రాది శబ్దములు యోగరూఢిచే నా యా దేవతావిశేష వాచకములయ్యును యోగ శక్తిచే పరమేశ్వరవాచకము గూడ నగుచుండును. కాన శాశ్వత బ్రహ్మ సంబంధిత్వము వేదముయొక్క అసాధారణ లక్షణమగుట నిర్బాధము. ఇట్లు వేదమంత్రజాతము, తత్ప్రతిపాద్య యజ్ఞాదికర్మజాతము, తత్ర ద్దేవతోపాసనాదికము, సాక్షాత్తుగ నుపనిషత్కాండయు, నన్నియు శాశ్వత బ్రహ్మసంబంధము గలవి యగుచున్నవి. చరిత్రకారులు తలచునట్లు లౌకికార్థ నియతములు గావు. ఇంతే కాదు.

# పరమేశ్వరుడు కవి--కావ్యలక్షణము :-

మఱియు వేదములు పరమేశ్వరునుండి యభివ్యక్తము లగుట శ్రుతి సంప్రదాయము పరమేశ్వరాభివ్యక్తము లగుటచేతను గూడ నీ వేదకావ్యమునకు శాశ్వత బ్రహ్మ సంబంధిత్వ ముపపన్న మగుచున్నది. వేద కావ్యమును ప్రవర్తింప జేసిన పరమేశ్వరునకు శ్రుతి స్మృతులయందు కవియను ప్రసిద్ధి గలదు.

1. గణానాం త్వా గణపతిం హవామహే కవిం కవీనామ్ ।

— ఋ. 2-23-1.

2. అనంత మవ్యయం కవిమ్. — తై. ఆ 10-1-2.

3. కవి ర్మనీషీ పరిభూః స్వయంభూః — ఈశా. ఉ. 8

4. వేదో వేదవి దవ్యంగో వేదాంగో వేదవి త్కవిః —విష్ణు. సహస్ర

5. కవిం పురాణ మనుశాసితారమ్ — భ గీ.

6. పురాణస్య కవే స్తస్య — రఘు 10-36: కుమార, సం. 2-17.

ఇంతే కాదు. శ్రుతులందు అగ్ని, ఇంద్ర, సోమ, బృహస్పతి, శుక్ర, ఆదిత్యాది దేవతలను కవి శబ్దముచే బలుచోట్ల కీర్తింపబడినారు అందుచేత నే 'కవిం కవీనా ముపమశ్రవస్తమమ్' 'స కవిః కవీనాం' అనుచు పరమేశ్వరుని కవులలో కవిగా శ్రుతి ప్రశంసించినది. అట్టి కవినుండి యావిర్భవించుటచేతను, కవియగు పరమేశ్వరుని తత్త్వమును ప్రతిపాదించుటచేతను - ఇట్లు కవితో నిత్యసంబద్ధమై (శాశ్వత బ్రహ్మసంబద్ధమై) వెలయుటచే వేదమునకు కావ్యమని యన్వర్థనామము

కావుననే – 'కావ్యం ఛందః' - అను వాజసనేయ శ్రుతి వాక్యమును 'కవేః పరమాత్మన ఇదం కావ్యమ్ వేదత్రయీ రూపం ఛందః; త్రయీ విద్యా

కావ్యం ఛందః (శ. బ్రా. 8-5-2-4) ఇతి శ్రుతేః' - అని ఉవట మహీధరు లిరువురును వివరించిరి. కవియగు పరమాత్మకు సంబంధించినది యగుటచే వేదము కావ్యము - అని యర్థము 'కవేః పరమాత్మన ఇదం కావ్యమ్' - అను నీ కావ్యపద వ్యుత్పత్తియు వేదకావ్యమునకు 'కవి (పరమాత్మ) సంబంధిత్వము'ను నిరూపించుచున్నది. కాన కవియగు పరమాత్మనుండి యావిర్భూతమై, కవియగు నా పరమేశ్వరుని తత్త్వమును ప్రతిపాదించుట త్రయీవిద్యారూప ః కావ్యఛంద లక్షణము.

ఇంతేకాదు. శివేతరక్షతి ద్వారా పరనిర్వృతిని గలిగించి యమృతత్వ మును బ్రసాదించుట వేదకావ్యముయొక్క లక్షణము; ప్రయోజనము గూడ.

పశ్చాత్పురస్తా దధరా దుదక్తాత్ కవిః కావ్యేన పరిపాహి రాజన్ ।
సఖే సఖాయ మజరో జరిమ్ణే ఽగ్నే మర్తాగ్ం అమర్త్య స్త్వం నః ॥
— ఋ. 10-87-21.

ఓ రాజా ! క్రాంతదర్శనుడవై కవివగు నీవు నీ కావ్యముతో (కవి కర్మయగు వేదకావ్యముతో) నలువైపుల యుపద్రవములనుండి కాపాడుము. సఖుడా ! నీవు జరారహితుడవు. నీతోడను, వేదకావ్యముతోడను, సఖ్యమొనర్చుచు సఖుడనైన నన్ను గూడ జరారహితుని గావింపుము. ఓ యగ్నీ ! నీ వమర్త్యు డవు. మర్త్యులమగు మమ్ము నమర్త్యుల గావింపుము - అని యర్థము.

ఈ మంత్రమున కావ్యమనగా కవికర్మ యని వివరింపబడినది. 'కవేః కర్మ కావ్యమ్' - అనియు నిర్వచనము ప్రసిద్ధము. ఇట నలువైపుల యుప ద్రవముల నిర్మూలించుటచే శివేతరక్షతియు, కవి యగు పరమేశ్వరునితోను, వేద కావ్యముతోను సఖ్యము జేయుకొనుటచే పరనిర్వృతియు, తన్మూలమున జరామరణ ప్రవాహరూప సంసార నివృత్తియు సిద్ధించును; ఇదియే వేదకావ్యమువలన సిద్ధించెడి యమృతత్వము. ఇట్లు శివేతరక్షతిని, పరనిర్వృతిని (అమృతత్వము) గల్గించుట

త్రయీవిద్యారూప ఛందః కావ్య ప్రయోజనము. వేదకావ్యము నాదరించుటవలన గలిగెడి ప్రయోజనముల నింకను ఋగ్వేద మిట్లు చెప్పుచున్నది.

"యః సమిధా య ఆహుతీ యో వేదేన దదాశ మర్తో
అగ్నయే। యోనమసా స్వధ్వరః ॥"
"త స్యే' దర్వన్తో రంహయన్త ఆశవ స్తస్య ద్యుమ్నితమం యశః।
న త మంహో దేవకృతం కుతశ్చన న మర్త్యకృతం నశత్॥"

— ఋ 8–19–5. ఆ.

సమిధలతో, ఆహుతులతో, వేదము (వేదాధ్యయనముతో)తో, యజ్ఞాదులందు చరుపురోడాశాదులతో నెవ డగ్నిని సేవించునో యాతని యింద్రియములు (ఆశవః అర్వన్తః) తీక్ష్ణము లగును; ఐశ్వర్యవంతుడై యశస్సును (ద్యుమ్నితమం యశః) గాంచును. దేవ మనుష్య కృత పాపముల - బొందడు అని యర్థము.

వేదవిదు డగువాడు సభలలో శోభించును; ఆతనితోడి వాదమునకు వెఱతురు (నైనం హిన్వన్త్యపి వాజినేషు - ఋ 10–71–5; నిరు. 1–20) అని పూర్వము వివరింపబడినది. కాన వేదాధ్యయనాదుల ద్వారా వేదమును బరిచరించుచో నింద్రియదీప్తి, యశఃప్రాప్తి, పాపనివృత్తి మున్నగు ప్రయోజనములు ప్రాప్తించు నని పై మంత్రము వలన దెలితయును.

కావ్యం యశ సే ऽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాంతాసంమితత యోపదేశయుజే॥

అనుచు నాలంకారికులును - యశస్సు, అర్థప్తి ప్రా, వ్యవహారవిజ్ఞానములతో శివేతరక్షతి, సద్యఃపరనిర్వృతియు కావ్యప్రయోజనము లని పేర్కొనిరి. అందును సదఃపరనిర్వృతియే కావ్యముయొక్క పరమ ప్రయోజన మని మమ్మటాదులు పేర్కొనిరి. కాన అలంకారికులు చెప్పిన కావ్యప్రయోజనము శ్రుతిసంప్రదాయానుగుణ మగుట స్పష్టము.

# వేదకావ్యలక్షణము : ఆలంకారికులు :_

పైన పేర్కొనిన వేదకావ్యలక్షణము (కవే రిదం కావ్యమ్)ను ఆలంకారికులును, మహాకవులును, నచటచట వాగ్దేవతాస్తోత్ర వ్యాజమున భాసింపజేయు టయు గమనార్హము.

"నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రామ్।
నవరసరుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి॥" —కావ్యప్రకాశ.

కావ్యప్రకాశకర్త యగు మమ్మటుడు గ్రంథారంభమున నీ శ్లోకముతో వాగ్దేవతా నమస్కారరూప మంగళ మాచరించినాడు. అందు బ్రహ్మసృష్టి కంటె కవిభారతి యుందలి వైలక్షణ్యము నీ కవి దర్శింపజేయుచున్నట్లు లౌకిక కవిభారతీ పరముగ వ్యాఖ్యాత లీ శ్లోకము నిట్లు వివరించిరి.

'లౌకికకవి యొక్క భారతి ప్రకృతినియమమునం కతీతమైనది. బ్రహ్మ సృష్టియగు ప్రకృతి యందు పద్మమునకు సౌరభము నియతమై యుండును; పద్మ మున్నచో గంధ ముండవలెను - ఇది నియతికృత నియమము; కవిసృష్టి యగు ముఖపద్మమునకు లోకసిద్ధ సౌరభముతో పని లేదు; అది కవిప్రతిభా కల్పిత సౌరభ విశేషముచే విరాజిల్లును; కవి సృష్టి యిట్లు నియతికృత నియమరహితము. బ్రహ్మ సృష్టి నియతముగ సుఖదుఃఖ మోహస్వరూపము; పరమాణ్వాది కారణపర తంత్రము; కట్వామ్లాది షడ్రసమయము; కవిసృష్టి యట్లు గాదు. అది ఆనందైక మయము; కేవల కవిప్రతిభాసిద్ధ మగుట జేసి యనన్య పరతంత్రము; శృంగా

రాది నవరసోజ్జ్వలము. ఇట్లు బ్రహ్మసృష్టికంటె విలక్షణమై కవిసృష్టి యొప్పా రును' —అని వ్యాఖ్యాతల యభిప్రాయము.

కాని పై శ్లోకమును బరిశీలించిన నందలి విశేషణములు తత్త్వతః కవిభా రతి - కవి యగు పరమేశ్వరునినుండి యావిర్భవించిన భారతి-యగువేదకావ్యమునకే చెల్లును. ఏలయన—

## నియతికృత నియమరహితా - అనన్యపరతంత్రా :

(1) ఆ భారతి (వేదము) నియతికృత నియమరహితము. లౌకికకావ్య మున కట్లు గాదు. దానికి కర్త యొకఁ డుండవలెను. కవి వేఱు; తద్రచిత కావ్యము వేఱు. వేద మట్లు గాదు. అదియే కవియు కావ్యము గూడ.

(2) లౌకికకావ్యము శబ్దానుశాసనాది శాస్త్రనియమ పరతంత్రము; ఇది నియతికృత నియమము. వేదకావ్య మట్టిది కాదు. అమెయే నియతి. ఆమెయే లౌకికవ్యవహారమునకు, లౌకికకావ్యములకును; శబ్దానుశాసనాదులకును నందు వాఙ్మయమును నియమపూర్వక సంప్రదాయముల నను(గ్రహించినది. 'ఛందోవ త్కవయః కుర్వన్తి; ఛందోవ దృషయః కుర్వన్తి' అని యనుచు పతంజలిమహర్షి కవులకును, ఋషులకును 'సంప్రదాయానుగ్రాహకము వేదమే' యను విషయము నభివ్యక్తము జేసినాడు.

అనాది నిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా।
ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః ॥

నామరూపే చ భూతానాం కర్మణాం చ ప్రవర్తనమ్ ।
వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః ॥

సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్పృథక్ ।
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథ క్సంస్థా శ్చ నిర్మమే ॥ —మనుస్మృతి.

ఇట్లు స్మృతులును వేదములయొక్క అనన్య పరతంత్రత్వమును, తదితరమగు లోకవ్యవహారమునకు వేదపరతంత్రత్వమును వివరించుచున్నవి.

"జనానాం సౌభాగ్యం సుఖ మమృతరూపం కలయితుం
పురాణానాం వ్రాతం స్మృతిశత మమీ కావ్యనివహాః ।
యత స్త్వాం సర్వజ్ఞాం ఖలు సమనుయంతి ప్రతిపదం
తతః స మాజ్ఞీ త్వం భువి విజయసే ఽనన్యవిభవా॥"

—వేదమాతృ స్తవః.

పై ప్రమాణముల వలన కవిభారతి యగు వేదము అనన్యపరతంత్రము. నియతికృత నియమరహితము అని కీర్తింపబడుట యుక్తమే.

## హ్లాదైకమయీ :—

బ్రహ్మసృష్టి నియతముగా సుఖదుఃఖ మోహస్వరూపము; లౌకిక కవిభారతి యట్లు గాక 'ఆనందైకమయము' - అని చెప్పబడినది. లౌకిక కావ్యములు ఆనందస్ఫూర్తిని కలిగించుట నిజమే. కాని ఆ యానందము తత్కాల మాత్ర పర్యాప్తము. అది యలౌకిక విభావాది సామగ్రీ సముల్లసితరత్యాది సంవలితమై భాసించు నని చెప్పబడుట జేసి విషయానందమే యగును. వేదకావ్యమును జాతము. ఇది జిజ్ఞాసువుల దృష్టిని సుఖదుఃఖ మోహస్వరూప ప్రకృతినుండి శాశ్వత బ్రహ్మానందము పైపు మరల్చుటకై యవతరించినది. తైత్తిరీయ శ్రుతి 'సైషా ఽఽనందస్యమీమాగ్ంసా భవతి' యనుచు ఆనందమీమాంస జేసినది అందు ప్రాకృతజనులు పొందెడి యానందముకంటె సార్వభౌమానందము

ఉత్కృష్టము. దానికి మానుషానంద మని పేరు - 'స ఏకో మానుష ఆనందః' దానికంటె మనుష్యగంధర్వుల యానందము నూఱురెట్లు ఉత్కృష్టము. ఇట్లు దేవ. గంధర్వ — పితృలోక - ఆజానజదేవ -కర్మదేవ -దేవ-ఇంద్ర-బృహస్పతి-ప్రజాపతి (విరాట్టు) - బ్రహ్మ (హిరణ్యగర్భుడు) లయొక్క యానందములు క్రమముగ శతగుణోత్తరోత్తరోత్కర్ష గలవి యని శ్రుతి వివరించినది. ఆ యానందము లన్నియు, తుదకు హిరణ్యగర్భానందము కూడ కామోపహతుడుగాని - రాగద్వేష వర్జితు డగు శ్రోత్రియుడు పొందెడి యానందముకంటె మిన్న గావు — (శ్రోత్రియస్య చాకామహతస్య) అని యుపసంహారము జేసినది. శ్రోత్రియు డనగా నియమపూర్వకముగ ఫలపదార్థావబోధ పర్యన్తము వేదాధ్యయనము జేసిన యతడు.

ప్రాణిని మహర్షియు 'శ్రోతియ శ్ఛందోఽధీతే' యను సూత్రముచే శ్రోత్రియస్వరూపము నిట్లే వివరించినాడు.

"యచ్చ కామసుఖంలోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్।
తృష్ణా క్షయ సుఖ స్యైతేనార్హతః షోడశీం కలామ్॥"

అనుచు స్మృతులును తృష్ణా క్షయ సుఖమున కే సుఖముగూడ సాటిరాదని జెప్పినవి. ఈ యానంద ముపాధిభేదముచే భిన్నముగా గన్పట్టును గాని వాస్తవమున కొకటియే యను విషయమును 'స యశ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే స ఏకః" అనుచు శ్రుతి వివరించినది. అట్టి యానందమే జిజ్ఞాస్యము; జ్ఞేయము కామోపహతుడుగాని శ్రోత్రియుడు-తత్త్వజ్ఞాని-పొందెడి యానంద మిదియే. శ్రుతియు 'యే విద్వాగ్ంస స్తే కవయః'(వా. సం. 1?-67; శ.బ్రా. 7-2-2-4) 'శుశ్రువాగ్ంసో హి కవయః' (తై.బ్రా. 3-2-2-3) అని యనుచు నట్టి రమణీయార్థమును ప్రతిపాదించెడి దగుటచే వేదవాక్కు తత్త్వతః హ్లాదైకమయి యగు కవిభారతి— యన జెల్లును. మఱియు లౌకికకావ్యముచే గలిగెడి యానందమే గాదు, హిరణ్యగర్భానందము గూడ నా యానందము యొక్క లేశమే యనియు శ్రుతి వివరించినది.

'ఏషో ఉస్య పరమ ఆనంద ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి' -

ఆనందము యొక్క లేశమును స్ఫురింపజేయుట చేతనే లౌకిక కవి భారతి "హ్లాదైకమయీ" అని కీర్తింపబడుచో పూర్ణ రసానందస్ఫూర్తిని గలిగించెడి వేదవాక్కు హ్లాదైకమయి యగు కవిభారతి యగుట నిర్బాధము.

## నవరసరుచిరా :-

ప్రకృతి కట్వామ్లాది షడ్రసమయము ; కవిభారతి యట్లుగాక శృంగారాది నవరసోజ్జ్వలము-అని చెప్పబడినది. లౌకిక కవిభారతి పరముగ జెప్పుచో నంతియే. లౌకిక-కావ్య లక్షణముల నిర్దేశించుటకై కావ్యప్రకాశికా గ్రంథమును బ్రవర్తింపజేయుచు గ్రంథకర్తచే జేయబడిన యాదిమ మంగళశ్లోక మిది అందు బ్రహ్మ సృష్టి కంటె లౌకిక కవిభారతి యొక్క యుత్కర్ష జెప్పుటయే కవి తాత్పర్య మగుచో నది వాగ్దేవతాస్తోత్ర మనుటకు వీలులేదు. అట్టియెడ గ్రంథాది, మంగళశ్లోకము గానేరదు. ఈశ్లోకముచే లౌకిక కవిభారతీ వైశిష్ట్యస్ఫూర్తి గలిగిన గలుగ వచ్చును. కాని లౌకిక కవిభారతికి ప్రేరయిత్రి యగు వాగ్దేవత లేక వేదవాణి 'నవ రసరుచిరా'-నిత్య నిరతిశయ పూర్ణ రసానందోజ్జ్వలయను నర్థస్ఫూర్తిని గలిగించి, యామె సర్వోత్కృష్టమును గీర్తించు మంగళశ్లోక మనుట యందే కవిసరంభ విశ్రాన్తి యన నగును. అట్లు రెండర్థములు స్ఫురించుటకే, మమ్మటుడు సామాన్యముగ 'భారతీ కవేర్జయతి' యనినాడు. కవిభారతి యన లౌకికకవిభారతియు, కవియగు పరమాత్మయొక్క భారతియు గావచ్చును. అట్టి యెడ నీ మంగళశ్లోక మప్రయత్నముగా 'కవేః ఇదం కావ్యమ్' అనెడి వేద కావ్యలక్షణమును స్పష్టముగా భాసింపజేయుట సహృదయ హృదయాభిమతము'

# వేదకావ్య లక్షణము -మహాకవులు :-

భవభూతి మహాకవియు ఉత్తరరామచరితనాటక-ఆది మంగళ శ్లోకమున పై వేదకావ్యలక్షణమునిట్లు స్ఫురింప జేసినాడు.

"ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే ।
వందేమహి చ తాం వాణీ మమృతా మాత్మనః కలామ్ ॥"

ఈ శ్లోకమున నిర్దేశింపబడిన పూర్వకవులు ఎవరు ?

వ్యాసవాల్మీకాదులని వ్యాఖ్యాతలు కొందఱు వివరించిరి. కాని మొదట లౌకిక కవులకు నమస్కరించి, వారల గూడ ననుగ్రహించెడి యమృత కలా స్వరూపిణి యగు వాగ్దేవతకు (వేదవాణికి) నమస్కరించుట సంప్రదాయముగాదని ఘనశ్యామాది వ్యాఖ్యాతల యభిప్రాయము. వ్యాస వాల్మీకాది మహాకవులకంటెను పూర్వకవులు వైదికకవులే యని యిట్లు వ్యాఖ్యానించిరి.

'పూర్వేభ్యః పురాతనేభ్యః అలౌకికేభ్య ఇత్యర్థః; వైదికేభ్య
ఇతి యావత్, వేదానాం లోకపూర్వత్వా దితి భావః ।
కవిభ్యః గణపతయే ఇత్యర్థః, గణపతిం హవామహే
కవిం కవీనా మితి శ్రుతేః, కవిః శుక్ర గజాననా వితి జయః।
బహువచనం తు పూజాయామ్'—ఘనశ్యామ టీక

కాన నిట పేర్కొనబడిన పూర్వకవులు వైదికకవులే.కాని యిట ఘనశ్యామ టీకయందు లౌకికకవులకంటె పూర్వు లగు వైదికకవులనే గ్రహింపవలె నని చెప్పి య వైదికకవి గణపతి; బహువచనము పూజార్థము-అని వివరింపబడినది బహుశాః కావ్యరూపము లగు వేదమంత్రములకు 'కవులు' అను ప్రసిద్ధి యెట్లని

తలచి వేదమంత్ర ప్రవర్తకుడగు నా బ్రహ్మణస్పతినే పూర్వకవిగా గ్రహించి యుండవచ్చును. కాని యా పక్షమున 'కవిభ్యః - పూర్వేభ్యః' అను బహు వచనము సార్థకము కాదు. కనుక బహువచన స్వారస్యముచే వేదమంత్రములనే పూర్వకవులుగా గ్రహించుట యుక్తతరము. వేదమంత్రములు కవులగుట పూర్వము వివరింపబడినది.

మఱియొక విశేషము. ఈ శ్లోకము మొదటి పాదమున 'కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే' అనిన చాలును గదా! ఇదం శబ్దం ఎందుకు? దానిచే గ్రంథాది మంగళశ్లోకమున కవి యుద్దేశించిన ప్రయోజనమేమి? యని పరిశీలించిన నా శబ్దమున కెట్టి ప్రత్యేక ప్రయోజన మున్నటుల వ్యాఖ్యాతలు వివరింపలేదు. కావి యా శబ్ద ప్రయోగ మచట నిష్ప్రయోజనమా? కాదు. సూక్ష్మముగా బరిశీలించుచో నట్లు 'ఇదం' శబ్దపూర్వక నమస్కారాచరణము వేద సంప్రదాయానుగుణ మగుట దెలియును.

'ఇదం నమో వృషభాయ స్వరాజే'

— ఋ. 15-51-15; మై సం. 4-14-14.

'ఇదం నమో రుద్రాయ ప్రేష్ఠమ్' — ఋ. 7-36-5.

'ఇదం నమో దేవేభ్యః' — మై. సం. 4-13-9; 212-13.

'ఇదం నమో దేవేభ్యః' — తై. సం. 2-6-9-8, శ. బ్రా. 1-9. 1-25; తై. బ్రా. 3-5-10-5.

పై మంత్రములందు 'ఇదం' శబ్ద పూర్వక నమస్కారాచరణము గావ నగును. ఇంతే గాదు.

'ఇదం నమ ఋషిభ్యః పూర్వజేభ్యః పూర్వేభ్యః పథికృద్భ్యః'

— ఋ. 10-14-15; అ. సం. 18-2-2; తై. ఆ. 6-1-5

ఈ మంత్రముయొక్క ప్రతిరూపమే – ఇదం కవిభ్యః పూర్వేభ్యః— అనెడి భవభూతి మహాకవి వాక్య మనవచ్చును. ఆ శ్రుతివాక్యమే కొలది మార్పులతో నిట శ్లోకముగా రూపొందినది యని స్ఫూర్తి కలిగించుటకే యా కవి మొదట 'ఇదం' శబ్దమును నిలిపి యుంచుట యని తెలియనగును. కాని యందలి 'ఇదం నమః' అనునది యిందలి 'ఇదం నమోవాకం' అని రూపొందినది. అందలి పూర్వ ఋషులిచట పూర్వకవు లైనారు. ఈ శ్రుతి వాక్యము నందలి పూర్వ ఋషులెవరు ?

పై మంత్రము నందలి పూర్వఋషులకు 'పూర్వజేభ్యః, పూర్వేభ్యః పథికృద్భ్యః' అను విశేషణములును గలవు. 'సృష్ట్యాదా వుత్పన్నేభ్యః అతఏవ పూర్వేభ్యః' పథికృద్భ్యః శోభనమార్గకారిభ్యః ఋషిభ్యః, ఇదం ప్రత్యక్షం యథా భవతి తథా నమః అస్తు' – అని సాయణభాష్యము. సృష్ట్యాదియందు ఉత్పన్నులు గావుననే పూర్వఋషులు అని యర్థము. సృష్ట్యాదియం దావిర్భూతులైన యావ్య ఋషులు మంత్రద్రష్టలు గావచ్చును. వారి ంచెను పూర్వఋషులు వేదమంత్రములు. అట్టి పూర్వ ఋషు లగు వేదమంత్రములు సృష్ట్యాదియందు మంత్రద్రష్టల తపః సమాధిలో నావిర్భూతము లయినవి. (చూ. ఋషి, ప్రథమజా శబ్దములు). అట్లు త్పన్నములై యధికారిభేదము ననుసరించి జిజ్ఞాసువులకు శోభన మార్గ దర్శకము లగుచు న్నవి. అందుచే 'పథికృద్భ్యః' అనియు గీర్తింపబడినవి. కాన నీ శ్లోకమున గీర్తింపబడిన పూర్వకవులు శ్రుతి వాక్యోద్దిష్ట పూర్వఋషులగు వేదమంత్రములు- అని గ్రహించుట యుక్తము. కాన 'యిదం నమః' అనునది వేద సంప్రదాయానుగుణము.1

1. ఇట్టి సంప్రదాయమును తరువాత ఇతిహాసములును అనుసరించినవి.
"విశ్వోద్భవ స్థితి లయేషు నిమిత్త లీలారాసాయ తేనమ ఇదం చకృమేశ్వరాయ" —భా.గ. 3-9-14.
"తస్మా ఇదం భగవతే నమ ఇ ద్విధేమ" భా.గ. 3-15-50.

## ఆత్మనః కలా :-

ఇట్లు భవభూతి యీ శ్లోకము మొదటిపాదమున వేదవాణిని' మంత్రవర్ణాత్మికగా మొదట కీర్తించి తరువాత నా వాణిని పరమేశ్వరిగా 'తాం వాణీం' అని తచ్ఛబ్దముచే పరామర్శించి - ఆత్మనః కలామ్ - ఆత్మకలాస్వరూపిణి - యని కీర్తించి నమస్కరించినాడు. వాణి యొక్క కళ యనుచో బైన జెప్పిన' కవేః పరమాత్మన ఇదం కావ్యమ్' అనెడి వేదకావ్యలక్షణము యొక్క స్ఫూర్తి గలుగు చునే యున్నది.

ఇంతే కాదు, మహాకవి యగు భారవియు నింద్రవాక్య ప్రశంసా వ్యాజమున వేదవాక్కుయొక్క లక్షణముల నిట్లు వివరించినాడు.

ప్రసాదరమ్య మోజస్వి గరీయో లాఘవాన్వితమ్।
సాకాంక్ష మనుపస్కారం విష్వగ్గతి నిరాకులమ్॥
న్యాయనిర్ణీతసారత్వా న్నిరపేక్ష మివాగమే।
అప్రకంప్యతయాన్యేషా మామ్నాయ వచనోపమమ్॥

—కిరాతార్జునీయమ్. 11-38, 39.

ఇంద్రవాక్యమువలె ఆమ్నాయవచనము ప్రసాదరమ్యము, ఓజోగుణ యుక్తము; అర్థగాంభీర్య విలసితము (శబ్దాడంబరము లేక యర్థవత్తరము); లాఘవాన్వితము (విస్తరదోష రహితము); విష్వగ్గతి (శతపథమై కృత్స్నార్థ ప్రతిపాదకము); నిరాకులము (అసంకీర్ణార్థ ప్రతిపాదకము); మీమాంసా న్యాయములచే నిర్ణీతమైన యర్థముతో నొప్పి స్వతంత్ర మైనది; కావుననే యనుమానాది ప్రమాణములకు చంపనిది - అని యర్థము.

త్రయీవిద్యారూప ఛందః కావ్య ప్రయోజనము. వేదకావ్యము నాదరించుటవలన గలిగెడి ప్రయోజనముల నింకను ఋగ్వేద మిట్లు చెప్పుచున్నది.

"యః సమిధా య ఆహుతీ యో వేదేన దదాశ మర్తో
అగ్నయే। యోనమసా స్వధ్వరః॥"
"త స్యే దర్వన్తో రంహయన్త ఆశవ స్తస్య ద్యుమ్నితమం యశః।
న త మంహో దేవకృతం కుతశ్చన న మర్త్యకృతం నశత్॥"

— ఋ 8–19–5. ఆ.

సమిధలతో, ఆహుతులతో, వేదము (వేదాధ్యయనముతో)తో, యజ్ఞాదు లందు చరుపురోడాశాదులతో నెవ డగ్నిని సేవించునో యాతని యింద్రియములు (ఆశవః అర్వన్తః) తీక్ష్ణము లగును; ఐశ్వర్యవంతుడై యశస్సును (ద్యుమ్నితమం యశః) గాంచును. దేవ మనుష్య కృత పాపముల - బొందడు అని యర్థము.

వేదవిదు డగువాడు సభలలో శోభించును; ఆతనితోడి వాదమునకు వెఱతురు (నైనం హిన్వన్త్యపి వాజినేషు - ఋ 10–71–5; నిరు. 1–20) అని పూర్వము వివరింపబడినది. కాన వేదాధ్యయనాదుల ద్వారా వేదమును బరిచరించుచో నింద్రియదీప్తి, యశఃప్రాప్తి, పాపనివృత్తి మున్నగు ప్రయోజనములు ప్రాప్తించు నని పై మంత్రము వలన దెలియును.

కావ్యం యశసే ఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాంతాసంమితత యోపదేశయుజే॥

అనుచు నాలంకారికులును - యశస్సు, అర్థప్రాప్తి, వ్యవహారవిజ్ఞానము లతో శివేతరక్షతి, సద్యఃపరనిర్వృతియు కావ్యప్రయోజనము లని పేర్కొనిరి. అందును సదఃపరనిర్వృతియే కావ్యముయొక్క పరమ ప్రయోజన మని మమ్మటాదులు పేర్కొనిరి. కాన ఆలంకారికులు చెప్పిన కావ్యప్రయోజనము శ్రుతిసంప్రదాయాను గుణ మగుట స్పష్టము.

అంతః కవయో విచక్షతే' 'తాం ద్యోతమానాగ్ం స్వర్యం
మనీషాం, 'ఋతస్య పదేకవయోనిపాంతి'

—తై. ఆ. 3-11; ఋ, 10-177-1-2, (చూ. స్వధాశబ్దము. స్వర్యా)

పై శ్రుతివాక్యముల వలన ఆత్మవిదులు కవులు, వారు వేదకావ్య రసాస్వాదము జేయుగలవా రని స్పష్ట మగును. ఈ విషయమునే శ్రీ మద్ భాగవతము నిట్లు చెప్పుచున్నది.

"శాబ్దస్య హి బ్రహ్మణ ఏష పంథా య న్నామభి ర్ధ్యాయతి ధీ రపార్థైః
పరిభ్రమం స్తత్ర న విందతేఽర్థాన్ మాయామయే వానపయా శయానః॥
తతః కవి ర్నామసు యావ దర్థః స్యా దప్రమత్తో వ్యవసాయబుద్ధిః
సిద్ధే ఽన్యధార్థే న యతేత తత్ర పరిశ్రమం తత్ర సమీక్షమాణః॥"

—భాగ. 2-2, 2,3.

కవి గానియతడు శబ్ద బ్రహ్మరూపవేద వాక్యములకపార్థముల గల్పించుకొని మాయావాసనా జాలమున జిక్కుకొనును; ఆ యర్థములనే సదా భావనజేయుచు బరిభ్రమించుచుండును; కాని పురుషార్థముల నొందలేడు; పిదప కవి యగు విద్వాంసుడు వేదశబ్ద నిహిత యావదర్థము నప్రమత్తతతో నిశ్చయించును; అపార్థముల భావనజేయుట వృథాశ్రమ యని గుర్తించి వానివైపు పోడు - అని యర్థము.

ఇట్లు శ్రుతిస్మృతులయందు కవియే వేదశబ్దార్థము (వాచో వీర్యం) నప్రమత్తతతో నిశ్చయించి నిర్వృతి నొందుచుండు నని చెప్పబడినది. కాని యీ కవి యెవరు ? వేదవిహిత కర్మానుష్ఠానముచే జిత్తశుద్ధి నొంది సాధన చతుష్టయ సంపన్నుడై, గురూపదేశానుసారము వేదకావ్యములతో జెలిమి చేయుచు తదర్థభావన జేయు మహాభక్తు డగు విద్వాంసుడే - క్రాంతదర్శియే - కవి. అట్టి యతడే వేదకావ్య రసాస్వాదపరు డగుట (వాగగ్ర విద్యానాం రసానా మవలేపితా) ఇంద్ర ప్రహ్లాద సంవాదమున స్పష్టమైనది. ప్రహ్లాద నారద పరాశరాదు లట్టివారు.

"య మంతః సముద్రే కవయో యవన్తి, త దేవ బ్రహ్మా
పరమం కవీనామ్" —తై. ఆ 10-1-1.

"ఋగ్భి రేతం యజుర్భి రంతరిక్షం సామభి ర్యత్త త్కవయో
వేదయన్తే" —ప్రశ్న. ఉ. 5-2.

ఇత్యాది శ్రుతులు అధ్యాత్మ తత్త్వవిదులు కవు లని చెప్పుచున్నవి.

భాగవతముగూడ అధ్యాత్మ తత్త్వవిదుని కవిగా నిట్లు పేర్కొనుచున్నారు.

"అహం భవా న్నచాన్య స్త్వం త్వ మేవాహం విచక్ష్వ భోః।
న నౌ పశ్యన్తి కవయ శ్ఛిద్రం గాతు మనా గపి॥" —భా. 4-28-62.

నేనే నీవు; నీవే నేను; వేఱు కాదు; కవులు మన యిరువురిలో నేమాత్రము నంతరమును (భేదమును) గాంచరు – అని యర్థము. అధ్యాత్మ తత్త్వవిదుడు 'కవి' యగుట యీ శ్లోకములవలన స్పష్టము.

యజ్ఞప్రవర్తకులు, ఋత్విజులు నగు నట్టి విద్వాంసులను కవులుగా శ్రుతి కీర్తించినది.

"సీరా యుంజన్తి కవయః యుగా వితన్వతే పృథక్।
ధీరా దేవేషు సుమ్నయా।"

—ఋ. 10-101-4; వా. సం. 12-67; తై. సం. 4-2-5-5.

ఈ మంత్రమున యజ్ఞకర్మకుశలురు, దేవతాధ్యాన సమాహితచిత్తులు (ధీరాః) నగు కవులు (ఋత్విజులు) దేవహితార్థమై నాగలి బట్టుట వర్ణింపబడినది.

"యే విద్వాంస స్తే కవయః" —శ.బ్రా. 7-2-2-4.

అనుమ శతపథశ్రుతి పై మంత్రము నందలి కవులను విద్వాంసులనుగా కీర్తించినది. కాన విద్వాంసు లగు కవులే, వారే పనిని జేయుచున్నను, వేద

కావ్య రసాస్వాద కుశలు రగుట శ్రుతి, పురాణ సంమతము. అట్టి కవులనుభవించు ఆత్మానుభూతియే రసానుభూతి యని 'రసో వై సః' అను శ్రుతిపలన వ్యక్తమగుచున్నది. అదియే రమణీయార్థము. రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్'- అనెడి యాలంకారికుల కావ్యలక్షణమునకు తత్త్వతః లక్ష్యము వేదకావ్యమే.

## కావ్యజీవితము - ఆలంకారికులు :-

కాని యొక విశేషము. కవియే వేదకావ్య రసాస్వాద సమర్థుడు. అందఱు నట్టి కవులు గాజాలరు. అందుచే నిత్యము నిరతిశయము నగు బ్రహ్మానందానుభవము నెల్లరచే దిఙ్మాత్రముగా నైన గుర్తింప జేయుటకై మహాకవులు లోకోపకార బుద్ధితో నేర్పరచిన వెలుగుబాటలే లౌకిక కావ్యములు. ఆ కారణము చేతనే యీ లౌకిక కావ్యార్థ భావనచే సామాజికుడు బొందు నిర్వృతి 'బ్రహ్మానంద సబ్రహచారి' యని యాలంకారికులచే పేర్కొనబడినది. కావున నట్టి రసమే కావ్య జీవితము.

కావ్యజీవిత విషయమై కూడ నాలంకారికుల యభిప్రాయమును జూతము.

అగ్నిపురాణము, భరతనాట్య శాస్త్రము రెండును కావ్యజీవితము 'రసము' అని పేర్కొనినవి. నాట్యశాస్త్ర వ్యాఖ్యాన మగు అభినవభారతి యందు నభినవగుప్తుడు రసవాదమును బాగుగ పోషించినాడు. కాని తరువాత క్రమముగ భామహ, ఉద్భట, దండి, రుద్రట, ప్రతిహారేందు రాజాదులు అలంకారమునకే ప్రాధాన్యము నంగీకరించి రని చెప్పవచ్చును. పూర్వుల కాదని, వామనుడు క్రొత్తమార్గము త్రొక్కినాడు.

'రీతి రాత్మా కావ్యస్య। విశిష్ట పదరచనా రీతిః। విశేషో
గుణాత్మా' —కావ్య. సూ. 1-2-6 నుండి 8.

రీతియే కావ్యాత్మ యని వామనుని యభిప్రాయము కుంతనుడు వక్రోక్తి (వైదగ్ధ్య భంగీ భణితిః)ని కావ్యాత్మగా నిరూపించినాడు. పై వాదముల త్రోసి రాజని ఆనంద వర్ధనుడు ధ్వని (వ్యంగ్యార్థము)ని కావ్యాత్మగా గ్రహించి యది ప్రాచీనసంమత మగుటయు వివరించినాడు. ఈ వ్యంగ్యార్థమును అనుమానమునం దంతర్భావము జేయవచ్చు ననుచు నీ వాదము నెదుర్కొనినది మహిమభట్టు. కాని యీ వాదమునకు తరువాత ఆశ్రయము లభింపలేదు. ఆలంకారికు లందఱు మహిమభట్టు వాదమును ఖండించి 'ధ్వని'కే పట్టము గట్టిరి. కాని మూడు విధము లగు 'వస్తు - అలంకార - రస' ధ్వనులలో రసధ్వనికే ప్రాధాన్యము నంగీకరించిరి.

ఇట్లు కావ్యజీవిత విషయమై యెన్ని వాదములు నొకదాని వెంట నొకటి క్రమముగ బయలుదేరినను తుదకు అగ్నిపురాణ, నాట్యశాస్త్ర ప్రోక్తమగు 'రసాత్మ' వాదమే నిలిచినది.

## అభినవగుప్తుడు - రసస్వరూపము - లక్ష్యము :-

శ్రుతిసిద్ధమైన రసస్వరూపమును చర్వింపజేయుటయే యాలంకారికుల తాత్పర్యము. ఈ విషయమై యభినవగుప్తుని యభిప్రాయమిది.

"ఆమ్నాయసిద్ధే కి మపూర్వ మేతత్
సంవి ద్వికాసే ఽధిగతాగమిత్వమ్।
ఇత్థం స్వయంగ్రాహ్య మహార్ఘహేతు
ద్వంద్వేన కిం దూషయితా న లోకః॥"

ఈ రసతత్త్వము నూతనము గాదు. ఆమ్నాయసిద్ధము. ఈ వైదిక సిద్ధాంతమును ఖండించుటకు కొంద ఱాచార్యులు ప్రయత్నించిరి. అందుచే నా

ప్రాచీనాచార్యుల మతముల నిట బర్యాలోచనము జేయవలసి వచ్చినది. ఇది పర్యాలోచనమే గాని వారి మతఖండనము గాదు. ఆమ్నాయ సిద్ధాంతము నీ రీతిగ బర్యాలోచన చేయుట లోపముగా నెన్నబడదు. ఇట్లీ మతముల పర్యాలోచనము జేయ శ్రుతిసిద్ధాంతము సుష్ఠు పరామృష్టమై దాని వాస్తవిక ప్రామాణిక స్వరూపము కన్నులగట్టినట్లగును. అట్లుగాక ఆమ్నాయ సిద్ధాంతమునే ఖండించుటకు ప్రయత్నము జేయుచో స్వతః ప్రమాణభూత వేదసిద్ధాంత ఖండనకు బూనుకొనువాడు దూషితుడు కాడా? ఆమ్నాయసిద్ధాంతము నపలపించుటకు శక్యము కాదు - అని భావము.

"ఊర్ధ్వోర్ధ్వ మారుహ్య య దర్థతత్త్వం
ధీః పశ్యతి శ్రాంతి మవేదయంతీ।
అలం తదాద్యైః పరికల్పితానాం
వివేక సోపాన పరంపరాణామ్"

ప్రాచీనాచార్యుల మతముల పర్యాలోచన సేయుకొలది విచార్యమాణార్థము యొక్క యదార్థ స్వరూపము గోచర మగును. ప్రాచీనాచార్య విచారధారలు పరమార్థ ప్రాప్తికి సోపాన పరంపరలు. పరమార్థము గోచరింపగనే సోపానాత్మక ప్రాచీన మతములతో బని లేదు.

"చిత్రం నిరాలంబన మేవ మన్యే
ప్రమేయసిద్ధౌ ప్రథమావతారమ్।
తన్మార్గ లాభే సతి సేతుబంధ
పుర ప్రతిష్ఠాది న విస్మయాయ॥"

లోకమున గన్పట్టు ప్రమేయ పదార్థముల కన్నింటికి నేదో యొక యాధారము - మూలము - గన్పట్టును కాని యా మూలమునకు మూల ముండదు. 'మూలే మూలాభావా దమూలం మూలమ్' - మూలమునకు మూలమేది? జడమునకు జడము మూలము గాదు. జడములకు జడవిలక్షణమైన మూలము ఆది

మూలము. ఇది నిరాధారము - అమూలము. ఈ నిరాధార మూలాధారముమీద జగన్నిర్మాణము జరిగినది. అట్లే రససాధక - ఆధారభూత - సిద్ధాంతములన్నియు ఖండింప బడుటచే వేదచోదిత రససిద్ధాంతము మిగిలినది ఇది యాదిమూలము ఇది యన్నిటికి మూలమగుటచే దీనికి మూలము లేదు. కాన స్వతఃప్రమాణము; ప్రథమావతారమగు నీ యాది మూలము యొక్క యాధారము మీద సాహిత్య శాస్త్రముయొక్కయు, రసప్రాసాదముయొక్కయు నిర్మాణము జరిగినది - అని భావము.

తస్మాత్ సతా మత్ర న దూషితాని
మతాని తాన్యేవ తు శోధితాని ।

పూర్వ ప్రతిష్ఠాపిత యోజనాసు
మూలప్రతిష్ఠా ఫల మామనంతి ॥

కాన ప్రాచీనాచార్య మతములు పర్యాలోచన చేసి శోధింప బడినవి; దూషింప బడలేదు. పూర్వాచార్యుల సిద్ధాంతముల నిట్లు పరిశోధించుచో మూల సిద్ధాంత స్థాపనాఫలము సిద్ధించును — అని భావము. (చూ. అభినవ భారతి - నాట్యశాస్త్ర వ్యాఖ్య - 6 అధ్యాయ.)

అభినవ గుప్తుని యీ వచనముల వలన వేదసిద్ధమగు రసతత్త్వమే సాహిత్యశాస్త్రముయొక్కయు, ఆలంకారిక నిర్మిత రసప్రాసాదముయొక్కయు మూలాధారము; అదియే లక్ష్యము నని తెలియగలము. అందుచే నాలంకారికుల రసస్వరూప నిర్వచన విధానము కూడ శ్రుత్యర్థమును లక్షింప జేయునదియై గన్పట్టును.

# అలంకారికులు-రసస్వరూపనిర్వచనము-లక్ష్యము :

ఇక నాలంకారిక రసస్వరూప నిర్వచన విధానము జూతము. జగన్నాథ పండితుని కావ్యలక్షణమువలెనే రసస్వరూప నిర్వచన విధానము వేదకావ్యమును గూడ లక్ష్యముగా గ్రహించి ప్రవృత్తమైనట్లు గన్పట్టును.

'వస్తుతస్తు వక్ష్యమాణ శ్రుతిస్వారస్యేన రత్యాద్యవచ్ఛిన్నా
భగ్నావరణా చిదేవ రసః' —రసగంగాధరః.

'యద్వై తత్ సుకృతం రసో వై సః' - అని శ్రుతి బ్రహ్మను రస స్వరూపునిగ నిర్వచించినది. సాధన చతుష్టయ సంపన్నుడై మహా వాక్యార్థ విచారము సేయు తత్త్వజ్ఞానికి ఈశ్వరానుగ్రహముచే బ్రహ్మాత్మైక్యజ్ఞానము సిద్ధించును. జ్ఞానముచే అజ్ఞానావరణము తొలగును. అంతట ప్రమాతృత్వ భావము నశించి అపరోక్షాత్మానందానుభవము గలుగును. ఈ యలౌకికాత్మానందమే రసమని శ్రుతి తాత్పర్యము.

అట్లే మహాకవి తన ప్రతిభతో సమకూర్చిన అలౌకిక విభావ-అనుభావ-వ్యభిచారిభావ రూప కావ్యసామగ్రిచే ప్రభావితుడైన సామాజికునకు రత్యాలమున ఆనందాంశము నావరించెడి యజ్ఞానము దొలగును. అందుచే పరిమిత ప్రమాతృత్వ భావము నశించి పూర్వవాసనా రూప రతి, శోకాది స్థాయీభావ సంవలితమై స్వ ప్రకాశ చిద్రూపానందము భాసించును. అదియే రసము - అని జగన్నాథపండితుని చే రస నిర్వచనము చేయబడినది.

ఇట రసనిరూపణమున (1) ఆనందాంశావరణాజ్ఞానము తొలగుట (2) అందుచే పరిమిత ప్రమాతృత్వ ధర్మము తొలగుట, (3) పిదప(రత్యాది

సంవలితమై) స్వప్రకాశ చిద్రూపానందము భాసించుట-యను ప్రక్రియ వేదాంత శాస్త్ర ప్రక్రియ ననుసరించినదే. అట్లనుసరించి రస స్వరూపమును నిర్వచించుటకు 'రసో వై సః' అను శ్రుతి ప్రమాణముగా జూపబడినది.

కాని కావ్యసామగ్రిచే దత్కాలమున గలుగున దగుటచే విది బ్రహ్మానందముగాక బ్రహ్మానంద సబ్రహ్మచారి యైనది. విభావాది కావ్యసామగ్రివలన గాక, పైన జెప్పినట్లు మహావాక్యజన్యతత్త్వ జ్ఞాన సిద్ధ మగుటచే శ్రుతిసిద్ధమైన రసము బ్రహ్మానందపద వ్యపదేశ్య మైనది. కాన కావ్యరసము శ్రుతికావ్య సిద్ధ రస స్వరూపమును గుర్తింప జేయునది యని నిరూపించుట యలంకారశాస్త్ర తాత్పర్యము.

బ్రహ్మానంద సబ్రహ్మచారి రసాభివ్యంజక రచనలు కావ్యము లయినట్లు, సాక్షాత్తు బ్రహ్మానంద రసానుభవమును గలిగించు శ్రుతులును తత్త్వతః కావ్యము లగుట నిర్బాధము. అందుచే 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అను కావ్య లక్షణమునకు తత్త్వతః లక్ష్యము శ్రుతి కావ్యమున జెల్లును.

మఱియొక విశేషము. పై కావ్యలక్షణమున రమణీయపద మర్థవంతము. ఈ రమణీయత్వమును మహర్షు లెట్లు దర్శించిరో చూతము.

"అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా ॥"

— రామా. 1.

నారదోపదేశము వలన బరమార్థము నెఱిగి నిర్మలచిత్తుడై మాధ్యాహ్నిక క్రియార్థమై తమసాతీరమున కేగి యా తీర్థ జలమును జూచిన వాల్మీకి మహర్షినుండి వెలువడిన వాక్యమిది.

'ఓ భరద్వాజా! చూచితివి కదా! ఈ తీర్థజలము అడుగుననగాని, మీద గాని (బురద) మాలిన్యము లేక, లోపల పాపపుటాలోచనగాని వెలుపల బాపపుచర్య గాని లేని పరిశుద్ధాంతఃకరణుడగు సత్పురుషుని మనస్సువలె, ప్రసన్నముగాను (అందుచే) రమణీయముగా నున్నది' - అని యర్థము.

వాల్మీకి మహర్షి యా తీర్థమును క్రొ త్తగా నిపుడు చూచుట లేదు. మున్నెన్ని మాఱులో జూచి యుండెను. అపుడు తీర్థజలము తీర్థజలముగానే గన్పట్టెను. కాని నేడు నారదోపదేశ శ్రవణము జేసి, శుద్ధాంతఃకరణుడైనంతనే, శుద్ధాంతః కరణుని మనస్సువలె నా యకర్దమతీర్థము ప్రసన్నము రమణీయము నై కన్పట్టెను. ఈ శ్లోకము రమణీయ రామాయణ మహాకావ్య రచనము నుప క్రమింపబోవు వాల్మీకి మనస్సు నారదోపదేశముచే నెట్లు ప్రసన్నమై, రమణీయ మైనదో తెలియ జేయుచున్నది. ఇంతేకాదు.

"ఆపో హి ష్ఠా మయోభువ స్తా న ఊర్జే దధాతన।
మహే రణాయ చక్షసే ॥"

"యో వః శివతమో రస స్తస్య భాజయతేహ నః।
ఉశతీ రివ మాతరః ॥"

— తై. ఆ. 4-2-24: 10-1-11; ఋ. 10-9-1-2.

'హే ఆపః' దధాతన పోషయత। కస్మై ప్రయోజనాయః చక్షసే పర మాత్మ దర్శనాయ। కథం భూతాయ। రణాయ రమణీయాయ। తథా మహ్యతే పూజ్యత ఇతి మహ్, తస్మై మహే మోక్ష రూపఫలత్వా న్మహతే, ముక్తిప్రయోజనా యాస్మాన్ పోషయత .... వో యుష్మాకం యః శివతమః కల్యాణతమో రసో మాధుర్య లక్షణోఽస్తి తస్యేహాస్యాం భువి విద్య మానా న్నో ఽస్మాన్, భాజ యత .... యథా మాతరః స్వాపత్య ముత్తమ గుడాది ప్రాపయన్తి తథా'

— సా. భా.; తై. ఆ.

'పరమాత్మ దర్శనము రమణీయము; మోక్షప్రదము; అట్టి పరమాత్మ దర్శనము ప్రసాదింపుడు; తల్లులు వాత్సల్యముతో మధురపదార్థములను బిడ్డలకు బెట్టునట్లు, అద్దేవతయు శివతమమగు – మిగుల రమణీయమగు – 'రసమును మా యందు నింపు గాక' – అని యర్థము.

'అప్-సలిల' ఇత్యాది శబ్దములకు సామాన్యముగ జలము అనియే యర్థము కాని పరమాత్మ దర్శనమును గలిగించెడి లక్షణము వేదవాక్కులకే గలదు. అట్టి పరమాత్మ దర్శనము గలిగించెడి అద్దేవత యిట వాగ్దేవత యగునను నర్థముగూడ లక్షిత మగుచున్నది. 'గౌరీ ర్మిమాయ సలిలాని తక్షతీ .... సహస్రాక్షరా పరమే వ్యోమన్ (ఋ. 1-164-1); సో ఽపోఽసృజత - వాచ ఏవ లోకాత్ । వాగేవాస్య సాఽసృజ్యత' (శ. బ్రా. 6-1-1-9)- ఇత్యాది శ్రుతి వాక్యము లందు అప్, సలిల శబ్దములు వాక్ పరములుగ గూడ ప్రసిద్ధములు. వాగ్దేవత యగు సరస్వతి యద్దేవతగ గూడ శ్రుతుల యందు ప్రసిద్ధము. కాన పై మంత్రము నందు జెప్ప బడిన రసప్రదాత్రి యగు దేవత యద్దేవతయే గాక వాగ్దేవతయు నగు ననెడి యర్థము గూడ నుపలక్షిత మగుచున్నదని గ్రహింపనగును. ఏలయన నదులను జలప్రవాహములుగ మాత్రమే గాక వేదవాక్స్వరూపములుగ గూడ దర్శించుట సంప్రదాయము. అట్లే రసపదము జలమును, బ్రహ్మానంద రసమును – రెండిటిని బోధించునది.

బ్రహ్మ — 'ఇయం వై నిర్మితా పూర్వం మయా వై వేదరూపిణీ।
వేదపాదాత్ సముత్పన్నా పుణ్యా లోకైకపావనీ ॥
—స్కాంద-సనత్కుమారసంహిత - కృష్ణా మాహాత్మ్యమ్. 22 అధ్యా.

కృష్ణవేణీనది వేదరూపిణి యని స్పష్టముగా నిట జెప్పబడినది. ఈనదియే యీగ్రంథమున మఱియొకచోట బ్రహ్మానంద స్వరూపిణిగ గూడ నిట్లు కీర్తింపబడినది.

"కృష్ణా కృష్ణాంగ సంభూతా సర్వలోకోపకారిణీ ।
బీజా న్యాదాయ గచ్ఛన్తీ బ్రహ్మానంద స్వరూపిణీ॥" 18 అధ్యా.

"బ్రహ్మామృతానంద రసేన పూర్ణాం
జలేన పూర్ణా మితి మేనిరే உజ్ఞాః॥
తాం త్వావగాహామి పిబామి కృష్ణే
దేవాన్ ఋషీం స్తర్పయిష్యే పితౄాం శ్చ॥" 23అధ్యా.

ప్రాకృతజనుల దృష్టిలో నీ కృష్ణానది జలప్రవాహపూర్ణముగ మాత్రమే గన్పట్టును కాని వాస్తవముగ నిది బ్రహ్మామృతానంద రసపూర్ణము. అట్లు భావన జేయుచు, నా నదీజలములలో నవగాహముజేయుచు, ఆనంద రసాస్వాదము జేయవలెను; దేవతలను, ఋషులను, పితరులను తృప్తి నొందింప వలెను-అని యర్థము.

పండితరాజ జగన్నాథుడును గంగానదిని 'శ్రుతి సర్వస్వరూపిణి' గ దర్శించి యిట్లు కీర్తించినాడు.

"సమృద్ధం సౌభాగ్యం సకల వసుధాయాః కిమపి తత్
మహైశ్వర్యం లీలా జనిత జగతః ఖండపరశోః॥
శ్రుతీనాం సర్వస్వం సుకృత మథ మూర్తం సుమనసాం
సుధాసోదర్యం తే సలిల మశివం నః శమయతు ॥" —గంగాలహరి.

అందుచే పై శ్రుతి వాక్యమున నుద్దిష్టమగు ఆద్దేవత వేదమాతయనియు, అందలి శివతమ మగు రసము బ్రహ్మామృతానంద రసమనియు గ్రహించుట సంప్రదాయానుగుణమే యగును. కాన తల్లి బిడ్డలకువలె నీ వేదమాతయు రమణీయము, కల్యాణతమము నగు రసముతో (శివతమో రసః) మమ్ము నింపు గాక యనియు నర్థము పై మంత్రమున సూచిత మగుచున్నది.

"శం నో దేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే।
శంయో రభిస్రవన్తు నః" — ఋ. 10-9-4; అ. సం. 1-6-1.

అద్దేవత (వాగ్దేవత) కామక్రోధాది పాపవృత్తుల బోనాడి శాంతిని (సుఖమును) గూర్చు గాక యని తాత్పర్యము. నారదోపదేశానంతరము వాల్మీకి మహర్షి దర్శించిన యకర్దమ తీర్థజలము నందలి రమణీయత్వము పై శ్రుత్యర్థముల దలపింప జేయుచున్నది. జగన్నాథుకును పై కావ్య లక్షణము నం దుద్దేశించిన రమణీయత్వ మటిది. శమప్రధానులై తపోధనులగు మహర్షుల మనస్సుల యందును శాంతము లగు వారి యాశ్రమ పదములందును ననిర్వచనీయ మగు నిట్టి రామణీయకము వెల్లివిరియుచుండును. ఇంతియే కాదు.

కావ్యములలో శృంగారాది రసములతోపాటు శాంతరసమునకును స్థానము గలదు. స్థాన ముండుటే గాదు. ప్రాణులకు శాంతము స్వాభావికము; శృంగారాదులు వికృతిరసములు; వికృతిరసములకు తుదకు ప్రకృతిరసము నందే లయము-అని యాలంకారికులు చెప్పుదురు. ఈ శాంతరసము శ్రుతి ప్రతిపాదిత

---

1. 'భావా వికారా రత్యాద్యాః శాంత స్తు ప్రకృతి ర్మతః।
వికారః ప్రకృతే ర్జాతః పున స్తత్రైవ లీయతే॥
స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతా ద్భావః ప్రవర్తతే।
పున ర్నిమిత్తాపాయే తు శాంత ఏవ ప్రలీయతే॥'
— అభినవగుప్తః.

'క్షణభంగిని జంతూనాం స్ఫురితే పరిచింతితే।
మూర్ధాభిషేకః శాంతస్య రసః సోఽత్ర విచార్యతామ్॥
త్రదమంద రసస్యంద సుందరీయం నిపీయతామ్।
శ్రోత్ర శుక్తిపుటైః స్పష్ట మజ్ఞ। రాజతరంగిణీ॥
— రాజతరంగిణీ.

తత్త్వజ్ఞానమునకు మిగుల దోహదకారి యగును. అట్టి శాంతమును 'రససార్వభౌమ' మని కీర్తించుటయు శ్రుతిసిద్ధ రస స్వరూపమును గుర్తింపజేయుట యందాలంకారికులకు గల తాత్పర్యము నభివ్యక్తము జేయును.

'తుష్యంతి తరుణాః కామే విదగ్ధాః సమయాశ్రితే।
అర్థే ష్వర్థపరా శ్చైవ మోక్షే ష్వథ విరాగిణః॥'

అను భరతవచనము శాంతము యొక్క ప్రకృతిత్వమును నిరూపించుచున్నది.

అభినవగుప్తుడు శాంతమును ప్రకృతిరసముగ నిరూపించినాడు. అంతియే కాదు;

"శమార్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః।
తస్మా త్స సర్వశాస్త్రజ్ఞః యస్య శాంతం మనః సదా॥"

'పండితుడై వ్యాఖ్యాన కౌశల మున్నంత మాత్రమున సర్వశాస్త్రజ్ఞుడు కాడు. సర్వశాస్త్రముల లక్ష్యము శమసంపత్తి. అది కలవాడే సర్వశాస్త్రజ్ఞుడు' - అనుచు పైన వాల్మీకి దర్శించిన రమణీయత్వమును స్ఫురణకు దెచ్చుచున్నాడు. తెచ్చుటయే కాదు; అట్టి రమణీయత్వమే ప్రధాన మనియు స్ఫురింప జేసినాడు. కావుననే శమప్రధానులైన యట్టి మహాత్ముల వాక్కులు ప్రసన్న గంభీరములై పునఃపున రనుసంధానము సేయు కొలది యపూర్వ రమణీయార్థ ప్రతిపాదకములై భాసించును. మహాకవి భారవియు నెంతయో సుకృతాత్ములకు గాని యట్టి ప్రసన్న గంభీర వాక్కు ప్రసరింప దనినాడు.

'వివిక్త వర్ణాభరణా సుఖశ్రుతిః
ప్రసాదయన్తీ హృదయా న్యపి ద్విషామ్।
ప్రవర్తతే నాకృత పుణ్యకర్మణాం
ప్రసన్న గంభీర పదా సరస్వతీ॥'

కావున 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' — అను జగన్నాథ పండితుని కావ్యలక్షణమునకు లక్ష్యము లేవి యనుచో మొదట వేదములు, తరువాత భారత రామాయణాదులు, పిదప లౌకిక కావ్యములు - అని చెప్పవలసి యున్నది.

ఆలంకారికులు వేదముల యడుగుజాడలలో నడిచిరను విషయమును 'కాణే' పండితుడు నిట్లు వివరించినాడు.

When DHVANI or RASA is said to be the soul of poetry (కావ్యస్యాత్మా ధ్వని రితి) it is virtually employing the language of the upanishads about Atman and Ananda (ఆనందో, బ్రహ్మేతి వ్యజానాత్). There is a remarkable similarity between the aesthetic experience on reading a poem or on seeing a good drama and the spiritual experience derived from the Vedanta discipline by one who has realised and contemplates upon the one reality. It is therefore that Mammata speaks of RASA as 'బ్రహ్మాస్వాద మివానుభావయన్'.

But there are differences between the two experiences. Art experience does not last long; vanishes when the stimulus is withdrawn, while the bliss of one who has reached the 'బ్రాహ్మీస్థితి' is permanent. Art experience does not necessarily require moral elevation, while spiritual life is not possible without moral discipline.

—P. V. Kane.[1] History of Sanskrit Poetics. P. P. 391.

'కావ్యజీవితము ధ్వని లేక రసము (కావ్యస్యాత్మా ధ్వని రితి) అని యనినంతనే, ఆత్మను లేక ఆనందమును గూర్చి చెప్పిన యుపనిష ద్వాక్య-

లనే (ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్) యాలంకారికులును అవలంబించి రనుట స్పష్టము ; చక్కని కావ్యమును జదివినపుడుగాని నాటకమును జూచినపుడుగాని గలిగెడి యానందమునకును శమాది సాధనసంపత్తి గలిగి యాత్మనిష్ఠు డగు తత్త్వజ్ఞాని బొందెడి యానందమునకును సామ్యముగలదు; ఇది గమనార్హము; కావుననే మమ్మటాచార్యుడు కావ్యరసము బ్రహ్మానంద సబ్రహ్మచారి (బ్రహ్మాస్వాద మి వానుభావయన్) అని యనినాడు.

ఇట్లు సామ్య మున్నను, ఈ రెండు అనుభూతులలోను మిగుల వ్యత్యాసము గలదు : (1) కావ్యాది కళల వలన గలిగెడి యనుభూతక్షణికము— తత్కాల మాత్ర పర్యాప్తము; ఉద్దీపన సామగ్రి దూరము కాగానే అనుభూతియు మఱుగుపడును. శ్రుతిసిద్ధ మగు ఆత్మానందానుభూతి (బ్రాహ్మిస్థితి) యట్లు గాదు; అది శాశ్వతము. (2) కావ్యనాటకాది కళా రసాస్వాదమునకు నైతికమగు ఔన్నత్యముతో (క్రమశిక్షణతో) బని లేదు. బ్రహ్మానంద రసానుభూతి కట్లు గాదు; దానికి శమాది సాధనసంపత్తి జనిత చిత్త సంస్కార మావశ్యకము' — అని యర్థము.

'వేదకావ్యము; కావ్యనాటక, సంగీతాది కళలు' — ఈ రెండిటి యనుభూతి విశేషస్వరూపము శివలీలార్ణవమున నిట్లు ప్రవచింపబడినది.

"స్తోతుం ప్రవృత్తా శ్రుతి రీశ్వరం హి
న శాబ్దికం ప్రాహ న తార్కికం వా ।
బ్రూతే తు తావ త్కవి రి త్యభీక్ష్ణం
కాష్ఠా పరా సా కవితా తతో నః ॥" — 1-16.

పరమేశ్వరుని స్తోత్రము జేయుటకై గదా శ్రుతి ప్రవృత్తమైనది. అట్టి శ్రుతి యీశ్వరుని శాబ్దికు (వైయాకరణు) డని గాని, తార్కికు డని గాని గాక

యడుగడుగున కవి యనియే కీర్తించినది. అట్టి కవియొక్క కవితయగు వేద కావ్యమే మనకు శరణ్యము.

"కర్ణం గతం శుష్యతి కర్ణ ఏవ
సంగీతకం సైకత వారి రీత్యా।
ఆనందయ త్యంత రమప్రవిశ్య
సూక్తిః కవే రేవ సుధాసుగంధా ॥" 1-17.

ఇసుకలో బడిన నీరు, అందే వెంటనే యింకి పోవునట్లు చెవిని బడెడి సంగీతము గూడ చెవియందే యింకి పోవును. కవి సూక్తి యట్లు గాక యమృత ప్రాయమై హృదయాంతరాళము జొచ్చి యానందింప జేయును.

పశ్యేయ మేకస్య కవేః కృతం చేత్
సారస్వతం కోశ మవైమి రిక్తమ్।
అంతః ప్రవిశ్యాయ మవేక్షిత శ్చేత్
కోణే ప్రవిష్టా కవికోటి రేషా॥" 1-18.

ఏదైన నొక కవియొక్క కృతిని గాంచినపుడు సారస్వత కోశము (వేద వాఙ్మయము) లోని శబ్దజాల మంతయు నందుపయుక్త మయి యది (సారస్వత కోశము) వట్టిపోయినదా యని యనిపించును. ఆ సారస్వత కోశములోనికి జొచ్చి దర్శించుచో కవికోటి యంతయు నందొకమూల నొదిగి యున్నట్లు గన్పట్టును.

"అనాయత ప్రాణ మసంయతాక్ష
మబ్రహ్మచర్యానశనాది ఖేదమ్।
చిత్తం మహోశే నిభృతం విధాతుం
సిద్ధః కవీనాం కవితైవ యోగః॥" 1-28.

యోగాభ్యాసమునకు ప్రాణాయామము, ఇంద్రియసంయమము, బ్రహ్మ చర్యము, ఆహారనియమాదు లావశ్యకములు. ఇట్టి నియమములు గాని వీని వలన

ఖేదము గాని లేకయే, చిత్తమును బరమేశ్వరు నందు నిలుపుటకై యీ కవితా యోగము కవులకు ఆజన్మసిద్ధము.

## అలంకారశాస్త్రము-లక్ష్యము :-

పై గ్రంథసందర్భము బట్టి పరమేశ్వరుడు కవి; తత్సంబంధి కవితయే వేదవాక్యము; ఈ కవియొక్కయు వేదకావ్యముయొక్కయు స్వరూపమును దర్శింప జేయుటయే లౌకికకావ్యముల లక్ష్యము; ఆలంకారికుల దృష్టియు నిదియే యని తెలిసినది. ఇంతే కాదు.

అలంకారశాస్త్రము గూడ పురాణేతిహాసాదుల వలెనే వేదార్థోప బృంహణ మునకై ప్రవర్తిల్లినది. అలంకారశాస్త్ర పరిచయము లేనిది వేదవాక్యగతము లయిన వివిధాలంకార స్వరూపము గాని, వేదవాక్యగత గూఢ చమత్కారార్థావగతి గాని కలుగదు. కావుననే షడంగముల తోపాటు అలంకారశాస్త్రమును గూడ వేదార్థోప బృంహణమునకై యేడవ యంగముగా గ్రహింప నగు నని రాజశేఖరుడు తన కావ్యమీమాంసా గ్రంథమున జెప్పినాడు.

"ఉపకారకత్వా దలంకారః సప్తమాంగ మితి యాయావరీయః;
ఋతే చ తత్స్వరూప పరిజ్ఞానాత్ వేదార్థానవగతిః। యథా
ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వ
జాతే। తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్న న్నన్యో
అభిచాకశీతి' —కావ్యమీమాంసా - 2 అధ్యా.

"ద్వా సుపర్ణా" అను నీ మంత్రమున నతిశయోక్త్యలంకారము. (రస గంగాధరమున గూడ నీ యలంకారమున కుదాహరణముగా నీ మంత్రమే యుదహ రింప బడినది). ఇట్టి మంత్రముల యందలి అలంకారాది స్వరూప పరిజ్ఞానముకై యలంకారశాస్త్ర మావశ్యక మని యర్థము.

కావ వేదకావ్య మలంకార శాస్త్రమునకు లక్ష్యమే యగుట యాలంకారికాభి మతము. "కవేః పరమాత్మన ఇదం కావ్యమ్" అను నిర్వచనము ననుసరించియు పై నుదహరించిన శ్రుతి స్మృత్యాదిప్రామాణ్యము ననుసరించియు కావ్య మను నామము ప్రధానముగా శ్రుతికే చెల్లును. కృత్స్నవేదము పరంపరగా గాని, సాక్షాత్తుగ గాని కవియగు పరమాత్మకు సంబంధించిన దగుట జేసి కావ్య మగును. 'అప్యేకం దేవపద మధీయాత' ఇత్యాది శ్రుతివాక్యములు వేదకావ్యగత పదము లన్నియు దేవపదములు (దేవునకు సంబంధించినవి) అని చెప్పుచున్నవి. వ్యాసాది మహాకవులు నా దృష్టితోనే వేదమును భారతమును కావ్య మని కీర్తించియుందు రనుట స్పష్టము. కావి నగరార్ణవ శైలర్తు చంద్రార్కో-దయాది వర్ణనలకు గాని' అలౌకిక విభావానుభావాది కావ్యసామగ్రికిగాని ప్రాధాన్యము లేమిం జేసి 'లౌకిక కావ్యములకంటె వేదము విలక్షణమైన' దను విషయమును పై యగ్ని పురాణ వచన మనువదించినది.

కాగా శ్రుతిదృష్టిలోను మహర్షుల దృష్టిలోను కావ్యలక్షణము వేఱు. లౌకికకావ్యకర్తల దృష్టిలో కావ్యలక్షణము వేఱు. మహర్షులాదరించిన కావ్యలక్షణము (కవేః కర్మ; కవేః పరమాత్మన ఇదం) అన్వర్థము. లౌకిక కావ్యలక్షణము కవి యగు పరమాత్మకే సంబంధింపక, లౌకిక విషయానుబంధి గూడ నగుట జేసి యౌపచారిక మన దగును. ఈ విషయముల దృష్టియం దుంచు కొనియే పండిత రాజ జగన్నాథుడు నిపుణముగ 'లోక-వేద' సాధారణమైన కావ్యలక్షణమును బరిష్కరించినాడు - అని చెప్ప నగును. కనుక వేదము కావ్య మన నది యాలంకారిక సమయవిరుద్ధము కాదని స్పష్టమైనది.

## అధికారి భేదముననుసరించి వేదమునకు ప్రభు-సుహృత్ - కాంతాసంమితత్వము :-

ఇక అధికారి భేదము ననుసరించి వేదము కొన్నియెడల ప్రభువై శాసించును; ఒకచో సుహృత్తువలె నుపదేశించును; ఇంకొక యెడ కాంతా సంమితముగ

దెలియ జెప్పును - అను విషయమును బరిశీలింప వలసి యున్నది. "అధికారిణః ప్రమితిజనకో వేదః ఇతి న్యాయే నేయ ముపనిషత్ బుభుత్సో ర్బ్రహ్మాత్మత త్త్వే ప్రమితిం జనయతి"

—సా. భా. తై. అ. 7-1.

చిత్తసంస్కృతి ననుసరించి పరమేశ్వరు డా యా రూపములతో సాక్షాత్కరించు నట్లు భిన్నభిన్న చిత్తసంస్కృతులు గల యధికారులకు భిన్నభిన్న రూపములతో శ్రుతియు బొడగట్టును. కొన్నియెడల ప్రభువువలె శ్రుతి యాదేశించు చుండును ప్రభువు నానతిని నెఱవేర్చు పట్టున హేతువాదమునకు దావు లేదు. అట్లే శ్రుతివిహిత వేదాధ్యయన, కర్మానుష్ఠానాది సమయము లందు హేతువాదముతో బని లేదు. అట్టియెడ వేదము ప్రభుసంమితమై యొప్పుచుండును.

మహాయజ్ఞములచేతను, యజ్ఞములచేతను శరీరము బ్రాహ్మముగును. అనగా నియమపూర్వక కర్మానుష్ఠానపరులై బ్రాహ్మీమూర్తులగుదురని స్మృతులు చెప్పుచున్నవి. 'మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః' (మను.) అట్టి మహాత్ములు శమాది సాధన సంపద గల్గి జిజ్ఞాసాపరులై వేదవాక్యార్థ విచారణకు బూనుకొను సమయమున హితునివోలె శ్రుతి యుపదేశించుటకు బూనుకొనును.

అట్లు నిరంతర కర్మానుష్ఠాన, మంత్రార్థ విచారములచే గలిగిన విలక్షణ చిత్తసంస్కృతి ప్రాభవముతో వలరారెడి యా బ్రాహ్మీమూర్తికి శ్రుతి చెలియై క్రమముగ నాత్మస్వరూపమును దర్శింపజేయుచు బ్రహ్మానంద రసావలిప్తుని జేయును. అట్టి బ్రాహ్మీమూర్తి వేదమూర్తియై వేదముతో ననన్యభావము చెందును.

కాన నధికారిభేదము ననుసరించి కర్మ - ఉపాసనా - జ్ఞాన యోగనిష్ఠులకు శ్రుతి భిన్నభిన్న రూపములతో సాక్షాత్కరించు ననుట యుక్తమే. శ్రుతి చమత్కారముగ నీ విషయము నీ మంత్రమున నిట్లు సూచించినది.

"పశ్చాత్పురస్తా దధరా దుదక్తాత్ కవిః కావ్యేన పరిపాహి రాజన్।
సఖే సఖాయ మజరో జరిమ్ణేఽగ్నే మర్తాగ్ంఅమర్త్యస్త్వం నః॥"

—ఋ. 10-87-21.

## కవిః కావ్యేన పరిపాహి రాజన్ :-

ఇట పరమేశ్వరుడు (అగ్ని) క్రాంతదర్శను డగు కవి యని చెప్పబడి, యెల్లెడల నుపద్రవములనుండి కాపాడెడి ప్రభువుగా 'రాజన్' అని మొదట సంబోధింప బడినాడు. రాజు ప్రజలను కాపాడుటకు చట్టము కావలెను. ఆ చట్టమే యిట వేదకావ్యము. ఆ కావ్యముతో రక్షింపుము (కావ్యేన పరిపాహి) అని కవి యిట నర్థింపబడుచున్నాడు. అట్టియెడ నా చట్టము ప్రభుసంమితమై కర్తవ్యమును శాసించి యుపద్రవముల నుండి కాపాడెడి కావ్య మగుచున్నది. ఇంతేగాదు.

## సఖే సఖాయ మజరో జరిమ్ణే :-

కవి యగు పరమేశ్వరుడే యీ రెండవ వాక్యమున జరారహితుడగు సఖుడుగ సంబోధింప బడినాడు : సఖు డగు సాధకుని గూడ కావ్యముతో జరారహితుని గావింపు మని యర్థింపబడుచున్నాడు. వేదకావ్యముతో జెలిమి యొనర్చుచో వేదము 'సచివిత్' (సఖివిత్) అగు నని పూర్వము దెల్పబడినది అట్టి, యతడు పరమేశ్వరునకు గూడ సఖు డగును. ఇట్లు పరమేశ్వరునితోడి నిరంతరసఖ్య మొనర్చు సఖునకు ఈశ్వరానుగ్రహముచే జిజ్ఞాస జనియించును. జిజ్ఞాసాపరు డగు నట్టి సఖునకు వేదకావ్యము హితుని వోలె వేదకావ్యార్థ విచారము ద్వారా కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించు చుండును. కాన నీ రెండవ వాక్యము వలన వేదము యొక్క సుహృత్సంమితత్వము సూచిత మగు చున్నది. మఱియు—

# అగ్నే మర్తాగ్ం అమర్త్యా స్త్వం నః -

ఈ వాక్యమున కవియగు పరమేశ్వరుడు అమర్త్యుడగు అగ్నిగా సంబోధింపబడినాడు; మర్త్యులను తనతోపాటు కావ్యముచే అమర్త్యుల నొనరింపు మని యర్థింపబడు చున్నాడు. ప్రభువై, నెచ్చెలియై కన్పట్టిన పరమేశ్వరుడే యిట నమర్త్యుడు. సర్వ 'వ్యాపకుడు, నగు అగ్ని (అంగతి సర్వత్ర గచ్ఛతీ త్యగ్నిః)గ దర్శింపబడినాడు జీవో మృతస్య చరతి స్వధాభి రమర్త్యో మర్త్యేనా సయోనిః' (ఋ. 1-164, 30). అనెడి పూర్వోదాహృత ఋఙ్మంత్రమున (చూ. స్వధాశబ్దము) 'దేహాదులు మర్త్య ములు-మరణధర్మము గలవి; జీవుడు అమర్త్యుడుమరణధర్మము లేనివాడు' అని చెప్ప బడినది. కాన జీవునకు అమర్త్యత్వము స్వాభావికము; మర్త్యత్వము ఆగంతుకము- దేహతాదాత్మ్యాభిమానము మూలము. అందుచే బరమేశ్వరుని వలెనే జీవుడును వాస్తవ ముగ నమర్త్యుడు. అట్టి యమృతత్వమును వేదకావ్యముచేత నను గ్రహింపు మని యిట నర్థింపబడినది. జిజ్ఞాసాపరు డగు వేదవిదునకు ఈశ్వరానుగ్రహముచే శ్రుతి సఖి (చెలి)యై ఆత్మస్వరూపము దర్శింప జేయవలె (జాయేవ పత్య ఉశతీ సువాసాః) నని తాత్పర్యము.

పై మంత్రార్థము బరిశీలించుచో - అగ్ని (పరమేశ్వరుడు) ప్రభువై శాసించు నెడల నీ వేదకావ్యము శాసించెడి చట్టమైనది; నెచ్చెలియై నపు డీ వేద కావ్యము కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించు నెచ్చెలియైనది. అమర్త్యుడై యాత్మ స్వరూపుడై భాసించు నపు డీ కావ్యము గూడ నమర్త్యత్వమును దర్శింపజేయు చెలియై యనన్యభావము జెందు నను విషయ మిట సూచిత మగుచున్నది. ఈ విషయమునే శ్రుతి యీ క్రింది మంత్రమున బయల్పరచుచున్నది.

మాతా రుద్రాణాం దుహితా వసూనాం
స్వసాదిత్యానా మమృతస్య నాభిః

ప్ర ణు వోచం చికితుషే జనాయ
మా గా మనాగా మదితిం వధిష్ట ॥"

—ఋ 8-101-15; తై. ఆ. 8-12- ; సాను. మం. బ్రా. 2-8-15.

ఇది గోదేవతాక మైన మంత్రము. గోరూపిణియైన దేవి రుద్రులకు మాత; వసువులకు దుహిత; ఆదిత్యులకు స్వస; అమృతమున కావాసస్థానము; నిరపరాధియు అదితియు నగు నీ గోరూపధారిణీ దేవిని హింసింపకు దని జ్ఞానియగు జనునకు జెప్పుచున్నాను -అని యర్థము.

దీని తరువాతి మంత్రము గూడ గోదేవతాకమే.
"వచోవిదం వాచ ముదీరయంతీం విశ్వాభి ర్ధీభి రుపతిష్ఠమానామ్ ।
దేవీందేవేభ్యః పర్యేయుషీం గా మామావృక్త మర్త్యో దభ్రచేతాః"

ఈ దేవి వాక్స్వరూపమును దెలియ జేయునది; వాక్ప్రేరయిత్రి; తన యన్నివాక్కుల చేతను పరమాత్మ నుపాసించునది; దేవార్థమై యేతెంచునట్టిది; అట్టి నన్ను (వాగ్దేవి యగు గోదేవతను) అల్పబుద్ధిగల మర్త్యుడు పరిత్యజించును - అని యర్థము.

ఈ మంత్రములకు సామాన్యముగ గోదేవతాపరముగ నర్థవివరణము గలదు. కర్మాంగముగ మంత్రవినియోగ సమయమున నా యర్థము గ్రాహ్యమే. కాని యీమంత్రములు గోసామాన్యార్థ స్ఫూర్తిని గలిగించుచునే వేదవాక్స్వరూప వివరణాత్మకములునై పఠింపబడుచు నా గోదేవిని వేదరూపిణిగ భావించు విధానమును వివరించుచున్నవి. మొదటి మంత్రమును జూతము. రుద్రులకు మాత, వసువులకు దుహిత, ఆదిత్యులకు స్వస, అమృతమున కావాసస్థానము - అని యిట్లు చెప్పుట వలన దెలియదగిన యంశ మేది ?

## దుహితా వసూనామ్ :-

వేదవిదుడు వసు-రుద్ర-ఆదిత్యరూపుడగుట శ్రుతివలన దెలియును.

"తస్మాత్ స్వాధ్యాయో ఽధ్యేతవ్యో యం యం క్రతు
మధీతే తేన తేనా స్యేష్టం భవతి - అగ్నే ర్వాయో రాదిత్యస్య
సాయుజ్యం గచ్ఛతి। త దేషాభ్యుక్తా। యే అర్వాఙుత వా
పురాణే వేదం విద్వాగ్ంస మభితో వద న్త్యాదిత్య మేవ తే
పరివద న్తి సర్వే అగ్నిం ద్వితీయం తృతీయం చ హగ్ంస
మితి" —తై. ఆ. 2-15-1. (చూ. ఆ. సం. 10-8-17)

"స్వాధ్యాయాధ్యయనము జేయవలెను; అట్లధ్యయనము జేయుచో నే యే క్రతుభాగము నధ్యయనము జేయుదురో వారు తమ యోగ్యత ననుసరించి క్రతుఫలము నొందుదురు; అగ్ని - వాయు - ఆదిత్య దేవతా సాయుజ్యము నొందుదురు; ఈ విషయము ఋఙ్మంత్రముచే గూడ నిట్లు చెప్పబడినది; అర్వాచీన వేదవిద్వాంసుని గాని, ప్రాచీన వేదవిద్వాంసుని గాని యెవరు నిందింతురో వారందఱు అగ్ని-వాయు - ఆదిత్య - దేవతానింద జేసిన వారగుదురు.

'అస్య వేదవిదః అగ్ని వాయ్వాదిత్య సాయుజ్య యోగ్యత్వాత్
ఏత న్నింద్యైవ తేషాం నిందా - ఇత్యనేనైవ మంత్రేణ
అగ్న్యాది రూపత్వ లక్షణం వేదవి న్మాహాత్మ్యం దర్శితమ్' —సా. భా.

వేదవిదుని నింపయే అగ్ని వాయ్వాదిత్య నింద యని చెప్పుటచే వేదవిదుడు అగ్నివాయ్వాదిత్య స్వరూపుడు; అందుచే అనింద్యుడు అని వేదవిదుని మాహాత్మ్యము చెప్పబడుచున్నది - అని యర్థము.

స్వాధ్యాయాధ్యయనముచే వేదవిదుడు సంస్కారక్రమాభివృద్ధి గల్గి అగ్ని - వాయు - ఆదిత్య స్వరూపు డగు నని తాత్పర్యము.

## వేదవిదుడు అగ్నివాయ్వాదిత్యరూపు డగుట యెట్లు ?

అగ్నియే వసు వని 'వసు రగ్ని ర్వసుశ్రవాః' (ఋ. 5-24-2, సా. సం. 2-458; వా. సం. 3-25; తై. సం. 1-5-6-3; శ. బ్రా. 2-3-4-31 మొ॥)

ఇత్యాది శ్రుతులు చెప్పుచున్నవి. కాని 'అష్టవసువులు' అను ప్రసిద్ధి గూడ శ్రుతులయందును, పురాణము లందును గలదు. వసువు లన సూర్య రశ్మ లనియు నిరుక్తము చెప్పుచున్నది. కొన్నియెడల నగ్నియు, కొన్నిచోట్ల వాయువు, ఇంకొక యెడ ఆదిత్యుకును 'వసువు' అని శ్రుతులు కీర్తించినవి. ఇట్లు 'వసు' శబ్దము ప్రకరణము ననుసరించి వేఱ్వేఱర్థముల బోధింప వచ్చును. కాని 'స ఏషో ఽత్ర వసుః' (శ. బ్రా. 9-3-2-1) - ప్రకృతత్వాత్ ఏత చ్ఛబ్దేన చిత్యాగ్నిం పరామృశతి (సా. భా.) అను శ్రుతి ననుసరించి అగ్ని చయనాది కర్మల యందు ప్రకృతు డగుటచే విట చిత్యాగ్నినే వసువుగా గ్రహింపవలసియున్నది. ఈ సంప్రదాయము ననుసరించి కర్మానుష్ఠాన సమయమున అగ్నినే వసువుగా గ్రహింపవలెను. అగ్ని వసు వగుచో నిరంతరము నగ్న్యుపాధనపరు డగు వేద విదుడు అగ్ని లేక వసు స్వరూపు డగును.

'యజమానో ఽగ్నిః' —శ. బ్రా. 6-3-3-21; 6-5-2-8.

'యజమానో ఽగ్నిః ఇతి విరాడ్రూపస్యాగ్నే ర్యజమాన భావి శరీరాత్మకతయా చ తద్రూపత్వమ్' —సా. భా.

కర్మానుష్ఠాన పరు డగు యజమానుడు ఉపాస్యదేవతా స్వరూపు డని ఐతరేయబ్రాహ్మణము వలనగూడ దెలియుచున్నది.

"అగ్ని ర్వై దేవయోనిః సో ఽగ్నే ర్దేవయోన్యా
ఆహుతిభ్య స్సంభవతి' —ఐ.బ్రా. 4-5-22.

'.... స యజమానో దేవయోనిరూపా దగ్నే రనుష్ఠితాభ్య
ఆహుతిభ్యశ్చ దేవతారూపః సంభవ త్యుపపద్యతే' —సా భా.

కాన అగ్న్యారాధనపరుడగు వేదవిదుడు విరాడగ్ని స్వరూపుడగుట, అనగా వసురూపు డగుట శ్రుతిసంమతము.

ఇట్లు వసురూపు డగు కర్మానుష్ఠాతకు వేదము దుహిత యగును. దుహిత యన పుత్రిక యని సామాన్యముగ నర్థము.

'దుర్హితా - దుఃఖేన హితా దుహితా'

అని యాస్కనిర్వచనము. దుఃఖకర మయ్యును హితమును గూర్చునది యని యర్థము. కట్వౌషధము వలెను ప్రభువువాక్కు వలెను వేదాధ్యయనము గాని తద్విహిత కర్మానుష్ఠానము గాని దుఃఖకర మయ్యును —మొదట క్లేశమును గల్గించున దయ్యును- పిదప హితమును గూర్చును. 'దూరే హితా దుహితా' అనియు మఱియొక నిర్వచనము నిరుక్తమున గలదు దూరమున నుండియు హితమును గూర్చునది యని యర్థము. అర్థజ్ఞాన రహితులకు వేదమంత్రములు దూరముగా నున్నట్లున్నను హితకరములే యగును. కాన వసువులకు శ్రుతి దుహిత యగు నని చెప్పుట యాలంకారికముగ యుక్తమే యగును.

## మాతా రుద్రాణామ్ :-

రుద్రులకు (మరుత్తులకు లేక ప్రాణములకు) మాత యని యర్థము శమాది సాధనసంపత్తి గలిగి జిజ్ఞాసాపరుడై శ్రవణము జేసి వేదమంత్రముల మన

వము జేయుచు తత్తన్మంత్ర ప్రతిపాద్యార్థ స్వరూపము ననుధ్యానించు వేదవిదునకు శ్రుతిమాతయై (శివతమోరసః.... ఉశతీ రివ మాతరః) వాత్సల్యము ప్రీతి మధురము, శివతమము నగు రసమును ఆస్వాదింప జేయుచు నుపదేశించును. రసాస్వాదపరు డగు నా వేదవిదుడు స్థూలశరీరాభిమానరహితు డగుచు ప్రాణశక్త్యభినివిష్టు డగును. (రమణీయ సూక్ష్మ శరీరాభినివిష్టు డగును). తత్తద్దేవతా మంత్రానుధ్యాన పారవశ్యమున తత్తద్దేవతా తాదాత్మ్యము నొందునని శ్రుతులును, సంప్రదాయవిదులును జెప్పుదురు.

ప్రజాపతియొక్క సూక్ష్మశరీరము రమణీయ మనియు, తదుపాసకుడగు యజమానుడును రమణీయ సూక్ష్మశరీర సంపత్తితో వెలయుచు ప్రజాపతి రూపుడగు ననియు శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"స ప్రజాపతిః, సోఽగ్నిః, స యజమానః స హిరణ్మయో భవతి...."

"త దస్మి న్నేతాం రమ్యాం తనూం మధ్యఽతో దధుః। త ద్య దస్మై తస్యాం రమ్యాయాం తన్వాం దేవా అరమన్త - తస్మా ది రమ్యమ్। హిరమ్యమ్ హ వై త ద్ధిరణ్య మి త్యా చక్షతే పరోఽక్షమ్। తథై వా స్మి న్నయ మేతాం రమ్యాం తనూం మధ్యతో దధాతి। ప్రాణో వా అస్య సా రమ్యా తనూః" —శ. బ్రా. 7-4-1-15, 16.

సః పురుషః ప్రజాపతిః స్థూల ప్రపంచాభిమానీ విరాడాత్మకః, సః ఏవ అగ్నిః సూక్ష్మప్రపంచాభిమానీ హిరణ్యగర్భాత్మకః, యజమానస్య తద్రూప ప్రాప్తేర్యజమానాత్మకో ఽపి స ఇత్యర్థః। ....తస్మా ద్రమణీయా జ్ఞానక్రియా శక్తిరూపా సూక్ష్మా తనూః ....ఏతస్యాం హితాయాం స్థాపితాయాం జ్ఞానక్రియా శక్త్యుపేత త్వేన రమణీయాయాం తన్వాం యస్మా ద్దేవా అరమన్తతస్మాత్

హితేఽస్మిన్ రమత ఇతి వ్యుత్పత్త్యా హిరమ్యమ్ ఇతి నామ సంపన్నమ్, తదేవ పారోక్ష్యేణ హిరణ్య మిత్యుచ్యతే....తథైవ ....అయం యజమానః। —సా. భా.

యజమానుడు విరాడ్రూపుడు, హిరణ్యగర్భరూపుడు నగును: ప్రజాపతియొక్క సూక్ష్మశరీరము జ్ఞాన క్రియా శక్తిరూపమై రమణీయము. హిత మగు దీనియందు దేవతలు రమింతురు గాన హితరమణీయ మగు నీ సూక్ష్మశరీరమునకు, (హితరమ్యమ్) 'హిరమ్య' మని పేరు. దేవతలు పరోక్షప్రియులు. అందుచే హిరమ్యమే పరోక్షముగా హిరణ్య మని చెప్పబడుచున్నది. తదారాధనా పరు డగు యజమానుని విషయమున గూడ నిట్లే; అనగా యజమానుని సూక్ష్మశరీరము గూడ హిరణ్య మగును - అని శ్రుతితాత్పర్యము.

దీనినిబట్టి యజమాను డగు సాధకుడు సంస్కార క్రమాభివృద్ధి గల్గి రమణీయ సూక్ష్మశరీరసంపత్తి గల్గి యుండు నని తెలియుచున్నది.

"యో దేవానాం ప్రథమం పురస్తాత్ విశ్వాధికో రుద్రో
మహర్షిః హిరణ్యగర్భం పశ్యత జాయమానమ్।"
—తై. ఆ. 10–10–3.

సమష్టి ప్రాణరూపు డగు హిరణ్యగర్భుడు రుద్రు డని యీ శ్రుతి వాక్యము చెప్పుచున్నది. కాన స్థూలశరీరాభిమాన రహితు డగుచు రమణీయ ప్రాణశక్త్యభినివిష్టు డగు వేదవిదుడును రుద్రరూపు డగును. సాధకుడు, జిజ్ఞాసాపరుడు, రుద్రరూపుడు నగు వేదవిదునకు శ్రుతి మాతయై వాత్సల్యము మీఱ నుపదేశించు నని "మాతా రుద్రాణాం" అనుచు శ్రుతి యాలంకారికముగ జెప్పినది. శ్రుతి మాతయై యుపలాలించుచు బోధించునను విషయమును శ్రీ శంకరభగవత్పాదులు నిట్లు చెప్పిరి.

"న్త్వం బాలం రోదమానం చిరతరసమయం శాంతి మానేతుమగ్రే
ద్రాక్షం ఖార్జూర మామ్రం సుకదల మథవా యోజయత్యంబికాఽస్మ,
తద్వ చ్చేతో ఽతిమూఢం బహు జననభవా న్మౌర్ఖ్య సంస్కారయోగాత్
బోధోపాయై రనేకై రవశ ముపనిష ద్బోధయామాస సమ్యక్"

—శతశ్లోకీ_ 8.

తల్లి యెంత సేపటి నుండియో యడే పనిగ పోరు పెట్టి యేడ్చుచున్న (రోదమానం) తన బిడ్డపోరు మాన్పుటకై ద్రాక్ష, ఖర్జూర, మామిడి, అరటి మున్నగు పండ్లను దెచ్చి యా బాలుని ముందుంచును. అట్లే యుపనిషత్తు గూడ బహుజన్మార్జితము లగు మూఢ సంస్కారములతో నిండి, వివేకము గోల్పోయి, కామ క్రోధాది దోష సంమోహితమై, పరతంత్రమై క్లేశపడు నంతఃకరణమునకు జ్ఞాన సాధనోపాయముల నెక్కింటిని యధికారి తారతమ్యానుగుణముగ జూపి యుద్బోధించినది- యని యర్థము.

పై యుపమానముచే కామక్రోధాది పరవశమై క్లేశపడెడి - (రోదించెడి) చిత్తము నెడల శ్రుతి, మాతయై జ్ఞాన సాధనోపాయముల జూపి యుపదేశించు నను విషయము స్పష్ట మైనది. రోదనధర్మముచే ప్రాణము లకును రుద్రు లని పేరు,

"ప్రాణా వై రుద్రాః। ప్రాణాహీదంసర్వం రోదయన్తి।"

జై. ఉ—— 4-2-6.

"ప్రాణా వావ రుద్రా ఏతే హీదగ్ం సర్వగ్ం రోదయన్తి"

—ఛాం. ఉ. 3_16_3.

రుద్రులై క్లేశపడెడి ప్రాణములను తల్లివోలె ఉపలాలించి శ్రుతి కర్తవ్యము నుపదేశించు ననుట యాలంకారికముగ యుక్తమే యగును.

## స్వసాఽఽదిత్యానామ్ :

ఆదిత్యులకు స్వస - అని యర్థము. ఈశ్వరానుగ్రహముచే బ్రహ్మాతి జిజ్ఞాసానంతరము బ్రహ్మనిష్ఠుడైన వేదవిదుడు ఆదిత్యస్వరూపుడు. అట్టి వానికి శ్రుతి స్వసయై యొప్పును.

ప్రాణములు పురుషుని ప్రథమవయస్సున వసువులు, మధ్యమ వయస్సున రుద్రులు; మూడవ వయస్సున ఆదిత్యులు నగునని శ్రుతి సంప్రదాయము. మొదటి ఇరువదినాలుగు సంవత్సరములు ప్రథమవయస్సు, తరువాత నలుబది నాలుగు సంవత్సరములు అనగా ఇరువదినాల్గవ వత్సరము మొదలుకొని అరువది యెనిమిదవ వత్సరము వరకు గల మధ్య కాలము -మధ్యమ వయస్సు. అది మొదలు నలుబది యెనిమిది వత్సరముల జీవిత కాలము మూడవ వయస్సు - ఇట్లీ త్ర్యాయుష పరిమిత కాలము నూట పదునారు వత్సరములు.

ఇట్టి పురుష జీవితకాలము ఒక యజ్ఞముగ (ఈశ్వరారాధన రూపముగ) భావన జేయుచు నీ పురుష యజ్ఞమును నిర్వర్తింప వలె నని శ్రుతి యాదేశము; ఉపదేశము; అగ్నిష్టోమాది క్రతువుల యందు ప్రాతః సవనము, మాధ్యందిన సవనము, తృతీయ సవనము - అను మూడు సవనములకును వరుసగా వసు - రుద్ర - ఆదిత్య అధిపతులు. అట్లే పురుష యజ్ఞమున నీ త్ర్యాయుషములు మూడు సవనములు. ఆ సవనములం దధిపతు లగు వసురుద్రాదిత్యులు ప్రాణములు. అనగా నీ ప్రాణములు ప్రాతఃసవనరూప మగు ప్రథమ వయస్సున వసువులు; మాధ్యందిన సవన రూప మగు మధ్యమ వయస్సున రుద్రులు; తృతీయసవనరూప మగు తృతీయవయస్సున నాదిత్యులు నగుచు, నీ పురుష యజ్ఞమున సవనత్రయాధిపతు లగుదురు. ఒకే ప్రాణములయందు వసురుద్రాదిత్యత్వమును దర్శించుట కుపపత్తిని నిర్వచన పూర్వకముగా శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"పురుషో వావ యజ్ఞః తస్య యాని చతుర్విగ్ంశతి వర్షాణి త
త్ప్రాతః సవనమ్। చతుర్విగ్ంశత్యక్షరా గాయత్రీ। గాయత్రం
ప్రాతః సవనమ్। త దస్య వసవో ఽన్వాయత్తాః। ప్రాణా
వావ వసవ ఏతే హీదగ్ం సర్వం వాసయన్తి ....... "

"అథ యాని చతుశ్చత్వారిగ్ంశ ద్వర్షాణి త న్మాధ్యందినగ్ం
సవనమ్। చతుశ్చత్వారిగ్ంశ దక్షరా త్రిష్టుప్। త్రైష్టుభం
మాధ్యందినగ్ం సవనమ్। త దస్య రుద్రా అన్వాయత్తాః। ప్రాణా
వావ రుద్రా ఏతే హీదగ్ం సర్వగ్ం రోదయన్తి .... .... "

"అథ యా న్యష్టాచత్వారిగ్ంశ ద్వర్షాణి త త్తృతీయ సవనమ్।
అష్టాచత్వారిగ్ంశ దక్షరా జగతీ। జాగతం తృతీయ సవనమ్।
త దస్యాఽఽదిత్యా అన్వాయత్తాః। ప్రాణా వా వా ఽఽదిత్యా
ఏతే హీదగ్ం సర్వమాదదతే .... .... "

— ఛాం. ఉ. 3-16-1, 35., జై. ఉ. 4-2.

సుఖ నివాస హేతువు (ఏతే హీదగ్ం సర్వం వాసయంతి) లగుటచే ప్రాణములు వసువులు. యజమాను దభిలషించెడి యిహాముత్ర ఫలములకు గారకుడై సుఖనివాస హేతుభూతు డగుటచే గర్మానుష్ఠాన సమయమున నగ్నియు వసురూపు డగును. అట్టి ప్రాణములతో దాదాత్మ్యము జెందు పురుషుడును (యజమానుడును) వసు వగును.

'రుదన్తి రోదయన్తీతి ప్రాణా రుద్రాః। క్రూరా హి మధ్యమే
వయ స్యతో రుద్రాః।' — శం. భా.

'రోదించునవి, రోదింపజేయునవి' గాన ప్రాణములకు 'రుద్రా' అని పేరు. ఇవి మధ్యమ వయస్సున నతిక్రూరములై యొప్పును. అందుచే వీనికి 'రుద్రాః' అని యన్వర్థ సంజ్ఞ.

'పరిణామ తాప సంస్కార దుఃఖై ర్గుణవృత్తి విరోధా చ్చ
దుఃఖ మేవ సర్వం వివేకినః' —పాతం. యో. సూ. 2–15.

కర్మలచే–భోగములచే - నింద్రియములకు గలుగు తృప్తి సుఖము. అట్లుతృప్తి లభింపక కలిగెడి యశాంతి దుఃఖము. "నా స్తితృష్ణాసమం దుఃఖం నా స్త్యతృష్ణా సమం సుఖ' మ్మని యభియుక్తోక్తి. వివేకు లగు మహనీయుల దృష్టిలో తాత్కాలిక మగు నీ సుఖ మంతయు గూడ దుఃఖరూపమేయగును. అట్లు దుఃఖము వలన క్లేశపడెడి ప్రాణములు రోదనధర్మము గల్గి రుద్రరూపము లగు నని శ్రుతితాత్పర్యము.

తృతీయ సవనరూప మగు తృతీయవయస్సున ఆదాన ధర్మముతో నొప్పి ప్రాణము లాదిత్యరూపములు (ఏతే హీదగ్ం సర్వ మాదదతే) అగును. ఆదిత్యున కాదాన మసాధారణ ధర్మము. 'ఆదత్తే హి రసం రవిః' అను కాళిదాససూక్తియు నీ విషయమును జెప్పుచున్నది. ఆదిత్యుడు రసమును (జలాదికమును) గ్రహించు నట్లు పరిణత మగు వయస్సున నుండెడి వేదవిదుని ప్రాణములును శబ్దా దిజాతమును సర్వమును గ్రహించును - అని శ్రుతితాత్పర్యము. (తే హీదం శబ్దాదిజాత మాదదతే ఇత ఆదిత్యాః–శం. భా.)

కాన సవనత్రయాత్మక మగు పురుషయజ్ఞము త్ర్యాయుషము. ఎట్టి విచ్ఛిత్తియు లేకుండ యజ్ఞనిర్వహణార్థమై యిట్టి యీ త్ర్యాయుషము నను గ్రహింపు మని యుపనీతులగు వటువులు గూడ సమిదాధానరూప మగు అగ్నికార్యసమయమున నగ్ని నర్థించెడి సంప్రదాయము గలదు.

"త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషం
యద్దేవానాం త్ర్యాయుషం తన్మే అస్తు త్ర్యాయుషమ్."

జైమినీయోపనిషద్బ్రాహ్మణము గూడ నీ పురుషయజ్ఞ స్వరూపము నిట్లే వివరించి, పిదప త్ర్యాయుష మన నిదియే యను నట్లుగా నట్టి త్ర్యాయుషము నర్థించెడి పై మంత్రమును కొలది మార్పులతో నిట్లుదహరించినది.

"త్ర్యాయుషం కశ్యపస్య జమదగ్నే స్త్ర్యాయుషమ్।
త్రీ ణ్యమృతస్య పుష్పాణి త్రీ ణ్యాయూంషి మేఽకృణోః"

—1-4-3.

పుష్పములు గాపాచుకొనుచో నవి ఫలముల నొసగు రీతిని, కర్మాద్యవస్థాన తత్పరుడై త్ర్యాయుషము లనెడి యీ పుష్పముల గాపాడుకొనుచో నమృతత్వప్రాప్తి యోగ్యము లయిన ఫలముల నొసగ గలవు. అందుచే వీనిని 'అమృతస్య పుష్పాణి' యని శ్రుతి నిర్దేశించినది.

ఇక బ్రహ్మకృతమునకు వత్తము. పై శ్రుతిప్రామాణ్యము ననుసరించి మొదట కర్మనిష్ఠుడై వసురూపుడు, జిజ్ఞాసాపరుడై రుద్రరూపుడు నైన వేదవిదుడు బ్రహ్మనిష్ఠుడై యాదిత్యరూపు డగు ననుట యుక్తమే. అట్టి యాదిత్యరూపులకు శ్రుతి స్వసయై యొప్పును.

స్వస యన సోదరి యని సామాన్యముగ నర్థము. 'స్వసస్మిన్ సీదతీతి స్వసా' - అని యాస్కనిర్వచనము 'సు ఆసా వేషు సీదతీతి స్వసా' అనియు మఱియొక నిర్వచనము. (నిరు. టిప్పణి). జిజ్ఞాసాపరుడై బ్రహ్మనిష్ఠు డైనవానికి శ్రుతి తన వాక్యము లన్నియు నాత్మయందే (స్వస్మిన్) సమన్వయ పఱచి వెలయుచు, తోడనుండి, నక్కిన యగు నని భావము. ఆదిత్యుడు రసమును గ్రహించునట్లు, బ్రహ్మనిష్ఠుడై యాదిత్యరూపుడగు నీ వేదవిదుడు త్రయీవిద్యా సారమగు రసమును (బ్రహ్మామృతానంద రసమును) గ్రహించి యాదిత్యు డను అన్వర్థనామము నొందును.

కాగా, మొదట వేదాధ్యయన కర్మానుష్ఠానాదులు, పిదప శ్రవణ మననాదులు– వీని ద్వారా శ్రుతి ప్రభుసంమితము, సుహృత్సంమితము నగుచు సాధకుని హృదయము నందు క్రమముగ సరసత (చక్కని చిత్తసంస్కృతి) నాపాదించి, తుదకు కాంతాసంమితముగ నాత్మ (లేక తన) స్వరూపమును దర్శింపజేయుచు బ్రహ్మానంద రసావలిప్తుని గావించు చున్నది.

## అమృతస్య నాభిః- అనాగా - అదితిః -

శ్రుతియందలి యిట్టి వైదగ్ధ్యమును దర్శించిన వేదవిదు లగు మహనీయులనే 'యే విద్వాంసస్తే కవయః' - అని శ్రుతి కీర్తించినది. అట్టి విద్వాంసు లగు కవులే వేదకావ్యకుశలు రగు సహృదయు లని పూర్వము చెప్పబడినది. వారికి అమృతరూప మగు నానందమునుదర్శింప జేయునది గావుననే శ్రుతి 'అమృతస్య నాభిః-అమృతమున కావాసస్థానము' అగు చున్నది.

అపౌరుషేయమై, యందుచే పురుషబుద్ధికృత దోషరహితమై (అనాగాం) అఖండనీయమై - సర్వదేవతా మంత్ర తత్త్వ ప్రఖ్యాపిక యగుచు సర్వదేవతా మాతృమూర్తియై, అదితి [1] స్వరూపిణి యగు వైదిక వాణిని వధింపకుడు (మా వధిష్ట)-హింసింపకుడు- అని పై మంత్రము నకు శ్రుతిపరమైన యర్థము.

ఇట్లు 'మాతా రుద్రాణామ్' అను నీ మంత్రము ద్వారా శ్రుతి తన స్వభావమును తానే భంగ్యంతరముగ నిరూపించుకొనినట్లు స్పష్ట మగును. పై శ్రుతివలన బ్రహ్మనిష్ఠు లయిన వేదవిదులకు శ్రుతి బ్రహ్మవిద్యా రూపిణియై స్వసయై యొప్పు నని తెలిసినది.

1. అదితి ర్హి గౌః —వా.సం. 38-2; శ.బ్రా. 14-2-1-7; 2-3-4-348.
వాగ్వా అదితిః—శ.బ్రా. 6-5-2-20.

## అంబిక - బ్రహ్మవిద్యారూపిణి - స్వసః.

బ్రహ్మవిద్యారూపిణి యగు అంబికయు బరమేశ్వరునకు 'స్వస' యై విరాజిల్లుచుండు నని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

'ఏష తే రుద్ర భాగః సహ స్వస్రాఽమ్బికయా, తం జుషస్వ'

—తై.సం. 1-8-6-1.

వాజసనేయశ్రుతియందు (3—57) నీ వాక్య మిట్లే గలదు. శతపథశ్రుతి యా వాక్యము నిట్లు వివరించినది

'అమ్బికా హ వై నామాఽస్య స్వసా, తయాఽస్యైష సహభాగః' —శ. బ్రా 2-6-2-9.

కాన బ్రహ్మవిద్యారూపిణి యగు పరమేశ్వరి పరమేశ్వరునకు స్వస యైనట్లు బ్రహ్మనిష్ఠ డయిన వేదవిదునకు బ్రహ్మవిద్యారూపిణి యగు శ్రుతియు స్వసయై యొప్పుట శ్రుతిసంప్రదాయానుగుణమే యగును.

కేనోపనిషత్తునందును ఇంద్రునకు సాక్షాత్కరించిన హైమవతియగు ఉమ పరమేశ్వరసహవర్తిని, బ్రహ్మవిద్యారూపిణి యగు పరాదేవత యని శ్రీ శంకరభగవత్పాదు లిట్లు వివరించిరి.

'తస్యేంద్రస్య యక్షే భక్తిం బుద్ధ్వా విద్యా ఉమారూపిణీ
ప్రాదు రభూత్-స్త్రీరూపా। స ఇంద్ర స్తా ముమాం బహు
శోభమానాం-సర్వేషాం హి శోభమానానాం శోభనతమా
విద్యా, తదా బహుశోభమానేతి విశేషణ ముపపన్నం భవతి,

హై మవతీం హేమకృతాభరణవతీ మివ బహుశోభమానా మిత్యర్థః। అథవా ఉమైవ హిమవతో దుహితా హైమవతీ నిత్య మేవ సర్వజ్ఞే నేశ్వరేణ సహ వర్తత ఇతి జ్ఞాతుం సమర్థేతి కృత్వా తాం - ఉపజగామ' —పదభాష్య.

'స శాన్తాభిమాన ఇంద్రోఽత్యర్థం బ్రహ్మజిజ్ఞాసుః .... ప్రియ మతిరూపిణీం విద్యా మాజగామ। అభిప్రాయోద్భోధ హేతుత్వా ద్రుద్రపత్న్యుమా హైమవతీవ సా బహుశోభ మానా విద్యైవ। విరూపోఽపి విద్యావాన్ బహు శోభతే।'

—వాక్యభాష్య.

విజయగర్వమోహితులై యగ్నివాయువులు తమ యెదుట ప్రత్యక్షమైన యక్షమును యక్షమును గానే దర్శించిరి. ఆ యక్షము యెదుట నుంచిన తృణమునుగూడ నగ్ని దహింపలేకపోయెను. వాయు వా తృణమును గదిలింప లేకపోయెను ఇట్లు వారు పరాభూతు లయిన పిదప ఇంద్రుడు రాగా నా యక్ష మంతర్హిత మయ్యెను కాని యింద్రు డా యక్షమును యక్షముగా గాక పరమేశ్వరస్వరూప మని గుర్తింప నాతని మనస్సు భక్తినిర్భరము. శాంతాభి మానమై జిజ్ఞాసాపరవశము నయ్యెను. అగ్నివాయువుల వలె గాక యింద్రుడు శాంతాభిమానుడు బ్రహ్మనిష్ఠుడు నగుట జేసి హైమవతి యగు ఉమ బహుశోభ మాన యగుచు సాక్షాత్కరించెను ఇంద్రు డంతట- 'ఈమె సర్వజ్ఞు డగు పరమేశ్వ రునితో నిత్యము తోడ నుండునది; బ్రహ్మవిద్యాస్వరూపిణి, కాన పరమేశ్వర స్వరూపమును దెలియజాలినది'—యని తెలిసి యామెను జేరి యుపాసించెను బుద్ధి వికసింపజేసి పరమార్థమును దర్శింపజేయు విద్యలలో బ్రహ్మవిద్య యుత్తమోత్త మము. ఎంతటి విరూపవంతు డైనను విద్యచే శోభించును. అందును బ్రహ్మ విద్యచే మిగుల శోభించును. కనుక బ్రహ్మవిద్యారూపిణి యగు ఉమ 'బహు శోభమానా' యని కీర్తింపబడినది - అని యర్థము.

ఇట భక్తిప్రవణుడై జిజ్ఞాసాపరవశు డయిన యింద్రునకు పరాదేవత బ్రహ్మవిద్యాస్వరూపిణియై సాక్షాత్కరించి పరమార్థమును దర్శింప జేయుట గమనార్హము. యక్షరూప పరమేశ్వర స్వరూప దర్శన భాషణాదులచే నగ్నివాయువుల ఇతరదేవతల కంటె భాగ్యాతిశయ సంపన్నులే. వారికంటెను గూడ భక్తి నిష్ఠుడై, శాంతాభిమానుడై, బ్రహ్మ విద్యాసాక్షాత్కారము నొందిన యింద్రుడు లోకోత్తరభాగ్యశాలి. కావుననే 'ఏతద్ (తృణం) దహ,' 'ఏతద్ (తృణం) ఆదత్స్వ ఇది దహింపుము ఇది కదిలింపుము-అని యిట్లు పరీక్షించి పరోక్షముగ నగ్ని వాయువులకుదన పారమైశ్వర్యమును ప్రబోధించిన యక్షమే శాంతాభిమానుడై, భక్తిప్రవణమనస్కుడై జిజ్ఞాసువై యుత్తమాధికారి యయిన యింద్రునకు ఉమారూపిణియై స్త్రీరూపమున సాక్షాత్కరించి బ్రహ్మవిద్యోపదేశము జేయుట గుర్తింప నగును.

శ్రీ మాధవాచార్యులచే గూడ నీ శ్రుతితాత్పర్య మిట్లే కాలమాధవీయమున నిట్లు వివరింపబడినది.

"భక్తానుగ్రాహి మూర్తిస్వీకార శ్చ తవలకారాఖ్యే సామవేద
శాఖావిశేషే కస్యాంచి దాఖ్యాయికాయా మామ్నాయతే।
తస్యాం హ్యాఖ్యాయికాయా మేవ ముక్తమ్ - అగ్ని
వాయ్వింద్రాదయో దేవా ఈశ్వరానుగృహీతాః సర్వత్ర
విజయమానాః స్వకీయ మేవైత త్సామర్థ్య మిత్యభిమన్యంతే।
తాన్ బోధయితు మవాఙ్మానసగమ్యం పర మేవ బ్రహ్మ
పూజ్యాం చక్షుర్గమ్యాం కాంచి న్మూర్తిం ధారయిత్వా
ప్రాదుర్బభూవ। తయా సహ వాదం కృత్వాఽపి రాజస
చిత్తా వగ్నివాయూ బ్రహ్మతత్త్వం నైన బుబుధాతే। ఇంద్ర
స్తు సాత్త్వికచిత్తో బుబుధే" -ఇతి. ——ఉపోద్ఘాతప్రకరణమ్.

పరమేశ్వరు డా యా సమయములందు భక్తుల చిత్తసంస్కృతుల ననుసరించి తత్తదనుగ్రహయోగ్య మూర్తివిశేషముల స్వీకరించుచుండునను విషయమును

కే నోపనిషత్తు ఒక యాఖ్యాయికారూపమున వివరించినది. పరమేశ్వరుడు పూజ్య యక్షరూపమున సాక్షాత్కరించినను విజయాభిమాన మోహితులై రాజసచిత్తు లగుట జేసి యగ్నివాయువులు బ్రహ్మతత్త్వము దెలియజాలకపోయిరి. సాత్త్వికచిత్తు డగుటచే వింద్రుడు తెలియజాలెను- అని యర్థము.

రాజసచిత్తులగు నగ్నివాయువులకంటె సాత్త్వికచిత్తుడై యుత్తమాధికారి యయిన యింద్రునకు బ్రహ్మవిద్య స్త్రీరూపమున సాక్షాత్కరించి యాత్మస్వరూప మును దర్శింపజేయుట స్పష్ట మని తెలియనగును. కాన పరమేశ్వరునకు సహ వర్తినియై స్వసయై శోభిల్లు పరాదేవతవలె బ్రహ్మనిష్ఠుడై వరలెడి వేదవిదునకు శ్రుతి తోడనుండి స్వసయై యాత్మస్వరూప సౌందర్యాదుల దర్శింపజేయు ననుట యుక్తమే యగును.

"ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః" (ఋ. 10–71-4) ఇత్యాది శ్రుత్యర్థమే యిట నాఖ్యాయికారూపమున జమత్కారముగ శ్రుతిచే బ్రదర్శింపబడిన దని తెలియనగును. కాన అధికారిభేదము ననుసరించి ప్రభు- సుహృత్ - కాంతా సంమితత్వ మార్గముల ద్వారా సాధకుల కర్మ - ఉపాసనా - జ్ఞాననిష్ఠల నొనరించుటయే త్రయీవిద్యారూప వేదకావ్య స్వభావము.

## చారిత్రికుల దృష్టి:-

కాని చరిత్రకారులు కవి-కావ్య పదములకు పైన బేర్కొనిన శ్రుతి స్మృతి కావ్య సంప్రదాయ సిద్ధము లయిన యర్థముల గ్రహించినట్లు కన్పట్టదు. వారు 'Poet-Poetry' అని యీరీతిగానే యా పదముల ననువదించిరి. ఆ పదములకు గల యర్థగాంభీర్యము వారిచే రూపొందింపబడిన కోశముల వలనను తేటపడుట లేదు. 'Poet-Poetry' అను నీ యాంగ్లపదములను పాశ్చాత్యకవులు, విమర్శ కులు ప్రాయికముగ నే యే యర్థములందు బ్రయోగించి - యట నట నా పదముల

యర్థముల నిర్వచించిరో, యా దృష్టితోనే శ్రుతిని, యందలి కవి కావ్య పదముల బరిశీలించుటకు చారిత్రికులు బూనుకొని నట్లు గన్పట్టుచు. ఆ దృష్టితోనే చూచి లౌకికకావ్యము లందు వలె వేదమున 'చమత్కృతి (Poetic Merit) యెడ నెడ కొలదిగ గన్పట్టుచున్నను మొత్తముమీద వేదము నందు కావ్యలక్షణము లేదను భావమే వారి వ్రాతలు దెలియజేయుచున్నవి. అందు చేతనే శ్రుతియందలి 'కవి కావ్య' యనుపదములు 'మంత్రరచయిత వారి రచన- లేక స్తోత్రము' అను నర్థముల బోధించు నవిగనే వారికి గన్పట్టినవి. శ్రుతిదృష్టిలోను తత్సంప్రదాయ ప్రవర్తకు లగు మహర్షుల దృష్టిలోను మహాకవుల దృష్టిలోను గల కావ్యలక్షణము వేఱు; ఈ చరిత్రకారుల దృష్టిలో గల కావ్యలక్షణము వేఱు. దృష్టిభేదమే యీ పదముల కిట్టి యర్థమును జెప్పుటకు కారణమైనది.

పాశ్చాత్యపండితులు, కవులు - వీరి దృష్టిలోని కావ్య (Poetry) స్వరూపమును జూతము. కావ్య (Poetry) మనగా :-

1) Metrical Composition - ఛందోబద్ధమైన రచన

—జాన్సన్.

2) 'The art of uniting pleasure with truth by calling imagination to the help of reason' — చమత్కారజనకమగు కల్పనతో సహేతుకముగ వాస్తవికతను ఆనందముతో మేళవించెడి కళ.

—కోశము.

3) 'The thought and words in which emotion spontaneously embodies itself — అప్రయత్నముగ నావేశముతో రూపొందు భావము, శబ్దములు.

4) The art of employing words in such a manner as to produce an illusion on the imagination, the art of doing by

means of words what the painter does by means of colours— వాస్తవముగ లేకున్నను చిత్రలేఖకుడు రంగులతో నొక వస్తువును సజీవముగ నున్న యటుల చిత్రించునట్లు, శబ్దములతో లేని యర్థము నున్నయటుల భ్రాంతిని గొల్పి చమత్కరించు కళ. —మెకాలే.

5) The expression of the imagination - ఊహాభివ్యక్తి.

—షెల్లీ.

6) The language of the imagination and the passions- ఊహలను, భావోద్రేకములను ప్రతిబింబింప జేయు భాష.

—హాజిలిట్.

7) The anti-Thesis of science, having for its immediate object pleasure, not truth -- కవితకు లక్ష్యమానందము; వాస్తవికత గాదు; కాన భౌతికశాస్త్రమున కిది విరుద్ధము. —కోలేరిడ్జ్.

8) The most delightful and perfect form of utterance that human words can reach -- మానవుడు శబ్దజాలముతో రూపొందింప గల్గిన అహ్లాదకరము, పూర్ణము నగు రచన. —మాచ్యూ ఆర్నాల్డ్.

9) Musical thought -- లయసమన్వితభావము —కార్లైల్.

10) The spontaneous overflow of powerful feelings- ఒక్కసారిగా పొంగి పొరలెడి ప్రబల - ఉదాత్త - భావపరంపర. వర్డ్స్‌వర్త్.

దాదాపు ఇట్టి యభిప్రాయములనే ప్రతిబింబింపజేయు నిర్వచనము లింకను గలవు ఈ నిర్వచనము లన్నియు తమ తమ యభిరుచుల ననుసరించి వెలువడినవి. ఒకే లక్ష్యము

నుద్దేశించి ప్రవృత్తము లయినవి కావు. కొందఱకు ఆనందమే లక్ష్యము; వాస్తవికత గాదు. కొందఱకు ఆనందముతో గూడిన వాస్తవికత ధ్యేయము. వాస్తవము గానిమ్ము; కాక పోనిమ్ము; గిలిగింతలు పెట్టి యాకర్షించుట కొందఱ కభిమతము. పొంగి పొరలెడి ప్రబల భావావేశపరంపరలో తన్మయీభావము కొందఱు కాంక్షించునది. ఇట్లు పరిశీలించుచో నీ నిర్వచనముల కొకే లక్ష్యము లేదనుట స్పష్టమగును. ఇవియన్నియు దాదాపు అలంకార ప్రాధాన్యమును జెప్పెడి భారతీ యాలంకారికుల నిర్వచనములలో నంతర్భూతము లగునని చెప్పవచ్చును. 'సౌందర్య మలంకారః' అని భట్టవామనుని వచనము. మనస్సుని రంజింపజేయు సౌందర్యము అలంకార మని యర్థము. 'A thing of beauty is joy for ever' ఇత్యాది పాశ్చాత్యకవుల వచనములు భట్టవామనుని వచనమును స్ఫూర్తికి దెచ్చుచుండును. 'బాహ్యసౌందర్యమును జూచి ప్రభావితమై పొంగి పొరలెడి యావేశముతో మూర్తీభవించెడి చమత్కారజనక శబ్దార్థ సన్నివేశము కావ్యకళ' అని యీ యన్ని నిర్వచనముల గలిపి జూచిన సిద్ధించెడి సారాంశముగా దెలియనగును.

ఇట్టి దృష్టితోనే—'ప్రకృతి దృశ్యముల జూచి పరవశులైన ఆర్యు లనెడి వారి రచనలు వేదములు'—అని చారిత్రికుల కల్పన సాగినది. 'శ్రుతుల యందలి ద్యావా పృథివీ-అగ్ని-వాయు-ఆదిత్యాది వర్ణనలు కేవలము ప్రకృతిదృశ్య వర్ణనలు గావు; అవి మంత్రములు; మననశీలములు; మననము జేయుకొలది ఆధిభౌతిక - అధిదైవిక - ఆధ్యాత్మికాద్యర్థముల ప్రబోధించునవి; బాహ్యసౌందర్య వర్ణన వ్యాజమున అంతర్దృష్టిని గలిగించునవి; శివతమ రసాస్వాదరూపమగు నజ్ఞాతార్థము వైపు దృష్టిని మరల్చునవి (వేదయతీతి వేదః; నితరాం వేదయతీతి నివిత్)' - అనియెడి యిట్టి విషయములు చారిత్రికుల దృష్టిలో నున్నట్లు వారి విమర్శలవలన గోచరింపదు.

భారతీయాలంకారికులు, మహాకవులు; మహర్షులు, శ్రుతియును జూపిన కవి-కావ్య-రస-ఆనంద-అలంకార-రీతి-శయ్యాది స్వరూపములుగాని, అధికారిభేదము ననుసరించి యీ పదములచే దెలియబడెడి విశిష్ట వివిధార్థస్వరూపము గాని చారిత్రికుల విమర్శలవలన దెలియదు. అట్టి యర్థగాంభీర్యమును దర్శించి

యా దృష్టితో శాస్త్రమును బ్రవర్తింపజేసిన వారు భారతీయాలంకారికులు. ఈ లక్ష్యమును విస్మరింపక భవ్య కవితావేశముతో గావ్యముల గానము చేసినవారు భారతీయ మహాకవులు. అందుచే భారతీయాలంకారికుల వచనములు, భారతీయ మహాకవుల సూక్తులు బరిశీలించినచో శ్రుతి యుద్దేశించిన 'కవి-కావ్య స్వరూపము తేటపడు నట్లు, అట్టి దృష్టిని ప్రతిబింబింప జేయని చారిత్రికుల కల్పనల నెంత బరిశీలించి నను నా స్వరూపము గోచరము గాదు.

శ్రుతియే ప్రత్యక్షముగను, పరోక్షముగను, కాంతాసంమితముగను తాను ప్రభు-సుహృత్-కాంతాసంమితముగ కర్మ- భక్తి - జ్ఞానయోగముల ప్రబోధించెడి త్రయి; విద్య; కావ్యము; ఛందస్సు-అని చెప్పికొనుట పూర్వము వివరింపబడినది. కాన శ్రుతియందలి త్రయీ - విద్యా - కావ్య -ఛందః స్వరూపముల సాకల్యముగ దర్శించినగాని శ్రుతి స్వరూపమును యథాతథముగ గ్రహింప శక్యము గాదనుట శ్రుతితాత్పర్యము.

'భారతీ' యనియు వేదవాణికి నామము. భారతీ స్వరూప పరిశీలనము జేసియు నీ వేదముయొక్క 'త్రయీ-విద్యా-కావ్య' స్వరూప మింకను తేటపడ గలదు. ఇక భారతీ స్వరూపమును జూతము.

# భారతీ

చరంతీ త్రైలోక్యం త్రిభువనపతే ర్యా సహచరీ
వసంతీ చిత్తేషు ప్రథయతి పరం సాధయతి చ।
చరంతీ యజ్ఞేషు హ్వాయతి చ సురాన్ పాలయతి యా
వరాం భారత్యాఖ్యాం హరిహృదియలక్ష్మీం హృది భజే ॥

అంబ ! భారతి ! నిరుక్తి రంజితే
సూనృతే మధుర సూక్త శోభితే ।
భావనాంబర విహార విశ్రుతే
పాహి పావని హరిప్రియే శివే॥

భారతీ భరత స్యేయం హరే స్సర్వస్వరూపిణీ ।
హృదయే హృదయే సత్యం విహరంతీ విరాజతామ్ ॥

— వేదమాతృ స్తవః

## త్రిస్రోదేవ్యః :-

వేదవాణి తన నారాధించెడి వసు-రుద్ర-ఆదిత్య రూపులగు వేదవిదుల యధికారి (అవస్థా) భేదము ననుసరించి యొకపుడు దుహితయై, ఇంకొకయెడ మాతయై, పిదప స్వసయై - ఇట్లు మూడు రూపములతో వెలసి యుపదేశించుచు అదితియై అనగా సర్వదేవతాత్మక మగు నఖండవాణి లేక శక్తియై, తనకు అన్యూత

నాభియై వరలు నని యింతకు బూర్వము వివరింపబడినది. ఈ వేదవాణియే భారతి.

కాని శ్రుతులయందు ఒక భారతీనామమే గాక దీనితోపాటు ఇడా-సరస్వతీ నామములు గూడ తఱచుగ వినవచ్చుచున్నవి. ఈ మూడు నామములతో శ్రుతులయందు ముఘ్వురు దేవతలు సాక్షాత్కరింతురు. ఈ ముఘ్వురికి నిరంతర సాహచర్య మున్నట్లును గన్పట్టును. వీరు 'తిస్రోదేవ్యః' (ఋ. 1-13-9; తై. బ్రా. 2-6-14-4 మొ.) అని వ్యవహరింపబడుచు యజ్ఞభూమి కాహ్వానింప బడుట పెక్కుచోట్ల గాననగును. ఒక్కొకపుడు ఇడా-సరస్వతీ - భారతి1 యని ప్రత్యేకముగ మూడు నామములతోను, కొన్ని యెడల 2 'ఇడాః, లేక సరస్వత్యః లేక భారత్యః' అని యొక్కొక్కనామముచేత నే ముఘ్వురు వ్యవహరింపబడుటయు గలదు. ఇం-కొకయెడ మహీః, మాతరః - ఇత్యాది పదములచే గూడ గీర్తింప

---

1. 'ఇడా సరస్వతీ భారతీ' — వా. సం. 27-19; తై. సం. 4-1-8-?; మై. సం. 4-13-8; కా. సం. 18-17; 19-13; తై. బ్రా. 3-6-13-1.

"సరస్వతీ సాధయంతీ ధియం న ఇళా దేవీ భారతీ విశ్వతూర్తిః"

"తిస్రో దేవీః" — ఋ. 2-3-8.

'ఇడా సరస్వతీ భారతీ మహీః' — వా. సం. 28-8; తై. బ్రా. 2-6-7-4.

'ఇడా సరస్వతీ మహీ' — ఋ. 1-13-9 మొ॥; అ. సం. 5-27-9; మై. సం. 2-16-6.

2. 'భారత్యః' — తై. బ్రా. 2-6-17-6;

'ఇడాభిః' — వా. సం. 21-14.

బడుటయు గలదు - ఇట్లు జూచినచో నీ క్రింది యాక్షేపము లుత్పన్నములు కాగలవు.

## ఆక్షేపములు :-

1) ఇడా - సరస్వతీ - భారతీ యను నీ ముగ్వురును దేవతలు గదా! అట్టి యెడ భారతి యను పదమొక దేవతావాచక మగును గాని వేదవాచకమగుట యెట్లు ?

2) మఱియు భారతీపదము ఈ దేశము నందును, ఇందలి ప్రజ యందును ప్రసిద్ధ మైనట్లీ క్రింది పురాణవచనముల వలన దెలియుచున్నది.

## దుష్యంతపుత్రుడు భరతుడు-భారతీప్రజ :-

"భరతా ద్భారతీ కీర్తిః యే నేదం భారతం కులమ్ ।
అపరే యే చ పూర్వే వై భారతా ఇతి విశ్రుతాః॥"

.... భార. 1-74-134.

"దుష్యంతా ద్భరతో జజ్ఞే విద్వాన్ శాకుంతలో నృపః ।
తస్మా ద్భారతవంశస్య వి ప్రతస్థే మహద్యశః॥"

— భార. 1-94-19.

"చక్రవర్తీ తతో జజ్ఞే దుష్యంతా త్సమితింజయః ।
శకుంతలాయాం భరతో యస్య నామ్నా తు భారతాః॥"

— మత్స్య. 49-11.

## ఋషభపుత్రుడు భరతుడు - భారతవర్షము :-

"అథ భగవాన్ ఋషభదేవ .... ఆత్మజానాం ఆత్మసమానానాం శతం జనయామాస। తేషాం ఖలు మహాయోగీ భరతో జ్యేష్ఠః శ్రేష్ఠగుణ ఆసీత్; యేనేదం వర్షం భారత మితి యత ఆరభ్య వ్యపదిశంతి"

.... భాగ. 5-3-8;9,10.

"ఋషభాత్ భరతో జజ్ఞే వీరః పుత్రశతాగ్రజః।
సోఽభిషి చ్యాఽథ ఋషభః పుత్రం ప్రావ్రాజ్య మాస్థితః॥

హిమాహ్వం దక్షిణం వర్షం భరతాయ న్యవేదయత్।
తస్మాత్తు ద్భారతం వర్షం తస్య నామ్నా విదు ర్బుధాః"

.... వాయు. పు. 33-51, 52. .... విష్ణు. పు. 2-1-27 నుండి 32.

## మనువు భరతుడు-భారతవర్షము-భారతీప్రజ :-

"వర్షం య ద్భారతం నామ యత్రేమా భారతీ ప్రజా॥
భరణా చ్చ ప్రజానాం వై మను ర్భరత ఉచ్యతే।
నిరుక్తవచనా చ్చైవ వర్షం త ద్భారతం స్మృతం॥"

- వాయు. పు. 47-76; మత్స్య. పు. 113-5.

## లోకమే భారతము :-

"లోకోఽయం భారతం వర్షమ్" —అమరకోశః

"మహర్షి వ్యాసరచితే జంబూద్వీపే చ భారతమ్" —రభసః

"వర్షం స్థానం నిదుః ప్రాజ్ఞా ఇమం లోకం చ భారతమ్—భారవి

"వర్షోఽస్త్రీ భారతాదౌ చ జంబూద్వీపాబ్దవృష్టిషు" —అమరసుధా

"అత ఏవ సామాన్యవిశేషభావాత్ జంబూద్వీపే తదేకదేశే
చ భారతప్రయోగః, ప్రకరణాదిభి స్తు తదవగమః"

— ముకుటః (చూ. అమరసుధా టిప్పణి).

పై పురాణవచనములయం దొకచో దుష్యంతపుత్రుడగు భరతుని వలనను, వేఱొకచో ఋషభపుత్రుడగు భరతుని వలనను, నింకొకచో భరతు డగు మనువు వలనను నీ దేశమునకు భారతవర్ష మనియు, నిందలి ప్రజకు భారతీప్రజ యనియు ప్రసిద్ధి వచ్చినట్లు గన్పట్టును. ఇంతేకాదు లోకమున కంతటికిని భారత వర్షమని ప్రసిద్ధి యున్నట్లు అమరసింహుని యొక్కయు భారవి యొక్కయు వచనముల వలన దెలియుచున్నది. జంబూద్వీపమే భరతవర్ష మనియు కొన్ని కోశములు చెప్పుచున్నవి. మొత్తముమీఁద భరత- భారత-భారతీ పదములు లోక వాచకములుగనో, ఈ దేశనామములుగనో, లేక యిందలి ప్రజానామములుగనో ప్రసిద్ధమై యుండుట స్పష్టము. అట్టి యెడ నీ భారతీపదము వేదవాచకమగు టెట్లు?

మఱియు భారతదేశము, భారతీప్రజ యను ప్రసిద్ధికి పై వచనము లలో నొకటి ప్రమాణ మగుచో మిగిలినవి యప్రమాణములు కావలసి వచ్చును. అట్లుగాక యన్నియు ప్రమాణము లనుట యెట్లు ?

(3) ఇదియుగాక చరిత్రకారుల వాద మింకొక తీరుగ నున్నది. 'వేదరచయిత' లని చెప్పబడెడి యార్యులలో బెక్కు తెగలు గలవు. వానిలో 'భరతులు' అను తెగ యొకటి. ఆర్యుల లోని యన్ని తెగలవారికి నగ్ని యారాధనీయుడే. అయినను భరతులచే నారాధింపబడుటచే నగ్నికి 'భారతః' అనియు' వారిని రక్షించి బ్రోచెడి యొక దివ్యశక్తికి (protective Divine Power)'భారతి యనియు బ్రసిద్ధి గలిగినది. భారతీదేవికి సరస్వతీసాహచర్యము గన్పట్టుట జేసి భరతు లనెడి తెగవారికి సరస్వతీ నదితో సంబంధ మున్నట్లు తెలియును, అనగా ఈ భరతు లను తెగవారు సరస్వతీనదీ తీరమున నివసించి యుండి తమదేవత యగు భారతిని గొల్చి యుండవలెను' (చూ. 'Vedic Index of Names and subjects' by A. A Macdonell and A. B Keith).మఱియు భరతులు సరస్వతీ నదీ తీరమున నివసించి యా నదిని గూడ నొక దేవతగా భావించి యుందు రనిపెక్కు చరిత్రకారుల యభిప్రాయము. భరతులు, భారతులు, సరస్వతి-వీనిని గూర్చిన విషయమై చారిత్రికులలో మతభేదములు చాల గలవు. ఏమైనను ఈ చారిత్రికుల వాదములను బట్టియు భారతీ పదము వేదవాచకము గాదని తెలియును. అగుచో వేదవాణిని భారతి యనుట యెట్లు ?

కాన భారతీస్వరూపము తేటపడుటకై పై విషయముల బరిశీలింపవలసి యున్నది. ముందు చారిత్రికుల వాదములో సామంజస్య మెంత గలదో చూతము.

## భరత-భారత - భారతీపదములు - చారిత్రికుల కల్పన-అసామంజస్యము:-

(1) 'భరతు లనెడి యొక తెగవారిచే నారాధింపబడుటజేసి యగ్నికి భరతుడనియు ఆ తెగవారిని రక్షించెడి యొక దివ్యశక్తికి వారిననుసరించి భారతి

యనియు బ్రసిద్ధి గలిగినది'--యనెడి వాదము కేవలము ఊహా కల్పితము; శ్రుతి ప్రసిద్ధము కాదు; యుక్తిసహము గాదు. లోకమున నేదేని యొక దేవతను ప్రధానముగ నారాధించుట వలన తదారాధకులకు తదనుగుణముగ శైవులు, వైష్ణవులు; గాణాపత్యులు-అని యీ విధముగ వ్యవహార మేర్పడుట గలదు' ఒక మహాప్రవక్త ననుసరించి తదనుయాయులకు బౌద్ధులు, జైనులు-అని యీ రీతి బ్రసిద్ధి వచ్చుటయు గలదు. లేక యా మహాప్రవక్తలచే బ్రవచింపబడెడి యొక మూలసిద్ధాంతము నాదరించుట వలనను ద్వైతులు- విశిష్టాద్వైతులు అని యీ రీతిగ బ్రసిద్ధి గల్గుటయు గలదు. అంతియేకాని ఆరాధకుల వర్గము, లేక సంఘము మొదలగువాని ననుసరించి యా యా దేవతకు గాని, ప్రవక్తకు గాని, నామము కల్పింపబడుట లోకన్యాయ విరుద్ధము. కాన భరతు లనెడి తెగ వారిచే భరత, భారతీనామము లా యా దేవతలకు బ్రసిద్ధము లయిన వనిచెప్పుట సమంజసము కాదు.

(2) 'భరతులను నొక తెగవారున్నట్లు శ్రుతులవలన దెలియు చున్నది.'-అని చెప్పుటయు తగదు భరతు అనగా నొక పురోహిత వర్గము (Priest class) అని చరిత్రకారు లూహించి తదనుగుణముగ పెక్కు చరిత్ర కల్పనల జేయుచున్నారు. ఇట్లు చెప్పుట శ్రుతిసంమతము కాదు. శ్రుతులయందు భరత-భారతీ శబ్దములకు బెక్కు నిర్వచనములు గానవచ్చును. అందెచటను 'భరతు లనగా నొక పురోహితవర్గము' అను విషయము గానరాదు.

## ఋత్విజులు-భరతులు :-

యజ్ఞాదికర్మ ప్రయోగకుశలులై యజ్ఞమును నిర్వహించెడి వారికిని, యజ్ఞమును జేసెడి యజమానులకును- 'ఋత్విజులు' అనియు. భరతులు లేక భారతులు - అనియు శ్రుతుల యందు బ్రసిద్ధి గలదు

"అమంథిష్టాం భారతా రేవ దగ్నిం" —ఋ. 3-23-2.

---

"ఋత్విజో గ్రావహస్తాసో భరతా వృక్తబర్హిషః"
—మాధవీయ ఋగ్వేదానుక్రమణిక.

"భరతాః- యజ్ఞద్వారేణ స్వాన్ సంభరంతి" —స్కందస్వామి

"భరత ముద్ధరే మనుషించ" —తై.బ్రా. 3-7-6-5.

"అత స్త్వం భరత మిమం యజమాన ముద్ధర। దేవేభ్యో
హవి ర్భరణా ద్యజమానో భరతః' —సా. భా.

"తద్ధైక హూ స్తా న్వో మహ ఇతి శంసే దేతాం వావయం
భరతేషు శస్యమానా మభి వ్యజానీమ ఇతి వదన్తః"
—ఐ, బ్రా. 12-7.

'బిభర్తి ఫల మితి భరో యజ్ఞ స్తంభరం తన్వ స్తీతి భరతా
ఋత్విజః' సా. భా.

వైదిక నిఘంటువు నందును భారతశబ్దము ఋత్విఙ్నామములలో బఠింపబడియున్నది. ఋత్విక్కు అనగా 'యజ్ఞము జేయువాడు'- అను నర్థము నిర్వచనము ద్వారా నిరుక్తమున నిట్లు వివరింపబడినది :

'ఋత్విక్ కస్మాత్ ? ఈరణః । ఋగ్యష్టా భవతీతి
శాకపూణిః । ఋతుయాజీ భవతీతి వా' —నిరు. 3-19.

'భ్రియంతే దక్షిణాభి స్త ఇతి భరతాః। కుర్వన్తి కర్మాణీతి
కురవః।....ఈరయితా హి స స్తుతీనాం భవతీతి ఋత్విక్।

....ఋగ్భి ర్హ్యేసౌ యజతీతి ఋత్విక్ ।....ఋతుయాజీ
....స హి కాలే కాలే దేవతా యజతీతి వా; ఋతౌ
యాజయతీతి వా। సహి కాలే కాలే ఏవ యాజయతే నాకాలే'

—దుర్గా- భా.

మాధవీయ ధాతువృత్తి యందును ఋత్విక్ శబ్ద మిట్లు నిర్వచింప బడినది. 'ఋతౌ యజతి; ఋతుం యజతి, ఋతు ప్రయుక్తోవా యజతీతి ఋత్విక్

పై శ్రుతులను, నిర్వచనములను బరిశీలించుచో యజనశీలు రగు యజమానులును, యజ్ఞమును నిర్వహించెడి యాజకులును-'ఋత్విజులు; భరతులు'-అగుట తెలియును. ఇట్లు యజమానులకును, యాజకులకును భరతు లను ప్రసిద్ధి వచ్చుటకు గారణము ముందింకను వివరింపబడును. ఈ భరతులు (ఋత్విజులు) ఆర్యు లనెడి వారిలో నొక తెగ యని శ్రుతులయం దెచటను గన్పట్టదు; కాన నట్లు చెప్పుట శ్రుతిసమ్మతము కాదు.

3) 'ఈ ఋత్విజులు యజ్ఞకర్మలయందు అరణుల మథించి యగ్ని నుత్పాదింప జేయుదురు. అందుచే నట్టి యగ్ని వీరికి పుత్రస్థానీయుడు, మథన హవిర్దానాదులచే భరతులకు సంబంధించినవాడు; కాన అగ్ని భారతుడగు' నని భాష్యకర్తలు కొన్నియెడల నాలంకారికముగ వివరించిరి. (ఋ. 2-7-1; 5 భరతా ఋత్విజః తేషాం సంబంధీ భారతః; భారతః ఋత్విజాం పుత్రస్థానీయః-సా. భా.) ఇట్టి ప్రయోగము లింకను గలవు. ఇట్లు అగ్ని పుత్రస్థానీయు డగు నను విషయము భాష్యకర్తలచే గల్పితము కాదు. ఇట్టి యభిప్రాయములు వివరించు ప్రయోగములు శ్రుతులయందు లెక్కు గలవు. 'ద్రావిణోదాః; సహస స్పుత్రః సహసః సూనుః; సహసో యహుః; ఋషీణాం పుత్రః' - ఇత్యాది పదము లిట్టివే.

## ద్రావిణోదాః:-

ద్రవిణ మన ధనము లేక బలము. ద్రవిణదాత యగుటచే దేవతకు (అగ్ని-ఇంద్ర) 'ద్రవిణోదాః' అని పేరు. మఱియు ద్రవిణ మని హవిస్సునకును పేరు. హవిర్దాత లగుటచే ఋత్విజులకును 'ద్రవిణోదసః' అని పేరు. వారల వలన నుద్భవించుటచే నగ్నికి 'ద్రావిణోదాః' అనిపేరు. ఈ విషయము నిరుక్తమున నిట్లు వివరింపబడినది.

> 'యథో ఏతత్-అగ్నిం ద్రావిణోదస మాహేతి, ఋత్వి
> జోఽత్ర ద్రవిణోదస ఉచ్యన్తే, హవిషో దాతార స్తే చైనం
> జనయన్తి ।ఋషీణాం పుత్రో అధిరాజ ఏషః ఇత్యపి
> నిగమో భవతి' ——నిరు.8.2

కాన ఋత్విజులకు అగ్ని పుత్రస్థానీయు డని ప్రసిద్ధి. దీనిని బురస్కరించుకొని ద్రవిణోదసులను నొక తెగవారున్నటుల నూహించుట సమంజస మగునా ? అంతే కాదు.

## ఋషీణాం పుత్రః[1] :-

> 'ఋత్విజః వేదవిదః ఋషయః తై రుత్పాదితత్వాత్ తేషాం
> పుత్రవత్ పుత్రః' ——మహీ-భా. (వా.సం.5-4.)

1. ఋ.వే. 4-39-9; వా.సం. 5-4; తై. సం. 1-3-7-2; మై.సం. 1-2-7. కా.సం. 3-4, శ.బ్రా. 3-4-1-26; తై. బ్రా. 2-7-15-1.

'ఋషీణాం పుత్రః మంత్రేణోత్పద్యమానత్వాత్'

—సా.భా. (శ.బ్రా. 3–4–1–25.)

'ఋషీణాం మంత్రాణాం ఋత్విజాం వా పుత్రః, తై

రుత్పాదితత్వాత్' —సా.భా. (తై.సం. 1–3–7–2.)

ఋషు లనగా మంత్రములు: లేక మంత్రవిదులగు ఋత్విజులు. అట్టి ఋషులచే మథింపబడి యభివ్యక్తము చేయబడుటచే నగ్ని 'ఋషిపుత్రుడ'ని యుపచరింపబడినది. ఇట్లు అగ్నియే కాదు; మంత్రములచే నభిషేక సంస్కారము చేయబడు రాజు కూడ 'ఋషీణాం పుత్రః' అని శ్రుతి2యందు జెప్పబడుచున్నాడు.

## సహసస్పుత్రః :-

వేదవిదులగు ఋత్విజులు బలముకొలది యరణుల మథించినపు డగ్ని ప్రాదుర్భవించును. అందుచే నగ్నికి సహస స్పుత్రః3 సహసః సూనుః4 సహసో యహుః5 అనియు నామములు గల్గినవి.

యజ్ఞముల యందు మంత్రపూర్వకముగ బలముకొలది యరణుల మథించుచో నగ్ని ప్రాదుర్భవించు నట్లు ఆధ్యాత్మికముగ మనస్సు అను అరణిని ఓజస్సుతో (తేజోరూపమగు బలముతో) మథించుకొలది దివ్య జ్యోతిస్సు

2. 'ఋషీణాం పుత్రో అభిశస్తిపా అయమ్' —తై.బ్రా. 2-7-15-1. అయ మభిషేకార్హో రాజా....సోఽయ మృషీణా మృత్విజాం పుత్రోఽభిషేక సంస్కారేణ తై రుత్పాదితత్వాత్' సా. భా.

3. ఋ 2-7-6, వా. సం. 11-70. తె . సం. 4-1-9-2, మొ

4. ఋ.3–24–1; 3-28-3; 8-19-25 మొ

5. ఋ. 1-26-10; 8-60-13 మొ.

ప్రాదుర్భవించు ననుట శ్రుతి[1] స్మృతి[2] ప్రసిద్ధము. అట్లు మథించెడి యోగులకు లేక మహర్షులకు నా దివ్యజ్యోతి పుత్రస్థానీయమే యగును. యజ్ఞముల యందలి అరణిమథనము ఆధ్యాత్మికముగ జేయవలసిన మనో మథనమును భావింప జేయునది భాష్యకర్తలును 'పుత్రవ త్పుత్రః' అని వివరించుచు శ్రుత్యుక్త మగు ఆలంకారిక భావమునే వివరించి రనుట స్పష్టము. ఈ యాలంకారిక ప్రయోగములు పరమార్థమును ప్రబోధించుటకే యుద్దిష్టములు. ఇట్టి ప్రయోగముల నుండి పరమార్థమునకు మాఱు చరిత్ర నూహించుట శ్రుతి తాత్పర్యానుగుణము గాదు. అగ్ని 'ఋషీణాం పుత్రః' అని చెప్పబడుచున్నందున ఋషు లనెడి యొకతెగవారు గల రందుమా ? అట్లే భరతు లొక తెగవా రనుటయు నా తెగవారి వలన నగ్నికి 'భారత' అను ప్రసిద్ధి యేర్పడిన దనుటయు దగదు.

భరతు లనెడి యొక తెగవారివలన నగ్నికి భారత అని ప్రసిద్ధి గల్గిన ద ని చెప్పుచో, నాతెగవారికి భరతు లని పేరు వచ్చుటకు గారణమేమి ? దీనికి గారణమును చరిత్రకారులు చెప్పుట లేదు.

4) కొన్నియెడల భరతశబ్దము ప్రజావాచకము. తైత్తిరీయశ్రుతి యందు 'తతో వసిష్ఠపురోహితాః ప్రజాః ప్రాజాయన్త' (తై. సం. 3-5-2-1)అని గలదు. ఈ వాక్యమే కొలది మార్పులతో తాండ్యబ్రాహ్మణము నందును-'తతో వై వసిష్ఠ పురోహితాః భరతాః ప్రాజాయన్త' (15-5-24) యని గలదు. ఈ రెండు శ్రుతు లచే ప్రతిపాద్య మగు నర్థమొకటియే (చూ - త్రయీశబ్దము). ఇందలి భరతాః, ప్రజాః- అను పదములు రెండును పర్యాయ పదము.

1. 'ఆత్మాన మరణిం కృత్వా' బ్రహ్మ ఉ. 18; కైవల్య. ఉ.11; ధ్యాన బిం. 2 ; సదానంద. ఉ. 15. మొ.

2. హరివంశము.

బగుట స్పష్టము. అందుచే భరతు లన ప్రజ యనియు నర్థమే కాని యొక తెగ యొక్క నామ మనెడి వాదము నిరాధారము ఈ విషయము ముమ్ముందింకను బరిశీలింపబడును.

5) మఱికొన్ని యెడల భరతశబ్దమునకు 'యోధుడు-యుద్ధకర్మ కుశలుడు-అనియు నర్థము గలదు. అందుచే 'భరతు లనెడితెగవారు యుద్ధకుశలురు కూడ' నని చరిత్రకారుల యభిప్రాయము. సంగ్రామము క్షత్రియధర్మముగాని పురోహితవర్గ ధర్మము గాజాలదు గదా।

6) ఇడా-సరస్వతీ-భారతీ యను ముగ్వురు దేవతలు పరస్పర సాహచర్యము గల్గియున్నట్లును, కొన్నియెడల వీరు ముగ్వురు 'మహీః, ఇడాః, సరస్వతీః' భారతీః' అని యొకే పదముచే జెప్పబడుటయు మఱియు 'తిస్రో దేవ్యః, తిస్రో మాతరః' అని వ్యవహరింపబడుటయు శ్రుతులయందు గలదు గదా; అట్లేల చెప్పబడవలెను ? చారిత్రికులచే వీరి సాహచర్యము గూర్చి యేమియు జెప్ప బడుట లేదు.

భరతు లనెడి యొక తెగవారు సరస్వతియను నొక నదీతీరమున వసించి యుందురను నూహచేసి, 'యా కారణమున వారిదేవత యగు భారతికిని సరస్వతీ నదికిని సంబంధము'-అని చరిత్రను గల్పించుచున్నారు. కాని ఇడాసాహచర్యము సంగతి యేమి? దీనినిగూర్చి యేమియు వివరింప బడ లేదు.

7) 'సరస్వతి యను పదము వేదములలో మొదట నదీవాచకము మాత్రమే; అది రానురాను కొంతకాలమునకు వాగ్దేవతావాచకముగ గూడ బరిణమించి నది'-అనియు చరిత్రకారుల యూహ. అట్లే పరిణమింపవలసి వచ్చినది ? ఎపుడు పరిణమించెను ? ఇందుకు సమాధానములు చారిత్రికులు చెప్పియుండలేదు. అందుచే వారి వాదము యుక్తిసహముగా గన్పట్టదు. ఇక శ్రుత్యనుగుణముగ భారతీ స్వరూ మును జూతము.

# అగ్ని_వాయు _ఆదిత్యులు : సాహచర్యము:_

శ్రుతి అగ్నినే గాక వాయు-ఆదిత్యులను గూడ భరతు లని కీర్తించి యున్నది. వీరు భరతు లెట్లగుదురో తెలియవలెను. మఱియు ఇడా-సరస్వతీ—భారతీ యను నీ ముప్పురు దేవతలకు అగ్నివాయ్వాదిత్యులతో నిరంతర సాహచర్యము గలదు. ఈ సాహచర్య తాత్పర్యమేమి ? వీరు ముప్పురు పరస్పరసాహచర్యము గలవా రగుటచే వీరిలో నే యొకరినిగూర్చి దెలియవలె నన్నను మిగిలిన యిరువురిని గూర్చియు దెలియవలసి యుండును కాన మొదట అగ్నివాయ్వాదిత్య దేవతా స్వరూప-సాహచర్యముల బరిశీలింపవలసియున్నది.

అగ్నివాయ్వాదిత్యులు ప్రత్యక్షముగ గన్పట్టెడి భౌతికరూపము తోనే గాదు; వారు విలక్షణమైన దేవతాస్వరూపములతో గూడ నొప్పి యుందు రని బ్రహ్మ, స్వాహా, స్వధా, త్రయీ శబ్దములయందు గొంత వివరింపబడినది. 'భూమి యందలి అగ్ని, అంతరిక్షమునందు వ్యాపించు వాయువు, ఆకాశము నందలి సూర్య బింబము-ఈ మూడును ప్రధాన దేవత లని భ్రమించి యీ ముప్పురుదేవతలే జగద్యాత్రా నిర్వహణమునకు గారణభూతులుగ ఋగ్వేదకాలమున ప్రాచీనార్యులు భావించిరి'-అని చరిత్రకారులు చెప్పుదురు. ఈ వాదమునం దెంత సామంజస్య మున్నదో చూడవలసి యున్నది. కాన మొదట ఋగ్వేదము అగ్ని వాయ్వాదిత్యాది దేవతా స్వరూపము, సాహచర్యము నెట్లు వివరించినదో చూచి పిమ్మట వారు భరతు లెట్లగుదురో, ఇడా-సరస్వతీ-భారతీ యను వారల సాహచర్య మెట్టిదో చూతము.

అగ్నిః :-

"అగ్నే యత్తే దివి వర్చః పృథివ్యాం యదోషధీ ష్వప్స్వా యజత్ర యే నాంతరిక్ష ముర్వా తతంథ త్వేషః స భాను రర్ణవో నృచక్షాః ॥ 1

యజనీయుడ వగు నో యగ్ని (యజత్ర అగ్నే) ! ద్యులోకమున ఆదిత్యాత్మ మగు నే జ్యోతిస్సు కలదో (యత్ తే దివి వర్చః) అది నీదియే; పృథివి యందు ఆహవనీయాది రూపమునను, ఓషధులయందును జలముల యందును నిగూఢముగను, మఱియు దాహ-పాక-ప్రకాశనాది సామర్థ్యముతో ప్రకటముగను - ఇట్లు సర్వత్ర వ్యాప్తమై యుండెడి జ్యోతిస్సు నీదియే; అంతరిక్షమున వాయురూపమున విస్తరించియున్న తేజము నీదియే; ఇట్లు తేజశ్శాలి (త్వేషః) వై అగ్ని వాయ్వాదిత్యాది రూపములతో లోకత్రయమును వ్యాపించి భాసించుచు సముద్రము వలె అనంతరూపమున (అర్ణవః) విశ్వవ్యాపకుడవై నరులకు (ప్రాణులకు) సాక్షి వగుచు ద్రష్టవై (నృచక్షాః) వెలయుచున్నావు — అని యర్థము.

ఈ మంత్రమును శతపథబ్రాహ్మణము కూడ నిట్లే వివరించినది.

'అగ్నే యత్తే దివి వర్చ ఇతి। ఆదిత్యో వా అస్య దివి వర్చః। పృథివ్యా మితి। అయ మగ్నిః పృథివ్యామ్! య దోషధీ ష్వప్స్వా యజత్రేతి। య ఏ వౌషధిషు చాప్సు చాగ్ని స్త మేత దాహ। యేనాంతరిక్ష ము ర్వా తతంథేతి। వాయుః సః త్వేషః స భాను రర్ణవో నృచక్షా ఇతి। మహాన్ స భాను రర్ణవో నృచక్షా ఇత్యేతత్ ॥

(చూ. సా. భా)

1. ఋ. 3-22-2, వా సం. 12-48; తై. సం. 4-2-4-2; మై. సం. 2-7-11, 89-13; కా. సం. 16-11. శ. బ్రా. 7-1-1-23.

ఈ మంత్రమున 'యత్ర అగ్నే' అను పదముంచే య్నాకర్త యందు ఆహవనీయాదిరూపమున యజనీయుడైన యగ్నియే సంబోధింప బడుట స్పష్టము. భౌతికముగ గన్పట్టెడి యా యగ్ని మాత్రమే యిట గ్రహింపబడె నని చెప్పుచో, యజ్ఞవేదియందు పరిచ్ఛిన్న (conditioned) రూపమున ప్రత్యక్షముగ గన్పట్టెడి. యీ యగ్నియొక్క దీప్తియు (వర్చః) పరిమిత మయియే యుండును. ఆ దీప్తి యజ్ఞశాలను, లేక తత్పరిసరములను దాటి ప్రసరింప నేరదు. అది సర్వవ్యాపక మగుట యెట్లు? కనుక శ్రుతియం దుద్దిష్టమైన యగ్నిస్వరూపము వేఱు అది పరంజ్యోతిరూపమగు మహాగ్ని; అపరిచ్ఛిన్నము; అనంతము; సర్వవ్యాపకము; నిఖిల ప్రాణులయందు సాక్షియై ద్రష్టయై విలసిల్లునది యని చెప్పబడినది.

జడమై భౌతిక మగు జ్యోతిస్సుకు లేక శక్తికి (Physical force or light or energy) సాక్షిత్వము -ద్రష్టృత్వము ఉపపన్నము గాదు. అట్టి శక్తి (ద్రష్టృత్వము) చైతన్యరూప మగు పరంజ్యోతికే కలదు. (చూ. బ్ర.సూ. ఈక్షత్యధికరణము). సాక్షియై-వినిద్రుడై-నిరంతరము జాగరూకుడై విలసిల్లెడి యగ్నినే ఋగ్యజుస్సామ మంత్రములు కాంక్షించుచున్నవి యని - 'అగ్ని ర్జాగార తమృచః కామయన్తే' - ఇత్యాది ఋక్కుల వలన పూర్వము స్పష్టమైనది. (చూ. వేదశబ్దము) ఇట్టి యీ యర్థమునే 'సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ' (శ్వే.ఉ. 6.11) అని యీ రీతిగా నుపనిషత్తులను వివరించినవి. ఆ పరంజ్యోతియొక్క జ్యోతిస్సు చేతనే అగ్ని -వాయ్వాది దేవతలు, పృథివ్యాది పంచమహాభూతములు-సర్వము వెల్గొందుచున్నట్లు పై ఋక్కున జెప్పబడినది. ఇట్లు చెప్పుచో-

"త మేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" —కఠ.ఉ. 5-15; ముండక. ఉ. 2-2-10; శ్వేత. ఉ. 6-14.

'భీషాఽస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః ।
భీషాఽస్మా దగ్ని శ్చేంద్ర శ్చ మృత్యు ర్ధావతి పంచమ ఇతి"

—తై.ఉ-7.2.

అని యీ రీతిగ బ్రతిపాదింప బడెడి యుపనిష దర్థమే పై ఋక్కున క్లుప్తమై యున్నదనుటయు స్పష్టము. ఇట్టి యర్థమును గ్రహించుచో అగ్ని-వాయు-ఇంద్ర-సూర్యాది పదములు ప్రకరణము ననుసరించి తత్తద్దేవతావాచకము లగుచునే పరంజ్యోతిరూప మగు తత్త్వమును గూడ నుపలక్షింప జేయుచుండు ననెడి సంప్రదాయమును బ్రవర్తింపజేయుటయే వేదము యొక్క తాత్పర్యముగా గ్రహింప నగును. కనుక అగ్ని యనగా-

1. అధియజ్ఞముగ ఆవహనీయాది త్రేతాగ్నులు;

2. అధిదైవికముగ పృథివ్యన్తరిక్ష ద్యులోకములయం దుండెడి అగ్నివాయ్వాదిత్యాత్మక త్రేతాగ్నులు.

3. ఆధ్యాత్మికముగ శరీరాంతర్గత మగు అగ్ని.

4. పృథివియందును, ఓషధులయందును, జలములయందును ప్రకటముగను నిగూఢముగను వ్యాప్తమై యుండెడి తేజస్సు.

5. ప్రాణులయందు సాక్షిరూపమున వెల్గొందెడి పరంజ్యోతి. అగ్ని దముయొక్క సామర్థ్య మట్టిది. ఇట్టి సంప్రదాయమును వివరించు మంత్రములెన్ని యేని ఋగ్వేదమున గలవు. 'అగ్ని రస్మి జన్మనా జాతవేదాః' ఇత్యాది ఋక్కులు నిట్టి యర్థమునే బోధించున వగుట పూర్వము (వేద, ఋషి, బ్రహ్మాది శబ్దములందు) వివరింపబడినది.

## వాయువు (వాయుః - వాతః)

వాయు వనగా పంచభూతములలో నొకటి యగు వాయువు (గాలి) మాత్రమే కాదు; సర్వవ్యాపక మగు అగ్ని (పరంజ్యోతి)యే అంతరిక్షతేజో రూప

మగు వాయువు-అని పై ఋక్కున చెప్పబడినది. కావుననే ఋగ్వేదమున (10-6. సూ) వాయువు-

"విశ్వస్య భువనస్య రాజా"
"అపాం సఖా ప్రథమజా ఋతావా క్వ స్వి జ్జాతః కుత ఆ బభూవ"
"ఆత్మా దేవానాం భువనస్య గర్భో యథావశం చరతి దేవ ఏషః"

అని కీర్తింపబడినాడు. వాయువు 1) నిఖిలభువనములకు రాజు (నిఖిల భువనముల విరాజిల్లచేయువాడు, పాలకుడు); 2) నిఖిలభువనములకు గర్భ (ప్రాణ) భూతుడు: 3) సకలదేవతలకు ఆత్మ 4) ప్రథమజాః (ప్రథమజీవి); 5) ఋతావా (సత్యశీలుడు)-అని చెప్పబడుటచే నిట్టి యీ విశేషణములు శ్రుతిసంప్రదాయము ననుసరించి సమష్టి ప్రాణస్వరూపు డగు (Universal Life Principle) హిరణ్యగర్భుని బోధించునవి. (చూ. ప్రథమజా శబ్దము మొ.) కాన నిట పంచభూతములలో నొకటియగు వాయువును మాత్రమే గాక, యీ విశేషణములచే సర్వదేవాత్మక హిరణ్యగర్భ బ్రహ్మ తత్త్వమును బోధించుటయే శ్రుతితాత్పర్య మగుట స్పష్టము. ఈ యర్థమునే తైత్తిరీయ శ్రుతియు నిట్లు వివరించుచున్నది.

"వాతం ప్రాణం మనసాఽన్వారభామహే। ప్రజాపతిం యో
భువనస్య గోపాః। స నో మృత్యో స్త్రాయతాం
పాత్వగ్ంహసః। జ్యోగ్జీవా జరా మశీమహి।"

— తై. ఆ. 10-47; తై. బ్రా. 3-7-7-2.

'వయం తం ప్రజాపతిం పరమాత్మానం, మనసా అంత
రంగేణాన్వారభామహే। కథంభూతం ప్రజాపతిమ్।
ప్రాణం సమస్తపిండాండస్య ప్రాణాపానాదిరూపమ్।
వాత మంతరిక్షస్థ వాయురూపమ్। ఏతేన పిండాండ

బ్రహ్మాండోభయ వికారకత్వం ప్రజాపతే రుక్తం భవతి ।
యః ప్రజాపతిః, భువనస్య బ్రహ్మాండస్య, గోపా
రక్షకః' సా. భా.

ఇట వాయువు అనగా శరీరములందు ప్రాణరూపమునను, అంతరిక్షమున వాయురూపమునను వర్తించుచు పిండాండ బ్రహ్మాండ వికార కారకమై నిఖిల భువన రక్షకము - అని చెప్పబడినది. 'ఆత్మా దేవానాం భువనస్య గర్భః' ఇత్యాది ఋక్కులలో సూత్రప్రాయముగ జెప్పబడిన వాయువుయొక్క భువనగర్భత్వాది విశిష్టధర్మము లిట ప్రవచింపబడినవి.

"ఓం త ద్బ్రహ్మ ఓం తద్వాయుః ఓం తదాత్మా ఓం తత్సర్వం
"ఓం తత్పురోం నమః" — తై. ఆ. 10-9-1.
"ఓం ప్రణవప్రతిపాద్యం త త్సర్వవేదాంతప్రసిద్ధం బ్రహ్మ
త త్త్వమ్ । తథా వాయుః సూత్రాత్మరూపో హిరణ్యగర్భ ఓం
తత్ప్రణవప్రతిపాద్యం బ్రహ్మైవ । తథైవాఽఽత్మా జీవోఽపి...."

— సా. భా.

'సూత్రాత్మరూపుడగు హిరణ్యగర్భుడును (వాయుః), జీవుడును (ఆత్మ) స్థూల–సూక్ష్మ–కారణ శరీరము లనెడి త్రిపురములును సర్వము ప్రణవ ప్రతిపాద్యము, 'తత్' శబ్దోపలక్షితము, వేదాంతప్రసిద్ధము నగు బ్రహ్మ" — అని యర్థము.

కాన వాయు వనగా —

1) పంచభూతములలో నొకటి యగు వాయువు;

2) శరీరాంతర్వర్తి యగు ప్రాణము (ప్రాణశక్తి);

3) అంతరిక్షము నందంతట వెలయు వాయుదేవత (మాధ్యమిక దేవత);

4) సూత్రాత్మ, సమష్టిప్రాణస్వరూపుడు సర్వదేవతాత్మయు నగు హిరణ్యగర్భ బ్రహ్మ;

5) ప్రణవప్రతిపాద్యము, వేదాంతప్రసిద్ధము, ప్రాణమునకు ప్రాణము (ప్రాణస్య ప్రాణః) నగు బ్రహ్మతత్త్వము.

పై శ్రుతి వాక్యముల బరిశీలించుచో ఋగ్వేద ప్రతిపాద్యమగు వాయు స్వరూపము వేఱు; తదితర శ్రుతిపతిపాద్య వాయు స్వరూపము వేఱు కాదని తేలినది. 'వాయు' పద సామర్థ్య మట్టిది.

## ఆదిత్యః - సూర్యః :-

'అగ్నే యత్తే దివి వర్చః' - అను పై ఋక్కునందు ఒకే యగ్ని పృథివియం దాహవనీయాద్యగ్ని రూపమునను, అంతరిక్షమున వాయురూపమునను, ద్యులోకమున ఆదిత్యరూపమునను విరాజిల్లుచుండునని చెప్పబడినది. అగ్ని-వాయు స్వరూపముల జూచితిమి. ఇక ఋగ్వేద ప్రతిపాద్యమగు నాదిత్యస్వరూపమును గూడ జూతము.

"చిత్రం దేవానా ముదగా దనీకం చక్షు ర్మిత్రస్య వరుణ స్యాగ్నేః।
ఆ ప్రా ద్యావాపృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ"[1]

1 ఋ. 1-115-1; అ. సం. 13-2-3 : వా. సం. 7-42, తై. సం. 1-4.; 43-1, మై. సం. 1-3-37; కా. సం. 4-9; ఐ. బ్రా. 4-9-11-శ. బ్రా. 4-3-1-10; తై. బ్రా. 2-8-7-3; ఐ. అ. 3-2; 3-10 తై. అ. 1-7-6 మొ॥.

ఇట ఉదగాత్ — అను క్రియవలన నీ మంత్రము దినదిన ముదయించెడి సూర్యుడు దేవతగా నుపాసింపబడుటకై యుద్దిష్టమైన దనుట స్పష్టము. సూర్య దేవతాకమగు నీ మంత్రమునకు యజ్ఞమున జేయబడు శంసనమునందును, హోమము నందును వినియోగము గలదు. ఇది బాలభానుని యుదయమును జూచి యాశ్చ పారవశ్యమున జేయబడిన రచన యని జెప్ప వీలులేదు. మంత్రార్థమును జూతము,

దేవానా మనీకం చిత్ర ముదగాత్ :—

తమయందు రక్తశ్వేతాది వివిధవర్ణములు నిగూఢముగా గలిగి దీప్తిమంత ములై లోకముల బ్రకాశింపజేయు కిరణముల పుంజము మహా సైన్యమువలె నొక్క మాఱుగా జిత్రముగా నుద్గమించినది — అని మండల పరమైన యర్థము.

సూర్యుని నుండి - పరమేశ్వరుని నుండి - వివిధ శక్తిసంపన్నమై లోక యాత్రా నిర్వహణక్షమమైన దేవతానీకము (దేవసేన) చిత్రముగా నుద్గమించినది— యని పరమాత్మపరముగ నర్థము.

మిత్రస్య వరుణస్య అగ్నేః చక్షుః - ఆ ప్రా ద్యావాపృథివీ అంతరిక్షమ్:—

ఇట్టి సూర్యుడు మిత్ర-వరుణ-అగ్నులకు చక్షువుగా జెప్పబడినాడు ఈ 'మిత్ర-వరుణ-అగ్ని' పదములు 'ద్యావా-పృథివీ-అంతరిక్ష' గత దేవతాపరములు అట్టి దేవతాత్రయమునకు సూర్యుడు చక్షువు-అనగా-తదుపలక్షితమైన జగత్త్రియము. నకు చక్షువు-ప్రకాశకుడు-లేక ప్రకాశకమగు చక్షురింద్రియస్థానీయుడు- అని యర్థము

అగ్ని-వాయు-సూర్యులు పృథివీ - అంతరిక్ష - ద్యులోకములకు పాలకు లగుట ఋగ్వేదమున ప్రసిద్ధము. 'సూర్యో నో దివస్పాతు, వాతో అంతరిక్షాత్; అగ్ని ర్నః పార్థివేభ్యః' (ఋ. 10-158-1) ఇత్యాది ఋక్కు లీ విషయమును స్పష్టము జేయుచున్నవి. కాన పై ఋక్కున జెప్పబడిన ద్యావాపృథివ్యంతరి

గతులగు 'మిత్ర వరుణాగ్నుల' ను ఇట్టి ఋక్ప్రతిపాదితార్థముతో నవిరోధముగ సమన్వయించి దర్శింపవలసి యున్నది. కాగా, 'త్రిలోకాధిపతు లగు అగ్ని-వాయు-ఆదిత్యులకును తదుపలక్షితము లగు మూడు జగత్తులకును చక్షువు సూర్యుడు' -అని తాత్పర్యము.

ఇట్లు చెప్పబడుటచే మండలరూపియై గన్పట్టు సూర్యుడు మాత్రమే యిట జెప్పబడె ననుట పొసగదు. మిత్రవరుణాగ్నులకు-తదధిష్ఠిత లోక త్రయమునకు-చక్షుర్భూతుడగు సూర్యుడు, తదతీతుడై తత్ప్రేరకుడు నగు సూర్యుడు గావలెను. అట్టి సూర్యుడే సవిత; పరమాత్మ. కావుననే యీ సూర్యుడు ఋగ్వేదమున-'చక్షుః;[1] చక్షుషే చక్షుః'[2]- అని యీ రీతిగ బలుచోట్ల నిర్దేశింపబడినాడు. ఇట్టి యర్థమునే 'చక్షుషశ్చక్షుః'- (కేన, ఉ 1-2; బృ. ఉ. 4-4-18) అని యీ రీతిగ-నుపనిషత్తులను ప్రతిపాదించినవి ఈ విషయ మింకను పై ఋక్కు- ఇట్లు స్పష్టము చేయుచున్నది.

## "ఆ ప్రా ద్యావాపృథివీ అంతరిక్షం, సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ :-

'తన తేజస్సుతో ముల్లోకముల వ్యాపించి అంతర్యామియై సర్వప్రేరకుడగుచు స్థావరజంగమాత్మక మగు జగత్తునకు ఆత్మయై-స్వరూప భూతుడై-పరమాత్మయై - మండలాంతర్గతపురుషుడు విరాజిల్లు చున్నాడు'-అని భావము.

1. "చక్షు ర్నో దేవః సవితా" —ఋ. 10-158-3.
2. "చక్షు ర్నో ధేహి చక్షు ర్విఖ్యై తనూభ్యః" —ఋ. 10-158-4.

కాన పై మంత్రమునందలి సూర్యుడు కేవలము బింబస్వరూపుడు కాడు. స్థావర జంగమాత్మక మగు కార్యజాత మంతటికిని గారణము (ఆత్మ) అగుచున్నాడు. కారణము కంటె కార్యము భిన్నము కాదు. (చూ. బ్ర. సూ. ఆరంభణాధికరణము_ శం. భా.) స్థావరజంగమాత్మక మగు జగత్తు (కార్యము) ఆత్మయగు సూర్యుని (కారణము) కంటె భిన్నము కాదు. కాన నీ మంత్రము సూర్యదేవతాక మగుచునే ఉపనిష త్ప్రతిపాద్య—అద్వయ పరమేశ్వరతత్త్వము నుపదేశించుచున్నది. ఐతరేయారణ్యకము గూడ 'చిత్రం దేవానామ్' అను నీ మంత్రవర్ణము నందలి సూర్యుని దర్శింపవలసిన విధానము నిట్లు చెప్పుచున్నది.

"శరీరపురుష ఇతి య మవోచామ స య ఏవాయం దైహిక
ఆత్మా, తస్య యోఽయ మశరీరః ప్రజ్ఞాత్మా స రసః|...."
మహాపురుష ఇతి య మవోచామ సంవత్సర ఏవ ప్రధ్వంస య
న్నన్యాని భూతాన్యేక్యా భావయ న్నన్యాని తస్యై తస్యాసా
వాదిత్యో రసః"

"స యశ్చాయ మశరీరః ప్రజ్ఞాత్మా యశ్చాసా వాదిత్య ఏక
మేతదితి విద్యాత్; తస్మాత్ పురుషం పురుషం ప్రత్యాదిత్యో
భవతి| తదప్యేత దృషిణో క్తమ్| చిత్రం దేవానాం....
సూర్య ఆత్మ జగత స్తస్థుషశ్చేతి |" ——ఐ.ఆ.3-2-3-1

'దేహమే ఆత్మ - అను ప్రత్యయముతో జరించువాడు శరీరపురుషుడు, స్వామియై లోపల విరాజిల్లు అశరీరుడు. ప్రజ్ఞాత్మ (చిద్రూపుడు) యగు పురుషుడు. ఈ శరీరపురుషునకు రసము (సారము). ప్రాణులు పుట్టుటకును గిట్టుటకును గారణభూతుడగు కాలాత్మ (సంవత్సరః) మహాపురుషుడు. సూర్యమండలమున గోచరుడగు నాదిత్యుడు (ఈశ్వరుడు) ఈ కాలాత్మయొక్క రసము. శరీరసారభూతుడగు ప్రజ్ఞాత్మయు, మహాపురుషసార భూతుడగు ఆదిత్యుడు (ఈశ్వరుడు)ను భిన్నులు

గారు; ఈ యిరువురు నొకే తత్త్వము (ఏక మేతత్) - అని దర్శించుటకై యుపాసింపవలెను. (విద్యాన్, సాక్షాత్కారపర్యన్త ముపాసీత - సా. భా) ఈ ప్రజ్ఞాత్మ- ఆదిత్యుల (జీవేశ్వరుల)ఏకత్వము వాస్తవికము. కావుననే ప్రతిపురుషునకు నభిముఖుడై యాదిత్యు డుదయించుచున్నాడు. అనగా 'వాస్తవముగ మన ముభయులము భిన్నులము కాము; ఒకే తత్త్వము' - అని యుద్బోధించుటకై యుదయించుచున్నాడు. ఈ యర్థమునే 'చిత్రం దేవానాం' అను ఋషి (మంత్ర వర్ణము)చే చెప్పబడినది.' -అని యర్థము.

కాన 'చిత్రం దేవానాం' అను మంత్రమునందలి సూర్యుడు మండలాంతర్గత పురుషుడగు ఈశ్వరుడు; అతడే శరీరాంతర్వర్తి యగు ప్రజ్ఞాత్మ (జీవుడు); ఇట్లు దర్శించుటయే ఋక్కు యొక్క తాత్పర్య మని ఐతరేయశ్రుతి చెప్పుచున్నది. అందుచే ఉపనిషత్ప్రతిపాద్యమగు అద్వైత తత్త్వమే యిట జెప్పబడినది. ఇట్లు ఋక్కుననే కాదు; 'అగ్ని రస్మి జన్మనా జాతవేదాః' - 'న వి జానామి యదివేద మస్మి' - 'పురుష ఏవేదం సర్వమ్' - 'హంసః శుచిషత్' -ఇత్యాది ఋక్కుల యందును ఇట్టి యద్వైతతత్త్వమే ప్రతిపాదింపబడుట పూర్వము వివరింపబడినది.

కాన అగ్ని-వాయు-ఆదిత్యాది దేవతాత్మకుడు, సర్వప్రేరకుడు, సర్వవ్యాపకుడు, స్థావరజంగమాత్మక కార్యప్రపంచమునకు గారణభూతుడు (ఆత్మ), కర్మసాక్షియు నగు ఆదిత్యుడు (పరమేశ్వరుడు)ను, ప్రజ్ఞాత్మ (జీవుడు)యు నిరువురు నొకే తత్త్వమని దర్శింపజేయుటకై యుదయించు సూర్యబింబము చిత్రము (చాయనీయం పూజ్యమ్). అట్టి సూర్యుని దర్శింపజేయుటయే శ్రుతితాత్పర్యము దిన దిన మెల్లరును సూర్యున కభిముఖముగ నిలిచి ధ్యానించు సంప్రదాయమునకు లక్ష్యము నిదియే.

కావున సూర్యు డనగా 1) సూర్యమండలము. 2) మండలాభిమాని యగు సూర్యదేవత; ద్యుస్థానదేవత. 3) మండలాంతర్గతుడగు ఆదిత్యుడు (ఈశ్వరుడు). 4) శరీరపురుషాంతర్గతుడు, అశరీరుడునగు ప్రజ్ఞాత్మ (జీవుడు). 5) జీవేశ్వరాత్మకమగు ఒకే తత్త్వము. 'సూర్య' పద ర టి

# త్రిస్థానదేవతలు - ఏకాత్మకత్వము :-

ఇట్లు అగ్ని-వాయు-సూర్య స్వరూపముల దర్శించుచో నీ* పదములు భౌతికముగ ప్రత్యక్షగోచరములగు నగ్న్యాదులను బోధించుచునే త్రిస్థాన గతములగు తదధిష్ఠాన దేవతాత్రయ స్వరూపమును గూడ బోధించుచున్నవి. అంతియే కాదు ఆ ముువ్వురు దేవతలు 'ఒకేతత్త్వము యొక్క భిన్నములై గన్పట్టు మూడురూపములు' లనియు దెలియును. అందుచేతనే యీ మూడు పదములలో నే యొక్కటియు గూడ పరమేశ్వరవాచకమై-పరమేశ్వర తత్త్వస్ఫోరకమై-అంతరదృష్టిని ప్రబోధింప జాలినది. ఋక్కులలో నచటచట అగ్ని, వాయు, సూర్యపదములే గాక ఇంద్ర-సోమ, బృహస్పతి వరుణాది పదములును త్రిస్థానగత దేవతావాచకములుగనే గాక ప్రకరణము ననుసరించి పరమేశ్వరవాచకములుగ గూడ గన్పట్టుటకు గారణ మిదియే.

"ఏక ఏవాగ్నిః బహుధా సమిద్ధః ఏకః సూర్యో విశ్వ మను
ప్రభూతః। ఏకై వోషాః సర్వ మిదం విభా త్యేకం వా ఇదం
వి బభూవ సర్వమ్" —ఋ, 10-58-2.

ఒకే అగ్ని బహుప్రకారముగ తేజరిల్లుచున్నాడు. సర్వప్రాణిప్రేరకుడగు నొకే సూర్యుడు జీవరూపమున విశ్వమున ననుప్రవిష్టుడై, యనేకాత్మ రూపమున ప్రాదుర్భ వించుచున్నాడు, ఒకే యుషోదేవత (పరాశక్తి) యెల్లెడల నావరించియున్న తమస్సును బోనాడుచు జగత్తును విశేషముగ ప్రకాశింపజేయుచున్నది. కాన నేకము నద్విత

1. "ఉద్యన్త మస్తం యన్త మాదిత్య మభిధ్యాయన్....అసా ఆదిత్యో బ్రహ్మ"
"సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా"

యము నగు బ్రహ్మయే దృశ్య మగు నీ జగదాకారమున భాసించుచున్నాడు. (తస్మా దేకం పై ఏక మేవా ద్వితీయం బ్రహ్మ ఇద మాబ్రహ్మ స్తంబపర్యంతం జగత్ వివ భూవ విశేషేణాభవ'దితి యుక్త మితి శేషః-సా భా.)-అని యర్థము.

ఈ మంత్రము పూర్వోదాహృతములయిన (1)అగ్నే యత్తే దివి వర్చః (2) విశ్వస్య భువనస్య రాజా; ఆత్మా దేవానాం భువనస్య గర్భః (3) సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ- అను మంత్రార్థములను, 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్ (తై. ఉ. 2-6)-ఇత్యాద్యుపనిషద్వాక్యా ర్థములను తలపింపజేయుట స్పష్టము. కాన నొకే దేవత (పరమాత్మ) జగ ద్యాత్రాసిద్ధికై అగ్ని-వాయు-ఆదిత్య దేవతారూప మున త్రిస్థానములందు త్రిధా అభివ్యక్తమైనది. ఈ ముప్వరు దేవతలు కొన్ని యెడల 'అగ్ని- ఇంద్ర-ఆదిత్యులు1, అగ్ని-విద్యుత్-ఆదిత్యులు, వసు-రుద్ర-ఆదిత్యులు' ఇత్యాది నామములతో 'హవిర్వహన-రసానుప్రదాన-రసాదాన'2 కర్మలయం దధి కృతులై వెలయునట్లు శ్రుతులయందు గన్పట్టుదురు. శ్రుతుల యందు ప్రస్ఫుట మయ్యెడి దేవతాతత్త్వమును యాస్కుడును నిరుక్తమున నిట్లు వివరించినాడు.

"మహాభాగ్యా ద్దేవతాయా ఏక ఆత్మా బహుధా స్తూయతే"-7-4.
"అగ్నిః పృథివీస్థానో వాయుర్వేంద్రో వాఽంతరిక్షస్థానః
సూర్యో ద్యుస్థానః, తాసాం మహాభాగ్యా దేకైకస్యా అపి
బహూని నామధేయాని భవంతి । అపి వాకర్మ పృథక్త్వాత్"
—7-5.

"యదస్య దివి తృతీయం త దసా వాదిత్య ఇతి బ్రాహ్మణమ్।
తదగ్నికృత్య స్తౌతి అథైన మేతయాదిత్యకృత్య స్తౌతి"
— 7-28.

1. "అగ్ని ర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః ఇంద్రో జ్యోతి ర్జ్యోతి రింద్రః సూర్యో జ్యోతి ర్జ్యోతిః సూర్యః"
—సామ. సం. 1831. (చూ. వా.సం. 3-9; మై. సం. 1-6-1.0
2. చూ. దుర్గాచార్యభాష్యము.

'భాగః' అనగా అణిమాద్యైశ్వర్యము. అదియే దేవత యొక్క మహా భా మహాభాగ్యసంపన్న మగుటచే నొకే దేవత నానా రూపమున స్తుతింపబడుచు అగ్ని పృథివీస్థాన దేవత; వాయువు లేక ఇంద్రుడు మధ్యమస్థానదేవత; భాగ్యసంపన్న మగుట జేసియు, నధికారకర్మ భేదము ననుసరించియు, నొక్కొక్కరికి బెక్కు నామములు గలవు. ద్యుస్థానమున వెలయు నాదిత్యుడు యొక్క తృతీయరూప మని శ్రుతులు చెప్పుచున్నవి. అందుచేతనే ఆదిత్యు గను, అగ్ని యాదిత్యుడుగను స్తోత్రము చేయబడుచున్నారు – అని ం దీనిని దుర్గాచార్యుడు నిట్లు వివరించినాడు

"బ్రాహ్మణ మపి చైత మేవార్థం బ్రవీతి – అయ మేవాగ్ని
రాదిత్యో భవతీతి। ఏక మేవేదం జ్యోతిః జ్యోతిష్ట్వా
విశేషాత్ । త త్పున రేతద్ జగత్యాత్రాసిద్ధమే త్రిధా
విభక్తం – పృథివ్యా మంతరిక్షే దివి చ విభక్తాభిధానం
సంపద్యతేఽగ్ని ర్విద్యు దాదిత్య ఇతి"

ఈ యగ్నియే ఆదిత్యుడని శ్రుతి చెప్పుచున్నది. ఒకే జ్యోతిస ద్యాత్రాసిద్ధి కొఱకై పృథివ్యన్తరిక్షద్యులోకముల యందు అగ్ని – విద్యుత్ – రూపమున త్రిధా విభక్తమై యున్నది ఈ మూడును వాస్తవముగ నొకే మయ్యును స్థానభేదము, కర్మభేదము ననుసరించి అగ్ని విద్యుదాదిత్యులని విభజించి చెప్పుటయు యుక్తమే. అందుచే వీరు భిన్నులుగను స్తోత్రము చే చున్నారు – అని యర్థము. త్రిస్థాన దేవతాగణములను గూర్చి బృహద్దేవత నిట్లు వివరింపబడినది.

"అసతశ్చ సతశ్చైవ యోని రేషా ప్రజాపతిః ।
యదక్షరం చ వాచ్యం చ యథైత ద్బ్రహ్మ శాశ్వతమ్ ॥

కృత్వైష హి త్రిధాఽత్మానం ఏషు లోకేషు తిష్ఠతి ।
దేవాన్ యథాయథం సర్వాన్ నివేశ్య స్వేషు రశ్మిషు ॥

ఏతద్భూతేషు లోకేషు అగ్నిభూతం స్థితం త్రిధా ।
ఋషయో గీర్భి రర్చన్తి వ్యంజితం నామభి స్త్రిభిః ॥
తిష్ఠ త్యేష హి భూతానాం జఠరే జఠరే జ్వలన్ ।
త్రిస్థానం చైన మర్చంతి హోత్రాయాం వృక్తబర్హిషః ॥
—బృ. దే. 1-61 నుండి 67.

'వ్యాహృతీనాం సమస్తానాం దైవతం తు ప్రజాపతిః
వ్యస్తానా మయ మగ్నిశ్చ వాయుః సూర్యశ్చ దేవతాః —'—12.

కాన పైన నుదహరింపబడిన శ్రుతి, నిరుక్త, బృహద్దేవతాది వచనముల ననుసరించి దేవతాస్వరూపము విట్లు గ్రహింపనగును.

పరమేశ్వరు ననుగ్రహముచే దివ్యశక్తిసంపన్నులయిన దేవతలు జగద్యాత్రానిర్వహణము కొఱకై, భిన్నరూపములతో భిన్నకర్మలయం దధికృతులై పృథివీ-అంతరిక్ష-ద్యులోకము లందును, ఆధ్యాత్మికముగ దేహమునను త్రిస్థానము లందు వర్తిల్లుదురు వివిధశక్తిసంపన్ను లగుట భిన్న భిన్న కర్మ నామధేయములతో గూడ వ్యవహరింప బడుచుందురు. పృథివీస్థానగతు లగు దేవతలు 'అగ్నయః' అనియు, మధ్యమస్థానదేవతలు 'వాయవః' (మరుతః ప్రాణాః) అనియు, ద్యుస్థాన దేవత లాదిత్యులనియు, వీరే క్రమముగ వసురుద్రాదిత్యు లనియు జెప్పబడుదురు. కొన్ని యెడల అగ్నయః, వసవః రుద్రాః, ఆదిత్యాః—అని యీ రీతిగ నొక్కొక్క నామముచే గూడ నీ త్రిస్థానదేవతాగణములు వ్యవహరింప బడును.

ఈ అగ్న్యాదులలో నొక్కొక్కరియందును ప్రకరణము ననుసరించి మూర్తిత్రయవివక్షయు గలదు. అనగా - అగ్న్యాదులు పృథివీస్థానదేవతలు; ఇంద్ర-వాయు -రుద్ర - మరుత్ - పర్జన్యాదులు అంతరిక్షస్థానదేవతలు, ఆదిత్యులు ద్యుస్థానదేవతలు' -అని విభక్తస్థానములతో నొప్పుచున్నను, వీరు పరస్పర సాహచర్యము గల దేవతలు ఒకే జ్యోతిస్సు యొక్క విభిన్నమూర్తులు నగుటజేసి వీరిలో నే యొకరియందైనను మూర్తిత్రయవివక్ష జేయుట యుక్తమే. అందు చేతనే యీ త్రిస్థానదేవతలను సమిష్టిగ అగ్నయః, వసవః- అనియు- నీ రీతిగా

శ్రుతి వ్యవహరించినది. విభిన్న దేవతాస్వరూప దర్శనముతోపాటు, తత్స్వాహచర్యము, తదనుస్యూత మగు ఏకత్వమును భావించి, దర్శించుటకు సాధకుల కిట్టి వివక్ష మిగుల తోడ్పడును. ఇది శ్రుత్యర్థ పరమార్థ సిద్ధమైన దేవతాస్వరూపదర్శనము.

అట్లుగాక - 'ఆర్యు లనెడివారిలో కొందఱు అగ్నికిని, మఱి కొందఱు ఇంద్రునకును, — ఇట్లే సోమ వరుణాది దేవతలకును తమ తమ యభిరుచుల ననుసరించి వేర్వేఱు కాలములలో సృష్టికర్తృత్వమును కట్టబెట్టి యందురు'-అనెడి చారిత్రికుల కల్పన శ్రుతిసంమతము, యుక్తి సహము కాదనుట పై గ్రంథసందర్భము వలన స్పష్టమగుచున్నది.

## యజ్ఞమునను రుద్రాదిత్యాత్మకము; విష్ణుస్వరూపము :-

యజ్ఞమునందలి ప్రాతఃసవన, మాధ్యందినసవన, తృతీయసవనములు వసురుద్రాదిత్యాత్మకములు.

"త్రయో వై దేవాః వసవో రుద్రా ఆదిత్యాః। తేషాం
"విభక్తాని సవనాని। వసూనా మేవ ప్రాతఃసవనమ్।
రుద్రాణాం మాధ్యందినం సవనమ్। ఆదిత్యానాం
తృతీయసవనమ్।" —శ. బ్రా. 4-3-5-1.

"ప్రాతఃసవనం గాయత్రీఛందస్కమ్। గాయత్రీ పాద శ్చాష్టా
క్షరః। సా చాక్షరగతాష్టత్వసంఖ్యా వసుష్వపి విద్యతే। అష్టౌ
వసవః ఇతి వసూనామప్యష్టత్వాత్। అతః సంఖ్యా ద్వారా
గాయత్రీసంబంధాత్ గాయత్రం ప్రాతఃసవనం వసూనా మేవ
విభక్తమ్। ఏవం ఉత్తరయో రపి సవనయోః— —" -సా. భా

ప్రాతఃసవనము గాయత్రీ ఛందస్సును, మాధ్యందినసవనము త్రిష్టుప్ ఛందస్సును, తృతీయసవనము జగతీఛందస్సును గల్గియున్నవి. గాయత్రీ ఛందస్సున

పాదమున కెనిమిదేసి యక్షరములు: త్రిష్టుప్ ఛందస్సున పదునొకం డక్షరములు; జగతీఛందస్సున ద్వాదశాక్షరములు నుండును. అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు నని త్రిస్థాన దేవతలకును సంఖ్యా ప్రసిద్ధి గలదు. ఈ మూడు ఛందఃపాదముల యందలి అక్షరగత సంఖ్యాసామ్యమును బురస్కరించుకొని వసువు లకు ప్రాతఃసవనము, రుద్రులకు మాధ్యందినసవనము, ఆదిత్యులకు తృతీయసవన మును విభక్తము లయినవి - అని యర్థము

"బ్రహ్మవాదినో వదన్తి య ద్వసూనాం ప్రాతఃసవనగ్ం,
రుద్రాణాం మాధ్యందినగ్ం సవన మాదిత్యానాం చ
విశ్వేషాం చ దేవానాం తృతీయసవనమ్" —ఛా.ఉ. 2-24-1.

అని యీ రీతిగ శ్రుతులయందు నీ మూడు సవనములు వసురుద్రాదిత్యా త్మకము లగుట ప్రసిద్ధము కాగా యజ్ఞము వసురుద్రాదిత్యాత్మకము. అందుచేత నే శ్రుతియు,

"అథేమం విష్ణుం యజ్ఞం త్రేధా వ్యభజన్త వసవః
ప్రాతఃసవనమ్ రుద్రా మాధ్యందినగ్ం సవన మాదిత్యా
స్తృతీయసవనమ్". —శ.బ్రా. 14-1-1-15.

యజ్ఞము విష్ణుస్వరూపము; అది వసురుద్రాదిత్యాత్మక సవనత్రయాత్మక ముగ విభక్తము — అని చెప్పుచున్నది. యజ్ఞవేదిని గూడ వసురుద్రాదిత్యాత్మక ముగ దర్శింపవలె నని శ్రుతి విధించుచున్నది.

"ఇమాం నరాః కృణుత వేది మేత్య వసుమతీగ్ం రుద్రవతీ
మాదిత్యవతీమ్" —తై. బ్రా. 3-7-7-13.

ఈ త్రిస్థానదేవతాస్వరూపము నిరుక్తము (దేవతాకాండము) నందును, బృహద్దేవత (1-2-3 అధ్యా.) యందును వివరింపబడినది. మొత్తముమీద నెట్లు

కీర్తింపబడినను ఆ యా దేవతావాచకపదములు ఆధియజ్ఞముగ తత్తద్దేవతావాచకములై యొప్పుచు నవి పరమేశ్వరు (పరమాత్మ) నుపలక్షింప జేయుచనే యుండును.

## ఇడా - సరస్వతీ - భారతీ - సాహచర్యము :-

అగ్ని - వాయు - ఆదిత్యులకు వలెనే ఇడా - సరస్వతీ-భారతీ యను దేవతలకును సాహచర్యము గలదు వీరొకరిని విడిచి యొక రెపుడును యజ్ఞభూమికి రారు. సహచారిణులై యేతెంచి కర్మసమృద్ధిని గావింతురు. అగ్ని వాయ్వాదిత్య (లేక వసురుద్రాదిత్య) పదములు వలెనే ఇడా - సరస్వతీ — భారతీ యను పదములలో నే యొకటియైన మూర్తిత్రయమును బోధింప జాలును. అనగా నొకే దేవతయందు మూర్తిత్రయవివక్ష జేయుటయు గలదు.

"దేవీ స్తిస్రః తిస్రో దేవీః సరస్వ త్యశ్వినా భారతీడా"

—తై. బ్రా. 2-6-14-4.

'సరస్వతీ భారతీడే త్యేతా స్తిస్రః సప్తమానుయాజదేవతాః ।
తాశ్చ పరస్పరం కదాచిద ప్యవియుక్తా ఇతి వక్తుం పున
స్తి సో దేవీ రిత్యుక్తమ్ । అథవా ఏకైకస్యా దేవతాయా
మూర్తిత్రయవివక్షయా తదుక్తిః।" —సా.భా.

వీరు మువ్వురును వాగ్దేవతలని శ్రుతులయందు బ్రసిద్ధి. కాని వైదిక నిఘంటువులలో నీ మూడు పదములు వాఙ్నామములందును బఠింపబడినవి. లౌకిక నిఘంటువులయందును[1] నివి దేవతానామములుగను, వాఙ్నామములుగను గూడ గన్పట్టుచున్నవి. కాన నీ మూడు పదములు వాగ్వాచకములు, వాగ్దేవతావాచకములు గూడ నగును. సంస్కృతభాషలో గొన్ని పదములు వాగ్దేవతావాచకములగుచునే వాగ్వాచకములుగ గూడ బ్రసిద్ధి నందినవి.

1. గో భూవాచ స్త్విడా ఇలా - అమరకోశః

'బ్రాహ్మీ తు భారతీ భాషా గీ ర్వాగ్ వాణీ సరస్వతీ'

—అమరకోశః

ఇవి వాగ్దేవతావాచకము లని వ్యాఖ్యాత లందఱును వివరించిరి. ఇవి వాగ్వాచకములు నగుట ప్రసిద్ధమే.

"వ్యాహార ఉక్తి ర్లపితం భాషితం వచనం వచః"

ఈ పదములు వాగ్దేవతావాచకములు గావు. వాగ్వాచకములు మాత్రమే. వేదమున 'వాక్' పదమునకు సామాన్యముగా వేదవాక్కు అనియే యర్థము.

"వాచా విరూప నిత్యయా" —ఋ. 8-75-6; తై. సం. 2-6-11-2;
"పతంగో వాచం మనసా బిభర్తి" -ఋ 10-117-2-; తై.ఆ.3-11.
"వాచా విప్రా స్తరత" —ఋ. 10-42-1; అ.సం. 20-89-1.
"వాచా సరస్వతీ భిషక్" -వా.సం. 19-12.
"వాచా సరస్వతీ మహః" -వా.సం. 21-37; తై.బ్రా. 2-6-11-7.
"వాగ్ఘోతా దీక్షా పత్నీ" —తై. ఆ. 3-6-1.
"వాచో వీర్యం తపసాఽన్వవిందత్" —తై. ఆ. 3-11-2.
"వాచస్పతేఽచ్ఛిద్రయా వాచా" —తై. ఆ. 3-4-1.

ఇట్లు శ్రుతులు 'వాక్' అనగా వేదవాక్కు అని బోధించుచున్నవి. భాష్యకర్తలు నట్లే త్రయీరూప వాక్కుగ నీ 'వాక్' పదమును గ్రహించిరి. ఈ వేదవాక్కు 'ఋక్ -యజుః -సామ' మంత్రరూపమున త్రివిధ మగుటజేసి యగ్నియు 'అగ్ని - వాయు - సూర్య' రూపమున త్రివిధరూపు డయ్యెననియు శ్రుతి చెప్పుచున్నది.

"సా వా ఏషా వాక్ త్రేధా విహితా —ఋచో యజూంషి
సామాని। తేనాగ్ని స్త్రేధా విహితః" —శ. బ్రా. 10-5-12.

"తేనాగ్ని స్త్రేధా విహితః అగ్ని - వాయు - సూర్యాత్మ
నేత్యర్థః — — వేదత్రయ ద్వారాఽగ్నే రుక్త
త్రైవిధ్యోపసంహారః" —సా. భా.
త్రయో వేదా అజాయన్త, ఋగ్వేద ఏవాగ్నే రజాయత,
యజుర్వేదో వాయోః సామవేద ఆదిత్యాత్" —ఐ. బ్రా. 5-32

ఇత్యాది శ్రుతివాక్యములు అగ్ని - వాయు - సూర్యులు వేదాత్మకు (వాగాత్మకు) లగుట జెప్పుచున్నవి. వీరితో నిరంతరసాహచర్యము గల్గిన వాగ్దేవత లగు ఇడా - సరస్వతీ - భారతీ యను దేవతలును వేదాత్మికలు - వాగాత్మికలు - నగుదురు కాగా వాఙ్నామములలో బఠింపబడినందునను, వాక్ పదము శ్రుతులలో వేదవాచకముగ బ్రసిద్ధమగుటవలనను, ఇడా-సరస్వతీ - భారతీ పదములు వేదవాచకములు, వాగ్దేవతావాచకములు గూడ నగును. వేదశరీరిణులగు నీ దేవతలు వసురుద్రాదిత్యులతో నిరంతరసాహచర్యము గల్గి యజ్ఞముల బ్రవర్తింపజేయుదురు.

"ఆదిత్యై ర్నో భారతీ వష్టు యజ్ఞగ్ం సరస్వతీ సహ రుద్రై
ర్న ఆవీత్। ఇడోపహూతా వసుభిః సజోషా యజ్ఞం నో
దేవీ రమృతేషు ధత్త" —తై. సం. 6-1-11-2; వా.సం. 29-8,

ఆదిత్యులతో భారతియు, రుద్రులతో సరస్వతియు, వసువులతో ఇడయు కలిసి యజ్ఞమున కేతెంచుట యీ మంత్రము వలన దెలియును. ఈ ముగ్గురు దేవతల గూర్చి బృహద్దేవత యందు నిట్లు చెప్పబడినది.

"తి సస్తు దేవ్యో యాః ప్రోక్తాః త్రిస్థానై వేహ సా తు వాక్ ।
త్రివిధేనోచ్యతే నామ్నా జ్యోతిఃషు త్రిషు వర్తినీ॥
అగ్ని మేవానుగేళా తు మధ్యం ప్రాప్తా సరస్వతీ।
అముం స్థితాఽధిలోకం తు భారతీ భవతి, హ్యాసౌ॥
సైషా తు త్రివిధా వాగ్వై దివి చ వ్యోమ్ని చేహ చ।
వ్యస్తా చైవ సమస్తా చ భజ త్యగ్నీ నిమానపి॥"
—బృ. దే. 3-12, 13, 14.

పృథివ్యంతరిక్షద్యులోకము లందలి మూడు జ్యోతిస్సులు అగ్ని-వాయు-సూర్యులు వీరియం దనుగతమై వాక్కు వర్తించుచున్నది. త్రిస్థానగతమైన యీ వాక్కే ఇడా-సరస్వతీ - భారతీ యనెడి ముగ్వురు దేవతలు. ఒకే వాక్కు త్రిస్థానగతమై మూడు నామములతో నభివ్యక్త మగుచున్నది. అగ్నిగతమై పృథివి యందు వ్యాప్తమైన వాక్కు ఇడ. వాయు (ఇంద్ర - రుద్రాదిదేవతా) గతమై యంతరిక్షమున వ్యాప్తమై యుండెడి మాధ్యమిక వాక్కు సరస్వతి. ఈ వాక్కు శచీ, గౌరీ, ఇత్యాది నామములతో గూడ బరగును (చూ. వైదికనిఘంటు). ఆదిత్య గతమై ద్యులోకవ్యాప్తమైన వాక్కు భారతి (సూర్యా, సావిత్రీ-ఇత్యాది నామములతో గూడ నొప్పును) ఈ వాగ్దేవి సమిష్టిరూపమున వాక్కుతో లోకత్రయమును వ్యాపించి యుండును. మరల నీమెయే యజ్ఞమున త్రేతాగ్నులయందు విభక్తమై మూడు నామములతో బరగుచున్నది-అని యర్థము.

దీని ననుసరించి యొకే వాక్కు త్రిధా విభక్తమై అగ్నివాయ్వాదిత్యుల యం దనుగతమై ఇడా-సరస్వతీ-భారతీ నామములతో బరగునని తెలియును. అగ్ని వాయు-సూర్యులు వేదాత్మకు లగుటచే వారియం దనుగతమై యుండెడి వాక్కు 'ఋగ్యజుఃసామ'రూప వేదవాక్కే యని పూర్వము వివరింపబడినది. శ్రుతియే 'తాను (వాగ్రూపిణి, లేక వాగ్దేవతా రూపిణి యగు తాను) వసురుద్రాదిత్యాది దేవతలయం దనుగతమై యుండి సర్వజగన్నిర్వహణ మొనర్చుచు పరమాత్మ కంటె ననన్యమైన పరమేశ్వరి యగుట' యొక సూక్తముఖమున జెప్పికొనినది.

"అహం రుద్రేభి ర్వసుభి శ్చరా మ్యహ మాదిత్యై రుత
విశ్వదేవైః । అహం మిత్రావరుణోభా బిభర్మ్యహ
మింద్రాగ్నీ అహ మశ్వినోభా'

—ఋ. 10-125 సూ, అ. సం. 4-30.

ఇచట 'బిభర్మి (భరించుచున్నాను)' — అను క్రియ యాద్యైపీ వాక్కు (లేక వాగ్దేవి) సర్వజగద్భరణధర్మము చే 'భారతి' యగునని సూచించుచున్నది. ఈ సూక్తముననే మఱియొకచోట దన ప్రాశస్త్యము నిట్లు జెప్పికొనినది.

"అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా
యజ్ఞియానామ్,"

నేను పరమేశ్వరిని: కర్మఫలదాత్రిని: ద్రష్టవ్యుడగు నాత్మ యొక్క యపరోక్షసాక్షాత్కారము గలదానను (చికితుషీ యత్ సాక్షాత్కర్తవ్యం పరం బ్రహ్మ తద్ జ్ఞాతవతి, స్వాత్మతయా సాక్షాత్కృతవతీ - సా భా); యజ్ఞముచే నారాధ్యులగు దేవతలలో బ్రప్రథమురాలను (ప్రథమా యజ్ఞియానామ్).

"అహమేవ స్వయ మిదం వదామి జుష్టం దేవేభి రుత
మానుషేభిః। యం కామయే తం త ముగ్రం కృణోమి
తం బ్రహ్మాణం త మృషిం తం సుమేధామ్ ॥"

ఇంద్రాది దేవతలకును మనుష్యులెల్లరకును నారాధనీయమగు నీ బ్రహ్మ తత్త్వమును నేనే స్వయముగ నుపదేశించుచున్నాను. (అహం స్వయమేవ, ఇదం వస్తు బ్రహ్మాత్మకం, వదామి ఉపదిశామి — సా.భా); ఎవడు నా యనుగ్రహ పాత్రు డగునో యాతనిని మేధావంతుని జేసి సర్వోన్నతుని గావింతును; క్రాంత దర్శనము గల ఋషి నొనర్తును; బ్రహ్మ నొనర్తును—అని యర్థము.

మానవులే గాక దేవతలు గూడ సేవింపదగిన బ్రహ్మతత్త్వము నేనే స్వయముగ జెప్పుచున్నాను—అని యిట జెప్పబడినది. ఈ యర్థమునే మనుస్మృతియు నిట్లుపదించినది.

"పితృ దేవ మనుష్యాణాం వేద శ్చక్షుః సనాతనమ్"

పితృ-దేవ-మనుష్యులకు వేదము సనాతనమైన జ్ఞాననేత్రము: కాన పై ఋక్కులలోని వాక్కు వేదవాక్కు, లేక వాగ్దేవత యగును. మానవ రచితము లగు గ్రంథములలో నెచటగాని సామాన్యముగ నా యా ఫలముల నుద్దేశించి దేవతల యనుగ్రహము కొఱకు జేయబడెడి ప్రార్థనాదికము గానవచ్చును. కాని స్వగ్రంథ ప్రతిపాదితార్థమును దేవతలు సైతము సేవింపవలె ననెడి శాసనములు గన్పట్టవు. ఒకవేళ నట్టి శాసనము లెచటనైన గన్పటిన నవి యున్మత్తప్రలాపములే యన

బడును. ప్రకృతమున వేదమునందట్టి శాసనము గన్పట్టుచున్నది. (జుష్టం దేవేభి రుత మానుషేభిః). వేద ప్రతిపాద్యమగు బ్రహ్మవిద్య యందు దేవతలు గూడ నధికారులు (చూ. బ్ర. సూ. దేవతాధికరణము). స్మృతులును, పురాణేతిహాసాదులును నిఃశంకముగ నా శ్రుత్యర్థము ననుసరించి, యా సత్యమును లోకమున బ్రబోధించినవే కాని, యక్షరహితము లనుచు శ్రుతిశాసనములను త్రోసిరాజనలేదు.

కాన పై ఋక్కుల ననుసరించి వేదవాణి లేక వాగ్దేవత - వసురుద్రాదిత్యులతో సంచరించుచు నిరంతరసాహచర్యము గలది. సర్వమును భరించు పరమేశ్వరి, కర్మఫలదాత్రి, అపరోక్షాత్మసాక్షాత్కారము గలది. బ్రహ్మతత్త్వప్రతిపాదికయు నగుచున్నది. ఇంతేగాదు. వసురుద్రాదిత్యుల యందు పారమేశ్వరతేజ మనుగతమై యుండునట్లే, వారితో సంచరించుచు వారియం దనుగతమై యుండెడి వేదవాణియందును, ఆ పారమేశ్వరతేజ మనుగతమై యుండును. అట్లు వారియం దనుగతమై యుండెడి యొకే వాగ్దేవి ఇడా - సరస్వతీ - భారతీత్యాది వివిధనామముల దాల్చుచు సర్వమును భరించుచున్నది' - అని తెలియనగును.

మఱియు - 'యం కామయే తం త ముగ్రం కృణోమి తం బ్రహ్మాణం త మృషిం తం సుమేధామ్' - అని యనుటచే, నీ వేదవాణితో నెవరు సఖ్యము చేయుదురో వారు ఆధ్యాత్మికౌన్నత్యము గలవారై యధికారిభేదము ననుసరించి క్రమముగ మేధాసంపద, క్రాంతదర్శనము (ఋషిత్వము). తుదకు బ్రహ్మత్వము గూడ నందెద రనియు దెలియును. వేదవాణితో సఖ్యము జేసెడి వేదవిదుడు క్రమముగ వసు-రుద్ర-ఆదిత్య రూపుడై తుదకు బ్రహ్మానందరసావలిప్తుడగు నని చెప్పెడి పూర్వోదాహృతములైన - 'మాతా రుద్రాణామ్; అగ్నే ర్వాయో రాదిత్యస్య సాయుజ్యం గచ్ఛతి' - ఇత్యాది శ్రుతివాక్యములును పై ఋగర్థమునే భంగ్యంతరముగ వివరించుచున్నవి.

ఇక నొకే వేదవాణి యవస్థాభేదముచే ఇడా-సరస్వతి-భారతి రూపములతో సాక్షాత్కరించి యుపదేశించుచు నెట్లు కావ్యమై వరలునో చూతము.

## ఇడా-శాసనీ; యజ్ఞానూకాశినీ; దేవహూః యజ్ఞనీః :-

'వేదవిదుడు వసు-రుద్ర-ఆదిత్యరూపు డగును; దేవతాత్రయరూపుడగుచు వెలయు నాతనియం దనుగతమై విలసిల్లు వాక్కు వేదవాణియే; అగ్ని నారాధించుచు కర్మానుష్ఠాన పరుడగు వేదవిదుడు వసురూపుడు'-అని పూర్వము వివరింపబడినది. కర్మానుష్ఠాన సమయమున వేదవిదునియం దుండెడి వేదవాక్కు ఇడారూపిణి యగును. కావుననే శ్రుతులయందు ఇడ - 'శాసనీ; యజ్ఞానూకాశినీ; దేవహూః' - అని యీ రీతిగ కీర్తింప బడినది.

"ఇడా మకృణ్వన్ మనుషస్య శాసనీమ్" —ఋ. I-31-11.

"మనుషస్య మనోః ఇడాం ఏతన్నామధేయాం పుత్రీం,

శాసనీం ధర్మోపదేశకర్త్రీం అకృణ్వన్ కృతవన్తః" —సా.భా.

మనువు పుత్రిక యగు ఇడ ధర్మోపదేశకర్త్రి (శాసనీ) యని యిట చెప్ప బడినది. తైత్తిరీయబ్రాహ్మణము మనువుకు సంబంధించిన గోరూపిణి యగు దేవత ఇడ యని యిట్లు వర్ణించినది.

"ఇడా వై మానవీ యజ్ఞానూ కాశి న్యాసీత్" —తై. బ్రా. 1-1-4-4.

"ఇడా నామ గోరూపా కాచిత్ దేవతా; సా చ మనుసంబంధినీ;

తత్సంబంధ శ్చ మానవీ ఘృతపదీ మైత్రావరుణీ—ఇతి ఇడో

పాహ్వానస్య బ్రాహ్మణే స్పష్ట మామ్నాతః—మానవీత్యాహ

మనుర్హ్యేతా మగ్రేఽపశ్యత్, -ఇతి సాచేడా యజ్ఞానూకాశినీ

యజ్ఞతత్త్వప్రకాశన సమర్థాఽఽసీత్ "—సా.భా.

సృష్ట్యాదియందు యజ్ఞాదికర్మలను, ధర్మములను ప్రవర్తింపజేసినవాడు మనువు. అట్లు ప్రవర్తింపజేయుటకు దోడ్పడిన గోదేవత ఇడ. యజ్ఞతత్త్వ ప్రకాశికయు, ధర్మోపదేశకర్త్రియు గోదేవతయు నగు ఇడ వేదవాణి యే యగును. గోదేవతాకములగు 'మాతా రుద్రాణామ్; వచో విదం వాచ ముదీరయన్తీమ్' ఇత్యాది

మంత్రములు కర్మాంగములుగ 'గో'పరము లయ్యును, నవి యా గోవును వేద రూపిణి యగు ధేనువుగా దర్శింపజేయునట్టివి యని పూర్వము వివరింపబడినది. కాన నిచట మానవి(మనోః సంబంధినీ) యగు ఇడ వేదవాణి యని గ్రహింపవగును.

మఱియు 'య మాహు ర్మనవ స్తీర్ణబర్హిషం-(వా.సం. 15-49)' అను శ్రుతివాక్యము నందలి 'మనవః' అను పదమును 'యే విద్వాంస స్తే మనవః' (శ.బ్రా. 8-6- -18) అని శతపథశ్రుతి వివరించినది. మనువు ప్రవర్తింపజేసిన ధర్మమార్గమున జరించుచు కర్మానుష్ఠానపరులగు విద్వాంసులును 'మను' రూపులే యగుదురని తాత్పర్యము. ప్రజాపతి యగు మనువునకు ధర్మోపదేశకర్త్రి (శాసని) యై, యజ్ఞతత్త్వప్రకాశికయై తోడ్పడినట్లే, యా మనుమార్గమున జరించుచు మనురూపులగు వేదవిదులకును ఇడారూపిణియై వేదవాణి తోడ్పడునని శ్రుతితాత్పర్యముగ గ్రహింపవగును.

యజమానుడు కర్మానుష్ఠాన సమయమున నీ వేదవాక్కుతో నా యా దేవతల నాహ్వానించి స్తుతించును. స్తుతిరూపమగు నా వాక్కు ఇడ యనియు, మహత్త్వసంపన్నము, గణనీయము నగునని ఋగ్వేద మిట్లు చెప్పుచున్నది.

"ఇడా యేషాం గణ్యా మాహినా గీః" —ఋ. 3-7-5.

"యేషాం మనుష్యాణా మగ్నివిషయా, మాహినా మహతీ,

ఇడా, గీః స్తుతిరూపా వాక్, గణ్యా గణనీయా పూజ్యా" —సా. భా.

కర్మానుష్ఠానసమయమున నగ్ని నుద్దేశించిన స్తుతిరూపమగు వాక్కు ఇడ యని యిట నిర్దేశింపబడినది. ఇట్లు అగ్నిని, అగ్నిముఖమున సర్వదేవతలను, ఆహ్వానించుట కుపయుక్త మగుటచే వేదవాణికి 'ఇడా' (ఈడ్యతే స్తూయతే అనయా) యని సార్థకనామము.

"ఇడా దేవహూ ర్మను ర్యజ్ఞనీః" —తై సం, 3-3-2-1.

అని తైత్తిరీయశ్రుతియు ఇడాస్వరూపమును వివరించుచున్నది. ఈమె

దేవతాహ్వానమున కుపయుక్త మగుటజేసి 'దేవహూః' అగుచున్నది. అట్లు దేవతాహ్వానాదుల ద్వారా యజ్ఞమును ప్రవర్తింపజేయునది యగుటజేసి 'యజ్ఞనీః' అగుచున్నది. ఈ యర్థమే 'శాసనీ, యజ్ఞానూకాశినీ' అను పదములందే గూడ పైన అభివ్యక్తము చేయబడినది. ఇంతే కాదు. మంత్రరూపమై మననము చేయదగినది యగుట జేసి 'మనుః' అనియు కీర్తింపబడినది. విష్ణుసూరిభాష్యమున నీ యర్థ మిట్లు వివరింపబడినది.

"ఇడా గోరూపిణీ బ్రహ్మవిద్యా। సా చ స్వ సత్తయా
దేవాహ్వానకరత్వాత్ దేవహూ రిత్యుచ్యతే-ఇడే రన్తేఽదితే
సరస్వతీ త్యాది మంత్రలింగాత్ 'గాయంతం త్రాయసే
యస్మా ద్గాయత్రీ త్వం ప్రతిష్ఠితా'-ఇతి స్మృతేః....[1] తథా
మను ర్మంత్రరూపా వాగ్దేవతా। సా చ కర్మమార్గోపదేశక
త్వాత్ యజ్ఞం నయతి ప్రాపయతీతి యజ్ఞనీః ఇత్యుచ్యతే"
—రుద్రాధ్యాయః, విష్ణుసూరిభాష్యమ్.

గోరూపిణియగు బ్రహ్మవిద్యయే ఇడ. ఆమెయే దేవతాహ్వాన-యజ్ఞప్రవర్తకత్వ ధర్మముల ననుసరించి 'దేవహూః, యజ్ఞనీః' అగుచు మంత్రరూపిణియై మననీయ యగుచు 'మనుః' అగుచున్నది-అని తాత్పర్యము. ఇడ యన బ్రహ్మవిద్యారూపిణి యగు వేదవాణి యగుట శ్రుతి తాత్పర్యము. అయ్యును వేదవిదునియందుండెడి వేదవాణి ఇడయై కర్మానుష్ఠాన సమయమున శాసించుచు యజ్ఞ (ధర్మ) మార్గమున ప్రవర్తింప జేయునది యగుటజేసి వేదకావ్యము యొక్క ప్రభుసంమితత్వము సూచిత మగుచున్నది.

"నాట్యవేదం ప్రవక్ష్యామి బ్రహ్మణం య దుదాహృతం" భ నా.శా. 1-1.
"బ్రహ్మణా పరమాత్మనా, య దుదాహృతం అవిద్యావిరచిత నిస్సార భేదగ్రహే, య దుదాహరణీకృతం తన్నాట్యం ప్రవక్ష్యామి. యథా హి కల్పనామాత్రసారం

1. తై.సం. 1-1-6-8: వా.సం. 8-43; శ.బ్రా. 4-5-8-10

తత ఏవ అనవస్థితైకరూపం క్షణేన కల్పనాశతసహస్ర సహం స్వప్నాది విలక్షణ మపి సుష్ఠుతరాం హృదయగ్రహనిదానం అత్యన్తస్వాలంబన బ్రహ్మకల్ప నటోపర చితం రామరావణాద్యుష్ఠితం అసత్యం కుతోఽప్యభూతాత్ జాతవృత్త్యా భాతి తథా భాసమాన మపి చ పుమర్థోపాయతా మేతి తథా తాదృ గేవ విశ్వ మిద మసత్య నామరూప ప్రపంచాత్మకం, అథ చ శ్రవణమననాది వశేన పరమపుమర్థ ప్రాపక మితి లోకోత్తర పరమ పురుషార్థ సూచనేన శాంతరసోపక్షేపో యం; భవిష్యతి, స్వం స్వం నిమిత్త మాదాయ శాంతా ద్భావః ప్రవర్తతే. (నాట్య. శా. 1-6 త దనేన పారమార్థికం ప్రయోజనము క్త మ్.-భట్టనాయకః—అభినవభారతీ. ఇట నాట్యశాస్త్రారంభమున ఈ నాట్యవేదము యొక్క పరమప్రయోజన మిట్లు వివరింప బడుచున్నది. ఈ నాట్యవేద మనాది అవిద్యాకల్పితమై నిస్సారమైన జగత్తునందలి వివిధ భేదప్రకారమును- అందలి తత్త్వమును- దర్శింప చేయుటకై పరమాత్మయే ఈనాట్యమును దృష్టాంతముగా జేసి ప్రవచించినాడు. నాట్యము కేవలము కల్పనా మూలము; క్షణక్షణ పరిణామశీలము; కల్పనాశతసహస్ర సంకులము; స్వప్నాది విలక్షణము; అత్యంతము హృదయావర్జకము; స్వ స్వరూపావస్థితు డయియే బ్రహ్మ మిథ్యా జగన్నాటక సూత్రధారుడై విలసిల్లున్నటులే నటుడును స్వస్వరూపావస్థితు డయియే అసత్య రామరావణాది చేష్టిత రూపము లైన వివిధరూపముల భాసింప జేయును. నాటకము లేక నాట్యము వస్తుతః మిథ్యారూపమై భాసించుచునే పురుషార్థ దర్శనోపాయమై వరలును; అట్లే అసత్య నామ రూపాత్మక మైన యీ జగన్నా టకము గూడ వేదవాక్య సాహాయ్యముతో శ్రవణ మననాదిక మొనర్చి దర్శించుచో పరమపురుషార్థ మగుచు శాంత రసోపస్థాపక మగును. ఇట్లు జగన్నాటక తత్త్వము దెలియజేయుట కయియే పరమాత్మ నాట్యవేదమును దృష్టాంతముగ ప్రవచించెను- అని యర్థము.

'బ్రహ్మణా య దుదాహృతమ్.-అను పై నాట్యశాస్త్రారంభ శ్లోకమునకు 'బ్రహ్మణా వేదాఖ్యేన భగవతా శబ్దరాశినా, ఉదాహృతం నిరూపితమ్'అని మతి యొక వ్యాఖ్యానము అభినవభారతి' యందు గాన నగును. వేదశబ్దరాశి బ్రహ్మ

నుండి యీ నాట్యశాస్త్రము నిరూపిత మైనది- అని భావము. పరిశీలించినచో నీ రెండు వ్యాఖ్యానముల తాత్పర్య మొక్కటియే.

కాగా భరతు (మహానటు) డగు పరమేశ్వరునిచే ప్రవర్తితము లైన కావ్యములు రెండు. ఒకటి రూపాత్మక జగన్నాటక దృశ్యకావ్యము. రెండవది నామాత్మక వేదరూపశ్రవ్యకావ్యము. కాననే (భరత నిఃసృతము లగుటచేతనే) లోకమునకు భారత వర్ష మనియు, వేదవాణికి భారతి యనియు ప్రశస్తి యుపపన్నమైనది. ఈరెండును దేవశిల్పములే; దేవతాతత్త్వ ప్రబోధకములే- అని తెలియచేయుటకే నాట్య శాస్త్రమును (నాట్యశిల్పమును) పరమాత్మ అవతరింప చేసినట్లు పై వచనముల వలన తెలియును.

సాధారణముగ జగన్నాటకముచే ప్రభావితులు గాని వారుండరు. ఇట నందఱును సామాజికులే. అయ్యును "ఈ దృశ్య మగు జగత్తు ఒక నాటకము; కల్పనా మాత్రసారము; దేవ ల్పము; కాన పురుషార్థోపాయప్రబోధకము"- అను విషయ మందఱకు పొడగట్టదు ఇది యథార్థమే - అను భ్రాంతిచే మోహితులై సంసార ప్రవాహమున బడి యటు నిటు పరిభ్రమింతురు. ఇట్టి జగద్రూప దృశ్యకావ్య తత్త్వమును తెలియజేసి యుద్ధరించుట కయియే భరతుని (పరమాత్మ)చే వేదరూప శ్రవ్య కావ్యము ప్రవర్తిత మైనది. ఇదియును దేవశిల్పమే. (తత్ప్రవర్తితము లైన యజ్ఞాది కర్మోపాసనలును దేవశిల్పములే) అయ్యును దీని నంద ఱెరుగజాలరు. (విశ్వ విత్ - అవిశ్వమిత్వా) కొందఱకిది లౌకిక విషయావబోధక మగు శబ్దరాశిగ మాత్రమే గోచరించును. అట్లుగాక దానితో నిరంతర సఖ్యమొనర్చి అధ్యయన కర్మానుష్ఠానాదిక (మొనర్చుచు) శ్రవణ మననాదిక మొనర్చుచో నట్టి సఖులగు సామాజికుల కిది దేవ శిల్పమై (దైవీవాక్కుగ) భాసించి పురుషార్థ ప్రద మగును. ఈ రీతిగ నీ దృశ్య శ్రవ్యకావ్యముల దర్శించి నపుడే త్రిలోకముల ప్రవర్తింప జేసిన అగ్ని- వాయు- ఆదిత్యులు భరతులగ గన్పట్ట గలరు. త జ్జ్యోతిస్త్రయాత్మకు డగు పరమేశ్వరుడును మహానటుడై - భరతుడై - మహాకవియై సాక్షాత్కరించును. కావుననే అలంకారశాస్త్ర ప్రవర్తకులలో నొకడగు భట్టనాయకుడు పరమేశ్వరుని జగన్నిర్మాణ కవిగా ఇట్లు కీర్తించినాడు.

నమ స్త్రైలోక్యనిర్మాణకవయే శంభవే యతః
ప్రతిక్షణం జగన్నాట్య ప్రయోగరసికో జనః"

అభినవభారతి-నాట్యశాస్త్ర 1-1.

# సరస్వతీ ;

వేదవాణి మంత్రరూపమై మననీయ మగుటచే 'మనః' అగునని పైన జెప్పబడినది. శ్రవణ మననాదులు జేయుచు నుపాసనాపరుడగు వేద విదుడు రుద్ర రూపుడగు ననియు బూర్వము (కవి కావ్యశబ్దమున 'మాతా రుద్రాణామ్' అను మంత్రమున) చెప్పబడినది. అట్టి వేదవిదునియం దుండెడి వేదవాణియే సరస్వతి (లేక గౌరి-శచీ ఇత్యాది నామములతో బరగునది). శ్రవణము జేసి శ్రుత్యర్థమును జక్కగా మననము జేయు విద్వాంసుని మనస్సు వివిధవిజ్ఞానములకు నిలయమై 'సరస్వాన్' అగు చున్నది. తద్గత మగు వాక్కు (వేదవాణి) సరస్వతి యగును. ఈ విషయమును శతపథ శ్రుతి యిట్లు వివరించుచున్నది.

"మనో హి సరస్వాన్। వాక్ సరస్వతీ। ఏతౌ సారస్వతా వుత్సౌ"

—శ బ్రా. 7-5-1-3 .

"సరస్వాన్ మన ఉచ్యతే । సరస్వతీ చ వాక్ । ఏతౌ సారస్వతౌ ఇతి స్వార్థికోఽణ్ ప్రత్యయః । ఉత్సౌ వారి ప్రవాహౌ వాఙ్మనసాత్మకౌ । మనస స్తావత్ సర్వశాస్త్రార్థ పరిజ్ఞాన రసాధారత్వాత్, వాచశ్చ తత్ప్రతిపాదన రసా ధారత్వా దుత్సత్వ మనయోః'

—సా. భా.

మనస్సు 'సరస్వాన్' అనియు, వాక్కు సరస్వతి యనియు, నీరెండును, సారస్వత ప్రవాహము లనియు నిట జెప్పబడినవి. వాఙ్మనస్సులు జల ప్రవాహముల వంటివి (ఉత్సౌ-ఉత్స్యందనౌ); లేక ఊటబావుల వంటివి (Fountains or Springs) ఊటబావులలో తోడినకొలది నీరు పైకి ఉబుకుచుండురీతి విజ్ఞానవిషయ

ముల మననము చేయకొలది మనస్సున నూత్నానూత్నాంశములు స్ఫురించుచుండుల వాక్కు కూడ చిత్తసంస్కృతి క్రమము ననుసరించి నూత్నానూత్నార్థములతోను శోభిల్లుచు గన్పట్టి వివిధ నిగూఢార్థముల పర్యింప జేయుచుండును. అందుచే నీ వాఙ్మనస్సులు ఊటబావులతో పోల్చబడినవి. మఱియు ప్రవాహము నిత్యసరణ శీలము. ప్రవాహము వలె వాఙ్మనస్సులు గూడ నిత్యసరణశీలములై సారస్వత ప్రవాహరూపములై వెలయుచుండును. అట్టియెడ మనస్సు నిఖిలశాస్త్రార్థ విజ్ఞాన రసమున కాకర మగును. వాక్కు గూడ తద్రస ప్రతిపాదకమై రసాధార మగును. కాన నీ రెండును సారస్వత ప్రవాహ రూపములగు ఉత్సవములు - అని యర్థము.

ఇట 'శ్రవణమననాదులచే బరిపక్వమైన వేదవిదుని మనస్సు శాస్త్రార్థ విజ్ఞానరసపరిప్లుతమై 'సరస్వాన్' అగుచున్నది' - అని చెప్పుటచే నట్టి మనస్వి యగు వేదవిదుడును సరస్వంతుడగును. ఆ సరస్వంతుని యొక్క వేదవాక్కు తత్ప్రతిపాదక రసాధారమగుచు సరస్వతి యగును. శాస్త్రార్థపరిజ్ఞానరసమే యిట శ్రుతియందు 'సరః' పదముచే నుపలక్షిత మగుచున్నది. వేదవిదునకు మాతవలె వివిధశాస్త్రార్థ విజ్ఞానరసము నందించెడి వేదవాక్కు సరస్వతి యగు నని శ్రుతితాత్పర్యము. వేదాభ్యాససమయమున సరస్వతి తల్లివోలె తనయందు నిగూఢమైయున్న విజ్ఞానరసము నందించునని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

> "యదేషాం శ్రేష్ఠం యదరిప్ర మాసీత్ ప్రేణా తదేషాం
> నిహితం గుహావిః" —ఋ. 10-71-11.
> 'ఏషాం శ్రేష్ఠ ప్రశస్యతమం, యత్ యచ్చ, అరిప్రం
> పాపరహితం వేదార్థజ్ఞానం, అసీత్, ఏషాం తద్ జ్ఞానం
> గుహా గుహాయాం, నిహితం గోప్యం, తత్ ప్రేణా ప్రేమాణ
> ఽఽవిర్భవతి। వేదాభ్యాసకాలే సరస్వతీ స్వార్థ మేభ్యః
> ప్రకాశయతీత్యర్థః' —సా. భా.

మఱియు యజ్ఞభూమి కాహ్వానింపబడు ఇడా-సరస్వతీ-భారతీ అను ముగ్గురు దేవతలలో బుద్ధిని సంస్కరించి విజ్ఞానప్రబోధము జేయునది సరస్వతి ఈ విషయమును శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"సరస్వతి సాధయన్తీ ధియం న ఇలా దేవీ భారతీ విశ్వతూర్తిః।
తిస్రో దేవీః స్వధయా బర్హి రేవ మచ్ఛిద్రం పాంతు శరణం
నిషద్య॥" —ఋ. 2-3-8.

ఈ మంత్రమున ముగ్గురు దేవతలు నాహ్వానింపబడిరి. అందు బుద్ధిని సంస్కరించి ప్రబోధించెడి ధర్మము (సాధయన్తీ ధియం నః) సరస్వతికే చెప్పబడినది. సరస్వతి యొక్క యిట్టి యీ స్వభావ డింకను పలు మంత్రములందును గాననగును.

"పావకా నః సరస్వతీ వాజేభి ర్వాజినీవతీ
యజ్ఞం వష్టు ధియా వసుః॥"[1]
"చోదయిత్రీ సూనృతానాం చేత న్తీ సుమతీనామ్।
యజ్ఞం దధే సరస్వతీ॥"[2]

## పావకా - ధియా వసుః-

'హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాఽపి వా'
—రఘు.

హిరణ్యము (బంగారము) యొక్క పరిశుద్ధి గాని, మాలిన్యము గాని అగ్నియందు స్ఫుటముగా నభివ్యక్త మగును-అని యర్థము ఇట్టి శోధకత్వధర్మము. గలవాడగుటచే నగ్నికి 'పావకః' (పావయతి శోధయతీతి పావకః)-అని పేరు. జ్ఞానక్రియాశక్తి సంపన్నమై 'హితరమ్య' మగుటచే సూక్ష్మశరీరమునకు హిరమ్య' మనిపేరు; హిరమ్యమే పరోక్షముగా హిరణ్య మని చెప్పబడు నని పూర్వము

1. ఋ. 1-3-10; సా.వే. 1-189; వా. సం. 20-84; తై. బ్రా. 2-4-3-1; ఐ. అ. 1-1-4-16.
2. ఋ. 1.3-11; వా. సం. 20-85; తై. సం. 4-1-11-2;

(చూ. కవి-కావ్యము) వివరింపబడినది. హిరణ్మయూప మగు సూక్ష్మశరీరము నందలి విశుద్ధిని. మాలిన్యమును శోధించి దర్శింపజేయునది గాన సరస్వతియు 'పావక' యగును. బుద్ధి నావేశించి యుండి 'ధియావసుః' -అగును.

"ధియావసుః బుద్ధ్యా సర్వా నాచ్ఛాదయన్తీ, బుద్ధిప్రదేత్యర్థః"

—సా. భా. (ఐ. ఆ.)

'ధియావసుః ప్రజ్ఞాధనా .... ప్రజ్ఞయాఽఽచ్ఛాదయిత్రీ సర్వార్థానామ్

—స్కందస్వామీ.

'ప్రజ్ఞయా సర్వేషాం వాసయిత్రీ' —వేం. మా. భాష్యమ్.

## పావమానీ - వేదమాతా :-

శోధకత్వధర్మమును బురస్కరించుకొని 'పావకా' యనియే గాక, పావమానీ యనియు వేదవాక్కు చెప్పబడుచున్నది.

'స్తుతా మయా వరదా వేదమాతా ప్రచోదయన్తాం పావమానీ
ద్విజానామ్। ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం
ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యం దత్వా వ్రజత బ్రహ్మలోకమ్'

—అ. సం. 19-71-1.

(ఈ మంత్రము కొలది మార్పులతో తైత్తిరీయారణ్యకము (10-36) నందును గలదు).

'మయా వేదాధ్యాయకేన'సావిత్రీం జపతా వా స్తుతా అభిష్టుతా స్వభ్యస్తా. వరదా ఇకామప్రదాత్రీ, పవమానః పాపాత్ పరిశోధకః సూత్రాత్మా। 'వాయు రేవ పవమానో దిశో హరిత అవిష్ట' —ఇతి ఐతరేయకశ్రుతేః(ఐ. ఆ. 2-1-1),తత్ప్రతిపాదికా పావమానీ, వేదమాతా వేదస్య ఋగాదిరూపస్య మాతా సర్వవేదసారత్వేన మాతృవత్

ఇట్లు సోముడు బ్రహ్మణస్పతి – మంత్రపతి – గా సంబోధింపబడినాడు. అట్టి సోము (బ్రహ్మ) నుద్దేశించిన మంత్రము 'పవిత్ర' శబ్దముచే జెప్పబడినది. 'పూఙ్' ధాతువు కంటె 'ఋషి (మంత్ర) – దేవతా' రూపార్థమున 'ఇత్ర' ప్రత్యయము వచ్చి 'పవిత్ర' అను రూపము సిద్ధించును.

"కర్తరి చర్షిదేవతయోః పా.సూ. 3-2-186.

"పువ ఇత్రః స్యాత్ ఋషౌ కరణే. దేవతాయాం కర్తరి ।
ఋషిర్వేదమంత్రః తదుక్త మృషిణేతి దర్శనాత్, పూయతేఽ
నేనేతి పవిత్రమ్। దేవతాయాం తు 'అగ్నిః పవిత్రం' స మా
పునాతు" –సిద్ధాన్తకౌముదీ.

'పూయతే అనేనేతి పవిత్రమ్' అను నిర్వచనము ననుసరించి పవిత్రహేతు వగు వేదమంత్రము పవిత్రము. పవిత్రము చేయువారు గాన దేవతలకును పవిత్ర వ్యవహారము గలదని శబ్దానుశాసనము వలన దెలియుచున్నది. కాన ఋగ్యజుఃసామాత్మక మంత్రరాశి పవిత్రశబ్ద వాచ్యమై శ్రుతిస్మృతుల యందు ప్రసిద్ధమైనది[1]

1. నిశమ్య తే ఘర్ఘరితం స్వఖేదక్షయిష్ణు మాయామయసూకరస్య ।
జన స్తపః సత్యనివాసిన స్తే త్రిభిః పవిత్రై ర్మునయో గృణన్స్మ ॥
—భాగ. 3-13-27.

'త్రిభిః పవిత్రైః ఋగ్యజుః సామ మంత్రైః' —శ్రీధరః
"మంత్రః పవిత్ర ముచ్యతే" —సా.భా. ఋ. 10-27-15.

"కుర్యాత్త్రిషవణస్నాయీ కృచ్ఛ్రం చాంద్రాయణం తథా।
పవిత్రాణి జపే త్పిండాన్ గాయత్ర్యా చాభిమంత్రయేత్॥"
యాజ్ఞ. స్మృ. ప్రాయశ్చిత్త కాండ. 325
"సావిత్రీం చ జపే న్నిత్యం పవిత్రాణి చ శక్తితః" —మను. 11-226.
"తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని యోగః—స్వాధ్యాయః ప్రణవాది
పవిత్రాణాం జపః" —శం.భా. (యోగసూత్ర).

ఇంతే కాదు. ఋగ్యజుఃసామాత్మకు లగు నగ్ని-వాయు-సూర్యులును పవిత్ర శబవాచ్యులు.

త్రిభిః పవిత్రై రపుపో ద్ధ్యర్కం హృదా మతిం జ్యోతి రనుప్రజానన్" —ఋ. 3-28-6.

'సర్వాత్మకః అగ్నిః హృదా అంతఃకరణవృత్త్యా, మతిం మననీయం, జ్యోతిః స్వప్రకాశరూపం పరబ్రహ్మాఖ్యం తేజః, అనుప్రజానన్ శ్రవణమననాది క్రమేణ ప్రకర్షేణ సంశయ విపరాస్య భావనా బుద్ధినిరాసేన స్వాత్మరూపతయా జానానః సన్, పవిత్రైః పావనైః, త్రిభిః అగ్ని వాయు సూర్యైః, అర్కం అర్చనీయం స్వాత్మానం, అపుపోద్ది తేభ్యోఽపి నిర్మలతయా పావనం పరిచిచ్ఛేద ఖలు । యథా దశాపవిత్రేణ సోమం పావయతి తద్వత్ ।' —సా. భా.

ఇట పరతత్త్వరూపమును సాక్షాత్కరించుకొనిన యగ్ని (ముక్తపురుషుడు) తన సర్వాత్మకత్వానుభవమును ఆవిష్కరించు కొనుచున్నాడు. దశాపవిత్రముచే సోమము పరిశుద్ధమై పావన మగునట్లు, పవిత్రులగు నగ్ని వాయు సూర్యులచే నర్చనీయుడగు స్వాత్మ, వారికంటె నిర్మలుడు; పవిత్రుడు నని ముక్తపురుషుడగు అగ్ని శ్రవణ మననా ద్యభ్యాసక్రమముచే దర్శించెను -అని యర్థము.

కాగా ఋగ్యజుః సామములు పవిత్రములు; తదాత్మకులగు నగ్ని వాయు సూర్యులు పవిత్రులు. ఆత్మ పరమపవిత్రము[1]. 'అత్యాశ్రమేభ్యః పరమం పవిత్రమ్

1. "యత్తే పవిత్ర, మర్చిష్యగ్నే వితత మంతరా బ్రహ్మతేన పునాతు మా" —వా.సం. 19-41; తై.బ్రా. 1-4-8-20.

ఆగ్నే తే తవ అర్చిషి జ్వాలయా మంతరా మధ్యే యత్ బ్రహ్మ త్రయీ రూపం, పరబ్రహ్మరూపం వా పవిత్రమ్, వితతం విస్తృతం ప్రసారితం, తేన పవిత్రేణ మా మాం భవాన్ పునాతు"-ఉవట. మహీధరౌ; చూ.సా.భా.

(శ్వే ఉ. 6-21.) — వేదాంతప్రతిపాద్య మగు బ్రహ్మ పరమపవిత్రము — అని యుపనిషత్తులను ముక్తకంఠముగ గీర్తించినవి. అట్టి బ్రహ్మప్రతిపాదక మగుచు ఆత్మచికిత్సకము, పరిశుద్ధహేతువునై వేదరూపిణి యగు సరస్వతి- 'పావకా, పావమాని, పవిత్ర' - శబ్దవాచ్య యగుచున్నది.

## చోదయిత్రీ సూనృతానాం; చేతన్తీ సుమతీనామ్ :-

అగ్నియందు శోధకత్వధర్మమే గాదు; తేజఃశాలి యగుటచే నంధకారమును దొలగించి పదార్థముల నభివ్యక్తము చేసి భాసింపజేయు ధర్మము గూడ గలదు. అట్లే సరస్వతియు శ్రవణము చేసి మననము చేయుకొలది అంతఃకరణమున నెలకొనిన యజ్ఞానాంధకారావరణముల గ్రమముగ దొలగించును. మొదట స్తుతిరూపములై వాక్యసామాన్యరూపమున మాత్రమే గోచరించు మంత్రరాశిని, సూనృత (సత్య ప్రియ) వాక్యములుగ దర్శింపజేయును; అనగా వాక్యములను ప్రియములుగ దర్శింపజేసి యవి సత్యార్థ బోధకములనెడి స్ఫూర్తిని గలిగించును. ధీమంతులను చైతన్యవంతులను నొనర్చి యుజ్జీవింపజేయును. కాగా ఇదవలె సరస్వతియు బ్రహ్మవిద్యారూపిణియే యయ్యును ఇదవలె శాసించునది గాక, కర్మాద్యనుష్ఠాన సమయమున యజమానుని బుద్ధి నావేశించి యుండి తల్లివోలె యుక్తాయుక్తముల నుపదేశించుచుండునది-యని తత్పార్యము. మహాభారతము గూడ సరస్వతి స్వరూపము నిట్లు వివరించు చున్నది.

అగ్నిహోత్రా దహ మభ్యాగతాస్మి
విప్రర్షభాణాం సంశయచ్ఛేదనాయ ।
త్వత్సంయోగా దహ మేత దబ్రువం
భావే స్థితా తథ్య మర్థం యథావత్ ॥' —భార. 3-186-22.

సరస్వతీదేవి స్వయముగ తార్క్ష్యు డను మునికి దన స్వరూపమును వివరించిన వాక్యమిది—'అగ్నిహోత్రాది సత్కర్మలవలన పరా-అపరా విద్యా రూపిణినై యారవి

వింతును; వేదవిదులను గల సంశయముల బోనాడు చుందును, నీ కిపుడు 'కర్మలు క్రమముగ ముక్తిహేతువు లగుట-యనెడి పరావిద్యయు, సగుణబ్రహ్మవిద్యయు నుపదేశించితిని. నే నెవరిభావమందు నిలిచి యుందునో యాతడు శ్రద్ధావంతుడై యగ్నిహోత్రాది కర్మలచే దేవతాప్రసాదమును, పిదప కర్మ-ఉపాసనా-జ్ఞానఫలములను బొందును-అని యర్థము (చూ. నీలకంఠవ్యాఖ్య).

ఇట కర్మానుష్ఠానముజేసి చిత్తపరిపాకము నొందిన వేదవిదులకు పరా-అపరా విద్యల విషయమై గలిగెడి సందియముల దీర్చు తల్లి సరస్వతి; ఆమె వేదవిదుల హృదయకాశవీథిని విహరించుచు జల్లని చూపులచే వేదనిహితగూఢార్థముల బ్రకాశింప జేయునది - యని చెప్పబడుటచే - చోదయిత్రీ సూనృతానామ్'-ఇత్యాది ఋగర్థమునే యీ మహాభారతశ్లోకము వివరించుట స్పష్టమగును. మహాభారతము మొదటి మంగళ శ్లోకమును బరిశీలించినను నీ విషయము స్పష్టముగా దెలియును.

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్॥"

ప్రాణిశరీరములకు పిండాండ మనియు, దృశ్యమగు చరాచరమునకు బ్రహ్మాండ మనియు పేరు. పిండాండమున కధినేత యగుటచే జీవునకు నరుడని పేరు. అట్లే బ్రహ్మాండమున కధినేత యగు పరమేశ్వరునకును నరు డని పేరు. నరుడగు పరమేశ్వరుని నుండి యావిర్భవించుటచే నీ చరాచరమునకు 'నారం' అనియు, వ్యాపకత్వధర్మముచే 'అపః' అనియుపేరు. ఆట్టి నారమునకు, అనగా చరాచరమునకు అయనము-అనగా అధిష్ఠానరూపుడై వసతిస్థానమగుటచే బరమేశ్వరునకు 'నారాయణః' అని పేరు ప్రసిద్ధము. నరనారాయణులగు జీవేశ్వరు లిరువురకును స్వరూపభూతుడై యధినేత యగు నిర్గుణ బ్రహ్మకును 'నరః' అని పేరు. ఇట్లు నర, నారాయణ, నిర్గుణబ్రహ్మలు మువ్వురును నరశబ్దవాచ్యులే. చేతను డగుటచే జడవర్గముకంటె జీవుడు ఉత్కృష్టుడు. జీవునికంటె కారణాత్మ యగు నారాయణు డుత్కృష్టతరుడు. వీరిరువురికంటెను "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

ఇత్యాది శ్రుతి ప్రతిపాద్య మగు నిర్గుణబ్రహ్మతత్త్వము ఉత్కృష్టతమము. కావున నట్టి నిర్గుణ తత్త్వము 'నరోత్తమం' అని యిట కీర్తింపబడుట యుక్తమే. ఇట్టి యీ నర-నారాయణ – నరోత్తమతత్త్వములను బ్రకాశింపజేయు తల్లి సరస్వతి. అట్టి తత్త్వముల నితిహాసాదివ్యాజమున బ్రకాశింపజేయుచు సంసార జయమునకు సాధనభూతమై ప్రవర్తిల్లిన దగుటచే నీ మహాభారతమునకు 'జయ' మని పేరు. మహాభారతమే కాదు; సర్వపురుషార్థప్రతిపాదకమై సంసారజయమునకు సాధ భూత ములైన పురాణాదులును, శారీరకసూత్ర భాష్యాదిగ్రంథములును 'జయ' శబ్దవాచ్య ములే యగును. అట్టి గ్రంథముల జదువుట కుపక్రమించు నపుడు నర–నారాయణ–నరోత్తములను, తత్తత్త్వ ప్రకాశిక యగు సరస్వతిని, అట్టి సరస్వతిదేవి యను గ్రహమునకు బాత్రుడగు వ్యాసుని స్మరించి నమస్కరింపవలెనని పై శ్లోకమునకు సంప్రదాయానుగతమైన యర్థము.[1]

ఈ భారతము మొదటి మంగళశ్లోకమున నర-నారాయణ-నరోత్తమ తత్త్వములను అనగా జీవేశ్వర బ్రహ్మ తత్త్వములను బ్రకాశింపజేయు తల్లి సరస్వతి యని కీర్తింపబడుట గమనార్హము.

'సరస్వతీ సాధయంతీ ధియం నః' – ఇత్యాది శ్రుతులు జిజ్ఞాసువుల బుద్ధిని సంస్కరించి తత్త్వము నుద్దీపింపజేయు తల్లి సరస్వతి యని చెప్పు చున్నవి. అట్టి శ్రుత్య

1. "పిండ బ్రహ్మాండ నేతృత్వా న్నరౌ జీవేశ్వరౌ వుభౌ।
తయో శ్చ నయనా చ్ఛుద్ధం బ్రహ్మాఽపి నర ఉచ్యతే॥
నరజానా మపాం కార్యం నారం బ్రహ్మాండ మిష్యతే।
త ద్యస్య వసతిస్థానం తేన నారాయణో విభు॥
స్వావిద్యాసృష్టపిండేన తాదాత్మ్యం యో గతో నరః।
స జీవః స పరం బ్రహ్మ నరోత్తమపదాభిధమ్॥
తద్ద్యోతికాం గిరం నత్వా తతో వ్యాస్త స్తయైవ సన్।
సంసారజయినం గ్రంథం జయనామాన మీరయేత్॥—ఇత్యాది
(చూ. – నీలకంఠవ్యాఖ్య).

ర్థమే యాదిమమంగళ శ్లోకరూపమున గ్రంథారంభ సమయమున మహర్షిచే తలపింప జేయబడుచున్నది. నీలకంఠపండితుడును శ్రుత్యర్థానుగుణముగనే పై శ్లోకవ్యాఖ్యానమున సరస్వతీస్వరూపము నిట్లు వివరించినాడు.

"దేవీం నరనారాయణ నరోత్తమ తత్త్వప్రద్యోతనీం
సరస్వతీం చ నమస్కృత్యైవ॥ —నీలకంఠః

## భిషక్ :-

వైద్యుడు చికిత్స జేసి శారీరిదోషముల మాత్రమే తొలగింప గలడు. సరస్వతి మనోదోషముల నిర్మూలించి ఆత్మచికిత్సక మగును. ఇట్లు చికిత్స చేయుటకు సాధనము వేదవాక్కు - అని శ్రుతి చెప్పుచున్నది.

'వాచా సరస్వతీ భిషక్' —వా సం. 19-12.

'సరస్వతీ చ, వాచా త్రయీలక్షణయా, భిష గాసీత్'
—ఉవటః, మహీధరః.

వేదవాక్కు ఆత్మచికిత్సక మని స్వాధ్యాయశబ్దమున వివరింపబడినది.

## రసాత్మికా :-

వాగ్దేవతయగు సరస్వతి అబ్దేవత గూడ నగుననీ పూర్వము (కవీ-కావ్య శబ్దమున) వివరింపబడినది. ఈమె మధ్యమస్థానదేవత; మాధ్యమిక వాక్కు-అనియు జెప్పబడును. ఈమే వాగ్దేవతయై హృదయాంబర వీథి నిలిచి బుద్ధిసమాయుక్తయై మాధ్యమికవాగ్రూపిణి యగుచు వాక్ప్రేరయిత్రి యగును. (అథ తదేవ శబ్దబ్రహ్మ తేనైవ వాయునా హృదయ పర్యంత మభివ్యజ్యమానం విశ్వమూర్తి

కయా బుద్ధ్యా యుక్తం విశేషస్పంద ప్రకాశరూప నాదమయం సత్ మధ్యమా వాగిత్యుచ్యతే।.... అథ హృదయగో బుద్ధియు జ్మధ్యమాఖ్యః - సౌభాగ్యభాస్కరరాయః - లలితాసహస్రనామవ్యాఖ్య). ఈ దేవియే యంతరిక్షమునం దంతట వ్యాపించి వాయు సమాయుక్తయై వృష్ట్యుదకముల గల్పించెడి మాధ్యమికవాక్కు. ఇట్లు అధిదైవికముగను, ఆధ్యాత్మికముగను, నీమె వాగ్దేవత యగుచున్నది. అంతరిక్షమున సలిలరూపరసమును (సరః), ఆధ్యాత్మికముగ విజ్ఞానరసమును (సరః) తల్లి వలె ప్రోదిసేయునది యగుటచే సరస్వతి యని యన్వర్థనామము. అందుచే సరస్వతీదేవతాకము లయిన మంత్రములు వాగ్దేవతా పరములుగను, అబ్దేవతా పరములుగను గూడ నర్థముల స్ఫురింప జేయుట శ్రుతిసంప్రదాయము. ఈ విషయము నీ క్రిందిఋక్కు స్పష్టము చేయుచున్నది.

"మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా।
ధియో విశ్వా విరాజతి ॥" —ఋ. 1-3-12; వా.సం. 20–86.

'సరస్వతి తన ప్రజ్ఞచే మహాజలరాశిని చైతన్యవంతమొనర్చి ప్రవర్తింప జేయుచున్నది.; అనుష్ఠాతల బుద్ధులను విజ్ఞానముతో నింపి వికసింప జేయుచున్నది' —అని యర్థము. ఇట నొకే సరస్వతికి 'మహాజలరాశిని ప్రవర్తింప జేయుట, అనుష్ఠాతల బుద్ధుల వికసింపజేయుట' — యని రెండు ధర్మములు చెప్పబడుటచే వాగ్దేవతయే అబ్దేవత యగుట శ్రుతితాత్పర్యము.

కాన సరస్వతి యనగా (1) వాగ్దేవి (2) వేదవాక్కు (3) వాక్కు. అట్లే 1) అబ్దేవత 2) జలప్రవాహరూపమగు నది 3) కొన్నియెడలనొక నదీనామము —అని తెలియును. దీనిచే 'సరస్వతీ' పదము మొదట నదీవాచకము; క్రమముగ వాగ్దేవతా వాచకముగ బరిణమించినది' — అనెడి చారిత్రికుల కల్పన శ్రుతిసంమతము కాదని స్పష్టమగుచున్నది. వాగ్దేవతా రూపములు గూడ నగుటచేతనే గంగా యమునాది నదు లన్నియు స్నాన, పూజాది సమయములందు స్మరింపబడు సంప్రదాయము నేటికిని గలదు. ఇవి ప్రత్యక్షముగ జలప్రవాహరూపములుగ గన్పట్టి

నను, బ్రహ్మామృతానంద సంపూర్ణములుగ దర్శింపవలె నను విషయము పూర్వము వివరింపబడినది. కాన శ్రవణ మననాదుల నొనర్చు వేదవిదునకు సఖి వోలె, లేక మాతవోలె రసస్వరూపమును దర్శింపజేయు రసాత్మిక యగు వేదవాక్కు సరస్వతి.

## భారతీ :—

వేదాంతవాక్యశ్రవణాదులు జేయుచు నిధిధ్యాసనపాటవమున జ్ఞాన యోగారూఢుడైన వేదవిదు డాదిత్యరూపు డన నొప్పును. ఒకే ప్రాణములు ప్రథమ వయస్సున వసువులు, మధ్యమ వయస్సున రుద్రులు, తృతీయ వయస్సున నాదిత్యులు నగునని పూర్వము వివరింపబడినది. మఱియు ఆదానక్రియ ఆదిత్యున కసాధారణధర్మము.

'ప్రాణా వా ఆదిత్యా ఏతే హీదగ్ం సర్వ మాదదతే'

—ఛాం. ఉ. 3-16-5.

'సవనాత్ పవితాఽఽదానా దాదిత్యః' మై. ఉ. 6.

'సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః' —రఘువంశ.

జ్ఞానయోగారూఢుడైన వేదవిదుడును వేదవాక్యముల నన్నిటి నాత్మ (బ్రహ్మ) పర్యవసానములుగ గ్రహింపజాలిన విద్వాంసుడు. సూర్యుడు రసాదానము జేయునట్లు వేదవాఙ్మయమునం దంతటను బ్రహ్మామృతానందరసము నాస్వాదింపజాలిన వాడగుటజేసి యాత డాదిత్యరూపమున నొప్పియుండు ననుట యుక్తమే యగును. అట్టిసమయమున నీ త్రయీవిద్య యా వేదవిదుని సమాహిత చిత్తమున వరసత నాపాదించి కాంతవలెను (ఉతో త్వస్మై తన్వం విసస్రే) తోడనుండి స్వసవలెను (స్వసాఽఽదిత్యానాం) ఆత్మ స్వరూపమును దర్శింపజేయును. అట్లు దర్శించిన వేదవిదున కీ వేదవాణి యాత్మ యొక్క అమృతకలాస్వరూపిణిగ

సాక్షాత్కరించును (వందేమహి చ తాం వాణీం అమృతా మాత్మనః కలామ్). ఆదిత్యరూపుడగు వేదవిదుడు భరతుడు; ఆతని యందు పలసిల్లెడి వేదవాణి భారతి' (బ్రహ్మవిద్యారూపిణి) యగును. ఈ విషయమును జూతము.

## ఆదిత్యుడు భరతుడు, తద్దీప్తి, లేక వాక్కు, లేక పత్ని భారతి :-

ఆదిత్యుడు భరతశబ్దవాచ్యు డగుట శ్రుతులయందు ప్రసిద్ధము. వైదిక నిఘంటువున ఆదిత్యనామములలో భరత శబ్దము పఠింపబడినది. భరత ఆదిత్యః, తస్య భాః భారతీ' అని యాస్కనిరుక్తము. 'భరతు డాదిత్యుడు; ఆయన పత్ని, దీప్తి లేక వాక్కు భారతి' యని భాష్యకర్తలందఱును వివరించిరి. ఆదిత్యుడు భరతుడు; త్రయీమయుడగు నా యదిత్యుని యందలి వాక్కు (త్రయీవిద్య) భారతీ యగుటచే నాదిత్యరూపుడగు వేదవిదుడును భరతుడు; ఆయన తోడనుండెడి వేదవాణియు భారతి యే యగును.

ఇట్లు పరిశీలించుచో నొకే వేదవాణి యొకే వేదవిదుని యందు సంస్కార క్రమము ననుసరించి వెలయు చిత్తపరిపాక వశమున మొదట ఇడయై శాసించి; తరువాత సరస్వతియై యుపదేశించి, తుదకు భారతియై యాత్మస్వరూప సాక్షాత్కారమునకు దోడ్పడి బ్రహ్మవిద్యాప్రదాత్రి యగునని తెలియనగును. ఇంతియే గాదు. ఆదిత్యుడే గాక అగ్నివాయువులును భరతులు; వారియందు విరాజిల్లు ఇడా, సరస్వతులును భారతీరూపు లగుదురు. కాన మొదట అగ్ని యొక్క భరతత్వమును జూతము.

## అగ్ని - భరతుడు :-

శ్రుతులయం దగ్ని 'భరత - భారత' నామములచే బలుచోట్ల[1] వ్యవహరింపబడినాడు. దేవతల కొఱకు హవిస్సుల భరించు వా డగుటజేసి యజ్ఞాది కర్మానుష్ఠానసమయమున నగ్నికి భరతు డని పేరు.

తస్మా అగ్ని ర్భారతః శర్మ యంసత్" —ఋ. 4-25-4.

"అగ్ని రగామి భారతో వృత్రహా పురుచేతనః" —ఋ. 6-16-9.

"ఉదగ్నే భారత" —ఋ. 6-16-45.

"భారతః హవిషో భర్తా అగ్నిః" —సా. భా.

"అగ్నే మహాగ్ం అసీత్యాహ మహాన్హ్యేష యదగ్ని
ర్బ్రాహ్మణే త్యాహ బ్రాహ్మణో హ్యేష భారతే
త్యాహైష హి దేవేభ్యో హవ్యం భరతి"
—తై. సం. 2-5-9; తై. బ్రా. 3-5-3.1; శ. బ్రా. 1-4-2-2;

బ్రాహ్మణములు గూడ నీ పదము యొక్క యర్థము నిట్లే వివరించినవి.

"అగ్ని ర్వై భరతః స వై దేవేభ్యో హవ్యం భరతి"—కౌ. బ్రా. 3-2.
"ఏష (అగ్నిః) హి దేవేభ్యః హవ్యం భరతి తస్మా
ద్భరతోఽగ్ని రిత్యాహుః" —శ. బ్రా. 1-4-2-2; 1-5-1-8.

కాన కర్మానుష్ఠానసమయమున నగ్ని హవ్యవాహనుడు, లేక హవిర్భర్తయగుచు, భరతు డగుచున్నాడు. ఆ యగ్ని యొక్క దీప్తి - తదనుగతమై ఇడా

1. ఋ. 1-96-3; 2-7-15; 4-25-4; 6-16-9; 6-16-45; 7-8-45
7-96-3 ఇత్యాది.

రూపమున నుండెడి వాక్కు - భారతి యగుచున్నది. అట్టియెడ భారతి (హవీంషి భరతీతి) యన హోమనిష్పాదిక (హో(త్రా) యని యర్థము. కర్మానుష్ఠానపరు డగు వేదవిదుడును అగ్ని (వసు) రూపుడై దేవతల కొఱకు హవ్యముల భరించును గాన నాతడును భరతుడే యగును. ఋత్విజులు భరతు లగుట బూర్వము వివరింప బడినది. అట్టి వేదవిదులయందుండెడి వేదవాణి హోమనిష్పాదిక (హో(త్ర)యై భారతియై యొప్పును. ఈ విషయ మీ మం(త్రమువలన స్పష్టమగును.

"శుచి ర్దేవే ష్వర్పితా హో(త్రా మరుత్సు భారతీ।
"ఇడా సరస్వతీ మహీ బర్హిః సీదంతు యజ్ఞియాః ॥"—ఋ. 1-142-9.

మరుతు లనగా అమరణధర్మము గల దేవత లనియు, ఋత్విజులనియు రెండర్థములు (ప్రసిద్ధములు (చూ. వైదికనిఘంటువు); భరతుడగు నాదిత్యుని యందుండెడి వాక్కు- భారతి (భరతస్య ఆదిత్యస్య సంబంధినీ ద్యుస్థానావాక్ – సా భా.) ఆ వాక్కు- అమరణధర్మము గల దేవతలయందనుగతమై పవి(త్రమై (శుచిః) నెలయును. ఆ భారతియే భరతులగు ఋత్విజులయందు (మరుత్సు) నిలిచి హోమ నిష్పాదికయై - దేవతలకు హవ్యము భరించుచు - భారతి యగును. ఈమె శాస కత్వధర్మము గల్గి ఇడయు నగును. వారి హృదయముల నిలిచి, దేవతాతత్త్వమును, తద్గత మహత్త్వమును దీపింపజేయుచు సరస్వతి యగును. ఇట్లు వేదవాక్స్వరూపమును యజ్ఞస్వరూపమును దర్శింపజేయు, నీ (త్రిస్థాన వాగభిమానదేవతలిట 'యజ్ఞియాః' అని కీర్తింపబడి యాహ్వానింపబడుచున్నారు.

## వాయువు(మధ్యమస్థానాగ్ని) – భరతుడు :–

అగ్ని వలెనే మధ్యమస్థానదేవత యగు వాయువు- అంతరిక్షాగ్నియు-భర తుడే. ఇట భరతు డన నర్థము వేఱు. హవ్యవహన మనెడి ధర్మము అగ్నికే గాని వాయువునకు (రు(ద్ర-ఇం(ద్రాది దేవతలకు) జెప్పబడుటలేదు. వాయురూపు డగు నీ భరతుని యందలి యసాధారణ ధర్మమును (శుతు లిట్లు చెప్పుచున్నవి.

"సరస్వతీవాన్ భారతీవాన్ ఇతి వాగేవ సరస్వతీ (ప్రాణో
భరతః" ....ఐ. (బా; 2-24.

"శరీరభరణహేతుత్వాత్ ప్రాణో భరతశబ్దవాచ్యః, తదీయ వృత్తి ర్భారతీ" -సా.భా.

"ఏష హి దేవేభ్యో హవ్యం భరతి తస్మా ద్భరతోఽగ్ని రిత్యాహుః। ఏవ ఉ వాఽఇమాః ప్రజాః ప్రాణో భూత్వా బిభర్తి తస్మాద్వేవాహ భరతవ ఇతి"

-శ.బ్రా. 1-5-1-8.

యజ్ఞములందు దేవతలకొఱకు హవ్యముల భరించెడి యే యగ్ని కలదో, యా యగ్నియే (మధ్యమస్థానదేవత యగుచు) ప్రాణరూపుడై నిఖిల ప్రాణులను భరించుచున్నాడు. 'నిఖిల ప్రాణిభరణము' - అను ధర్మముచే ప్రాణరూపుడైన యగ్ని భరతుడు- అని యర్థము.

ప్రాణరూపుడై యగ్ని దేహమును ధరించునట్లు. అధిదైవికముగ వాయురూపుడై జగత్ప్రాణశబ్దవాచ్యుడై భువనముల భరించుచున్నాడు, కాన రుద్ర-ఇంద్ర-వాయ్వాది శబ్దవాచ్య మగు మధ్యమస్థానదేవత (ప్రాణదేవత) భరతశబ్దవాచ్య మగును. అట్టి భరతుని వృత్తి, దీప్తి, వాక్కు లేక పత్ని భారతి యగును. 'ప్రాణదేవత వాచస్పతి; వాక్కు ప్రాణ పత్ని'-అని శ్రుతి సంప్రదాయము. అనగా మధ్యమస్థానవాగ్దేవత యగు సరస్వతియే యాధ్యాత్మికముగను ప్రాణరూపభరతుని పత్నియై, వృత్తియై, దీప్తియై, లేక వాగ్రూపిణియై, తదనన్యయై నిఖిలప్రాణుల భరించి[1]

1. 'వాగ్వాఽఇదం కర్మ ప్రాణో వాచస్పతిః' — (వా.సం. 30-1); శ.బ్రా. 6-3-1-19.

'నమో వాచే ప్రాణపత్న్యై స్వాహా' — ష. విం. బ్రా. 2-9.

'వాక్ చ వై ప్రాణశ్చ మిథునమ్' — శ. బ్రా. 1-1-1-2.

'వాక్ చ వై మనశ్చ దేవానాం మిథునమ్' — ఐ. బ్రా. 5-23.

'సాహ వా గువాచ- (హేప్రాణ) యద్వా అహం వసిష్ఠాస్మి త్వం తద్వసిష్ఠోఽసీతి' — శ. బ్రా. 14-9-2-14.

'వాగ్వా తస్య (ప్రాణస్య) పత్నీ' — గో. ఉ. 2-9. (చూ. పేజి 568)

జగద్యాత్రానిర్వహణము గావించుచు భారతి యను సార్థకనామమున గూడ బరగును.

శ్రవణమననాదుల నొనర్చుచు మంత్రవాక్యార్థ జిజ్ఞాసాపరుడగు వేదవిదుడును ప్రాణ (రుద్ర) రూపు డగునని పూర్వము చెప్పబడినది. ప్రాణాత్మనిష్ఠుడగు వేదవిదుడు భరతు డన జెల్లును. అట్టియెడ నాతనియందుండెడి సరస్వతియు భారతియై యొప్పును. మంత్రవాక్యార్థవిజ్ఞానమునకు బుద్ధివృత్తుల బ్రేరేపించుటచే (సరస్వతీ సాధయన్తీ ధియం నః) సరస్వతియు, భారముగు - వేదవిజ్ఞానసారము ను - విస్తరింపజేయునది (భారం వేదవిజ్ఞానసారం తనోతి ఇతి) యగుటచే భారతియు నగును. ఇట్టి ధర్మమును, లేక భారమును (వేదవిజ్ఞానసారమును). విస్తరింపజేయుట చేత నే పంచమవేద మనబడు మహాభారతమునకును 'భారత' మనెడి యన్వర్థసంజ్ఞ యని చెప్పుదురు. (చూ. నీలకంఠవ్యాఖ్య ; వాచస్పత్యమ్ : శబ్దకల్పద్రుమః).

## భారతీ-బ్రహ్మవాదినీ-బ్రాహ్మీ :

ద్యుస్థానదేవత యగు నగ్ని లేక యాదిత్యుడు — భరతు డనియు, తద్దీప్తి లేక పత్ని, లేక వాక్కు, భారతి యనియు బైన దెల్పబడినది. తన దివ్యతేజముచే జగముల నెల్ల భరించుటజేసి యాదిత్యుడు భరతుడు; తద్దీప్తియు జగద్భరణక్షమయై భారతి; అట్లే యోగారూఢుడై వేదవాక్యముల నెల్ల నాత్మపర్యవసానములుగ గ్రహించెడి వేదవిదుడును ఆదిత్య రూపు డగుచు భరతుడు; అతనియందుండు వేదవాణి భారతి'_యగు ననియు పైన జెప్పబడినది. అట్టి భారతీస్వరూపమును మహాభారత మిట్లు చెప్పుచున్నది.

---

'వాగ్వై వాయుః — తై. బ్రా. 1-8-8-1 : తాం. బ్రా. 18-8-7.

'తస్మాత్ సర్వేప్రాణాః వాచి ప్రతిష్ఠితాః' — శ. బ్రా. 12-8-2-25.

'తస్యా (వాచః) ఉ ప్రాణ ఏవ రసః' — జై. ఉ 1-1-7.

'తస్య (మనసః) ఏషా కుల్యా యద్వాక్' — జై. ఉ. 1-38-3.

"గౌరివ ప్రసవ త్యర్థాన్ రస ముత్తమశాలినీ ।
సతతం స్యందతే హ్యేషా శాశ్వతం బ్రహ్మవాదినీ ॥
దివ్యా దివ్యప్రభావేన భారతీ గౌః శుచిస్మితే।"

—భారత. 14-22-22-2 .

'వాచం ధేను ముపాసీత తస్యా శ్చత్వారః స్తనాః.... ఇతి
శ్రుతేః। స్తనై స్తత్కర్మఫలరూపం రసం అర్థాన్ ప్రసవతి,
బ్రహ్మవాదినీ ఉపనిషద్వాక్తు శాశ్వతం మోక్షం స్యందతే
ప్రసవతి సతతం నిత్యసిద్ధమ్" నీలకంఠవ్యాఖ్య.

వేదవాక్కు- ధేనువు. ఆ ధేనువు నుపాసించుచో స్వాహాకార, స్వధాకార హంత కార వషట్కారము లనెడి స్తనములతో గర్మఫలరూపమగు క్షీరము (రసము) నొస గును (చూ. స్వధాశబ్దము). కర్మఫలముల గోరక సేవించు వేదవిదునకు నీ భారతి బ్రహ్మవాదినియై శాశ్వతము నిత్యసిద్ధమునగు మోక్షము (బ్రహ్మామృతానందరసము) నొసగును-అని యర్థము.

కర్మపరులకు నాత్మచికిత్సక మగుచు గ్రమముగను, కర్మఫలము గోరని వారికి సాక్షాత్తుగను, బ్రహ్మతత్త్వావబోధకమై శ్రుతి బ్రహ్మవాదిని యగు కామ ధేనువు; ఈ ధేనువువే భారతి - యని భావము. 'బ్రహ్మవాదిని యనుటచే శ్రుతికి గల బ్రాహ్మత్వము - బ్రహ్మపరత్వము చెప్పినట్లగును. అందుచేతనే-రహస్యతత్త్వ ప్రతిపాదిక యగుటచేతనే-శ్రుతిని 'బ్రహ్మ ఉపనిషత్' అని వ్యవహరించెడి సంప్ర దాయమును గలదు. ఈ విషయ మీ భాగవత వచనములవలన స్పష్టము కాగలదు.

రాజా -

'బ్రహ్మన్ బ్రహ్మణ్యనిర్దేశ్యే నిర్గుణే గుణవృత్తయః ।
కథం చరన్తి శ్రుతయః సాక్షా త్సదసతః పరే॥'

శ్రీశుకః :—

"బుద్ధీన్ద్రియ మనః ప్రాణాన్ జనానా మసృజ త్ప్రభుః।
మాత్రార్థం చ భవార్థం చ ఆత్మనే కల్పనాయ చ॥
సైషా హ్యుపనిష ద్బ్రాహ్మీ పూర్వేషాం పూర్వజైర్ధృతా,
శ్రద్ధయా ధారయే ద్య స్తాం క్షేమం గచ్ఛే దకించనః॥"

—భాగ. 10-37-1,2,3.

'పరంపరయా సాక్షా ద్వా సర్వాసాం శ్రుతీనాం బ్రహ్మణి పర్యవసానమ్....సైషా యథో క్తలక్షణా యథోక్తాలంబనా వా, బ్రాహ్మీ బ్రహ్మపరా, శ్రద్ధయా ఆదరేణ వైతండిక తర్కా- నభినివేశేన యః శ్రవణాదినా ధారయేత్, సః అకించనః నిర స్తదేహాద్యుపాధిః సన్, తతః పరం పదం ప్రాప్నుయా దితి' —శ్రీధరః.

"సైషా ఉపపాదితా, బ్రాహ్మీ బ్రహ్మసంబంధినీ సర్వశబ్దానాం బ్రహ్మ ణ్యభిధానవృత్తి రిత్యర్థః, ఉపనిషత్ రహస్యతమా, ఉపనిషదర్థవిచారే ణావగంత వ్యేతి వాఽర్థః'—వీరరాఘవాచార్య.

ఇవి శ్రుతిగీతోపాఖ్యానారంభ శ్లోకములు. ప్రశ్నోత్తరవ్యాజమున శ్రుతి స్వరూప మిట చెప్పబడినది. ధర్మార్థకామమోక్షఫలములు సిద్ధింపజేసి కొనుటకే జనులకు బుద్ధి-ఇంద్రియ-మనః-ప్రాణముల నీశ్వరుడు ప్రసాదించును; ఇందు ప్రధానము తురీయపురుషార్థము; అధికారి తారతమ్యమును బట్టి క్రమముగనో లేక సాక్షాత్తుగనో బ్రహ్మ (ఆత్మ) స్వరూపమును దర్శింపజేయుటయే శ్రుతుల తాత్పర్యము; కావుననే ఇట్లు బ్రహ్మపరమై రహస్య తత్త్వ ప్రతిపాదిక యగుటచేతనే-శ్రుతి 'బ్రాహ్మీ ఉప నిషత్' అని చెప్పబడును; దీనియం దాదరము గల్గి వితండవాదములు చేయక

యెవడు దీనిని ధరించునో యతడు చిత్త - సంస్కారక్రమమున బరిపక్వనతిష్ఠై యకించను డగును; అకించను దనగా నేమియు లేనివాడు. అనగా దేహాద్యభిమాన వర్జితుడై బ్రహ్మభావము నొందును - అని యర్థము.

ఈ భారత, భాగవత వచనముల వలన 'శ్రుతు లన్నియు సాక్షాత్తుగ గాని, పరంపరగ గాని బ్రహ్మయందు పర్యవసన్నములు - శ్రుతిగత శబ్దము లన్నియు బ్రహ్మపరములు'-అని తెలిసినది. అట్లు దర్శించు వేదవిదునకు శ్రుతి యంతయు నుపనిషద్రూపమున సాక్షాత్కరించును, (సైషా హ్యుపనిష ద్బ్రాహ్మీ), ఇట్టి యీ శ్రుతియే బ్రహ్మవాదినీ, బ్రాహ్మీ. భారతీ యని తెలియును.

## యోగము - యోగశక్తి :

ఇట నొక విషయము పరిశీలింప నగును. వైదికశబ్దము యోగ రూఢిచే తత్త్వ ద్విశేషపదార్థవాచకము, యోగశక్తిచే పరమాత్మవాచకము నగు నని కవి - కావ్య శబ్దమున వివరించబడినది. (ఏవమేవ సర్వేఽపి శబ్దా యోగరూఢ్యా తత్తద్విశేష పదార్థ వాచకా అపి యోగార్థ మాదాయ సర్వే బ్రహ్మవాచకా అపి భవన్తి - నీల కంఠః). దీనిచే వేదవాక్కులకు గల శాశ్వత బ్రహ్మసంబంధిత్వము (కవేః పర మాత్మన ఇదం కావ్యం) సిద్ధమై పై భారత భాగవత వచన తాత్పర్యమును స్పష్టము చేయుచున్నది. వేదవాక్కుతో బరమార్థమును నంయోజనము చేయుటయే యోగము. ఆ యోగశక్తిచే సిద్ధన యర్థమే యోగార్థము. ఇదియే సర్వపదార్థాధిష్ఠానమగు పర మార్థము. సర్వపదార్థాధిష్ఠానభూతమగు నీ యోగార్థమునందు (రూఢములై) భాసిం చెడి తత్తద్విశేషరూపార్థములను గూడ బోధించెడి వగుటజేసి వేద శబ్దములు యోగ రూఢములగును వేదవిదుడు వేదవాక్కులయందు తుదకు దర్శింపవలసిన యోగ శక్తి యిట్టిది ఈ యోగశక్తిచే జ్ఞాపకము చేయబడెడి పరమార్థమును దర్శింపజేయుట కయియే వేదవాణి కర్మ-భక్తి - జ్ఞాన యోగముల నుపదేశించినది. ఇవియు యోగ

ములే. అనగా బుద్ధీంద్రియ మనఃప్రాణములను వేదవాక్సాహాయ్యమున బరమార్థ ముతో సంయోజనము చేయునవిగాన యోగములు. కాన (1) వేదవాక్కుతో బరమార్థమును సంయోజనము చేయుట, (2) తత్సాహాయ్యమున బుద్ధీంద్రియ మనః ప్రాణములను పరమార్థముతో సంయోజనము చేయుటయు యోగము.

ఈ విషయమును కాళిదాసమహాకవి యిట్లు చమత్కరించినాడు.

"త మర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి ।
అశోచ్యా హి పితుః కన్యా సద్భర్తృప్రతిపాదితా" ....కు.సం. 6-79.

ఓ గిరిరాజా! యోగ్యుడగు వరున కిచ్చిన కన్యకై తరువాత వగవవలసి యుండదు. కాన, భారతితో (వాక్కుతో) నర్థమును వలె, నిత్యసంబంధముకై నీ పుత్రిక యగు పార్వతితో నా దేవుని గూర్చుట మంచి పని - అని యర్థము.

ఇట కన్యను వరునితో గూర్చు మనిగాక, కన్యతో వరుని గూర్చుమని చెప్పబడినది. భారతితో (వాక్కుతో) నిత్యసంబద్ధమై యుండెడి యర్థమును యోజనయు చేయునట్లు, పార్వతితో బరమార్థరూపుడైన యా దేవుని గూర్చుము (యోజనము చేయుము)- అని చెప్పబడినది. పరాదేవితో నిట పోల్చబడిన భారతి లౌకిక భారతి (వాక్కు) గాదు. బ్రహ్మవాదిని (బ్రాహ్మి) యగు వేదభారతి. వేద వాక్యము లన్నియు నాత్మపర్యవసానములు, ఆత్మయే పరమార్థము. వేదభారతితో నా పరమార్థము నిత్య సంబద్ధము. అయ్యాను నంత తెలుగరు. (చూ. విశ్వవిత్, అవిశ్వమిన్వా శబ్దములు). యోగారూఢుడైన వేదవిదుడు ఆ వాగర్థసంబంధము నెఱిగి వేదభారతితో నా పరమార్థమును యోజనము సేయును. ఓ రాజా! నీవు నట్టి మహాత్ముడవు; నీ పుత్రిక పరాదేవత. పార్వతీ - పరమేశ్వరుల సంబంధము నిత్యము; అది గుర్తించి యామెతో బరమార్థ సత్యరూపు డగు నా దేవుని గూర్చుము' - అని భావము, 'యోక్తు మర్హసి' - యనుచు యోగస్వరూప మిట

కవిచే వివరింపబడుట స్పష్టము. నేటికిని కన్యాదాన సమయమున 'నారాయణ స్వరూపాయ వరాయ - - లక్ష్మీ నామ్నీం కన్యామ్' - అనుచు వధూవరులను ఆది దంపతులనుగా భావించెడి లేక దర్శించెడి సంప్రదాయము గలదు. లక్ష్మీరూపిణి యగు కన్యతో నారాయణస్వరూపు డగు వరుని యోజనము చేయుట యనెడి సంప్రదాయమే యిట నీ శ్లోకమున వివరింపబడినది. కాన వివాహసంస్కార మిట్టి యోగము నుపలక్షింపజేయునది.

కాగా బ్రహ్మవాదిని (బ్రాహ్మీ) యగు వేదవాణి భారతి; (భరతస్య కవేః పరమాత్మన ఇయమ్) - అగుట కాంతాసంమితముగ నిట మహాకవిచే జెప్ప బడినది. కాన యోగారూఢుడగు వేదవిదుని కీ వేదవాణి సహచారిణియై, తోడనుండి, క్రాంతదర్శియగు నా కవి (పరమాత్మ) యొక్క భారతియై విరాజిల్లు ననుట యుక్తమే.

'భారతీ కవే ర్జయతి - భరతస్య కవేః పరమాత్మన ఇయం భారతీ'

భరతుడును, కవియు నగు నా పరమాత్మ యొక్క వాక్కుగా వేదవిదునకు సాక్షాత్కరించుచు భారతియై యాత్మస్వరూపమును దర్శింపజేయును. అందుచే 'భరత స్యేయం భారతీ' - యను నీ నిర్వచనము 'కవేః పరమాత్మన ఇదం కావ్యమ్' - అను పూర్వోక్తమగు త్రయీవిద్యారూప ఛందః కావ్య లక్షణమును స్పష్టము చేయుచున్నది.

## ప్రజాపతి - భరతుడు; వసురుద్రాదిత్యులు ప్రజ :-

అగ్ని - వాయు- ఆదిత్యు లనెడి త్రేతాగ్నులు భరతు లని దర్శించితిమి. అంతియే కాదు. దేవతాత్రయాత్మకుడు, అఖండాగ్నియు నగు ప్రజాపతియు భరతశబ్ద వాచ్యుడే. ప్రజాపతి శబ్దముచే శ్రుతులయందు గొన్నియెడల దేవతా

త్రయాత్మకుడగు విరాట్పురుషుడును[1] గొన్నియెడల హిరణ్యగర్భుడును,[2] మఱికొన్ని యెడల పరమేశ్వరుడును[3] జెప్పబడుచుందురు. కాని ప్రజాపతి శబ్దముచే ప్రకరణము ననుసరించిముర్వురిని గ్రహింపనగును.

అగ్ని - వాయు - సూర్యులు ప్రజలు - ప్రకృష్టజన్మ గలవారు - అని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"త్రయః కృణ్వన్తి భువనేషు రేతః తిస్రః ప్రజా ఆర్యా
జ్యోతి రగ్రాః" —ఋ 7-33-7.

ఈ మంత్రమును శాట్యాయనబ్రాహ్మణ మిట్లు వివరించినది.

"త్రయః కృణ్వన్తి భువనేషు రేత ఇత్యగ్నిః పృథివ్యాం
రేతః కృణోతి వాయు రంతరిక్ష ఆదిత్యోదివి, తిస్రః ప్రజాః
ఆర్యా జ్యోతిరగ్రా ఇతి వసవో రుద్రా ఆదిత్యా స్తాసాం జ్యోతి
ర్య దసా వాదిత్యః" – (చూ. సా. భా.)

అగ్ని -వాయు-సూర్యు లనెడి ముగ్వురు దేవతలు క్రమముగ పృథివ్యంత రిక్షద్యులోకము లందు తమ రేతస్సును (తేజస్సును) నింపుచున్నారు. ఈ వసు రుద్రాదిత్యులే ప్రకృష్టజన్మ గల ప్రజలు. (తిస్రః ప్రజాః). వీరికి గారణభూత

1. "ప్రజాపతిః పరమేష్ఠి విరాట్"
....తై. సం. 57-4-4; అ.సం. 4-1-7; 18-5-10.

2. "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్"
....ఋ. 10-121 సూ; తై. సం. 4-1-8-3; వా. సం. 13-4; అ.సం. 4-2 ఇత్యాది

3. "ప్రజాపతి శ్చరతి గర్భే అంతః అజాయమానో బహుధా విజాయతే"
....తై.ఆ. 3-13-1; వా.సం. 31-19, అ.సం. 10-8-13.

షగు జ్యోతిస్సు ఆదిత్యుడు (పరమేశ్వరుడు). ఆ మహా జ్యోతిస్సు నుండి యభి వ్యక్తమగుటచే నీ ముప్వురు 'జ్యోతిరగ్రాః (తాసాం జ్యోతిః యదసా వాదిత్యః) —అని చెప్పబడిరి. ఇంతే కాదు.

ప్రణవ మనెడి యా మహాజ్యోతిస్సునుండి యభివ్యక్తములగుఋగ్యజుః సామ లనెడి త్రివిధ వాక్కులును 'జ్యోతిరగ్రాః' అని చెప్పబడినవి (తిస్రః త్రివిధా ఋగ్యజుఃసామాత్మికాః స్తుతిరూపాః వాచః....జ్యోతిరగ్రాః జ్యోతి ర్ద్యోత మానః ప్రణవోఽగ్రే ప్రముఖో యాసాం తాదృశీః - సా. భా. ఋ. 7-101-1). కనుక వసురుద్రాదిత్యుల వలెనే వారియందనుగతములై యుండెడి వాక్కులు గూడ జ్యోతిరగ్రములే.

వసురుద్రాదిత్యు లట్టి ప్రకృష్టజన్మ గలవారగుటచేతనే 'ఆర్యాః' అని చెప్పబడిరి. ఆర్యు లనగా శ్రేష్ఠులు, ప్రాప్యులు నని యర్థము. వీరికి గారణ భూతమగు జ్యోతిస్సు ఈశ్వరుడు. సర్వప్రాప్యమగు నా పరంజ్యోతిని దర్శించు టకు నీ ప్రజలు ముప్వురు ద్వారభూతులు. అనగా అగ్ని- వాయు- సూర్యదేవతాను గ్రహము వలన గ్రమముగ విరాట్ - హిరణ్యగర్భుల యొక్కయు, ఈశ్వరుని యొక్కయు ననుగ్రహము సిద్ధించును. కనుకనే అగ్ని వాయు సూర్యులు ముప్వు రిని ఆర్యు లని శ్రుతి నిర్దేశించినది. ప్రకృష్టదేవతాజన్ము లయిన యీ ప్రజలకు (తిస్రః ప్రజాః) పాలకు డగుటచే విరాట్టు, లేక హిరణ్యగర్భుడు, లేక పరమేశ్వ రుడు' ప్రజాపతి యగుట పై మంత్రమున సూచిత మగుచున్నది. ఇట్టి ప్రజాపతి భరతుడని శ్రుతి చెప్పుచున్నది.

"ప్రజాపతి ర్వై భరతః స హీదం సర్వ బిభర్తి"

—శ. బ్రా. 6-8-1-14.

దృశ్యమగు నీ ప్రపంచమంతయు భరించుటచే ప్రజాపతి భరతుడు — అని యర్థము. ఈ లక్షణము ప్రధానముగ బరమేశ్వరునందును, తర్వాత విరాట్

హిరణ్యగర్భుల యందును నొప్పును. మరుత్తులు (ప్రాణములు) జగద్భర్త యగు భరతుని పుత్రులని శ్రుతి (ఋ. 2-36-2) చెప్పుచున్నది. పరమేశ్వరునినుండి నిఃశ్వాసముల వలె నప్రయత్నముగ నభివ్యక్తములైన జ్యోతిరగ్రములు వేదవాక్కులని పైన జెప్పబడినది. అట్లు భరతుని నుండి నిఃసృత యగుటజేసియు, భరత స్వరూప ప్రతిపాదిక యగుటజేసియు - ఇట్లు నిరంతర భరత సంబద్ధ యగుట జేసియు వేదవాణికి 'భారతీ' యని యన్వర్థనామము.

"వ్యవహృతయే వికల్ప ఇషితో౽న్ధపరంపరయా
భ్రమయతి భారతీ త ఉరువృత్తిభి రుక్థజడాన్ ।"

—భాగ. 10-87-37.

"తే తవ భారతీ వేదవాక్" —శ్రీధరః

"పురాణస్య కవే స్తస్య వర్ణ స్థాన సమీరితా ।
బభూవ కృతసంస్కారా చరితార్థేవ భారతీ ॥" —రఘు,

హంసవ ద్విదుషాం రాజా ద్విజానాం తత్ర భారతీమ్॥
శుశ్రువే వేదవిదుషాం పుష్కలార్థపదాక్షరామ్॥

—భార. 12-39-20.

కాన భరత (పరమేశ్వర) సంబద్ధ యగుటజేసి వేదవాణి భారతియై ప్రసిద్ధయగుట పై శ్లోకముల వలన దెలియును.

ప్రజాపతి భరతుడని శ్రుతి చెప్పుచున్నది. వేదవాణి ప్రజాపతికి స్వభూత యగుట (సైవ తే వాగాహ-స్వాహా) స్వాహా శబ్దమున వివరింపబడినది. నిఖిలవేద పరమేశ్వర నిఃసృత మనియు దెల్పబడినది. అందుచే బరమేశ్వరునకు స్వభూత యగుచు, అనూచాన సృష్టి రచనా రహస్యముల నుద్బోధించుచు జగద్యాత్రా నిర్వహణమున సహచారిణియై యుండి తోడ్పడునదగుటచే అనగా భరతునకు సహచారిణి యగుచు వేదవాక్కు భారతి యన నొప్పును.

బ్రహ్మజ్ఞా న్బ్రహ్మయే యగు (బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి) నని సంప్రదాయము. అనగా భారతీస్వరూపము నెఱిగిన వేదవిదుడు భరత స్వరూపుడే యగును. అట్టి బ్రహ్మవేత్తకు వేదవాణి 'స్వభూత-(స్వస)-యగును. అందుచే నాతడు భరతుడు, భారతియు కూడ నగును. బ్రహ్మవేత్త కుదయించెడి యఖండబ్రహ్మాకారవృత్తికి 'భా' యనిపేరు. నిరంతరమద్దానియందు 'రతుడు' (తన్నిష్ఠుడు) అగుటచే బ్రహ్మవేత్త భారతుడు(భాయాం రతః భారతః) అగు ననియు సంప్రదాయవిదులు చెప్పుదురు.

బ్రహ్మవిద్యయే మంత్రశాస్త్రమున శ్రీవిద్యగా ప్రసిద్ధము. శ్రుతియు 'ఋచో యజూంషి సామాని సా హి శ్రీ రమృతా సతామ్' - అనుచు త్రయీ విద్యయే శ్రీవిద్య యని పేర్కొనినది. అట్టి శ్రీవిద్య, లేక పరాదేవత భారతి యనియు, భారతి నుపాసించువారు భారతు లనియు మంత్రశాస్త్రప్రసిద్ధి.

'భాయాం శ్రీవిద్యాయాం రతాః భారతాః'
'భారత్యా ఉపాసకాః భారతాః' —సౌందర్యలహరి; లక్ష్మీధరవ్యాఖ్య.

కాగా, భరతుడన నాత్మస్వరూపవిషదనియు నర్థము. అట్టి మహనీయు డగుటచే వేదవ్యాసుని ధృతరాష్ట్రుడు 'త్వం హి భారత' భార. 6-3-42)- నీవు భారతివి - నీవు భారతివి - అని కీర్తించెను.

"విద్యాభారేణ సంపూర్ణః సర్వభారం పరిత్యజేత్'
దుఃఖభారం న జానాతి భారతీ పరికీర్తితా" —(శబ్దకల్పద్రుమః).

విద్యాభారపరిపూర్ణుడై, భారముల నన్నిటిని విడిచి, దుఃఖభారము నెఱుగనివాడు భారతీ - అని యర్థము. అట్టి మహాత్ములను భారతీ, సరస్వతీ, ఇంద్రసరస్వతీ - ఇత్యాది నామములతో బిలిచెడి సంప్రదాయము నేటికిని గలదు. కాగా-

"(కవేః) భరతాత్ ఆగతా భారతీ, (కవేః) భరతస్య
ఇయం భారతీ భారం వేదవిజ్ఞానసారం తనోతీతి భారతీ"

అను నిర్వచనముల ద్వారా భారతీస్వరూపమును దర్శింపనగును. పై గ్రంథసందర్భము ననుసరించి 'అగ్నివాయ్వాదిత్యులు ముప్పురును, తదాత్మకుడగు ప్రజాపతియు, పరంజ్యోతీరూపు డగు పరమేశ్వరుడును అందఱును భరతులు లేక భారతులు; అట్టి భరతుల యొక్క వృత్తి, దీప్తి, పత్ని లేక వాక్కు వ్యష్టిగను, సమష్టిగను ఇడా - సరస్వతీ - భారతీరూపిణి: అట్లే వేదవిదులును భరతులు. వారియందలి వేదవాణియు ఇడా - సరస్వతీ - భారతీరూపిణి, లేక సమష్టిగ నఖండభారతీరూపిణి' - అని తెలియగలము.

## విశ్వవిత్ - అవిశ్వమిన్వా :-

అట్టి యా దేవతాతత్త్వము గాని, వాగ్దేవతాతత్త్వము గాని యత్యంత నిగూఢము, దానిని దర్శించుట దేవతలకు గూడ దుష్కర మని ఋగ్వేద మిట్లు చెప్పుచున్నది.

"తిస్రో మాతౄ స్త్రీన్ పితౄన్ బిభ్ర దేక ఊర్ధ్వ స్తస్థౌ
నే మవగ్లాపయన్తి। మంత్రయన్తే దివో అముష్య పృష్ఠే
విశ్వవిదం వాచ మవిశ్వమిన్వామ్॥"

—ఋ. 1. 164-10; అ సం. 9-9-10.

పృథివ్యన్తరిక్షద్యులోకము లనెడి ముప్వురు తల్లులను (తిస్రో మాతౄః). లోకత్రయ పాలకులయిన ముప్వురు పితరులను (త్రీన్ పితౄన్) పుత్ర స్థానీయుడగు నాదిత్యు

డొక్కఁడే యసహాయుడై భరించుచు (బిభ్రత్), తదతీతుడై సర్వోన్నతుడై విల సిల్లుచున్నాడు. (ఏక ఊర్ధ్వ స్తస్థౌ). అట్టి యాదిత్యున కెవరు నెట్టి గ్లానిని గల్పింప లేరు. (ఈం న అవగ్లాపయన్తి). ఈ వాక్కు అట్టి యాదిత్యునకు సంబంధించినది. (అముష్య). ఇది సర్వమును దెలియజేయజాలినది (విశ్వవిదం); కాని యీ వాక్కు అందఱి యందు నభివ్యక్తము కాదు (అవిశ్వమిన్వాం)- అని బ్రహ్మలోకవాసులగు (దివఃపృష్ఠే) దేవతలు ఆదిత్యుని గూర్చి రహస్యముగ బరస్పరము జెప్పికొను చున్నారు (మంత్రయన్తే)- అని యర్థము

ఇట లోకత్రయమును, తత్పాలకులను ముప్పురిని భరించుచు తదతీతుడై సర్వోన్నతుడై, అద్వితీయుడై (ఊర్ధ్వః ఏకః), అవికార్యుడై యొప్పుచున్నట్లు ఆది త్యుడు కీర్తింపబడినాడు. కాన నిట నాదిత్యు డనఁగా పరమేశ్వరుడనియే గ్రహింప వలెను. అతడు లోకత్రయమును, తత్పాలకులను, వాక్కును- సర్వమును భరించు వాడని చెప్పుటచే నీ యాదిత్యుడు భరతుడను విషయమిట సూచిత మగుచున్నది. (బిభర్తి సర్వ మితి భరతః)[1]

1. ఈశ్వర తత్త్వము క్షర-అక్షరాత్మక (కార్యకారణరూప) ఉపాధులకంటె విలక్షణమై లోకత్రయమును భరించు చున్నది- అని యీ విధముగ ఉపనిషత్తులు, స్మృతులు వర్ణించుచూ యుత్ప్రతిపాదితమైన పరమేశ్వరుని యందుగల భరతతత్త్వమును అడుగడుగున నభివ్యక్తము చేయుచున్నట్లు గన్పట్టును.

"వ్యక్తావ్యక్తం భరతే విశ్వమీశః" —శ్వేత. ఉప. 1-8.

"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యు దాహృతః ।
యో లోక త్రయ మావిశ్య బిభర్త్య వ్యయ ఈశ్వరః॥ -భ,గీ. 1-5-27.

ఈ వాక్కు ఆ దేవునకు సంబంధించినది (అముష్య) కాన తన్నిః
సృతమై తత్ప్రతిపాదక మగుచు నీవాక్కు భారతి (భరతస్య ఇయం: భరతా దాగతా)
యగుటయు సూచిత మగుచున్నది. 'ఇట్టి యీ భారతి సర్వమును దెలియ జేయునది
(విశ్వవిత్); అయ్యును నందఱియం దభివ్యక్తము గాదు (అవిశ్వమిన్వా), కాన
సర్వజ్ఞకల్పమగు నీ వేదవాణి క్రాంత దర్శనము గల ద్రష్టలగు మహర్షులయందు
మాత్రమే యభివ్యక్త మగును; అన్యులయందు కాదు; మఱియు నా దైవీవాక్కు
నుపాసించువారికే (నఖ్యము చేయువారికే) తత్ప్రతిపాదితార్థములు, సంప్రదాయ
ములు, రహస్యములు మున్నగునవి యభివ్యక్తములగును గాని, యన్యులకు గాదు'-
అనియు దెలియును.

ఇది యత్యన్తనిగూఢ మగు పరతత్త్వరహస్య మగుటచే నధికారులగు
వారి యొద్దనే యీ విషయము ప్రస్తావింపనగునుగాని యందఱి కడకాదు. కావుననే
దేవతలు కూడ నీ విషయమును గూర్చి పరస్పరము రహస్యముగ జెప్పికొను
చున్నట్లు శ్రుతి తెల్పుచున్నది. తానే కవియు కావ్యము నగుటచే వేదము తన స్వరూ
పమును దేవతా రహస్య సంవాద రూపమున జమత్కారముగ వివరించినదని
గ్రహింపనగును.

## క్రాంతదర్శనము-కవి-స్మృతులు :-

ఈ విభిన్న దేవతాతత్త్వమును, దేవతైక్యమును దర్శించుటయే క్రాంత
దర్శనము. ఆ దర్శనము గలవారు కవులు. అట్టి కవులు విరళముగ నుందురు- అను
విషయమును ఋగ్వేద మిట్లుచెప్పుచున్నది.

"అవః పరేణ పితరం యో అస్యాను వేద పర ఏనావరేణ।
కవీయమానః క ఇహ ప్రవోచ ద్దేవం మనః కుతో అధిప్రజాతమ్॥"

ఋ. 1-164-18; అ.సం. 9-9-18.

పృథివీలోకపాలకు డగ్ని, ద్యులోకపాలకు డాదిత్యుడు. వీరిరువురును పితరులు. (పాలకులు), వీరిరువురు భిన్నులుగ గన్పట్టినను వాస్తవముగ భిన్నులు గారు· అగ్నియే ఆదిత్యుడు; ఆదిత్యుడే అగ్ని-అని యెవడుపాసించునో (యః అనువేద) యతడే క్రాంతదర్శనముగల కవి. లేక వీరిరువురు వాస్తవమున నద్వితీయము, శుద్ధ సత్త్వమాయోపాధికము నగు నీశ్వరతత్త్వమే యని యెవడు దర్శించునో యతడే కవి (అభిభూత రజస్తమస్కా- ఉద్బుద్ధసత్త్వా అత ఏవ స్వాధీన మాయౌ ఏతౌ ఏకత్వేన వా అధిగచ్ఛతి- సా.భా.) అగుచో కవిననుచు తన క్రాంత దర్శనమును లోకమున నెవడు చాటుకొనగలడు? (కవీయ మానః కవివ దాచరన్, క్రాంతి దర్శిత్వ మాత్మనః ఖ్యాపయన్. క ఇహ అస్మిన్ లోకే, ప్రవోచత్ (ప్రబ్రవీతి?) కవితాప్రయోజకమగు దైవీశక్తి సంపన్నమగు మనస్సు ఏ యదృష్టవిశేషమువలన ప్రకర్షాధిక్యము గలిగి సిద్ధింపగలదు? (ద్దేవం మనః కుతో అధిప్రజాతమ్?)- అని యర్థము. శ్రుతి యందలి యీ రెండు ప్రశ్నలు గమనార్హములు.

1. కవిననుచు తన క్రాంతదర్శనము నెవడు లోకమున ప్రకటించుకొనగలడు ?

2. అట్టి దర్శనమును సిద్ధింపజేయు దైవీశక్తి సంపన్నమగు మనస్సు ఎట్లు సంప్రాప్తమగును?

ఇట్టి దర్శనము సిద్ధించుటకొక సంప్రదాయక్రమమును శ్రుతియే యట్లు భంగ్యంతరముగ సూచించుచున్నది. ఈశ్వరానుగ్రహము వలననే అద్వైత వాసన సిద్ధించును- (ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైత వాసనా) నియమపూర్వక కర్మానుష్ఠానము, ఉపాసన- ఈ రెండును లేక ఈశ్వరానుగ్రహము సిద్ధింపదు. అనగా నీ రెండింటి

వలననే దైవీశక్తి సంపన్నమగు మనస్సు (దేవం మనః) ప్రాప్తించును. ఈ మంత్రమున అగ్ని -ఆదిత్యులిరువురు నుపాస్యదేవతలుగ బేర్కొనబడినారు. కర్మల యందగ్నియు, సంధ్యోపాసనాదులయందు సవితృ (ఆదిత్య) దేవతయు ప్రధానముగ నారాధ్యులు. వీరు భిన్నులయి కన్పట్టినను వాస్తవముగ భిన్నులు కారు. అభిన్నులుగ నుపాసింపవలెను. (కావుననే సంధ్యావందన సమయమున 'సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా'- యనుచు ప్రాణాగ్నిని సూర్య జ్యోతి రూపముగను, 'దేవ సవితః ప్రసువ' అని యనుచు అగ్నికార్య, ఔపాసనాది సమయములందు అగ్నిని సవితృరూపముగను దర్శించెడి- యారాధించెడి సంప్రదాయము వరలినది). అట్టి కర్మోపాసనల వలననే క్రమముగ చిత్తము పరిశుద్ధ మగును. దివ్యశక్తిసంపన్న మగును. క్రమముగ నద్వయ పరమేశ్వరతత్త్వ విజ్ఞానము గల్గి క్రాంతదర్శను డగును. ఈ తత్త్వమును దర్శించి లోకానుగ్రహబుద్ధితో ప్రబోధించెడివారే కవులు. ఈ దర్శనము ఈశ్వరానుగ్రహాధీనము, వేదైకగమ్యము నగుటచే నివి రెండును లేకుండ 'నేను కవినని యెవడు చాటుకొనగలడు అని శ్రుతి ప్రశ్నించుచున్నది. ఈ ప్రశ్నవలన-క్రాంత దర్శనము గల్గి ప్రబోధించెడి యాదికవిని నేనే' - యని వేదము భంగ్యంతరముగ జెప్పికొనినట్లు గ్రహింపనగును.

ఈశ్వరానుగ్రహముచే మహర్షులు మంత్రద్రష్టలయి క్రాంతదర్శనముతో నొప్పి వేదముల ప్రవచించి కవులుగ ప్రసిద్ధులయినట్లు శ్రుతులే జెప్పినవి (తా మన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్- చూ. ఋషి శబ్దము). ఈ వేదమాత యొక్క యనుగ్రహముచే దరువాత నెందరో కవులయినట్లు పురాణాదులవలన దెలియగలము. వ్యాస, వాల్మీకాది మహర్షులట్టి కవులు; వేదమూర్తులు; లేక భారతీస్వరూపులు. ఈ వేదవాణి సర్వమును దెలియజేయునది (విశ్వవిత్) యయ్యును నందఱియం దభివ్యక్తము కాదు (అవిశ్వమిన్వా)'- అని శ్రుతిచెప్పినది,

## త్రిపథగామినీ - :

క్రమముగ చిత్త సంస్కారపరిపాకము గలిగించి తుదకు నాత్మస్వరూప సాక్షాత్కారము గలిగించుటకే శ్రుతి లోకానుగ్రహబుద్ధితో కర్మ - ఉపాసనా - జ్ఞాన కాండత్రయ రూపమున నవతరించినది. అట్లు మూడు మార్గముల ప్రవర్తిల్లుటచే వేదవాణి త్రిపథగామినియైనది. ఈ విషయమును భాగవత మిట్లు చెప్పుచున్నది.

"కిం విధత్తే కిమాచష్టే కి మనూద్య వికల్పయేత్।
ఇత్యస్య హృదయం లోకే నాన్యో మద్వేద కశ్చన॥
మాం విధత్తేఽభిధత్తే మాం వికల్ప్యాపోహ్యతే హ్యహమ్।"

భాగ. 11-12-42-43.

ఉద్ధవునకు భగవానునిచే వేద స్వభావ మిట్లు తెల్పబడినది.

'వేదము కర్మకాండ యందు విధివాక్యములచే యజ్ఞరూపమున నన్నే విధించుచున్నది. దేవతాకాండ యందు నా యా దేవతా రూపమున నన్నే జెప్పు చున్నది. తుదకు జ్ఞానకాండ యందు 'నా నుండియే యాకాశాది ప్రపంచ సృష్టి గలుగు' నని యీ రీతిగ బెక్కు వికల్పముల జూపి తుదకు నన్నే అద్వితీయ బ్రహ్మ స్వరూపునిగ నిరూపించుటకై సర్వమును నిషేధించి యుపరత వ్యాపార మగుచున్నది!- అని అర్థము.

ఈ భాగవత శ్లోకమున వేదమును గూర్చిన మూడు ప్రశ్నలు, మూడు సమాధానములు గలవు. (1) కిం విధత్తే ? ఏమిటి విధించుచున్నది? (2) కి మాచష్టే ఏమి యుపదేశించుచున్నది? (3) కి మనూద్య వికల్ప యేత్? ఏ యర్థముల ననువదించి నిషేధించి తుదకు నుపరత వ్యాపార మగుచున్నది? ఇందు మొదటి ప్రశ్న

వలన సుహృత్సంమితత్త్వము, మూడవప్రశ్న వలన కాంతా సంమితత్త్వమును సూచితము లగుచున్నది. కాన అధికారిభేదము ననుసరించి ప్రభు-సుహృత్-కాంతా సంమితత్త్వ మార్గముల ద్వారా తత్త్వము నుపదేశించుటకై వేదకావ్యము ప్రవర్తిల్లె ననుట సంప్రదాయాభిమత మని తెలియును.

అగ్ని- వాయు- ఆదిత్యులనెడి త్రిస్థానజ్యోతిస్సులందును తద్రూపులగు వేదవిదులయందును ఇడా-సరస్వతీ-భారతీ రూపమున ననుగతమై, కర్మ-భక్తి-జ్ఞాన తత్త్వ ప్రబోధకమై, ప్రభు-సుహృత్ - కాంతాసంమిత మగుచు త్రయీ విద్యారూప వేదవాణి 'త్రిపథగామిని'గా నొప్పుచున్నది. మఱియు అద్వేవత యని పూర్వము చెప్పబడినది. అద్వేవతయు వాగ్దేవియు నగు సరస్వతి త్రిలోకవ్యాపినియై త్రిపథగామిని యగుటచేతనే శ్రుతులయందు 'త్రిషధస్థా సప్తధాతుః (ఋ. 6-61-12)'- అని కీర్తింపబడినది.

"త్రిషధస్థా త్రిషు లోకేషు సహావతిష్ఠమానా, త్రిలోక
వ్యాపినీ, సప్తధాతుః సప్తధాతవోఽవయవా గాయత్ర్యాద్యా
గంగాద్యా వా యస్యాః సా తథోక్తా" —సా.భా.

ఋక్ - యజుః - సామరూప మంత్ర త్రైవిధ్యముతో నొప్పియు వేదవాణి త్రిపథగామిని యగుచున్నది. (చతుర్వేదశరీరిణీ - ఋగ్యజుః సామ గతిః). ఇట్లు వివిధరీతుల త్రిపథగామినియై యొప్పుచు కాండత్రయాత్మికయగు నీ వేదవాణి నన్నే (పరమాత్మనే) బోధించుచున్నది యని పై భాగవత శ్లోక తాత్పర్యము. కర్మోపాసనాది వివిధార్థముల నధికారానుగుణముగ బోధించుచునే యుత్తమసాధకునకు వేదరాశియంతయు నాత్మస్వరూపపరమై కన్పట్టును. ఇట్లు చెప్పుచో నీ శ్లోకము — వేద (వేదం పరమేశ్వరం వేదయతి), స్వాహా (స్వం ఆహ), స్వధా (స్వం దధాతి), స్వాధ్యాయ (స్వం ఆత్మవిషయకం అధ్యయనమ్), కావ్య (కవేః పరమాత్మన ఇదం) (భారతీ - భరతస్య పరమాత్మన ఇయం) —ఇత్యాది వేదనామముల సార్థకతను దలపింప జేయునది యగుచున్నది.

## మహానటుడు - భరతుడు: ( శిల్పములు - ఆత్మ సంస్కృతి ) :-

పై మంత్రము అందును భాగవతశ్లోకమునందును పరమేశ్వరుదే యజ్ఞాది కర్మరూపమునను, వివిధదేవతారూపమునను, ఆకాశాది భూత భౌతికరూపమునను ప్రవర్తిల్లుచు తదతీతుడై యద్వయరూపమున నుండునట్లు చెప్పబడినది.

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"
"రూపం రూపం ప్రతిరూపో బభూవ"

—ఋ. 6–47–18, శ.బ్రా. 14 – 5 – 5; బృ. ఉ. 2 – 5 –19.

"రూపం రూపం మఘవా బోభవీతి" –ఋ.3–53–8. తై.బ్రా. 1–44–67.

"రూపాణి బిభ్రతం పృథక్" – వా.సం. 28–32; తై.బ్రా. 2–6–1, 7.

అని యీ రీతిగా శ్రుతులు పరమేశ్వరుడు వివిధరూపముల ధరించుట పెక్కు చోట్ల వివరించినవి. వివిధరూపధారణము చేయువాడగుటచే నీశ్వరుడు 'మహానటుడు, నటరాజు' –అని ప్రసిద్ధి.

'మహాకాలో మహానటః' —అమరః.

నటునకు భరతుడని పేరు. వివిధభూమికల ధరించువా డగుటచే నటుడు భరతు డయ్యెను. యాజ్ఞవల్క్యస్మృతి యట్టి భరతునితో నాత్మను బోల్చినది.

"యథా హి భరతో వర్ణై ర్వర్ణయ త్యాత్మన స్తనుమ్ ।
నానారూపాణి కుర్వాణ స్తథాऽత్మా కర్మజా స్తనూః ॥

—యాజ్ఞ. స్మృ. 3–162.

భరతుడు (నటుడు) వివిధవర్ణములతో రామ రావణాది వివిధరూపముల ధరించియు స్వస్వరూపమున నుండునట్లు ఆత్మయు కర్మానుగుణముగ నానావర్ణాత్మకము లయిన వివిధదేహముల దాల్చియు స్వస్వరూపమున విరాజిల్లుచుండును - అని యర్థము.

ఇట స్మృతి ఆత్మను భరతునితో బోల్చి, ఆత్మ భరతు డగుట సూచించినది. 'వ్యావృత్తాయ యవిష్ఠాయ భరతాయ చ రక్షసే' - యనుచు మత్స్యపురాణము (47-149) శివుని భరతు డని కీర్తించినది. ఇట్టి భరత (ఆత్మ) స్వరూపమును అధికారిభేదము ననుసరించి దర్శింపజేయుటకే త్రయీ విద్య యగు భారతి యవతరించినది. ప్రాకృతజనులకు సైతము కాంతాసంమితముగ నీ భరత - భారతీ స్వరూపమును దర్శింపజేయుటకే భరతనాట్యశాస్త్రము ప్రవర్తితమయినట్లు చెప్పబడుచున్నది.

"నాట్యవేదం ప్రవక్ష్యామి బ్రహ్మణా యదుదాహృతమ్" -భ.నా.శా.1-1

"బ్రహ్మణా పరమాత్మనా, య దుదాహృతం అవిద్యా విరచిత నిస్సార భేదగ్రహే, య దుదాహరణీకృతం తన్నాట్యం ప్రవక్ష్యామి. యథా హి కల్పనామాత్రసారం తత ఏవ అనవస్థితైక రూపం క్షణేన కల్పనా శతసహస్ర సహం స్వప్నాది విలక్షణ మపి సుష్ఠుతరాం హృదయ గ్రహనిదానం అత్యక్త స్వాలంబన బ్రహ్మకల్ప నటోపరచితం రామరావణాది చేష్టితం అసత్యం కుతోఽప్య భూతాత్ భూతవృత్త్యా భాతి। తథా భాసమాన మపి చ పుమర్థోపాయతా మేతి। తథా తాదృగేవ విశ్వ మిద మసత్య నామరూప ప్రపంచాత్మకం, అథ (చ) శ్రవణమననాది వశేన పరమ పుమర్థ ప్రాపకమితి లోకోత్తర పరమ పురుషార్థ సూచనేన శాంతరసోపక్షేపోఽయం భవిష్యతి। స్వం స్వం నిమిత్త మాదాయ శాంతా ద్భావః ప్రవర్తతే"

—నాట్య శా. 1-6.

"త దనేన పారమార్థికం ప్రయోజన ముక్తమ్"॥-భట్టనాయకః-అభినవ భారతీ.

ఇట నాట్యశాస్త్రారంభమున ఈ నాట్యవేదము యొక్క- వరమ ప్రయోజన మిట్లు వివరింపబడుచున్నది. ఈ నాట్యవేద మనాది. అవిద్యాకల్పితమై నిస్సారమైన జగత్తు నందలి వివిధ భేదప్రకారమును- అందలి తత్త్వమును- దర్శింప జేయుటకై పరమాత్మయే ఈ నాట్యమును దృష్టాంతముగా జేసి ప్రవచించినాడు. నాట్యము కేవలము కల్పనామూలము; క్షణక్షణ పరిణామశీలము;(కల్పనాశతసహస్ర సంకులము; స్వప్నాది విలక్షణము; అత్యంతము హృదయావర్జకము); స్వ స్వ రూపావస్థితు డయియే బ్రహ్మ మిథ్యా జగన్నాటక సూత్రధారుడై విలసిల్లు నటులే నటుడును స్వ స్వరూపావస్థితు డయియే అసత్య, రామ రావణాది చేష్టిత రూపము లైన వివిధరూపముల భాసింపజేయును. నాటకము లేక నాట్యము వస్తుతః మిథ్యా రూపమై భాసించుచునే పురుషార్థ దర్శనోపాయమై వరలును; అట్లే అసత్య నామ రూపాత్మక మైన యీ జగన్నాటకము గూడ వేదవాక్య సాహాయ్యముతో శ్రవణ మననాదిక మొనర్చి దర్శించుచో వరమపురుషార్థ మగుచు శాంత రసోపస్థాపక మగును. ఇట్లు జగన్నాటక తత్త్వము దెలియజేయుట కయియే పరమాత్మ నాట్యవేదమును దృష్టాంతముగ ప్రవచించెను- అని యర్థము.

'బ్రహ్మణా యదుదాహృతమ్ - అను పై నాట్యశాస్త్రారంభ శ్లోకము నకు, 'బ్రహ్మణా వేదాఖ్యేన భగవతా శబ్దరాశినా, ఉదాహృతం నిరూపితమ్'- అని మఱియొక వ్యాఖ్యానము 'అభినవ భారతి' యందు గాననగును. వేదశబ్ద రాశి (బ్రహ్మ)నుండి యీ నాట్యశాస్త్రము నిరూపిత మైనది - అని భావము పరిశీలించి నచో పీ రెండు వ్యాఖ్యానముల తాత్పర్య మొకటియే.

కాగా భరతు(మహానటు)డగు పరమేశ్వరునిచే ప్రవర్తితములైన కావ్య ములు రెండు. ఒకటి రూపాత్మక జగన్నాటక దృశ్య కావ్యము. రెండవది నామాత్మక వేదరూప శ్రవ్యకావ్యము. కాననే భరత (విఃసృతము లగుట చేతనే) లోకమునకు భారత వర్ష మనియు, వేదవాణికి భారతి యనియు ప్రశస్తి యుపపన్న

మైనది. ఈ రెండును దేవశిల్పములే; దేవతా త త్త్వప్రబోధకములే -అని తెలియ జేయుటకే నాట్యశాస్త్రమును (నాట్యశిల్పమును) పరమాత్మ అవతరింప చేసినట్లు పై వచనముల వలన దెలియును.

సాధారణముగ జగన్నాటకముచే ప్రభావితులు గాని వారుందరు. ఇట నందఱును సామాజికులే. అయ్యును "ఈ దృశ్యమగు జగత్తు ఒక నాటకము; కల్పనామాత్రసారము; దేవశిల్పము; కాన పురుషార్థోపాయప్రబోధకము" -అను విషయ మందఱకు పొడగట్టదు. ఇది యదార్థమే – అను భ్రాంతిచే మోహితులై సంసారప్రవాహమున పడి యటు నిటు పరిభ్రమింతురు. ఇట్టి జగ ద్రూప దృశ్య కావ్య త త్త్వమును తెలియజేసి యుద్ధరించుట కయియే భరతుని (పర మాత్మ)చే వేదరూప శ్రవ్యకావ్యము ప్రవ ర్తిత మైనది. ఇదియును దేవశిల్పమే. (తత్ప్రవ ర్తితము లైన యజ్ఞాది కర్మోపాసనలును దేవశిల్పములే), అయ్యును దీని నంద ఱెరుగజాలరు. (విశ్వవిత్ - అవిశ్వమిన్వా). కొందఱకిది లౌకిక విషయావ బోధక మగు శబ్దరాశిగ మాత్రమే గోచరించును. అట్లుగాక దానితో నిరంతర సఖ్యమొనర్చి అధ్యయన కర్మానుష్ఠానాదిక (మొనర్చుచు) శ్రవణ మన నాదిక మొనర్చుచో నట్టి సఖులగు సామాజికుల కిది దేవశిల్పమై (దైవీవాక్కుగ) భావించి పురుషార్థప్రద మగును. ఈ రీతిగ నీ దృశ్య శ్రవ్య కావ్యముల దర్శించి నపుడే త్రిలోకముల ప్రవ ర్తింప జేసిన అగ్ని - వాయు – ఆదిత్యులు భరతులుగ గన్పట్ట గలరు. ఆ జ్యోతిస్త్రయాత్మకు డగు పరమేశ్వరుడును మహానటుడై - భరతుడై - మహాకవియై సాక్షాత్కరించును. కావుననే అలంకార శాస్త్ర ప్రవ ర్తకు లలో నొకడగు భట్టనాయకుడు పరమేశ్వరుని జగన్నిర్మాణకవిగా ఇట్లు కీ ర్తించినాడు.

'నమ స్త్రైలోక్య నిర్మాణ కవయే శంభవే యతః ।
ప్రతిక్షణం జగన్నాట్య ప్రయోగరసికో జనః ॥'

—అభినవ భారతి - నాట్యశాస్త్ర 1-1.

కావుననే యీ శాస్త్రము నాట్యవేద మనియు గీర్తింపబడినది.

"నాట్యసంజ్ఞ మిమం వేదం సేతిహాసం కరో మ్యహమ్ ।
ఏవం సంకల్ప్య భగవాన్ సర్వవేదా ననుస్మరన్ ॥
నాట్యవేదం తత శ్చక్రే చతుర్వేదాంగ సంభవమ్ ।
జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యో గీత మేవ చ॥
యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణా దపి ।
వేదోపవేదైః సంబద్ధో నాట్యవేదో మహాత్మనా ॥"

—భరతనాట్యశాస్త్ర 1వ అధ్యా.

పై శ్లోకముల వలన చతుర్వేదముల యొక్క లక్ష్యమును దర్శింపజేయుటయే చతుర్వేదసారరూప మగు నాట్యవేదము యొక్క లక్ష్యమని తెలియును. ఇట్లు నాట్యకళయే కాదు. సంగీతాది చతుఃషష్టి కళల లక్ష్యము నిదియే. శ్రుతియు నీ విషయము నిట్లు చెప్పుచున్నది.

"దేవశిల్పా న్యేతేషాం వై శిల్పానా మనుకృతీహ శిల్ప
మధిగమ్యతే....ఆత్మసంస్కృతి ర్వావ శిల్పాని చ్ఛందో
మయం వా ఏతై ర్యజమాన ఆత్మానం సంస్కురుతే॥"

—ఐ. బ్రా. 6–27.

"శిల్పశబ్ది శ్చాఽఽశ్చర్యకరం కర్మ బ్రూతే। తచ్చ శిల్పం
ద్వివిధమ్। దేవశిల్పం మానుషశిల్పం చేతి। నాభానేదిష్ఠాదీని
యాని శిల్పాని సంతి దేవానాం ప్రీతిహేతుత్వా ద్దేవశిల్పా
నీత్యుచ్యన్తే, ఏతేషామేవ దేవశిల్పానా మనుకృతి సదృశ
రూప మిహ మనుష్యలోకే శిల్ప మధిగమ్యతే ప్రతీయతే....
వక్ష్యమాణాని నాభానేదిష్ఠాదిశిల్పా న్యాత్మ సంస్కృతి

జ్జీవాత్మనః సంస్కారకారణాని । తస్మా దేతై ర్యజమానో
జీవాత్మానం ఛందోమయం వేదమయో యథా భవతి తథా
సంస్కురుతే" —సా.భా.

'శిల్ప' మనగా నాశ్చర్యకరమగు కర్మ. శిల్పము ద్వివిధము-దేవశిల్పము; మానుషశిల్పము. నాభానేదిష్ఠాది శస్త్రములకు శిల్పము అని పేరు. ఇవి దేవప్రీతికరములు; కాన దేవశిల్పములు. మానుషశిల్పము లీ దేవశిల్పములకు అనుకృతులు. ఈ దేవశిల్పములు ఆత్మసంస్కార హేతువులు. ఈ శిల్పములచే యజమానుడు 'జీవాత్మ వేదమయుడగు నట్లు'గా సంస్కరించుకొనును-అని యర్థము.

శస్త్రములు దేవతాతత్త్వప్రబోధకములు, తత్ప్రీతికర కర్మప్రకాశకములగు మంత్రసముదాయరూపము లగుటజేసియు, తద్ద్వారా ఆత్మ సంస్కార హేతువు లగుట జేసియు, దేవశిల్పము లని యిట గీర్తింప బడినవి. దేహాద్యభిమానముతో సంసారమున బరిభ్రమించు యజమానుని యాత్మను క్రమముగ సంస్కరించి యాతని భరతునిగను, భారతీమయునిగను తీర్చి దిద్దుటయే దేవశిల్ప రహస్యము. నాభానేదిష్ఠాది శిల్పములును నట్టివి; ఉదా :—

"ఇయం మే నాభి రిహ మే సధస్థ మిమే దేవా అయ మస్మి
సర్వః। ద్విజా అహ ప్రథమజా ఋతస్యేదం ధేను రదుహ
జ్జాయమానా॥" —ఋ. 10-61-19.

నేను ఆదిత్యరూపుడను. ఆదిత్యుడు వాగ్రూపుడు. అందుకే నాదిత్యగతమగు నీ వాక్కు నాకు నాభి (ఇయం మే నాభిః). ఈ ఆదిత్యమండలము నాకు స్వస్థానము (ఇహ మే సధస్థం); ఈ దేవతలు నాకు స్వభూతులు (ఇమే దేవాః మే). ప్రథమోత్పన్నులగు ఋషులును నాకు స్వభూతులు (అహ ద్విజా ఋతస్య ప్రథమజాః) నాకు నాభిస్థానీయమై స్వభూతమగు నీ వాక్కే దృశ్యమగు నీ ప్రపంచమును నభి

వ్యక్తము జేయుచున్నది. (ధేనుః జాయమానా ఇదం అదుహత్) కాన ఆదిత్యరూపుడ నగు నేను సర్వాత్మకుడను (అయ మస్మి సర్వః) - అని నాభానేదిష్ఠుని సర్వాత్మ కత్వానుభవము నీ మంత్ర మభివ్యక్తము జేయుచున్నది. 'అగ్నిరస్మి జన్మనా జాత వేదాః; న విజానామి యది వేద మస్మి' - ఇత్యాది పూర్వోదాహృత మంత్ర తాత్ప ర్యము నిదియే.

ఆదిత్యుడు భరతుడు; తద్గత మగు వాక్కు భారతి-యని పూర్వము చెప్పబడినది. 'సా యా వా గసౌ స ఆదిత్యః - (శ. బ్రా. 10-5-1-4)' - అను శతపథ శ్రుతియు నాదిత్యుడు వాగ్రూపు డగుట వివరించుచున్నది. పై మంత్రము ఆదిత్యో పాసకుడై జ్ఞానియైన బ్రహ్మవిదుని (నాభానేదిష్ఠుని) ఆదిత్యరూపునిగను, తద్గత వాగ్రూపునిగను, సర్వదేవాత్మకునిగను, తుదకు సర్వాత్మకునిగను గీర్తించుచున్నది. శ్రుతి యుద్దేశించిన దేవశిల్ప మిట్టిది. కాగా, భారతీయుల దృష్టిలో శిల్పములనగా రమణీయార్థము లను దర్శింపజేసి యలౌకికానంద రసపరిపూర్ణుల గావించు లక్ష్యము గలవి. ఇదియే భారతీయ సంస్కృతి. ఈ సంస్కృతిని ప్రతిబింబింప జేయునవియే చతుః షష్టికళలు. ఇవి దేవశిల్పములకు ప్రతిరూపములు. దేవశిల్పము లాత్మ సంస్కార హేతువులు. అట్లే తదనుకృతిరూపములగు మానుషశిల్పములకును ఆత్మసంస్కారమే లక్ష్య మని పై శ్రుతి వలన దెలియును. జీవాత్మ వేదమయు డగునట్లుగ, అనగా భారతీమయుడగు భరతుడగునట్లుగ, నొనరించుకొనుటయే ఆత్మసంస్కృతి. ఇట్టి యీయాత్మసంస్కృతి నుద్దీపింప జేయుటకే దేవాలయ విమాన గోపుర ప్రాకారాదులన్నియు శిల్పమయ ములై వెలసినవి.

## మహాభారతము - అగ్ని (భరత) వంశము:-

బ్రాహ్మణములందు కర్మ విధివాక్యములలో గన్పట్టుచు యజ్ఞములందారాధింప బడెడి వివిధాగ్నుల స్వరూపము నాఖ్యాయికారూపమున మహా భారతము(వనపర్వము) వివరించినది.

"తత్ర నానావిధా నగ్నీన్ ప్రవక్ష్యామి మహాప్రభాన్ ।
కర్మభి ర్బహుభిః ఖ్యాతాన్ నానార్థాన్ బ్రాహ్మణే ష్విహ॥"

—భార. 217-21.

పరమేశ్వరుడాదిగా గల యీ యగ్నివంశము, అందలి వివిధాగ్నుల క్రమము ఆ యగ్నుల 'యుత్పత్తి-స్వరూప-ప్రయోజనాదులు' వేఱ్వేఱుగ వర్ణించి, తుదకు నగ్ను లెందఱైనను తదాత్మకమగు తేజ మొక్కటియే యని యిట్లు చెప్పబడినది.

"అద్భుతస్య తు మాహాత్మ్యం యథా వేదేషు కీర్తితమ్।
తాదృశం విద్ధి సర్వేషా మేకో హ్యేష హుతాశనః॥
ఏక ఏవైష భగవాన్ విజ్ఞేయః ప్రథమోఽంగిరాః।
బహుధా నిఃసృతః కాయాత్ జ్యోతిష్టోమః క్రతు ర్యథా॥
ఇ త్యేష వంశః సుమహా నగ్నీనాం కీర్తితో మయా।
యోఽర్చితో వివిధై ర్మంత్రై ర్హవ్యం వహతి దేహినామ్॥"

—భార.222-30 నుండి 32

పై శ్లోకముల బరిశీలించుచో వేదప్రతిపాదితమై యజ్ఞాదికర్మల యందారాధింపబడెడి యగ్ని యొక్క స్వరూపమును దర్శింపజేయుటకై యీ యగ్నివంశోపాఖ్యానము ప్రవృత్తమైన దగుట స్పష్టము. ప్రజాపతి యగు నా యగ్ని భరతుడని యిట్లు నిర్వచింపబడినది.

"భరతో భరతస్యాగ్నేః పావకస్తు ప్రజాపతేః ।
మహా నత్యర్థమహిత స్తథా భరతసత్తమ ॥" —219-8.

'భరతః భరణం కుర్వతః - తేన భరతశబ్దస్య నిర్వచనం
దర్శితమ్ । భరతస్య ప్రజాపతేః పావకః సుతః, సః
అత్యర్థం మహితత్వాన్ మహాన్' —నీలకంఠః.

భరణధర్మము గల్గి భరతుడైన ప్రజాపతికి (అగ్నికి) పావకు డను నగ్ని మహామహిమాన్వితుడై జనించెను.

'గురుభి ర్నియమై ర్జాతో భరతో నామ పావకః ।
అగ్నిః పుష్టిమతి ర్నామ తుష్టః పుష్టిం ప్రయచ్ఛతి॥'
'భరత్యేష ప్రజాః సర్వా స్తతో భరత ఉచ్యతే ।' -221-1.

ఈ పావకు డను నగ్నికి భరతుడనియు పుష్టిమతి యనియు నామములు గలవు. సంతుష్టుడై పుష్టి నొసగువా డగుటచే పుష్టిమతి యని నామము. హవిరాదుల ద్వారా ప్రజలను భరించుటచే భరతుడని నామము. ఒకే జ్యోతిస్సు ఎపుడు హవిరాదుల భరించునో యపు డది యగ్ని యగును. లేనిచో కారణస్వరూపమున నుండును. (అత్ర అగ్నిశబ్దేన దిగ్దేశకాల కర్తా్రి ద్యాత్మా సూత్రసంజ్ఞో హిరణ్యగర్భ ఉచ్యతే: తస్య అగ్నిత్వత్యాగః కారణాత్మనాఽవస్థానమ్—నీలకంఠః 217-16). ఆ యగ్ని యొక్క హవిర్భరణ, ప్రజాభరణాది ధర్మముల బోధించునదియే 'భరత' పదము.

ఇంతియే కాదు. జడములై యచేతనము లయిన భూతములను దీపింపజేయుచు భరించువా డగుట జేసియు నగ్నికి భరతు డను నామము చెప్పబడుచున్నది.

'అగ్ని ర్గృహపతి ర్నామ నిత్యం యజ్ఞేషు పూజ్యతే ।
హుతం వహతి యో హవ్యం అస్య లోకస్య పావకః ॥
అపాం గర్భో మహాభాగః సత్త్వభుక్ యో మహాద్భుతః ।
భూపతి ర్భువభర్తా చ మహతః పతి రుచ్యతే ॥'
దహన్ మృతాని భూతాని తస్యాగ్ని ర్భరతోఽభవత్ ।
అగ్నిష్టోమే చ నియతః క్రతు శ్రేష్ఠో భరస్య తు॥
—222-4, 5, 6.

పావకుడగు నీ యగ్ని యజ్ఞములందును, అట్లే దేహమునందును వర్తించుచు పిండబ్రహ్మాండములయం దుండెడి దేవతలను అన్నాది హవిస్సులతో దృప్తి నందించి హవ్యవాహను డగుచున్నాడు.

## అపాం గర్భః :-

ఈ భరతుడు అద్భుతుడు. ఇతడు 'అప్తుడు' అను అగ్నికి పుత్రుడు. అనగా నవ్యక్తకారణము నుండి యావిర్భవించినాడు—అని యర్థము. (అప్సంబంధా దాపావర నామా సహ ఏవాత్ర అప్శబ్దార్థః తస్య గర్భః పుత్రః.... సహశబ్దేన కారణ మవ్యక్తాఖ్యమ్ । అప్ శబ్దేన, 'సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవతీత్యాది శ్రుతౌ సలిలేనో పమితం శుద్ధం బ్రహ్మగ్రాహ్యమ్. సత్త్వభుక్ :- సత్త్వభుక్ అనగా నాధ్యాత్మికము బుద్ధిని, ఆధిభౌతికముగ లోకత్రయమును లయ మందించువాడు. భూర్భువర్లోకములకు పతి; అధ్యాత్మికముగ మహత్తత్త్వమునకు (సూక్ష్మబుద్ధికి)పతి. మహత్తత్త్వ మనెడి యగ్ని నుండి "అహంకారము" అను పేరు గల యగ్ని యుద్భవించెను. ఈ యగ్నియే భరతుడు. ఇతడు ఆదిభౌతికముగను, అధ్యాత్మికముగను, జడములై యచేతనము లయిన భూతములను (మృతాని భూతాని) దీపింప జేయుచు, లయ మొందించుచు - నిట్టి భరణధర్మముచే భరతు డగుచున్నాడు. ఈ యగ్ని అధియజ్ఞముగ నగ్నిష్టోమమునందు వియతుడగు చున్నాడు. 'తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానః, శ్రద్ధా పత్నీ, శరీరమిధ్మ' మని యీ రీతిగా శ్రుతిచే జెప్పబడిన యాధ్యాత్మికయజ్ఞము అగ్నిష్టోమము; ఇది మరణరూప-అవభృథాంతము నిత్యము చేయదగినది. ఇట్టి యీ యజ్ఞమున నారాధింపబడెడి యగ్ని భరతుడు—(చూ. నీలకంఠవ్యాఖ్య).

అట్టి మహాదేవుడు, మహానటుడు నగు భరతుని యం దనుగతమై యజ్ఞతంత్రమును, లోకతంత్రమును నిర్వహించెడి వేదవాణి భారతి. ఈ మహాభారత వచనముల ననుసరించియు నాధ్యాత్మికముగ, నాధిభౌతికముగ, నధియజ్ఞముగ హవి

ర్భరణ - శరీరభరణాది ధర్మములచే నగ్నికి భరతుడని ప్రసిద్ధి స్పష్టము. అందుచే, —'ఆర్యులలో భరతు లనెడి యొక తెగవారికి నారాధ్యుడగుటచే నగ్నికి భరతు డను వ్యవహారము కల్గినది' - అనెడి చారిత్రికుల కల్పన శ్రుతి స్మృతి తాత్పర్య విరుద్ధము.

## కోశ - పౌరాణిక వచనములు - భారతీప్రజ- భారతీసంస్కృతి :-

"ఇమా హ వై ప్రజా భారతీః అథో య దే వైనేన (అగ్నినా)
అగ్ర ఈజిరే అథో య దే వైష దేవేభ్యో హవ్యం వహతి తస్మా ద్భారతః"

—తై. బ్రా. 36-2.

సర్వదేవాత్మకు డగు అగ్ని హవిర్భరణ ధర్మముచే భారతః -అని చెప్ప బడును. సృష్ట్యాదియందు (అగ్రే) అట్టి భారతుని ఆరాధించుటచే -ఈ ప్రజకు (ఈ లోకమునందలి ప్రజకు) భారతి యని యన్వర్థనామము -అని యర్థము.

"ప్రజాపతిర్వై భరతః సహీదం సర్వం బిభర్తి-"

జగద్భర్త యగుటచే ప్రజాపతి భరతుడు - అని శ్రుతినిర్వచనము, జగ ద్భర్తయగు భరతుని నుండియే యీ లోకము ప్రవర్తిత మగుచున్నందున నీలోకము —'భారతము; భారతవర్షము' - అను నన్వర్థసంజ్ఞతో నొప్పినది. అందుచే 'లోకోఽ యం భారతం వర్షమ్। వర్షం స్థానం విదుః ప్రాజ్ఞా ఇమం లోకం చ భారతమ్'— ఇత్యాది వచనము లుపపన్నములే యగుచున్నవి.

"త్వం భారతే కార్యగురు స్త్వం చక్షు స్త్వం పరాయణమ్।
తదాగచ్ఛ హృషీకేశ క్షితౌ తాన్ జహి దానవాన్॥"

—హరివంశః 1-54-86.

ఈ శ్లోకమున 'భారతే - క్షితౌ' అను పదములు రెండును సమానాధికరణములుగ బ్రయోగింపబడినవి.

మయ్యాసక్తాం చ జానామి భారతీం మహతీం ధురమ్।
సర్వం తచ్చ విజానామి" —హరివంశః 1-55-19.

దానవసంహారమునకై భూమియందు (లోకమునందు) అవతరింపుమని యేడి పై యభ్యర్థనకు భగవానుని ప్రతివచనమిది. 'భారతీ (లోక - ప్రజా) రక్షణభారము నా యందున్నదని యెఱుగుదును' - అని యర్థము. కాన భారత భారతీ పదములు లోక - ప్రజా - వాచకము లగుట శ్రుతి స్మృతి సంమతము.

"ప్రజాపతిర్వై మనుః । సహీదం సర్వ మమనుత ।
ప్రజాపతి ర్వా ఏతదగ్రే కర్మ అకరోత్" —శ. బ్రా. 6-6-1-19.

ప్రజావతి యగు మనువు యజ్ఞాదికర్మ (ధర్మ) మార్గమును లోకమున మొదట బ్రవర్తింపజేసిన యధికారపురుషుడు; రాజర్షి (చూ. 'మనుష్వత్'- త్రయీ శబ్దము) ప్రజాపతి భరతుడని శ్రుతిచే జెప్పబడినది. 'భరణాచ్చ ప్రజానాం వై మను ర్భరత ఉచ్యతే'-అని పురాణాదులును ప్రజాపతి యగు మనువు భరతుడనికీర్తించినవి. భరతుడగు మనువు యొక్క ధర్మమార్గమున బ్రవర్తిల్లెడి ప్రజ భారతి యగును. ప్రజ యన ప్రకృష్టజన్మ గలది, (ప్రజాయతే ఇతి) యని యర్థము. అగ్ని - వాయు-ఆదిత్యులు ప్రకృష్టజన్మగల ప్రజలు (తిస్రః ప్రజా ఆర్యా జ్యోతి రగ్రాః)అని పూర్వము వివరింపబడినది. తదారాధకు లగుచు మనువు చూపిన ధర్మమార్గమున వర్తించుటయే భారతీ ప్రజ యందలి ప్రకృష్టత్వము గావచ్చును. కర్మల యందగ్నిని-ఆధ్యాత్మికముగ శరీరాంతర్నిహిత జ్యోతిని అన్నాదిహవిస్సులతోను, వాయు(ప్రాణాత్మక)రూపమగు జ్యోతిస్సును ప్రాణాయామాద్యభ్యాసము చేతను, అభిముఖులై నిలిచి ఆదిత్యుని ఉపాసనాదులతో నారాధించెడి సంప్రదాయము అనాదిసిద్ధము.

"రేఖామాత్ర మపి క్షుణ్ణా దామనో ర్వర్త్మనః పరమ్ ।
న వ్యతీయుః ప్రజా స్తస్య నియంతు ర్నేమివృత్తయః॥"

— రఘు.

మనుధర్మమార్గ మనాదిసిద్ధ మని పై శ్లోకముచే కాళిదాసమహాకవి స్పష్టము చేయుచున్నాడు.

కాన అగ్ని - వాయు - ఆదిత్యులు, తదాత్మకుడగు ప్రజాపతి, సర్వ కారణుడు నగు పరమేశ్వరుడు, లోకమున ధర్మప్రవర్తకుడగు మనువు - అందఱు భరతులు; వీరియందును, వేదవిదులగు భరతులయందును ననుగతమై యుండెడి ఇడా-సరస్వతి-భారతీరూపిణి యగు వేదమాత భారతి; వేదచోదిత కర్మ-భక్తి-జ్ఞాన మార్గముల బ్రవర్తిల్లుచు నీ భరత-భారతీ దేవతా రాధనము సల్పుట భారతీసంస్కృతి-యని దెలియనగును. నదీ-నద- పర్వతాదులయందును, లతావృక్షాదులయందును భరత-భారత దేవతాత్వము దర్శించి యారాధించుట భారతీసంస్కృతి. ఇట్టి దేవతా తత్త్వము నుద్దీపింపజేయుచు భారతీ ప్రజపాలిటి కల్పవృక్షములై యవతరించినవి యీ లతా వృక్షాదులు. ఈ విషయ మీ క్రింది వచనము వలన స్పష్టము కాగలదు.

"కల్పవృక్షస్వరూపా యా భారతే వృక్షరూపిణీ।
భారతీనాం ప్రీణనాయ జాతా యా పరదేవతా॥"

—దేవీ - భాగ. 9-1-70.

భారతీ ప్రజ పాలిటి కల్పవృక్షమై భారతమున (లోకమున) తులసీవృక్ష రూపమున బరదేవత యావిర్భవించినది యని యర్థము.. తులసి మహౌషధియై స్థూలశరీరమును, పరాదేవతయై సూక్ష్మశరీరమును ఆధివ్యాధులనుండి రక్షించెడి కల్పవృక్ష మని భావము ఇట్లు లతావృక్షాదుల యందు సైతమ ను గతమై తన నారాధించెడి భారతులను పాలించెడి పరాశక్తియే భారతి.

"భద్రకాళీ భుజంగాక్షీ భారతీ భారతాశయా" —దేవీ. భాగ. 12-6-118.

'భారతాశయా, భా స్వప్రకాశా సంవిత్ తస్యాం రతా
యే జ్ఞానిన స్తేషు ఆశయో యస్యాః సా' —నీలకంఠః

'భా' - యన స్వప్రకాశాత్మకమగు జ్ఞానము. దానియందు రతులు (ఆసక్తులు) భారతులు, జ్ఞాను లని యర్థము. ఆ భారతుల యందు 'ఆశయము-దృష్టి' కలది యగుటజేసి పరదేవత 'భారతాశయా' యగును. అట్టి యా పరాదేవతయే భారతి యని యిట కీర్తింపబడినది. కాన నగ్ని వాయ్వాది దేవతారాధనకును, తులసీవృక్షాదిపూజలకును, యోగుల యోగ సాధనకును - అన్నిటికిని లక్ష్యము పరదేవత యగు భారతియే. పరాదేవతా భావనతో నారాధనల నల్పుట భారతీ సంస్కృతి యని దెలియును.

"భరం సంగ్రామం తనోతీతి భరతః" భర మనగా సంగ్రామము. దానియందు కుశలులు, లేక దానిని విస్తరింప జేయువారు గాన భరతులు- అనెడి పూర్వోదాహృతమైన యీ నిర్వచనము కూడ భారతీయసంస్కృతి స్వరూపమును దెలియ జేయునదియే. చిత్తమున నిరంతరము పొడసూపు అసురీప్రవృత్తిని దైవీసంపదతో (దేవం మనః) నెదుర్కొనుటయు సంగ్రామమే. ఇట్టి సంగ్రామమునందును కుశలు రగువారే భరతులు. అసురీప్రవృత్తి నెదుర్కొనజాలెడి దైవీసంపదను సమకూర్చున దగుటచే యజ్ఞమునకు 'భరః' అని శ్రుతులయందు ప్రసిద్ధిః (ఋ. 5-37-5, భరే సంగ్రామే, భరణవతి యజ్ఞే - సా.భా.).

'బలం భరం భవతి బిభర్తేః' అను నిరుక్తవచనము (3-2-9) బల-భర శబ్దములు రెండును సమానార్థకములని చెప్పుచున్నది. కాన బలమనగా బ్రాహ్మ-క్షాత్ర-తేజోరూపమగు బలము. 'భరం యజ్ఞం ఆత్మ బలం వా తనోతీతి భారతీ' -యజ్ఞమును (ఈశ్వరారాధనను), తద్ద్వారా యాత్మబలమును బెంపొందించునది యగుటజేసి వేదవాణీ భారతి. ఆ భారతి నుపాసించువారు, అనగా ధర్మానుష్ఠాన పరులు - తద్రక్షకులును, భారతులు; ఇదియే భారతీసంస్కృతి.

పై గ్రంథసందర్భము ననుసరించి యిట్టి సంస్కృతి పూర్వము విశ్వవ్యాప్తమై యుండి యుండవలెను. నేటికిని భారతీసంస్కృతిని దలపింపజేసెడి శిల్పకళాఖండములు, భాషాసామ్యము మున్నగునవి యితరదేశములందును నచటచట గన్పట్టుట యిందుకు దార్కాణము. ఆ సంస్కృతి కాలక్రమమున లుప్తమై భారతదేశమున మాత్రమే సుస్థిరముగ నిలిచియుండవచ్చును.

"ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రే శ్చైవ దక్షిణమ్
వర్షం తద్భారతం నామ భారతీ యత్ర సంతతిః" -విష్ణు పు. 2-3-1.

సముద్రమునకు హిమాద్రికిని మధ్య భారతీసంతతి యెచట గలదో యది భారతవర్షము - అని యర్థము భారతీసంతతిని బట్టి యీ దేశమునకు భారతీ వర్షమను ప్రసిద్ధి వచ్చినట్లు పై పురాణవచనము వలన దెలియును.

సామాన్యముగ ప్రజలు వ్యవహరించుకొను భాషను బట్టియే యా ప్రజకు గాని, వారు నివసించు దేశమునకు గాని పేరు ప్రసిద్ధ మగు చుండును. తెలుగుదేశము, తమిళనాడు, కన్నడదేశము, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ - ఇత్యాదులిందు కుదాహరణము. ఈ లోకన్యాయము ననుసరించుచో నీ భారతి (సంస్కృతవాణి) యొకపుడు విశ్వవ్యాప్తమై యుండుటచే లోకమునకు భారత వర్షమను ప్రసిద్ధికి గారణమై యుండవలెను. క్రమముగ నది జంబూద్వీప మాత్ర పరిమితమై, తుదకు ఆసేతుహిమాచల దేశమాత్రపరిమితమై, యీదేశము భరతఖండముగ వ్యవహరింపబడి యుండ వలెను.[1] వైదికకర్మానుష్ఠానారంభమున 'జంబూద్వీపే భరతవర్షే

1. తప స్తప్య న్తి మునయో జుహ్వతే చాత్ర యజ్వనః।
దానాని చాత్ర దీయ న్తే పరలోకార్థ మాదరాత్॥
పురుషై ర్యజ్ఞపురుషో జంబూద్వీపే సదేజ్యతే।
యజ్ఞై ర్యజ్ఞమయో విష్ణు రన్యద్వీపేషు చాన్యథా॥
అత్రాపి భారతం శ్రేష్ఠం జంబూద్వీపే మహామునే।
యతో హి కర్మ భూ రేషా హ్యతోఽన్యా భోగభూమయః॥
—విష్ణు. పు. 2-3-20; 21,22.

భరతఖండే' యని యీరీతిగ దేశకాలసంకీర్తనము జేయుటకు గారణ మిదియే కావచ్చును.

ఇక ఋషభపుత్రుడగు భరతుని వలనను, దుష్యన్తపుత్రుడగు భరతుని వలనను, అనాదిసిద్ధమై యున్న భారతకీర్తి యినుమడింపజేయబడిన దనియే పూర్వోదాహృత పురాణవచన - తాత్పర్యముగ గ్రహింపనగును. ఋషభపుత్రుడు స్వాయంభువ మనుసంతతికి జెందినవాడు (విష్ణు పు 2-1) దుష్యంతపుత్రుడు వైవస్వత మనుసంతతికి జెందినవాడు (భార. 1-74, 75 అధ్యా). ఇరువురును వేదవిహితధర్మానుష్ఠానపరులగు రాజులు; మన్వంతర భేదముచే భారతీ కీర్తి నినుమడింపజేసిన మహాపురుషులు; సార్థకనామధేయులు.

ఏమైనను మొత్తముమీద భారతి యను నామము ఈ దేశమునకును, ఇందలి ప్రజలకును అనాదిసిద్ధము, ప్రసిద్ధము; అట్లే వాగ్దేవతకును వేదవాణికిని గూడ ప్రసిద్ధము. భరతుని లేక భారతి నుపాసించువారు భారతులు, లేక భారతీ ప్రజ యగుట శ్రుతి స్మృతి సంప్రదాయానుగుణము.

"ఉత్తిష్ఠత మా స్వప్త అగ్ని మిచ్ఛధ్వం భారతాః"

తై. అ 1-27-2.

భారతులారా! లెండు, నిదురింపకుడు; అగ్నిని (ఈశ్వరుని) ఆరాధింపుడు— అని వేదభారతి భారతులను హెచ్చరించుచున్నది. ఇది భారతీయులకు మఱువరాని హెచ్చరిక.

ఇంతవఱకు 'త్రయీ వై విద్యా కావ్యం ఛందః' -అను శ్రుతి వాక్యము నందలి త్రయీవిద్యా-కావ్యశబ్దములు పరిశీలింపబడినవి. వేదకావ్య స్వరూపముఛందః శబ్దపరిశీలనము వలనను స్పష్టపడును. ఇక వేదముయొక్క ఛందస్త్వమును జూతము.

# ఛందః

వ్రజే తత్ గోస్థానేఽ పరిమిత పదే యజ్ఞ సదనే
ముదానందస్యాజ్యే సువిమల యశోదాంచిత గృహే
చరంతం గోపాలం మధురవచసా ఛందయతి యా
శ్రుతి ర్గోపీ గోపాన్ చదయతు పరం దర్శయతునః

సదా మృత్యో ర్భీతాన్ ఛదయతి తథా ఛాదయతి యా
జనాన్ పూతాన్ దివ్యాన్ విగతతమసశ్ఛన్దయతి చ।
పరం చర్మైవాస్తే త్రిభువనపతేః, శర్మ పరమం
శివాం ఛందోరూపాం సతత మభివన్దే త్రిపథగామ్॥

—వేదమాతృస్తవః.

## ఛందస్సులు - కోశప్రసిద్ధి :-

సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు – అని వేదము స్థూలముగ నాల్గు భాగములతో నొప్పుచుండును. ఇందు సంహితా భాగమునకు మంత్రభాగ మని పేరు. బ్రాహ్మణ –ఆరణ్యక – ఉపనిషత్ భాగములు మూడింటికివి గలిపి సమష్టిగ బ్రాహ్మణభాగ మనియు వ్యవహారము. కాగా వేదము మంత్రబ్రాహ్మణాత్మకము. మంత్రబ్రాహ్మణాత్మకమగు శబ్దరాశికి 'ఛందః' అనియు నామము ప్రసిద్ధము.

'ఛందో బ్రహ్మ శ్రుతి ర్వేదః' —వైజయన్తీ.

'స్వాధ్యాయః శ్రుతి రామ్నాయ శ్ఛందో వేదః'

—అభిధానచింతామణి.

'ఛందః పద్యే చ వేదే చ స్వైరచారాభిలాషయోః'

—విశ్వః; మేదినీ.

'ఛందాంసి త్రిషుబాదీని శ్రుతిర్బానునయా అపి'

—నానార్థరత్నమాలా.

మంత్రబ్రాహ్మణాత్మకమైన శ్రుతికి 'ఛందః' అను వ్యవహారము ప్రసిద్ధమైనట్లు పై కోశముల వలన దెలియును. ఇంతే కాదు. నియతాక్షర పాద-వ్యవస్థారూపము లగు గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, త్రిష్టుప్ - మున్నగు వానికిని ఛందస్సులని పేరు.

## ఛందస్సులు - నాగేశభట్టువాదము :-

"మంత్రబ్రాహ్మణాత్మక శబ్దరాశికి బ్రహ్మ, శ్రుతి, స్వాధ్యాయ, ఆమ్నాయ, వేద-ఇత్యాది నామములు చెల్లును గాని 'ఛందః' అను నామము చెల్లదు; గాయత్ర్యాది ఛందోబద్ధమంత్రములే ఛందస్సులు; బ్రాహ్మణములు ఛందోబద్ధములు గానందున ఛందస్సులు కావు; ఏలయన-

"ఛందో బ్రాహ్మణాని చ తద్విషయాణి" —పా.సూ. 4-2-66.

"ఛందఃపదేన గాయత్ర్యాది ఛందోయుత మంత్రాణా మేవ గ్రహణ మితి బ్రాహ్మణాగ్రహణమ్। జుష్టార్పితే ఛందసి త్యత్ర బ్రాహ్మణే లక్షణా। నిత్యం మంత్రే ఇత్యుత్తరసూత్రే మంత్రగ్రహణాత్" —నాగేశభట్టః - లఘుశబ్దేందుశేఖరః

పై ప్రాణిని సూత్రమున ఛందః - బ్రాహ్మణ పదములు రెండును నిర్దేశింపబడినవి ; ఛందః పదమునకు 'మంత్రబ్రాహ్మణాత్మక వేదము' -అను నర్థమే యున్నచో నొక ఛందః పదము నుపయోగించిన జాలును : మఱల 'బ్రాహ్మణ' పద నిర్దేశమేల ? అట్లు నిర్దేశము చేయుట వలన ఛందః పదము మంత్రభాగమునే బోధించుననుగాని బ్రాహ్మణమును బోధింప దనుట సూత్రకారాభిమతము; కాని కొన్ని యెడల ఛందఃపదము ముఖ్యార్థమగు 'మంత్రము, అను నర్థమును విడిచి 'బ్రాహ్మణము' అను నర్థమును గూడ జెప్పవచ్చును; ఉదా :—

"జుష్టార్పితే ఛందసి; నిత్యం మంత్రే" (6-1-209, 210).

ఇవి రెండును పాణిని సూత్రములు ; సూత్రములో లేని పదములు పై సూత్రముల నుండి యనువృత్తి రావచ్చును. ఇట పై సూత్రములలో మొదటి సూత్రము నుండి ఛందః పదము రెండవ సూత్రము లోనికి యనువృత్తి రావచ్చును. ఆ పదము 'మంత్రము' అను నర్థమును బోధించుచునే యున్నది గదా ! మరల రెండవ సూత్రములో 'మంత్రే' యను పదమేల ? కాని కన్పట్టుచున్నది. అందుచే బూర్వసూత్రము లోని ఛందః పదము 'మంత్రము' అను ముఖ్యార్థమును విడిచి లక్షణావృత్తిచే బ్రాహ్మణ మను నర్థమును జెప్పును - అని యర్థము. కాన ఛందోబద్ధ మంత్రములకే ఛందస్త్వము -అను నర్థము పాణిని కభిమతము ; ఇంతే కాదు ;

'యథాసంఖ్య మనుదేశః సమానామ్' —పా. సూ. 1-3-10.

అను సూత్రమునకు గల మహాభాష్యము నందలి 'అధీయాన విదుషో శ్ఛందో బ్రాహ్మణాని' - అను వార్తికము నందలి ఛందఃపదమునకు గూడ నర్థము నిట్లే తన యుద్యోత వ్యాఖ్యానమున నాగేశు డిట్లు వివరించినాడు;

'వస్తుతః గాయత్ర్యాది ఛందోబద్ధేషు మంత్రేష్వేవ ఛందస్త్వ మితి బోధయితుం తత్ర బ్రాహ్మణగ్రహణమ్ ।"

"బ్రాహ్మణానా మచ్ఛందస్త్వాత్ సూత్రే పృథగ్గ్రహణమ్"

—4-2-66,

పై ప్రమాణముల ననుసరించి 'ఛందోబద్ధమంత్రములకే ఛందస్త్వము'- అని నాగేశాభిమతముగ గన్పట్టును. ఈ వాదమునందలి సామంజస్యము బరిశీలింప వలసి యున్నది.

'అనియతాక్షరపాదాని యజూగ్ంషి భవన్తి' - అని సంప్రదాయము. దీని ననుసరించి యజుస్సులకు నక్షర-పాద- నియమము లేదు. ఛందోనిబంధన నియమము లేదని యర్థము. ఛందోబద్ధములు కానందున మంత్రభాగాత్మకములగు యజుస్సులకును ఛందస్త్వము లేదనవలసి వచ్చును గదా! అట్లుగాక పింగళ నాగ వైదికచ్ఛందఃసూత్రము ననుసరించి ఏకాక్షరాది యజుస్సులకు గూడ ఛందోని యమ మున్నదని కొందఱు చెప్పుదురు.

"ఛందః గాయత్రీ దైవ్యేకమ్" —పింగళఛందఃసూత్రము.

కావుననే ఏకాక్షరమగు ప్రణవము గూడ "ఓమితి ప్రతిపద్యతే ఏతద్వై యజుః (తై.ఆ. 2-11)' అను శ్రుతిప్రామాణ్యముచే యజూరూపము: దైవీగాయత్రీ ఛందోబద్ధము - అని చెప్పుదురు.

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ। అగ్ని ర్దేవతా బ్రహ్మ ఇత్యార్షమ్।
గాయత్రం ఛందం పరమాత్మం సరూపమ్" —తై.నా. 19-33.

అను శ్రుతియు ప్రణవము గాయత్రీఛందోబద్ధమని నిర్దేశించు చున్నది. దీనివలన ఏకాక్షర ద్వ్యక్షరాత్మకము లగు యజుస్సులకు గాయత్ర్యాదుల కంటె విలక్షణమైన ఛందస్సులు గలవని తెలియుచున్నది. 'ఏకపదా గాయత్రీ; ద్విపదా విరాడ్గాయత్రీ; మధ్యేజ్యోతి త్రిష్టుప్; ఏకపదా

త్రిష్టుప్; త్రిపదా త్రిష్టుప్' - అని యీ రీతిగ నిబంధనకారులు యజుస్సులకు గం ఛందోనామముల నా యా మంత్రముల కడ నిర్దేశించి యున్నారు. అయితే కాత్యాయన సర్వానుక్రమసూత్రము అనియతాక్షరరూపము లగు యజుస్సులకు కొన్నింటికే ఛందోనియమము కలదు గాని యన్నిటికి లేదని చెప్పుచున్నది.

"యజుషా మనియతాక్షరత్వా దేకేషాం ఛందో న విద్యతే"

—కాత్యా. సర్వ. సూ.

ఈ విషయమునే వాజసనేయసంహితాభాష్యకర్తలగు ఉవట, మహీధరు లిరువురు నిట్లు వివరించిరి.

"తత్ర యజుషాం కేచిత్ పైశేషికం ఛంద ఇచ్ఛన్తి పింగల పరిపఠితం దైవ్యేక మిత్యాదినేతి। తత్ర ఇషేత్వా-ద్విపదో మంత్రః త్ర్యక్షరత్వాత్ దేవ్యనుష్టుప్। శ్రుత్యా శాఖాచ్ఛేదే వినియుక్తః" —ఉవటః.

"తత్ర యజుర్వేదమన్త్రేషు కానిచి ద్యజూంషి, కాశ్చన ఋచః। తత్ర ఋచాం నియతాక్షర పాదావసానానా మావశ్యకం ఛందః కాత్యాయనేనోక్తమ్। యజుషాం షడుత్తరశతాక్షరావసానానా మేకాక్షరాదీనాం పింగలేన దైవ్యేక మిత్యాదినోక్తం ఛందో బోద్ధవ్యమ్। తదధికానాం తు హోతా యక్ష ద్వనస్పతి మభిహి (వా.సం. 21—46)- ఇత్యాదీనాం నాస్తి ఛందః కల్పనా।" —మహీధరః.

యజుర్వేదమంత్రములలో గొన్ని యజుస్సులు; కొన్ని ఋక్కులు. ఋక్కులు నియతాక్షర పాదావసానము గలవి. వీనికి గల గాయత్ర్యాది ఛందస్సులు కాత్యాయనునిచే వివరింపబడినవి. యజుస్సులకు 'దేవ్యేక' మన్ని యీ రీతిగా జెప్ప

బడిన పింగళ ప్రోక్తములగు ఛందస్సులు గ్రహింపనగును. అందును 'హోతా యక్ష ద్వనస్పతి మభిహి' - ఇత్యాది యజుస్సులకు ఛందఃకల్పన లేదు. —అని యర్థము.

దీనివలన యజుస్సులకు ఛందోనియమము లేదను పక్ష మొకటియు, పింగళప్రోక్తఛందోనియమము గలదను పక్షమొకటియున్నట్లు తెలియును. ఛందోనియమ మున్నదని యంగీకరించినను కొన్ని యజుస్సులకు మాత్రమే ఛందఃకల్పన గలదు; అన్నిటికి లేదనియు దెలియుచున్నది. శ్రీ సాయణాచార్యులును తైత్తిరీయసంహితాభాష్యమున యజుస్సులు ఛందోరహితములని చెప్పిరి.[1] మఱల కాణ్వసంహితాభాష్యమున[2] పైన జెప్పిన రెండు సంప్రదాయములు గలవని వివరించిరి. పై రెండు సంప్రదాయములలో యజుస్సులకు ఛందోనియమము లేదను సంప్రదాయము ననుసరించినచో, ఛందోబద్ధములు కాకపోవుటచే యజుస్సులు ఛందస్సులు కాకపోవలసి వచ్చును. రెండవ సంప్రదాయము ననుసరించినను 'హోతా

---

1. "యది కామయేత ఛందాగ్ంసి యజ్ఞయశసే నార్పయేయ మిత్యృచ మంతమాం కుర్యా చ్ఛందాగ్ంస్యేవ యజ్ఞయశసేనార్పయతి యది కామయేత యజమానం యజ్ఞయశసేనార్పయేయ మితి యజు రంతమం కుర్యాత్. ఛందోబద్ధాయా ఋచ స్త్వంతిమత్వే యజ్ఞఫలం ఛందస్సు గచ్ఛేత్ యజుషస్తు ఛందోరహితత్వేన యజ్ఞఫలం ఛందోగామి న భవతి; కింతు యజమానగామ్యేవ భవతి"

—సా.భా. తై.సం. 1-1-1 1; 5-1-1-3.

2. "ఛందస్తు మంత్రాణాం ఇషేత్వాదీనా మనియతాక్షరత్వా న్నాస్త్యేవ। యే తు యజుషా మపి ఛంద ఇచ్ఛన్తి తైః కాత్యాయనోక్త సర్వానుక్రమణికాయాం పంచమాధ్యాయ మభ్యస్య తద్ద్వారేణ తత్ర న్మంత్రచ్ఛందోఽనుసంధేయమ్॥"

—సా.భా. కాణ్వసంహితా. భాష్యభూమికా.

యష ద్వనస్పతి మభిహి' - ఇత్యాది యజుస్సులు, ఛందఃకల్పన లేదు గాన, ఛందస్సులు కాకపోవలసి వచ్చును. కాని పై నాగేశవచనముల ననుసరించి 'మంత్ర ములు ఛందస్సులు - బ్రాహ్మణములు కావు' - అనియే తెలియును. కాన యజు స్సులకు ఛందిస్త్వము నాగేశు డంగీకరించినట్లే యగుచున్నది. అట్టియెడ 'ఛందో బద్ధము లగుటచే మంత్రములు ఛందస్సులు' - అనెడి నాగేశుడు చెప్పినలక్షణము పై రెండు సంప్రదాయముల ననుసరించియు యజుస్సుల కుపపన్న మగుట లేదు.

మఱియు 'ఛందోబద్ధము కాకపోవుటచే బ్రాహ్మణభాగమునకు ఛంద స్త్వము లేదు' — అను నాగేశవాక్యము కూడ నుపపన్నము కాదు. కొన్ని యజు స్సులు పింగలప్రోక్త ఛందోబద్ధము లయినట్లు, కొన్ని బ్రాహ్మణ భాగములు గూడ ఛందోబద్ధము లగు నని తెలియుచున్నది. శతాక్షర, షణ్ణవత్య క్షరాత్మకములగు ఛందస్సులకు నుదాహృతులుగ పింగలఛందః శాస్త్రమున కొన్ని బ్రాహ్మణగ్రంథ భాగములు పేర్కొనబడుట యిందుకు తార్కాణము.[1] కాన 'ఛందోబద్ధము గానందున బ్రాహ్మణగ్రంథభాగమునకు ఛందస్త్వము లేదు' -అనుట సరికాదు. కాగా 'గాయ త్ర్యాది ఛందో బద్ధత్వము ఛందస్త్వము' - అనునది ఆపాతలక్షణమే గాని నిర్దుష్ట లక్షణము గానేరదని స్పష్టమగుచున్నది.

కాని బ్రాహ్మణభాగమునకు గూడ ఛందస్త్వ మున్నచో ఛందో బ్రాహ్మ ణాని చ తద్విషయాణి' -యను పాణిని సూత్రమున 'ఛందః, బ్రాహ్మణాని'— అని రెండు పదముల నిర్దేశించు టేల ? అని యనవచ్చును.

1. శతాక్షరం ఛందః-అభికృతిః ఉదా:— 'దేవో అగ్నిః స్విష్టకృత్। దేవాన్ యక్ష ద్యథాయథమ్ । హోతారా విన్ద్ర మశ్వినా । వాచా వాచం సరస్వతీం .... ....ఊర్జ మపచితిం స్వధామ్ —తై.బ్రా. 2-6-14-1.

షణ్ణవత్యక్షరం ఛందః . సంస్కృతిః. ఉదా :— దేవో అగ్నిః స్విష్టకృత్ సుద్రవిణా మంద్రః కవిః....వసువనే వసుధేయస్య నమోవాకే వీహి.

—తై.బ్రా. 3-6-14-1.

పాణిని మహర్షి పెక్కు సూత్రములందు ఛందఃపదమును మంత్ర బ్రాహ్మణాత్మక వేదపర్యాయపదముగ ప్రయోగించినాడు. ఉదా :-

'ఛందసి పునర్వస్వో రేకవచనమ్' —పా.సూ. 1-2-61.

"వ్వయో రేకవచనం వా స్యాత్। పునర్వసు ర్నక్షత్రం
పునర్వసూ వా లోకే తు ద్వివచన మేవ' —సిద్ధాంతకౌముదీ.

పునర్వసునక్షత్రములు రెండు. అయినను ఛందస్సునందు పునర్వసు శబ్దమునకు ద్వివచనము వికల్పముగా వచ్చును. పునర్వసుః, పునర్వసూ లోకము నందు ద్వివచనమే - అని యర్థము.

ఇట ఛందస్సు కంటె భిన్నమైన లోకము (లౌకికసంస్కృతము) నందు ద్వివచనము నిత్యము-అని వివరింపబడినది. వ్యాఖ్యాత లందఱితోపాటు నాగేశుడు కూడ నిట్లే వివరించినాడు. లోకముకంటె ఛందస్సు భిన్నమైనదని యనుటచే నిట ఛందః పదము మంత్రబ్రాహ్మణాత్మక వేదమునకు మొత్తమునకు వాచక మగు

ద్వానవత్యక్షరం ఛందః - వికృతిః ఉదా ;—'ఇమే సోమాః సురామాణః ఛాగైర్నమేషైర్ ఋషభైః సుతాః....పిబన్తు మదన్తు వియన్తు సోమమ్'
—తై. బ్రా. 2-6-11.

ఇట్లు బ్రాహ్మణభాగములే గాక అరణ్యక భాగమునగూడ ఛందస్సుల కుదాహరణలు గలవు.

అష్టాశీత్యక్షరం ఛందః - ఆకృతిః ఉదా :—'తచ్చక్షు ర్దేవహితం పురస్తా చ్ఛుక్ర ముచ్చరత్....జ్యోక్ చ సూర్యం దృశే'—తై.ఆ. 4-42-2'.

చతురశీత్యక్షరం ఛందః - ప్రకృతిః. ఉదా:—అగ్నిశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః....సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా'

తై.ఆ. 10-24.

చున్నది. అట్లు గాక పై నాగేశ వాక్యము ననుసరించి బ్రాహ్మణభాగమునకు ఛందస్త్వము లేనిచో ఛందోభిన్నము లోకమే కాక, బ్రాహ్మణభాగము కూడ కావలెను. అట్లగుట పైన చెప్పినట్లు భాష్యకారాద్యభిమతము కాదు. ఇట నాగేశుడు నట్లు వివరింపలేదు. ఇంతే కాదు-ఇట్లే.

"షష్ఠీ యుక్తశ్ఛందసి వా" - పా.సూ. 1-4-8.

"వా ఛందసి సర్వే విధయో భవన్తి" —మహాభాష్య.

ఇత్యాది స్థలములయందును ఛందః పదము లోకభిన్నమగు మంత్రబ్రాహ్మణాత్మక వేదసామాన్యపరముగనే గ్రహింపబడినది. కాన నీ దృష్టితోనే 'ఛందో బ్రాహ్మణాని చ తద్విషయాణి' అను పై సూత్రమును గూడ బరిశీలించినచో ఛందః పదము సామాన్యవాచకము, బ్రాహ్మణ పదము విశేషవాచకము నని గ్రహింపవలసి యుండును. సామాన్యవిశేషవాచక పదములు రెండును నొకచో బ్రయోగింపబడినపుడువిశేషముకంటె వ్యతిరిక్తమగు నర్థమునే సామాన్యవాచకము బోధించుట సంప్రదాయము.

"విశేషవాచక పదసన్నిధానే సామాన్యవాచక పదానాం

తద్విశేషాతిరిక్త పరత్వమ్"

'విప్రులు వచ్చిరి; వసిష్ఠుడును వచ్చెను' - ఇట వసిష్ఠుడును విప్రుడే. అందుచే నిట విప్రపదము సామాన్యవాచకము. వసిష్ఠపదము విశేష వాచకము. వసిష్ఠుని కంటె భిన్నులగు విప్రులు వచ్చిరనియే యిందలి మొదటి వాక్యమున కర్థము. ఈ న్యాయము ననుసరించి పై సూత్రమున సామాన్యవాచకమగు ఛందః పదమును బ్రాహ్మణభాగవ్యతిరిక్త వేదవాచకముగనే గ్రహించుట యుక్తము. కైయటుడును మహాభాష్య వ్యాఖ్యయగు ప్రదీపమున నిట్లే వ్యాఖ్యానించినాడు.

"గోబలీవర్దన్యాయేన ఛందఃపదేన బ్రాహ్మణానాం గ్రహణమ్।

యథా జుష్టార్పితే చ ఛందసీతి బ్రాహ్మణానాం గ్రహణం,

నిత్యం మంత్ర ఇతి మంత్రగ్రహణాత్" —ప్రదీపః. 1-3-10.

కాన నాగేశప్రోక్త మగు 'గాయత్ర్యాది ఛందోబద్ధత్వము ఛందస్త్వము'-అపాతలక్షణమే యగును. గాయత్ర్యాది ఛందోబద్ధమైనను, కాకపోయినను, మంత్ర బ్రాహ్మణాత్మక వేదరాశి కంతటికిని ఛందస్సు అను వ్యవహారము గలదనుట స్పష్టము. కోశప్రసిద్ధియు నట్లే గలదు.

'ఇక బ్రాహ్మణములకు వేదత్వమే లేదు'-అనెడి శ్రీదయానందాదుల వాదము గూడ నిట బరిశీలింప దగియున్నది. ఆ వాదముల గూడ బరిశీలించిన పిదప ఛందః స్వరూపమును దర్శింతము.

## బ్రాహ్మణములకు వేదసంజ్ఞ - శ్రీ దయానందాదుల యాక్షేపము :-

"వేద మను సంజ్ఞ మంత్రభాగరూపసంహితకే; బ్రాహ్మణమునకు గాదు; కాని 'మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయమ్' - అను కాత్యాయన వచనము ననుసరించి బ్రాహ్మణభాగమునకు గూడ వేద మను సంజ్ఞ గలదని చెప్పబడు చున్నది. అట్లు చెప్పుట తగదు. ఏలయన :— (1) బ్రాహ్మణములకు పురాణేతిహాస మని సంజ్ఞ ప్రసిద్ధము; వేద మని కాదు. (2) బ్రాహ్మణములు మంత్ర వ్యాఖ్యానరూపములు; వ్యాఖ్యానేము లగుటచే మూలగ్రంథమగు మంత్రభాగము కంటె నర్వాచీనము లనుట యుక్తము. (3) మంత్రభాగము వలె బ్రాహ్మణములు ఈశ్వరప్రోక్తములు; కాన పురుషబుద్ధిరచితములు (4) కాత్యాయనుడు కాక మిగిలిన ఋషు లెవ్వరును బ్రాహ్మణములకు వేదసంజ్ఞ నంగీకరింప లేదు" -అని శ్రీదయానందుల వాదము.[1]

---

1. "అథ కోఽయం వేదో నామ? మంత్రభాగసంహితే త్యాహ। కించ మంత్ర బ్రాహ్మణయో ర్వేదనామధేయ మితి కాత్యాయనోక్తే ర్బ్రాహ్మణ భాగస్యాపి వేదసంజ్ఞా కుతో న స్వీక్రియత ఇతి। మైవం వాచ్యమ్। న బ్రాహ్మణానాంవేదసంజ్ఞా భవితు మర్హతి। కుతః ? పురాణేతిహాస సంజ్ఞకత్వాత్, వేదవ్యాఖ్యానాత్ ఋషిభి రుక్తత్వాత్, అనీశ్వరోక్తత్వాత్ కాత్యాయనభిన్నైః ఋషిభి ర్వేదసంజ్ఞాయా మస్వీకృతత్వాత్, బుద్ధిరచితత్వాచ్చేతి-"

—దయానంద ఋగ్వేదాదిభాష్యభూమికా.పుట. పుట. 80.

## దయానందుల యాక్షేపమునకు సమాధానము :-

పై వాదము నందలి సామంజస్యమును జూతము. బ్రాహ్మణములకు 'పురాణము; ఇతిహాసము' — అనియే కాని వేద మను సంజ్ఞ ప్రసిద్ధము కాదు; కాత్యాయనుడు కాక మిగిలిన ఋషు లెవ్వరును బ్రాహ్మణములకు వేదసంజ్ఞ నంగీకరింపలేదు—అని శ్రీదయానందులు చెప్పిరి. ఇట్లనుట సరి కాదు. ఏలయన కోశములు, వ్యాకరణ, న్యాయ, వైశేషిక, పూర్వోత్తరమీమాంసాదర్శనములు మున్నగువానియందు బ్రాహ్మణములు వేదభాగములుగ నిర్దేశింపబడినవి.

## కోశప్రసిద్ధి :-

"బ్రాహ్మణం బ్రహ్మసంఘాతే వేదభాగే నపుంసకమ్।
భూమిదేవే తు పుంలింగః" -మేదినీ.

"వేదే బ్రాహ్మణం పుంసి తు ద్విజే" -నానార్థరత్నమాలా.

"అథ బ్రాహ్మణో ద్విజే।
అత్మక్ష్మేక్లీ తు విధివ ద్వేదభాగ తదంశయోః" -వైజయంతీ.

"ప్రపాఠక స్త్వాహ్నికోఽథో అనువాకశ్చ ఖండికా ।
బ్రాహ్మణం చే త్యవచ్ఛేదాః" -వైజయంతీ.

ఇట్లు కోశములందు బ్రాహ్మణములు వేదభాగములుగ నిర్దేశింపబడినవి, ఇట వైజయంతీకోశము బ్రాహ్మణమును వేదభాగ మని నిర్దేశించుటయే కాక, వేదైకదేశవాచకము లగు ప్రపాఠక, ఆహ్నిక, అనువాక, ఖండికాశబ్దములకోపాటు

బ్రాహ్మణ శబ్దమును గూడా పేర్కొనినది. అందుచే ననువాకాది శబ్దముల వలెనే బ్రాహ్మణ శబ్దము గూడ వేదైకదేశవాచక మనియు దెలియును. ఇక దర్శనకారుల దృష్టిలో వేదస్వరూపమును జూతము.

## పూర్వమీమాంసాదర్శనము-ప్రసిది :-

"తచోదకేషు మంత్రాఖ్యా। శేషే బ్రాహ్మణ శబ్దః"
—జై. సూ. 2-6-32, 33.

ఇట మొదట మంత్రలక్షణము పేర్కొనబడినది. పిదప 'శేషే బ్రాహ్మణ శబ్దః' - అని బ్రాహ్మణ లక్షణము చెప్పబడినది. కాన మంత్రశేషభాగము బ్రాహ్మణ మని యర్థము. శేష మనగా మొదట గ్రహింపబడిన సముదాయములో మిగిలిన ఏకదేశము, ఇట మొదట గ్రహింపబడిన సముదాయము వేదము. అందు మంత్రభాగము పోగా మిగిలిన బ్రాహ్మణభాగము మంత్ర శేష శబ్దము నింకొక చోట గూడ జైమిని మహర్షి ప్రయోగించుటయు గుర్తింప దగినది

"తేషాం ఋక్ యత్రార్థవశేన పాదవ్యవస్థా గీతిషు
సామాఖ్యా। శేషే యజుః శబ్దః॥ —జై.సూ. 2-35-36-37:

మంత్రములు మూడు విధములు. అందు యర్థానుసారముగ పాదవ్యవస్థతో నొప్పు మంత్రము ఋక్కు; గాన యుక్తము సామము; మిగిలినది (శేషః) యజుస్సు - అని యర్థము." ఇచట గూడ మంత్రములలో గొన్ని సామలు - అని వాని లక్షణముల జెప్పి పిదప మిగిలినవి యజుస్సు లని చెప్పబడినవి. అట్లు మిగిలిన యజుస్సులు మంత్రములే యగును. కాని వేఱు కావు. అట్లే వేదసముదాయములో నొక భాగము మంత్రమని చెప్పి, మిగిలినది బ్రాహ్మణ మనుటచే

నదియు వేదైక దేశమే యగును; వేదభిన్నము కాదు. కాన బ్రాహ్మణభాగమునకు వేదసంజ్ఞ జైమినిమహర్షిసంమతము. శ్రీ శబరస్వామియు పై సూత్రము నిట్లు వ్యాఖ్యానించినాడు.

"అథ కిం లక్షణం బ్రాహ్మణమ్ ? మంత్రాశ్చ బ్రాహ్మణం చ వేదః। తత్ర మంత్రలక్షణే ఉక్తే పరిశేషసిద్ధత్వాత్ బ్రాహ్మణ లక్షణ మవచనీయమ్ । మంత్రలక్షణవచనేనైవ సిద్ధమ్। యస్యైతల్లక్షణం న భవతి తద్ బ్రాహ్మణ మితి పరిశేషసిద్ధం బ్రాహ్మణమ్।"

## వ్యాకరణదర్శనము-ప్రసిద్ధి :-

పాణినిమహర్షి పెక్కుచోట్ల 'ఛందసి, ఛందసి' యనుచు ఛందః పదముచే మంత్రబ్రాహ్మణాత్మక వేదసముదాయమును గ్రహించుటయు, ఛందోభిన్నమును 'భాషాయామ్' అని వ్యవహరించుటయు, వ్యాఖ్యాతలు నట్లే వివరించుటయు బైన వివరింపబడినది. మహాభాష్యకారుడు నెడనెడ శ్రుతివాక్యములనుచు నా యా బ్రాహ్మణవాక్యముల నుదహరించుటయు గమనింపదగినది.

"తేఽసురాః' – 'తేఽసురా హేలయో హేలయ ఇతి కుర్వన్తః పరా బభూవుః। తస్మా ద్బ్రాహ్మణేన న మ్లేచ్ఛితవై నాఽపభాషితవై, మ్లేచ్ఛో హ వా ఏష యదపశబ్దః (శ. బ్రా. 3–1–5–24), మ్లేచ్ఛా మా భూమే త్యధ్యేయం వ్యాకరణమ్॥" ——పస్పశాహ్నిక.

ఇట్లెన్నియేని యుదాహరణముల నీయవచ్చును. అదియును గాక పాణి యనీ సూత్రములందలి ఛందఃశబ్దము యొక్క అర్థము నెట్లు దర్శింపవలసినదియు

కాశికావృత్తియందును, తద్వ్యాఖ్యానములగు పదమంజరీ - న్యాసములయందును నిట్లు వివరింపబడినది.

"ఛందో నామ్ని చ" — పా. సూ. 3-3-34.

"వృత్త మత్ర ఛందో గృహ్యతే, యస్య గాయత్ర్యాదయో విశేషాః, న మంత్రబ్రాహ్మణమ్; నామగ్రహణాత్"

—కాశికావృత్తి.

"న మంత్రబ్రాహ్మణ మితి 'బహులం ఛందసి' -ఇత్యాదౌ యద్యపి తేషా మేవ గ్రహణం ప్రసిద్ధమ్। తథాపీహ తేషాం గ్రహణం న భవతి। కుతః ఇత్యాహ - నామగ్రహణాదితి'

—పదమంజరీ.

"ఛందః శబ్దోఽయ మస్త్యేవ మంత్రబ్రాహ్మణే। అస్త్యన్య దక్షరాణా మియత్తావిశిష్టవృత్తే యస్య గాయత్ర్యాదయో విశేషాః। తదిహ కతర స్తదర్థో గృహ్యతే....యద్యత్ర మంత్రబ్రాహ్మణ మిష్టం స్యాత్ నామగ్రహణం న కుర్యాత్, ఛందసీత్యేవ బ్రూయాత్। ఏవ మపి హ్యుచ్య మానే మంత్రబ్రాహ్మణగ్రహణం లభ్యత ఏవ, యథా 'బహులం ఛందసి ఇత్యాదౌ వాక్యే। తస్మా న్నామ గ్రహణా ద్వృత్త మిహ చ్ఛందో గృహ్యతే" -న్యాసః.

ఛందఃశబ్దమునకు రెండర్థములు గలవు. 1. మంత్రబ్రాహ్మణాత్మక వేదరాశి, 2. అక్షరసంఖ్యానియమము గల గాయత్ర్యాది వృత్తములు. పై సూత్రమునందలి ఛందఃశబ్దముచే నే యర్థమును గ్రహించుట యుక్తము? బహులం ఛందసి ఇత్యాది సూత్రములందు ఛందఃపదముచే మంత్రబ్రాహ్మణాత్మక వేదభాగము

గ్రహింపబడుచునే యున్నది. ఇచట గూడ మంత్రబ్రాహ్మణములనే గ్రహించుట యభిమతమైనచో మిగిలిన సూత్రములయందు వలెనే 'ఛందసి' యని నిర్దేశించిన జాలును. 'నామ్ని' యని యధికముగ నామపదనిర్దేశ మెందుకు? నామపదగ్రహణముచే నిట వృత్తమునే గ్రహింపవలెను; మంత్రబ్రాహ్మణముల గాదు - అని యర్థము. దీని ననుసరించి నామనిర్దేశము లేకుండ నష్టాధ్యాయి యందు ఛందఃపదమెచట నిర్దేశింపబడినను నది మంత్రబ్రాహ్మణాత్మక వేదభాగవాచక మగుట పాణిన్యాదిసంమత మని తెలియును.

## న్యాయదర్శనము - ప్రసిద్ధి :-

"తదప్రామాణ్య మనృతవ్యాఘాత పునరుక్త దోషేభ్యః"

—న్యాయదర్శనమ్. 2-1-57.

ఇది వేదములు ప్రమాణములు గావని శంకించెడి పూర్వపక్షసూత్రము. 'అనృతవ్యాఘాత (పరస్పరవిరోధ) - పునరుక్తిదోషములతో నిండియుండుటచే వేదము (తత్) ప్రమాణము గాదు' - అని యిట్లు పూర్వపక్షము చేసి, వానికి తగిన సమాధానములు తరువాతి సూత్రములలో జెప్పబడినవి. వాని తర్వాత గల యీ క్రింది సూత్రముల జూతము.

'వాక్యవిభాగస్య చార్థగ్రహణాత్' -న్యా. సూ. 2-1-61.

"విధ్యర్థవాదానువచన వినియోగాత్. -న్యా.సూ. 2-1-62.

"విధి ర్విధాయకః" -న్యా. సూ. 2-1-63.

'ప్రమాణం శబ్దో యథా లోకే । త్రిధా ఖలు బ్రాహ్మణ వాక్యాని వినియుక్తాని । విధివచనాని, అర్థవాదవచనాని,

అనువాదవచనానీతి । యద్వాక్యం విధాయకం చోదకం స
విధిః । విధిస్తు నియోగోఽనుజ్ఞా వా । యథా-అగ్ని
హోత్రం జుహుయాత్ స్వర్గకామ ఇత్యాది .... ...."

-వాత్స్యాయనభాష్యమ్.

లోకమున ప్రత్యక్షానుమానముల వలె శబ్దము గూడ ప్రమాణము. వేదము ఆప్తవాక్యరూపము. కాన ప్రమాణము. అట్టి వేదరూప బ్రాహ్మణ వాక్యములు మూడు విధములు. 1. విధివాక్యములు. 2. అర్థవాదవాక్యములు. 3. అనువాదవాక్యములు. విధాయకవాక్యములకు చోదకము లని పేరు. విధి యన నియోగము, లేక యనుజ్ఞ. ఉదా :- అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః మొదలగునవి - అని యర్థము.

ఇట మొదట 'తదప్రామాణ్యం' అను సూత్రమున 'తత్' శబ్దముచే వేదమును బరామర్శించి, ఆ వేదమునకు అప్రామాణ్యశంక జేయబడినది. పిదప అప్రామాణ్యశంకానిరాసకములైన సిద్ధాంతసూత్రముల జెప్పు ప్రకరణమున నీ సూత్రములు పఠింపబడినవి. వేదము ప్రమాణ మని పేర్కొని, వేదవాక్యములుగా బ్రాహ్మణవాక్య విభాగమిట జెప్పబడినది. కాన మొదట 'తత్' శబ్దముచేత మంత్ర బ్రాహ్మణాత్మక వేదరాశినే గౌతమ మహర్షి పరామర్శించె ననుట స్పష్టము. ఈ విషయమును పై సూత్రవృత్తి యందు విశ్వనాథపంచాననుడు నిట్లు వివరించినాడు.

"మంత్రబ్రాహ్మణభేదాత్ ద్వివిధో వేదః। తత్ర బ్రాహ్మణ
స్యాఽయం విభాగః, -విధివచనత్వేన, అర్థవాదవచనత్వేన,
అనువాదవచనత్వేన చ వేదస్య వినియోగాత్ విభజనాత్"

-న్యా. సూ వృత్తి.

కాన న్యాయదర్శనకారుల ననుసరించి వేదము మంత్రబ్రాహ్మణాత్మక మగుట స్పష్టము.

# వైశేషికప్రదర్శనము - ప్రసిద్ధి :-

"బుద్ధిపూర్వా వాక్యకృతి ర్వేదే" -వై. శే. సూ. 6-1-1.

"వేదవాక్యాని బుద్ధిమత్కర్తృకాని, ప్రమాణవాక్యత్వాత్,
లౌకిక ప్రమాణవాక్యవత్" "వేదః ప్రమాణం మహాజన
పరిగృహీతత్వాత్" -రసాయనవ్యాఖ్య.

మహాజనులు (శిష్టజనులు) ఆదరించుట జేసి వేదము ప్రమాణము. ఆప్త వాక్యములు - వివేకవంతులగు పురుషులచే లోకహితము గోరి యుచ్చరింపబడిన వాక్యములు - ప్రమాణములు: అట్లే ప్రమాణభూతములగు నీ వేదవాక్యములు గూడ నొక సర్వజ్ఞునిచే లోకహితమునకై యుచ్చరింపబడి యుండవలెను. దృష్టాదృష్టవిషయముల నెఱుగజాలిన సర్వజ్ఞుడు ఈశ్వరుడే యగును గాని అస్మదాదులు కాజాలరు. కాన దృష్టాదృష్టవిషయముల నెక్కింటిని బ్రతిపాదించెడి వేదము ఈశ్వర ప్రోక్త మని యవశ్య మంగీకరింపవలెను - అని పై సూత్ర తాత్పర్యము. ఇట్లు వేదవాక్యమే కాదు, వేదమునందలి ప్రతి యొక పదము యథార్థ జ్ఞానసాధక మగునని తరువాతి సూత్రమున వివరింపబడినది.

"బ్రాహ్మణే సంజ్ఞాకర్మ సిద్ధిలింగమ్" 6-1-2.

"బ్రాహ్మణే మంత్రబ్రాహ్మణాత్మక భాగద్వయరూప
వేదగత బ్రాహ్మణభాగే, సంజ్ఞాకర్మ కర్మణాం కర్మారాధ్య
దేవతానాం చ నామకరణం సిద్ధౌ బుద్ధౌ లింగ మితి"

—రసాయన వ్యాఖ్య.

ఇట్టి యాకారము గలది గోవు; ఇట్టి ఫలమును సాధించెడి క్రియ పాకక్రియ; ఈ ప్రదేశవిశేషమున కిది నామము - అని యా యా గవాది వ్యక్తుల యొక్కయు, ప్రదేశవిశేషముల యొక్కయు స్వరూప, స్వభావ, రహస్యముల సాంగోపాంగముగ నెఱిగినవారిచే మొదట వానివానికి అన్వర్థనామకరణము చేయబడి యుండవలెను. మంత్ర బ్రాహ్మణాత్మకమైన వేదములో నేకదేశమగు బ్రాహ్మణభాగమున బెక్కు కర్మలయొక్కయు, నా యా కర్మలచే నారాధనీయులగు నగ్ని - వాయు, ఇంద్రాది దేవతలయొక్కయు నామములు గన్పట్టుచున్నవి. అట్లే 'ఉద్భిదా యజేత; జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' - అని యీ రీతిగ ఉద్భిద్ - జ్యోతిష్టోమాది కర్మనామధేయములును గలవు. భూః-భువః- సువః ఇత్యాది వివిధ లోకనామములు, తద్విశేషములును వేదమున వర్ణింప బడినవి. మఱియు కర్మాచరణ విషయమున నొక నియమము గూడ నిట్లు గలదు.

> త 'త్తచ్ఛబ్దసంకీర్తన పురఃసరం కృత మేవ కర్మ ఫలతి,
> న తు పర్యాయశబ్దాంతర ప్రయోగే" ——రసాయనవ్యాఖ్య.

వేదోపదిష్టములయిన శబ్దముల నుచ్చరించుచు జేసిననే వేదవిహితకర్మ ఫలవంత మగును. అట్లుగాక పర్యాయశబ్దముల నుచ్చరించి చేసినచో నా కర్మ విఫల మగు నని యర్థము. ఈ నియమము వలన - ఆ యా కర్మల యొక్కయు దేవతలయొక్కయు స్వర్గాదులయొక్కయు నామములు అర్థవంతములు. అవియే వాని వాని స్వరూపస్వభావాదుల దెలియజేయజాలినవి. కాన అపూర్వశక్తిమంతములు. పర్యాయశబ్దము లట్టివి కావు -అని తెలియును. కాన వాని స్వరూపస్వభావాదుల రహస్యమును సమగ్రముగ నెఱిగిన మేధావి యొకడు వానికి నా యా నామధేయముల గూర్చి యుండవలెను. యజ్ఞాదులు, దేవతలు, స్వర్గాదులు, ధర్మాధర్ములు- వీనియొక్క తత్త్వము నెఱిగిన మేధావి పరమేశ్వరుడే యగునుగాని యల్పబుద్ధులగు మానవులు గారు - అని పై సూత్ర తాత్పర్యము. ఈ రెండు సూత్రతాత్పర్యముల బరిశీలించినచో మంత్రభాగము వలెనే బ్రాహ్మణ భాగము గూడ ఈశ్వరప్రోక్త మగు వేదమే-యని పై శేషిక దర్శనప్రవర్తకు డయిన కణాదమహర్షి యభిప్రాయ మగుట స్పష్టము.

# ఉత్తరమీమాంసా దర్శనము - ప్రసిద్ధి :-

వేదము మంత్రబ్రాహ్మణాత్మక సముదాయ మను దృష్టితోనే బాదరాయణ మహర్షిచే ఉత్తరమీమాంసాదర్శనము ప్రవర్తితమైనది. 'శాస్త్రయోనిత్వాత్' ఇత్యాది సూత్రములు నా దృష్టితోనే ప్రవర్తిల్లిన వనుట స్పష్టము. భాష్యకర్తలగు శ్రీ శంకర - రామానుజాదులు గీతా - సూత్ర- ఉపనిషత్ప్రస్థానముల యందు నీ విషయమును బెక్కుచోట్ల వివరించినారు. బ్రాహ్మణ వాక్యములకు గూడ ప్రమాణ భూత శ్రుతివాక్యములుగ నడుగడుగున నుదహరించినారు. శ్రుతి యవతరణమును గూర్చి బృహదారణ్యక శ్రుతియు నిట్లు చెప్పుచున్నది.

"స యథాఽఽర్ద్రైధాగ్నే రభ్యాహితాత్ పృథగ్ధూమా వినిశ్చరన్తి - ఏవం వా అరేఽస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేత దృదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రా ణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానా న్యస్యైవైతాని నిఃశ్వసితాని" -బృ.ఉ.2-4-10.

తడిసిన కట్టెలతో మండెడి యగ్నినుండి నానా ప్రకారములుగ విస్ఫులింగ ములు, పొగలు పైకి లేచునటు (అవిర్భవించునట్లు) ఓ మైత్రేయీ ! ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, ఇతిహాసము (ఊర్వశీ పురూరవ స్సంవాదాది రూపమగు బ్రాహ్మణము). పురాణము (అసద్వా ఇదమగ్ర ఆసీత్- ఇత్యాది సృష్టిపర్యాలోచనారూప మగు బ్రాహ్మణము); విద్య (దేవజనవిద్య- నృత్యగీతాది శాస్త్రరూపమగు బ్రాహ్మణము) ఉపనిషత్తులు, శ్లోకములు (బ్రాహ్మణ ప్రభవా మంత్రాః). సూత్రములు (ఆత్మే త్యేవోపాసీత-ఇత్యాది వస్తుసంగ్రహవాక్య ములు), అనువ్యాఖ్యానములు (మంత్రవివరణములు - లేక వస్తుసంగ్రహవాక్య వివరణములు), వ్యాఖ్యానములు (అర్థవాదములు లేక మంత్రవివరణములు) - అను

నీ రూపముగ వేదములు పరమాత్మనుండి నిఃశ్వాసముల వలె నప్రయత్నముగ నావిర్భవించినవి అని యర్థము.

శ్రీ శంకరభగవత్పాదులు పై శ్రుత్యర్థము నిట్లే వివరించిరి. ఇంతియే కాదు. వేదప్రామాణ్యము నిట్లు వివరించిరి.

"ఏవం అష్టవిధం బ్రాహ్మణమ్ । ఏవం మంత్రబ్రాహ్మణ
యోరేవ గ్రహణమ్। నియతరచనావతో విద్యమానస్యైవ
వేదస్యాభివ్యక్తిః, పురుషనిఃశ్వాసవత్; న చ పురుషబుద్ధి
ప్రయత్న పూర్వకః। అత్ర ప్రమాణం నిరపేక్ష ఏవస్వార్థే।
తస్మా ద్యత్తేనోక్తం తత్తథైవ ప్రతిపత్తవ్యమాత్మనః
శ్రేయ ఇచ్ఛద్భిః జ్ఞానం వా కర్మ వేతి।" -శం భా.

పైన (శ్రుతియందు) జెప్పినట్లుగా బ్రాహ్మణము అష్టవిధము. ఇట నిఃశ్వాసముల వలె పరమేశ్వరుని నుండి మంత్రబ్రాహ్మణములు రెండును అభివ్యక్తము లయిన వని గ్రహింపవలెను. అట్లే నియతవాక్యరచనాస్వరూపము గలిగి నిరంతరము విలసిల్లుచుండు వేదమే యప్రయత్నముగ పరమేశ్వరుని నుండి యభివ్యక్తమయినది. కాన నీ వేదము పురుషబుద్ధి ప్రయత్నపూర్వకము గాదు. పురుషబుద్ధిదోషరహితమై యన్యనిరపేక్షముగ స్వతంత్రమై ప్రమాణ మగును. ప్రమాణభూత మగుటచే శ్రేయస్కాము లగువారు వేదోపదిష్టము గు ధర్మములగాని, జ్ఞానమును గాని యథాతథముగనే గ్రహించుట యుక్తము - అని యర్థము.

పై శ్రుతివాక్యములను, తద్వివరణరూపము లగు శ్రీ శంకరుల వచనములను బరిశీలించినచో, (1) వేదములు మంత్రబ్రాహ్మణాత్మకములు (2) అవి

పరమేశ్వర నిఃశ్వాసరూపములు; (3) పురుషబుద్ధికల్పితములు కావు; కాన స్వతః ప్రమాణములు - అని స్పష్టమగును. ఇంతేగాదు. వేదము మంత్రరూపమున నావిర్భవించుటయే గాక యా మంత్రములందు నిగూఢములైన వివిధార్థముల నుద్దీపింపజేయుటకై పురాణేతిహాసవిద్యాదిరూపములతో నొప్పెడి యష్టవిధ బ్రాహ్మణ రూపమునను నావిర్భవించిన దనియు దెలియును. కాగా 'మంత్రవ్యాఖ్యానరూపము లగుటచే బ్రాహ్మణములు మంత్రము లావిర్భవించిన తర్వాత నెవరిచేతనో రచింపబడియుండు' ననెడి వాదమునకు తావు లేదు. కాని యిట నొక యాక్షేపము.

## ఆక్షేపము :-

"తదేత త్సత్యం మంత్రేషు కర్మాణి కవయో యా న్యపశ్యన్ ।
తాని త్రేతాయాం బహుధా సంతతాని" ——ముండక. ఉ. 1-2-1.

'తదేత త్సత్యం అవితథమ్। కిం తత్ ? మంత్రేషు ఋగ్వేదాద్యాఖ్యేషు, కర్మాణి అగ్నిహోత్రాదీని, మంత్రైరేవ ప్రకాశితాని, కవయః మేధావినో వసిష్ఠాదయః, యాని అపశ్యన్ దృష్టవన్తః, య త్తదేత త్సత్యం ఏకాంతపురుషార్థసాధనత్వాత్ । తాని చ వేదవిహితాని ఋషిదృష్టాని కర్మాణి, త్రేతాయాం త్రయీసంయోగలక్షణాయాం హౌత్రాధ్వర్యవౌద్గాత్రప్రకారాయాం అధికరణభూతాయాం, బహుధా బహుప్రకారం, సంతతాని సంప్రవృత్తాని, కర్మిభిః క్రియమాణాని త్రేతాయాం వా యుగే ప్రాయశః ప్రవృత్తాని"

——శం.భా.

'ఋగ్యజుఃసామరూపమంత్రములచే ప్రకాశితము లయిన యగ్నిహోత్రాది కర్మలను మేధావులగు వసిష్ఠాది కవులు (ఋషులు) దర్శించిరి; అవి పురుషార్థ

సాధకము లగుటచే సత్యములు; వేదవిహితములు ఋషి దృష్టములు నగు నా కర్మలు హౌత్రము, ఆధ్వర్యవము, ఔద్గాత్రము నాధారముజేసికొని బహుప్రకారము లుగ ప్రవృత్తము లయినవి; లేక యా కర్మలు త్రేతాయుగమున ప్రచురములు' అని యర్థము.

పై శ్రుతిని, శంకరభాష్యమును బరిశీలించినచో నీ ప్రశ్న యుదయింప వచ్చును. వేదములు మొదట మంత్రరూపమున నావిర్భవించినవి. పిదప వేద పారగులైన వసిష్ఠాదిమహర్షు లా మంత్రములయందు గల కర్మల దర్శించి తద్వ్యా ఖ్యానరూపమున బ్రాహ్మణభాగముల రచించిరి. కాన బ్రాహ్మణములు పౌరుషేయము లన దగును గదా !

## సమాధానము :-

ఈ యాక్షేపము సరియైనది కాదు. బ్రాహ్మణములు వసిష్ఠాది ఋషి రచితము లనుచో నవియు వసిష్ఠాది ఋషిరచిత స్మృతుల వలె పౌరుషేయములై స్మృతు లనియే వ్యవహరింపబడి యుండెడివి. అట్టియెడ నవి వేదములు కాకపోవలసి వచ్చెడిది. మఱియు బ్రాహ్మణభాగమున విహితములైన కర్మలు స్మృత్యుక్త కర్మలవలె వేదమూలములు గావచ్చును గాని వేదవిహితములు కాకపోవలసి వచ్చును. అట్లు చెప్పుచో 'వేదవిహితాని ఋషిదృష్టాని కర్మాణి' (ఋషి దృష్టములగు వేదవిహిత కర్మలు)'అను పై శంకరభగవత్పాద వాక్యముతో విరోధము సంభవించును. కాన బ్రాహ్మణభాగమందు విహితములగు కర్మలు వేదవిహితము లగుట శ్రీశంకరభగవత్పాద సంమతము. బ్రాహ్మణభాగము కూడ మంత్రభాగము వలెనే వేదమయి ఋషిదృష్టమైనపుడే బ్రాహ్మణవిహిత కర్మలు వేదవిహితకర్మ లగును. అట్లు బ్రాహ్మణ భాగమును వేద మని యంగీకరించుచో నది వసిష్ఠాది రచిత మనుట పొసగదు. కాన మంత్రభాగము నే వలె

బ్రాహ్మణభాగము కూడ మంత్రద్రష్టలగు కవులచే దర్శింపబడినదనుట యుక్తము. అట్లు చెప్పునపుడే శ్రుతియందలి 'అపశ్యన్' అను క్రియయు సార్థక మగును. (అపశ్యన్ – అనగా దర్శించి రనియేగదా యర్థము.) ఇంతియే కాక మంత్రము లతోపాటు బ్రాహ్మణములు కూడ పరమేశ్వరుని నుండి నిఃశ్వాసముల వలె నప్ర యత్నముగ నభివ్యక్తమైన వనెడి పై బృహదారణ్యకశ్రుతితో సంవాదము గూడ లభించును. ఈ విషయమును ఛాందోగ్యమున గూడ శ్రీ శంకరు లిట్లు వివరించిరి.

"నామ్ని మంత్రా ఏకం భవంతి, మంత్రేషు కర్మాణి"

—ఛాం. ఉ. 7-4-1.

"మంత్రేషు కర్మాణ్యేకం భవంతి। మంత్రప్రకాశితాని కర్మాణి క్రియంతే, నామంత్రక మస్తి కర్మ। యద్ధి మంత్రప్రకాశనేన లబ్ధసత్తాకం సత్ కర్మ బ్రాహ్మణేనేదం కర్తవ్య మస్మై ఫలాయేతి విధీయతే। యాఽప్యుత్పత్తిః బ్రాహ్మణేషు కర్మణాం దృశ్యతే, సాఽపి మంత్రేషు లబ్ధసత్తాకానామేవ కర్మణాం స్పష్టీకరణమ్। న హి మంత్రాప్రకాశితం కర్మ కించిత్ బ్రహ్మణ ఉత్పన్నం దృశ్యతే। త్రయీవిహితం కర్మేతి ప్రసిద్ధం లోకే। త్రయీ శబ్దశ్చ ఋగ్యజుఃసామ సమాఖ్యా। 'మంత్రేషు కర్మాణి కవయో యా న్యపశ్యన్' ఇతి చాఽఽథర్వణే। తస్మాద్ యుక్తం మంత్రేషు కర్మాణ్యేకం భవన్తీతి।" —శం.భా.

కర్మల బ్రకాశింపజేయునవి మంత్రములు. మంత్రప్రకాశిత కర్మలనే 'ఆ యా ఫలము నుద్దేశించి యా యా కర్మను జేయునది'–యని బ్రాహ్మణమువిధించు చున్నది. అనగా మంత్రప్రకాశితమైన యర్థమును బ్రాహ్మణము వివరించుచున్నది. కాన మంత్రప్రకాశితములుగాని కర్మలను బ్రాహ్మణము స్వతంత్రముగా స్వోపజ్ఞముగా విధించుట లేదు, ఇట్లు చెప్పుటచే 'కర్మలు త్రయీవిహితములు' – అనెడి లోక ప్రసిద్ధియు నుపపన్న మగును. 'మంత్రేషు కర్మాణి కవయో యా న్యపశ్యన్'–

అను అథర్వణ శ్రుతియు నిందుకు ప్రమాణము. కాన కర్మలు మంత్రము లందే కీర్తింపబడినవనుట యుక్తమే - యని యర్థము. అనంతరగిరియు పై శాంకర భాష్యము నిట్లు వివరించినాడు.

"బ్రాహ్మణస్య మంత్రవ్యాఖ్యాన రూపత్వాత్ అతిస్పష్ట
మంత్రానుపలంభేఽపి కల్ప్యతే మంత్రోక్తత్వ మితి"

'బ్రాహ్మణము మంత్రవ్యాఖ్యానరూపము' కావున బ్రాహ్మణోక్త కర్మలను ప్రకాశింపజేసెడి మంత్రములు కొన్నియెడల స్పష్టముగ (ప్రస్తుతము) లభింపక పోయినను ఆ కర్మలకును మంత్రోక్తత్వము కలదనియే గ్రహింపవలెను -అని యర్థము. పై విషయముల బరిశీలించుచో వేదమే మంత్రరూపమునను తన్నిగూఢ కర్మప్రకాశక బ్రాహ్మణభాగ రూపమునను నావిర్భవించినదని తెలియును అగుచో మంత్రములందు కర్మలను మొదట దర్శించిన కవులు బ్రాహ్మణములే యని యన దగును. పిదప నా మంత్రబ్రాహ్మణాత్మక వేదరాశియందు వసిష్ఠాది ఋషులు మహాతపఃసమాధిలో కర్మలను దర్శించిరి. అనగా మంత్రబ్రాహ్మణాత్మకమైన వేదరాశిని దర్శించి తద్విహిత కర్మల బ్రవర్తింపజేసిరని తెలియవలెను. కాన 'మంత్రేషు కర్మాణి కవయో యా న్యపశ్యన్' ఇత్యాది స్థలములయందు 'కవులు దర్శించిరి' - అను నర్థమే సరసము; శ్రుతిభాష్యాదిసంమతము నగును గాని 'రచించిరి' - అని కాదు. అందుచే వసిష్ఠాది కవులు బ్రాహ్మణముల రచించి రని చెప్పెడి వాదమునకు తావే లేదు. బ్రాహ్మణశేషములే యారణ్యకములు, ఉప నిషత్తులును కాన నివియు బ్రాహ్మణములే. ఇట్లు బ్రాహ్మణరూపములైన బ్రాహ్మ ణారణ్యకోపనిషత్తులను గూడ అపౌరుషేయము లనియు, స్వతఃప్రమాణము లనియు సూత్రకర్త యగు బాదరాయణ మహర్షియు, మతత్రయ భాష్యకర్తలును శ్రుత్యను గుణముగ గీర్తించియున్నారు.

ఇంతే కాదు. సంహితాభాగముకంటె భిన్నమైన వేదభాగమునకు బ్రాహ్మణ మని సామాన్యముగ బ్రసిద్ధి. అయినను దానిననుసరించి 'బ్రాహ్మణ

మనగా సంహితాభాగము కంటె భిన్నమైనది' - యని లక్షణము చెప్పుట సరికాదు; కొన్నియెడల తైత్తిరీయాది సంహిత యందే బ్రాహ్మణ భాగ ముండుటయు, బ్రాహ్మణ భాగ మని ప్రసిద్ధి గలిగిన వేదభాగము గూడ మంత్రబ్రాహ్మణాత్మక మగుటయు నిందుకు కారణము - అని సోదాహరణముగ సోపపత్తికముగ బ్రహ్మ శబ్దమున వివరింపబడినది. ఉత్తర మీమాంసా దర్శనకారుల యభిప్రాయము నిదిమ.

"బ్రహ్మవిదాప్నోతి పరమ్। తదేషాభ్యుక్తా సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ। యో వేద నిహితం గుహాయామ్ పరమే వ్యోమన్ ।.... అన్యోఽన్తర ఆత్మాఽఽనందమయః" —ఇత్యాది

—తై.ఉ.2.

"మాంత్రవర్ణిక మేవ చ గీయతే" —బ్ర.సూ. 1-1-15.

"ఇత శ్చానందమయః పర ఏవాత్మా, 'యస్మాత్' బ్రహ్మ విదాప్నోతి పర మిత్యుపక్రమ్య 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' - ఇత్యస్మిన్ మంత్రే యత్ ప్రకృతం బ్రహ్మ సత్యజ్ఞానానంతవిశేషణై ర్నిర్ధారితం,....యస్య విజ్ఞానాయ 'అన్యోఽంతర ఆత్మాఽన్యోఽంతర ఆత్మా ఇతి ప్రక్రాంతం, తన్మాంత్రవర్ణిక మేవ బ్రహ్మేహ గీయతే, అన్యోఽంతర ఆత్మాఽనందమయ ఇతి । మంత్ర బ్రాహ్మణయో శ్చైకార్థత్వం యుక్తమ్. అవిరోధాత్ । అన్యథా హి ప్రకృతహానాప్రకృతప్రక్రియే స్యాతామ్ । న చాన్నమయాదిభ్య ఇవానందమయా దన్యోఽంతర ఆత్మాఽభిధీయతే, ఏతన్నిష్ఠైవ చ సైషా భార్గవీ వారుణీ విద్యా (తై. 3-6)" —శం. భా

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' - యనునది తైత్తిరీయోపనిషద్భాగ మగు ఆనందవల్లి యందలి మంత్రవర్ణము. మిగిలిన యుపనిషత్తంతయు ఏత న్మంత్రవ్యాఖ్యానరూపమగు బ్రాహ్మణ మని సంప్రదాయము. బ్రహ్మ సూత్రము లలో ఆనందమయాధికరణమున గల 'మాంత్రవర్ణిక మేవచ గీయతే' -యను సూత్రమును వ్యాఖ్యానించుచు శ్రీ శంకరు లీ విషయము నిట్లుస్పష్టము చేసిరి. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ - యనునది మంత్రవర్ణము; అన్యోఽంతర ఆత్మా ఆనందమయః - ఇత్యాది వాక్యము లన్నియు తద్వ్యాఖ్యారూప మగు బ్రాహ్మణము; మంత్రబ్రాహ్మణములు భిన్నార్థముల బ్రతిపాదింపవు; అవి ఏకార్థబోధకము లగుట యుక్తము; అట్లు కానిచో 'ప్రకృతహాస - అప్రకృతబోధకత్వ' మను దోషములు సంభవించును: కాన 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' - యను మంత్రముచే నే ముఖ్యబ్రహ్మ బోధింపబడుచున్నదో తద్వ్యాఖ్యానరూపమగు 'అన్యోంతర ఆత్మా ఆనందమయః' - అను బ్రాహ్మణముచే గూడ నా బ్రహ్మయే బోధింప బడుచున్న దనుట యుక్తము. కాన నిట నానందమయుడు పరమాత్మయే గాని సంసారి యగు జీవుడు కాడు" - అని యర్థము.

భగవద్రామానుజు లీ సూత్రమున నీ విషయము నిట్లు వివరించిరి.

"బ్రాహ్మణోక్తస్యార్థస్య వైశద్య మనేన మంత్రేణ
క్రియత ఇత్యర్థః" —శ్రీభాష్య.

బ్రాహ్మణభాగమగు నీ యుపనిషత్తుచే జెప్పబడిన యర్థమును విశదీకరించుట కయియే "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"-యను మంత్రవర్ణమిట నుదహరింప బడినది అని యర్థము. పై రామానుజవాక్యమును శ్రుతప్రకాశికావ్యాఖ్యానమున శ్రీ సుదర్శనభట్టారకాచార్యు లిట్లు వివరించిరి.

"శ్రుతిషు మంత్రాణాం ప్రాబల్యం కేచి ద్వదంతి ।
తద్వ్యుదాసార్థ మాహ బ్రాహ్మణోక్తస్యేతి । బ్రాహ్మణో

క్తార్థ విశదీకరణరూపో మంత్ర ఇతిప్రయోజకమ్ ।
సంగ్రహేణోక్తస్య విస్తరేణ కథనం, విస్తృతస్య ప్రతి
పత్తిసౌకర్యాయ సంగ్రహేణ కథన మపి వైశద్యావహమ్।
నిత్యనిర్దోషిత్వావిశేషా న్మంత్రబ్రాహ్మణయోః ప్రాబల్య
దౌర్బల్యవిభాగోఽనుపపన్న ఇతి భావః ।',

శ్రుతులయందు బ్రాహ్మణముల కంటె మంత్రములు ప్రబలములు-అనెడి వాద మిట నిరసింపబడుచున్నది, మంత్రప్రకాశితార్థమును బ్రాహ్మణము విశదీకరించు నట్లే, బ్రాహ్మణోక్తార్థమును మంత్రము విశదీకరించుచుండును. విశదీకరణ మనగా సంగ్రహముగా చెప్పినదానిని విస్తరించి చెప్పుటయే కాదు; జ్ఞాతృసౌకర్యము కొఱకై విస్తృతార్థమును సంగ్రహించి చెప్పుటయు విశదీకరణమే యగును. నిత్యత్వము, నిర్దోషిత్వము - అను లక్షణములు మంత్రబ్రాహ్మణముల రెండింటియందును సమానము. కాన వీని విషయమై ప్రాబల్య దౌర్బల్య విచార మనుపపన్నము - అని యర్థము. ఇట్టి వైశద్యము కొఱకయియే పురాణేతిహాసాది రూపమున నష్టవిధమయి బ్రాహ్మణ మవతరించినది. కొన్నియెడల శ్రుతి శిష్యరూపమున ప్రశ్నించి తానే యాచార్యరూపమున సమాధానము చెప్పుచుండును.

"శిష్యభూతయా శ్రుత్యా చోదితే సైవాఽఽచార్యరూపా పరిహరతి
వాగేవేతి" —ఆనందగిరి. ఛాం. ఉ. 1-1-5.

పై శంకరరామానుజాది భాష్యముల తాత్పర్యమును బరికించినచో ఉపనిషత్తు స్థూలముగ బ్రాహ్మణభాగ మయ్యును మరల నది మంత్ర బ్రాహ్మణాత్మక రూపమున విలసిల్లుచుండు నని తెలియును. ఇట్టియుదాహరణములనెన్నియేని జూప వగును. ఇట్లు బ్రాహ్మణాత్మకమైన వేదరాశి గూడ మంత్రబ్రాహ్మణాత్మక మగుటచే భిన్నమైన భాగము బ్రాహ్మణ మని చెప్పుటగాని, అది బ్రాహ్మణప్రోక్త మని యనుటగాని, అందుచే బ్రాహ్మణ మని ప్రసిద్ధమైనదని యనుటగాని, అందువేతనే పౌరుషేయ మని చెప్పుటగాని యుక్తము గాదు. కాని ఉత్తర మీమాంసాదర్శనము

ననుసరించియు మంత్రములతోపాటు బ్రాహ్మణములకు గూడ ఛందస్త్వము (వేదత్వము) సిద్ధమై యున్నదనుట స్పష్టము. ఇక వేదాంగములలో నొకటి యగు నిరుక్తశాస్త్రమును జూతము.

## నిరుక్తము - ప్రసిద్ధి :-

మంత్రవాక్యార్థనిర్ణయమునకై నిరుక్తశాస్త్రము ప్రవృత్తమైనది. అందు- "మంత్రములు నిరర్థకములు; తద్వాక్యార్థనిర్ణయమునకై నిరుక్తశాస్త్రారంభము వ్యర్థము"- అనెడి కౌత్సుని వాద ముదహరింపబడినది. కౌత్సుని వాద మిది:

"(1) లోకవ్యవహారము అర్థవంతమైన వాక్యములతో జరుగుచున్నది; ఆ వాక్యములలో నియతమైన యానుపూర్వి లేదు; పాత్రం ఆహర; ఆహర పాత్రం (పాత్రను తెమ్ము; లేక తెమ్ము పాత్రను) - అని యీ రీతిగ వాక్యములందలి పద రచన వక్తృవివక్షాధీనమై యనియతముగ నుండవచ్చును; మంత్రములందట్లు గాదు; ఉదా :- 'అగ్న ఆయాహి....' - ఇది యొక మంత్రము; ఇందలి పదరచనను వక్తృవివక్షాధీనముగ 'ఆయాహ్యగ్నే' - అని యీ రీతిగ మార్చిగాని, లేక పర్యాయపదముల నుపయోగించి 'వహ్నె ఆయాహి; ఆయాహి వహ్నే'-అని యీ రీతిగగాని యుచ్చరించుటకు వలనుపడదు. మంత్రము లర్థవంతములే యగుచో లోకవ్యవహారము నందలి వాక్యముల వలె నివియు ననియతపదరచన గలిగి, వక్తృవివక్షాధీనముగ నుచ్చరించుటకు యుక్తములై యుండవలెను. అవి యట్టివి కావు గదా! కాన మంత్రము లనర్థకములు (యది మంత్రార్థప్రత్యయాయ అనర్థకం భవతీతి కౌత్సః। అనర్థకా హి మంత్రాః। తదేతేనోపేక్షితవ్యమ్। నియతవాచో యుక్తయో నియతానుపూర్వ్యా భవన్తి - నిరు). (2) నియతపదరచన గలిగియున్నను

బ్రాహ్మణవాక్యములే యర్థవంతములు గాని మంత్రములు గావు; బ్రాహ్మణవాక్యము లా యా కర్మల విధించుచు, నా యా కర్మలలో నా యా దేవతలింగములుగల మంత్రముల వినియోగమును విధించుచున్నవి. అర్థమున్నను లేకపోయినను బ్రాహ్మణవాక్యప్రామాణ్యముచే నా యా సమయముల యందు నా యా మంత్రముల వినియోగపరచుటయే కర్తవ్యము; మంత్రములకు వినియోగమును విధించునవి యగుటజేసి బ్రాహ్మణము లర్థవంతములు అర్థనిరపేక్షముగ వినియోక్తవ్యము లగుట జేసి మంత్రములు నిరర్థకములు (అథాపి బ్రాహ్మణేన రూపసంపన్నా విధీయన్తే. నిరు)."

ఇట్లు మంత్రములు నిరర్థకము లని యనుటకు కౌత్సుని వాదము ననుసరించి మఱికొన్ని హేతువులు గూడ నిరుక్తమున యాస్కునిచే జూపబడినవి (అథాప్యనుపపన్నార్థా భవంతి । అథాపి విప్రతిషిద్ధార్థా భవంతి।.... ఇత్యాది). ఈ కౌత్సుని వాదమును యాస్కు డిట్లు ఖండించినాడు.

'అర్థవన్తః శబ్దసామాన్యాత్' —నిరు. 1-16.

లోకమున శబ్దము లర్థవంతములు. మంత్రములును శబ్దరూపములే యగుట జేసి యవి యర్థవంతములని యంగీకరింపవలెను. అందు గొన్ని శబ్దములకు లోకప్రసిద్ధి లేనందువలన వాని నుచ్చరించినంతనే. యర్థస్ఫూర్తి కలుగకపోవచ్చును. ప్రౌఢమహాకవిప్రయోగములు అవిద్వాంసులకు వెంటనే యర్థస్ఫూర్తిని గలిగింపనంతమాత్రమున నవి యర్థరహితము లగునా? అంధునకు వస్తుప్రదర్శనము లేనంతమాత్రమున నది వస్తుదోష మగునా? పురుషదోషమే యగును. (నైష స్థాణో రపరాధో యదేన మంధో న పశ్యతి। పురుషాపరాధః స భవతి). కాన నర్థస్ఫూర్తి వెంటనే కలుగకపోవుట పురుషదోషమే యగును కాని శబ్దదోషము కాదు. కోశాది సాహాయ్యమునను, గుర్వనుగ్రహాదులచేతను నా శబ్దము లర్థవంతములుగ భాసిల్లుచున్నవి. అట్లే బ్రాహ్మణాది సాహాయ్యముతో మంత్రములయందు గల యర్థముల బ్రకాశింపజేయుటయే యీ నిరుక్తశాస్త్రారంభప్రయోజనము.

మంత్రములందు వలెనే లౌకికవాక్యములందును నియతపదరచన విషయమై నియమములను వ్యాకరణాదిశాస్త్రములు విధించినవి. శాస్త్రానుసారముగ ప్రయోగించినపుడే యది సాధువై శిష్టజనసంమత మగుచున్నది. (శాస్త్రేణ ధర్మ నియమః క్రియతే - మహాభాష్య, పస్పశాహ్నిక) ఉదా :-

"లౌకికే ష్వప్యేతత్ యథా ఇంద్రాగ్నీ పితాపుత్రా వితి"

—నిరు.1-16.

ఇంద్రాగ్నులు, పితాపుత్రులు (ఇట్లే భార్యాభర్తలు, నలదమయంతులు, సీతారాములు) మున్నగు పదములలో నియతపదరచన శాస్త్రవిహితమై యనూచానముగ గన్పట్టుచున్నది. కాన నియతపదరచన గల్గియుండుట యను కారణముచే మంత్రములనర్థకము లని యనుట యుక్తము కాదు. కర్మలయందు మంత్రముల వినియోగ పఱచుచు విధాయకము లగుటజేసి బ్రాహ్మణవాక్యము లర్థవంతము లనియు, వినియోజ్యము లగుటచే మంత్రము లనర్థకము లని చెప్పుటయు యుక్తము కాదు.

"ఏతద్వై యజ్ఞస్య సమృద్ధం యద్రూపసమృద్ధం యత్కర్మ క్రియమాణం ఋగ్యజు ర్వాభివదతీతి చ బ్రాహ్మణమ్"

—నిరు. 1-16.

మంత్రము లర్థవంతము లనుటకు పై గోపథ బ్రాహ్మణవాక్యము (2-2-6; 2-1-2) ప్రమాణము. మంత్రములు స్వార్థబోధనము ద్వారా దేవతాలింగప్రకాశకములు. అట్టి మంత్రములచే నేది ప్రకాశింపజేయబడునో యా యర్థమే యజ్ఞసమృద్ధికి గారణ మగును. బ్రాహ్మణములచే విహితములై యనుష్ఠింపబడు కర్మలన్నిటిని ఋక్కుగాని యజుస్సుగాని తత్తల్లింగములచే బ్రకాశింపజేయుచునే యుండును (యత్కర్మ క్రియమాణం ఋగ్యజుర్వాభివదతి). కౌత్సుడును 'అథాపి బ్రాహ్మణేన రూపసంపన్నా విధీయన్తే' అని యనుచు బ్రాహ్మణముచే తత్తద్దేవతాలింగప్రకాశకము లయిన మంత్రములు విధింప

బడుచున్న పనియే చెప్పినాడు. మంత్రము లర్థవంతములు గానిచో నని తత్తద్దేవతా లింగప్రకాశకము లగుట యెట్లు ? ఆ యా కర్మల ప్రకాశింపజేయుటెట్లు? ఆ యా కర్మలయందు ప్రత్యేకించి యా యా మంత్రములనే బ్రాహ్మణములు వినియోగ పరచుటకు గారణ మేమి ? బ్రాహ్మణముల దృష్టిలో మంత్రము లర్థవంతములే యగును. ఒకే కర్మయందు సమానలింగములు గల పెక్కు మంత్రములు 'ఖలే కపోత న్యాయము' చే బ్రాప్తించుచుండగా నచట బ్రాహ్మణము 'ఈ మంత్రమునే వినియో గింపవలె' నని నియమించుచు విధించుచున్నది. ఇట్లు మంత్రములు, బ్రాహ్మణ ములు రెండును పరస్పరానుబద్ధములై యర్థవంతములు. కాన తద్వాక్యార్థ నిరూపణకై నిరుక్తశాస్త్రారంభ మావశ్యక మని యాస్కుడు సిద్ధాంతీకరించెను.

ఇచట కౌత్సుని పూర్వపక్షమును, యాస్కుని సిద్ధాంతమును రెంటిని సూక్ష్మముగ బరిశీలించినచో నుభయులును మంత్ర బ్రాహ్మణములు రెండిటికిని అపౌరుషేయత్వమును, స్వతః ప్రామాణ్యమును గుర్తించియే పూర్వపక్షసిద్ధాంతముల జేసినట్లు గాంచనగును. మంత్రముల యర్థపరిశీలనముతో నిమిత్తము లేకయే, బ్రాహ్మణవాక్యప్రామాణ్యముచే, నవి యథాతథముగ గర్మలయందు వినియోగింప బడిన జాలును గదా యని కౌత్సుని యాశయము. అంతియేగాని సర్వథా మంత్రము లనర్థకములని కౌత్సుని యభిమతము గాదు. ఇక యథాతథముగ అంగా బ్రాహ్మ ణోక్త ప్రకారము మంత్రవినియోగము జేయుట యాస్కునకు నభిమతము. గోపథ బ్రాహ్మణప్రామాణ్యము ననుసరించియు, తత్తద్దేవతాలింగప్రకాశకము లగుట జేసియు మంత్రము లర్థవంతములు; కావున అర్థజ్ఞానపూర్వకముగ గర్మలయందు మంత్రవినియోగము జరుగవలె నని యాస్కుని సిద్ధాంతము, "ఋచో అక్షరే పరమే వ్యోమన్....యస్తన్న వేద కి మృచా కరిష్యతి- మంత్రముల యర్థము, వానిలక్ష్యము తెలియక నా మంత్రములతో జేయగల్గిన దేమి?" - అని శ్రుతియే స్వయముగ బ్రశ్నించుచున్నది. అర్థజ్ఞాన పూర్వకముగ మంత్రవినియోగము శ్రుత్యభిమత మని స్పష్ట మగుచున్నది. అందుచే యాస్కుని సిద్ధాంతము శ్రుతి సంప్రదాయానుగుణము. కాన నిరువురి దృష్టిలోను మంత్రములతోపాటు

బ్రాహ్మణములుగూడ వేదభాగములు, స్వతఃప్రమాణములు నని తెలియును. బ్రాహ్మణములు పురుషబుద్ధి రచితములే యయినచో నవి స్వతఃప్రమాణములుగ నిరువురిచేతను గ్రహింపబడి యుండెడివి కావు.

## నిరుక్తమున కౌత్సవాదము - చారిత్రికుల యాక్షేపము-సమాధానము :-

పైన బేర్కొనబడిన నిరుక్తమునందలి కౌత్స-యాస్కుల యొక్క పూర్వపక్ష సిద్ధాంతముల నాధారము జేసికొని చారిత్రికులు కొన్ని యభూతకల్పనలు జేయుటకు బూనుకొనిరి.

'The gap between the poets and the early interpreters was indeed so great that one of Yaska's predecessors, named, Kautsa actually had the audacity to assert that the science of Vedic exposition was useless, as the Vedic hymns and formulas were obscure, unmeaning, or mutually contradictory. Such criticisms Yaska meets by replying that it was not the fault of the rafter if the blindman did not see it. Yaska himself interprets only a very small portion of the hymns of the Rigveda. In what he does attempt to explain he largely depends on etymological considerations for the sense he assigns. He often gives two or more alternative or optional senses to the same word. The fact that he offers a choice of meanings shows that he had no earlier authority for his guide, and that his renderings are simply conjectural; for no one can suppose that the authors of the hymns had more than one meaning in their minds.'

—Macdonell : History of Sanskrit Literature-pp. 61.

"వేదమంత్రరచయితల తరువాత నెంతకాలమునకో గాని మంత్రార్థముల నిర్వచించెడి నిరుక్తకారులు బయలుదేరలేదనుట స్పష్టము; కావుననే యాస్కునకు బూర్వులలో నొకఁడగు కౌత్సుడు, సాహసించి," ఈ వేదమంత్రములు దుర్బోధములు; అనర్థకములు, పరస్పర విప్రతి షిద్ధార్థకములు; కాన వానియర్థముల నిర్వచించుటకై నిరుక్తశాస్త్రారంభము వ్యర్థము' —అని చెప్పఁగాఁ గెను. '(గుడ్డివాడు చూడలేనిచో నది స్వాపరాధము గాని స్థాణుగతదోషము కాదు' – అనెడి సమాధానముతో నిట్టి విమర్శలను యాస్కు డెదుర్కొనెను. కాని తానుమాత్రము ఋగ్వేదములో గల కొలది మంత్రములకే అర్థ నిర్వచనము జెప్పెను. అందు, అర్థ నిర్వచనమునకై యెక్కువగ వ్యుత్పత్త్యర్థముల మీఁద నాధారపడెను. కొన్ని యెడల నొక్కొక్క పదమునకు ఒక యర్థమును మాత్రమే గాక రెండు లేక పెక్కు వికల్పముల గూడ జూపెను. ఒక్కొక్కపదమున కిట్లు పెక్కు వికల్పముల జూపినందున, పదపదార్థనిర్ణయవిషయమై యాతనికి సంప్రదాయానుగతమైన నిర్దిష్టప్రమాణము లేదు; ఆతఁడు జూపిన నిర్వచనములు గాని యర్థములుగాని స్వప్రతిభోన్నీతములు – అని తెలియును. ఏలయన, మంత్రరచయితలు తమ రచనలకు నిర్దిష్టమగు నొక యర్థమునుగాక వివిధార్థముల నుద్దేశించియుందు రని యెవరును భావింపరు." –అని యర్థము.

చారిత్రికుల యిట్టి యూహలు సరియైనవి కావు. మంత్రము లొకే యర్థమును గాక యధికారిభేదము ననుసరించియు, ప్రకరణము ననుసరించియు వివిధార్థబోధకములు, శతవ్రజములు, శతపథములు నగునని శ్రుతులే స్వయముగ జెప్పికొనినట్లు 'ఋషి' మొదలగు శబ్దములలో సప్రమాణముగ సోపపత్తికముగ వివరింపబడినది. మఱియు బ్రాహ్మణములు మంత్రార్థప్రకాశకము లనునది నిర్వివాదము. బ్రాహ్మణమే కొన్నియెడల తానే నిరుక్తమై మంత్రార్థముల పెక్కురీతుల పెక్కుచోట్ల వివరించినది. 'ఇత్యధిదైవం, అథాధ్యాత్మం' – అనియు నీరీతిగ నాధ్యాత్మికాద్యర్థముల గ్రహింపనగునని చెప్పినది. అధికారిభేదము ననుసరించి తత్త్వము నుద్బోధించుట కయి వివిధార్థముల బ్రకాశింపజేయుట మంత్రముల స్వభావము. అంతియే కాని యీ వివిధార్థములు వివిధవికల్పములు గావు; అవ్వి

చీనకల్పనలును గావు. మంత్రబ్రాహ్మణములచే బ్రకాశితములైన యర్థముల శ్రుతి చెప్పినచొప్పున నిర్వచించి జిజ్ఞాసువుల కందించి తోడ్పడుట కయియే నిరుక్త శాస్త్రారంభము. శాఖోపశాఖలతో విస్తరించిన వేదరాశియందు ప్రకాశితములయి, పరంపరాగతములయిన యర్థములే యందు దిఙ్మాత్రముగ జూపబడినవి. అట్లు చూపుటలో యాస్కుడు తనకంటె బ్రాచీనులగు ఔపమన్యవ, శాకపూణ్యాది నిరుక్త కారుల నెందఱినో యుదహరించినాడు. 'ఇతి చ బ్రాహ్మణమ్, ఇత్యపి నిగమో భవతి'- అని యీ రీతిగ ననుచు స్వప్రతిపాదితార్థవిషయమై వివిధశాఖాగత మంత్ర బ్రాహ్మణవాక్యముల బ్రమాణముగ జూపినాడు. కాన యాస్కుడు చూపిన యర్థముల విషయమై సంప్రదాయానుగుణమైన ప్రామాణ్యము లేదనుట యుక్తము కాదు వేదవాక్యముల యొక్క సంప్రదాయానుగతమైన యర్థము నిగమ-నిరుక్త వ్యాకరణాధీన మని మీమాంసాదర్శనకారుల యభిప్రాయము గూడ.

'సతః పర మవిజ్ఞానమ్' —జై.సూ. 1-2-49.

"విద్యమానోఽప్యర్థః ప్రమాదాలస్యాదిభి ర్నోపలభ్యతే ।
నిగమ నిరుక్త వ్యాకరణవశేన ధాతుతోఽర్థః కల్పయితవ్యః'

—శాబరభాష్య. (చూ. అవతారిక)

యాస్కుడు సాయణాదిభాష్యకర్తల వలె వేదమంత్రభాష్యరచనకై పూను కొనలేదు. నిరుక్తశాస్త్రమును బ్రవర్తింపజేయుటకు బూనుకొనెను. పదగత స్వరసంస్కారాదుల దెలియజేయుచు వ్యాకరణశాస్త్ర మెట్లు వేదాఙ్గములలో నొకటియై వరలినదో, స్వరసంస్కారజ్ఞానము గలిగి వేదపదగత యావదర్థమును దెలియగోరు జిజ్ఞాసువులకు నా పదములయందు సంప్రదాయానుగతమైన యర్థముల దర్శించు విధాన మిది' — యని చూపుటకై నిరుక్తశాస్త్రము కూడ వేదాఙ్గమై వరలినది' ఇట నొక విషయము గమనింప దగినది. నిరుక్తము, వ్యాకరణము – అను నీ రెండు శాస్త్ర ములును స్వతంత్రవిద్యాస్థానములు. అయ్యును ఇతరేతరాశ్రయములు. అర్థపరి

జ్ఞానము నిరుక్తశాస్త్రాధీనము. స్వరసంస్కారపరిజ్ఞానము వ్యాకరణశాస్త్రాధీనము. నిరుక్తశాస్త్రసాహాయ్యముచే గలిగెడి యర్థమును దృష్టియం దుంచుకొనియే వ్యాకరణ శాస్త్రము స్వరసంస్కారస్వరూపమును దెలియజేయును. అటులే వ్యాకరణశాస్త్ర ప్రతిపాదిత స్వరసంస్కార స్వరూపమును దృష్టియందుంచుకొనియే నిరుక్తము శ్రుత్యనుగుణముగ పదగతార్థపరిజ్ఞానమును దర్శింపజేయును' యాస్కుడీ విష యము నిట్లు వివరించియున్నాడు.

"అథాపీద మంతరేణ మంత్రే ష్వర్థప్రత్యయో న విద్యతే ।
అర్థ మప్రతియతో నాత్యంతం స్వరసంస్కారోద్దేశః। తదిదం
విద్యాస్థానం వ్యాకరణస్య కార్త్స్న్యమ్। స్వార్థసాధకం చ।"

—నిరు. 1-5-15.

"నహ్యనవధృతార్థః స్వరసంస్కారా వవధారయితుం శక్ను
యాత్। అర్థవశేన హి స్వరసంస్కారా వవతిష్ఠేతే। తదిదం
ఏవం కృత్వా నిరుక్తశాస్త్రం విద్యాస్థానం, ఏత దధీనత్వా
దర్థపరిజ్ఞానస్య। అర్థవశగత్వాచ్చ స్వరసంస్కారయో రిదం
వ్యాకరణస్య కార్త్స్న్యం కృత్స్నభావం కరోతీతి వాక్యశేషః।
వ్యాకరణే హి స్వరసంస్కారౌ చింత్యేతే। తస్మా దపరిసమాప్త
మేవ తావ ద్వ్యాకరణం యావ న్నిరుక్తం నాధిగత మితి।
....తస్మాత్ స్వతంత్ర మేవేదం విద్యాస్థాన మర్థనిర్వచనమ్।
వ్యాకరణం తు లక్షణప్రధాన మితి విశేషః।" —దుర్గాచార్యభాష్య.

కావున వేదపదగతార్థ స్వరూపమును దర్శింపజేయు శాస్త్రము నిరుక్తము. శాస్త్రము లక్షణముల జెప్పి, వానికి నొకటి రెండు ఉదాహరణల జూపి, యిట్లే మిగిలినవానిని దర్శించునది యనుచు మార్గదర్శక మగుచుండును. వ్యాకరణశాస్త్రము స్వరసంస్కారవిషయమై లక్షణముల జెప్పి తత్సాహాయ్యముతో నిఖిలపదగత స్వర సంస్కారముల దర్శించుటకు మార్గదర్శక మగుచున్నటులే నిరుక్తశాస్త్రము కూడ

ప్తై దికనిఘంటుపదములను, తత్తత్సందర్భానుగుణముగ నితరపదములను నిర్వచించి పదగత యావదర్థ స్వరూపమును దర్శించు విధానమును జూపి యిట్లే వేదిగత నిఖిల పదములకు నర్థస్వరూపమును దర్శించునది, యని చెప్పినది. కాన నిది శాస్త్రము. దీనినిట్లు దర్శింపక 'యాస్కుడు కొన్ని పదములకు మాత్రమే యర్థము జూపగల్గెను' —అని విమర్శించుట శాస్త్రసంప్రదాయానుగుణము గాదు.

మఱియు జైమిని బాదరాయణులకు బూర్వము పూర్వోత్తర మీమాంసా సంప్రదాయములు లేవనిగాని, పాణినికంటె బూర్వము వ్యాకరణ సంప్రదాయము లేదనిగాని యనుట యెట్లు పొసగదో యాస్కునకు బూర్వము నిరుక్తసంప్రదాయము లేదనుటయు బొసగదు. ఏలయన, నీ సంప్రదాయముల నన్నిటిని మొదట ప్రవర్తింపజేసినది శ్రుతియే. సృష్ట్యాదినుండి యధ్యయనసంప్రదాయము, యజ్ఞాది ధర్మాచరణ సంప్రదాయము నవిచ్ఛిన్నముగ బ్రాప్తించినట్లే నాంతరీయకము లగుటచే వానితోపాటు వ్యాకరణ - నిరుక్తాది విద్యాసంప్రదాయములు నవిచ్ఛిన్నముగ బాప్తించినవనియే తెలియనగును.

## ఓహబ్రహ్మాణః - శ్రుతిమతిబుద్ధిలక్షణా విద్యా :-

ఈ నిరుక్తవిద్యాసంప్రదాయ మనాదిసిద్ధ మయినట్లు ఋగ్వేదము నందే దర్శింపగలము. నిరుక్త విద్యాసంప్రదాయరహస్యాభిజ్ఞులగు విద్వాంసులను "ఓహ బ్రహ్మణః" - అని ఋగ్వేదము కీర్తించినది.

> "హృదా తష్టేషు మనసో జవేషు యద్బ్రాహ్మణాః
> సంయజన్తే సఖాయః। అత్రాహ త్వం విజహు ర్వేద్యాభి
> రోహబ్రహ్మాణో విచరన్త్యుత్వే ॥" —ఋ 10-71-8.

శ్రుతితో సఖ్య మొనర్చెడి వేదవిదులగు సఖులు, పరిపక్వ మగు బుద్ధితో గుణదోషనిరూపణము జేసి, వేదార్థముల నిశ్చయించి, యా యర్థముల విషయమై ఏకభావము జెంది సమానఖ్యానము గల్గియుందురు. ఊహాపోహాకుశలురగు నా విద్వాంసులతో నొప్పెడి సమాజమున ఊహాపోహాసమర్థుడు, మందప్రజ్ఞుడు, అవిజ్ఞాతార్థస్వరూపుడు నగు నవిద్వాంసు డున్నచో వానిని బరిహరింతురుగాని వానితో తత్త్వ నిరూపక ప్రశ్నప్రతివచనాదుల నొనరింపరు. అట్టి విద్వాంసులకు 'ఓహాబ్రహ్మాణః' —అని పేరు. వారా సమాజమున సమానఖ్యానము గల సఖులతో ప్రశ్నప్రతివచనాదుల జేయుచు వేదార్థనిర్ణయమునకై ప్రవర్తింతురు- అని యర్థము.[1]

1. "హృదా హృదయేన, బుద్ధ్యా తష్టేషు తనూకృతేషు సంస్కృతేషు నిశ్చితేషు సత్సు.... మనసః జవేషు స్వేన మనసా ఊహాపోహాభ్యాం యేఽర్థాః సమ్యక్ ఉహ్యన్తే శ్రూయన్తే గమ్యన్తే నోపదేశమాత్రేణ తేషు సూక్ష్మే ష్వర్థేషు, తద్గమ్యా నర్థాన్ స్వయం మనసాఽఽలోచ్య బుద్ధ్యా పరిచ్ఛేద్యేత్యర్థః। యత్ యత్ర సమాజే యదా వా కాలే, బ్రాహ్మణాః సంయజన్తే సంగచ్ఛన్తి, సఖాయః సమానఖ్యానా ఋత్విజః అన్యే చ శాస్త్రజ్ఞాః । అత్ర సమాజే కాలే వా, త్వం ఏకం మంద ప్రజ్ఞం ఊహాపోహాసమర్థం. వి జహుః వివిధం త్యజన్తి వేద్యాభిః.... సప్తమ్యర్థే చ తృతీయా । వేద్యతే జ్ఞాయతే తత్త్వం యాభి స్తాః వేద్యాః ప్రశ్న ప్రతివచన ప్రవృత్తయః, తాసు నైనం కించిత్ పృచ్ఛన్తి నాప్యస్మై ప్రతిబ్రువన్తీత్యర్థః । యే ఓహబ్రహ్మాణః ఓహం ఉహ్యమానా బ్రహ్మ పరా విద్యా యైస్తే. ఊహాపోహసమర్థా ఇత్యర్థః.....త ఏవైకేఽత్ర వి చరన్తి వివిధం చరన్తి ప్రవర్తన్తే పరస్పరం పృచ్ఛన్తి ప్రతి బ్రువన్తి చేత్యర్థః" —ఉద్గీథ. భా.

"ఓహబ్రహ్మాణః ఉహ్యమానం బ్రహ్మ విద్యా శ్రుతిమతిబుద్ధిలక్షణం యేషాం తే తథోక్తాః తాదృశా స్త ఏకే విద్వాంసః వి చరన్తి యథాకామం వేదార్థేషు వినిశ్చయార్థం ప్రవర్తన్తే॥" —సా.భా.

ఇట్లు శ్రుతియందు ఊహాపోహకుశలబుద్ధులై—గుణదోషనిరూపణ సమర్థులై-వేదార్థనిర్ణయము చేయగలిగిన వేదసఖులగు విద్వాంసులు 'ఓహ బ్రహ్మాణః' - అని కీర్తింపబడిరి. శ్రుతి మతి బుద్ధిలక్షణ మగు బ్రహ్మ ఎవరిచే వహింపబడుచుండునో వారికి 'ఓహబ్రహ్మాణః' అని పేరు. శ్రుతి మతి బుద్ధిలక్షణ మగు నీ విద్యకే బ్రహ్మ యని పేరు. (ఈ విద్యాస్వరూపము ముందు వివరింపబడును.) ఇయ్యది నిరుక్తశాస్త్రవిజ్ఞాన ప్రభవ మగు విద్య యనుట సంప్రదాయము. ఈ విషయము నిరుక్తమున నిట్లు వివరింపబడినది.

"హృదా తష్టేషు మనసాం ప్రజవేషు....ఓహబ్రహ్మాణ ఊహ బ్రహ్మాణ ఊహ యేషాం బ్రహ్మేతి వా సేయం విద్యా శ్రుతి మతిబుద్ధిః తస్యా స్తపసా పార మీప్సితవ్యం, తదిద మాయు రిచ్ఛతా న నిర్వక్తవ్యం, తస్మా చ్ఛందస్సు శేషా ఉపేక్షితవ్యాః."

—నిరు. 13-13-

"ఏవ మేతస్మిన్ మంత్రే....మంత్రార్థచింతాభ్యూహస్య బ్రహ్మత్వం శ్రూయతే। తస్మా దిదమపి నిరుక్త శాస్త్రం బ్రహ్మైవ। వేద ఇత్యర్థః। ఇదానీ ముపసంహరతి సేయం విద్యా ఇతి ।"

—దుర్గాచార్యభాష్య.

"సేయం ఏత న్నిరుక్తశాస్త్రవిజ్ఞానప్రభవా విద్యా వేదార్థవిజ్ఞాన లక్షణా శ్రుతి మతి బుద్ధిశబ్దై నాఖ్యాయతే నైరుక్తై"

—ముకుందఝాబక్షీ నిరుక్తవ్యాఖ్య.

"సేయం విద్యా శ్రుతిః శ్రవణమ్, మతిర్మననం, బుద్ధిః నిది ధ్యాసనం, తస్యాః శ్రవణ మనన నిది ధ్యాసనరూపాయా విద్యాయా స్తపసా పారమీప్సి తవ్యమ్"

—స్వామి బ్రహ్మమునికృత నిరుక్త సమ్మర్శః.

మంత్రార్థచింతాభ్యూహరూప మగు నీ విద్యకు బ్రహ్మ యని పేరు. అట్టి విద్యారూపమగు నీ నిరుక్తశాస్త్రము కూడ బ్రహ్మయే - వేదమే - యగునని 'హృదా తష్టేషు' -యను నీ శ్రుతివలన దెలియుచున్నది. తాదృశ విద్యారూప బ్రహ్మసంపన్నులగు విద్వాంసులకు 'ఓహాబ్రహ్మాణః' — అని పేరు. శ్రుతి మతి బుద్ధిలక్షణమగు — శ్రవణ మనన నిదిధ్యాసనారూపమగు - పరావిద్య నిరుక్త శాస్త్రవిజ్ఞానలభ్యము. అట్టి యీ విద్యయందు పారంగతు లగుటకు తపస్సే ముఖ్య సాధనము (తపసా పార మీప్సితవ్యమ్). తపఃసంపన్నులు గాక లౌకిక భోగ పరాయణులై ఆయురైశ్వర్యాదులయం దాసక్తులగు వారల కీ విద్యయం దధికారము లేదు. పరావిద్యాసాధనమగు నీ నిరుక్తవిద్యాసాహాయ్యముతో శ్రుత్యనుగుణముగ నేను జూపిన మార్గమున బోయి వివేచనచేసి ఛందోగతము లయిన-మంత్రబ్రాహ్మణ గతము లయిన - మిగిలిన పదముల యర్థస్వరూపమును దర్శించునది - అని యర్థము.

పై గ్రంథసందర్భము వలన నిరుక్తవిద్య శ్రుతి మతి బుద్ధిలక్షణ మగు పరావిద్యకు సాధనమనియు, ననాదిసిద్ధ మనియు స్పష్ట మయినది. పరావిద్య యొక్క శ్రుతిమతిబుద్ధిలక్షణమును నిరుక్తమే మఱియొకచోట నిట్లు వివరించినది.

> "తిస్రో వాచ ఈరయతి ప్రవహ్నిః ఋతస్య ధీతిం బ్రహ్మణో మనీషామ్" —ఋ. 9-97-34.

> "వహ్ని రాదిత్యో భవతి, స తిస్రో వాచః ప్రేరయతి, ఋచో యజూంషి సామాని, ఋత స్యాదిత్యస్య కర్మాణి.
> బ్రహ్మణో మతాని, ఏష ఏవైత త్సర్వ మక్షర మిత్యధి
> దైవతమ్ ; అథాధ్యాత్మం; వహ్ని రాత్మా భవతి, స తిస్రో
> వాచ ఈరయతి ప్రేరయతి, విద్యామతిబుద్ధిమతాం, ఋత
> స్యాత్మనః కర్మాణి బ్రహ్మణో మతాని, అయ మేవై త
> త్సర్వ మనుభవ త్యాత్మగతి మాచష్టే" —నిరు. 14-14.

"విద్యా - మతి - బుద్ధిమతాం - విద్యావతాం మతిమతాం బుద్ధిమతా మేతేషాం, త్రయాణాం తిస్రో వాచః। విద్యావతాం వాగ్ భిన్నా । తథా మతిమతామ్। తథైవ బుద్ధిమతామ్। తే విద్యావంతః యే శ్రుతిం జానంతి। తే మతిమంతః యే తర్కేణ అర్థాన్ నిశ్చిన్వన్తి। తే బుద్ధిమంతః యే బ్రహ్మ జానంతి। నిరు. 13–13 - ఇత్యత్ర సేయం విద్యా శ్రుతి—మతి - బుద్ధిః ఇత్యుచ్యతే। శ్రుతిరూపా విద్యా ప్రథమా। మతిరూపా ఊహారూపా వా అస్యాః ఉచ్చతరా। బుద్ధిరూపా సర్వాసా ముత్తమా। విద్యా - మతి - బుద్ధిమతా మిత్యత్ర విద్యా శబ్దస్య శ్రుతి రిత్యర్థః స్యాత్ శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః ఇత్యేవం ఉపనిషత్సూచ్యతే" —ఆనందాశ్రమనిరుక్తటిప్పణీ.

ఇట నిరుక్తమున పై ఋక్కునకు ఆధిదైవికముగ నాదిత్యుని పరముగను, ఆధ్యాత్మికముగ నాత్మపరముగను రెండర్థములు జూపబడినవి. 'బ్రహ్మయొక్క మనీషా రూపములు, స్వకర్మ రూపములు నగు మూడు వాక్కులను-ఋగ్యజుఃసామలను—ఆదిత్యుడు ప్రేరేపించుచున్నాడు' - అని ఆధిదైవికార్థము. 'బ్రహ్మ మనీషా రూపములును, స్వకర్మరూపములు నగు మూడు వాక్కులను - విద్యా మతి బుద్ధి రూపము లగు వాక్కులను - అట్టి విద్వాంసులకు నాత్మ ప్రేరేపించును' - అని ఆధ్యాత్మికార్థము. ఋగ్యజుఃసామలక్షణ మగు నొకే వేదవాక్కు అధికారిభేదము ననుసరించి విద్యావంతులకు వేఱుగను, మతిమంతులకు వేఱుగను, బుద్ధిమంతులకు వేఱుగను దోచును. ఆత్మచే బ్రేరేపింపబడు మూడు వాక్కులు నివియే. విద్యావంతులనగా నియమపూర్వకముగ వేదాధ్యయనము జేసినవారు. ఊహాపోహకుశలురై తర్కముతో వేదార్థనిర్ణయము జేయగల్గిన విద్వాంసులు మతిమంతులు. బ్రహ్మవిదులగు విద్వాంసులు బుద్ధిమంతులు (జ్ఞానులు). శ్రుతిరూపమగు విద్యకంటె మతి (ఊహ) రూప మగు విద్యయు, దానికంటె బుద్ధిరూప మగు విద్యయు నుత్తరోత్తర ముత్కృష్టములు - అని యర్థము.

ఒకే వేదవాణికర్మానుష్ఠానాధ్యయనాది సమయమున ఇడారూపిణిగను, జిజ్ఞాసువై మననము జేయు సాధకుల హృదయముల సంస్కరించుచు (సాధయంతీ ధియం నః) సరస్వతీరూపముననుసు, బ్రహ్మనిష్ఠులకు స్వయమై భారతీరూపమునను నొప్పుచుండు నని కవి – కావ్య, భారతీ శబ్దములందు వివరింపబడినది. వరావిద్యా రూపిణి యగు నా వేదవిద్యయే యిట 'శ్రుతి – మతి – బుద్ధిరూపిణి'గా వివరింప బడుట గమనార్హము. కాన నిరుక్తశాస్త్ర సంప్రదాయము శ్రుతిప్రసిద్ధము. అనాది సిద్ధము నగుట స్పష్టము. అందుచే పై చారిత్రికుల యూహలు నిరాధారములు ఇక ప్రకృతమునకు వత్తము.

మంత్రబ్రాహ్మణములు రెండును పురుషబుద్ధిరచితములు గావనెడి విషయమును యాస్కుడు మఱియొకచోట నిరుక్తమున నిట్లు వివరించినాడు.

"తేషాం మనుష్యవద్దేవతాభిధానమ్। పురుషవిద్యాఽనిత్యత్వాత్ ।
కర్మసంపత్తిర్మంత్రో వేదే" —నిరు. 1-2-7.

నామ, అఖ్యాత, ఉపసర్గ, నిపాత లనెడి చతుర్విధపదజాలముతో లోక వ్యవహారము కొనసాగుచున్నది. ఈ శబ్దములు అవయవాదులతో నొప్పు మను ష్యాదులను, వారి కర్మలను బోధింప జాలినట్లే, అవయవాదియుక్తులైన దేవతలను తత్కర్మలను బోధింపజాలును. అట్టియెడ నా యా దేవతల నుద్దేశించి చేసెడి హవిఃప్రదానాది కర్మల జేయుటకై లౌకికశబ్దములు చాలును గదా ! అందుకై వేదమున గల మంత్రములు బఠింపనేల ? యని యనరాదు. పురుషుల బుద్ధులు అలౌకికములగు దేవతాస్వరూపములను, దత్కర్మలను దర్శింపలేవు. ఒకవేళ ప్రతిభావ్యుత్పత్తులతో నేదియేని దేవతల నుద్దేశించి కల్పించి చెప్పినను నద్యది యథార్థ మనియు, యథాతథముగ ప్రమాణభూత మనియు లోకము గ్రహింపదు. పురుషు డెంతటి ప్రతిభావంతుడైనను, లౌకికవిషయములం దెంత సుశిక్షితుడైనను అలౌకిక దేవతాస్వరూప స్వభావాదివిషయమున నశిక్షితుడే యగుచున్నాడు. ఇట్లు పురుషబుద్ధి అల్పము, అశిక్షితము, విస్మరణశీలము, భ్రమప్రమాదాది దోష బహుళము వగుటచే పురుషబుద్ధికల్పిత దేవతాస్వరూపస్వభావాదులు గాని, కర్మలుగాని,

సమ్యగ్జ్ఞానమును బోధింప సమర్థములు గావు. పురుషబుద్ధిదోషప్రచురములైన యా లౌకిక శబ్దముల నుపయోగించుచో కర్మసముదాయముల యందు దేవతాపూర్వావముగాని, తదనుగ్రహముచే గర్మలు సఫలము లగుట గాని సిద్ధింపదు. పురుషవిద్య యని యతమై యనిత్య మగుటచే లౌకికశబ్దములు కర్మవినియోగానర్హములు. అందుచే పురుషబుద్ధిదోషరహితములగు మంత్రములు కర్మాదివినియోగమునకై వేదమున సమామ్నాతములైనవి - అని యర్థము.

పై విషయమును బరిశీలించుచో - కర్మసమృద్ధిని గలుగజేయునవి లౌకిక వాక్యములు గావు. వేదమంత్రములే; కర్మసంపత్తిని గల్గించు మంత్రములు సంహితా భాగమునను, బ్రాహ్మణభాగమునను గలవు. అందుచే మంత్రబ్రాహ్మణములు రెండును అపౌరుషేయములే; పురుషబుద్ధి కల్పితములు గావు' - అనుట యాస్కాభి మతము.

ఇంతియే కాదు. యాస్కుడు నిరుక్తమున నచటచట బ్రాహ్మణ వాక్య ముల బ్రమాణముగ నుదహరించి వానిని ఆమ్నాయవచనము లనియు, నిగమము లనియు బేర్కొనుట గమనార్హము. ఉదా :- 'ఓషధేత్రాయస్వైనం' —ఇది వాజసనేయసంహిత (4-1) యందును, తైత్తిరీయసంహిత (1-2-1-1) యందును గలదు. ఈ వాక్యము నుదహరించుచు దీనిని ఆమ్నాయవచన మనినాడు. (ఆమ్నాయవచనాచ్చ - నిరు. (4-1). మఱియొకచోట 'యథో ఏతత్ రోహాత్ ప్రత్యవరోహ శ్చికీర్షితః' - అనియెడి వాక్యముచే నుద్దిష్టమైన ఐతరేయ బ్రాహ్మణ వచనమును (18 - 4 నుండి 7) గూడ ఆమ్నాయవచన మనినాడు. (ఆమ్నాయవచనా దేత ద్భవతి - నిరు. 7-24-1). ఇట్లే 'యస్మా త్పరం నాపర మస్తి కించిత్ (తై. ఆ. 10-10-3; శ్వేత. ఉ. 3-9); అను బ్రాహ్మణ వాక్యము నుదహరించి యిది నిగమ మనినాడు. (ఇత్యపి నిగమో భవతి - నిరు. 2-1-4). కాన నిరుక్తసంప్రదాయము ననుసరించియు బ్రాహ్మణము గూడ నపౌరుషేయమై వేద మగుట స్పష్టము. ఇక నీ విషయమై శ్రౌతసూత్ర, గృహ్యసూత్రకారుల యభిప్రాయమును జూతము.

## శ్రౌత - గృహ్యసూత్రములు : స్మృతులు-ప్రసిద్ధి :-

"మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయమ్"

—అప.పరి సూ- 31. - సత్యా.శ్రౌ.సూ. 1-1;-అప.శ్రౌ.సూ, 24-1-31-1.

"ఆమ్నాయః పునః మంత్రాశ్చ బ్రాహ్మణాని చ"

—అథర్వ. కౌశిక. సూ. 1-3.

"మంత్రబ్రాహ్మణయో రాహు ర్వేదశబ్దం మహర్షయః".

—షడ్గురుశిష్య : సర్వానుక్రమణికావృత్తిభూమికా.

"మంత్రబ్రాహ్మణాత్మకం తావ ద్వేదస్యాదుష్టం లక్షణమ్"

—సాయణః — ఋగ్వేద భాష్యభూమికా.

"ఆమ్నాయో వేదః-బ్రాహ్మణం విధ్యర్థవాదరూపమ్। మంత్రస్తు కర్మాంగభూత ద్రవ్యదేవతాస్మారకమ్"

—ఉవట.వాజ-ప్రాతిశాఖ్యవ్యాఖ్య.

"మంత్రబ్రాహ్మణయో ర్వేదనామ ప్రోక్తం ఋగాది"

—శుక్రనీతి. 4-271.

"ఉదితేఽనుదితే చైవ సమయాధ్యుషితే తథా।
సర్వథా వర్తతే యజ్ఞ ఇతీయం వైదికీ శ్రుతిః॥

—మను. 2-15.

ఇట మనుస్మృతి 'ఉదితే జుహోతి, అనుదితే జుహోతి' యను నీ బ్రాహ్మణవాక్యములను 'వైదికీ శ్రుతిః' యని పేర్కొనినది. ఇట్లే బ్రాహ్మణప్రోక్త ధర్మముల బరామర్శించుచు వానిని 'ఇతి వైదికీ శ్రుతిః' అని పలుచోట్ల స్మృతులు పేర్కొనినవి.

ఇది నొక విషయము పరిశీలింపవగినది. మానవధర్మశాస్త్రమును ప్రవర్తింపజేసిన మనువు సృష్ట్యాదికాలికుడు. ఈ విషయము నిరుక్తమున నిట్లు జెప్పబడినది.

'అవిశేషేణ పుత్రాణాం దాయో భవతి ధర్మతః ।
మిథునానాం విసర్గాదౌ మనుః స్వాయంభువోఽబ్రవీత్ ॥

—నిరు. 3-4.

'విసర్గాదౌ' - యన సృష్ట్యాదియందు అని యర్థము. మనువు సృష్ట్యాదియందు ధర్మముల ప్రవర్తింపజేసినట్లు పై శ్లోకమువలన దెలియును. మనువు మొదట యజ్ఞాదుల ప్రవర్తింపజేసి తరువాతి మానవుల కాదర్శ భూతు డయినట్లు ఋగ్వేదము చెప్పుచున్నది.

"మనుష్వ దగ్నిం మనునా సమిద్ధం" —ఋ. 7-2-3.

'మనుష్వత్ మనుష్యవత్, మనునా సమిద్ధం యథేదానీం
మనుష్యైః సమిన్ధతే తథా పూర్వం మనునా ప్రజాపతినా
సమిద్ధ మగ్నిం' సా,భా.

కనుక మనువు మొదట - సృష్ట్యాదియందు - యజ్ఞాది రూపమైన ధర్మము ప్రవర్తింపజేసె ననుట స్పష్టము. 'బ్రాహ్మణములు చతుర్వేదపారగులైన ఋషులచే ప్రోక్తములు ; కాన పురుషబుద్ధిరచితములు' - అని చెప్పెడి శ్రీదయానందులును (తదనుయాయులును) మనువు సృష్ట్యాదికాలికు డనియే యనుచు 'సత్యార్థ ప్రకాశ' యను గ్రంథమునే నిట్లు చెప్పినారు.

"యహ్ మనుస్మృతి జో సృష్టి కే ఆది మేఁ హుయీ హై
ఉస్కా ప్రమాణ హై' —11 సముల్లాస.

ఇట్లు మనువు సృష్ట్యాదికాలికు డనుట యీ విమర్శకులకు నభిమతమే. అగుచో సృష్ట్యాది నుండియు మంత్రబ్రాహ్మణాత్మక వేదచోదితమైన యజ్ఞాది రూప ధర్మము ప్రవర్తితమై యవిచ్ఛిన్నముగ వచ్చినది - అని యంగీకరింప వలసి యున్నది. ఏలయన— పై ఋగ్వేదమంత్రమున 'మనువుచే యజ్ఞమున సమిద్ధుడైన యీ యగ్నినే యజ్ఞసంపత్తి కొఱకు నెల్లప్పుడు పూజింపవలయును (మనునా సమిద్ధ మగ్నిం, అధ్వరాయ యజ్ఞాయ, సదమిత్ సదైవ, నంమహేః సంపూజ యత - సా.భా)' — అనెడి హెచ్చరికయు గలదు. యజ్ఞసంపత్తి మంత్రబ్రాహ్మణముల రెండింటివలననే సిద్ధించు ననుట పై దికసంప్రదాయము.

"మంత్రబ్రాహ్మణే యజ్ఞస్య ప్రమాణమ్"
"మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయమ్" —ఆప. పరి.సూ. 32-33.

"మంత్రబ్రాహ్మణాభ్యాం హి సాంగోపాంగో యజ్ఞః ప్రమీయతే"
—కర్క భాష్య.

మంత్రబ్రాహ్మణములకు వేద మని నామధేయము. ఇవి రెండు నితరేతరాశ్రయములై సాంగోపాంగ యజ్ఞనిర్వహణకు బ్రమాణము అగుచుండునని యర్థము. కాగా సృష్ట్యాదియందు మనువు మంత్రబ్రాహ్మణముల రెండింటిని బ్రమాణముగ గొనియే యజ్ఞాదిధర్మప్రవర్తకు డయ్యె నని యంగీకరింపవలెను. మనువు త్రొక్కిన మార్గముననే పోయి తరువాతివారును యజ్ఞాదుల నిర్వహింపవలెనని పై శ్రుతి యాదేశము. అప్రతిహతము క్షుణ్ణము నైన మనుప్రదర్శిత ధర్మమార్గముననే ప్రజలు ప్రవర్తిల్లినట్లు మహాకవి కాళిదాసు రఘువంశమహాకావ్యమున నిట్లు తెలియజేయుచున్నాడు.

"రేఖామాత్ర మపి క్షుణ్ణా దా మనో ర్వ_ర్త్మనః పరమ్।
న వ్యతీయుః ప్రజా _స్తస్య నియంతు ర్నేమివృ_త్తయః॥"

కనుక మనువునాటి నుండి – సృష్ట్యాదినుండి – యవిచ్ఛిన్నముగ గురుశిష్యపరంపరాప్రా_ప్తమై స్వాధ్యాయాధ్యయన మెట్లు విలసిల్లుచున్నదో, యటులనే యజ్ఞాది ధర్మమార్గము, తదనుగుణముగ నిరు_క్తాది షడంగముల సంప్రదాయము ప్రా_ప్తమైనటుల గ్రహింపవలసియున్నది. అంతియేకాని, యీ సంప్రదాయములు విచ్ఛిన్నము లైనవనిగాని, మఱల నా యా కాలముల యందు కమకమ ప్రతిభకొలది వేత్వేఱుపురుషులచే గల్పితములనిగాని చెప్పుట యు_క్తిసహము, శ్రుత్యాదిసంమతము గాదు. ఇట్లీ సంప్రదాయ మవిచ్ఛిన్న మని యంగీకరింపవలసియున్నది. మంత్రములతోపాటు బ్రాహ్మణములు నావిర్భవించినవనియు, అందుచే వానికి వేదత్వము నిర్బాధ మగుననియు గ్రహింపనగును.

కనుక 'కాత్యాయను డొకడు కాక మిగిలిన ఋషు లెవ్వరును బ్రాహ్మణములకు వేదసంజ్ఞ నంగీకరింపలేదు – అనెడి శ్రీ దయానందాది విమర్శకుల వాదము గ్రాహ్యము కాదు. కాత్యాయనుడే గాక కోశకారులు, దర్శనకారులు, నిరు_క్తశాస్త్రప్రవ_ర్తకులు, స్మృతికర్తలు, శ్రౌత - గృహ్యసూత్రకర్తలు, శ్రీసాయణాదిభాష్యకర్తలు నెల్లరును గూడ బ్రాహ్మణములు వేదములని ము_క్తకంఠముగ గీ_ర్తించియుండుట గాంచితిమి. ఈ విషయమును 'బ్రాహ్మణాచ్ఛంసీ' యను పదమును బరిశీలించినను స్పష్టము కాగలదు.

## శ్రుతిప్రసిద్ధి - బ్రాహ్మణాచ్ఛంసీ :-

యజ్ఞమున అధ్వర్యుడు, హోత, ఉద్గాత, బ్రహ్మ యను ప్రధాన ఋత్విజులు నలువు రుందురు. అందొక్కొక్కరికి ముగ్గురు ముగ్గురు అనుచరులు ఉందురు.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| అధ్వర్యుః | హోతా | ఉద్గాతా | బ్రహ్మ |
| ప్రతిప్రస్థాతా | మైత్రావరుణః | ప్రస్తోతా | బ్రాహ్మణాచ్ఛంసీ |
| నేష్టా | అచ్ఛావాకః | ప్రతిహర్తా | ఆగ్నీధ్రః |
| ఉన్నేతా | గ్రావస్తుత్ | సుబ్రహ్మణ్యః | పోతా |

ఇట బ్రహ్మవర్గములో రెండవవాడు 'బ్రాహ్మణాచ్ఛంసి'. ఈ పదమును మహా భాష్యాది గ్రంథము లిట్లు నిర్వచించినవి.

"అన్యార్థే చైషా పంచమీ ద్రష్టవ్యా। బ్రాహ్మణాని శంసతీతి బ్రాహ్మణాచ్ఛంసీ । అథవా యుక్త ఏవాత్ర పంచమ్యర్థః । బ్రాహ్మణేభ్యో గృహీత్వా ఆహృత్య ఆహృత్య శంసతీతి బ్రాహ్మణాచ్ఛంసీ" ——మహాభాష్య. 6-3-2.

"బ్రాహ్మణాచ్ఛంసిన ఉపసంఖ్యానమ్। బ్రాహ్మణ మాదాయ శంసతీతి బ్రాహ్మణాచ్ఛంసీ ఇతి। ఋత్విగ్విశేషస్య రూఢి రియమ్ । తస్య వ్యుత్పత్తిః అసతా సతావా అవయవార్థేన క్రియతే ।" ——కాశికావృత్తి.

ఏవ మపి హోతృప్రభృతిష్వపి బ్రాహ్మణాచ్ఛంసీతి ప్రాప్నోతి। తత్రాహ ఋత్విగ్విశేషస్య రూఢి రియ మితి"

——పదమంజరీ. (చూ.న్యాస.).

బ్రాహ్మణాచ్ఛంసి యనగా బ్రాహ్మణములందు విహితములగు శస్త్రము లను శంసనము చేయువాడు; లేక బ్రాహ్మణములనుండి శస్త్రముల గ్రహించుచు

శంసనము చేయువాడు - అని యర్థము. బ్రాహ్మణములను గ్రహించి శస్త్రము లను శంసనము చేయు ధర్మ మితర ఋత్విజులందును గలదు. అయిన నీ పద మీ ఋత్విజుని యందే రూఢము; శ్రౌతసూత్రకారులు వ్యాఖ్యాతలు నీ నిర్వచన మునే యాదరించిరి:

"బ్రాహ్మణాచ్ఛంసిన ఉపసంఖ్యానమితి పంచమ్యా అలుక్
బ్రాహ్మణే విహితాని శస్త్రాణ్యుపచారా ద్బ్రాహ్మణాని ।
తాని శంసతీతి బ్రాహ్మణాచ్ఛంసీ, ఋత్విగ్విశేషః ।
ద్వితీయార్థే పంచమ్యుపసంఖ్యానాదేవ"

—మహాదేవకృత వైజయంతీవ్యాఖ్య - సత్యా. శ్రౌ. సూ. 7-7-21.

ఋగ్వేదమున గొన్నిచోట్ల బ్రాహ్మణ శబ్దము 'బ్రాహ్మణాచ్ఛంసి' యను నర్థమున ప్రయోగింపబడినది.

"బ్రాహ్మణా దింద్రరాధసః" —ఋ 1-15-5.

'బ్రాహ్మణాత్ బ్రహ్మశబ్దే నాత్ర బ్రహ్మవర్గే ద్వితీయో
బ్రాహ్మణాచ్ఛంసీ కథ్యతే.... (తత్సంబద్ధ) చమసవరోఽత్ర
బ్రాహ్మణ శబ్దః' —సా.భా.

"బ్రాహ్మణా దా తృపత్ పిబ" —ఋ. 2-36-5.

"బ్రాహ్మణాత్ బ్రాహ్మణాచ్ఛంసినో యాగాత్" —సా.భా.

"స సద్మ పరి ణీయతే హోతా మంద్రో దివిష్టిషు ।
ఉత పోతా ని షీదతి ।" —ఋ. 4-9-3.

'ఉత గ్నా అగ్ని రధ్వర ఉతో గృహపతి ర్దమే ।
ఉత బ్రహ్మా ని షీదతి" —ఋ. 4-9-4.

"వేషి హ్యధ్వరీయతా ముపవక్తా జనానాం।

హవ్యా చ మానుషాణామ్ ।" —ఋ 4-9-5.

ఈ మంత్రములందు యజ్ఞేశ్వరుడగు నగ్నియే హోత, పోత, అధ్వర్యుడు గృహపతి (యజమానుడు). బ్రహ్మ (బ్రాహ్మణాచ్ఛంసి) ఉపవక్త (బ్రహ్మ) —మున్నగు ఋత్విగ్రూపుడై యజ్ఞగృహమున దేజరిల్లుచున్నట్లు చెప్పబడినది. సాయణ ఉద్గీథ - ముద్గల -స్కందస్వామి వేంకటమాధవాది భాష్యకారు లందఱు నీ యర్థమునే గ్రహించిరి. ఈ మంత్రములయందు యజ్ఞకర్మనిర్వహణమునం దధికృతు లయ్యేడి ఋత్విజుల నామములు కొన్ని పేర్కొనబడినవి. మిగిలిన ఋత్విజుల నామములు నిట్లే మిగిలిన మంత్రములయందు దర్శింపనగును. నేటికిని ఆ నామధేయములతోనే ఋత్విజులు నియమితులగుచున్నారు. అవగా అనాది కాలము నుండి యజ్ఞనిర్వహణక్రమ మొకేరీతిగ నవిచ్ఛిన్న పరంపరాప్రాప్త మయినట్లు తెలియనగును. పై మంత్రములయందు మిగిలిన ఋత్విజులతోపాటు బ్రాహ్మణాచ్ఛంసి యను ఋత్విక్కు గూడ నిర్దేశింపబడినాడు. కనుక యజ్ఞములందు బ్రాహ్మణవిహిత శస్త్రములను శంసనము చేయు సంప్రదాయమును ఋగ్వేదము తెల్పుచున్నది. మంత్రములతోపాటు బ్రాహ్మణములు నావిర్భవించి యనూచానముగ యజ్ఞకర్మప్రవర్తితములై వచ్చినవని యంగీకరించినపుడే పై మంత్రార్థములును బ్రాహ్మణాచ్ఛంసి పదనిర్వచనములును సరసము లయి సంగతము లగును.

పై ఋఙ్మంత్రములందు బ్రహ్మ శబ్దము బ్రహ్మ యను ఋత్విజునే బోధించును. గాని బ్రాహ్మణాచ్ఛంసి యను ఋత్విజుని బోధింపదని 'గెల్డనర్' అను పాశ్చాత్యపండితుని యభిప్రాయము. కాని 'ఓల్డెన్ బర్గ్' మున్నగు పండితులు సాయణాది భాష్యకర్తల వలెనే యిచటి బ్రహ్మశబ్దము బ్రాహ్మణాచ్ఛంసి వాచకమే యగునని చెప్పినారు. (చూ. Vedic Index. బ్రాహ్మణాచ్ఛంసీ) బ్రాహ్మణశబ్దము బ్రాహ్మణాచ్ఛంసి వాచక మగుట సంప్రదాయసిద్ధము.

బార్హ్మణో బార్హ్మణత్వాచ్చ" ....హరివంశ, 3-10-6, 7.

"బార్హ్మణత్వాత్, బర్హ్మ వేదః తదధ్యేతృత్వాత్ బార్హ్మణో బార్హ్మణాచ్ఛంసీ నామ" —నీలకంఠః.

## బ్రాహ్మణము - అనుబ్రాహ్మణము :-

బ్రాహ్మణము లందు గొంక భాగమునకు 'అనుబ్రాహ్మణ' మని పేరు. ఈ విభాగమును గూర్చి సూత్రకారు లిట్లు వివరించుచున్నారు.

"పౌరోడాశికం యాజమానం హోతారః హౌత్రం పితృమేధ
ఇతి సబ్రాహ్మణాని సానుబ్రాహ్మణాని ప్రాజాపత్యాని"

—బోధా. గృ. సూ. 3-3.

"అను బ్రాహ్మణా దినిః" అని పాణినీయసూత్రము (4-2-62). 'బ్రాహ్మణ సదృశోఽయం గ్రంథోఽనుబ్రాహ్మణమ్'-అని కాశికావృత్తియందు 'అనుబ్రాహ్మణ' శబ్దార్థము వివరింపబడినది. బ్రాహ్మణ సదృశగ్రంథమనుబ్రాహ్మణము. దాని నధ్యయనము జేయువాడు 'అనుబ్రాహ్మణీ' యగును. శ్రీ సాయణాచార్యులును అను బ్రాహ్మణ స్వరూపము నిట్లు వివరించిరి.

"అష్టమే మంత్రకాండస్థే కర్మణాం బహులత్వతః ।
తత్తత్సన్నిధయే ప్రోక్తాః మంత్రా విధిపురఃసరాః ॥
అనూద్య తాన్ విధీ నర్థవాదో బ్రాహ్మణ ఈరితః ।
సంప్రదాయవిదోఽతోఽత్ర బ్రాహ్మణద్వయ మూచిరే ॥
బ్రాహ్మణం మంత్రకాండస్థ విధిజాత మితీరితమ్ ।
అనుబ్రాహ్మణ మన్యత్తు కథితం సార్థవాదకమ్ ॥"

"అనుమత్యై పురోడాశ మష్టాకపాలం నిర్వపతి । ఏఁ స్మిన్
ముఖ్యే బ్రాహ్మణే ప్రధానం కర్మ విహితమ్ । అను
బ్రాహ్మణం తు గ్రంథాంతరే ప్రథమకాండే షష్ఠ సప్త
మాష్టమ ప్రపాఠకరూపమ్' —సా.భా. తై.సం. 1–8-1.

బ్రాహ్మణము, అనుబ్రాహ్మణము - అని రెండు బ్రాహ్మణభాగములు గలవు. అందు బ్రాహ్మణ మనగా మంత్రకాండ ప్రకాశిత విధిజాతమును దెలియజేయు భాగము. బ్రాహ్మణమునం దర్థవాదసహిత మగు బ్రాహ్మణ 'మనుబ్రాహ్మణ' మని సంప్రదాయవిదులు చెప్పుదురు. 'అనుమత్యై పురోడాశ మష్టాకపాలం నిర్వపతి' - ఇది ముఖ్యబ్రాహ్మణము. ఇందు ప్రధానకర్మ విహితమైనది. తైత్తిరీయ బ్రాహ్మణము ప్రథమకాండమున షష్ఠ, సప్తమ, అష్టమ ప్రపాఠకము లను బ్రాహ్మణము - అని యర్థము. ఇట్లే 'ఇషే త్వోర్జేత్వా' - ఇది మంత్రము. దీనికి "తృతీయస్యా జతో దివి సోమ ఆసీత్ ప్రత్యుష్టగ్ం రక్షః (తై బ్రా. ప్ర. 3-2)" - ఇత్యాది ప్రశ్నద్వయము బ్రాహ్మణము. మరల నీ మంత్రమునకే తైత్తిరీయసంహిత (2-5-1) యందలి 'విశ్వరూపో వై త్వాష్ట్రః' - "సమిధో యజతి" —అను ప్రశ్నద్వయ మనుబ్రాహ్మణము.[1] కాన మంత్రములకు బ్రాహ్మణము అనుబ్రాహ్మణము అని బ్రాహ్మణద్వయము గలదు. తైత్తిరీయసంహిత యందు బ్రాహ్మణభాగమే గాక పైన జెప్పినట్లు అనుబ్రాహ్మణము గూడ నుండుట గమనార్హము.

విమర్శకులు చెప్పునట్లు 'బ్రాహ్మణప్రోక్తము లగుటచే బ్రాహ్మణము లను పేరు వచ్చినదని జెప్పుచో, కొంత భాగమునకు బ్రాహ్మణ మనియు, మఱి కొంతభాగమున కనుబ్రాహ్మణ మనియు బేరు వచ్చుటకు గారణమేమి? అందును

---

1. చూ. గజానందశర్మ - వేదవేదికానామ్నీ తైత్తిరీయసంహితాభూమికా.

సంహితలు బ్రాహ్మణప్రోక్తములు కావనియే శ్రీ దయానందాది విమర్శకుల యభిప్రాయము. అట్టియెడ సంహితయందే కొంతభాగము బ్రాహ్మణ మగుటకును మఱికొంతభాగము అబ్రాహ్మణ మగుటకును కారణ మేమి ? కాన 'బ్రాహ్మణప్రోక్తము లగుటచే బ్రాహ్మణము లనెడి ప్రసిద్ధి వచ్చిన' దనెడి విమర్శకుల యూహ సరియైనది కాదు.

## మంత్రబ్రాహ్మణాత్మక వేదము ధర్మమూలము :-

వేదమునకు శ్రుతి యనియు, ధర్మశాస్త్రమునకు స్మృతి యనియు ప్రసిద్ధి.

"శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః"
—మను. 2-10.

కృత్స్న వేదరాశి ధర్మమునకు మూలము. (వేదోఽఖిలో ధర్మమూలమ్ - మను-2-6; శ్రుతిప్రమాణో ధర్మః స్యాత్ - భార. 3-206-41). కావున స్మృతు లడుగడుగున శ్రుత్యర్థము ననుసరించుచుండును. 'శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛత్' (రఘువంశ) - ఇత్యాది వాక్యము లన్నియు నీ యర్థమునే చెప్పుచున్నవి. ఇట శ్రుతి యన నేది ? కేవలము మంత్రభాగమా ? లేక మంత్రబ్రాహ్మణభాగములు రెండు నగునా ? వేదము ధర్మమునకు ప్రమాణమనుచో మంత్రబ్రాహ్మణములు రెండును గూడ వేదశబ్దముచే గ్రహింపబడవలసియున్నది. మంత్రబ్రాహ్మణముల రెండిటిచేతను సాంగోపాంగయజ్ఞకర్మ సిద్ధించు నని పూర్వము వివరింపబడినది. మఱియు 'చోదనాలక్షణోఽర్థో ధర్మః (జై. సూ. 1-1-2)' - అని

మీమాంసాదర్శనమున ధర్మలక్షణము చెప్పబడినది. విధివాక్యము లకే 'చోదన' యని పేరు. అట్టి విధివాక్యమే (చోదనయే) ధర్మమునందు ప్రమాణము; లేక ధర్మము నందు విధివాక్యము ప్రమాణమే - యని పై సూత్రమునకు రెండర్థములు (చోదనైవ లక్షణం ప్రమాణం యస్యసః; చోదనా లక్షణ మేవ యస్య సః చోదనాలక్షణః) చెప్పబడుచున్నవి. మొదటి యర్థముచే విధివాక్యములకంటె నితరములు ధర్మము నందు ప్రమాణములు గావు. రెండవ యర్థముచే విధివాక్యము లప్రమాణములు గావు; ప్రమాణములే - యని తెలియనగును. విధివాక్యములు మంత్రభాగమున విరళముగను, బ్రాహ్మణభాగమున బహుళముగను గలవు. కాన పై సూత్రము ననుసరించి మంత్ర బ్రాహ్మణములు రెండును ధర్మమునకు మూలము లని యంగీక రింపవలెను. అందుచే వేదైకదేశముమాత్రము గాక నిఖిలవేదము ధర్మమునకు మూల మని స్మృతికర్తలు జెప్పినారు.

శ్రుతిస్మృతుల కెచటనైన బరస్పరము విరోధము గన్పట్టినచో నపుడు శ్రుతియే ప్రబలప్రమాణము. స్మృతి కాదు - అని సంప్రదాయము. ఇక మంత్ర -బ్రాహ్మణవిషయమున నట్లు కాదు. మంత్రములకు బ్రాహ్మణములకు విరోధము గన్పట్టుటగాని, అట్టియెడ బ్రాహ్మణముకంటె మంత్రమే ప్రబలప్రమాణ మని చెప్పెడి సంప్రదాయముగాని కానరాదు. విమర్శకులు చెప్పునట్లు బ్రాహ్మణములు పురుషరచితములే యగుచో, శ్రుతిస్మృతుల విషయములో వలె, మంత్రబ్రాహ్మణ విషయమునను గూడ నట్టి భేదము ప్రవర్తిల్లియుండెడిది. కాని లేదు. కాన బ్రాహ్మణములు పురుషబుద్ధికల్పితము లనెడి వాదము శ్రుతిస్మృతి సంప్రదాయాను గతము కాదు.

## యాజ్ఞవల్క్యబ్రాహ్మణములు-ఆక్షేపసమాధానములు:-

కాని యాజ్ఞవల్క్య (శతపథ) బ్రాహ్మణములు మాత్రము అర్వాచీనము

లనియెడి యాక్షేప మొకటిగలదు.[1] అందుకు జూపబడు ప్రమాణములు.

"పురాణ ప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు" —పా సూ. 4-3-105.

పురాణేతి కిం? యాజ్ఞవల్క్యాని బ్రాహ్మణాని"

—సిద్ధాన్తకౌముదీ; కాశికావృత్తి.

పురాణప్రోక్తము లనగా 'పురాణ మునిప్రోక్తములు' - అని యర్థము. పై సూత్రమున 'పురాణ' అను పదము చెప్పనిచో పురాణ మునిప్రోక్తములు గానట్టి యాజ్ఞ్యవల్క్యబ్రాహ్మణములు గూడ గ్రహింపబడును. అర్వాచీన మునిప్రోక్తము లగు యాజ్ఞవల్క్యబ్రాహ్మణములను నిషేధించుట కొఱకే సూత్రమున 'పురాణ అను పదము ప్రయోగింపబడినది. యాజ్ఞవల్క్య బ్రాహ్మణము లర్వాచీనము లని మహాభారతము గూడ జెప్పుచున్నది.

ప్రతిష్ఠాస్యతి తే వేదః సఖిలః సోత్తరో ద్విజ।
కృత్స్నం శతపథం చైవ ప్రణేష్యసి ద్విజర్షభ॥
తతః శతపథం కృత్స్నం సరహస్యం ససంగ్రహమ్।
చక్రే సపరిశేషం చ హర్షేణ పరమేణ హ॥
కృత్వా చాధ్యయనం తేషాం శిష్యాణాం శతముత్తమమ్।
సూర్యస్య చానుభావేన ప్రవృత్తోఽహం నరాధిప॥
కర్తుం శతపథం వేద మపూర్వం చ కృతం మయా।
యథాఽభిలషితం మార్గం తథా తచ్చోపపాదితమ్॥"

—భార. 12-318-10 నుండి 23.

కాన యాజ్ఞవల్క్యబ్రాహ్మణము లర్వాచీనములు - అని యాక్షేపము.

1. భగవద్దత్త - హంసరాజకృత వైదికకోశ - ఉపోద్ఘాత.

ఈ వాదము సరికాదు సిద్ధాంతకౌముది యందును, కాశికావృత్తి యందును జేయబడిన పై సూత్రవ్యాఖ్యానము భాష్యవార్తికవిరుద్ధము; కాన నాదర ణీయము గాజాలదు వార్తికమునందును, తద్వివరణరూపమైన భాష్యమునందును యాజ్ఞవల్క్యబ్రాహ్మణములు ఇతరబ్రాహ్మణతుల్యకాలములని స్పష్టముగ జెప్ప బడినది

పురాణప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు యాజ్ఞవల్క్యాదిభ్యః
ప్రతిషేధః, తుల్యకాలత్వాత్" —వార్తికమ్.

"పురాణప్రోక్తేష్వితృత్ర యాజ్ఞవల్క్యాదిభ్యః ప్రతిషేధో
వక్తవ్యః । యాజ్ఞవల్క్యాని బ్రాహ్మణాని సౌలభాని ఇతి।
కిం కారణమ్ ? తుల్యకాలత్వాత్ । ఏతాన్యపి తుల్యకాలానీతి"

-మహాభాష్య-(చూ. మహాభాష్య ఛందోబ్రాహ్మణాని చ తద్విషయాణి. 4-2-66.)

భాష్యవ్యాఖ్యానములగు ప్రదీప -ఉద్యోతములు రెండిటియందును మిగిలిన బ్రాహ్మణముల వలెనే యాజ్ఞవల్క్యబ్రాహ్మణములు గూడ పురాణప్రోక్తములే గాని యర్వాచీనములు గావని స్పష్టముగ వివరింపబడినది. కాన యాజ్ఞవల్క్య బ్రాహ్మణములు అర్వాచీన మునిప్రోక్తము లనుట భాష్యవార్తికసంమతము గాదు. బ్రాహ్మణము లన్నియు గూడ నతిపురాణము లనెడి యథాస్థితార్థమును స్పష్టముగ గుర్తింపజేయుటకే పాణినిమహర్షి పై సూత్రమున 'పురాణ' పదమును నిర్దేశించె నని భాష్యవార్తికానుగుణముగ నర్థమును గ్రహించుట యుక్తము. మఱియు యాజ్ఞవల్క్యబ్రాహ్మణముగ బ్రసిద్ధమగు శతపథబ్రాహ్మణము గూడ మిగిలిన బ్రాహ్మణముల వలెనే ప్రమాణభూతమైన శ్రుతిభాగముగ జైమిని, బాదరాయణాది మహర్షులును, ధర్మబ్రహ్మసూత్రభాష్యకారు లందఱును గ్రహించి తమతమ దర్శనములందు విషయవాక్యములుగ బలుచోట్ల నుదహరించిరి. ఇట్లు జైమిని-బాదరాయణాది మహర్షు లందఱిచేతను శతపథబ్రాహ్మణము ప్రమాణభూతమగు శ్రుతిగ నాదరింపబడుటచే మహాభారతమునందలి యాఖ్యాయికను తదవిరోధముగ సమన్వయము జేసికొనవలసియున్నది. శాస్త్రము వలె నాఖ్యాయిక స్వతః ప్రమా

ణము కాదని సంప్రదాయము. ఆఖ్యాయిక యర్థవాదరూప మగుటచే స్తుతిరూప ముగ గ్రహింపవలసియున్నది. అందువలననే 'శతపథం చక్రే'- అను మహాభారత వాక్యమునకు - "చక్రే కర్మకర్తరి ప్రయోగః । స్వయమేవ ఆవిరభూ దిత్యర్థః —స్వయముగనే యావిర్భవించెను" - అని నీలకంఠపండితుడును, 'ప్రవచన విషయీకృతవాన్ - శిష్యులకు ప్రవచనము చేయుచు వ్యాప్తి నొందించెను' —అని తదితరపండితులును సంప్రదాయానుగుణముగ నర్థము వివరించిరి. మంత్రకృత్ ఋషికృన్ —ఇత్యాది ప్రయోగముల కిట్టి యర్థమును గ్రహించెడి సంప్రదాయము పూర్వము ఋషిశబ్దమున వివరింపబడినది. కాన శతపథబ్రాహ్మణ మర్వాచీన మనియెడి యాక్షేపము సరి కాదు

## బ్రాహ్మణశబ్దనిర్వచనము-ఆక్షేపసమాధానములు :-

"మఱియు బ్రాహ్మణశబ్ద నిర్వచనమును గూర్చి విమర్శకులు[1] చెప్పుచున్న యాక్షేప మొకటి గలదు; వారి వాద మిది: జైమినిమహర్షి 'శేషే బ్రాహ్మణశబ్దః (2-1-33)' -అని బ్రాహ్మణలక్షణము చెప్పినాడు. మంత్రభాగాతిరిక్త మగు వేదభాగము బ్రాహ్మణ మని యర్థము; ఈ లక్షణము యుక్త మని ఋగ్వేదభాష్య భూమికాదులయందు సాయణాదులచే నంగీకరింపబడినది; కాని యీ లక్షణము బ్రాహ్మణశబ్దార్థ జ్ఞానోపయుక్తము కాదు; దీనివలన బ్రాహ్మ గ్రంథ స్వరూపప్రతీతి యేమియు గలుగుటలేదు; కనుక నిది గ్రాహ్యము కాదు; బ్రాహ్మణభాగము వేద మని యనుటలో మాకు విప్రతిపత్తియుండుట వలనను, జైమినిమహర్షి చెప్పిన యీ లక్షణము గ్రాహ్యము కాదు; కాన 'కర్మచోదనా బ్రాహ్మణాని (35 సూ)' —అని యాపస్తంబుడు చెప్పిన బ్రాహ్మణలక్షణమే గ్రాహ్యము; అగుచో కర్మ

1. ఆచార్య సత్యవ్రతసామశ్రమీ - ఐతరేయాలోచనమ్.

విధాయకములు మంత్రములు గూడ నగునుగదా ! ఈ లక్షణ మెట్లు తగును ? అని యందురేమో ! పదార్థస్వరూపమును దెలియజేయుట కుపయుక్తముగాని నిర్దోషలక్షణము కంటె, పదార్థస్వరూపబోధ కుపయోగ పడెడి లక్షణము సదోషమైనను గ్రాహ్యమే; వస్తుతః యజుస్సులు బహుళముగ నుండుటచే యజుర్వేదమని చెప్పినట్లు, కర్మ విధాయకవాక్యములు బహుళముగ నుండుటచే వీనికి బ్రాహ్మణము లను పేరు తగును. వీనిని రచించినవి బ్రాహ్మణులు; బ్రాహ్మణరచితము లగుటచే వీనికి బ్రాహ్మణములని యన్వర్థసంజ్ఞ; శ్రీ దయానందసరస్వతీస్వామియు, హాగ్ పండితుడును బ్రాహ్మణశబ్దనిర్వచనము నిట్లే చెప్పిరి; అంతియేగాని బ్రహ్మ యన వేదము; తద్వ్యాఖ్యానరూపము లగుటచే వీనికి బ్రాహ్మణము లని సార్థకనామము, —అని చెప్పుట శబ్దానుశాసనవిరుద్ధము; 'బ్రాహ్మోజాతౌ - (పా.సూ. 6-4-117). —అను పాణినిసూత్రము ననుసరించి యపత్యార్థమున (బ్రహ్మణః అపత్యం) బ్రాహ్మణ-అను రూపము సిద్ధించును; అందుచే బ్రహ్మకు (వేదమునకు) సంబధించినది యనియెడి యర్థమున 'బ్రాహ్మీ' అనియే రూపము సిద్ధించునుగాని, బ్రాహ్మణమ్' అను రూపము సిద్ధింపదు; కాన బ్రాహ్మణప్రోక్త యాగవిద్యాదిబోధకమగు వచనము బ్రాహ్మణము; లేక యట్టి వచనజాతముతో నొప్పు గ్రంథము బ్రాహ్మణము; లేక వేదార్థకుశలు రగు బ్రాహ్మణులచే ప్రోక్తమై యాగ విద్యానుస్యూతమగు భాష్యమే బ్రాహ్మణము" - అని యాక్షేపము.

ఇట్లు చెప్పుట తగదు. 'మంత్రవ్యతిరిక్త వేదభాగము బ్రాహ్మణము' —అను జైమినిలక్షణము నిర్దుష్ట మని యీ విమర్శకులు గూడ నంగీకరించిరి. కాని బ్రాహ్మణము వేదభాగము కాదని వారి వాద మగుటచే నీలక్షణము నిర్దుష్టమైనను వారికి గ్రాహ్యము కాకపోయినది. బ్రాహ్మణము వేదభాగమని పైన సప్రమాణముగ నిరూపింపబడినది. కాన జైమినిమహర్షి చెప్పిన లక్షణము గ్రాహ్యమే యగును. అట్టిచో బ్రాహ్మణములు బ్రాహ్మణులచే రచితములని యనుటకును వలనుపడదు. మఱియు ఋగ్వేదము మొదటి మండలముననే 'బ్రాహ్మణాచ్ఛంసి' యను ఋత్విజుని ప్రశంస గలదు. దానిని బూర్వము వివరించితిమి. బ్రాహ్మణవిహితములగు శస్త్రముల శంసనము జేయువాడగుటచే 'బ్రాహ్మణాచ్ఛంసి

యని యతనికి సార్థకనామ మని మహాభాష్యాదిగ్రంథముల వలన దెలియుచున్నది. తరువాత నెప్పుడో బ్రాహ్మణులచే రచింపబడనున్న బ్రాహ్మణములచే విహితము లయ్యెడి శస్త్రములను (మంత్రముల) నా ఋత్విక్కు శంసనము జేయుచెట్లు ? అట్టి వానిని గూర్చి ముందుగా ఋగ్వేదమంత్రములు జెప్పుచెట్లు ? కాన 'బ్రాహ్మణప్రోక్త మగుటచే బ్రాహ్మణము అనెడి లక్షణము శ్రుతిసంమతము, యుక్తిసహమును గాదు. 'కర్మచోదనా బ్రాహ్మణాని' —యనెడి యాపస్తంబ సూత్రము బ్రాహ్మణస్వరూపాను వాదకమే గాని బ్రాహ్మణలక్షణము గాదని విమర్శకులే యంగీకరించిరి. కాన 'శేషే బ్రాహ్మణశబ్దః' - అను జైమిని **లక్షణమే** నిర్దుష్ట బ్రాహ్మణలక్షణము.

జైమినిలక్షణ మంగీకరించినచో నిది 'బ్రాహ్మణశబ్దార్థజ్ఞానోపయుక్తము కాదు: బ్రాహ్మణస్వరూపప్రతీతి గలుగుటలేదు —అని యనుటయు సరికాదు. బ్రహ్మ యనగా మంత్రరూపవేదభాగము. దానికి సంబంధించినది, అనగా తద్వ్యాఖ్యానరూప మగుటజేసి బ్రాహ్మణ మని యన్వర్థసంజ్ఞ. మంత్రప్రకాశితము గాని దేదియు బ్రాహ్మణభాగమున స్వతంత్రముగ జెప్పబడియుండలేదు ఒకవేళ బ్రాహ్మణ భాగమునకు మూల మగు మంత్ర మేదియైన స్పష్టముగ నుపలభ్యము కాకపోయినను శాఖాంతరీయమగు మంత్రమేదియో మూలభూతమై యుండి యుండునని గ్రహింపవలె ననియు బూర్వము చెప్పబడినది. కాన బ్రాహ్మణము బ్రహ్మ (మంత్ర) సంబద్ధము; తద్వ్యాఖ్యానరూపము; కాన బ్రాహ్మణ మను నామధేయ మన్వర్థము (బ్రహ్మాణి నామ మంత్రాః సంహన్యంతే స్పష్టీక్రియంతే వ్యాఖ్యాయంతే వా యస్మిం స్తాదృశే వేదభాగే బ్రాహ్మణశబ్ద ఇత్యర్థః — శ్రీధరశర్మా - శతపథబ్రాహ్మణ - ఉపోద్ఘాత).'

ఇట్లు నిర్వచనమును జెప్పుచో 'బ్రాహ్మో జాతౌ' అను పాణిని సూత్రముతో విరోధము వచ్చు ననుటయు **సరి కాదు.** పై సూత్రము ననుసరించి జాతిరూపార్థమున, అనగా 'బ్రహ్మకు (బ్రాహ్మణునకు) సజాతీయభార్యయందు బుట్టినవాడు'-అను నర్థమున 'బ్రాహ్మణ' - అను రూపము సిద్ధించును. 'బ్రహ్మకు సంబంధించినది యను నర్థము చెప్పుచో 'బ్రాహ్మమ్' అను రూపము సిద్ధించునుగాని బ్రాహ్మణమ్

అన్న రూపము సిద్ధించుటెట్లు ? - అని యాక్షేపము. ఇట్లాక్షేపించుట యుక్తమే, పై సూత్రముచే జెప్పబడిన నియమము లౌకికసంస్కృతమున గ్రాహ్యము కావచ్చును. కాని లౌకికసంస్కృతమునను, పురాణాదులయందును, వేదము ను గూడ బ్రాహ్మణశబ్దము జాతియ పార్థమనసే గాక 'బ్రహ్మాధ్యయనపరుడు, బ్రహ్మ వేత్త, వేదపారగుడు' ఇత్యాద్యర్థములందుగూడ ప్రసిద్ధము.

"అథ బ్రాహ్మణో ద్విజే ఆత్మజ్ఞే। క్లీతు విధివద్వేదభాగ తదంశయోః" —వైజయన్తీ.

'బ్రాహ్మణో బ్రాహ్మణత్వాచ్చ" —హరివంశ. 3.166.7.

"బ్రాహ్మణత్వాత్, బ్రహ్మ వేదః, తదధ్యేతృత్వాత్ బ్రాహ్మణో బ్రాహ్మణాచ్ఛంసీ నామ" —నీలకంఠః.

బ్రహ్మ యనగా వేదము. దాని నధ్యయనము చేసినవాడగుటచే బ్రాహ్మణుడు —అని బ్రాహ్మణాచ్ఛంసి యనెడి ఋత్విక్కుచే జెప్పబడును.

"బ్రాహ్మణః బ్రహ్మవిత్" --నీలకంఠః, హరివంశ. 2-72-43.

"చత్వారి వాక్పరిమితాపదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః" —ఋ. 1-164-45.

బ్రాహ్మణాః వేదవిదః" —సా. భా; వేం. మా. భా.

"బ్రహ్మ విదన్తీతి బ్రాహ్మణాః-టిలోపాభావ శ్ఛాందసః" —నిర్ణయసాగర మహాభాష్య టిప్పణీ.

'బ్రాహ్మణ(ణీ) - బ్రహ్మ వేదం, శుద్ధం చైతన్యం వా వేత్తి అధీతే వా, అణి

ఇంతేగాదు. అగ్నిని శ్రుతి బ్రాహ్మణు డని వ్యవహరించినది.

"స ప్రజాపతి ర్బ్రాహ్మణ మబ్రవీత్" —తై. సం. 2-5-11-8.

"యోఽయం మానుషోఽగ్నిః స బ్రాహ్మణః- బ్రహ్మణి
వేదే విహితం కర్మ సాధయితుం ప్రవృత్తత్వాత్" —సా.భా.

బ్రహ్మయందు (వేదమునందు) విహితమైన కర్మను సాధించుటకు (నిర్వర్తించుటకు) ప్రవృత్తు డగుటచే నీ యగ్ని బ్రాహ్మణుడు - అని యర్థము. కాన బ్రాహ్మణు డన బ్రహ్మ (వేద) విహిత కర్మసాధన ప్రవృత్తు డని యర్థము. ఈ లక్షణము అగ్నియందును, వేదవిహితకర్మానుష్ఠానపరుల యందును, బ్రహ్మ విహిత కర్మప్రకాశకము గాన బ్రాహ్మణగ్రంథము నందును నొప్పును.

బ్రహ్మరూప మగు మంత్రభాగము యొక్క పరిరక్షణము చేయుటవలన. బ్రాహ్మణ మని సార్థకనామము - అని వాయు పురాణవచనము వలన దెలియును

"మంత్రో మన్త్రయతేర్ధాతో ర్బ్రాహ్మణో బ్రహ్మణోఽవనాత్"
—వాయు. 59 - 116.

"త్రీ నిమాన్ కృతవాన్ లోకాన్ యథాఽహ బ్రాహ్మణీ శ్రుతిః"
—హరివంశః 3-14-8.

"బ్రాహ్మణీ బ్రహ్మప్రతిపాదికా" —నీలకంఠః

బ్రహ్మప్రతిపాదక మగుటచే శ్రుతి బ్రాహ్మణియై యొప్పును - అని యర్థము. బ్రహ్మప్రతిపాదిక యగు శ్రుతి బ్రాహ్మీ యని గాక బ్రాహ్మణీ యని యిట జెప్పబడుట గమనార్హము. కాన పై సూత్రము ననుసరించి జాతిరూపార్థ మునసే 'బ్రాహ్మణ' అను రూపము సాధువగు ననుట యుక్తము గాదు. బ్రహ్మ

సంబద్ధమై బ్రహ్మవేతృత్వము, బ్రహ్మవిహితకర్మ ప్రకాశకత్వము నను ధర్మములు గలిగి యొప్పుటజేసి మంత్రవ్యతిరిక్త వేదభాగము బ్రాహ్మణ మనెడి యన్వర్థ సంజ్ఞతో నొప్పుట స్పష్టము.

మంత్రములకు వలె బ్రాహ్మణములకు ఋషి - ఛందో - దేవతాజ్ఞాన నియమము లేనందున మంత్రములవలె బ్రాహ్మణము లపౌరుషేయములు కావు —అనెడి యాక్షేపము గూడ నొకటి గలదు. ఇక దానిని బరిశీలంతము.

## మంత్రము : ఋషి-ఛందో-దేవతాపరిజ్ఞానము :-

"మంత్రముల విషయమై ఋషి - ఛందో - దేవతలతో గూర్చిన యను క్రమణికలు గన్పట్టుచున్నవి ; బ్రాహ్మణముల విషయమున గన్పట్టుట లేదు; సంహితలకు ఋష్యనుక్రమణిక గలదు; కాని వానియందు గొన్ని యెడల గల బ్రాహ్మణభాగమునకు లేదు; దీనినిబట్టి జూచినచో ఋషిచ్ఛందో దేవతా నియమములు గల మంత్రభాగము మాత్రమే యపౌరుషేయ మనియు, అట్టి నియమములు లేనందున బ్రాహ్మణభాగము పౌరుషేయ మనియు స్పష్ట మగుటలేదా ?" - యని యాక్షేపము.[1]

ఈ వాదము సరి కాదు. ఋషి - ఛందో - దేవతా - బ్రాహ్మణసహితమైన మంత్రములతోనే యజన -యాజన - అధ్యాపనాదిక్రియలు సలుపవలె ననియు, నట్లు జేయనిచో ప్రత్యవాయము సంభవించు ననియు శ్రుతి యిట్లు శాసించుచున్నది.

---

1. భగవద్దత్త - హంసరాజకృత వైదికకోశోపోద్ఘాత.

"యో హ వా అవిదితార్షేయ చ్ఛందో దైవత బ్రాహ్మణేన మంత్రేణ యజతి యాజయతి వాఽధ్యాపయతి వా స్థాణుం వర్ఛతి గర్తే వా పాత్యతే ప్రమీయతే పాపీయాన్ భవతి।....తస్మా దేతాని మంత్రే మంత్రే విద్యాత్"

—ఆర్షేయబ్రాహ్మణమ్ 1-1-6 (చూ. సాయణకృత తై.సం. భాష్యభూమికా)

"పదం పాదం విధాం మాత్రాం ఛందో విజ్ఞాయ దైవతమ్।
ఆర్షం చ బ్రాహ్మణం చైవ తతః సామ ప్రయోజయేత్ ॥

....ఛందోగపరిశిష్ట (చూ. విష్ణ్వాత్మజకృత సంహితోపనిషద్బ్రాహ్మణభాష్య.3 -31.

ఇట్లు శ్రుతిశాసన మగుటజేసి మంత్రవిషయమున ఋషిచ్ఛందో దైవతానుక్రమణిక లావశ్యకములు. మంత్రవినియోగవిషయమున (యజన యాజనాది సమయమున) ఋషి - ఛందో - దైవతాదులతోపాటు బ్రాహ్మణము కూడ తెలియదగి జ్ఞేయకోటిలో జేరియున్నది. అందుచే శ్రుతితాత్పర్యము ననుసరించి బ్రాహ్మణముల విషయమై ఋషి చ్ఛందో దైవతజ్ఞాన మావశ్యకము గాదు. కాని బ్రాహ్మణగత మంత్రముల విషయమై, యవి బ్రాహ్మణగతము లైనను, మంత్రము లగుటజేసి శ్రుతి యాదేశానుగుణముగ ఋష్యాదిజ్ఞాన మావశ్యకమైనది. కాన ఋషిసంబంధ బోధక - అనుక్రమణిక లేనందున బ్రాహ్మణములు పౌరుషేయము లనుట తగదు. ప్రయోగసమవేతములు మంత్రములే కాని విధివాక్యాదిరూపము లగు బ్రాహ్మణ వాక్యములు కావు గదా। యజన యాజనాది సమయములందు ఋషిచ్ఛందోదైవత జ్ఞానము, తత్సంబంధి బ్రాహ్మణోద్దిష్టార్థపరిజ్ఞానము- వీనితోగూడిన మంత్రప్రయోగమే కర్మసమృద్ధికి గారణ మనుట సంప్రదాయము. ఋషులచే నెపుడు మంత్రములు దర్శింపబడినవో, కర్మసమృద్ధికై యపుడే బ్రాహ్మణ సహితములైన మంత్రములే దర్శింపబడిన వని తెలియదగును. "యజ్ఞేన వాచః పదవీయ మాయన్। తా మన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్।" (ఋ 10-71-3) అను శ్రుతివాక్యము

నీ విషయము నిట్లు స్పష్టము చేయుచున్నది. "ధీరులగువారు యజ్ఞముచేతనే వేద వాక్కు యొక్క మార్గము ననుగమించిరి." ఏ వాక్కుయొక్క మార్గము? అది స్వక పోలకల్పితమా? ఇతరకల్పితమా? రెండును కాదు. "ఋషులయందు ప్రవిష్టమై నిహితమైయున్న యజ్ఞనిష్పాదిక యగు వాక్కును బొందిరి"-అని శ్రుతి చెప్పుచున్నది. ఇక నీ మంత్రము యొక్క రెండవ పాదము. "తా మాభృత్యా వ్యదధుః పురుత్రా తాం సప్తరేభా అభి సం నవన్తే" "ఋషులనుండి యా వాక్కును గ్రహించి యధ్యాపనము, యజ్ఞము మున్నగువానిద్వారా పలువిధములుగ బలుచోట్ల వ్యాప్తి జేసిరి. అట్టి యీ వాక్కును సప్తచ్ఛందస్సులు ననుగమించుచున్నవి" – అని యర్థము. (చూ. సా. భా; ఉద్గీథ భా; ఋషిశబ్దము). దీని ననుసరించి ఋషులచే దర్శింపబడి వారియందు నిహితమై యున్న ఛందోమయి యగు నీ వాక్కే యజ్ఞ నిష్పాదిక యగు వాక్కు. అదియే యజన - యాజనాధ్యాపనాదుల ద్వారా సర్వత్ర వ్యాప్తమైనట్లు దెలియగలము. యజన - యాజనాది సమయములందు ఋషి చ్ఛందో దైవతబ్రాహ్మణ జ్ఞానరహిత మగు మంత్రమును బ్రయోగింపరాదని శ్రుతిశాసనము. కనుక యజ్ఞనిష్పాదిక యగు వేదవాక్కునే ఋషులు దర్శించిరి; అనగా కర్మసమృద్ధికై బ్రాహ్మణసహితమగు మంత్రజాతమునే దర్శించి రనుట శ్రుతిసంమతము, యుక్తిసహము గూడ. మఱియు బ్రాహ్మణములకు ఋషి-ఛందో-దేవతాజ్ఞాన మావశ్యకము కాదనినంత మాత్రముచే వానికి ఋషిసంబంధము (ఆర్షేయత్వము) లేదనుటయు, కాన నవి పౌరుషేయములే యని యనుటయు యుక్తము గాదు. బ్రాహ్మణములకు గల ఋషిసంబంధము సాయణాదిభాష్యకర్తలచే నుదహరింపబడిన కాండానుక్రమణికావచనములచే దెలియనగును.

"శాఖాదిం యాజమానం చ హోత్రాన్ హౌత్రం చ దార్శికమ్।
తద్వ్యాధీన్ పితృమేధం చ నవాహుః కన్య తద్విదః ॥
అధ్వరప్రభృతి త్రీణి తద్విధి ర్వాజపేయకౌ ।
నవా శ్శుక్రియకాండే చ నవేందో రితి ధారణా॥"

.. కాండానుక్రమణికా.

"శాఖాదిః 'ఇషేత్వా' ఇత్యాది ప్రపాఠకః, యాజమానాః 'సం త్వా సించామి' ఇత్యా ద్యనువాక షట్క మంత్రాః । హోతారః 'చిత్తిఃస్రుక్' ఇత్యాదయో మంత్రాః । 'సత్యం ప్రపద్యే' ఇత్యాదికం దార్శికం హౌత్రమ్ । తద్విధయః ప్రోక్తానాం చతుర్విధమంత్రాణాం చత్వారి బ్రాహ్మణాని । పితృమేధః 'పరేయువాగ్ంస' మితి । తా న్యేతాని నవకాండాని ప్రజాపతినా దృష్టాని" —తై. సం. సా. ఉపోద్ఘాతః.

'ఆప ఉంద న్త్విత్యాదిక మధ్వరకాండమ్ । ఆదదే గ్రావాసీ త్యాదికం గ్రహకాండమ్। ఉదుత్యం జాతవేదస మిత్యాదికం దక్షిణాకాండమ్ । తా న్యేతాని త్రీణి । ప్రాచీన వగ్ంశం కరోతీత్యాదికం త్రయాణా మేతేషాం విధిః। దేవ సవితః ప్రసువేత్యాదికం వాజపేయస్య మంత్రకాండమ్ । దేవా వై యథా దర్శం యజ్ఞా నాహర న్త్విత్యాదికం వాజపేయస్య విధికాండమ్ । త్రివృ త్స్తోమో భవతీత్యాదికాః సవాః। నమో వాచే యాచోది తేత్యాదికం శుక్రియ మంత్రకాండమ్ । దేవా వై నత్ర మాసతే త్యాదికం తద్విధికాండమ్ । తా న్యేతాని నవ స ఖ్యాకాని చంద్రస్య కాండాని । అత స్తేషు చంద్ర ఋషి రితి ధ్యేయమ్ ।" ....సా. భా.-తై. సం. 1-2-1.

పై కాండానుక్రమణికాశ్లోకములను, శ్రీ సాయణకృత తదర్థవివరణ మును బరిశీలించుచో తైత్తిరీయసంహితయందలి దార్శికాద్వ్యవ మంత్రాది కాండము ప్రజాపతి – సోమాదులచే దృష్టము లయినట్లే తద్విధిరూపము లగు బ్రాహ్మణము లును వారిచేతనే దృష్టము లయినట్లు స్పష్ట మగును. ఇట్లే వివిధశాఖాగత మంత్ర బ్రాహ్మణవిషయమునను దెలియదగును.

"కొన్నియెడల బ్రాహ్మణములకు ద్రష్ట ప్రజాపతి యని చెప్పబడు చున్నాడు. ప్రజాపతి పరమేశ్వరునినుండి మంత్రభాగమును గ్రహించి, పిదప వేదవ్యాఖ్యానరూపములగు బ్రాహ్మణముల బ్రవచించెను ; ఇట్లు వేద వ్యాఖ్యాన ప్రవచనకర్త యగుటజేసియే ప్రజాపతి యచటచట బ్రాహ్మణములకు ఋషిగా జెప్పబడినాడు" - అనియు విమర్శకుల యాక్షేపము.[1]

ఇట్లనుట సరికాదు. 'ఋషి ర్దర్శనాత్'- అని ఋషిశబ్ద నిర్వచనము. దీని ననుసరించి 'దర్శనము' వలననే ఋషిత్వవ్యవహార మేర్పడవలయునుగాని 'వ్యాఖ్యా పవచనముల' వలన గాదు. వేదగతార్థమును దర్శించి వ్యాఖ్యాప్రవచనముల జేసిన వారు స్మృతికర్తలు. వారు మంత్రబ్రాహ్మణ ద్రష్టలై, ఋషులై, పిదప స్మృతికర్త లయిరి. అంతియేకాని స్మృతికర్తృత్వము -వ్యాఖ్యాప్రవచనకర్తృత్వము - ఋషిత్వ ప్రయోజకము కాదు. (చూ -ఋషిశబ్దము). ద్రష్టృత్వప్రయుక్తమే ఋషిత్వము, కాగా ప్రజాపతికి గల ద్రష్టృత్వము వ్యాఖ్యాప్రవచనపూర్వకము కాదనుట శ్రుతిస్మృతి సంప్రదాయాభిమతము. శ్రీ సాయణాదులును 'ప్రజాపతినా దృష్టాని' యని వ్యాఖ్యా వించుట గమనార్హము. కాన వేదవ్యాఖ్యానరూప బ్రాహ్మణముల బ్రవచించుటచే ప్రజాపతికి ఋషిత్వవ్యవహారము గలదనుట సంప్రదాయాభిమతము, యుక్తి సహము గాదు.

వాత్స్యాయనమహర్షియు 'మంత్రబ్రాహ్మణద్రష్టలగు ఋషులే పురాణేతి హాస - ధర్మశాస్త్రకర్తలు' అని యనినాడు.

"ద్రష్టృ ప్రవక్తృ సామాన్యా చ్చాప్రామాణ్యానుపపత్తిః' - య ఏవ మంత్రబ్రాహ్మణస్య ద్రష్టారః ప్రవక్తారశ్చ తే ఖల్వితి

1. భగవద్దత్త .... వైదికకోశోపోద్ఘాత-పుట 46.

హాసస్య పురాణస్య ధర్మశాస్త్రస్య చేతి"

—వాత్స్య. భా: న్యా. సూ. 4-1-62.

"య ఏవ వేదస్య ద్రష్టారోఽనుష్ఠాతారశ్చ తదర్థస్య త ఏవ
స్మృతీతిహాసాదీనాం ప్రవక్తారః -- ఇత్యర్థః"

—ఉద్యోతవ్యాఖ్య.

మంత్రబ్రాహ్మణ (వేద) ద్రష్టలును ప్రవక్తలు నగు ఋషులే పురాణేతిహాస - ధర్మశాస్త్రప్రవక్తలు - అని యర్థము. ఇట మంత్రబ్రాహ్మణయోః ద్రష్టారః' అనిగాక 'మంత్రబ్రాహ్మణస్య ద్రష్టారః' అని యేకవచన ప్రయోగము గలదు. మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయమ్' -ఇత్యాది స్థలములయందు ఇతరేతరయోగద్వంద్వముచే మంత్రబ్రాహ్మణములకు గల నిరంతరసాహచర్య మభివ్యక్త మగును. ఇట న్యాయభాష్యమున "మంత్రబ్రాహ్మణస్య ద్రష్టారః' - అని సమాహారద్వంద్వ మాశ్రయించి యేకవచనము ప్రయోగింపబడినది. అందుచే ఋషులు మంత్ర బ్రాహ్మణసముదాయరూప వేదరాశియొక్క ద్రష్టలు; తదేకదేశమునకు గాదు' - అను విషయముగూడ నభివ్యక్త మగుచున్నది. కాన ఋషులు దర్శించినది మంత్ర బ్రాహ్మణ సముదాయము; తదేకదేశము కాదు. తత్ప్రోక్తములు పురాణేతిహాస ధర్మశాస్త్రములు. అట్లుగాక బ్రాహ్మణములు కూడ ఋషిప్రోక్తము లగుచో నవియు స్మృతులే యనబడెడివి. తత్ప్రోక్తములైన స్మృతులే మంత్రబ్రాహ్మణములు రెండును వేదము' - అని ముక్తకంఠముగ గీర్తించినవి. కావ విమర్శకుల యొక్క పై యూహలు బ్రాహ్మణగత పౌరుషేయత్వ నిర్ణాయకములు గాజాలవు. ప్రత్యక్షప్రమాణముచేగాని, యనుమానప్రమాణముచే గాని తెలియజాలని పురుషార్థోపాయములను-అతీంద్రియార్థములను వెలియజేయజాలినది వేదము (వేదయతీతి) - అనునదియే వేదముయొక్క వేదత్వమును తెలియజేయు లక్షణము. అట్టి లక్షణము మంత్రమునందు వలెనే బ్రాహ్మణమునందు నుండుటచే మంత్ర బ్రాహ్మణాత్మక శబ్దరాశికి ఛందస్త్వ మవిరుద్ధము.

ఇంతవరకును గాయత్ర్యాదిఛందోబద్ధములు గానందున బ్రాహ్మణములకు ఛందస్త్వము లేదు' - అనెడి శ్రీ నాగేశభట్టు వాదమును, బ్రాహ్మణభాగమునకు వేదసంజ్ఞయే లేదనెడి శ్రీ దయానందాదుల వాదములును బరిశీలింపబడినవి. మంత్ర బ్రాహ్మణముల రెండింటికిని వేదత్వము, ఛందస్త్వము గలదని దర్శించితిమి. ఛందః పద పరిశీలనము వలనను నీ విషయ మింకను స్పష్టము కాగలదు. 'ఛందోబద్ధ త్వము ఛందస్త్వ' మనునది యాపాతలక్షణము మాత్రమే యని నిరూపింపబడి నందున నిక శ్రుత్యనుగుణముగ ఛందోలక్షణ మేదియో దెలియవలసియున్నది.

## శ్రుతులు - ఛందఃపదనిర్వచనములు :-

శ్రుతులే ఛందఃపదము నెట్లు నిర్వచించినవో జూతము.

### ఛాదనాత్ ఛందాంసి :-

"దేవా వై మృత్యో ర్బిభ్యత స్త్రయీం విద్యాం ప్రావిశగ్ం స్తే ఛందోభి రాచ్ఛాదయన్ య దేభి రాచ్ఛాదయగ్ం స్త చ్ఛందసాం ఛందస్త్వమ్" —ఛాం. ఉ. 1-4-2.

దేవతలు మృత్యువునకు భయపడిరి. మృత్యువునుండి రక్షింపగ్లిగినది త్రయీవిద్యయే యని తలచిరి. త్రయీవిద్య నాశ్రయించిరి. తద్విహిత కరాత్మ చరణమునకు దొడగిరి ఛందస్సులతో (మంత్రములతో) వివిధజప హోమ కర్మాదుల ననుష్ఠించిరి. ఇట్లు నిరంతరము తమ్ము ఛందస్సులతో నాచ్ఛాదించు కొనిరి గాన నాచ్ఛాదకము లగుటచే ఛందస్సు లని వేదములకు నన్వర్థసంజ్ఞ - అని యరము.

యాస్కమహర్షియు 'ఛందాంసి ఛాదనాత్' (నిరు. 7-3-2) అని పై శ్రుత్యుక్త నిర్వచనమునే ప్రదర్శించినాడు. పై శ్రుతివాక్యముల గమనించుచో 'కృత్స్న వేదరాశికివి ఛందస్సు లనెడి వ్యవహారము గలదు; నిరంతరము వేద మంత్రములతో సఖ్యము జేయుచు తద్విహితకర్మాద్యనుష్ఠానతత్పరు లగుటయే ఛందస్సులతో నాచ్ఛాదించుకొనుట; ఆచ్ఛాదకము లగుచు వేదమంత్రములు మృత్యువును దూరము జేసి క్రమముగ నమృతత్వమును సిద్ధింపజేయును' - అని త్రయీ విద్యారూప ఛందఃస్వభావము దెలియును.

భగవద్గీతయందు సంసారవృక్షముయొక్క పర్ణములుగా ఛందస్సులకు రూపకల్పన యిట్లు చేయబడినది.

"ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ ॥"

—భ. గీ. 15-1.

"ఛందాంసి ఛాదనాత్ ఋగ్యజుః సామ లక్షణాని యస్య
సంసారవృక్షస్య పర్ణానీవ పర్ణాని । యథా వృక్షస్య
పరిరక్షణార్థాని పర్ణాని తథా వేదాః సంసార వృక్ష పరిరక్ష
ణార్థాః, ధర్మాధర్మ తద్ధేతు ఫలప్రకాశనార్థత్వాత్...." —శం భా.

ఆచ్ఛాదకములగుటచే ఋగ్యజుఃసామలక్షణములగు మంత్రములకు ఛందస్సు లని పేరు. పర్ణములు వృక్షమునువలె ఛందస్సులు మాయామయసంసార వృక్షపరిరక్షణము సేయుచుండును - ధర్మాధర్మములు, వానివలని ఫలములను ప్రకాశింపజేయుట ద్వారా ఛందస్సులు సంసారవృక్షపరిరక్షణార్థమై యవతరించినవి. అని యర్థము. సంసారవృక్షమునకు మూలము బ్రహ్మ. హిరణ్య గర్భాదులగు జీవులు శాఖాస్థానీయులు. ఆ వృక్షము వినశ్వరము (న శ్వోఽపి స్థాతుం యోగ్యం ఇతి అశ్వత్థమ్); కాని యిది బీజాంకురరూపమున ప్రవాహ నిత్యము. వేదోక్త

ములగు కర్మ లనెడి జలములచే తడుపబడి వర్ధిల్లుచుండును; బ్రహ్మజ్ఞానముచే ఛేదింపబడుచుండును. ఇదియే వేదార్థము. ఇట్లు సమూలసంసారవృక్షజ్ఞానము గలవాడే వేదవిదుడు - అని పై శ్లోక తాత్పర్యము. (చూ. మధుసూదనీ వ్యాఖ్య).

ఇట ఛాదన మనగా 1. తత్త్వవస్తుప్రావరణము, 2. సంసారవృక్షరక్షణము - అని రెండర్థములు చెప్పబడుచున్నవి. ఫలకాములై కర్మలయందు జరించువారికి తత్త్వము నాచ్ఛాదించి ధర్మనిష్ఠుల గావించి సంసారవృక్షమును రక్షించుచుండును. జ్ఞానులగువారికి ధర్మాధర్మఫలముల యొక్క యనిత్యత్వమును దెలిపి రక్షించుచుండును. కర్మిష్ఠుల నధర్మరూపమృత్యువు నుండియు, జ్ఞానులను సంసారరూపమృత్యువునుండియు నాచ్ఛాదించి రక్షించునవి గాన వేదములు ఛన్దస్సులు అను నర్థము పర్యవసిత మగుచున్నది. కాన మృత్యువునుండి భీతులై దేవతలు తయీవిద్యను ప్రవేశించి ఛందస్సులతో దమను ఆచ్ఛాదించుకొని రను పై శ్రుతి-తాత్పర్యమే యిట వివరింపబడిన దనుట స్పష్టము. స్మృతులు నీ యర్థము నిట్లు వివరించినవి.

"మృత్యుభీతైః పురా దేవై రాత్మన శ్ఛాదనాయ చ।
ఛందాంసి సంస్మృతా నీహ చ్ఛాదితా స్తై రతోఽమరాః॥
ఛాదనా చ్ఛంద ఉద్దిష్టం వాససీ కృత్తి రేవ వా।
ఛందోభి రావృతం సర్వం విద్యా త్సర్వత్ర నాఽన్యతః॥"

—బృ. పరా. స్మృతి. 2-41-42.

## ఛందస్సులు శర్మ హేతువులు - కృష్ణాజినశిల్పము (చర్మ - శర్మ) :-

యజ్ఞదీక్షితులగు యజమానుల నాచ్ఛాదించి పరిరక్షణము సేయుచు ఛందస్సులు శర్మ (సుఖ) హేతువు లగునను విషయము కృష్ణాజినదీక్షాధారణ మను వ్యాజమున శ్రుతి చక్కగా నిట్లు వివరించినది.

"అథ కృష్ణాజిన మాదత్తే యజ్ఞస్యైవ సర్వత్వాయ। యజ్ఞో హ దేవేభ్యోఽపచక్రామ, స కృష్ణో భూత్వా చచార। తస్య దేవా అనువిద్య త్వచ మేవావచ్ఛాయాఽఽజహ్రుః ॥"

"తస్య యాని శుక్లాని చ కృష్ణాని చ లోమాని – తా న్యృచాం చ సామ్నాం చ రూపం .... యది వేతరథా.... యాన్యేవ బభ్రూణీవ హరీణి తాని యజుషాం రూపమ్"

"సైషా త్రయీ విద్యా యజ్ఞః। తస్యా ఏత చ్ఛిల్పమ్ - ఏష వర్ణః। తద్యత్ కృష్ణాజినం భవతి। యజ్ఞస్యైవ సర్వత్వాయ। తస్మాత్ కృష్ణాజిన మధిదీక్ష న్తే యజ్ఞస్యైవ సర్వత్వాయ...."

"అథ కృష్ణాజిన మాదత్తే– 'శర్మాసి (వా. సం. 1–14)' –ఇతి। చర్మ వా ఏతత్ కృష్ణస్య, తదస్య తన్మానుషం, శర్మ దేవత్రా। తస్మా దాహ - శర్మాసీతి" —శ.బ్రా 1-1-4-1 నుండి 4.

"దక్షిణే నాహవనీయం ప్రాచీనగ్రీవె కృష్ణాజినే ఉప స్తృణాతి ....యాని శుక్లాని తాని దివో రూపమ్। యాని కృష్ణాని తా న్యస్యై। య దివేతరథా—యాన్యేవ బభ్రూణీవ హరీణి - తాన్య న్తరిక్షస్య రూపమ్। తదేన మేషు లోకే ష్వధిదీక్షయతి....॥"

"—తే వా మాఽభే' (వా సం 4–9) ఇతి। గర్భో వా ఏష భవతి ....యో దీక్షతే। స చ్ఛందాంసి ప్రవిశతి తస్మాన్న్యక్నాంగులి రివ భవతి। న్యక్నాంగులయ ఇవ హి గర్భాః–"

"అథ దక్షిణేన జానునాఽఽరోహతి_ 'శర్మాసి శర్మ మే యచ్ఛ' (వా.సం. 4–9) ఇతి। చర్మ వా ఏతత్ కృష్ణస్య తదస్య తన్మానుషమ్। శర్మ దేవత్రాః తస్మా దాహ–శర్మాసి శర్మ మే యచ్ఛేతి" —శ.బ్రా. 3_2_1-1 నుండి 8.

"యజ్ఞము దేవతలనుండి తొలగిపోయి కృష్ణమృగరూపమై సంచరింప జొచ్చెను; దేవతలు వెన్నంటిపోయి దాని చర్మమును గ్రహించిరి. కావ యజ్ఞశరీరమే కృష్ణాజినము. దానియందలి, శుక్ల - కృష్ణ - బభ్రు వర్ణములు ఋక్ - సామ-యజుస్సుల యొక్క రూపములు. కాన నా వర్ణములు ఋగ్యజుః సామశిల్పములు. ఇట్లు కృష్ణాజినము త్రయీవిద్యాస్వరూపము. త్రయీవిహిత కర్మసాధ్య మగుటచే యజ్ఞము కూడ త్రయీస్వరూపము. అట్టి కృష్ణాజినము గ్రహించుటచేతను, ఆచ్ఛాదించుకొనుట చేతను, యజ్ఞమునకు బూర్ణత సిద్ధించును. అందుచేతనే యజ్ఞదీక్షితుడగు యజమానుడు ఛందస్సుల ప్రవేశించును. (స చ్ఛందాంసి ప్రవిశతి). అని శ్రుతి చెప్పుచున్నది. లేక - కృష్ణాజినము నందలి శుక్ల-కృష్ణ-బభ్రువర్ణములు లోకత్రయరూపములు; లోకత్రయరూప మగు కృష్ణాజినము ధరించి యజమానుడు లోకత్రయదీక్షితు డగుచున్నాడు. మానవునకు మొదట గల్గు నది మానుషజన్మ. యజ్ఞాచరణముచే పునర్జన్మగలిగి దేవత్వము సిద్ధించును. కావున దీక్షితుడగు యజమానుడు గర్భస్థశిశు తుల్యుడు. గర్భస్థశిశువేరీతిగ వ్రేళులు ముడిచి గుప్పిలి పట్టి (న్యక్నాంగులీః ముష్టీన్ కురుతే) మాతృశరీరాచ్ఛాదితుడై యుండునో యజ మానుడు నట్లే గుప్పిలి పట్టి త్రయీవిద్యారూప ఛందోమాతృ శరీరాచ్ఛాదితుడై - కృష్ణాజిన (చర్మ)ధారియై యుండవలెను. అందుకే కృష్ణాజినధారణము. కృష్ణాజినము మానుషదృష్టిలో గృష్ణమృగము యొక్క చర్మమే(త దస్య త న్మానుషమ్). కాని దేవతా ప్రీతికర మగుటచే యజ్ఞకర్మమునందీ చర్మము శర్మ(శర్మ దేవత్రా) యగును కావుననే యజమానుడు - 'నీవు శర్మరూపివి: నాకు శర్మ (సుఖము) నిమ్ము (శర్మాసి శర్మ మే యచ్ఛ)' - అని కృష్ణాజినమును సంబోధించి యధిరోహించుచు బలుకును" - అని యర్థము.

ఇట కృష్ణాజినము త్రయీవిద్యాశిల్పము; అది మానుషదృష్టిలో చర్మము; నియమపూర్వక యజ్ఞానుష్ఠానసమయమున దేవతాప్రీతికరమై శర్మరూపము' - అని చెప్పబడినది. అట్లే ఋక్-యజుః-సామలక్షణమగు త్రయీవిద్యయు మానుషదృష్టిలో గేవలము చర్మరూపము. అనగా మనస్సు నాచ్ఛాదించెడి కేవలశబ్దరూపము. కాని వేదార్థకుశలురై వేదవిహిత కర్మాదిపరతంత్రు డగుచు నిరంతరము ఛందస్సులతో

నాచ్ఛాదించుకొనుచో నపు డా త్రయీవిద్య కేవలచర్మ(శబ్ద)రూపము గాక దేవతాప్రీతి హేతు వగుచు శర్మ(సుఖ)రూప మగు నను విషయ మిట సూచిత మగు చున్నది. దేవతలు మృత్యువునకు భయపడి త్రయీవిద్యను ప్రవేశించి ఛందస్సులతో తమ్మాచ్ఛాదించుకొని రనెడి పూర్వోదాహృత శ్రుత్యర్థమే యిట కృష్ణాజినశిల్పము ద్వారా ప్రదర్శింపబడినది.

త్రయీవిద్యారూపము యజ్ఞము; త్రయీవిద్యాశిల్పము కృష్ణాజినము —కాన నట్టి త్రయీవిద్యాధ్యయనమునందు అధికారము సిద్ధించుటకై చేయబడెడి యుపనయనసంస్కారమునందును గూడ కృష్ణాజినధారణముచేయబడుచుండును. అది మానుషదృష్టిలో 'చర్మమే' యయ్యును దేవతా ప్రీతికరమై శర్మ (ఆనంద) హేతువగుచు 'శర్మ' యగునని చెప్పబడినది. త్రయీవిద్యాప్రతిష్ఠితు లయి ఛంద స్సులతో తమ్మాచ్ఛాదించుకొనువారు చిత్తశుద్ధిద్వారా క్రమముగ శర్మ (ఆనంద) స్వరూపు లగుదు రని ప్రబోధించుటయే కృష్ణాజినధారణతాత్పర్యము. నేటికిని అభి వాదనప్రసంగమున శర్మాంతముగనే (నారాయణశర్మా అహం భోః అభివాదయే -యనుచు) నామోచ్చారణ జేయుట నీవైదికసంప్రదాయరహస్యద్యోతక మనవచ్చును. ఆనందస్వరూపు డగుటచేతనే పరమేశ్వరునకును శర్మ యని నామము.

"సురేశః శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః"

—విష్ణు సహస్రనామము.

"పరమానందరూపత్వాత్ శర్మ" —శం.భా

శర్మ(ఆనంద) స్వరూపుడగు విష్ణువు యజ్ఞస్వరూపుడు (యజ్ఞో వై విష్ణుః) యజ్ఞము త్రయీవిద్యాశరీరము. అట్లే విష్ణువు త్రయీవిద్యాశరీరుడు.

"యస్య ఛందోమయం బ్రహ్మ దేహ ఆవపనం విభో ।
శ్రేయసాం తస్య గురుషు వాసోఽత్యన్తవిడంబనమ్ ।"

—భాగ. 10-80-45.

దేవా ! శ్రేయోమూలము, ఛందోమయము నగు బ్రహ్మ (వేదము) నీ మూర్తి. అట్టి నీవు విద్యాభ్యాసమునకై గురుకులవాసము చేయుట లోకధర్మానుకరణము మాత్రమే' - అని తన నెచ్చెలియైన శ్రీకృష్ణునితో కుచేలుడు పల్కిన వాక్యము.

కాన 'కృష్ణమృగచర్మ - శర్మ' - శబ్దములు 'యజ్ఞము యొక్క లేక పరమేశ్వరుని యొక్క దేహ మగు త్రయీవిద్యనే తాము ధరించుట' - యను భావమును ఆరాధకులకు స్ఫురింపజేయునట్టివి. ఇంతేకాదు; అవి శర్మహేతువులు. ఛందస్సులు శర్మహేతువు లను విషయమును 'సంహితా' పదప్రశస్తి ద్వారా శ్రుతి యిట్లు ప్రతిపాదించుచున్నది.

> "ప్రజాపతిః ప్రజాః సృష్ట్వా వ్యస్రంసత సంవత్సరః, స
> చ్ఛందోభి రాత్మానం సమదధా ద్య చ్ఛందోభి రాత్మానం
> సమదధా త్తస్మా త్సంహితా ఇతి" —ఐ. ఆ. 3-2-12.

కాలస్వరూపుడగు పరమేశ్వరుడు దేవ తిర్యఙ్మనుష్యరూప ప్రజలను సృజించి శ్రాంతుడై ఛందస్సులచే స్వశరీరమును సమాహితము గావించెను. అనగా వేదోక్త మంత్రపాఠసామర్థ్యముచే స్వావయవ పాటవమును సంపాదించెను. ఛందస్సులచే (వేదములచే) స్వశరీరమును సమాహితము గావించుటచే ఛందః పాఠమునకు 'సంహిత' యని యన్వర్థనామము (యస్మా దయం ఛందోభిః స్వశరీరం సమాహితవాం స్తస్మా త్సమాధానహేతుత్వా చ్ఛందః పాఠః సంహితే త్యుచ్యతే —సా.భా.). సృష్టికార్య పరిశ్రాంతు డగు ప్రజాపతి ఛందఃపాఠముచే సమాహితుడయినట్లు, సంసారభారపరిశ్రాంతు లగువారును ఛందఃపాఠముచే సమాహితు (స్వస్థు) లగుదురు; అట్టివారి స్థూల - సూక్ష్మ శరీరములు సమాహితము (స్వసము) లయి ఆనంద (శర్మ) ప్రాప్తిని గల్గించెడి పాటవము ఛందఃపాఠము (స్వాధ్యాయము)చే సమకూరును; అందుచే - నట్లు స్వాస్థ్యమును, పాటవమును గల్గించునది యగుటచే 'సంహిత' యగునని తాత్పర్యము.

కాన 'ఛాదనాత్ ఛందాంసి' - యను నిర్వచనమే యిట చెప్పబడి నట్లగు చున్నది. కాని ఛాదన మనగా నాచ్ఛాదించుట (మృత్యువునుండి యాచ్ఛాదించుట) యను నర్థము పూర్వము చెప్పబడినది. 'స్వాస్థ్యమును జేకూర్చి పాటవమును గల్గించుట' యని యిట జెప్పబడినది. రెండింటి తాత్పర్యమొకటియే. 'ఛాదయతి' -యను క్రియకు సిద్ధాన్తకౌముది యందు నీ యర్థము లిట్లు వివరింపబడినవి.

"స్వార్థే ణిచి తు ఛాదయతి। బలీ భవతి, ప్రాణీ భవతి,
అపవారయతి వేత్యర్థః"

'ఛాదన' మనగా బలవంతు డగుట, ప్రాణశక్తిమంతు డగుట, ఆచ్ఛాదించుట - అని యర్థము. అట్టి ధర్మము గలవి యగుటచే వేదములకు 'ఛందస్సు' లని పేరు. ఛందస్సులతో నాచ్ఛాదించుకొనుటచే ప్రాణులు శక్తిమంతు లగుదు రను విషయము తైత్తిరీయశ్రుతియు నిట్లు వివరించినది.

"ప్రజాపతి రగ్ని మచినుత। స క్షురపవి ర్భూత్వాఽతిష్ఠత్ ।
తం దేవా బిభ్యతో నోపాఽఽయన్। తే ఛందోభి రాత్మానం
ఛాదయిత్వోపాఽఽయన్। త చ్ఛందసాం ఛందస్త్వమ్। బ్రహ్మ
వై ఛందాంసి। బ్రహ్మణ ఏతద్రూపగ్ం యత్ కృష్ణాజినమ్।
కార్ష్ణీ ఉపానహౌ వుపముంచతే। ఛందోభి రేవాఽఽత్మానం
ఛాదయిత్వాఽగ్ని ముపచరతి॥" —తై.సం. 5-8-6-1.

ప్రజాపతి యగ్నిచయనము జేయ నా యగ్ని తీక్ష్ణవజ్రధారవలె నత్యుగ్ర రూపుడై తేజరిల్లెను. దేవత లా మహాగ్నిని జూచి భయపడి సమీపింపలేరైరి. వా రపుడు ఛందస్సులతో దమ్మాచ్ఛాదించుకొని వానితో నాత్మరక్ష గావించుకొని యగ్నిదరి జేర గల్గిరి. ఇట్లాచ్ఛాదకము లయి, ఆత్మరక్షకరము లగుటయే ఛందస్సుల ఛందస్త్వము. వేదమే (బ్రహ్మయే) ఛందస్సులు కృష్ణాజినము అనునది బ్రహ్మ (వేదము) యొక్క రూపము. కాన యజమానుడు కృష్ణాజిననిర్మితము లగు పాదుకల ధరించుచున్నాడు. అనగా ఛందస్సులచే నాచ్ఛాదింపబడి యగ్నిని

సమీపించుచున్నాడు - అని యర్థము. ప్రత్యక్షముగ జ్వాలారూపుడై తీక్ష్ణముగ గన్పట్టెడి యగ్ని ఛందస్సులతో నాచ్ఛాదించుకొనెడి యజమానునకు దేవతారూప మున ప్రసన్నుడై ప్రాప్యుడగునని భావము. ఆచ్ఛాదకము లగుచు ఆత్మరక్షకర ములు (ఆత్మచికిత్సకములు) -శర్మహేతువులు - గాన వేదములు ఛందస్సు లగునని శ్రుతితాత్పర్యము.

## (2) ఛదయన్తీతి ఛందాంసి :-

ఛాదయన్తీతి ఛందాంసి -యను నిర్వచనమే గాక 'ఛదయంతీతి ఛందాంసి యను నిర్వచనము గూడ శ్రుతులయందు గలదు.

"తా న్యస్మా అచ్ఛదయం స్తాని య దస్మాఽఅచ్ఛదయన్
తస్మా చ్ఛందాంసి" —శ బ్రా. 8-5-2-1.

ఇట శ్రుతియందు ఛదయన్తీతి ఛందాంసి' యను నిర్వచనము ప్రదర్శింప బడినది. 'ఛదయంతి' యను క్రియకు సిద్ధాంతకౌముది యందర్థ మిట్లు గలదు.

"ఛదంతం ప్రయుంక్తే ఛదయతి। బలవంతం ప్రాణవంతం
వా కరో తీత్యర్థః॥"

బలవంతుని, లేక ప్రాణవంతుని జేయునది యని యర్థము. కాన నీ నిర్వచనము గూడ పూర్వోక్తమైన 'ఛాదయన్తీతి ఛందాంసి' యను నర్థమునే స్పష్టము జేయుచు వివరించుచున్నది.

ఇంతేగాక ఛందః శబ్దమునకు మఱియొక నిర్వచనము గూడ సంప్రదా యానుగతమై కానవచ్చుచున్నది.

## 3) చందయతి - ఆహ్లాదయతి :-

"చందయతి ఆహ్లాదయతి, చంద్యతేఽనేనవా - చది ఆహ్లాదనే-

ఛందే రాదే శ్చ ఛః (ఉణాది 4-218) ఇతి అసున్ - చస్య ఛశ్చ'—

—అమరసుధాటీకా ; వాచస్పత్యము.

ఆహ్లాదపరచునవి, లేక దీనిచే నానందింపజేయబడుదురు గాన ఛందస్సులు —అని యర్థము. ఆహ్లాదపఱచునవి యనుటచే లోకోత్తరాహ్లాదముచే జిత్తమును స్వస్థము (సమాహితము) గావించునవి యని సూచిత మగుచున్నది. ఈ లోకోత్తరాహ్లాదమే రమణీయ ర్థము. అట్టి రమణీయార్థమును ప్రతిపాదించు వేదశబ్దములే ఛందస్సులు. అట్టివి యగుటచేత నే వీనిని కావ్య మనుచు 'కావ్యం ఛందః-త్రయీ వై విద్యా కావ్యం ఛందః' - అని యీ రీతిగ శ్రుతులును ప్రవర్తిల్లినవి. చూ. కవి కావ్యశబ్దములు).

## గాయత్ర్యాదిచ్ఛందస్సులు - ఛందస్త్వము :-

'ఛందాంసి ఛాదనాత్' — అను నీ వ్యుత్పత్తి ననుసరించియే గాయత్ర్యాది, ఛందస్సులకును ఛందస్సులను నామ మన్వర్థమైనది.

"య చ్ఛందోభి శ్ఛన్నో య చ్ఛందోభి శ్ఛన్న స్తస్మా
చ్ఛందాంసీ త్యాచక్షతే ఇతి"
"ఛాదయన్తి హ వా ఏనం ఛందాంసి పాపా త్కర్మణో
యస్యాం కస్యాంచి ద్దిశి కామయతే య ఏవ మేత
చ్ఛందసాం ఛందస్త్వం వేద, ఇతి" —ఐ. ఆ. 2-1-6.

ఉష్ణిక్ గాయత్ర్యాది ఛందస్సులు ప్రాణదేవత (హిరణ్యగర్భుని) యవయవములు. కాన ప్రాణదేవత గాయత్ర్యాది ఛందోమయము. ఇట్లు ప్రాణదేవత ఛందోమయు యగుచు గాయత్ర్యాది ఛందస్సులచే నాచ్ఛాదిత మగుటజేసి, ఛాదన

హేతువు లగు గాయత్ర్యాదులకును 'ఛందస్సు' లని యన్వర్థనామము గల్గినది. మఱియు నెవడీ ఛందస్సులు ప్రాణదేవత నాచ్ఛాదించునని యని తెలిసికొనునో యతడు ఎచట నే పాపము చేయ సంకల్పించినను గాయత్ర్యాది ఛందస్సు లా ప్రాణ దేవతోపాసకుని పాపము నుండి యాచ్ఛాదించును; పాపసంకల్పముల బోనాడి పాపము ను స్పృశింపకుండ జేసి యాతని రక్షించును – అని యర్థము

మంత్రములతో సంబంధము లేక గాయత్ర్యాదిఛందస్సులకు స్వతంత్రమైన యునికి లేదు. ఇట గాయత్ర్యాది ఛందస్సు లాచ్ఛాదించుచున్నవనినచో వేదములు ప్రాణదేవత నాచ్ఛాదించుచున్న వనియే యర్థము. ఐతరేయబ్రాహ్మణము గూడ ఛందస్సులు ప్రజాపతి యంగము లని యిట్లు వర్ణించినది.

"ప్రజాపతే ర్వా ఏతా న్యంగాని య చ్ఛందాంసి" —ఐ.బ్రా. 1-8.

కాన నిట్లు ఛందస్సులు ప్రజాపతి యంగము లనియు, విష్ణువు ఛందోమయమూర్తి యనియు జెప్పుటచే బరమేశ్వరుడు, లేక హిరణ్యగర్భుడు ఛందః శరీరుడు లేక ఛందోమయుడు అని తెలియును. అనగా 1) పరమేశ్వరుడు ఛందస్సుల (వేదముల) చేతనే తెలియబడును. 2) ఛందస్సులు పరమేశ్వరుని బ్రతిపాదించుటయందే తాత్పర్యము గలవి – యనెడి రెండు విషయములు స్పష్టము లగుచున్నవి. యజ్ఞదీక్షితుడై ఛందోమయుడైన యజమానుడును ప్రజాపతిరూపుడే యగు నని శ్రుతి చెప్పుచున్నది.

'ప్రజాపతి ర్వై యజతే' —ఐ. బ్రా. 7-8.

'దేవాసురా హా వై యత్ర సంయేతిర ఉభయే ప్రాజాపత్యాః'

—ఛాం. ఉ. 1-2-1.

"శాస్త్రీయ ప్రకాశ వృత్త్యభిభవనాయ ప్రవృత్తాః స్వాభావిక్య స్తమోరూపా ఇంద్రియ వృత్తయోఽసురాః। తథా తద్విపరీతాః శాస్త్రార్థ విషయ వివేక జ్యోతి రాత్మానో దేవాః

స్వాభావిక తమోరూపాసురాభిభవనాయ ప్రవృత్తా ఇత్యన్యోన్యాభిభవోద్భవరూపః సంగ్రామ ఇవ సర్వ ప్రాణిషు ప్రతిదేహం దేవాసుర సంగ్రామోఽనాదికాల ప్రవృత్త ఇత్యభిప్రాయః। ....అత ఉభయేఽపి దేవాసురాః ప్రజాపతే రపత్యానీతి ప్రాజాపత్యాః। ప్రజాపతిః కర్మజ్ఞానాధికృతః పురుషః। 'పురుష ఏవోక్థమయ మేవ మహాన్ ప్రజాపతిః' ఇతి శ్రుత్యంతరాత్ ।" —శం.భా.

అనగా కర్మజ్ఞానాధికృతు డగుచు యజమానుడు ఛందోమయుడై వ్యష్టి పరిచ్ఛిన్న భావము వదలి తనను సమష్టిదేవతాస్వరూపు డగు ప్రజాపతిగ భావన జేయవలె ననియు క్రమముగ తద్రూపుడు కావలె ననియు తాత్పర్యము.

## గరుడవాహనః _ వృషభవాహనః :-

హిరణ్యగర్భునివలెనే సుపర్ణుడును ఛందోమయు డని యిట్లు చెప్పబడు చున్నాడు.

"సుపర్ణోఽసి గరుత్మాం త్రివృత్తే శిరో, గాయత్రం చక్షుః, స్తోమ ఆత్మా, సామ తే తనూ ర్వామదేవ్యం బృహద్రథంతరే పక్షౌ, యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం, ఛందాగ్ం స్యంగాని ధిష్ణియాః శఫా, యజూగ్ంషి నామ, సుపర్ణోఽసి గరుత్మాన్ దివం గచ్ఛ సువః పత" —తై. సం. 4-1-10-5; 4-6-5-3; వా. సం. 17-4; శ. బ్రా. 6-7-2-6; ఐ.ఆ. 5-1-5-4.

ఈ శ్రుతి వాక్యము లగ్నిని ఛందోమయుడగు సుపర్ణునిగా గీర్తించు చున్నవి. సుపర్ణుడు (గరుత్మంతుడు) ఛందోమయు డగుట శ్రుతితాత్పర్యము ఛందోమయుడగు గరుడునిచే వహింపబడుచు శ్రీమహావిష్ణువు గజేంద్రుని రక్షించుటకై యేతెంచినట్లు శ్రీమద్భాగవత మిట్లు చెప్పుచున్నది.

"ఛందోమయేన గరుడేన స ఉహ్యమానః చక్రాయుధోఽభ్యగమ
దాశు యతో గజేంద్రః ।" —భాగ. 8-3-31.

ఈ గరుడుడు వేదరాశి యని హరివంశము గూడ నిట్లు చెప్పుచున్నది.

"తతః స భగవాం స్తార్క్ష్యో వేదరాశి రితి స్మృతః"
—హరివంశః 76-2.

యజ్ఞము త్రయీవిద్యారూపమై ఛందోమయ మగుటజేసియే 'యజ్ఞాంగః యజ్ఞవాహనః, వృషరథ' – ఇత్యాదినామములు శ్రుతిస్మృతులయందు బరమేశ్వరునకు జెప్పబడుచున్నవి. 'బ్రహ్మాణం బ్రహ్మవాహసమ్ (ఋ. 6-45-7 మొ.); యజ్ఞేభి ర్యజ్ఞవాహసం (ఋ. 8-12-20 మొ.): వృషా త్వా వృషణం వర్ధతు ద్యౌ ర్వృషా....స నో వృషా వృషరథః (ఋ. 5-36-5); యజ్ఞాంగో యజ్ఞవాహనః (విష్ణుసహస్రనామ) - ఇత్యాది శ్రుతి – స్మృతివాక్యములు 'పరమేశ్వరుడు యజ్ఞ శరీరుడు, యజ్ఞవాహనుడు, ఛందఃశరీరుడు, ఛందోవాహనుడు, - అను విషయమును దెల్పుచున్నవి. అనగా ఛందస్సుల ద్వారా, యజ్ఞాదికర్మానుష్ఠానముద్వారా, పరమేశ్వరుని దర్శింప శక్య మని తాత్పర్యము. శాస్త్రయోనిత్వాత్ (బ్ర సూ. 1-1-3) 'శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి' –ఇత్యాది వచనములును పరమేశ్వరుడు వేదైకప్రతిపాద్యు డని చెప్పుచున్నవి. ఈ వైదికసంప్రదాయ రహస్యమును గుర్తింపజేయుటకో యనునట్లు శివాలయములందు ఛందోమయుడు లేక ధర్మస్వరూపు డగు నందీశ్వరుని మొదట దర్శించి పిదప శివుని దర్శించుటయు, విష్ణ్వాలయములందు మొదట ఛందోమయ సుపర్ణుని (గరుత్మంతుని) దర్శించి పిదప విష్ణువును దర్శించుటయు నను నాచారము శిష్టజనసంమతమై నేటికిని వరలుచున్నది. దేవతామూర్తి కెదురుగ గరుడధ్వజ వృషభధ్వజముల బ్రతిష్ఠించి బ్రహ్మోత్సవముల నల్పు ఆచారములు నీ యర్థము నుపలక్షింపజేయునట్టివి.

4. ఛందస్సుల ద్వారా మాత్రమే పరమేశ్వరుని దర్శింపశక్య మగుటయు అట్లు దర్శింపజేయుటయందు ఛందస్సులు స్వచ్ఛందములు – స్వతఃప్రమాణములు

—నసు విషయము ఛందఃపదము యొక్క మఱియొక విశ్వచనము ద్వారా గ్రహింపనగును.

"ఛందాంసి నామ ద్విపదాం వరిష్ఠ । స్వచ్ఛందయోగేన భవంతి
తత్ర । ఛందోవిద స్తేన చ తా నధీత్య । గతా హి వేదస్య
న వేద్య మార్యాః ॥ —భార. సనత్సుజాతీయ. 2-41.

"హే ద్విపదాం వరిష్ఠ । ఛందాంసి వేదాః, స్వచ్ఛందయోగేన
స్వచ్ఛందతా స్వాధీనతా యథాకామ మిత్యర్థః । తత్రైవ
ప్రమాణం భవన్తి । శ్రూయతే చ - సర్వే వేదా యత్పద
మామనంతి; వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః ఇతి ।
పురుషార్థపర్యవసాయిత్వా ద్వేదస్య తద్వ్యతిరిక్తస్య అనిత్యా
శుచి దుఃఖానువిద్ధత్వేన పురుషార్థత్వాభావాత్ తత్స్వరూపత్వ
తత్సాధకత్వ తత్ప్రతిపాదకత్వేన వేదానాం ప్రమాణత్వ మిత్యర్థః ।
యస్మా ద్వేదాః స్వచ్ఛందయోగేన తత్రైవ ప్రమాణం భవన్తి ।
తేన చ హేతునా తాన్ వేదా నధీత్య అవగమ్య వేదాంత
శ్రవణాదికారణం కృత్వా, గతాః ప్రాప్తాః, వేదస్య సంవి
దూపస్య పరమాత్మనః రూపం న వేద్యం ప్రపంచం, ఆర్యాః
పండితాః బ్రహ్మవిదః॥" —శం భా.

'వేదములు పరమేశ్వరపరములు గావు' -అని శంకించెడి ధృతరాష్ట్రుని సందియమును దొలగించుటకై సనత్సుజాతుని సమాధానవచనమిది. 'పురుషశ్రేష్ఠుడా! ఛందస్సులకు బురుషార్థములదర్శింపజేయుటయందే తాత్పర్యము. పురుషార్థవ్యతిరిక్తములయినవి. అనిత్య-అశుచి-దుఃఖానుగతములు. కావ నవి పురుషార్థములు గావనియు ఛందస్సులు బోధించుచున్నవి. అట్టి ఛందస్సులు పరమేశ్వరస్వరూపములు, తత్సాధకములు, తత్ప్రతిపాదకములును నగును. కావ నవి అన్యనిరపేక్షముగ, అనగా స్వచ్ఛందముగ, పరమాత్మయందు ప్రమాణము లగుటచే వాని నధ్యయముజేసి బ్రహ్మవిదు

లగు నార్యులు (పండితులు) వేదముయొక్క (సంవిద్రూపుడగు పరమాత్మయొక్క), స్వరూపమును బొందుదురు. కాని వేద్యమగు ప్రపంచమును బొందరు-అని యర్థము.

ఛందస్సులు స్వచ్ఛందయోగముచే బరమాత్మయందు ప్రమాణము లగు ననుటచే వేదములకు ఛందస్సు లను నామ మన్వర్థమైన దను విషయమిట సూచిత మగుచున్నది. కాన ఛందస్సు లనగా స్వచ్ఛందముగ బురుషార్థముల బ్రతిపాదించునవి యని భావము.

## ఛందస్సులు - నిర్వచనక్రమము:-

ఇంతవరకును ఛందః శబ్దమునకు శ్రుతిస్మృతులు ప్రదర్శించిన వ్యుత్పత్తు లివి.

1. ఛాదయన్తి ఆచ్ఛాదయన్తి ఇతి
2. ఛదయన్తి ప్రాణీ భవన్తి, బలీ భవన్తి ఇతి.
3. ఛందయన్తి ఆహ్లాదయన్తి ఇతి
4. స్వచ్ఛందయోగేన ప్రమాణం భవన్తి ఇతి —ఛందాంసి.

పైన జూపిన వ్యుత్పత్తులలో నొక్కొక్కదాని యందొక్కొక్క విశిష్టతయు, దానిని బురస్కరించుకొని యొక క్రమపద్ధతియు నుద్దిష్టమై యున్నటుల గన్పట్టును.

1. మొదటి నిర్వచనమును జూతము. 'ఛాదయన్తి - ఆచ్ఛాదించునవి' యని యర్థము. యజ్ఞదీక్షితుడు భౌతికశరీరాచ్ఛాదితుడయ్యును, ఛందః శరీరుడై మఱియొక శరీరము దాల్చి దివ్యజన్మ నొందునని యీ నిర్వచనము వలన దెలియుచున్నది. కృష్ణాజినధారణశిల్పము వలన నీ విషయము స్పష్టము గావింపబడినది. ఇట యజ్ఞదీక్షితుడు ఛందఃశరీరుడగుట యన నేమో చూతము.

కర్మానుష్ఠానమునకై దీక్షితుడగువాడు భౌతికశరీరముతో నొప్పి యున్న

జాలదు. దేవతానుగ్రహపాత్రు డగుటకై వలయు విలక్షణశరీరము నాతనికి ఛందస్సులు ప్రసాదించుచున్నవి. ఆతడు జన్మసిద్ధబ్రాహ్మణత్వముతో నొప్పి యున్నను నా బ్రాహ్మణత్వము వేదవిహిత కర్మానుష్ఠాన యోగ్యతాసంపాదకము మాత్రమే. తరువాత దీక్షణీయేష్టి - కృష్ణాజినధారణాది దీక్షాసంస్కారములచే సంస్కృతు డగుచు దీక్షితుడై ఛందస్సులతో ననుగ్రహింపబడిన నూతనశరీరముతో విశిష్టబ్రాహ్మణుడై మహావీర్యుడగు నని శ్రుతి చెప్పుచున్నది.

"అథైక ఉద్వదతి-దీక్షితోఽయం బ్రాహ్మణో దీక్షితోఽయం
బ్రాహ్మణ ఇతి। నివేదిత మేవైన మేత త్సన్తం దేవేభ్యో
నివేదయతి, అయం మహావీర్యో యో యజ్ఞం ప్రాప దితి।
అయం యుష్మాకైకో భూత్ । తం గోపాయత ఇత్యేవైతదాహ"
— శ. బ్రా 3-2-1-39.

"అథ యద్బ్రాహ్మణ ఇత్యాహ - అనద్ధేవ వా అస్యాతః
పురాజానం భవతి । ఇదం హ్యాహుః - రక్షాంసి యోషిత
మనుసచ న్తే। తదుత రక్షాంస్యేవ రేత ఆదధతీతి। అథాత్రాద్ధా
జాయతే । యో బ్రాహ్మణో — యో యజ్ఞాత్ జాయతే
తస్మాదపి రాజన్యం వా వైశ్యం వా బ్రాహ్మణ ఇత్యేవ
బ్రూయాత్ । బ్రహ్మణో హి జాయతే। యో యజ్ఞాత్
జాయతే । తస్మా దాహుః - న సవనకృతం హన్యాత్
ఏనస్వీ హైవ సవనకృతేతి"
శ. బ్రా. 3-2-1-40. (వా.సం 5-14).

అధ్వర్యు డను ఋత్విజుడు దీక్షాదిసంస్కారములచే దీక్షితుడైన యజమానుని- 'ఇడుగో దీక్షితుడైన యజమానుడు. దీక్షాదిసంస్కారములచే మహావీర్యుడై యజ్ఞకర్మ కేతెంచినాడు; ఇతడు మీలో నొక డగుటచే రక్షింపుడు' - అని దేవతలకు నివేదించును. ఇతడు జన్మసిద్ధబ్రాహ్మణత్వము గలవాడయ్యును నది యఖి

వ్యక్తము గాకయుండును. ఏలయన, గర్భధారణసమయమున స్త్రీలు సామాన్యముగ రక్షఃసమాక్రాంత లగుదురని చెప్పుదురు; అందుచే జన్మసిద్ధబ్రాహ్మణత్వ మభివ్యక్తము గాదు. తిరిగి యిట బ్రహ్మనుండి - అనగా యజ్ఞమునుండి - పుట్టుటచే బ్రాహ్మణుడగుచున్నాడు. అట్లే రాజన్యుడుగాని, వైశ్యుడుగాని, జన్మసిద్ధ లోకవ్యవహారయోగ్య బ్రాహ్మణత్వము లేకున్నను యజ్ఞాచరణముచే దేవతానుగ్రహయోగ్య బ్రాహ్మణత్వము నొందును. కావున యజ్ఞశీలుని జంపరాదు. అట్లు చంపువాడు మహాపాపి యగును - అని యర్థము.

పై శ్రుతివాక్యముల గమనించుచో యజ్ఞము నాచరించినవాడు మొదటి ప్రాకృతదేహముతోగాక యప్రాకృత బ్రాహ్మీతనువుతో విలసిల్లునని తెలియుచున్నది.

"స్వాధ్యాయేన వ్రతైర్హోమైః త్రైవిద్యే నేజ్యయా సుతైః।
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః॥"

—మను. 2-28.

ఇత్యాది శ్రుతివచనములును పై విషయమునే వివరించుచున్నవి. ఇట్లు కర్మయోగమున ప్రవర్తిల్లువారలకు బ్రాహ్మీతనువును —ఛందఃశరీరమును - అనుగ్రహించునవి ఛందస్సులు. కనుక ఛందస్సులచే నాచ్ఛాదింపబడుట యనగా నాసురీప్రవృత్తిని దొలగించి ఛందస్సులు కర్మణ్యునియందు క్రమముగా దైవీసంపదను విలసిల్లజేయుట యని గ్రహింపనగును. ఈ విషయమునే 'ఛందాంసి ఛాదనాత్' అను మొదటి నిర్వచనము స్ఫురింప జేయుచున్నది.

(2) 'ఛదయన్తీతి ఛందాంసి' —కర్మచ[illegible]చే దైవీశక్తి సంపన్నులై క్రమముగ లౌకికవిషయవాసనాదూరులై ఛందస్సులతో (వేదములతో) పరమేశ్వరు నుపాసించుకొలది ఇంద్రియజయము ద్వారా సమాహి[illegible]డగును. ప్రాణశక్తి యుద్దీపితమై చిత్తము వీర్యవత్తరమగును. చిత్తము వీర్యవ[illegible] కొలది ఛందస్సులును వీర్యవత్తరము లగుచుండును. అట్లు ఛందఃసమాహి[illegible]త్తులే ధీరులు; బలవంతులు. 'అజితేంద్రియులు దుర్బలులు; జితేంద్రియ[illegible] తులు' సనుట శ్రుతి

సంప్రదాయము. జితేంద్రియులు గానిచో వారికి గర్మయోగముగాని, భక్తి యోగము గాని దుస్సాధ్యము. యోగోపయుక్త చిత్తసమాధానము నను గ్రహించి ఛందస్సులా యుపాసకుల శక్తిమంతుల గావించును. క్రమముగ జిజ్ఞాసాపరులగు సాధకులకు తల్లివోలె తత్త్వము నుపదేశించుచు విజ్ఞాన బలమును పెంపొందించును. శ్రుతి యీ రెండవ నిర్వచనము ద్వారా యుద్దేశించిన బలము గాని శక్తిగాని యిట్టి యీ 'ప్రాణశక్తియే: మనః శక్తియే: విజ్ఞానశక్తియే' — యని గ్రహింపనగును. ఇక మూడవ నిర్వచనమును జూతము.

3) "చందయన్తి ఆహ్లాదయన్తీతి ఛందాంసి' — ఆహ్లాదపరచునవి యని యర్థము. మొదట కర్మానుష్ఠానాదుల జేసి దైవీసంపదతో విలసిల్లి, క్రమముగ నీశ్వరార్పితచిత్తుడై, శక్తిమంతుడై, విరక్తుడై, గురుశుశ్రూషాదుల ద్వారా వేదాంతశ్రవణమననాదుల జేసెడి యుత్తమాధికారికి — జ్ఞానయోగికి — ఛందస్సులు కాంతవోలె రస (ఆనంద) స్వరూపుడగు బ్రహ్మ (ఆత్మ) యొక్క యపరోక్ష సాక్షాత్కారము గలిగించి యాహ్లాదపఱచును. ఇది యలౌకికానందము. శ్రుత్యుద్దిష్టమైన రమణీయార్థమును (పరమార్థమును దర్శింపజేయు ఛందస్సు అలౌకికానందమును గలిగించునవి యని యీ మూడవ నిర్వచనము యొక్క తాత్పర్యము.

అట్టి యలౌకికానందమును గలిగించెడి విశిష్టమైన శక్తి సామగానమునం దుండుటజేసి సామలకు 'ఛందస్సు' లనెడి ప్రత్యేకనామము గలదు. కావుననే సామశాఖీయులకు 'ఛందోగాః' అనియు, తచ్ఛాఖీ యోపనిషత్తులలో నొక దానికి 'ఛాందోగ్య' మనియు నామములు ప్రసిద్ధము లైనవి. 'వేదానాం సామ వేదోఽస్మి: వేదైః సాంగ పద క్రమోపనిషద్భిర్గాయన్తి యం సామగాః' ఇత్యాది వచనము లిందుకు దారాకాణము. శౌనకమహర్షియు బృహద్దేవతయందు ఋక్— యజుస్— సామల స్వభావము నిట్లు చెప్పినాడు.

"యోగేన దాక్ష్యేణ దమేన బుద్ధ్యా బాహుశ్రుత్యేన తపసా
నియోగైః, ఉపాస్యాస్తాః కృత్స్నశో దేవతా యా॥ ఋచో
హ యో వేద న వేద దేవాన్॥ యజూంషి యో వేద స
వేదయజ్ఞాన్। సామాని యో వేద స వేద తత్త్వమ్।"

—బృహద్దేవత. 8—130.

"యోగము (చిత్తవృత్తి నిరోధము), దాక్ష్యము (దక్షత), దమము, బుద్ధి (వివేకము), పాండిత్యము, తపస్సు, నియోగము (శాస్త్రోక్తవిధి),—వీనితో నొప్పి దేవతలను జక్కగ నుపాసింపవలెను. ఆ యుపాస్య దేవతా స్వరూప మును వివరించునవి ఋక్కులు. ఇట్టి ఋక్కుల నెవడు చక్కగా దెలిసికొనునో యతడే దేవతల దెలిసికొనినవాడు (ఋచో హ యో వేద స వేద దేవాన్). యజుస్సుల నెవడు తెలిసికొనునో యతడే యజ్ఞముల తెలిసినవాడు. (యజూంషి యో వేద స వేద యజ్ఞాన్). సామల నెవడు తెలిసికొనునో యతడు తత్త్వము నెఱిగినవాడు (సామాని యో వేద స వేద తత్త్వం) — అని యర్థము.

ఇచట సామవిదుడు తత్త్వవిదు డగునని చెప్పబడుటచే సామల ప్రాశస్త్యము సూచిత మగుచున్నది. మఱియు నొక విషయము. ఋక్కులు, యజుస్సులు, సామలు మూడింటిచే కలిపి నిర్వర్తింపబడెడి క్రియకు స్థూలముగ యజ్ఞ మని వ్యవ హారము. ఈ మూడింటిచే మూడు విభిన్నక్రియలు నిర్వర్తింపబడుచుండును. సామవిదుడు తత్త్వవిదు డగు నని చెప్పబడుటచే యజ్ఞమున జేయబడెడి సామ గానము జ్ఞానయోగమున కుపలక్షకముగా గ్రహింప నగును. సామలు జ్ఞానయోగ ప్రేరకము లగుచో మిగిలినవి రెండును యథాతథముగ కర్మ - ఉపాసనా - యోగో పలక్షకములుగ గ్రహింప నగును. కాన శ్రుతివిహితమైన యజ్ఞ మనెడి మహా క్రియ త్రివిధమంత్రజాతము యొక్క విశిష్టక్రియల ద్వారా కర్మోపాసనా జ్ఞాన— యోగత్రయమార్గదర్శియగు ననుట నిట సూచిత మగుచున్నది. యజ్ఞక్రియ యందు సూచనాప్రాయముగ నుపలక్షితములైన నీ మూడు యోగముల వివరించుటకై కర్మో పాసనాజ్ఞానరూప కాండత్రయాత్మకముగ శ్రుతి ప్రవర్తిల్లినది. ఇట్టి శ్రుతియొక్క పరమలక్ష్యము ఆహ్లాదపరచుటయే — అలౌకికానందమును గల్గించుటయే. ఇది మూడవ నిర్వచనము యొక్క తాత్పర్యము.

4) 'స్వచ్ఛందయోగేన ప్రమాణం భవన్తి'— పైన జెప్పినట్లు ఛందస్సులు అధికారి యోగ్యత ననుసరించి యుపదేశించుచు గ్రమముగ వారిని గర్మోపాసనా జ్ఞానయోగమార్గములందు బ్రవర్తిల్లజేసి, ప్రభు - సుహృత్ - కాంతాసంమితత్వ

రూపములతో బొదగట్టుచు, నిట్లు స్వచ్ఛందముగ దత్త్వము నుద్బోధించుట యందు ప్రమాణము లగుచుండు నని యీ నిర్వచన తాత్పర్యము.

## ఛందస్సులు - గోవ్రజములు :-

ఛందస్సు లనగా గోస్థానములగు వ్రజము లని శ్రుతి యిట్లు కీర్తించు చున్నది.

"వ్రజం గచ్ఛ గోస్థాన మిత్యాహ। ఛందాంసి వై వ్రజో గోస్థానః। ఛందాంస్యేవాస్మై వ్రజం గోస్థానం కరోతి॥"

—తై. బ్రా. 3-2-9.

"వ్రజ న్త్యస్మి న్నితి వ్రజః। గోచరాదౌ నిపాత్యతే। గవాం స్థాన మధికరణభూతో వ్రజః। ఛందాంసి శబ్దానాం స్థానాధికరణత్వాత్

తత్సామ్యాదుత్కర్షోఽపి తథోచ్యతే" —భట్ట. భా.

"గాయత్ర్యాదీని ఛందాంస్యేవ గోశబ్దాభిధేయానాం వాచా మవస్థానయోగ్యో వ్రజశబ్దాభిధేయో దేశవిశేషః" —సా.భా.

మంత్రము లనెడి గోవులకు (వేదవాక్కులకు) నిలయము లగుటచే ఛందస్సులు (వేదములు) గోస్థానము లగు వ్రజము లని యిట శ్రుతిచే గీర్తింప బడినవి. గోవింద, గోపీజనవల్లభ, గోపాల, గోపుర - ఇత్యాది పదములు నీ విషయమును (మంత్రములు గోవులగుటను) ఉపలక్షింప జేయునట్టివి.

"గో భూమి వేదవిదితో వేదితా గోపీజనవిద్యాకలా ప్రేరకః"

—గో.పూ.ఉ.

"గోభూమి వేదై ర్విదితః। విగ్రహస్తు గాం సౌరభేయీం, గాం భూమిం; గాం వాచం వేదం వా విందతీతి గోవిందః।— యద్వా గోపీ జన ఏవాఽఽసమన్తా ద్విద్యాకలాజ్ఞానప్రదో గ్రంథభాగః। 'గోప్యో గావ ఋచః' ఇతి శ్రుతేః। తాసాం

ప్రేరకః సోఽస్మత్సుఖతాసంపాదకః"

—నారాయణవిరచిత దీపికావ్యాఖ్య.

"నష్టాం వై ధరణీం పూర్వ మవిందం వై గుహాగతామ్।
గోవింద ఇతి తేనాహం దేవై ర్వాగ్భి రభిష్టుతః॥"
ఇతి మోక్షధర్మ వచనాత్ (భార. 1.-341-70) గోవిందః;

"అహం కిలేంద్రో దేవానాం త్వం గవా మింద్రతాం గతః।
గోవింద ఇతి లోకా స్త్వాం స్తోష్య న్తి భువి శాశ్వతమ్॥" ఇతి।

"గౌ రేషా తుతథా వాణీ తాం చ విందయతే భవాన్।
గోవింద స్తు తతో దేవ మునిభిః కథ్యతే భవాన్॥"

ఇతి చ హరివంశే (3-88-50)। గౌర్వాణీ తాం విందతీతి గోవిందః।.... గోభి ర్వాణీభిః విందతే, వేత్తి వేదాన్త వాక్యై రితి వా గోవిందః.

"గోభిరేవ యతో వేద్యో గోవిందః సముదాహృతః।"
ఇతి శ్రీవిష్ణుతిలకే —శం.భా. విష్ణుసహస్రనామ.

"స త్వాం కృష్ణాభిషేచ్యామి గవాం వాక్యప్రచోదితః।
ఉపేంద్రత్వే గవా మింద్రో గోవింద స్త్వం భవిష్యసి"

—విష్ణు. పు. 5-12-12.

"యుగే యుగే ప్రణష్టాం గాం విష్ణో విందసి తత్త్వతః।
గోవిందేతి తతో నామ్నా ప్రోచ్యసే ఋషిభి స్తథా॥"

—మత్స్య. పు. 246-43.

"గో-భూమి-వేదవాక్కు-"లకు గోవు లని పేరు. వీనిచే దెలియబడు వాడు, లేక వానిని బొందువాడు పాలించువాడు నగుటచే పరమేశ్వరునకు గోవింద

డని లేక గోపాలు డని యన్వర్థనామములు. 'గోప్యో గావః ఋచః' —అను శ్రుతి ననుసరించి ఋక్కులకు - వేదవాక్కులకు - గోపిక అని పేరు. కాన గోపీజన మనగా విద్యాకలాస్వరూపము, జ్ఞానప్రదము నగు వేదరూప గ్రంథ భాగము. తత్ప్రేరకుడు, అనగా స్వాభిముఖము గావించుకొనువాడు గాన గోపీజన వల్లభుడు -అని యర్థము. "మంత్రములు కావ్యములు; అవి శాశ్వతుడగు బ్రహ్మకు సంబంధించినవి; వానిని యజ్ఞేశ్వరుడు నియమముగస్వాభిముఖములను జేసికొను చున్నాడు (శశ్వతః శాశ్వతస్య నిత్యస్య, వేధసః విధాతు ర్బ్రహ్మణః సంబంధీని, కావ్యా కావ్యాని మంత్రరూపాణి స్తోత్రాణి అయ మగ్నిః ని కః నియమేన స్వాత్మాభిముఖం కరోతి - సా. భా. ఋ 1-72-1; తై. సం. 2-2-12-1)- అను విషయము శ్రుతులను ప్రతిపాదించుచున్నవి (చూ. కవి. కావ్యము). ఇట్లు మంత్రములే కాదు. సంస్కృతశబ్దము లన్నియును యోగరూఢిచే గో- అశ్వాది లౌకికార్థముల బోధించుచునే యోగశక్తిచే బరమేశ్వరతత్త్వ వ్యాఖ్యారూపములని సూత సంహిత యిట్లు చెప్పుచున్నది.

"వ్యాఖ్యాగానే ష్వశక్త స్తు శివ ముద్దిశ్య భక్తితః। లౌకికీ మపి
వా గీతం కుర్యా న్నిత్య మతంద్రితః" —4-3-113.

"సంస్కృత శబ్దరూపం గద్యపద్యాత్మకం వ్యాఖ్యాగానమ్"

—మాధవీయ తాత్పర్యదీపికావ్యాఖ్య.

కావున గోవింద - గోపీజనవల్లభాది పదములు 'ఛందాంసి వై గోస్థానః' —అనెడి పై శ్రుతియొక్క తాత్పర్యమును వివరించుట స్పష్టము.

"యత్ర గావో భూరి శృంగా అయాసః। అత్రాహ తదురు
గాయస్య వృష్ణః పరమం పద మవభాతి భూరి"

—ఋ 1-154-6; నిరు. 2-7.

కొలది మార్పులతో 'విష్ణోః పరమం పదమ్' అనుచు నీ మంత్రము తైత్తిరీయాది సంహితలయందును (తై. సం. 1-3-6-1; వా. సం. 6-3; శ.బ్రా. 3-7-1-15) గలదు. దీప్త్యతిశయ సంపన్నములగు గోవులకు నిలయము విష్ణు

పదము. అదియే గోవులకు ప్రాప్తవ్యము, ప్రశస్యతమమునగు స్థానము - అని యర్థము. కాన విష్ణుపదమే గోస్థాన మని శ్రుతి తాత్పర్యము. గోకులమునను (వ్రజమునను), బృందావనమునను పరమేశ్వరుడు లీలాగృహీత శరీరముతో[1] శ్రీకృష్ణనిరూపమున గోవ్రజముల మధ్య గోపాలకుడై సంచరించుట భాగవతాదుల యందు ప్రసిద్ధము. శ్రీకృష్ణు డట్లు చరించుట 'మంత్రరూపము లగు గోవులకు నిలయములగు ఛందస్సు లనెడి వ్రజములలో మంత్రపతి (బ్రహ్మణస్పతి)నై యెల్లరకు పూజ్యుడనై సంచరించువాడను' - అను తత్త్వమును స్ఫురింపజేయుటకే —యని యిట పొడగట్టక మానదు. ఇంతేకాదు. ఛందస్సులు వ్రజములు ఛందః సారము ప్రణవము. అది విశ్వరూపము. ('య శ్ఛందసా మృషభో విశ్వరూపః' —తై. ఉ). అంకురగతరసము నానా కాండశాఖల యందు వ్యాప్త మగు నట్లు ప్రణవ ప్రతిపాద్య మగు ఈశ్వరతత్త్వమే ఛందస్సులందంతట వ్యాప్తమై యున్నది.

"ఏతావాన్ సర్వ వేదార్థ శబ్ద ఆస్థాయ మాం భిదా।
మాయా మాత్ర మనూద్యాన్తే ప్రతిషిధ్య ప్రసీదతి ॥"

—భాగ. 11-21-44.

"యదా హ్యంకురే యో రసః స ఏవ తద్విస్తార భూత నానా
కాండ శాఖాస్వపి। తథైవ ప్రణవస్యైవ యోఽర్థః
పరమేశ్వరః స ఏవ తద్విస్తార భూతానాం సర్వ వేద
శాఖాకాండానా మపి సంగచ్ఛతే నాన్యః" —నీలకంఠః

"కృత్స్న ఏవ హి వేదోఽయం పరమేశ్వర గోచరః।
స్వార్థద్వారైవ తాత్పర్యం తస్య స్వర్గాదివ ద్విధా॥"
"న సన్త్యేవ హి వేదభాగా యత్ర పరమేశ్వరో న గీయతే।
తథా హి। స్రష్టృత్వేన పురుష సూక్తేషు, విభూత్యా రుద్రేషు,

---

1. గోపరూపో హరిః సాక్షా న్మాయా విగ్రహధారణః।
దుర్బోధం కుహకం తస్య మాయయా మోహితం జగత్॥

—కృష్ణ. ఉ. 10.

శబ్ద బ్రహ్మత్వేన మండల బ్రాహ్మణేషు, ప్రపంచం పుర
స్కృత్య నిష్ప్రపంచతయోపనిషత్సు, యజ్ఞ పురుషత్వేన
మంత్రవిధిషు, దేహాదిర్బా హ్యైరుపాఖ్యానేషు, ఉపాస్యత్వేన
సర్వత్రేతి।' —న్యాయకుసుమాంజలి. 5-16.

ఈశ్వర తత్త్వమును ప్రతిపాదింపని వేదభాగమే లేదు. ఏ భాగమున నైనను జగత్స్రష్టృత్వ - శబ్దబ్రహ్మత్వ - యజ్ఞపురుషత్వాది రూపమున ఈశ్వర తత్త్వమే ఉపాస్యమగుట (ఉపాస్యత్వేన సర్వత్ర) శ్రుతి తాత్పర్యము. ఈశ్వర తత్త్వ ప్రతిపాదనమున కియయే మంత్రబ్రాహ్మణాత్మక ఛందోరాశి యవతరించిన దని తాత్పర్యము.

కాన ఛందస్సులు స్వచ్ఛందయోగముచే పరమేశ్వరుని యందు ప్రమాణ మగు నను విషయమునే 'ఛందాంసి వై వ్రజో గోస్థానః' - అను శ్రుతి యిట జమత్కరించినట్లు కాన నగును. ఆచ్ఛాదించుట, శక్తిమంతుల నొనర్చుట, ఆహ్లాద పఱచుట, స్వచ్ఛందయోగముచే పరమేశ్వరునందు ప్రమాణ మగుట-యను లక్షణములు బురస్కరించుకొని వేదములకు ఛందస్సు లనెడి యన్వర్థ సంజ్ఞ యొప్పు చున్నటుల శ్రుతి - స్మృతి - నిరుక్తాదులవలన దెలియును. ఈ లక్షణములు కేవలము మంత్రభాగము నందే గాక బ్రాహ్మణారణ్యకోపనిషద్రూప మగు బ్రాహ్మణ భాగము నందును నుండుటచేతను, శ్రుతి - స్మృత్యాది ప్రామాణ్యము చేతను, కృత్స్న వేదరాశికి ఛందస్సు లనెడి వ్యవహారము ప్రసిద్ధ మగుట స్పష్టము. ఇట్లు శబ్దాత్మక వేదరాశియే కాదు ; ఆ వేదశబ్దముల (ఛందస్సుల) సాయముతో ప్రజాపతిచే సృజింపబడిన జగత్తంతయు ఛందోమానము, జగత్తే కాదు; జీవేశ్వరులును ఛందో రూపులు - అని శ్రుతి యిట్లు చెప్పుచున్నది

"మూర్ధా వయః ప్రజాపతి శ్ఛందః క్షత్రం వయో మయందం
ఛందో విష్టంభో వయోఽధిపతి శ్ఛందో విశ్వకర్మా వయః
పరమేష్ఠీ ఛందో- - -' —వా. సం. 14-9; 10;
"మా ఛందః ప్రమాఛందః ప్రతిమా ఛందో అస్రీవయ శ్ఛందః
— — జగతీ ఛందః — — పృథివీ ఛందోఽన్తరిక్షం

ఛందో ద్యౌ శ్ఛందః సమా శ్ఛన్దో నక్షత్రాణిఛందో వా శ్ఛన్దో
మన శ్ఛందః — — —" — వా. సం. 14-18, 10.
"ఏవ శ్ఛందో వరివ శ్ఛందః - - - క్షురో భ్రజ శ్ఛందః।
ఆచ్ఛచ్ఛందః ప్రచ్ఛ చ్ఛందః—— తంత్రం ఛందోఽంకాంకం
ఛందః" —వా సం. 15-4,5; తై. సం. 4-3-12-2.

అగ్నిచయనమున సర్వము ఛందో రూపమున దర్శించుచు ఇష్టకోపధానము చేయుచు జెప్పెడి మంత్రము లివి. పృథివ్యాది లోకత్రయము, తత్పాలకులు, స్థూల సూక్ష్మశరీరములు, సర్వదేవాత్మకుడగు ప్రజాపతి, త్రయీవిద్య, గాయత్రి - ఉష్ణి గాదులు, భోగ్య విరాడన్నాత్మక మగు జగత్తు, జీవులు — సర్వము ఛందోరూప మని యీ శ్రుతి వలన దెలియును. పరమేశ్వర స్వరూపమును నామరూపాత్మక జగత్తుతో నాచ్ఛాదించెడి పారమేశ్వరశక్తి ఛందోరూపిణి. ఈ కారణముచే లోకము గూడ ఛందోరూపము. 'పశవో వై ఛందాంసి'- అను శతపథశ్రుతి ననుసరించి జీవులు ఛందోరూపులు. స్వచ్ఛందయోగమున నామరూపాత్మకజగత్తును బ్రవర్తింప జేయువాడగుటచే పరమేష్ఠి ఛందోరూపుడు. జీవ-జగత్ - ఈశ్వరస్వరూపము నిట్లు ఛందోరూపమున దర్శింపజేయు త్రయీవిద్యా లక్షణ మగు కావ్యము ఛందస్సు (త్రయీ విద్యా కావ్యం ఛందః). పర్ణములు వృక్షమునువలె, ఋగాది రూపము లగు ఛందస్సులు ధర్మముచే సంసారవృక్ష పరిరక్షణము సేయుచుండును. తుదకు ఉత్తమ సాధకులకు గుహానిహితమై ప్రచ్ఛన్నమై యున్న రసాత్మక పరతత్త్వమును దర్శింపజేసి లోకోత్తరాహ్లాదము గల్గించుచు (చందయన్తి) ఛందస్సులు - అను అన్వర్థసంజ్ఞతో నొప్పును.

ఇట్లు ఛందఃశరీరిణియై విశ్వాత్మికయై పూజనీయయై విలసిల్లుచు తనను గానముచేయు వారల నెల్ల బ్రోచుచు (గాయంతం త్రాయతే) లోకోత్తరానంద సంధాత్రి యగు నా వేదమాతకు (వరదా వేదమాతా) నమోవాకములు.

ఇదం నమో జగన్మాత్రే కల్యాణానంద మూర్తయే।
భారత్యై హరిసోదర్యై వేదమాత్రే ప్రశాస్మహే॥

—)o(—

# పరిశిష్టము (2)

## మంత్రాది - సూచీ


అ

అంగాదంగాత్ 18

అంగాని వేదాః XV

అంగిరసో నః 435

అంగైరుపాంగైః 536

అంబికా హవై 528

అకర్దమ మిదం 502

అగ్నిః పూర్వేభిః 97

అగ్నిః పృథివీస్థానః 561

అగ్నిమధ్యే 450

అగ్నిమీళే XXXX

అగ్నిమే వామగేళా 568

అగ్నిరగామి 590

అగ్నిరస్మి 17

అగ్నిర్ ఋషిః 79

అగ్నిర్గృహపతిః 618

అగ్నిర్జాగార 13, 455

అగ్నిర్జ్యోతిః 561

అగ్నిర్మూర్ధా XXXXXI

అగ్నయోవై 167

అగ్నిర్వాయుశ్చ 313

అగ్ని ర్వైదేవయోనిః 265

అగ్నిర్వై భరతః 590

అగ్నివాయురవిభ్యస్తు 118

అగ్నిష్వాత్తాదయః 314

అగ్నిష్వేషు అగ్నిశాలాసు 173

అగ్నే మహా అసీత్యాహ 590

అగ్నే యత్తే 550

అగ్నే యత్తే దివి 550

అజ ముఖాంబుజ 5

అజాన్ హ వై 71

అత్రాపి భారతం 624

అథ కృష్ణాజిన మాదత్తే 695

అథ చేత్ నైనం విదం బ్రహ్మణం 364

అథ జాతకర్మ ........... 19

అథ దక్షిణేన జానునా ... రోహతి 695

అథ ప్రజాపతిః సోమేన 383

అథ భగవాన్ ఋషభదేవ 589

అథ యజ్ఞ ఇత్యాచక్షతే 54
అథయత్ 276
అథయత్ ప్రథమా సమితే 317
అథాస్యనామ కరోతివేదోఽసీతి 17
అథ యదేవాహ
అథ యద్దీక్షితః 276
అథ యద్బ్రాహ్మణ ఇత్యాహ 707
అథ య ద్వాచం ని యచ్ఛతి 276
అథ యాని 524
అథయామేతాం 272
అథర్వక్షేత్రవాన్ 420
అథర్వణస్తయో యోగః 392
అథర్వభూతా 439
అథర్వ వేదోభేదః 444
అథర్వాంగిరసోహ్యేషా 392
అథవాచం యచ్ఛతి 276
అథసాయమ్ ధృతిషు హూయ
మానేషు— 195
అథాతః సంప్రవక్ష్యామి 363
అథాతః స్వాధ్యాయ ప్రశంసా— 246
అథా థర్వవిదే స్తస్య 361
అథాధ్యాత్మమ్....
వాగషాఢా 346
అథాపి వాజసనేయ బ్రాహ్మణమ్
అథాపి....స్వాధ్యాయోనామ 239
అథాపీద మ నరేణ
మంత్రేష్వర్థ ప్రత్యయో 45
అథాస్య జాతకర్మ 19
అథాస్యనామకరోతి 17
అథాహ శాండిల్యోహవై
బ్రహ్మర్షిశ్చతుర్వేదేషు 379
అథా హి విక్ష్వద్యోఽసి
ప్రియోనో అతిథిః 400
అథేమం విష్ణుం యజ్ఞం
త్రేధా వ్యభజన్త 565
అథైక ఉద్వదతి దీక్షితోఽయం
బ్రాహ్మణః 707
అథైకపాత్ పురుషోయన్ 364
అథైత త్తస్మాత్ తప్యమానాత్ 379
అథైత ద్వామేక్షిపి 268
అథైతా వేదస్య అష్టావుపనిషదో
భవన్తి 67
అదబ్ధవ్రతప్రమితి ర్వసిష్ఠః.... అగ్నిః
అథబ్ధవ్రతప్రమతిః 427
అద్భుతస్య తు మాహాత్మ్యం 617
అద్యతేఽత్తిచ భూతాని 442
అధి భూతమ్ శరోభావః XXXXIX
అధీతశ్శాఖా మాత్మీయాం 2.8
అధీత్యవేదానఖిలాన్ 219
అధ్యాపయేరన్ శిష్యాన్ వై
గోమతీం 450
అధ్వర ప్రభృతిత్రీణి 688
అనగ్ని రవికేతః 242
అనిరుద్ధః స్వయంజ్ఞేయః 312

అనుపశమశరదీ ప్తతా
గరీయాన్ 407
అనూద్య తాన్ విధీ నర్థవాదో
బ్రాహ్మణ ఈరితః 675
అనంత మవ్యయల కవిం 482
అన్నం బ్రహ్మాత్మకంధ్యాత్వా 322
అంతరాత్మక మాకాశం తన్మయం
శ్రోత్ర మింద్రియం 23
అన్యా సంస్కార గాయత్రీ
కర్మణ్యన్యా ప్రయుజ్యతే XX VIII
అనాది నిధనా నిత్యా వాగు త్సృష్టా
స్వయంభువా 486
అనాయతప్రాణ మసంయ తాత్మం 510
అపాం రేతాంసి జీవ్యతో3పు 193
అపాంగర్భో మహా భాగః కర్తవ
భుక్ యో మహాత్మకః 618
అపాజ్ ప్రాజ్ఞేతి స్వధయా
గృహీతః 304
అప్రాణం శుద్ధ మేకం నమ
భవత్ 288
అపివా హననాదేవన్యుః XXXIII
అపేక్షితం యాచితవ్యం 360
అప్యేకం దేవపదం అధీయా
నైన 22, 121
అప్యేకః పశ్యన్ న పశ్యతి 468
అప్యేక స్తైరన్వం విసృష్టే 408
అప్యేతి య ఏవం వేద 388
అభిచారేషు సర్వేషు కర్తవ్యో
ద్విషతో దమః 404
అభిషిక్తోఽథర్వ మంత్రైః 362
అభినో అర్ష దివ్యా వసూన్యభి
విశ్వా 91
అమన్యమానాం అభిమన్య మానైః 452
అమం ధిష్టాం భారతా రేవ ధగ్నిం 542
అమూల్యం రత్నం XXXXXX
అయం కృత్స్నరగృహీతో 476
అయం వై యజ్ఞోయోఽయం
పవతే 58
అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం
ప్రతిష్ఠితమ్ 379
అర్థనిత్యః పరీక్షేత .... నైకపదాని
నిర్బ్రూయాత్ XXI
అర్థాత్ ప్రకరణాత్ లింగాత్
XXXXIV
అర్థేప్సవః శల్పపేషయః 107
అల్పాభిధానే త్వార్థోయః సమాసేన్లో
చ్యతే బుధైః XVIII
అవః పరేణ పితరం యో
అస్యామవేద 606
అవరం స్వాహాకారం కరోతి 287
అవిచికిత్సా యావత్ బ్రహ్మ
విగంతవ్యం 85
అవిద ద్దతం మిత్రో నవీయాన్ 182

అవిశేషేణ పుత్రాణాం దాయో భవతి
ధర్మతః 669
అష్టమే మంత్ర కాండస్తేకస్మిణాం
బహూలత్వతః 675
అష్టాచక్రా నవద్వారా దేవానాం
పూః 155
అసంసేవ్యాం దానైరనఫి గమ
నీయాం 260
అసతశ్చ సతశ్చైవ యోనిరేషా
ప్రజాపతిః 562
అసద్వా ఇద మగ్ర ఆసీత్ 81
అసర్జి వాం స్థవిరా వేధసా 415
అసౌ వా అనువాక్యా, ఇయం యాజ్యా
తే ఉభే యోషే 336
అస్మా ఇత్ కావ్యమ్ వచ ఉక్థ
మింద్రాయ శస్యమ్ 477
అస్య కా వ్యస్య కవయో న సమర్థా
విశేషణే 460
అస్య మహతో భూతస్య నిః
శ్వసిత మేతద్ 367
అస్య హో తుః ప్రదిశ్యృ తస్య
వాచి 274
అస్మ్యత్తరస్యాందిశి దేవతాత్మా 265
అహం భవాన్ నవాన్య స్త్వం 496
అహం కిలేంద్రో దేవానాం
త్వంగవామింద్రతాం గతః 712
అహం శాస్త్రీ వంగమప్తీ
వసూనాం 670
అహంరుద్రేభిర్వ సుభిశ్చరామి 569
అహం వై సర్వభూతానిభూతాత్మా
భూతభావనః 152
అహమేవస్వయ మిదం వదామి 570
అహ మోపయికీ భార్యా రామస్య 456
అహరహః స్వాధ్యాయ మధీతే 249
అ హే బుధ్నియ మంత్రం మే
గోపాయ 26, 169

## ఆ

ఆత్మన ఆకాశః సంభూతః XX V
ఆత్మన్వన్నభో దుహ్యతే XX V
ఆత్మన్వత్ ఆత్మవత్ సారవత్ XX V
ఆత్మన్వతీభిః ఆత్మీయాభిః XX V
ఆత్మవాన్ కో జితక్రోధః XX V
ఆత్మవిద్యా తపోమూలం 52
ఆత్మార్థే చాసృజ త్పుత్రాన్ 439
ఆత్మా యజ్ఞస్య రంహ్యా 476
ఆత్మాన మరణిం కృత్వా 547
ఆత్మేన వేదితవ్యేషు ప్రియేష్వేవహి
జీవితమ్ 459
ఆదంగిరాః ప్రథమం దధిరే 437
ఆదిత్యా వసవో రుద్రాః 313
ఆదిత్యైర్నో భారతీ వష్టు యజ్ఞం 569
ఆద్యోం రాజ్ఞేన సహియష్తే 437
ఆధారం వాక్యవాధారం 107
ఆధ్వర్యవం యజుర్భిస్తు 374

ఆధ్వర్యవం యజుర్భిః స్యాత్ 574
ఆనంద ఏవాస్య విజ్ఞానమాత్మా 37
ఆనుశ్రవిక ఏవనౌ కశ్యప ఇతి 176
ఆనీదవాతం స్వధయా తదేకం 297
ఆన్వీక్షికీ త్రయీదేవిదండనీతిశ్చ
కథ్యసే 417
ఆపో నారా ఇతి ప్రోక్తా 325
ఆపో హి ష్ఠా మయో భువః 503
ఆమ్నాయాంబుధి మాదరేణ 206
ఆమ్నాయసిద్ధేకి మపూర్వమేతత్ 498
ఆమ్నాయః పునః మంత్రాశ్చ
బ్రాహ్మణానిచ 668
ఆయుః ప్రజాం ధనం విద్యాం 308
ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రా
విరోధినా 91
ఆవిర్భూతమాత్రా ఏతే 9
ఆసన్నః సన్నతరః సాధనానాం 326
ఆహూతయో వై నామైతా
యదాహూతయః 272

## ఇ

ఇజ్యాచార 258
ఇడాభిః 537
ఇడా మకృణ్వన్ మనుషస్య
శాసనీమ్ 572
ఇడా యేషాం గణ్యామాహినా గీః 573
ఇడా వై మానవీ 572
ఇడా సరస్వతీ 537
ఇడా సరస్వతీ భారతీ 537
ఇడా సరస్వతీ మహీ 537
ఇతిహాస పురాణాభ్యాం XIV
ఇతి నానావ్యయోపాయైః XXXXIV
ఇత్యదదా 196
ఇత్యజినా 196
ఇత్యుపనిషత్ 52
ఇత్యేష వంశః సుమహానగ్నీనాం 617
ఇదం కవిభ్యః పూర్వేభ్యో 490
ఇదం నమః దేవేభ్యః 491
ఇదం నమ ఋషిభ్యః 491
ఇదం నమో జగన్మాత్రే 716
ఇదం నమో వృషభాయ 491
ఇదం నమో రుద్రాయ 491
ఇంద్రం మిత్రం వరుణ మగ్ని
మాహుః 479
ఇంద్రయస్తే నవీయసీం గిరం
మంద్రాం 191
ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః 115
ఇంద్రో బ్రహ్మ 116
ఇంద్రో బ్రహ్మేంద్ర ఋషిః 116
ఇంద్రో మాయాభిః 479
ఇంధోహవై 268
ఇమం మంత్రం 363
ఇమం విధన్తో 437
ఇమ ముత్య మథర్వవ దగ్నిం 437
ఇమాం నరాః కృణుత 565

ఇమా హవై ప్రజా భారతీః 620
ఇమే వేదాః శశ్వత్ప్రభు రివ 446
ఇయం తే పూషన్నాఘృణే 181
ఇయంవై నిర్మితా పూర్వం మయా
వై వేదరూపిణీ 504
ఇష్టారవ్యవచ్ఛిన్నా 462
ఇహ చాముత్ర వాకామ్యం 5

ఉ

ఉక్థ్యమ్ .. యజుః... సామ
క్షత్రం 361
ఉక్థ భృతం సామభృతం బిభర్తి 189
ఉక్థభృతం సామభృతం బిభర్తి 422
ఉచ్చైర్ ఋచాక్రియతే 356
ఉతగ్నా అగ్నిరధ్వర ఉతో 673
ఉతత్వం సఖ్యే స్థిరపీత మాహుః 456
ఉతత్వః పశ్యన్ న దదర్శవాచం 453
ఉతనో బ్రహ్మన్నవిష ఉక్థేషు 159
ఉత స్యా నః సరస్వతీ ఘోరా 443
ఉతాసి మైత్రావరుణో 425
ఉత్తమః పురుషస్త్వన్యః 604
ఉత్తరం యత్సముద్రస్య 624
ఉత్తిష్ఠత మా స్వప్త 625
ఉదగ్నే భారత 690
ఉదితేఽనుదితే చైవ 668
ఉద్యంత మస్తంయంత మాదిత్య 560
ఉద్యతాసివిషాగ్నించ 404
ఉపకారకత్వా దలంకారః సప్త
మాంగం 511
ఉపనిషత్ప్రతి పాద్యస్వరూపమాహ 37
ఉపబ్రహ్మాణి వాఘతః 112
ఉస్రా ఇవ సూర్యో జ్యోతిషా
మహా 134

ఊ

ఊర్ధ్వమూల మధశ్శాఖం 693
ఊర్ధ్వోర్ధ మారుహ్యాయదర్థతత్వా
ధీః 499

ఋ

ఋక్సామే వా ఇంద్రస్యహరీ 190
ఋక్సామే వై హరీ 190
ఋగహం యజురహం
సామాహం 368
ఋగ్భిః పూర్వాహ్ణే దివిదేవ
ఈయతే 445
ఋగ్భిరేతం యజుర్భి రంతరిక్షం
చ 379, 496
ఋగ్భ్యః స్వాహా యజుర్భ్యః
స్వాహా 371
ఋగ్యజుః సామాథర్వాణః
చత్వారో వేదాః 367
ఋగ్యజుః సామధామానం 21
ఋగ్యజుః సామభాగేన 416
ఋగ్యజుః సామరూపాశ్చ 364

ఋగ్యజుః సామవేదాఃత్రయీ 409
ఋగ్వేదం భగవోఽధ్యేమి 368
ఋగ్వేద ఏవాగ్నేరజాయత 18
ఋగ్వేద స్త్వం యజుర్వేదః 20
ఋగ్వేదాది విభాగేన
వేదాశ్చత్వార : 368
ఋగ్వేదేన హోతా కరోతి 357
ఋచం వాచం ప్రపద్యే మనోయజుః
ప్రపద్యే 340
ఋచం సామయజామహే 377
ఋచం సామయదప్రాక్షం 377
ఋచః సామాని జజ్ఞిరే 356
ఋచః సామాని భేషజా 361
ఋచాం గాయత్రం ఛందః 396
ఋచాం చ వై సామ్నాం
యజుషాం 360
ఋచాం త్వః పోషమాస్తే 187, 372
ఋచాం ప్రాచీ మహతీ ది
గుచ్యతే 388
ఋచో నామాస్మి యజూంషి
నామాస్మి 19
ఋచో యజూంషి సామాని 366
ఋణాని త్రీణ్యపాకృత్య 204
ఋత్విక్ కస్మాత్ 543
ఋత్విజో గ్రావహస్తాః 543
ఋషభాత్ భరతో జజ్ఞే 539
ఋషయస్త్వా ప్రథమ జాదేవేషు 80
ఋషయో రాక్షసీ మాహుః వాచం 85
ఋషింతు ప్రథమం బ్రూయాత్
ఛందస్తు తదనంతరమ్ 107
ఋషిం త్వాం వేదం త్వాం 216
ఋషిచ్ఛందో దైవతాది జ్ఞానం 105
ఋషియజ్ఞం దేవయజ్ఞం భూత
యజ్ఞం 62
ఋషిర్వా దీక్షప్రశు త్తమః 80
ఋషీణాం పుత్రో అధిశ స్తిపా
అ నుమ్ 546
ఋషీణాం సర్వస్వం ఋషిమభయ
దాత్రీం 61

## ఏ

ఏక ఆసీద్యజుర్వేదః తం చతుర్ధా
వ్యకల్పయత్ 374
ఏక ఏవాగ్నిః బహుధా సమిద్ధః 569
ఏక ఏవ మహానగ్నిః హవిషా
సంప్రవర్తతే 329
ఏక ఏవైష భగవాన్ విజ్ఞేయః
ప్రథమోఽంగిరాః 617
ఏకర్షిః ముఖ్యర్షిః శివః 64
ఏకవేదస్య చాజ్ఞానాత్ వేదాస్తే బహ
వోఽభవన్ 7
ఏకోఽభూన్నలినాత్తతస్తు
పులినాత్ 474
ఏకో మంత్ర స్తథాధ్యాత్మ
మధిదైవ మధిక్రతు XX VIII
ఏతద న్తః నమామ్నాయో యోగః 208

ఏతద్ భూతేషు లోకేషు అగ్ని
భూతం 563
ఏతత్ వై యజ్ఞస్య సమృద్ధం 655
ఏతద్దీక్షాయై (రూపం) యచ్ఛ్రద్ధా 57
ఏతద్వై భూయిష్ఠం బ్రహ్మ యద్
భృగ్వాంగిరసః 360
ఏతద్వోఽస్తు 61
ఏతద్ధస్మ వై త ద్విద్వాన్
వసిష్ఠో 425
ఏతత్పృథివ్యా మమృత మేత
చ్చక్షు రనుత్తమమ్ 466, 470
ఏతమేవసన్తం
ఏతస్య మహతో భూతస్య నిః శ్వ
సిత మేతద్ 367
ఏతచ్ఛ్రుత్వా బ్రహ్మవత్తః 448
ఏతా అర్షన్తి హృద్యా త్సముద్రాత్ 65
ఏతా విశ్వా విదుషే తుభ్యం XXXVI
ఏతాసాం భూమికానాం 51
ఏతాం వావ ప్రజాపతిః ప్రథమాం
వాచం 468
ఏతావ చ్ఛ్రేయ ఇత్యాహ ప్రహ్లాదో 466
ఏతావాన్ సర్వ వేదార్థః శబ్ద
ఆస్థాయ మాం విదా 714
ఏతే ఏవ వషట్కారస్య ప్రియే
తనూ 339
ఏతే వై కవయః యదృషయః 476
ఏవం త్విహ స
సర్వత్ర XXXXII
ఏవం వేదం వేదో వేదాన్ వా
స్వీ కుర్యాత్
ఏవ మేవ యజుర్భాగః
ఏవ మేవాస్య యజ్ఞో శ్రేషం న్యే
ఏవశ్ఛందో వరివశ్ఛందః
ఏవాహ్యస్య సూనృతా విరప్శీ
గోమతీ
ఏష ఆదేశః ఏష ఉపదేశః
ఏష ఆహుతయో వా
ఏష ఇమం లోక మభ్యార్చతు
రూపేణ
ఏష ఉ ఏవ ప్రాణః ఏషహీవ
ప్రజాః ప్రణయతి
ఏష ఉ బృహస్పతిః బ్రహ్మ
వాగ్వై బృహతీ
ఏష ఉ బ్రహ్మణస్పతిః బ్రహ
వాగ్వై
ఏష ఉ సామ వాగ్వైసా
ఏష ఉ హ్యేవ సర్వే దేవాః
ఏషతే రుద్రభాగః సహస్వ్రసా
కయా (ప్రజాపతిః)
ఏష వై వసిష్ఠః
ఏష వై సప్తదశః ప్రజాపతిర్య
షన్నాయత్తః
ఏషహి దేవేభ్యో హవ్యం భరః
ఏషోఽస్యపరమ ఆనందః
ఏహ్యేహీతి త మాహుతయః

ఓ

ఓం హి ఓం హి ఓం హీత్యే
తదుపనిషదం విన్యసేత్ 39
ఓం తద్బ్రహ్మ 654
ఓజశ్చ హవై సహశ్చ వ
షట్కారస్య 638
ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ 628
ఓమితి ప్రతిపద్యతేఏతద్వై యజుః 417

క

కణ్వాసో వాం బ్రహ్మకృణ్వ న్త్యధ్వరే 112
కథం కవ్యాని దత్తాని హవ్యానిచ 314
కన్దస్తారః తథాబిందుః 365
కర్ణం గతం శుష్యతి కర్ణ ఏవ 510
కర్మభక్తి సాంఖ్యయోగ 355
కర్తుం శతపథం చేదనుపూర్వం 679
కల్పవృక్ష స్వరూపా యా భారతే వృక్షరూపిణీ 622
కల్పే కల్పే క్షయోత్పత్త్యా 86
కవిం పురాణమను శాసితారం 482
కవిర్మనీషీ పరిభూః స్వయంభూః 482
కవీశ్వరం తం హి వందే XXXXIII
కామతో విచరస్యధ్వం 313
కామహాకామకృత్ కాంతః కామః 12
కావ్యస్యాత్మా ధ్వనిః XXV
కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః 462
కావ్యం యశసేఽర్థకృతే 484
కిం విధత్తే కి మాచష్టే 608
క్రియావన్తః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః 63
క్రియావన్త శ్శ్రోత్రియాః 68
కుర్యాత్ క్రియేత 163
కుర్యాత్ త్రిషవణస్నాయీ 581
కృతం మయేదం 460
కృత్వాధ్యయనం తేషాం శిష్యాణాం 679

కృష్ణం న స్తం విప్రా బహూధాయజన్తి 289
కృష్ణా కృష్ణాంగ సంభూతా 505
కేనేదం విశ్వం సంసరతీతి.... స్వో హేదం సంసరతీతి 289
కోనునామన యో వేదత్వాం వినా సాంప్రతం వద 7

## క్ష

క్షణభంగిని జన్తూనాం సంసారే 506
క్షాత్రో ధర్మః

## గ

గణానాం త్వా 141, 482
గన్ధద్వారాం 50
గాధాభిః X IV
గామావిశ్యచ భూతాని 339
గాయత్రం త్వో గాయతి 189
గాయత్ర్యసి 289
గిరః ప్రజాతాయాః పుష్పిణ్యాః 176
గుణాలంకారరీతి 463
గురుభిర్నియమైః 618
గురుశిష్య పరమ్పరా 175
గోపరూపో హరిః 714
గోభిరేవ 712
గోభూమివేద విహితా 711
గోభూవాచ స్త్విడా 666
గౌరివప్రవనరత్యర్థాన్ 594

## ఘ

ఘృతం తేజో 281
ఘృతస్య నామ 281

## చ

చక్రవర్తీ తతోజజ్ఞే 530
చక్షుర్నో దేవఃసవితా 557
చక్షుర్నోదేహి 557
చతస్ర ఈం ఘృతద్రుహః 413
చత్వారిశృంగా 413
చత్వారి వాక్పరిమితా 413
చత్వారో వా ఇమే 360
చత్వారోఽస్యై వేదాః 348
చతుర్భిశ్చ 356
చతుష్కపర్దా యువతిః 413
చిత్రం దేవానాం 556
చిత్రం నిరాలంబనమేవ 449
చిత్రం వటతరోర్మూలే 321
చోదయిత్రీ సూనృతానాం 577

## ఛ

ఛందః పద్యేచ 627
ఛందో బ్రాహ్మణాని చ 627
ఛందాంసి త్రిష్టుబాదీని 627
ఛందాంసి నామ 706
ఛందాం స్యధీత్య 259
ఛందో బ్రహ్మ శ్రుతిర్వేదః 626

ఛందో మయేన గరుడేన 704
ఛాదనాచ్ఛంద ఉద్దిష్టం 694
ఛాదయన్తి హవా ఏనం
ఛందాంసి 701

జ

జగద్ధితైకలక్షణాం 312
జనానాం సౌభాగ్యం 487
జన్మప్రభృతి సత్యాం 461, 460
జాతమాత్రాత్తు 9; 392
జాతవేదసే సునవామ 15
జాయేవ పత్యే కామయమానా 454
జీవో మృతస్య చరతి 304

త

తం త్వా వయం సుధ్యో 182
తం త్వా ను నవ్యం ,,
తం విద్యాకర్మణీ 305
తతః స భగవాన్ తార్క్ష్యో 704
తతః శతపథం కృత్స్నం 679
తతః కవిర్నామ మను 495
తతః సహస్రం 220
తతః సురగుణాః సర్వే 125
తతో బ్రాహ్మణః స్వోచితార్థ 196
తతో వసిష్ఠ పురోహితాః 423
తతో వై వసిష్ఠ పురోహితాః 423
తతోఽసృజద్వై త్రిపదాం 493
తత్తేజోఽసృజత.... తదపోఽసృజత 412

తత్ర నానావిధానగ్నీన్ 617
తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః 368
తత్స్వ మహిమానమాపోఢ్వా 285
తత్ సూర్యోఽగ్నిర్నామ 64
తత్రనిగమ నిరుక్త వ్యాకరణానాం XXIII
తద్భాష్య భూతం పురాణం XXXXXIII
తద్ఘృత మభవత్ 279
తద్వా ఏష ఏవ వషట్కారః 341
తద్వా ఏతత్సుదర్శనంమహాచక్రం 368
తద్వాచా త్రయ్యేవ 373
తదదోషౌ శబ్దారౌ 463
తదమంద రసస్యంద 501
తదస్మిన్నేత్రాంమ్యాం 520
తదాహుః కాదేవతాః స్వాహాకృత య ఇతి 274
తదాహుః కిం సుబ్రహ్మణ్యాయై 171
తదీక్షణాయ 257
తద్వేదగుహ్యోపనిషత్సు 46
తదేవ కావ్యమిత్యుక్తం 475
తదేతత్సత్యం మంత్రేషు 646
తద్దైక ఆహుః తాన్ వో మహ 543
తద్యేషు పదేషు స్వరసంస్కారౌ 213
తపసా బ్రహ్మచర్యేణ 459
తపసి సర్వం ప్రతిష్ఠితం 167
తపస్తప్యంతి మునయో 624

తపోజాం వాచమస్మే నియచ్ఛ 72
తపోవిశేషైః వివిధైః 219
తమర్థ మివభారత్యా 597

తమేతం వేదానువచనేన 54, 150
తమేవ భా న్తమనుభాతి 551
తమోషధీభ్యశ్చ 162
తమృచ శ్చ సామాని యజూంషి 360
తస్మా అగ్నిర్భారతః 590
తస్మా ఇదం భగవతే 492
తస్మాదేతత్ బ్రహ్మ 113
తస్మాద్ గురుం ప్రపద్యేత 152
తస్మాత్ రాజా విశేషేణ 362
తస్మాదోంకారః 378
తస్మాదృచః సామయజూంషి 407
తస్మాద్వా ఏతస్మాత్ 412
తస్మాత్ యేఽద్యాపి వాసిష్ఠాః 424
తస్మాత్ సతామత్రనదూషితాని 500
తస్మాత్ స్వాధ్యాయోఽధ్యేతవ్యః 517
తస్మాత్ సర్వేప్రాణాః 593
తస్మాదేవంవిత్ శాన్తోదాన్త
ఉపరతః 54
తస్మైనమో బ్రహ్మణే
బ్రాహ్మణాయ 159
తస్మై సరస్వతీదుహే 579
తస్యవా ఏతస్యయజుషః రసః
ఏవోపనిషత్ 36, 52
తస్యకర్తార మపి 107
తస్య సందిదిహే 209
తస్యవా ఏతస్య యజ్ఞస్య
ద్వావనధ్యాయౌ 224
తస్య యజురేవశిరః 364
తస్యహ విశ్వామిత్రో 423
తస్య ఏషాకుల్యాః 593
తస్య యానిచ శుక్లాని 695
తస్యా వాచః ఉ ప్రాణా ఏవరసః 593
తస్యైదర్వన్తోరంహాయన్త 434
తస్మై ప్రయాజేషు తాయషూనేషు 195
తస్యోపనిషత్ అహరితి 52
తస్యోపనిషత్ అహమితి 52
తహోను వ్యాహరిష్యన్త 44
త్రయోవేదా అజాయన్త 356
త్రయ్యాంచ దండనీత్యాంచ 361
త్రయీ విద్యా మవేక్షేత 399
త్రయీ వై విద్యా కావ్యం ఛందః
414, 445, 446
త్రయీ విద్యా యజ్ఞః 414
త్రయీత్రివర్గనిలయా 417
త్రయీవై విద్యాకావ్యం ఛందః 501
త్రయోవా ఋతవః సంవత్సరస్య 410
త్రయో వేదా అజాయన్త 400; 568
త్రయో వై దేవాః వసవో
రుద్రా ఆదిత్యాః 564
త్రయః కృణ్వన్తి భువనేషు రేతః 59[illegible]
త్ర్యాయుషం జమదగ్నేః 521
త్ర్యాయుషం కశ్యపస్య 521
త్వన్నో మోచ్చార్య మంత్రాంతే 26
త్వం భారతే కార్యగురుః 62
త్వం హి బ్రహ్మ పరంజ్యోతిః 15
త్వం బ్రహ్మరయివిత్ 15

త్వమేకో హ్యస్య సర్వస్య
విధానస్య 23
తాం హంసమాలాః శరదీవ 120
తా ఉపదిశతి 360
తాన్ పూర్వయానివిదాహూమహే 181
తా ను తత్ర మృత్యుః 370
తానుపదిశతి 360
తాన్యుపదిశత్యథర్వాణో 360
తాన్యస్మా అభ్యవదయన్ 700
తారః కంఠః శ్రుతేర్జాతిః 365
తా హ్యైతాస్త్రయ్య ఆపః 416
తిరశ్చా మువసేదుషామ్ 43
తిరశ్చీనో వితతో రశ్మిరేషాం 298
తిష్ఠత్యేష హి భూతానా ముదరే 568
తిస్రస్తు దేవ్యోయాః 563
తిస్రోదేవీః 537
తిస్రో వాచ ఈరయతి 413
తిస్రో వాచ ఉదీరత 413
తిస్రో వాచః ప్రవద 413
తిస్రో మాతౄస్త్రీన్
పితౄన్ 301, 603
తుష్యంతి తరుణాః కామే 507
తేఽధీత్య సకలాన్ వేదాన్ 220
తే వా మారభే ఇతి 695
తే విస్రబ్ధాః ప్రభాషన్తే 485
తే సృజన్తి తదా వేదాబ్రహ్మ 302
తేజోఽసి శుక్ర మస్యమృత
మసి 281
తేనతేనవశే భద్రే స్థాతవ్యం 363
తేనేబ్రహ్మ 113
తేషాం మనుష్యవత్ 666
త్రయ్యాం దండనీత్యాంచ 361
త్రిధాప్రణీతోజ్జ్వలనో 328
త్రిధాహితం పణిభిః 298
త్రిభిః పవిత్రైః 302
త్రిభువనస్య చ సర్జన పాలన 61
త్రీనిమాన్ కృతవాన్ 685
త్రేధా విహితా హివాక్ 413

## ద

దత్తం మరీచ మత్రించ 439
దక్షిణేనాహవ నీయం 695
దండా ఇవే ద్గో అజనాస 422
దధుష్ట్వా భృగవో 437
దమే సర్వం ప్రతిష్ఠితం 167
దహన్ మృతాని భూతాని 618
ద్వయం వా ఇదం— ఆ తా
ప్యైవాద్యంచ 267
దానేసర్వం 167
ద్వాదశవర్షాణ్యేకవేదే 219
ద్వాదశవర్షాణి వేదబ్రహ్మ
చర్యమ్ 220
దివశ్చిదా పూర్వ్యా 179
దివాబ్రహ్మణో గాయేత్ 196
ద్వితీయంప్రాప్యాను పూర్వ్యాత్ 247

దివ్యాదివ్యప్రభావేన భారతీగోః 594
దీర్ఘమాయుశ్చతే బ్రహ్మన్ 125
దుఃఖేన బుబుధే సీతాం హనుమా
నవలంకృతామ్ 210
దుష్యంతాద్ భరతో జజ్ఞే 538
దేవత్తం బ్రహ్మగాయత 112
దేవపాత్రం వా ఏతత్
వషట్కారః 328
దేవశిల్పా న్యేతేషాం 614
దేవా వై మృత్యోస్త్రయీవిద్యాం
ప్రావిశన్ 692
దేవాన్ జిగాతి సుమ్నయోఃమ్ 193
దేవానాం గుణలింగానాం అనుశ్రవిక
కర్మణే 177
దేవాసురా హవై యత్రసంయేతిర
702
దేవా స్త్రిస్రః తిస్రోదేవీః 566
దేవీం వాచమ జనయన్త దేవాః 412
దేహో దేవాలయః ప్రోక్తః 155
ద్వే విద్యే వేదితవ్యే శబ్దబ్రహ్మ
పరం చ యత్ 152
ద్వౌ ద్వౌ హి మాసౌ ఋతుః 45

## ధ

ధర్మాత్మానం 465
ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా
19, 167
ధియోరధ్వష్టాం 185
ధీరసి దక్షిణాసి 199

## న

న కశ్చిద్వేదకర్తా చ వేదం స్మృత్వా
చతుర్ముఖః 86
న చ తస్మిన్ శయనే స్వాధ్యాయ
మధీత 224
న తిథిర్న చ నక్షత్రం 362
వను శబ్దార్థౌ కావ్యమ్ 462
నమః ప్రమాణమూలాయ XXXIX
నమసానవ్య అర్కైః 184
నమస్త్రైలోక్య 613
నమామ వేదమాతరమ్ 1
నమోవాచే 73
నమో వృక్షేభ్యో హరికేశేభ్యః 122
నమో బ్రహ్మణే నమస్తే వాయో 154
నమోద్విశీర్ష్ణే త్రిపదే 399
నమో వాచే ప్రాణపత్న్యై స్వాహా 592
నరజా నామహాం కార్యం నారం
బ్రహ్మాండ మిష్యతే 585
నవంనుస్తోమం నవజాత మద్య 186
నవిజానామి యదివేన మస్మి 29
నవేదాస్త్వామేవం 289
నవో నవో భవతి జాయమానః 183
నవ్యమతక్షత్ 191
నశక్తస్త్వం బలాద్ధర్తుం 69

నష్టజ్వలన సంపాతా 216
నష్టాం వై ధరణీం పూర్వమవిందం 712
నసవేద వరం బ్రహ్మయో న వేద చతుష్టయమ్ 70
న హ వైతా ఆహూతయో దేవాన్ గచ్ఛన్తి యా అవషట్కృతా ... 274
నాచరేత్యది వేదోక్తం 56
నాట్యవేదం తతశ్చక్రే 615
నాట్యవేదం ప్రవక్ష్యామి 611
నాట్యసంజ్ఞమిమం 614
నానానామాశ్రయోత్పన్నం XVIII
నామగోత్రే పితౄణాం తు ప్రాపకం హవ్యకవ్యయో 314
నామవా ఋగ్వేదో యజుర్వేదః 368
నామరూపేచ భూతానాం కర్మణాం చ ప్రవర్తకమ్ 486
నారద మవలోక్య త హాహా పితా హుహుః 38
నారాయణం నమస్కృత్య నరం చైవ 584
నాసూయామి ద్విజాన్ విప్ర 465
నాస్తి మత్తోఽధికః కశ్చిత్ 315
న్యాయనిర్ణీతసారత్వాత్ నిరపేక్షమివాగమే 68, 493
న్యాస ఇత్యాహు ర్మనీషిణో బ్రహ్మాణం 167
నికాయ్యా వేధసః శశ్వతః 478
నిజయోగబలేనైవ 313
నియతికృత నియమరహితాం 487
నిరతిశయపదస్థః సచ్చిదానంద మూర్తిః 109
నిరత్యేష సమిత్యేష స్థానే XXXIII
నిరుక్తి మగ్రతః కుర్యాత్ XXXXVII
నిరుక్తిర్యోగతో నామ్నా మన్యార్థత్వప్రకల్పనం XXXX
నిర్దోషగుణాలంకార లక్షణరీతి వృత్తిమద్వాక్యం 463
నివృత్త చౌలకర్మణో త్రయీవర్ణం 222
నిశమ్యతే ఘుష్టరితం 681
నేతిప్రతిషేధార్థీయోభాషాయాం 2,6
నేత్రాభ్యాం జనయత్ దేవో 392
నైరుక్తేయో యతేత XXXXIX
నౌధిరాత్మన్వతీభిః XXV

## ప

పంచప్రాణ మనోబుద్ధి 336
పంచవా ఋతవః హేమ 410
పంచర్తవో హేమ శిశిరయోః సమాసేన 411
పంచహ్యృతవః 411
పంచానామపి భూతానా ముత్కర్షం పుపుషుర్గుణాః 183

పతంగో వాచం బిభర్తి 324
పతంగో వాచం మనసా బిభర్తీతి 325
పదంపాదం విధాం మాత్రాం 687
పదోయస్య
పయ అహూతయో 367
పరాపరే బ్రహ్మణి
పరీత్య భూతాని 87
పరోక్షవాదో వేదోఽయం 56
పవిత్రం తే వితతం 580
పశ్చాత్పురస్తా అధరాదుదక్తాత్ 483
పశ్యేయ మేకస్య 510
పాతే బ్రహ్మాంజలిః 172
పారంపర్యాగతో యేషాం వేదః
సపరిబృంహణః 228
పార్థివం ధాతు మ సాద్య శారీరోఽ
గ్నిః కథం భవేత్ XXXXXI
పార్థోవత్సః స ధీరోక్షిత్వా 350
పావకా నః సరస్వతీ 577
పావనా త్వావకిశ్చాసి వహనా
ద్ధవ్య వాహనః 15
పాహినో అగ్న ఏకయా 395
పితా పితామహశ్చైవ 315
పితామహ పితాచైవ 313
పితామహాసచః బ్రుత్వా 156
పితృదేవ మనుష్యాణాం వేదశ్చక్షుః 5, 570
పురాణ సంహితాం చక్రేపురా
ణార్థ విశారదః XXXXXIII
పురాణస్య కవేస్తస్య 482; 601
పురాణ న్యాయ మీమాంసా XIV
పురీష్యోఽసి విశ్వభరా అథర్వా 433
పురుషైర్యజ్ఞపురుషో జంబూద్వీపే
సదేజ్యతే 124
పురుషో దివ్యరూపాభిః సంభూతః 392
పురుషో వావయజ్ఞః తస్య యాని
చతుర్వింశతి వర్షాణి తత్ప్రాతః
సవనమ్ 524
పురోహితం తథాఽథర్వమంత్ర
బ్రాహ్మణ పారగమ్ 362
పురోహితం ప్రకుర్వీత దైవజ్ఞం 362
పూర్వసూరికృత వాగ్విలాస XXXXXX
పూషన్నేకర్షే యమ సూర్యప్రాజా
పత్య 64
హోతా నిషీదతి
పౌరోడాశికం యాజమానం హోతా
రః 675
పౌరోహిత్యం శాంతిక పౌష్టికాది 362
పౌర్వికీం సంస్మరన్ 205
ప్రకావ్య ముశనే వబ్రువాణో 477
ప్రకృతిస్త్వం 22
ప్రజననం వైప్రతిష్ఠా 167

ప్రజాపతిః పరమేష్ఠీ విరాట్ 599
ప్రజాపతిః ప్రజాః సృష్ట్వా
వ్యత్రసంసత 698
ప్రజాపతిరగ్ని మచినుత 699
ప్రజాపతిర్వో యజతే 702
ప్రజాపతిర్వా ఇదమేక ఆసీత్ 282
ప్రజాపతిర్వై భరతః సహీదం
సర్వం బిభర్తి 600
ప్రజాపతిర్వై మనుః 621
ప్రజాపతిర్వై వసిష్ఠః 426
ప్రజాపతిర్వై వాచస్పతిః 282
ప్రజాపతిశ్చరతి గర్భే అన్తః 599
ప్రజాపతేః బ్రహ్మకోశం బ్రహ్మ
ప్రపద్యే 156
ప్రజాపతే ర్వా ఏతాన్యంగాని యు
చ్ఛందాంసి 702
ప్రజాపతే ర్వై భువనస్య భర్తుః 260
ప్రణవస్య ఋగ్యజుః సామ్నే 331
ప్రణవైః శస్త్రాణాం రూపం 194
ప్రతిష్ఠాస్యతితే
ప్రతివేదం బ్రహ్మచర్యం ద్వాదశాబ్దాని
219
ప్రతివేదం బ్రహ్మచర్యం 249
ప్రత్యక్షేణాను మిత్యావా యు
స్తూపాయో 4
ప్రథమం పాదం జానీయాత్ 278
ప్రథమో దైవ్యోభిషక్ 418
ప్రథమో వరుణో జ్ఞేయః 312
ప్రదీపం భారత్యాః XXXXXX
ప్రసూనం బ్రహ్మణస్పతిః 133
ప్రవృత్తం కర్మసంసేవ్య 5
ప్రశ్నమేతం సముద్దిష్టం XXXXXII
ప్రసాదరమ్య మోజస్వి 68, 493
ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ 166
ప్రజ్ఞావైశాఖ వేధసా శీతజలనిధేః 207
ప్రాణావా ఋషయః ప్రథమజాః 80
ప్రాణావా ఆదిత్యా ఏతే హీదగ్ం
సర్వమాదదతే 588
ప్రాణావావ రుద్రాః 522
ప్రాణావై ఛందాంసి 106
ప్రాణావై రుద్రాః 522
ప్రాణినః ప్రీణయ న్త్వేతే 314
ప్రాణోఽధర్వా 433
ప్రాణోవై వసిష్ఠ ఋషిః 426
ప్రాతారథో నవోయోజి సస్నిః 183
ప్రియే స్వాధ్యాయ ప్రవచనే
భవతః 246
ప్రశ్ని రిత్యుచ్యతే చాన్నం 21
ప్రోవాచ వేదాన ఖిలాన్ 221

బ

బర్హి రివ యజుషా 380
బుద్ధీంద్రియ మనః ప్రాణాన్ 595

బృహస్పతిర్గణపతిః సప్తాస్యో
బ్రహ్మణస్పతిః 135
బృహస్పతే ప్రథమం వాచో
అగ్రం 467
బ్రహ్మచర్య మహింసాం చ 241
బ్రహ్మచారీ చరతి వేవిషద్విషః 158
బ్రహ్మణః కోశోఽసి మేధయాఽపి
హితః 156
బ్రహ్మణాతే బ్రహ్మయుజా 190
బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మా 159
బ్రహ్మతేన పునీహినః 132
బ్రహ్మన్ బ్రహ్మణ్య నిర్దేశ్యే
నిర్గుణే 594
బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా 166
బ్రహ్మ ప్రావాదిష్మతన్నో మాహాసీత్
113
బ్రహ్మర్షే స్వాగతం 125
బ్రహ్మవాదినో వదన్తియ ద్వసూనాం
ప్రాతః సవనం 565
బ్రహ్మవాహః 150
బ్రహ్మవాహసః 150
బ్రహ్మవాహస్తమం 150
బ్రహ్మవిదాప్నోతి పరం 600
బ్రహ్మవృక్షో రక్ష్యమాణః 174
బ్రహ్మహవై వాచః పరమం వ్యోమ
132
బ్రహ్మశ్రీ ర్వైనామైతత్ 170
బ్రహ్మసరూపమను మేద మాగాత్ 113
బ్రహ్మాక్షర సముద్భవం 113
బ్రహ్మాణం బ్రహ్మవాహసం 182
బ్రహ్మాణి వేదగ్రహణకాలే 173
బ్రహ్మాణి హి చక్షుషే వర్ధనాని 113
బ్రహ్మాణి మే మతయః శం సుతాసః
146
బ్రహ్మా దేవానాం ప్రథమః
సంబభూవ 89
బ్రహ్మా దేవానాం పదవీః కవీనాం 132
బ్రహ్మా బృంహణశీల ఇత్య
భిహితో 100
బ్రహ్మామృతానందరసేవ 505
బ్రహ్మాయం వాచః పరమంవ్యోమ 132
బ్రహ్మేంద్ర మగ్నిం జగతః
ప్రతిష్ఠాం 144
బ్రాహ్మణం మంత్రకాండస్థం 675
బ్రాహ్మణ మృగ్యజుః సామ 379
బ్రాహ్మణా దాత్రుషత్ పిబ 673
బ్రాహ్మణా దింద్రరాధసః 673
బ్రాహ్మణో బ్రాహణత్వాచ్చ 675
బ్రాహ్మణ్యం యది మే ప్రాప్తం 126


భ


భక్తిదాస్యప్రదాతాయః సచకృష్ణః 479

భద్రకాళీ భుజంగాక్షీ భారతీ
భారతాశయా 623
భరత ముద్ధరే మనుషించ 543
భరతాత్ భారతీ కీర్తిః 538
భరితో భరత స్యాగ్నేః 617
భరంతీ త్రైలోక్యం త్రిభువన వతే
రసీ సహచరీ 536
భవిష్యతి మహాభాగా దక్షస్య
దుహితా స్వధా 3:3
భాతి ప్రస్ఫుతి దిక్కాల
బాహ్యం XX IV
భారతీః 537
భారతీ భరతస్యేయం హార్దేః సర్వ
స్వరూపిణీ 536
భావా వికారాః 507
భిషక్తమం త్వాభిష జాం శృణోమి 18
భీషాస్మా ద్వాతః 418
భూతం భవత్ 38
భూతం భవ్యం భవిష్యంచ
XXXXX II
భృగువత్ 438
భృగూణా మంగిరసాం 436
భృగూణా మంగిరసాంతవసా 418
భేషజం వా అధర్వణాని 444
భేషజం వై దేవానాం 444


## మ


మధ్వాహూతయో వా 253
మనసస్పత ఇమే 292
మనుష్యా వా ఋషిషు XXXX VI
మనుష్వ దగ్నిం మనునా సమిద్ధం
660
మనోహి సరస్వాన్ వాక్
సరస్వతీ 575
మన్త్రగ్రామం తదారాజన్ 363
మన్త్ర బ్రాహ్మణే యజ్ఞస్య
ప్రమాణమ్ 670
మన్త్ర బ్రాహ్మణయోః 668
మాం విధ త్తేఽభిద త్తేమాం 608
మమై వాన్యా పరాశక్తిర్వేదసంజ్ఞా 417
మయ్యా సక్తాంచ జానామి 521
మరీచయః స్వాయంభువాః XX IV
మహర్షిస్యాస రచితే 540
మహాకాలో మహానటః 610
మహాపురుష ఇతి 558
మహాభాగ్యాద్దేవతాయాః 135
మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి
537
మా ఛందః ప్రమాఛందః 715
మాతా రుద్రాణాం 519
మానసే సర్వం ప్రతిష్ఠితం 167

